# ఆర్.యస్.యస్.

# ఆకృతి దాల్చిన ఆదర్శం



సంకలనకర్త
హెచ్.వి. శేషాద్రి

అనువాదం
కె. శ్రీనివాసమూర్తి
రాంమాధవ్

నవభారతి ప్రచురణలు
హైద్రాబాద్

ప్రథమ ముద్రణ:
డిసెంబర్, 1990.

ప్రచురణ:
నవభారతి ప్రచురణలు,
3-4-705/4, నారాయణగూడ,
హైద్రాబాద్-500 029.

ప్రతులకు:
సాహిత్యనికేతన్
3-4-852, బర్కత్‌పురా,
హైద్రాబాద్-500 027.

కంపోజింగ్:
ప్రసాద్ గ్రాఫిక్స్
3-6-115/5,
హైదర్‌గూడ,
హైదరాబాదు - 500 029.

ముద్రణ:
భారతి ఆర్ట్‌ప్రింటర్స్
1-7-513/8, దయారామార్కెట్,
ముషీరాబాదు,
హైద్రాబాద్-500 048.

ముఖచిత్రం:
సూర్య
నల్లకుంట, హైద్రాబాద్.

వెల: రూ. 60-00

# అంకితం

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ

సంస్థాపకులు

డా. కేశవ బలీరాం హెడ్గెవార్

దివ్యస్మృతికి

వారి జన్మశతాబ్ది నివాళిగా

# మనవి

డాక్టర్ హెడ్గెవార్ జన్మశతాబ్ద్యుత్సవ సందర్భంగా RSS: A vision in Action అనే గ్రంథాన్ని జాగరణ ప్రకాశన, బెంగుళూరువారు ప్రచురించారు. 1988 విజయదశమినాడు విడుదలైన ఆ గ్రంథం రెండవ ముద్రణకు కూడా అతిత్వరలోనే నోచుకున్నది. రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్‌యొక్క ఆదర్శం కార్యకర్తలద్వారా ఏవిధంగా రూపాన్ని దిద్దుకుంటున్నదీ అందులో వివరించారు. పలువురి ప్రశంశలను ఆ గ్రంథం పొందింది. చాలామందికి తెలియని విషయాలు ఉల్లేఖించబడ్డాయని వారంతా పేర్కొన్నారు.

ఆ గ్రంథం తెలుగులో ప్రచురించటానికి అడిగిన వెంటనే సంకలన కర్తా, సంపాదకులూ అయిన శ్రీ హెచ్.వి. శేషాద్రిగారు అంగీకరించటమేకాదు, ప్రోత్సహించారు. తెలుగులోకి శ్రీ కె. శ్రీనివాసమూర్తి, శ్రీ రాంమాధవ్ 'ఆర్.యస్.యస్ ఆకృతి దాల్చిన ఆదర్శం'గా అనువదించారు. వారందరికీ, జాగరణ ప్రకాశన వారికీ మా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

ప్రమోద కార్తీక శు. ఏకాదశి
ఉత్థానైకాదశి
అక్టోబరు 30, 1990 — ప్రకాశకులు
భాగ్యనగర్



ప. పూ. శ్రీ కేశవరావ్ బలీరామ్ హెడ్గేవార్
( డాక్టర్జీ )

# ముందుమాట

## మొదటి ప్రతి, అక్టోబర్ 1988

ఈసంకలనం, పేరులో సూచించిన విధంగానే, రాష్ట్రీయస్వయం సేవకసంఘం దర్శించిన ఒకానొక పునర్జాగృత, పునస్సంఘటిత జాతీయజీవన స్వప్నాన్ని ఆచరణ రూపంలో సాక్షాత్కారింప జేసేందుకు ఉద్దేశించినదే. సంఘంయొక్క సైద్ధాంతిక సూత్రాలకు, ప్రత్యక్ష జీవనంలో వాటి ఆవిష్కారానికి మధ్యగల పరస్పరపూరకతనుఈ సంకలనం మనముందుంచుతుంది. సంఘంయొక్క సైద్ధాంతిక భాగం ఇప్పటికే చాలామందికి తెలుసు. కానీ రెండవది చాలాతక్కువ మందికి మాత్రమే తెలుసు.

ఏసంస్థయొక్క సైద్ధాంతిక నిష్ఠకైనా నిజమైన గీటురాయి, దాని ఆలోచనలు, విలువలను, నిత్యజీవితంలో సమన్వయం చేసుకుని, ప్రజలలో కూడా అందుకనుగుణమైన పరివర్తన సాధించేవిధంగా కార్యకర్తకు ప్రేరణ నివ్వడంలోనే ఉంటుంది. ఈమౌలికదృష్టి కోణంలోనుండి వికసించినదే సంఘం యొక్క 'వ్యక్తినిర్మాణ' సిద్ధాంతం. సంఘతంత్రం, సంఘ కార్యక్రమాలు, సంఘ ఆలోచనలు - ప్రతిఒక్కటి 'మనిషిని'..., 'స్వయంసేవక్'ను నిర్మాణం చేయడానికి, జాతీయ పరివర్తన కార్యంలో అతడినొక సాధనంగా చేయడానికి ఉద్దేశించినవే.

స్వయంసేవకులు తమజీవితాలను మలచుకునేందుకు అవసరమైన కల్పనను, ప్రేరణను, మార్గదర్శనాన్ని సంఘసంస్థాపకులు డా. కేశవ బలిరాం హెడ్గెవార్ తన జీవితమే సజీవ ఉదాహరణగా వారిముందుంచారు. సంఘం రూపంలో తాను ప్రారంభించిన ఈ వ్రతానికి అనుగుణంగా తనస్వీయ జీవన స్వరూపాన్ని ప్రకాశవంతంగా మలచుకున్నారువారు.

దేశమంతటా 20వేల స్థలాలలో నిత్యం శిక్షణ పొందుతున్న లక్షలాది స్వయంసేవకులు నిర్వహిస్తున్న కార్యకలాపాల విస్తృతి, వివిధతలు ఊహకందనివి. ఆమేరకు, ప్రస్తుత సంకలనం కేవలం సంకేతమాత్రమే. అఖిలభారత ప్రాముఖ్యత కలిగిన కొన్ని సంఘటనలను మినహాయించి, మిగిలిన వాటిని వాటి విశిష్ట, ప్రధాన అంశాలను మాత్రం తెలియజెప్పడానికి వీలుగా సంక్షిప్తీకరించడం జరిగింది.

ఈసమయంలో మరొక విషయాన్ని కూడా స్పష్టపరచవలసి ఉన్నది. ఈసంకలనంలో పేర్కొన్న వివిధ సంఘటనలు, వాటి ప్రభావం తదితర వివరాలు స్వయంసేవకులు ప్రారంభించిన వివిధసంస్థలలో పనిచేస్తున్న కార్యకర్తల అనుభవాలకు సంబంధించినవే. అయితే తమ వ్యక్తిగత స్థాయిలో అసంఖ్యాకరంగాలలో అలాంటి అనేక కార్యకలాపాలు సాగిస్తూ, తమ పరిసరాలలో అలాంటి పరివర్తనను సాధించిన వేలాదిమంది స్వయం సేవకులు దేశమంతటిలోనూ ఉన్నారు. వారు ఏరంగంలో కృషిచేస్తున్నా, వారి వ్యక్తిగత అనుభవాలు కూడా సాధారణమైనవికావు. వాటి ప్రభావం సామాన్యమైనది కాదు. స్వయంసేవకుల అలాంటి వ్యక్తిగత ప్రయత్నా లను సంకలనం చేయడం అనేది పరిమితులకు లోబడి సాధ్యమయ్యే విషయంకాదని అందరికీ అర్ధమౌతుంది.

ఆమేరకు ప్రస్తుత సంకలనం, సంఘానికి సమాజంపై గల సమగ్ర, విశాల ప్రభావంయొక్క కొంతభాగాన్ని మాత్రమే తెలియజెప్పగలదు. నిజానికి ఆరెస్సెస్ పేరు విన్నంతమాత్రానే కోట్లాది హృదయాలలో ఉప్పొంగే ప్రఖరమైన ఆత్మీయత, విశ్వాసభావనలు స్వయంసేవకులు వ్యక్తి గతంగాను, సామూహికంగాను కూడా సమాజహృదయంపై విభిన్న కార్యకలాపాల ద్వారా కలిగించిన ప్రభావానికి సాక్షిగా నిలుస్తాయి.

అదేవిధంగా, ఇక్కడ పేర్కొన్న జాతీయపునరుజ్జీవన మార్గదర్శక సూత్రాలు సంఘం దర్శించిన సజీవచైతన్యమయ హిందూరాష్ట్ర దృశ్యాన్ని సంక్షిప్తరూపంలోనైనా మన కళ్ళముందు నిలుపుతాయని ఆశిద్దాం. ఆదృశ్యం భావితరాల స్వయంసేవకులకు జాతిమొత్తాన్ని కలుపుకుంటూ తాము నిర్వహించిన పాత్ర పరిధిని మరింత విస్తరింపజేసుకొనేందుకు సహకరిస్తుంది. సంఘంలోనే కాక, మిగిలిన సమాజంలో కూడా మన పట్ల స్పందించే హృదయాలు, సహకరించే హస్తాలు చాలా ఉన్నాయి. మన కార్యవ్రత సాధనలో తమశక్తి మేరకు సహకరించడానికి అవిసిద్ధంగా ఉన్నాయి. వారిముందు కూడా ఈపుస్తకం సంఘంయొక్క వివిధ సేవారంగాలకు సంబంధించిన కల్పననుంచుతుంది.

ఈసంకలనంలోని ఒక విచిత్రమైన అంశాన్ని నిశితంగా పరిశీలించే పాఠకులు గ్రహించగలరు. కొద్దిమందిని మినహాయించి, ఈకృషిలో అగ్రగాములుగా నిలిచిన మిగిలిన ఎవ్వరిపేర్లను ఇందులో పేర్కొనలేదు. కారణం సుస్పష్టం. పేర్లు వేలల్లో ఉన్నాయి. వాటిలో నుండి ఏవోకొన్ని ఏరివ్రాయడం అసాధ్యమైన విషయం. అదీగాక, ఆకార్యకర్తలు ప్రచారాన్ని

కోరుకునేవారు కాదు. నిశ్శబ్దంగా పనిచేసుకుంటూ పోయేవారు మాత్రమే. అయితే ఔచిత్యాన్ని దృష్టిలో పెట్టుకుని, చరిత్ర గర్భంలో కలిసిపోయిన కొందరు ప్రముఖుల పేర్లను, కొందరు ప్రఖ్యాతులైన అఖిలభారతీయ పెద్దల పేర్లను మాత్రం పేర్కొనడం జరిగింది. పేర్లదేముంది? కార్యకర్తలు సాధించిన విజయాలు, అనుభవాలు ప్రధానం. చివరికి ఒక కార్యకర్త విలువ అతడు నిర్మాణం చేసిన కృషిలోనేకదా కనిపించేది! అలాంటి కృషి నే ఈ పుస్తకంలో ప్రత్యేకంగా వెలుగులోకి తెచ్చాం.

మా ఈ చిన్ని ప్రయత్నం విషయంలో మేధావులనుండి మార్గ దర్శక ప్రతిస్పందన లభించగలదని మావిశ్వాసం. ప్రస్తుత సంకలనం తయారీలో అనేక ముఖ్యమైన, ఆసక్తికరమైన సంఘటనలు సంకలనకర్తల దృష్టిలో పడకపోయి ఉండవచ్చునన్న సందేహంనాకుంది. సంఘం పనిచేసే విధానం మౌలికంగా నిరాడంబర రీతిలో ఉంటుంది కనుక ఆసంఘటన లకు సంబంధించిన వివరాల పత్రాలు తగినంతగా దొరకలేదు. అయితే మీముందుంచుతున్నదంతా పూర్తిగా అధికారికమైనదేనన్నది మాత్రమే మాకు సంతృప్తిని కలిగిస్తోంది. ఎందుకంటే, ఆఘటనలన్నీ ప్రత్యక్షంగా పాల్గొన్న వారో, ప్రత్యక్షంగా పరిశీలించినవారో మాకు అందజేసినవే.

ఈ సంకలనానికి ఉపయుక్తమైన సమాచారాన్ని పంపించమని కోరిన వెంటనే శ్రమతీసుకుని సహకరించిన అసంఖ్యాక మిత్రులకు నాహృద యపూర్వక కృతజ్ఞతలు. అయితే ఈసంకలనం యొక్క సంగ్రహతను దృష్టిలోపెట్టుకుని, ఆసమాచారమంతటినీ ప్రచురించలేకపోయాం . మొత్తం సమాచారాన్ని పరిశీలించి, దానిలోని కొన్నిభాగాలను ఇందులో చేర్చాం. ఈ ప్రయత్నంలో కొన్ని విలువైన వివరాలు కూడా తప్పిపోయి ఉండవచ్చు. దయతో దానిని అర్థం చేసుకొనమని వారిని నేను కోరుతున్నాను.

సంఘంలో మాపెద్దలు, సహచరులు సర్వశ్రీ యాదవరావుజోషీ, రాజేంద్రసింగ్, కె.కె. సుదర్శన్, కె.సూర్యనారాయణరావు, దత్తోపంత్ ఠేంగ్డీ, భావూసాహెబ్ భుస్కుటే మరియు పి.పరమేశ్వరన్‌లు ఎంతో పరిశ్రమకోర్చి మొత్తం వ్రాతప్రతిని పరిశీలించి, తమ విలువైన సలహాలను అందజేసారు. ఆ సహకారమే లేకుంటే ఈసంకలనం ఈరోజు ఈ స్వరూపాన్ని పొంది ఉండేది కాదు. వారందరికీ నేనెంతో ఉపకారబద్ధుడనై ఉన్నాను.

వారాల తరబడి సర్వశ్రీ ఎస్.ఆర్.రామస్వామి, బెంగుళూరులోని ఉత్థాన కన్నడ మాసపత్రిక సంపాదకులు; మద్రాస్‌కు చెందిన ఎస్.ఎస్.మ

హదేవన్, కె.ఆర్.రాజగోపాల్, కె.ఎస్.నాగరాజ్, జె.రఘునాథభట్‌లు అందించిన ప్రేమపూర్వక సహకారం అనేక దిశలనుండి వచ్చిపడిన విస్తృత సమాచారాన్ని క్రమబద్ధీకరించడంలో అపురూపమైన సహాయం అయింది. వ్రాతప్రతి సిద్ధం చేసేందుకు అన్ని ఏర్పాట్లు గావించి నందుకు, ప్రచురణకు కూడా సౌకర్యాలు కల్పించినందుకు రాష్ట్రోత్థాన పరిషత్ కార్యనిర్వాహక కార్యదర్శి శ్రీ ఎమ్.సి.జయదేవ కు కూడా నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

పుస్తకాన్ని చక్కని పద్ధతిలో ముద్రించడంలోనూ, ఆకర్షణీయమైన రూపం కల్పించడంలోనూ, అతి తక్కువ సమయంలో పుస్తకం సిద్ధం చేయడంలోనూ బెంగుళూరులోని మెసర్స్ రాష్ట్రోత్థాన ముద్రణాలయ, మెసర్స్ లైప్‌షాప్ యాజమాన్యాలు చూపిన శ్రద్ధ కూడా అభినందనీయం.

ప్రముఖ జాతీయ ప్రాధాన్యతగల అంశాలపై పుస్తకాలు ముద్రించ డంలో పెట్టింది పేరైనా బెంగుళూరులోని జాగరణ ప్రకాశన్ వారికి, ఈసంకలన ముద్రణను స్వీకరించినందుకు ప్రత్యేకంగా ధన్యావాదములు తెలియజేస్తున్నాను.

ఏవైనా సలహాలు, అభిప్రాయాలు ఉన్నట్లైతే తెలియజేయవలసిందని, అలాగే మిగిలిపోయిన అధికారిక సమాచారం ఏదైనా ఉంటే పంపిం చవలసిందని, తద్వారా రాబోయే సంకలనాలను మరింత సమగ్రంగా తీర్చిదిద్దడంలో సహకరించవలసిందని పాఠకలోకాన్ని కోరుతున్నాను.

కేశవకృప, శంకరపురం,
బెంగుళూరు - 560 004(భారత్).                హెచ్.వి.శేషాద్రి
విజయదశమి, విభవనామసంవత్సరం
అక్టోబర్ 20, 1988

# ముందు మాట

## పునర్ముద్రణ, డిసెంబర్'88

ఆరెస్సెస్ సంస్థాపకులు డా. హెడ్గేవార్ జన్మశతాబ్ది ఉత్సవాలు దేశమంతటా ప్రారంభమైన సందర్భంలో, గత విజయదశమి నాడు జరిగిన ఈ పుస్తక ప్రచురణ అనేక విధాలుగా ఒక గొప్ప వరప్రదానం అయింది.

భారతదేశంలో జరుగుతున్న సమగ్ర జాతీయ పునరుజ్జీవన మహోద్యమంలో సంఘస్వయంసేవకులు నిర్వహిస్తున్న చైతన్యవంతమయిన పాత్రను ప్రస్ఫుటం చేస్తూనే ఈ పుస్తకం డా. హెడ్గేవార్ అందించి వెళ్ళిన ఒక భవ్య స్వప్నాన్ని ఆచరణ మార్గాన్ని కూడా మన ముందు ఉంచుతుంది. డా.హెడ్గేవార్ గురించి సమగ్రంగా తెలుసుకోవాలన్న ఆతృతతో ఉన్న ప్రజానీకం ఈపుస్తకాన్ని అత్యంత సమయోచితమైనదిగా భావించిందనడంలో ఆశ్చర్యంలేదు. దేశంలోని అనేక ప్రముఖ పట్టణాలలో శతజయంతి ప్రారంభోత్సవాలసందర్భంగా ప్రతిష్ఠిత వ్యక్తుల చేతుల మీదుగా ఈపుస్తకావిష్కరణ జరగడంతో, పుస్తకంలోని ఇతివృత్తానికి మరింత ప్రాధాన్యత ఏర్పడింది. ఈసందర్భంలో ఆ ప్రతిష్ఠితవ్యక్తులకు, ఉత్సవనిర్వాహకులకు వారందించిన సహకారానికి మాహృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం.

ప్రథమ ముద్రణ ప్రతులన్నీ అతితక్కువ సమయంలో అమ్ముడై పోవడాన్ని బట్టి ఒక చిరకాల వాంఛను ఈపుస్తకం తీర్చిందని నిరూపణ అయింది. దేశంలోని వివిధ ప్రదేశాలనుండి పుస్తకాలు మరిన్ని కావాలంటూ అందుతున్న అభ్యర్థనలు ఈ అభిప్రాయాన్ని మరింత బలపరుస్తున్నాయి.

పుస్తకంలో దొర్లిన కొన్ని అస్పష్ట విషయాలను, ముద్రణదోషాలను మా దృష్టికి తీసుకుని వచ్చిన మిత్రులకు ధన్యవాదాలు. ఈపునర్ముద్రణలో వాటిని సవరించాం. ఈ పుస్తకాన్ని తమతమ భాషలలో వెలువరించడానికి వివిధ రాష్ట్రాలలోని ప్రచురణకర్తలకు అనుమతి ఇచ్చిన విషయం పాఠకులకు సంతోషం కల్గించవచ్చు. ఈశతాబ్ది ఉత్సవాల సంవత్సరంలోనే కొన్ని భాషలలో ముద్రణ పూర్తిచేసుకుని పుస్తకం అమ్మకానికి సిద్ధం కాగలదుకూడా.

గీతాజయంతి, విభవనామ సంవత్సరం
డిసెంబర్19, 1988.

ప్రచురణ కర్తలు

# సంకేతాక్షరముల వివరణ

ఎ.బి.జి.పి. - అ.భా.గ్రా.ప. - అఖిల భారతీయ గ్రాహక్ పంచాయత్

ఎ.బి.వి.పి. - అ.భా.వి.ప. - అఖిల భారతీయ విద్యార్థి పరిషత్

ఎ.ఐ.ఎ.డి.ఎమ్.కె. - ఆల్ ఇండియా అన్నా ద్రవిడ మున్నేట్ర కజగం

బి.జె.పి. - భా.జ.పా. - భారతీయ జనతా పార్టీ

బి.జె.ఎస్. - భా.జ.సం. - భారతీయ జనసంఘ్

బి.కె.ఎస్. - కిసాన్ సంఘ్ - భారతీయ కిసాన్ సంఘ్

బి.ఎమ్.ఎస్. - మజ్దూర్ సంఘ్ - భారతీయ మజ్దూర్ సంఘ్

బి.ఎస్.ఎస్. - భారతీయ స్వయంసేవక సంఘ్

బి.వి.కె. - భారతీయ విచార కేంద్ర

సి.పి.ఐ. - కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా

సి.పి.ఎమ్. - కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా(మార్క్సిస్ట్)

డి.కె. - ద్రవిడ కజగం

డి.ఎమ్.కె. - ద్రవిడ మున్నేట్ర కజగం

డి.ఆర్.ఐ. - దీనదయాళ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్

హెచ్.ఎస్.పి. - ప్రతిష్ఠాన - హిందూ సేవా ప్రతిష్ఠాన

హెచ్.ఎస్.ఎస్. - హిందూ స్వయంసేవక సంఘ్

జె.ఎస్.బి. - జనతా సహకారీ బ్యాంక్

ఆర్.యస్.యస్. - రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్

ఎస్.ఎస్.ఎమ్. - స్వదేశీ సైన్స్ మూవ్‌మెంట్

వి.హెచ్.పి. - వి.హిం.ప. - విశ్వహిందూ పరిషత్

వి.కె.ఎ. - కళ్యాణాశ్రమ్ - వనవాసీ కళ్యాణ ఆశ్రమ్.

గమనిక: ఈపుస్తకంలో వివిధ సంస్థల ప్రగతికి సంబంధించి ఇచ్చిన గణాంక వివరాలు 1988 జనవరి 1వతేదీ నాటి స్థితిని తెలియజేస్తాయి.

# విషయసూచిక

ప్రస్తావన:

# జాతీయ పునరుజ్జీవన గంగోత్రి - ఆర్.యస్.యస్

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ పుట్టు పూర్వోత్తరాలకు సంబంధించిన వివిధ అంశాలను గనుక పరిశీలించినట్లైతే దానికదేసాటి అని అనిపిస్తుంది.

1925వసం.లో కొద్దిమంది యువకులతో డా.హెడ్గెవార్ సంఘాన్ని ప్రారంభించారు. నేడు సంఘ కార్యం దేశంలో అన్ని భాగాలకు విస్తరించింది. 20వేలకు పైగా గ్రామాలలో శాఖలు ఉన్నాయి. విద్యార్థులు, ఉపాధ్యాయులు,వ్యవసాయదారులు, కార్మికులు,వ్యాపారస్తులు, పారిశ్రామికవేత్తలు, వృత్తికళాకారులు,ఉద్యోగులు, మేధావులు మొదలైన అన్ని వర్గాలవారు సంఘకార్యక్రమాలలో పాల్గొంటున్నారు.

సంఘం ఇంతవేగంగా ప్రజాదరణ పొందడానికి అనేక విషయాలు సహకరించాయి.వివిధ జాతీయ సమస్యలను ప్రజలదృష్టికి తీసుకుని రావడానికై స్వయంసేవకులు తరచు జనజాగరణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రకృతి వైపరీత్యాలు, మానవ దోషాలు సృష్టించే ఆపదల నుండి వారు అన్ని విధాల ప్రజలను ఆదుకుంటున్నారు. జాతీయ జీవనరంగాలలో తమ చైతన్యవంతమైన పాత్ర ద్వారా స్వయంసేవకులు శక్తివంతమైన ప్రజాఉద్యమాలను నిర్మించారు. ఆఉద్యమాలు కోట్లాది ప్రజలను విశేషంగా ఆకర్షించాయి.

సంఘస్థాపనకు పూర్వరంగంలో జాతీయసమస్యలు, వాటి పరిష్కారాల గురించి డాక్టర్జీకి ఉన్న అవగాహన కూడా విశిష్టమైనది.

జన్మతః డా.హెడ్గెవార్ గొప్పదేశ భక్తులు. కణకణ మండే దేశభక్తి వారిది. పసివయస్సునుండే విదేశీ బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా వారినుండి నిరసన జ్వాలలు పెల్లుబుకుతూ ఉండేవి. ఫలితంగా పాఠశాల నుండి బహిష్కరణకు గురి అయ్యారు. గూఢచారులు వారిని వెంటాడారు. వారి పినతండ్రిని వేధించారు. వీటన్నింటినీ డా.హెడ్గెవార్ ధైర్యంగా ఎదుర్కొన్నారు. వైద్య విద్యనభ్యసించే మిషతో

కలకత్తా వెళ్ళారు. విప్లవకారుల కార్యకలాపాలను నిశితంగా పరిశీలించారు. డాక్టర్‌గా తిరిగివచ్చి,వ్యక్తిగత సుఖాన్నీ, కుటుంబ సౌఖ్యాలను కాలదన్ని కాంగ్రెస్ నాయకత్వంలోని స్వరాజ్య ఉద్యమంలోకి ఉరికారు. రెండుసార్లు కఠిన కారాగార శిక్షను అనుభవించారు.

నిప్పులు గ్రక్కే వాగ్ధోరణి డా.హెడ్గెవార్‌ది. ఒకసారి వారు చేసిన ఒకప్రసంగాన్ని రాజద్రోహంగా పరిగణించి బ్రిటిష్ ప్రభుత్వం కోర్టుకు ఈడ్చినపుడు,తనప్రసంగాన్ని సమర్థించుకుంటూ తిరుగుబాటు ధోరణిలో వారు చేసిన వాదాన్ని విన్న న్యాయమూర్తి 'నీ ఉపన్యాసం కంటె నీ వాదనే ఎక్కువ రాజద్రోహకరమైన'దని వ్యాఖ్యానించాడు. వారికి ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్ష విధించాడు. అది 1921 నాటి మాట. రెండవసారి 1930లో డా.హెడ్గెవార్ తన సంఘ మిత్రులతోకలిసి సత్యాగ్రహోద్యమంలో పాల్గొని మరల కఠిన కారాగార శిక్షను అనుభవించారు.

'ఈ తనువులో,ఈకనులతో' స్వతంత్ర భారతాన్ని చూడాలనే తీవ్ర ఆకాంక్షతో వారు 1940 లో తుదిశ్వాస విడిచేవరకు తపించారు. అవి రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులు. జీవన్మరణ సమస్యలతో బ్రిటిష్‌వారు కొట్టుమిట్టాడుతున్నారు. ఆవరిస్తున్న యుద్ధమేఘాలను డా.హెడ్గెవార్ ముందుగానే పసిగట్టారు. బానిస సంకెళ్ళు బిగించిన వారికి దాపురించిన కష్టకాలం,బానిసలు ఆసంకెళ్ళను త్రెంచుకొనడానికి సువర్ణావకాశం అవుతుందని వారు భావించారు. అందుకే ఒక మహత్తర శక్తిని అత్యల్పకాలంలో నిర్మించడానికి స్వయంగా రాత్రింబవళ్ళు శ్రమించారు. సంఘకార్యకర్తలందరినీ పనిని త్వరితంగా వృద్ధిచేయాలని ఉద్బోధించారు. ఒక్కొక్క సారి నిద్రలో కూడా 'కాలం కరిగిపోతోంది. లక్ష్యం నెరవేరలేదింకా' అని వారు కలవరిస్తూ ఉండేవారు. వారి స్వాతంత్ర్యేచ్ఛ అంత తీవ్రమైనది.

స్వాతంత్ర్యేచ్ఛ ఎంత తీవ్రంగా ఉన్నప్పటికీ ఆనాడు ప్రచారంలో ఉన్న నినాదాల హోరులో వారు కొట్టుకుపోలేదు. అడ్డదారులు త్రొక్కడానికి అంగీకరించలేదు. 'హిందూ-ముస్లిం భాయి భాయి', 'హిందూ-ముస్లిం ఐక్యత లేనిదే స్వరాజ్యంరాదు' వంటి నినాదాలు మార్మోగుతున్న రోజులవి. ముస్లింలను ఆకట్టు కోవడం కోసం వారిని బుజ్జగించే స్థితికి సైతం కాంగ్రెస్ దిగజారింది. అయితే అవన్నీ జారుడుమెట్లే. ముస్లింలను, బ్రిటిష్ వారిని ఒకేసారి ఎదుర్కొనవలసి వచ్చే పరిస్థితిని తప్పించడం వ్యూహరీత్యా అవసరం అనేది అర్థం చేసుకోదగినదే. ముస్లింలను బ్రిటి

షవాది ప్రభావం నుండి బైటకులాగి, జాతీయవాదుల శిబిరంలోకి వారిని ఆకర్షించడానికి ప్రయత్నించడం పూర్తిగా సమంజసమే. డా.హెడ్గేవార్ స్వయంగా జాతీయోద్యమంలో పాల్గొన్న ముస్లింలందరితో సన్నిహితంగా, ఆత్మీయతతో వ్యవహరించారు.

అంతమాత్రాన ముస్లింలను ఆకర్షించే ప్రయత్నంలో జాతీయభావనను నీరుగార్చరాదని వారు నొక్కివక్కాణించారు. అదేపనిగా వారిని బుజ్జగించే ఆరాటం వారిలో మతతత్వాన్ని, వేర్పాటు ధోరణిని పెంచుతుందని వారు హెచ్చరించేవారు. జాతీయజీవన స్రవంతిలో హిందువులతో కలవడం వల్ల ఉండే ప్రయోజనాన్ని ముస్లింలు గ్రహించే విధంగా హిందూసమాజం గనుక శక్తివంతంగా రూపొందితే వారు తమ జాతి వ్యతిరేక ధోరణులను విడనాడి తీరుతారని డా.హెడ్గేవార్ ప్రగాఢంగా విశ్వసించారు. శత్రుకూటమిలో చీలికలు తేవడం చక్కటి యుద్ధతంత్రమే అయినా, చివరివరకు నిలువగలిగేది సుసంఘటిత జాతీయ శక్తి మాత్రమే. భారతదేశంలో నెలకొని ఉన్న పరిస్థితులలో - అటు ముస్లింలను జాతీయ జీవనస్రవంతిలో కలపాలన్నా, ఇటు బ్రిటిష్ వారితో పోరాడాలన్నా, జాతీయ సౌధానికి మూలస్తంభం అయిన హిందూసమాజాన్ని శక్తివంతం చేయవలసి ఉన్నది. ఆపనికి మొదటి ప్రాధాన్యత నివ్వాలి.

అయితే ఇక్కడ కాంగ్రెస్ తప్పటడుగు వేసింది. భారతదేశానికి స్వాతంత్ర్యం రావాలంటే ముస్లింల సహకారం ఉండి తీరాలని, అందుకోసం వారిని ఏదోవిధంగా మనవైపు త్రిప్పుకోవాలని కాంగ్రెస్ భావించింది. ఈ తప్పుడు ఆలోచన జాతి మనోనిబ్బరంపై దెబ్బతీసింది. దాని దుష్ఫలితాలు వెంటనే కనిపించాయి. ఒకప్రక్క ముస్లింలలో వేర్పాటు వాదం నానాటికీ పెరుగసాగింది. మరొకప్రక్క జాతీయవాదపు వెన్నెముక విరిగిపోయింది. ఈ దుస్థితిని ముందుగానే ఊహించిన డా.హెడ్గేవార్ స్వాతంత్ర్య సముపార్జన కోసం హిందూసమాజాన్ని సంఘటిత శక్తిగా రూపొందించాలని నిశ్చయించారు.

ఒకవైపు జాతికి వెన్నెముక అయిన హిందూసమాజాన్ని సుసంఘటితం చేస్తూనే, మరొకవైపు స్వాతంత్ర్యజ్యోతిని జాజ్వల్యమానం చేయడం సంఘం యొక్క దూరదృష్టికి నిదర్శనం. ప్రారంభదినాలనుండి బ్రిటిష్‌వారు మనదేశాన్ని విడిచిపెట్టి పోయేవరకు సంఘ పెరుగుదలలో ఈ ప్రత్యేకత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

ఆరోజులలో ప్రతిజ్ఞలో హిందూరాష్ట్ర స్వాతంత్ర్యం కోసం తమను

తాము అంకితం చేసుకుంటున్నామని స్వయంసేవకులు స్పష్టంగా వక్కాణించేవారు. 1930లో లాహోర్‌లో జరిగిన సమావేశాలలో కాంగ్రెస్ సంపూర్ణస్వాతంత్ర్యం తమలక్ష్యమని ప్రకటించింది. అదితెలియగానే డా॥హెడ్గేవార్ కాంగ్రెస్‌ను అభినందిస్తూ సందేశాలు పంపవలసిందిగా అన్ని సంఘశాఖలను ఆదేశించారు. సంపూర్ణ స్వరాజ్యం మొదటి నుంచి సంఘ లక్ష్యంగా ఉంటూనే వచ్చిందని, దానిని కాంగ్రెస్ స్వీకరించడం స్వయంసేవకులకు సహజంగానే సంతోషం కలిగిస్తుందని కూడా వారు తన లేఖలో పేర్కొన్నారు.

1930లో సత్యాగ్రహంలో పాల్గొన్నప్పుడు డా.హెడ్గెవార్ సర్‌సంఘచాలక్ బాధ్యతను మరొక జ్యేష్ఠ కార్యకర్తకు అప్పగించారు. తాను, తనతో బాటు సత్యాగ్రహంలో పాల్గొంటున్న ఇతర స్వయంసేవకులు తమ వ్యక్తిగత హోదాలోనే పాల్గొంటున్నామని వారు స్పష్టంగా ప్రకటించారు. సత్యాగ్రహంలో పాల్గొనడానికి వెళ్ళేముందు మిగిలిన స్వయంసేవకులను సంఘకార్యాన్ని మరింత ఉధృతం చేయవలసిందిగా వారు హెచ్చరించారు. జైలుకు వెళ్ళడమే లక్ష్యం కారాదని, అదే దేశభక్తికి చిహ్నంగా భావించరాదని వారు స్పష్టంగా చెప్పారు. హిందూసంఘటనాకార్యాన్ని మరింత విస్తరింపజేయడం, సుదృఢం చేయడం అత్యంత ఆవశ్యకమని వారు నొక్కిచెప్పారు.

స్వాతంత్ర్యపోరాటంలో డా.హెడ్గెవార్ అనుసరించిన పద్ధతిలో మరొక మౌలిక విశేషమున్నది. స్వాతంత్ర్యాన్ని సంపాదించడమనేది తక్షణ కర్తవ్యమైనప్పటికీ, వారి ఆలోచనలు దానిని దాటి మరింత ముందుకు సాగాయి. గత చరిత్రను వారు నిశితంగా పరిశీలించారు. చరిత్ర నుండి గుణపాఠాలు నేర్చుకొననివారికి తిరిగి అవే తప్పులకు పాల్పడే దుస్థితి దాపురిస్తుందని వారు గ్రహించారు. గత చరిత్రను ఒక్కసారి పరిశీలిస్తే మనదేశం ఒకనాడు స్వతంత్రంగా, సుభిక్షంగా ఉండేదని, అన్నిరంగాలలోను ఉన్నత శిఖరాలను అందుకున్నదని తెలుస్తుంది. కానీ కొద్దిమంది విదేశీదురాక్రమణదారుల చేతుల్లో ఓటమిని, అవమానాన్ని మనం చవిచూడవలసి వచ్చింది. గుణపాఠం స్పష్టంగా తెలుస్తుంది. మన జాతీయజీవనంలో అనేక లోపాలు ప్రవేశించాయి. దేశం యొక్క శక్తి సన్నగిల్లింది. ఫలితంగా దేశం విదేశీ దురాక్రమణదారుల కోరలలో తేలికగా చిక్కుకుంది.

అన్నింటికంటే ప్రమాదకరమైన లోపం ప్రజలలో సంఘటిత జాతీయ

భావన లోపించడం. ఉదాహరణకు విదేశీయులు దేశంలో ఏదైనా ఒక భూభాగంపై దాడిచేస్తే మిగిలినవారు అది తమకు పట్టనట్లు ఊరుకునే వారు. స్వేచ్ఛాయుత జాతీయజీవనపు ప్రాథమిక సూత్రాన్ని వారు మరచిపోయారు. స్వాతంత్ర్యం అవిభాజ్యమైనది. ఏదైనా ఒక ప్రాంతం స్వేచ్ఛను కోల్పోతే జాతి మొత్తానికి ప్రమాదం కలుగుతుంది. ఇదే పరిస్థితి గనుక కొనసాగితే బ్రిటిష్ వారినుండి స్వేచ్ఛ పొందగలిగినప్పటికీ ఆస్వాతంత్ర్యం తిరిగి ఒడిదుడుకుల పాలవడం ఖాయమని డా.హెడ్గేవార్ అంటూండేవారు.

ఈ లోపాన్ని తొలగించి ఒక అఖిల భారత జాతీయ జాగృతిని ప్రజలలో నిర్మించడానికి డా.హెడ్గేవార్ సంఘం యొక్క దైనందిన శాఖా కార్యపద్ధతిని రూపొందించారు. సంస్కృత ఆజ్ఞలు, మనమంతా ఒకే భారతమాత సంతానమనే భావనను ప్రబోధించే సంస్కృత ప్రార్థన, పాటలు, ఆటలు, కథలు, జాతీయసమైక్యత గురించి చర్చలు, మహనీయుల సూక్తులు, జాతీయశ్రద్ధాకేంద్రాల ప్రాధాన్యత గురించిన వర్ణనలు, రోజూ ఏకాత్మతా స్తోత్రాన్ని, ఏకతామంత్రాన్ని పఠించడం - మన జాతి సమైక్యతను, సమరసతను ప్రబోధించే చారిత్రక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక సంప్రదాయాలను ప్రతిబింబించే ఇటువంటి వివిధ కార్యక్రమాలు స్వయంసేవకులలో దేశభక్తిని మేల్కొల్పుతాయి. పట్టణాలలో, పల్లెలలో, మారుమూల కొండకోనలలో జరిగే శాఖలన్నింటిలోనూ ఇవే కార్యక్రమాలు రోజూ జరుగుతూ ఉంటాయి.

దీనితోబాటు స్వయంసేవకులు వివిధ స్థాయిలలో సంఘ శిక్షా వర్గలలో పాల్గొంటూ ఉంటారు. ఎటువంటి కుల,వర్గ,భాషాది భేదాలు లేకుండా తామందరము ఒకటే అనే ఉత్తమ సంస్కారం వారికి కలుగుతుంది. మొదటి రెండు శిక్షావర్గలు వేరు వేరుగా ప్రాంతాలవారీగా జరుగుతాయి. మూడవ శిక్షావర్గలో దేశంలో అన్ని ప్రాంతాల నుండిమొదటి రెండు శిక్షావర్గలు పూర్తిచేసిన వారు పాల్గొంటారు. భారతదేశం యొక్క సమగ్ర స్వరూపాన్ని అక్కడ వారు తమ హృదయఫలకాలపై ముద్రించుకుంటారు. దేశం నలుమూలలనుండి వివిధ భాషలకు, మాండలీకాలకు చెందిన వారు, వివిధ అలవాట్లు, ఆనవాయితీలు గలవారు నాగపూర్‌కు వస్తారు. అంతా కలిసి ఆడుకుంటూ, పాడుకుంటూ, ముచ్చటలాడుకుంటూ, కలిసి తింటూ, కలిసిప్రార్థన చేస్తూ - ఒక్కమాటలో చెప్పాలంటే ఒకే కుటుంబంలో వ్యక్తులుగా మసలుతూ జాతి ఒక బృహత్ కుటుంబం అనే అనుభూతిని పొందుతారు. దేశం నలుమూలల వ్యాపించి ఉన్న ప్రచారక

వ్యవస్థ కూడా జాతీయసమైక్యతకు దోహదం చేస్తున్నది. ప్రచారకులు ఎక్కడికి వెళ్ళినా స్థానిక ఆచారాలను అనుసరిస్తూ, స్థానిక ఆహార నియమాలను పాటిస్తూ, స్థానిక వేషభాషలను ఆదరిస్తూ, స్థానికులతో సామరస్యంగా ఉంటూ జాతీయ సమైక్యతకు ప్రతీకలుగా భాసిస్తూ ఉంటారు.

ఈ విధంగా జాతికి అంకితమైన స్వయంసేవకులు దేశ స్వాతంత్ర్యానికి, సమగ్రతకు, భద్రతకు ఎటువంటి ముప్పు వాటిల్లినా సహజరీతిలో స్పందించి, తగు చర్యలు తీసుకోవడంలో ఆశ్చర్యం ఏమీలేదు. బ్రిటిష్ పరిపాలన రోజులలోనూ, ఆ తరువాత అనేక సందర్భాలలోనూ స్వయంసేవకులలోని ఈ గుణం వెలికిరావడం మనకు కనిపిస్తుంది. (వివరణ 1వ అధ్యాయంలో)

కేవలం బ్రిటిష్ వారు వెళ్ళిపోయినంత మాత్రాన మనసమస్యలన్నీ తొలగిపోతాయనుకోవడం భ్రమ అని డా. హెడ్గేవార్ అనేక పర్యాయాలు హెచ్చరించే వారు. చైతన్యవంతం,శక్తిమంతం,సుసంఘటితం అయిన హిందూసమాజం మాత్రమే జాతికి భద్రతను సమకూర్చగలదన్న వారి విశ్లేషణను తదుపరి సంఘటనలు బలపరిచాయి. దేశంలో హిందువులు అల్ప సంఖ్యాకులుగాను, బలహీనులుగాను, అసంఘటితులు గాను ఉన్న ప్రాంతాలలో పరిస్థితులు దేశసమగ్రతకు భంగం కలిగిస్తున్నాయి.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా హిందువుల అనైక్యత,క్రమశిక్షణారాహిత్యం వంటి దోషాలు కొనసాగుతూనే వచ్చాయి. దేశవిభజనతో ముస్లిం వేర్పాటు వాదానికి తెరపడుతుందని మన రాజకీయ నాయకులు భావించారు. కానీ అది శుద్ధ తప్పని తరువాత జరుగుతున్న సంఘటనలు నిరూపించాయి. హిందువులలో చైతన్యరాహిత్యాన్ని, అసంఘటితస్థితిని ఆసరాగా తీసుకుని కుటిలురైన రాజకీయవాదులు మూకుమ్మడి ఓట్లకోసం ముస్లింలను బుజ్జగించే ప్రయత్నాలు చేశారు. ఫలితంగా ముస్లింల మత మౌఢ్యం, వేర్పాటువాదం క్రొత్తరూపును సంతరించుకుంటూ, నానాటికీ మరింత బలపడుతూ, ప్రమాదకరంగా తయారవుతున్నాయి. (వివరణ 2వ అధ్యాయంలో)

అల్పసంఖ్యాకుల హక్కులపేరిట ముస్లింల వేర్పాటు వాదాన్ని ప్రోత్సహించడం, క్రైస్తవమిషనరీలకు ఉత్సాహాన్నిచ్చింది. ఇటు బీహార్‌నుండి అటు మిజోరాం వరకు ఈశాన్య భారతంలో వారు బాహాటంగానే వేర్పాటువాదాన్ని ప్రోత్సహిస్తున్నారు. (వివరణ 3వఅధ్యాయంలో)

ఇటువంటి జాతివ్యతిరేక కార్యకలాపాలన్నింటికీ హిందువుల నైతిక

స్థైర్యం మాత్రమే సరియైన సమాధానం కాగలదని గుర్తించిన డా. హెడ్గెవార్ దానిని శక్తివంతం చేయడానికి వీలైన మార్గాలన్నింటినీ అన్వేషించారు. ఆ ఉద్దేశంతో ఏర్పాటుచేసిన అన్ని కార్యక్రమాలలోను వారు తప్పక పాల్గొనేవారు. ప్రోత్సహించేవారు. ఈ హిందూ పునరుజ్జీవన ఉద్యమంలో ప్రముఖులైన పెద్దలు పాల్గొనేటట్లు చేయడానికి ఆయన నిరంతరం కృషి చేస్తుండేవారు. బాబారావు సావర్కార్, భాయి పరమానంద్, పండిత మదనమోహన మాలవీయ వంటి ప్రముఖ హిందూనాయకులతో వారికున్న సన్నిహిత సంబంధాల కారణంగా సంఘ శాఖలు వ్యాప్తి చెందడం మాత్రమే కాక, సాధారణ హిందువులలో కూడా చైతన్యం కలిగింది.

వీటన్నింటి ఫలితంగా సంఘం ఒక మామూలు స్వచ్ఛందసంస్థ కాదని, హిందూ పునరుజ్జీవనానికి కృషిచేసే ఒక మహోద్యమమని గుర్తింపు లభించింది. డా. హెడ్గెవార్ తరువాత శ్రీ గురూజీ సర్ సంఘచాలక్ బాధ్యతను చేపట్టారు. ధార్మిక, సామాజిక, విద్యారంగాలలో పని చేస్తున్న అనేకమంది ప్రముఖులు ఈ హిందూ జాగరణోద్యమంలో పాల్గొనేటట్లు శ్రీ గురూజీ ప్రయత్నించారు. నేడు స్వయంసేవకులు అనేకరంగాలలో సంస్థలను స్థాపించి పని చేస్తున్నారు. వారందరి కృషి ఫలితంగా హిందూసంఘటనా కార్యానికి మరింత పుష్టి చేకూరింది. పర్యవసానంగా నేడు దేశం నలుమూలలా వెల్లువలా, హిందువు లలో స్వాభిమానం, ఆత్మస్థైర్యం ప్రకటితమౌతున్నాయి.(వివరణ 4వ అధ్యాయంలో)

దేశంలో ఉన్న పరిస్థితులలో హిందువులు సంఘటితంగా, వీరోచితంగా నిలబడి తమ మాన ప్రాణాలను కాపాడుకోవాలని డా. హెడ్గెవార్ స్పష్టంగా చెప్పారు. ఈ విషయంలో వారి అభిప్రాయాలు గాంధీజీ అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవించాయి. మొట్టమొదటి సారి దేశమంతా పర్యటించిన తరువాత గాంధీజీ 'ఒక సామాన్య ముస్లిం దుండగుడు. ఒక సామాన్య హిందువు పిరికివాడు. నా అనుభవం దీనిని నిరూపిస్తున్నది. పిరికివాళ్ళు ఉన్నచోట్ల దుండగులు ఉండి తీరుతారు' అని వ్రాశారు. ముస్లింల దౌర్జన్యాన్ని అంతంచేయాలంటే హిందువులు తమ పిరికి తనాన్ని విడనాడాలని వారి మాటలు పరోక్షంగా హెచ్చరిస్తున్నాయి.

సంఘ ప్రారంభదినాలనుండి స్వయంసేవకులు ఈ అవమానకర పరిస్థితిని అంతం చేయాలని నిర్ణయించుకున్నారు. సంఘాన్ని స్థాపించిన రెండేళ్ళకే మొదటి సవాలు ఎదురైంది. ఒక పీర్‌సాహెబ్ గౌరవార్థం

జరిపే ఊరేగింపు మిషతో నాగపూర్‌లో ముస్లింలు హిందువుల మీద పెద్ద ఎత్తున దాడిచేశారు. పోలీసులు మౌనంగా, ప్రేక్షకులవలె ఉండిపోవడంతో ముస్లింలు తమ ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించవచ్చనుకున్నారు. కానీ స్వయం సేవకులు సమయస్ఫూర్తితో, ధైర్యంతో ఎదురు తిరగడంతో దుండగులు తోకముడవక తప్పలేదు. ఆవీరోచిత పోరాటంలో ఒక స్వయంసేవక్ ప్రాణాలు అర్పించాడు. అయితే మొదటిసారిగా ముస్లింలు సంఘటిత హిందూశక్తిని చవిచూచారు. ఆతరువాత నేటివరకు మరెన్నడు నాగ పూర్‌లో ముస్లింలు ఘర్షణకు దిగలేదు.

హిందూ శ్రద్ధాకేంద్రాలపై దాడి జరిగినపుడు గానీ, హిందువుల హక్కులను కాలరాచే ప్రయత్నాలు జరిగినప్పుడుకానీ ఆ ప్రయత్నాలకు వ్యతిరేకంగా హిందువులలో సంఘటిత ప్రతిక్రియ, ప్రచండమైన ఆత్మవి శ్వాసం వెల్లువలా ఉప్పొంగుతుందనడానికి నేడు దేశం నలుమూలలా సంఘ స్వయంసేవకులు ఒక సంకేతంగా నిలచి ఉన్నారు. (వివరణ 4వ అధ్యాయంలో)

శతాబ్దాల తరబడి హిందువులనుండి ఇస్లాం,క్రైస్తవాలలోకి ఒకేదిశలో సాగుతున్న మతం మార్పిడులను నిరోధించడానికి జరిగిన కృషి హిందూ జాగృతి ప్రభావం ప్రస్ఫుటంగా పడిన ప్రధాన రంగాలలో ఒకటి.

మతం మార్పిడులు, వాటి ఫలితంగా హైందవేతరుల జనాభాలో వచ్చే పెరుగుదల వల్ల కలిగే మహా విపత్కర పరిణామాలను గురించి నెమ్మదిగా ప్రజలకు అవగాహన అవుతోంది. ముస్లిం ఆధిక్యత గలిగిన భాగాలుగా మారిన ప్రాంతాలు కాలగమనంలో మాతృభూమి నుండి చీలిపోయాయి. అనాదిగా మన భూభాగంలో అంతర్భాగమైన గాంధారం ఇస్లాంకు మారిన తరువాత ఆఫ్ఘనిస్థాన్‌గా మారిపోయింది. 1947లో ఇదే ప్రాతిపదికగా దేశవిభజన కూడా జరిగింది. మొట్టమొదటి హిందువు ముస్లింగా మతం మార్చబడిన రోజునే పాకిస్తాన్ అనే బీజం ఈ భూమిలో నాటబడిందని మహమ్మదాలీ జిన్నా అన్న మాటలు ఈసందర్భంగా మనం గుర్తు చేసుకోవాలి.

శతాబ్దాల ఈ పరిణామాల తర్వాత కూడా నిన్న మొన్నటి వరకు హిందువులలో మతం మార్పిడి వలన కలిగే విపత్కర పరిణామాల గురించిన సరియైన అవగాహన లేనేలేదు. మన అమాయకత్వం కారణంగా ఈ దురాక్రమణదారులు విశ్వసిస్తున్న మతాలు కూడా ఆధ్యాత్మిక సాధనలో వేరు వేరు మార్గాలు మాత్రమే అని విశ్వసిస్తూ వచ్చాం.అవి



ప. పూ. శ్రీ మాధవ సదాశివ గోళ్వాల్కర్
( గురూజీ )

కూడా మన మతాల లాంటివేనని, పరమత సహనం వాటికి కూడా ఉందని భావిస్తూ వచ్చాం. ఆమతాలలోకి మారడం కేవలం వ్యక్తిగతమైన విషయమని నమ్ముతూ వచ్చాం. ఈ మతాల దురాక్రమణలకు బలి అయిపోయిన దేశాల దుస్థితిని మనం ఏనాడూ తెలుసుకునే ప్రయత్నం చేయలేదు. జాతి తరువాత జాతి తన సంస్కృతి, చరిత్ర, సంప్రదాయాలు, విలువల సహితంగా దురాక్రమణకారుల జీవనవిధానంలోకి ఎలా పీల్చివేయబడిందో మనం గ్రహించలేదు. సంక్షిప్తంగా చెప్పాలంటే ఆ మతాలలోకి మారడం అనేది ఒక మామూలు మతం మార్పిడికి సంబంధించిన విషయం కాదని, (జన్మనిచ్చిన) జాతీయసమాజం నుండి పూర్తిగా దూరం చేయబడడం, దానిని నాశనం చేయడం మాత్రమేనని మనం అర్థం చేసుకోలేదు. 'హిందూసమాజం నుండి బైటకువెళ్తోన్న ప్రతి ఒక్కవ్యక్తి వల్ల ఒకవ్యక్తి చేయిజారిపోవడం మాత్రమేకాదు, ఒక శత్రువు పెరుగుతున్నాడని గ్రహించాలి' అని స్వామి వివేకానంద ఆనాడే హెచ్చరించారు.

ఏమైనప్పటికీ,మతం మార్పిడుల దాడిని ఎదుర్కోవడంలోనే కాక, మతం మారిన వారిని తిరిగి హిందూత్వపు ఒడిలోకి తెచ్చే ప్రయత్నాలపైన కూడా ఈ మధ్యకాలంలో వేగంగా పెరుగుతున్న హిందూజాగృతి యొక్క ప్రభావం కనబడుతోంది. (వివరణ 3వ అధ్యాయంలో)

మన స్వాతంత్ర్యానంతర కాలఖండంలో కూడా హిందూసమాజం అంతరంగికంగా అనేక సవాళ్ళను ఎదుర్కొన్నది. వాటికారణాలు సుస్పష్టం. మన జాతీయ జీవనానికి కేంద్రమైన సమైక్యతా ప్రవాహం బలహీనం ఐన ఫలితంగా మన వైవిధ్యానికి ప్రతిబింబాలైన భాషలు, మాండలీకాలు, సంప్రదాయాలు, అలవాట్లు, ఆరాధనా పద్ధతులు, వివిధ ఆధ్యాత్మిక ప్రతిపాదనావాదాలుకాలగమనంలో వేటికవి ప్రత్యేకంగా రూపొందాయి. దేశం యొక్క విశాలత కారణంగా సమాజంలో వివిధ ప్రాంతాల మధ్య. సంబంధాలు, ముఖ్యంగా పర్వత ప్రాంతాలతో..కొనసాగించడం మరొక సమస్యగా తయారైంది. బ్రిటిష్‌వారు తమ 'విభజించి పాలించే' నీతిని అనుసరించి, మన యొక్క ఈ బాహ్యమైన వైవిధ్యాలను ఒక క్రమపద్ధతిలో రెచ్చగొడుతూ, ప్రజలబుర్రలలో వేర్పాటువాద బీజాలను నాటడం ప్రారంభించారు. ఉదాహరణకు ఆర్యులదండయాత్ర; ద్రవిడ, వనవాసీ, సిక్కుల ప్రత్యేక అస్తిత్వం మొదలైన సిద్ధాంతాల ప్రతిపాదన బ్రిటిష్‌వారు ఉద్దేశ పూర్వకంగా చేసిన ప్రయత్నమే నన్న విషయం అందరికీ తెలిసినదే.

హిందూ సమాజంలోని వివిధ వర్గాలు తమ మౌలిక హిందూ అస్తిత్వాన్ని వదులుకునేటట్లు, వీలైతే వ్యతిరేకించేటట్లు చేయగలిగినట్లైతే మాత్రమే ఈ వేర్పాటువాద సిద్ధాంతాలు వ్రేళ్ళూన గలుగుతాయన్న విషయం బ్రిటిష్ వారికి బాగా తెలుసు. ఆదృష్టితోనే వారు ఒకప్రక్క నుండి హిందువులకు సంబంధించిన ప్రతివిషయాన్ని అవమానపర్చడం, కించపరచడం సాగించారు. రెండవప్రక్కనుండి ప్రధాన హిందూసమాజం నుండి ఆయావర్గాలు తమంతట తాము వేరు పడేందుకు దారి తీసే విధంగా రాజకీయపరమైన ప్రోత్సాహకాలు వారికి కల్పించసాగారు. లార్డ్ మెకాలే ప్రారంభించిన నూతన విద్యావిధానం కూడా ఈ హిందూ త్వవ్యతిరేకత లక్ష్యంగా ప్రేరేపించబడినదే.

అయితే హిందూత్వపు మౌలిక అంతర్వాహిని చాలా లోతైనదని, సనాతనమైనదని, పైపై వైవిధ్యాలకారణంగా కానీ, రాజకీయపు ఎత్తు గడల ద్వారాకానీ అది నాశనం కాబోదని సంఘం ప్రారంభం నుండి గట్టిగా విశ్వసిస్తోంది. వాస్తవానికి ఈ వైవిధ్యం మన సమాజం యొక్క చైతన్యవంతమైన ప్రగతికి ఒక ప్రకటీకరణ మాత్రమే. ఒక చెట్టు నుండి పుట్టుకొచ్చిన ఆకులు, పూవులు, కాయలు పైకి ఒక దానికొకటి వేరుగా కనిపించినా, ఏవిధంగా ఆచెట్టు యొక్క సజీవ అంతర్భాగాలు అవుతాయో ఇది కూడా అలాంటిదే. ఇదికూడా హిందూసమాజమనే సజీవ వృక్షానికి సంబంధించిన వైవిధ్యం మాత్రమే.

రకరకాల ప్రత్యేక ప్రయోజనాలు, ప్రత్యేక గుర్తింపులు నినాదాలుగా చేసుకుని నేడు దేశంలో తలఎత్తుతున్న వివిధ విచ్ఛిన్నకర శక్తుల సమస్యకు మన సమాజాన్ని కలిపి ఉంచే జాతీయ జీవరసం కొంతమేరకు ఇంకిపోవడం కారణమని సంఘం భావించింది. ఏ హిందూ జాతీయాత్మ నుండి వివిధ పంథసంప్రదాయాలు, భాషలు, మాండలీకాలు, అలవాట్లు, ఆనవాయితీలు, ఆధ్యాత్మిక వాదాలు, సిద్ధాంతాలు ఉద్భవించాయో ఆ జాతీయాత్మయొక్క మూలాలను పెంచి పోషించడం,శక్తివంతం చేయడం మాత్రమే ఈ అంతరంగిక ఒత్తిడులకు చక్కటి పరిష్కారం కాగలదు. (వివరణ 5వ అధ్యాయంలో)

సమాజాన్ని సమైక్యము, సుహృద్భావ భరితము చేసే తరంగాలను పుష్టివంతం చేయడానికి సంఘం వికసింపజేసిన విధానం సంపూర్ణంగా భావాత్మక మైనది. మన పతనానికి, క్షీణదశకు ఇతరులపై నింద మోపడం కాక స్వీయ సంస్కరణ దానికి మార్గదర్శక సూత్రంగా

ఉండింది. ముస్లిం వ్యతిరేకత, క్రైస్తవవ్యతిరేకత, ఇంకా చెప్పాలంటే బ్రిటిష్ వ్యతిరేకత లాంటి ఎటువంటి వ్యతిరేకాత్మక ధోరణులకు ఇందులో ఏమాత్రం స్థానంలేదు. 'ముస్లింలు చేస్తున్న వివిధ కార్యకలాపాలకు ప్రతిక్రియగా సంఘం హిందువులను సంఘటితం చేస్తున్నదా?' అని ఒకసారి ఒక పెద్దమనిషి శ్రీ గురూజీని అడిగారు. "మహమ్మద్ ప్రవక్త అసలు పుట్టే ఉండకపోయినా, ఇస్లాం అనేది ఆవిర్భవించకపోయినప్పటికీ హిందువులు ఇదేవిధంగా అసంఘటిత, ఆత్మవిస్మృతస్థితిలో పడిఉన్నట్లు మేం గమనించినట్లైతే ఈ రోజు చేస్తున్నట్లుగానే ఆరోజుకూడా ఈ కార్యాన్ని మేం స్వీకరించి ఉండే వాళ్ళం" అని సమాధానం ఇచ్చారు శ్రీగురూజీ.

"సమైక్యతను చాటే అంశాలను గురించి నొక్కి వక్కాణించండి.వైవిధ్యాలను గురించి ప్రస్తావించకండి" ఇది సంఘ దృష్టికోణంలో మరొక భావాత్మక విశేషం. కార్యక్రమాలలో పాల్గొనే అందరిలోను ఆంతరంగిక ఏకత్వం జాగృతం అయేవిధంగాను, తద్వారా ఒక విడదీయరాని సామాజిక సోదరభావన నిర్మాణం అయ్యేవిధంగాను సంఘ కార్యక్రమాలన్నీ రూపొందించబడ్డాయి.

ప్రారంభ దశలలోనే సంఘం స్వీకరించిన ఈ విధానం యొక్క మహత్వం ప్రకటితం కావడం ప్రారంభమైంది. 1934లో వార్ధాలో 1500మంది స్వయంసేవకులు పాల్గొన్న ఒక సంఘశిబిరాన్ని సందర్శించిన గాంధీజీ అక్కడ స్వయంసేవకులకు అంటరానితనం మాట దేముడెరుగు, అసలు ఒకరికులం కూడా మరొకరికి తెలియకపోవడం చూసి ఎంతో ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని ప్రకటించారు. ఈ సంఘటన గాంధీజీ మనస్సుపై ఎంత లోతైన ముద్ర వేసిందంటే 13సం.ల తరువాత గాంధీజీ ఆవిషయాన్ని ఉటంకించారు. 1947సం.సెప్టెంబర్ 16వతేదీన ఢిల్లీలోని భంగి కాలనీలో స్వయంసేవకులను ఉద్దేశించి ప్రసంగిస్తూ వారు, కొద్దిఏండ్లక్రితం సంఘ సంస్థాపకులు డా.హెడ్గెవార్ జీవించి ఉండగా నేనొక ఆర్.యస్.యస్.శిబిరాన్ని సందర్శించాను. మీక్రమశిక్షణ, కఠోరమైన నిరాడంబరత, అంటరానితనం అనేది మచ్చుకైనా లేకపోవడం చూసి నేను చాలా ప్రభావితుడినయ్యాను. ఆనాటినుండి సంఘం పెరిగింది. సేవ,ఆత్మసమర్పణ లాంటి మహోదాత్త ఆశయాలు ప్రేరణగా పని చేసే ఏ సంస్థ అయినా బలం పెంచుకుని తీరుతుందన్నది నా ప్రగాఢ విశ్వాసం' అని అన్నారు. (ది హిందూ;సెప్టెంబర్17,1947)

1939లో పూనాలో సంఘ శిక్షా వర్గను సందర్శించిన డా.బాబా సాహెబ్ అంబేద్కర్ కూడా స్వయంసేవకులు తమతమ కులాలను గురించి ఊసే ఎత్తకుండా సంపూర్ణమైన సమానత్వ, సోదరత్వభావనలతో కలిసిమెలిసి ఉండడాన్ని గమనించి ఆశ్చర్యపోయారు. 'శిబిరంలో ఎవరైనా అస్పృశ్యులు ఉన్నారా?' అని ఆయన డాక్టర్జీని అడిగినపుడు డాక్టర్జీ 'ఇక్కడ 'స్పృశ్యులు' లేరు. 'అస్పృశ్యులు' లేరు. ఉన్నదల్లా 'హిందువులు' మాత్రమే'. అని సమాధానం ఇచ్చారు. అంటరాని తనం విషయంలో ప్రస్తుత సర్‌సంఘచాలక్ శ్రీ బాలాసాహెబ్ దేవరస్ పలికిన పలుకులు - అమెరికాలో నల్లజాతివారి బానిసత్వం విషయంలో లింకన్ యొక్క ప్రఖ్యాత వాక్యాలను పోలినవి - 'అంటరానితనం తప్పుకాకపోతే ప్రపంచంలో మరేదీ తప్పుకాదు' అనేవి- దేశం యావత్తు మార్మోగుతున్నాయి.

ఇదే సుదృఢమైన విశ్వాసంతో, స్వయంసేవకులు తమ నిరంతర సంపర్కం, సంభాషణలు, తగు కార్యక్రమాల ద్వారా ఈ సందేశాన్ని సమాజంలోని అన్ని వర్గాలలోకి తీసుకువెళ్తున్నారు. ఫలితంగా శతాబ్దాలుగా మన సమాజపు జీవశక్తిని హరించి వేస్తున్న కులతత్వం, అంటరానితనంవంటి వినాశకరమైన దోషాల నుండి నెమ్మదిగా బైట పడగలుగుతున్నాం.

సంఘం ప్రతిపాదించిన, దర్శించిన సామాజిక సమైక్యత యొక్క భావాత్మక స్వరూపంలో ఈ దేశంలోని ముస్లింలు, క్రైస్తవులకు కూడా స్థానండుంది. కేవలం వేరొక ఆరాధనావిధానానికి చెందినవారన్న నెపంతో సంఘం ఎవరిపై ద్వేషాన్ని వహించదు. సంఘం దృష్టిలో 'హిందూ' అనే పదం కేవలం ఒక ఆరాధనా విధానాన్ని కాక, భారత్ యొక్క జాతీయ అస్తిత్వాన్ని నిర్వచిస్తుంది. ఈ విశాలమైన జాతీయ దృష్టికోణంలో తమతమ వర్గాల కతీతంగా ఇక్కడి జాతీయ జీవన ప్రవాహంలో ఎవరు తాదాత్మ్యం చెందుతారో వారంతా 'హిందువు'లే. సులభమైన మాటలలో చెప్పాలంటే: మనదేశపు జాతీయ జీవనప్రవాహంలో తాదాత్మ్యం చెందడం, మిళితం కావడం అంటే: మాతృభూమి ఎడల స్వచ్ఛమైన భక్తిభావన, సోదరభావన; దేశప్రజలందరి ప్రయోజనాలలో తన ప్రయోజనాలు ముడిపడి ఉన్నాయన్నభావన; అతి ప్రాచీన కాలం నుండి నేటి వరకు ఈ జాతిని నిర్మించిన మహాపురుషుల ఎడల, వారు మనకు అందించి వెళ్ళిన జీవనవిలువల ఎడల గౌరవ భావన. ఆత్మవిశ్వాసంతో, వివేకంతో కూడిన సంబంధాల ద్వారా ముస్లిం, క్రైస్తవులను నెమ్మదిగా ప్రధాన

జాతీయస్రవంతిలోకి తీసుకుని రావచ్చునని సూచనలు కనబడుతున్నాయి. (వివరణ 6వ అధ్యాయంలో)

హిందూ సంప్రదాయంలో ప్రముఖంగా పరిగణింపబడిన ఉదాత్త వ్యక్తిగత గుణాలను వ్యక్తులలో నింపే ప్రక్రియ ఈ హిందూ సంఘటనా వ్రతంలో ఒక విడదీయరాని అంగంగా ఉంటూ వచ్చింది. ఆ మేరకు సంఘంలో శిక్షణ ద్వారా వ్యక్తిగత నిజాయితీ, పరస్పర విశ్వాసపాత్రత, పెద్దల ఎడల గౌరవం, స్త్రీల ఎడల ఆదరభావం, భగవంతుడు, సాధు సంతులు ఎడలభక్తి, ప్రజాధనంతో వ్యవహరించేటప్పుడు ప్రామాణికత, న్యాయబద్ధమైన స్వభావం, జీవన విధానంలో నిరాడంబరత, ఎటువంటి దుర్గుణాలు లేకుండా ఉండడం.. వగైరా శ్రేష్ఠగుణాలన్నీ చాలా సహజమైన పద్ధతిలో స్వయంసేవకులలో నాటుకుంటాయి. తాము ఏ క్షేత్రంలో పనిచేస్తున్నప్పటికీ స్వయంసేవకులు అక్కడ ఆగుణాలను ప్రసరింపజేస్తారనేది నేడు అందరూ గుర్తించిన విషయమే. స్వయంసేవకులు నిర్వహించే అన్నిరకాల ప్రయత్నాలలోను విస్తృత పరిధిలో ప్రజలను ఆకర్షించడంలో వారి ఈ శీలము,ప్రవర్తనలకు సంబంధించిన అంశాలు ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. (వివరణ 7వ అధ్యాయంలో)

సామాజిక పరివర్తనకు సంబంధించిన వివిధ అంగాలలో - సామాజిక న్యాయానికి హామీ కల్పించడం వాటిలో ప్రముఖమైనది - స్వయంసేవకులు నిర్వహిస్తున్న పాత్రవెనుక వారి మధ్య వికసించిన ఆత్మీయతతోకూడిన సోదరభావన యొక్క ప్రేరణ ఉన్నది. సమాజంలో ఎక్కడైతే నిజమైన ఆత్మీయత,స్నేహం ఉంటుందో, అక్కడ ఒక వర్గంపై మరొక వర్గం దోపిడీ, అన్యాయాలు తలపెట్టడం లాంటివి ఉండవని సంఘం విశ్వాసం. అయితే, ఈనాడు సామాజికంగా, ఆర్థికంగా, విద్యాపరంగా నిరాకరణకు గురియై బాధపడుతున్న వారు మన సమాజంలో పెద్ద సంఖ్యలో ఉన్నారు. అణచివేతకు, దోపిడీకి వారు సులభంగా గురౌతూ ఉన్నారు. న్యాయము, సత్ప్రవర్తనలను గురించి పిలుపు నిచ్చినంతమాత్రాన ఒక్కొక్కసారి తగిన ఫలితం కనిపించనపుడు ఈ దోపిడీ వ్యవస్థలకు వ్యతిరేకంగా పీడిత వర్గాలు సంఘటిత ప్రతిఘటనను చూపవలసిన అవసరం ఏర్పడుతూ ఉంటుంది.

అటువంటి సందర్భాలలో స్వయంసేవకులు పోరాట మార్గంలో పయనించారు. విజయం సాధించేవరకు ముందుకుసాగారు. అయితే అదే సమయంలో ద్వేషం, శతృత్వం లాంటి భావాలు శాశ్వతముద్రగా సమాజంలో ఏర్పడకుండా తగు జాగ్రత్తలు వారు తీసుకుంటూనే ఉన్నారు.

- అంతతోగత్వా-చివరికి హృదయాలను జయించడం, అన్ని వర్గాలలోనూ సామాజిక అవగాహన పెంపొందించడం మాత్రమే సామాజిక పరివర్తనకు ప్రభావవంతమైన మార్గం అవుతుందన్న విశ్లేషణకు రాక తప్పదు. జాతీయజీవనంలోని ప్రతి రంగంలో సమరసత, సమానత, న్యాయం సాధించడానికి ఉద్దేశించబడిన ఈ స్వాభావికము, సముచితము అయిన మార్గంలో వర్గ, కుల సంఘర్షణ సిద్ధాంతాలకు ఏమాత్రం స్థానంలేదు. (వివరణ 8వ అధ్యాయంలో)

స్వయంసేవకులలో సమాజం ఎడల గల ప్రఖరమైన ఆత్మీయతను ప్రతిబింబించే మరొకరంగం సమాజసేవారంగం. సమాజాన్ని ఒకటిగా, విశాలమైన,దేశవ్యాప్త కుటుంబంగా చూసే శిక్షణ స్వయంసేవకులకు ఇవ్వబడుతుంది. కుటుంబంలో ప్రతి సభ్యుడు ఇతర సభ్యుల సుఖ దుఃఖాలతో తాను ఏవిధంగా తాదాత్మ్యం చెందుతాడో, ఈవిశాల సమాజ కుటుంబంలోని ఇతర సభ్యుల విషయంలో స్వయంసేవక్ కూడా అలాగే ప్రవర్తించాలని ఆశించబడుతుంది.

1938లో పునే నగరంలో మహారాష్ట్ర హిందూ యువకమండల్ ను ఉద్దేశించి ప్రసంగిస్తూ డా. హెడ్గెవార్ ఇలా అన్నారు.

"జాతితో సంపూర్ణంగా తాదాత్మ్యం చెందినవాడే నిజమైన జాతిసేవకుడు. జాతికోసం తాము చేసిన త్యాగాన్ని ఎలుగెత్తిచాటుకోవడం గొప్పతనంగా కొందరు భావిస్తుంటారు. ఆరకమైన ప్రకటీకరణ జాతినుండి తాము వేరు అనే భావాన్నే పరోక్షంగా ప్రకటిస్తుంది. ఎలాగైతే తనకొడుకు కోసం తానుత్యాగాలు చేశానని ఏవ్యక్తీ ఏనాడూ చెప్పుకోడో, అలాగే మన విశాల జాతీయ సమాజానికి సమర్పితమైన ఏవిధమైన సేవ కూడా త్యాగం లెక్కలోకి రాదు. అదికేవలం మనం నిర్వర్తించవలసిన పవిత్రకర్తవ్యం మాత్రమే."

సమాజంలోని ఉపేక్షిత వర్గాల సేవలో నిమగ్నులై ఉన్న కార్యకర్తలకు మార్గదర్శనం చేస్తూ శ్రీగురూజీ ఇలావ్రాశారు:

'హృదయాంతరాళాలలోనుండి పెల్లుబికి, దైనందిన వ్యవహారం ద్వారా ప్రకటితమయ్యే కఠోరమైన పరిశ్రమ, ఆధ్యాత్మిక, నైతిక, సామాజికస్థాయిలలో కృషి నేడు కావలసినది'

సంఘం ప్రసాదించిన ఆసంస్కారాలను తమలో జీర్ణించుకుని కార్యకర్తలుగా రూపొందిన వేలాది మంది స్వయంసేవకులు దేశం మొత్తంలో నేడు లెక్కలేనన్ని సేవా ప్రకల్పాల నిర్వాహణలో నిమగ్నులై ఉన్నారు.(వివరణ 9వ అధ్యాయంలో)

ప్రకృతి విపత్తులు లేక మానవ నిర్మిత విపత్తుల సమయంలో వెను వెంటనే స్వయంసేవకులు ప్రతిస్పందించే తీరు కూడా సంఘం వారిలో నిర్మించిన మౌలిక సామాజిక అవగాహన వల్ల జనించినదే. సంఘం సమాజాన్ని ఒక సజీవ ఆకృతిగా దర్శిస్తుంది. అది వివిధ అవయవాలు, అంగాల మధ్య, సంపూర్ణ శరీరం మధ్య సజీవసంబంధం కలిగిఉన్న ఒకే బ్రహ్మాండమైన సమైక్యపురుషునిగా - 'విరాట్ పురుషునిగా' అభివర్ణింపబడింది. శరీరంలోని ఏ భాగంలో ఎట్టి లోటు ఏర్పడినా మిగిలిన అవయవాలు అవసరమైన త్యాగం చేసి దానిని పూరిస్తాయి. సమాజంలో అటువంటి సమిష్టి స్పృహ మాత్రమే ప్రజలు తమ తమ సుఖ దుఃఖాలను పరస్పరం పంచుకునేటట్లు చేయగలుగుతుంది.

ఈ ఉదాత్త సామాజిక స్పృహ ద్వారా ప్రేరితులైన స్వయంసేవకులు, ఎప్పుడు విపత్తులు విరుచుకుపడినా ప్రజలకు తక్షణం సహాయాన్నందించడా నికి ముందుకురుకుతారు. తగురీతిలో వారి పునరావాసానికి అవసరమైన యోజనలు చేస్తూంటారు. (వివరణ 10వ అధ్యాయంలో)

డా. హెడ్గేవార్ దర్శించిన జాతి స్వాతంత్ర్యకల్పన ప్రధానంగా భావా త్మకమైనది. విదేశీయులను తరిమివేయడమే దాని ఏకైక లక్ష్యం కాదు విదేశీయుల పరిపాలనలో అపవిత్రం చేయబడిన, విధ్వంసంచేయబడిన జాతీయగౌరవ కేంద్రాలు, జీవనవిలువలను పునఃప్రతిష్ఠాపన చేయడమే దాని సారాంశం. రాజకీయ దాస్యవిముక్తికి జరుగుతూ ఉన్న ఉద్యమా లలో తలమునకలౌతూ కూడా డా. హెడ్గేవార్ ఈ అంశాల విషయంలో కూడా అంతతీవ్రంగానూ ఆలోచిస్తూ ఉండేవారు. నిజానికి ఆరెండింటిని వారు ఏనాడూ ఎక్కువ తక్కువగా చూడలేదు. వారి దృష్టిలో స్వాతంత్ర్యం కోసం పోరాడడం అంటే జాతి గౌరవాన్ని, జాతీయవిలువలను పరిరక్షించడం కోసం పోరాడడమే.

స్వాతంత్ర్యానంతర కాలఖండం వివిధ జీవనరంగాలలో జాతీయ శ్రద్ధా కేంద్రాలు, జాతీయ గౌరవచిహ్నాలను పునరుద్ధరించడానికి, పునః ప్రతిష్ఠ చేయడానికి స్వయంసేవకులు సాగించిన అనేక ఉద్యమాలను ప్రత్యక్షంగా దర్శించింది. (వివరాలు 13వ అధ్యాయంలో)

స్వతంత్ర భారత భావి (నిర్మాణ) స్వరూపం విషయంలో డా. హె డ్గేవార్ దృష్టి మన జాతీయ విలువల సారానికి అనుగుణమైనదే. 1930లో కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్యం తమ లక్ష్యంగా స్వీకరించిన

రోజున వారు వ్రాసుకున్న కొన్ని వాక్యాలు స్పష్టంగాను, నిర్దిష్టంగాను ఉన్నాయి.

"హిందూ సంస్కృతి హిందుస్థాన్ యొక్క ఊపిరి. కనుక హిందుస్థాన్ రక్షింపబడాలంటే ముందు హిందూ సంస్కృతిని మనం పెంచిపోషించాలన్నది స్పష్టమైన విషయం. హిందుస్థాన్‌లోనే హిందూ సంస్కృతి రూపుమాసిపోతే, హిందూసమాజం తన అస్తిత్వాన్నే కోల్పోతే, కేవలం ఒక భూఖండంగా మిగిలిన దానిని హిందుస్థాన్‌గా వ్యవహరించడం ఏమాత్రం సమంజసం కాబోదు. ఒట్టి భూఖండాలు ఒకజాతిగా రూపొందలేవు. స్వాతంత్ర్యాన్ని సాధించడానికి జరుగుతున్న ప్రయత్నాలలో, అవి మన జాతీయ సంస్కృతి పరిరక్షణకు ఆటంకంగా నిలువనంతవరకు, సంఘం కాంగ్రెస్‌కు సహకారాన్నందించగలదు"

స్వాతంత్ర్యానంతరం మన నాయకులు భారతదేశాన్ని నడిపించిన దిశపై అతి సూక్ష్మంగా వెళ్ళి విశ్లేషణ చేసిన శ్రీ గురూజీ "ఇవాళ అన్నివైపులా అమెరికా,రష్యా,ఆంగ్లేయ జీవనవిధానాల అచ్చులో మన జీవన విధానాన్ని కూడా పోతపోసేందుకు జరుగుతున్న ప్రయత్నాలు చూస్తున్నాం. 'స్వ'త్వం ఏమాత్రం లేని దీనిని స్వాతంత్ర్యం అని ఎలా పిలుస్తాం? ఇది కేవలం 'పరతంత్రం' మాత్రమే. లెనిన్‌ను ఆదర్శంగా పెట్టుకుంటే అది లెనిన్ తంత్రం అవుతుంది తప్ప స్వతంత్రం కాబోదు. నిజానికి మన జాతీయ జీవనవిలువలైన ధర్మ సంస్కృతుల పరిరక్షణ, ప్రతిష్ఠాపనలే స్వాతంత్ర్యపు మూలస్తంభాలుగా మన పరంపరాగత చరిత్రచాటిచెబుతున్నది" అని వ్రాశారు.

పై విషయాలను మార్గదర్శక సూత్రాలుగా తీసుకుని స్వయంసేవకులు మన జాతీయ మహోద్యమపు వివిధరంగాలలో జాతియొక్క మౌలిక జాతీయస్వభావాన్ని ఆవిష్కరింపజేయడానికై కృషిని సాగిస్తున్నారు. (వివరణ 11,12 అధ్యాయాలలో)

1975-77 అత్యవసర పరిస్థితి సమయంలో మన దేశం ఆంతరంగిక బానిసత్వంలో నెట్టివేయబడినప్పుడు, అతిప్రియమైన స్వతంత్ర, ప్రజాస్వామ్య జీవనపు విలువలన్నీ అణచివేయబడినప్పుడు, ప్రజా సంక్షేమం కోసం స్వయంసేవకులు ఒక్కటైలేచి నిలబడడం చాలా సహజమైన విషయం. ఎవరో అన్నట్లు, ఆకీలకదినాలలో స్వయంసేవకులు నిర్వహించిన వీరోచితమైన, ఆత్మ సమర్పితమైన పాత్ర ఆ చారిత్రాత్మక ఘడియలను 'ఆర్.యస్.యస్. యొక్క సువర్ణ ఘడియలు'గా

రూపొందించింది.

తమలో పెంచిపోషించిన ఉదాత్త హిందూవిలువల ఎడల స్వయంసేవకులకు గల నిష్ఠ భారత సరిహద్దుల వరకే పరిమితం కాలేదు. "నీవు ఎక్కడ, ఏస్థానంలో ఉన్నా నీవొక స్వయంసేవకుడవని మరచిపోకు. ఎక్కడికి వెళ్ళినా, ఎప్పుడూ నిన్ను నీవు సంఘ సందేశాన్ని వ్యాప్తి చేయడానికి సమర్పితుడవైన సంఘ ప్రచారక్‌గానే భావించుకో" అని డా. హెడ్గెవార్ స్వయంసేవకులకు చెబుతూండే వారు.

విదేశాలకు వెళ్ళిన స్వయంసేవకులలో కూడా ఇదే భావన ఉండేది. తాము పొందిన సంస్కారాలకు అనుగుణంగా జీవించడం, వాటిని ఇతరులలో కూడా వ్యాపింపచేయడం ఎలా అన్న ప్రశ్నకు వారందరికీ శ్రీ గురూజీ మాటలు మార్గాన్ని చూపించాయి.'మన సాంస్కృతిక ఔన్నత్యపు విలువలు, మన కార్యవ్రతం యొక్క అవగాహన వారి హృదయాలలో సదాసర్వదా ప్రజ్వరిల్లుతూ ఉండాలంటే ఇక్కడ విశుద్ధ సంస్కారాలను పొందిన మనహిందూ సోదరులు అక్కడ నియమితంగా కలుసుకుంటూ ఉండడం అత్యంత ఆవశ్యకం.' విదేశాలలో ఉన్న హిందువులందరికీ ఒక సమాన ప్రార్థన రూపొందించబడింది. ప్రపంచం మొత్తంలో నేడది అమలులో ఉంది.

శ్రీ గురూజీ మార్గదర్శనం మరొక కోణంలో కూడా ఎంతో సముచితమైనది. "విదేశాలలో ఉన్న మన సోదరులు జ్ఞాపకం ఉంచుకోవలసిన మొట్టమొదటి అంశం ఏమిటంటే అక్కడ తమతమ వృత్తి ఉద్యోగాదులు కొనసాగించేటప్పుడు కేవలం డబ్బు సంపాదించడం, డబ్బు కూడగట్టడం మాత్రమే వారిఏకైక లక్ష్యం కారాదు. స్థానికప్రజల సమస్యలను వారు అర్థం చేసుకోవాలి. వారి ఆకాంక్షలతో సహానుభూతిని ప్రదర్శించాలి. ఉన్నత హిందూ ఆదర్శాలు, విలువలను వారికి బోధించడానికి, వారి సంక్షేమానికై వినియోగించడానికి తమ సంపాదనలో కొంతభాగం తప్పక కేటాయించాలి. అదే సమయంలో తాము ఒక గొప్ప, ప్రాచీన సంస్కృతి గల భూమికి చెందిన వారమనే విషయాన్ని ప్రకటించే విధంగా వారి ప్రవర్తన, జీవనం ఉండాలి. ఆవిధంగా ఇతరుల ముందు తాము ఒక ఉదాహరణగా వారు నిలవాలి" అని వారు హెచ్చరించారు.

పాశ్చాత్య, అరేబియా, ఆఫ్రికా, ఆగ్నేయఆసియా దేశాలలో విభిన్న పరిస్థితులు, ప్రజాసముదాయాల మధ్య జీవిస్తూ, ఈ సందేశాన్ని తమతమ జీవితాలలో అన్వయించుకోవడానికి విదేశాలలో ఉన్న స్వయంసేవకులు

చేస్తున్న ప్రయత్నాలు భారతదేశంలో ఉన్నప్పుడు వారు తమలో జీర్ణించుకున్న ఉదాత్త హిందూవిలువలను ప్రకటించే విధంగా ఉన్నాయి. (వివరణ 15వ అధ్యాయంలో)

పైన పేర్కొన్న విధంగా వివిధ దృక్కోణాలలో ఆచరణాత్మకంగా ప్రకటితమౌతున్న సంఘ సిద్ధాంతాన్ని పరిశీలించి చూస్తే అవి అన్నీ వాస్తవానికి 'ఆచరణలో స్వయంసేవక్' అనే దృశ్యాన్ని సువ్యక్తపరుస్తాయి. ఎందుకంటే తన కలలకు వాస్తవరూపం కల్పించడానికి సంఘానికి ఉన్న ఒకే ఒక్క మాధ్యమం స్వయంసేవక్. సమాజం యొక్క బాగోగులు అన్నీ ఆసమాజంలోని వ్యక్తులపైనే ఆధారపడి ఉంటాయన్న విశ్వాసంలోంచే సంఘం ఈ నిష్కర్షకు వచ్చింది.చివరికి ఒక జాతి ప్రగతి స్థాయిని నిర్ణయించేవి సాధారణ వ్యక్తి యొక్క శీలము, సామర్థ్యములే. అందుకే సంఘం ప్రారంభదినాల నుండి యోగ్యులైన వ్యక్తులను తయారుచేయడంపైనే తన దృష్టినంతటినీ కేంద్రీకరించింది.

వివిధ సామాజిక సంస్థలతో సుదీర్ఘకాలం సన్నిహిత సంబంధాలు కలిగి ఉన్నకారణంగా డా. హెడ్గెవార్‌కు ఆసంస్థలలోని కార్యకర్తలను దగ్గరగా పరిశీలించడానికి, వారిలోని తీవ్రమైన లోటుపాటులను గ్రహించడానికి అవకాశం లభించింది. అక్కడ లభించిన పాఠాలను ఆధారం చేసుకుని, అటువంటి వైఫల్యాలకు స్వయంసేవకులు లోను గాకుండా ఉండే విధంగానూ, సమగ్ర జాతీయపునర్నిర్మాణానికి అవసరమైన అన్ని గుణాలు, యోగ్యతలు వారిలో నిర్మాణం అయే విధంగానూ శాఖాతంత్రాన్ని వారు రూపొందించారు.

మొదటిగా, జాతిహితం కోసం పని చేయడం , త్యాగం చేయడం లాంటివి సాధారణ వ్యక్తి సామర్థ్యానికి అతీతమైనవని చాలాకాలంగా అందరూ విశ్వసించే ఒక అభిప్రాయం ఉంది. ఇప్పటికే తన వ్యక్తిగత, కౌటుంబిక బాధ్యతలతో ఎంతో భారాన్ని మోస్తున్నానని, జాతి యొక్క బాధ్యతలు కూడా పంచుకునే శక్తి తనకు లేదని అతడు భావిస్తూ ఉంటాడు. కానీ, రోజూ ఒక గంటసేపు కొందరు వ్యక్తులు ఒక చోట కలుసుకోవడం, ఆసక్తికరము, ప్రబోధాత్మకము అయిన కార్యక్రమాలలో పాల్గొనడం వంటి సాధారణం,సులభం అయిన శాఖాతంత్రం ఈ అభిప్రాయాన్ని దూరంచేయడంలో విజయం సాధించింది. సమాజంలోని అన్ని వర్గాల,స్థాయిల ప్రజలు సంఘ కార్యక్రమాలలో పాల్గొంటున్నారన్న వాస్తవం, జాతీయ కార్యం కోసం సామాన్యవ్యక్తి యొక్క శక్తి

సామర్థ్యాలను సమీకరించగల ఈ తంత్రపు శ్రేష్ఠత్వానికి ఒక జ్వలంత ఉదాహరణగా నిలుస్తుంది.

ఇక సమాజసేవకులకు ప్రేరణ నిచ్చే విషయంలో కూడా అంతే తీవ్రమైన ఇబ్బందులు ఉండేవి. ఆరోజులలో, ఇవాళకూడా స్వలాభానికి సంబంధించి లేశమాత్రంగానైనా ఆలోచన లేకుండా, నిస్వార్థ భావనతో సమాజకార్యంలో నిమగ్నుడై ఉన్న వ్యక్తి దొరకడం కష్టం. సామాజిక కార్యరంగంలో సాధారణంగా రెండు దృశ్యాలు కనబడుతూ ఉంటాయి. అసలు కార్యకర్తలే లేకపోవడం, ఫలితంగా ఎటువంటి కార్యకలాపాలు లేక పోవడం ఒక దృశ్యం అయితే, ఒక వేళ ఏదైనా కార్యకలాపం కనబడినా ఏవో స్వార్థ ప్రయోజనాలు దానిని నడిపిస్తూండడం రెండవదృశ్యం. అందుకే సమాజసేవకుల మాటలకు, చేతలకు మధ్యకొండంత తేడా కనబడడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

స్వయంసేవకులు అలాంటి వ్యక్తిగత వ్యామోహాలన్నింటికే అతీతంగా ఉండేటట్లు చూసేందుకు యోగ్యమైన ఒక తంత్రాన్ని రూపొందించడానికి డా.హెడ్గెవార్ చాలా కృషి చేశారు. మాతృభూమి సేవలో కనీసం రోజుకు ఒక గంటసమయం కేటాయించడం, ప్రతిఒక్కరిలో భారతమాత చరణాల వద్ద తనను సంపూర్ణంగా సమర్పణ చేసుకునే ప్రేరణను జాగృతం చేసే సామూహిక ప్రార్థన; అజేయమైన శక్తి, శీలం, జ్ఞానం, వీరత్వం, ధ్యేయానికి అంకితం కావడం వంటి గుణాలకై భగవంతుని ప్రార్థించడం, నిస్వార్థంగా సమాజానికి సేవచేసే భావనతో గురుదక్షిణను సమర్పించడం; శిబిరాలు, ఇతర విశేష కార్యక్రమాలలో పాల్గొనేటప్పుడుతన సొంత డబ్బు ఖర్చుపెట్టుకునే అలవాటు; సంస్థాగత ఖర్చులకోసం ప్రజలనుండి చందాల వసూలుకు పోవడం, ప్రభుత్వ ఆశ్రయం కోసం ప్రాకులాడటం వంటివి ఏమాత్రం లేక పోవడం - ఇవన్నీ స్వయంసేవక్ శీలాన్ని సుదృఢం చేసి, అచంచలమైన ఆత్మ నిర్భరత, ఆత్మసమర్పణ వంటి భావనలను వారిలో నింపడానికి ఉపకరిస్తున్నాయి. ఈ నియమబద్ధ మైన శిక్షణ ద్వారా రూపొందిన స్వయంసేవకులు దేశమంతటిలోనూ సమాజం యొక్క విశ్వాసాన్ని, నమ్మకాన్ని చూరగొంటున్నారనడానికి అనేక ఉదాహరణలు ఉన్నాయి. స్వయంసేవకులకు ప్రజలనుండి వెల్లువలా ప్రోత్సాహం లభించడానికి, ప్రజల భాగస్వామ్యంతో ఉద్భవిస్తున్న వివిధ ప్రకల్పాలు, కార్యక్రమాల సంఖ్య గణనీయంగా పెరగడానికి వెనుక రహస్యం దీనిలోనే ఉంది.

మన గతచరిత్రలో క్రమశిక్షణరాహిత్యం మరొక పెద్ద అవరోధంగా ఉండింది. ఈ తీవ్రమైన లోపం కారణంగానే మనం 1761లో జరిగిన మూడవ పానిపట్టు యుద్ధం, 1857లో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ఉవ్వెత్తున లేచిన ఉద్యమం వంటి అనేక కీలకమైన యుద్ధాలలో ఓటమిని చవిచూశాం. మన సైనికులలోను, సైన్యాధిపతులలోను ఆత్మసమర్పణ చేసుకునే సంసిద్ధత గానీ, వీరత్వం గానీ తక్కువేం లేవు. కానీ పై అధికారులకు, వారు రూపొందించిన యుద్ధవ్యూహాలకు కట్టుబడి ఉండే ఖచ్చితమైన క్రమశిక్షణను సైన్యంలో నిర్మాణం చేయడంలో విఫలం అయిన కారణంగా మన సేనల పరాక్రమం, బలిదానాలన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి.

అయితే క్రమశిక్షణ అనేది కేవలం సైన్యం, పోలీసులకు మాత్రమే కావలసిన లక్షణం అని దీని అర్థం కాదు. వాస్తవానికి, పాల్గొనేవారు క్రమశిక్షణతో కూడిన వ్యవహారాన్ని పాటించక పోయినట్లైతే ప్రజాజీవనంలో ఏరంగంలోనూ, ఏ ప్రయత్నమూ కూడా విజయం సాధించలేదు. సామాన్య ప్రజలనుండి అపేక్షించబడే క్రమశిక్షణ, సైన్యంలో అమలు చేయబడే క్రమశిక్షణ కంటే వేరైనది. సమాజసంక్షేమం దృష్ట్యా నిర్వర్తించవలసిన ఉన్నత బాధ్యతల గురించిన స్పృహలోంచి జనించే ఆత్మ సంయమనం యొక్క స్వభావం ఈక్రమ శిక్షణ. తనలోని దోషాలను తొలగించుకుని, సంఘటిత ఉద్యమపు అపేక్షలకు అనుగుణంగా తనను తాను మలచుకొనడానికి స్వయంసంసిద్ధ మనస్తత్వం కలిగి ఉండడమే ఈ క్రమశిక్షణ.

ఇటువంటి స్వయంఅనుశాసనాన్ని నిర్మించడంకోసమే శాఖలోని వివిధ శారీరక, బౌద్ధిక, మానసిక కార్యక్రమాలు రూపొందించబడ్డాయి. ఈతంత్రం సాధించిన అద్భుత విజయం నేడు అందరూ ఎరిగినట్టిదే. నేడు ప్రజలు 'క్రమశిక్షణ' అనే పదాన్ని 'ఆర్.యస్.యస్' తో సమానార్థకంగా వర్ణిస్తున్నారు. స్వయంసేవకులు ముందుండి నిర్వహిస్తున్న అతి పెద్ద హిందూ సమ్మేళనాలలోగానీ, విద్యార్థులు, కార్మికులు మొదలైన వర్గాలు పాల్గొనే సమ్మేళనాలలోగానీ ఉండే క్రమశిక్షణా యుతమైన వాతావరణం, క్రమ బద్ధమైన ప్రవర్తన నేడు అన్నిచోట్లా గుర్తించబడుతోంది.(వివరణ 7వ అధ్యాయంలో)

ఆరు దశాబ్దాలపైబడి తాను ఎంచుకున్న మార్గం నుండి ఏమాత్రం ప్రక్కకు తప్పకుండా, నిరంతరంగా సంఘం పెరుగుతూఉండడానికి కార

ణాలను సంఘం యొక్క 'వ్యక్తి కేంద్రితం' కాకుండా 'సంఘటన కేంద్రిత' మైనట్టి కార్యపద్ధతిలో దర్శించగలుగుతాం. మన జాతి సంస్కృతి, సంప్రదాయాలకు అనాదిగా ప్రతీకగా ఉంటూ వచ్చిన 'భగవాధ్వజాన్ని' గురువుగా స్వీకరించి, తనను తాను ఆ గురువు యొక్క భక్తులైన స్వయంసేవకులలో ఒకరిగా భావించుకున్న డా. హెడ్గేవార్ ముందుచూపు ఈ విషయంలో స్పష్టంగా గోచరిస్తుంది. వ్యక్తుల ఆధారంగా నిర్మాణం అయిన మనదేశంలోని అనేక సంస్థలు, పక్షాల దుఃఖకరమైన స్థితినేడు స్పష్టంగా కనబడుతూనే ఉంది. కనుక ప్రత్యేకంగా వివరించవలసిన అవసరంలేదు. అయితే మరొక ప్రక్క రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ యొక్క శ్రేష్ఠత్వం ఈ విషయంలో అసాధారణమైనది.

సంఘానికి 15 సం.ల వయస్సు వచ్చి, అప్పుడప్పుడే జాతీయాకాశంలో ప్రవేశిస్తున్న సమయానికి సంస్థాపకులు డా. హెడ్గేవార్ స్వర్గస్థులయ్యారు. అప్పుడప్పుడే ఆయన రూపొందించిన అనేక పద్ధతులు వ్రేళ్ళూనుతూ ఉన్నాయి. ఆసమయంలో దేశం రెండవ ప్రపంచయుద్ధపు సమస్యల వలయంలో చిక్కుకుని ఉంది. తరువాతి సర్‌సంఘచాలక్ శ్రీ గురూజీ నేతృత్వంలో సంఘం డా. హెడ్గేవార్ సూచించిన వివిధ మార్గాలలో అభివృద్ధి సాధించింది. తన 33 సం.ల ఏకాగ్రతపశ్చర్య ద్వారా శ్రీ గురూజీ సంస్థను మహోన్నత శిఖరాలను అధిష్ఠింపజేశారు. 1973లో శ్రీ బాలాసాహెబ్ దేవరస్‌కు బాధ్యతలను అప్పగించి వారు పార్థివదేహాన్ని విడిచిపెట్టారు. అయినా అదే విశిష్ట పరంపర కొనసాగుతోంది. ఎక్కడా మార్గం తప్పడం జరుగలేదు. తననిర్ధారిత మార్గంలో ముందుకు సాగే విషయంలో సంఘానికి గల సామర్థ్యంపై ఎక్కడా, ఎటువంటి సందేహాలకు ఆస్కారమే ఏర్పడలేదు.

ఈ 'సంఘటన కేంద్రిత' కార్యపద్ధతి నేడు జాతీయ పునర్నిర్మాణా నికి సంబంధించి స్వయంసేవకులు వివిధ రంగాలలో ప్రారంభించిన అనేక సంస్థలలోకి కూడా చొచ్చుకుపోయింది. ప్రజలు వాటిని వ్యక్తివాదాలకు, మతాతత్వాలకు అతీతమైనవిగా, సామరస్యంతో, పరస్పరసహకారంతో జరుగుతున్న ప్రయత్నానికి ఒక నమూనాగా చూస్తున్నారు.

అన్నిరకాల అవరోధాలు, వ్యతిరేకతలు విజయవంతంగా అధిగమించడా నికి కావలసిన దృఢనిశ్చయం ప్రారంభదినాలనుండి సంఘ స్వయంసేవకుల విశిష్టలక్షణంగా గుర్తింపబడూతూ వచ్చింది. బహుశః సంఘం ఎదుర్కొన్నన్ని ఆటుపోట్లను ఈనాడు మనదేశంలో ఉన్న మరే ఇతర సంస్థ అనుభవించలేదు. అడ్డమైన ప్రతి నిహితస్వార్థశక్తి సంఘంపై సాగించిన

నిందాపూర్వక ప్రచారానికి అంతేలేదు. దీనిలో ముందున్న వారు రాజకీయనాయకులు. బ్రిటిష్ పరిపాలన కాలంలో సాధారణంగా ఉండిన ప్రభుత్వపు పీడన స్వాతంత్ర్యం లభించిన తరువాత కూడా చాలాకాలం కొనసాగింది.

ప్రభుత్వం రెండుసార్లు సంఘాన్ని నిషేధించింది. మొదటిసారి 1948లో గాంధీజీ హత్య సందర్భంగా; రెండవది 1975-77 మధ్య అత్యవసర పరిస్థితి సమయంలో. సంఘానికి వ్యతిరేకంగా ప్రభుత్వం ఎడతెరిపిలేకుండా ప్రచారం సాగించింది. ప్రచార మాధ్యమాలపైన గానీ, జాతీయస్థాయి పత్రికారంగంపైనకానీ, రేడియో పైనగానీ సంఘానికి సంబంధించినంతవరకు ఎటువంటి పట్టులేదు. ప్రచారోద్యమాన్ని సాగించడంలో నిపుణులు కూడా ఎవరూ సంఘానికి లేరు. అయినా ఈ దూషణలు, బురదజల్లడం సామాన్యప్రజలను సంఘానికి వ్యతిరేకంగా చేయడంలో ఏమాత్రం విజయం సాధించలేకపోయాయి. ప్రతి అగ్ని పరీక్ష నుండి సంఘం మరింత శక్తితో, తేజస్సుతో బైటకు వచ్చింది. స్వయంసేవకుల స్వభావంలో అంతర్భాగంగా మారిన విజయాకాంక్షకు ఇది నిదర్శనం.

స్వయంసేవకుల గుణాలు,యోగ్యతలు బహుముఖంగా వికసించడానికి డా.హెడ్గెవార్ యొక్క వ్యక్తిగతజీవితం ఒక ధృవతారగా ఉంటూ వచ్చిందనేది వేరే చెప్పవలసిన అవసరం లేదు. అతి సాధారణ సందర్భాలలో కూడా వారిమాటలు, వారిఇష్టాయిష్టాలు, వారిప్రవర్తన, - ప్రతి ఒక్కవిషయం ప్రేరణదాయక సందేశాన్ని ప్రసరించేది. రానున్న అనేక తరాల స్వయంసేవకులకు వారు అందించి వెళ్ళిన సొత్తుగా అది నేటికీ నిలిచిఉంది. వారి సంపూర్ణ స్వార్థత్యాగం, వారు అనుభవించిన అంతులేని కష్టాలు, చిరునవ్వుతో వారు వరించిన నిరుపేదతనం, తన ఉగ్ర స్వభావంలో వారు తెచ్చుకున్న పరివర్తన, వేరు వేరు స్వభావాలు, గుణాలు కలిగిన అనేకమంది వ్యక్తులను సంఘంవైపు ఆకర్షించగల వారి అనన్యసామాన్యమైన సామర్థ్యము, తాను స్వీకరించిన దైవీకార్యం ఎడల వారికిగల దృఢమైన నిష్ఠ, వీటన్నింటితోబాటు, వేషభాషలలో, జీవన విధానంలో అత్యంత నిరాడంబరత, నిరహంకార ధోరణి - ఇవన్నీ స్వయంసేవకులు వారి ప్రతి కృషిలో, వేసే ప్రతి అడుగుకు సరియైన దిశను చూపే దీపస్తంభాలవలె నిలచిఉన్నాయి. తమ హిందూ రాష్ట్ర పరమవైభవ స్వప్నాన్ని సాకారం గావించేవరకు విశ్రాంతి, విరామం లేకుండా కృషి చేసే విధంగా అవి స్వయంసేవకులను ప్రేరేపిస్తూనే ఉంటాయనడంలో ఏమాత్రం సందేహం లేదు.

# ఆకృతిదాల్చిన ఆదర్శం

డా. హెడ్గేవార్ కన్నులలో వెలిగిన ఒకస్వప్నం; దానిని వాస్తవంలోకి సాక్షాత్కరింపజేసేందుకై వారు రచించిన ఒక కార్యపద్ధతి; జాతీయ పునర్నిర్మాణకార్యంలో వివిధ రంగాలలో అంకిత భావంతో పనిచేస్తున్న లక్షలాది స్వయంసేవకులకు ప్రేరణదాయకమైన వారసత్వంగా లభించాయి. ఈ గ్రంథంలోని ఒక్కొక్క అధ్యాయం ఒక్కొక్క రంగంలో స్వయంసేవకులు చేస్తున్న కృషిని వివరిస్తుంది.

# 1

# వెలుగులు విరజిమ్మే స్వాతంత్ర్యజ్యోతి

డా. హెడ్గెవార్ తన హృదయంలో ప్రజ్వలించిన స్వాతంత్ర్య జ్యోతిని స్వయంసేవకులందరి హృదయాలలోను వెలిగించారు. బ్రిటిష్ వారి పరిపాలన సమయంలోను, ఆతరువాత ఆ స్వేచ్ఛాజ్యోతి దశదిశలా కాంతులు విరజిమ్మిన సందర్భాలు ఎన్నెన్నో.

1940 తొలినాళ్ళలో యుద్ధపరిస్థితి బ్రిటిష్ వారికి గడ్డుసమస్యగా మారింది. సంఘనాయకత్వాన్ని అప్పుడప్పుడే శ్రీ గురూజీ చేపట్టారు. సంస్థానిర్మాణానికి సంబంధించిన బృహద్భారం వారిపై పడింది. హిందూ యువకులను సమీకరించి, వారికి శిక్షణనిచ్చే మహత్తర కార్యాన్ని ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెనువెంటనే చేపట్టవలసి వచ్చింది. దానికై శ్రీ గురూజీ ప్రభంజనంలా దేశమంతటా పర్యటించడం ప్రారంభించారు. శంఖారావం లాంటి వారి పిలుపు భారత వీరకిశోరాల హృదయాలలో మార్మోగసాగింది. పూర్ణవికసిత యౌవనంలోనే జీవనకుసుమాన్ని మాతృభూమి చరణాలవద్ద సమర్పించడంలోనే జీవన సాఫల్యం ఉన్నదని వారు ఉద్బోధించారు. ఆయన పిలుపు నందుకున్న వందలాది స్వయంసేవకులు తమ చదువులను కట్టిపెట్టి, ఇళ్ళూవాకిళ్ళూ వదిలి పెట్టి, జాతికి విముక్తి ప్రసాదించేందుకు సంఘంద్వారా కృషిచేయాలని ముందుకు వచ్చారు.

1942లో కాంగ్రెస్ ప్రారంభించిన 'క్విట్ ఇండియా' ఉద్యమం ఉవ్వెత్తున విరుచుకుపడి, అంతలోనే అణగారిన ఒక కెరటంలా మిగిలిపోయిందే తప్ప సంఘటిత, వ్యవస్థిత మహోద్యమంగా అది రూపొందలేదు. ఉద్యమాన్ని ప్రారంభించే ముందు కాంగ్రెస్‌నాయకులు సంఘంతో గానీ, మరే ఇతర సంస్థలతోగానీ చర్చించలేదు. అయినప్పటికీ అనేకమంది సంఘ కార్యకర్తలు ఆఉద్యమంలో పాల్గొన్నారు. విదర్భలో జరిగిన అస్తిచిమూర్ తిరుగుబాటులో వారు ప్రముఖ పాత్ర వహించారు. ఆతిరుగుబాటులో

పాల్గొన్న వారిపై బ్రిటిష్ ప్రభుత్వం సాగించిన క్రూరదమనకాండ దాని కదే సాటి. ఢిల్లీ - ముజఫర్‌పూర్ రైలు మార్గాన్ని ధ్వంసంచేసిన ఢిల్లీకి చెందిన యువకులలో ఎక్కువమంది స్వయంసేవకులే. ప్రఖ్యాత వేదపండితులు, జిల్లా సంఘచాలక్ అయిన పండిత శ్రీ.దా.సాత్వ లేకర్, మహారాష్ట్రకు చెందిన నానాపాటిల్‌కు (పత్రిసర్కార్ ఫేం) ఆశ్రయమిచ్చారు. అజ్ఞాతంలో ఉన్న సోషలిస్ట్ పార్టీ నాయకుడు శ్రీ సానేగురూజీని పూనాసంఘచాలక్ శ్రీ భావూసాహెబ్ దేశముఖ్ కాపాడారు. జయప్రకాశ్‌నారాయణ్, అరుణ అసఫాలీలు ఢిల్లీ సంఘచాలక్ శ్రీ లాలాహంసరాజ్ గుప్తా ఇంట్లో ఆశ్రయం పొందారు.

1942 ఉద్యమం నీరుగారిపోవడంతో సామాన్యప్రజలకు దిక్కు తోచని స్థితి ఏర్పడింది. ఇంతలోనే జాతిపై మరొక ప్రమాదం ముంచుకు రాసాగింది. కాంగ్రెస్ నాయకులందరూ జైళ్ళలో ఉండడంతో ముస్లింలీగ్ పని ఇష్టారాజ్యంగా మారింది. బ్రిటిష్ వారి ప్రోత్సాహం కూడా దానికి తోడయ్యింది. దాంతో వారు మరింత మొండివైఖరిని ప్రదర్శించడం ప్రారంభించారు. 1940లో లాహోర్‌లో జరిగిన సమావేశాలలోనే ముస్లింలీగ్ 'పాకిస్తాన్' తీర్మానాన్ని చేసింది. ఈసమయానికి ఆ ఆలోచనలకు ఒక స్పష్టమైన రూపం ఏర్పడింది. కాంగ్రెస్ దేశ విభజనను అంగీకరించేటట్లు చేయడానికి ముస్లింలీగ్ దౌర్జన్యానికి, రక్తపాతానికి తలపడసాగింది. 'ప్రత్యక్ష చర్యకు పిలుపు', 'కలకత్తా ఊచకోత'మొదలైనవి రానున్న గడ్డురోజులకు సంకేతంగా నిలిచాయి. ఆరోజులలో గాంధీజీ ఢిల్లీలోని భంగీ కాలనీలో ఉన్నారు. ఒకనాటిరాత్రి ముస్లిం గూండాలు ఆయన నివాసాన్ని చుట్టుముట్టి అసభ్యకరమైన పదజాలంతో ఆయనను దూషించసాగారు. అయితే సంఘస్వయంసేవకులు ముందుకు వచ్చి రక్షణ వలయంగా నిలవడంతో ఆతరువాత ఎప్పుడూ వారి ఆటలు సాగలేదు. అప్పటికే ముంచుకొస్తున్న దేశవిభజన కారుమేఘాలు ప్రజలను భయకంపితులను చేస్తున్నాయి. ఈ పరిస్థితులలో ప్రచండమైన హిందూ సంఘటిత శక్తి అత్యంత ఆవశ్యకమని హిందూసమాజం సహజంగానే భావించసాగింది. జంట శత్రువులైన ముస్లింలీగ్, బ్రిటిష్ పాలకులు కుమ్మక్కై పన్నిన కుట్రను ఎదుర్కొని, మాతృభూమి స్వాతంత్ర్యాన్ని, సమగ్రతను పరిరక్షించగల శక్తి దానికే ఉంది. కనుక ఆపరిస్థితులలో సామాన్యహిందువుకు సంఘం ఒక ఆశాకిరణంలా కనబడడంలో ఆశ్చర్యమేమీ లేదు. ఫలితంగా దేశమంతటా హిందువులలో చైతన్యం వెల్లుబకసాగింది.

## 1947 సంకటదినాలలో:

1947జూన్ 3వతేదీన అనూహ్యమైన రీతిలో, హఠాత్తుగా కాంగ్రెస్ నాయకులు దేశవిభజనకు అంగీకారం తెల్పడం హిందూసమాజానికి, ముఖ్యంగా సంఘస్వయంసేవకులకు, అశనిపాతంలా తాకింది. సంఘం తీరుతెన్నులు ఎటువంటివో బ్రిటిష్ వారికి బాగాతెలుసు. శ్రీ గురూజీ సునిశిత మేధాసంపత్తి గల నాయకుడని వారి గూఢచారి శాఖ నివేదికలో పేర్కొంది. ఒక సంఘ శిక్షణ శిబిరంలో శ్రీ గురూజీ చేసిన ప్రసంగాన్ని గురించి పేర్కొంటూ "తమ స్వప్రయోజనాలకోసం ప్రభుత్వంతో సహకరించే వారిని గోళ్వాల్కర్ ఘాటుగా విమర్శించారు. ప్రపంచమంతా ఎదురు తిరిగినప్పటికీ సంఘం తన కర్తవ్యాన్ని నిర్వహించి తీరుతుందని, భారతమాతకోసం తమ ప్రాణాలను అర్పించడానికి సైతం స్వయంసేవకులు సిద్ధంగా ఉండాలని ఆయన అన్నారు" అని వారు వ్రాశారు. ఆ నివేదిక ఢిల్లీలోని 'నేషనల్ ఆర్కైవ్స్' లో ఇప్పటికీ ఉన్నది.

దేశపరిస్థితిని బ్రిటిష్‌వారు సరిగ్గా అంచనా వేశారు. తాము ఇంకెంతోకాలం ఇక్కడ ఉండలేమని వారు గ్రహించారు. ఐ.ఎన్.ఎ.వి చారణ ప్రజలలో సుభాష్‌చంద్ర బోస్ పట్ల అభిమానం రేకెత్తించింది. బొంబాయిలో నౌకాదళంలో రగిలిన తిరుగుబాటు నిప్పురవ్వలు సుదూర ప్రాంతాలలోని ఇతరసైనికస్థావరాల వరకు కూడా చేరాయి. వాయుసేన, పదాతి సేనలలో కూడా సహానుభూతిని ప్రకటిస్తూ సమ్మె ప్రారంభమైంది. అదే సమయంలో బ్రిటిష్ ప్రధాని తాము త్వరలోనే భారత్‌ను విడిచి వెళ్ళనున్నట్లు ప్రకటించారు. చివరికి 1948 జూన్‌లోగా తాము దేశాన్ని విడిచి వెళ్ళనున్నట్లు 1947 ఫిబ్రవరి 20న బ్రిటిష్ ప్రభుత్వం స్పష్టంగా ప్రకటించింది.

అయితే చిట్టచివరి రాజప్రతినిధిగా వచ్చిన మౌంట్‌బాటన్ పదినెలలు ముందుగానే 1947 ఆగస్ట్ 15న బ్రిటిష్ వారు తొలగిపోతారని నిర్ణయించాడు. అప్పుడు మౌంట్‌బాటన్‌తో బాటు ఉన్న లియోనార్డ్ మోస్లె ఆనిర్ణయానికి దారితీసిన కారణాలను ఇలా వివరించాడు. "సైన్యాధికారులు వ్యతిరేకించినప్పటికీ, దేశవిభజనకు ఎటువంటి ప్రతిఘటనా తలెత్తడానికి సమయంలేకుండా చేయడం కోసం హడావుడిగా ఒడంబడికను పూర్తిచేయడం జరిగింది." వాస్తవానికి ఈ ప్రతిఘటనను ఉధృతం చేయడంలో బహుశః సంఘనాయకత్వంలో రూపొందిన హిందూ శక్తి కీలకపాత్ర నిర్వహించగలిగి ఉండేది. సంఘం మొదటి నుండి అఖండ

భారత్ యొక్క సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతున్నదని బ్రిటిష్ వారికి తెలుసు. శ్రీగురూజీ దేశవ్యాప్తంగా పర్యటిస్తూ, భవ్యమైన 'అఖండ భారత్' ఆదర్శంతో ప్రజలకు స్ఫూర్తినిస్తున్నారని, దేశ అఖండతను పరిరక్షించడానికి ఎంతటి మహత్తర త్యాగాలకైనా సంసిద్ధం కావలసిందిగా యువతకు వారు ఇస్తున్న పిలుపుకు అద్భుతమైన ప్రతిస్పందన లభిస్తున్నదని బ్రిటిష్‌వారు గుర్తించారు.

## ఢిల్లీని రక్షించిన వేళ:

ఏమైతేనేం, దేశవిభజన రానే వచ్చింది. దేశం తీవ్రంగా కంపించింది. అహర్నిశలు అఖండ స్వతంత్ర భారతదేశపు దృశ్యాన్నే హృదయాలలో విరాజిల్లజేసుకున్న స్వయంసేవకులు దుఃఖసాగరంలో మునిగిపోయారు. అయినా కర్తవ్యప్రబోధాన్ని వారు వెంటనే అందుకున్నారు. స్వాతంత్ర్యం లభించిన భూభాగపు సమగ్రతను కాపాడడానికి, కోల్పోయిన భూభాగంలో ఉండిపోయిన హిందూసోదరుల మాన ప్రాణాలను కాపాడడానికి పూనుకున్నారు.

ఢిల్లీ నగరమంతా ముస్లింలీగ్ సృష్టించిన హింస,కుతంత్రాల కోరలలో చిక్కుకుని ఉంది. ఆక్లిష్ట సమయాలలో, కీలకమైన ఘడియలలో సంఘం నిర్వహించిన పాత్రను గురించిన వివరాలు ఆతరువాత తెలుసుకున్న మహా విద్వాంసుడు, భారతరత్న పురస్కారగ్రహీత అయిన డా.భగవాన్‌దాస్ భావోద్వేగంతో 1948 అక్టోబర్ 16నాడు ఇలావ్రాశారు:

"1947 సెప్టెంబర్ 10వతేదీ ఆకస్మికంగా దాడిచేసి ప్రభుత్వంలోని అందరు సభ్యులను, అందరు హిందూ అధికారులను, వేలాది హిందూ పౌరులను అంతమొందించాలని, ఎఱ్ఱకోటపై పాకిస్తాన్ జెండాను ఎగురవేసి, హిందుస్థాన్ మొత్తాన్ని కబళించాలని ముస్లింలీగ్ తలపెట్టిన కుట్రను గురించి సకాలంలో ఆర్.యస్.యస్.యువకులు సర్దార్ పటేల్, నెహ్రూజీలకు తెలియజేశారని నాకు విశ్వసనీయ వర్గాలద్వారా తెలిసింది."

ఆయన ఇంకా ఇలా అన్నారు: "ఇదంతా నేను ఎందుకు చెబుతున్నాను? ఎందుకంటే ఆ ఉన్నతాదర్శప్రేరితులు, ఆత్మసమర్పకులు అయిన యువకులు సకాలంలో నెహ్రూజీ, పటేల్‌జీలకు సమాచారాన్ని అందించి ఉండకపోతే ఈ రోజున 'భారతప్రభుత్వం'అనేది ఉండేది కాదు. దేశం మొత్తం పేరు 'పాకిస్తాన్'గా మారిపోయి ఉండేది. వందలవేల హిందువులు హత్యగావింపబడేవారు. మిగిలిన వారంతా ముస్లింలుగా మతం

మార్చబడేవారు. లేదా నికృష్టమైన బానిసత్వంలోకి నెట్టివేయబడేవారు. ఇంతకీ, ఈ సుదీర్ఘ కథనం యొక్క ఫలితం ఏమిటి? సంక్షిప్తంగా చెప్పాలంటే, లక్షలాది ఆర్.యస్. యస్. యువకుల దేశభక్తి, శక్తి సామర్థ్యాలను మన ప్రభుత్వం తప్పక ఉపయోగించుకోవాలి. వాటిని నిష్ప్రయోజనం కానీయరాదు."

## కాశ్మీర్ పరిరక్షణలో:

ఇది జరిగిన కొద్దిరోజులకే కాశ్మీర్‌లో స్వతంత్రభారత స్వాతంత్ర్యం, సమగ్రతలకు అత్యంత తీవ్రమైన ఒక సవాలు ఎదురైంది. సంక్షిప్తంలో, 1947 జూన్ 3నాడు వెలువడిన ప్రకటన అవిభాజ్య భారతదేశంలోని వివిధ సంస్థానాధీశులకు అటు భారత్‌లో చేరడానికిగానీ, ఇటు పాకిస్తాన్‌తో కలియడానికి గానీ లేదా స్వతంత్రంగా ఉండిపోవడానికిగానీ స్వేచ్ఛను కల్పించింది. అయితే జమ్మూ-కాశ్మీర్ మహారాజు హరిసింగ్ తీవ్రసంశయంలో పడ్డాడు. నిష్ఠావంతుడైన, దేశభక్తుడైన హిందువు అయినకారణంగా మహారాజు పాకిస్తాన్‌లో చేరడం అనే ఊహనే చేయలేకపోయాడు. అదే సమయంలో రాష్ట్రంలో గుర్తించదగిన సంఖ్యలో ముస్లిం ఆధిక్యత కూడా ఉన్న దృష్ట్యా నేరుగా భారత్‌లో విలీనం కావడానికి కూడా ఆయన సంకోచించాడు. మహారాజును పాకిస్తాన్‌లో విలీనం కావలసిందిగా ఒప్పించే ప్రయత్నంలో జూన్ మూడవవారంలో స్వయంగా మౌంట్ బాటన్ ప్రత్యేకంగా కాశ్మీర్‌కు వెళ్ళాడు కూడా. అయినా మహారాజు ఈ ఒత్తిడిని ఎదిరించి నిలబడ్డాడు. ఒక తాత్కాలిక ఏర్పాటుగా పాకిస్తాన్‌తో 'యథాస్థితి ఒప్పందాన్ని'(stand-still agreement) చేసుకున్నాడు. భారత్‌తోగూడా అటువంటి సంబంధాలే కావాలని ఆయన వాంఛించాడు. అయితే మన భారత నాయకులు ఆ ప్రతిపాదనకు అంగీకరించలేదు. సంస్థానంలోపల, ముస్లిం కాన్ఫరెన్స్ పాకిస్తాన్‌తో కలువవలసిందిగా మహారాజుపై ఒత్తిడి తీసుకురావడం మొదలు పెట్టింది. అయితే అప్పటి కాశ్మీర్ ప్రధానమంత్రి ఆర్.సి.కాక్ మాత్రం ఆయనను స్వతంత్రంగానే ఉండవలసిందిగా సలహా ఇచ్చాడు.

విభిన్నమైన ఈ ఒత్తిడుల మధ్య రాష్ట్రంలోని సంఘనాయకులు 1947ఆగస్ట్15 లోగానే భారత్‌లో విలీనమౌతున్నట్లు ప్రకటించమని మహారాజును ఒప్పించడానికి వీలైన అన్ని రకాల ప్రయత్నాలను చేస్తూనే ఉన్నారు. ఆప్రాంత సంఘచాలక్ పండిత ప్రేమనాథ్ డోగ్రా మహారా

జుకు అనేక విజ్ఞాపన పత్రాలు అందజేశారు. అనేక సార్లు ప్రత్యక్షంగా కలిసిమాట్లాడారు. ఏమాత్రం ఆలశ్యం చేయకుండా భారత్‌లో విలీనం కమ్మని మహారాజును అర్థిస్తూ తీర్మానాలు చేయవలసిందిగా ప్రాంతంలోని వివిధ సామాజిక, రాజకీయ సంస్థలపై ఒత్తిడి తీసుకుని రాబడింది. కాశ్మీర్‌లోని అన్ని మూలలనుండి, చుట్టుప్రక్కల రాష్ట్రాలనుండి వేలసంఖ్యలో తంతులు(టెలిగ్రాం) పంపబడ్డాయి. మహారాజు మిక్కిలి గౌరవించే పంజాబ్ సంఘచాలక్ శ్రీ బదరీదాస్‌జీ ఆయనను కలుసుకుని సలహానివ్వడానికి వెనువెంటనే శ్రీనగర్ చేరుకున్నారు.

అయితే, మహారాజు తాననుకున్న మార్గంలో పయనించకుండా భారతవ్యతిరేక శక్తులు అవరోధంగా నిలిచాయి. ఆగస్ట్ 14వ తేదీరాగానే, శ్రీనగర్‌లోని పోస్టల్ అధికారులు 'కాశ్మీర్ రాష్ట్రంలోని పోస్టాఫీసులు ప్రస్తుతం పాకిస్తాన్‌లో భాగంగా మారిన సియాల్‌కోట కేంద్ర పరిధిలోనికి వస్తాయి' అనే నెపంతో తమ ఆఫీస్‌పై పాకిస్తాన్‌జెండా ఎగురవేశారు. వెంటనే సంఘ స్వయంసేవకులు, అభిమానులు కలిసి అదే పోస్టల్ అధికారులు ఆ జెండాను క్రిందికి దించివేసేటట్లు చేశారు. మరుసటిరోజు, అంటే ఆగస్ట్ 15నాడు శ్రీనగర్‌లో అధికశాతం గృహాలు,దుకాణాలపై భారతదేశపు త్రివర్ణపతాకం రెపరెపలాడింది. ఆజెండాలన్నీ వందల సంఖ్యలో సంఘ కార్యాలయంలో తయారుచేసి, ప్రజలకు పంచిపెట్టినవే.

అదేసమయంలో కాశ్మీర్‌లోని పాకిస్తాన్ అనుకూలశక్తులు మహారాజును పాకిస్తాన్‌లో విలీనం అయేటట్లు ఒత్తిడి చేసేందుకు తమ ప్రచారాన్ని ఉధృతం చేశాయి. ఆంతరంగికంగా తిరుగుబాటును రెచ్చగొట్టడానికై రాష్ట్రంలోకి పెద్ద ఎత్తున ఆయుధాల దొంగ రవాణా సాగుతూ వచ్చింది. బైటనుండి పాకిస్తాన్ ఆర్థిక దిగ్బంధనం సృష్టించింది. పరిస్థితి ఎంత విషమంగా ఉన్నదో మొట్టమొదట గ్రహించినది సంఘనాయకులే. మరలవారు మహారాజుకు విజ్ఞాపనలు పంపించారు. ముస్లిం వేషంధరించిన ఒక స్వయంసేవక్ శ్రీనగర్ లోని రాష్ట్ర సాయుధ దళాలకు చెందిన ముస్లిం సైనికులు నివసించే గుడారాలలోకి ప్రవేశించాడు. అక్కడ పాకిస్తాన్ ఆక్రమణను బహిర్గతంచేసే విస్తార ప్రణాళికలను చేజిక్కించుకున్నాడు. కాశ్మీర్‌కు చెందిన ఒక ప్రముఖ కార్యకర్త రాష్ట్ర సాయుధ దళాల కమాండర్‌కు వ్యక్తిగతంగా ఈ ప్రణాళికల గురించి, రానున్న విషాదకర పరిణామాలగురించి తెలియజేశాడు. తరువాత జరిగిన పరిణామాలు ఆప్రణాళికలతో అక్షరాల సరిపోయాయి.

అక్టోబర్ మధ్య దినాలలో కేంద్ర ప్రభుత్వాధికారుల స్థాయిలో కూడా సంఘం కొన్ని కీలకమైన చర్యలు తీసుకున్నది. మహారాజు హృదయాన్ని ఎఱిగిన సర్దార్ పటేల్ ఆయనతో మాట్లాడవలసిందిగా శ్రీగురూజీని అభ్యర్థించారు. మహారాజుకు శ్రీగురూజీ ఎడల అంతులేని విశ్వాసం వుందని ఆయనకు తెలుసు. అక్టోబర్ 17, 1947నాడు శ్రీగురూజీ శ్రీనగర్‌కు బయలు దేరివెళ్ళారు. కాశ్మీర్‌ను ఒక స్వతంత్రరాజ్యంగా చేయాలనే ఆలోచన వ్యర్థమైనదని మహారాజుకు వారు నచ్చజెప్పారు. నేరుగా భారత్‌లో విలీనంకమ్మని సలహా ఇచ్చారు. చిట్టచివరికి, భారత్‌లో విలీనపు ఒప్పందంపై సంతకం చేయడానికి మహారాజు తన సంసిద్ధతను వ్యక్తంచేశాడు. 19అక్టోబర్‌నాడు క్రొత్తఢిల్లీకి తిరిగివచ్చిన శ్రీగురూజీ భారత్‌లో విలీనానికి మహారాజు సిద్ధంగా ఉన్నారన్న విషయాన్ని సర్దార్ పటేల్‌కు తెలియజేశారు.

అక్టోబర్ 23నాడు హటాత్తుగా, పెద్ద ఎత్తున కాశ్మీర్‌పై పాకిస్తానీ గిరిజనుల దురాక్రమణ, ఢిల్లీనుండి అత్యవసర సహాయానికై మహారాజు అభ్యర్థన, భారత్‌లో కాశ్మీర్ విలీనానికి ఆయన అంగీకరించడం , కాశ్మీర్‌ను రక్షించడానికి భారతసేనల పయనం - అన్నీ ఆతరువాత మెరుపు వేగంతో జరిగిపోయాయి.

1947 అక్టోబర్ 11నాడు పాకిస్తానీ ఆక్రమణకారులుమొదటిసారి దాడిచేశారు. భారతదేశంవైపు అనేకమందిని ఊచకోత కోసారు. పెద్ద సంఖ్యలో స్త్రీలను ఎత్తుకుని పోయారు. ఆతరువాత సరిహద్దు పొడుగునా నియమితంగా దాడులు ప్రారంభం అయ్యాయి. అక్టోబర్ 22-23 నాటికి జమ్ము-సియాల్‌కోట సరిహద్దు మొత్తం మంటల్లో ఉంది. లెక్కలేనన్ని సరిహద్దు గ్రామాలు బూడిదైపోయాయి. జమ్ము నగరంలో గూడా సుమారు 20వేల సంఖ్య గల స్థానిక ముస్లింలు తిరుగుబాటు ధోరణిలో ఉన్నారు. తలాబ్ కటికాన్ ప్రాంతంలో మొదటి తుపాకి గుండు పేలింది. ఆతరువాత వరుసగా ఘర్షణలు ప్రారంభం అయ్యాయి. భద్రతాదళాలేవీ అందుబాటులో లేకపోవడంతో జమ్ముపట్టణం, చుట్టుప్రక్కల గ్రామాల పరిస్థితి అనిశ్చితంగా వ్రేలాడసాగింది. ప్రతిఒక్కరి ముఖంలో తీవ్రమైన విషాదం అలముకుని ఉంది. ఆపరిస్థితులలో సంఘయువకులు లేచిని లిచారు. రాష్ట్రంలోని పాకిస్తాన్ అనుకూల ముస్లిం శక్తులను వారు ఎదుర్కొన్నారు. అనేక సార్లు వారి దాడులను త్రిప్పికొట్టారు. వారి ప్రణాళికలన్నింటినీ భగ్నం చేశారు.

ఆ విధంగా జమ్మూ కాపాడబడింది. స్వయంసేవకుల వీరోచిత కృషి గనుక లేకపోతే జమ్మూ రక్షింపబడి ఉండేదేకాదు. జమ్మూయే లేకపోతే భారతీయసైన్యాలకు శ్రీనగర్‌ను రక్షించడానికి అవకాశమే ఉండేది కాదు.

## త్యాగాలగాథ:

ఆంతరిక ద్రోహుల వెన్ను విరుగ గొట్టే పనిపూర్తయిన తదుపరి స్వయంసేవకులు జమ్మూ విమానాశ్రయాన్ని విస్తృతం చేసే అత్యవసర పనిని చేపట్టారు. అయిదువందల మంది స్వయంసేవకులు వారం రోజులపాటు రాత్రింబవళ్ళు శ్రమించి భారతీయ డకోటా విమానాలు దిగడానికి వీలుగా విమానాశ్రయాన్ని సిద్ధం చేశారు. భారతీయసైనికుల కదలికల కోసం రోడ్లను మరమ్మత్తు చేశారు. అతితక్కువ వ్యవధిలో రోడ్లను నిర్మించారు కూడా. ఈ లోగా అనేక సరిహద్దుగ్రామాలలో స్థానికముస్లింలు దురాక్రమణకారులతో చేతులు కలిపి, వేలాది హిందువులను హత్యచేశారు. వేలాది హిందూ స్త్రీలను ఎత్తుకుపోయారు. ఆక్లిష్ట సమయంలో స్వయంసేవకుల అప్రతిహతమైన వీరత్వము, త్యాగభావన మరొక సారిబైటపడింది. మీర్‌పూర్ ప్రాంతం పాకిస్తాన్ చేజిక్కిన తరువాత, అక్కడే మిగిలిపోయి। వేలాది హిందువుల మానప్రాణాలను కాపాడే ప్రయత్నంలో జమ్మూకు చెందిన వందలాది స్వయంసేవకులు తమ ప్రాణాలను అర్పించారు.

నిస్సహాయస్థితిలో జమ్మూ వైపుకు పరుగులు తీస్తున్న శరణార్థులకు పఠానుల తుపాకిగుండ్ల వర్షం నుండి రాత్రింబవళ్ళు వారి చుట్టూ రక్షణ వలయంలా నిలచిన ఒక వందమంది స్వయంసేవకులు మినహా మరే విధమైన రక్షణ లేకపోయింది.

కోట్లీ అనేది ఒక కీలకమైన సరిహద్దు పట్టణం. స్థానిక ముస్లింల సహకారంతో పాక్ ఆక్రమణకారులు పదేపదే ఈ పట్టణంలోకి చొరబడి హత్యలు,ఇతర దురాగతాలు సాగించారు.. అయితే హిందువులు ఊరుకో లేదు. ప్రతిసారి వారు ఎదురుపోరాటం సాగిస్తూనే వున్నారు. దాదాపు ప్రతివీధి, ప్రతిఇల్లు ఒక రక్షణ కోటగా మారింది. అసంఖ్యాకులైన మన తల్లులు, సోదరీమణులు దురాక్రమణకారుల చేతులలో చిక్కి తమ మానాన్ని కోల్పోయే కంటే, విషంత్రాగడం ద్వారానో లేదా తమ స్వంత కుటుంబంలోని మగవారిచేతిలో బలిదానం కావడాన్నో కోరుకున్నారు.

ఆరువారాల పాటు హిందువులు గట్టిగా నిలబడ్డారు. ప్రాణప్రదమైన ఈ సరిహద్దు కేంద్రంలో సాగిన చారిత్రాత్మక ప్రతిఘటనకు ఘనత అంతా సంఘ స్వయంసేవకులకు చెందవలసిందే. సంఘ నగర కార్యవాహ నాయకత్వాన స్వయంసేవకులు ప్రజల ఆత్మవిశ్వాసాన్ని సుదృఢం చేశారు. వారిలో దేశభక్తి భావనను జాగృతం చేసి వీరోచిత ప్రతిక్రియకు వారిని సన్నద్ధం చేశారు.

భారత సైన్యానికి సహకరించవలసిన పిలుపు వచ్చినపుడు స్వయంసేవకులు ఎటువంటి త్యాగాలకు వెనుదీయలేదు. కోట్లీలోని సైనికస్థావరంలో మందుగుండు అయిపోయింది. మనవైమానిక దళం జారవిడిచిన 20 ఆయుధ పెట్టెలు పాకిస్తాన్ తుపాకీదళపు పరిధిలో ఉన్న ఒక నిలువైన లోయలో పడ్డాయి. ఆపెట్టెలను తీసుకురావడమంటే చావుఖాయం కనుక ఆసైనికస్థావరపు అధికారి ఉన్నకొద్దిమంది సైనికుల ప్రాణాలను ఆసామగ్రిని సంగ్రహించడం కోసం బలిపెట్టడం తెలివితక్కువతనం కాగలదని భావించాడు. అయితే క్రిష్ణలాల్ అనే స్థానిక సంఘ కార్యకర్త, మరొక ఇరవైమంది స్వయంసేవకులు కలిసి దానిని ఒక సవాలుగా తీసుకుని 17 పెట్టెలను స్థావరానికి తీసుకుని వచ్చారు. అయితే అందుకు మూల్యంగా తమనాయకుడితో కలిపి ఆరు విలువైన ప్రాణాలను వారు చెల్లించవలసివచ్చింది. ఏమైనా ఈ ఆరుగురికి బదులు పట్టణంలోని ఆరువేలమంది హిందువుల మానప్రాణాలను వారు రక్షించగలిగారు. పట్టణాన్ని రక్షించడానికి సాగుతున్న పోరాటం చిట్టచివరి దశలో నగర కార్యవాహ ప్రకాశ్ కూడా వీరమరణం పొందారు.

కాశ్మీర్ లోయలో కూడా ఇదే పరిస్థితి నెలకొనిఉంది. కాశ్మీర్‌లో తనకు ఉన్నత పీఠం లభించేటట్లు ఢిల్లీనుండి హామీపొందిన షేక్ అబ్దుల్లా పాకిస్తాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా దృఢంగా నిలబడినప్పటికీ, ఆయన అనుచరులు మాత్రం పాకిస్తాన్ ప్రచారం కారణంగా చెలరేగిన ముస్లిం మతోన్మాదంలో కొట్టుకునిపోయి ఆక్రమణకారులతో చేతులు కలిపారు. స్వయంసేవకులు పెద్దసంఖ్యలో పౌర సైన్యంలో జేరారు. ఆక్రమణకారులను తరిమివేయడంలో భారతసైన్యానికి అన్నిరకాల సహకారాన్ని అందించారు. పౌరసైన్యంలోని సంఘకార్యకర్త పండిత మన్మధ్ కాశ్మీర్ రక్షణలో ప్రాణాలర్పించాడు. కాశ్మీర్‌లోయలో నుండి ఆక్రమణకారులను తరిమివేసేటంత వరకు, తన స్వంత పరిపాలన స్థిరపడేటంత వరకు షేక్ అబ్దుల్లా ప్రభుత్వం సంఘస్వయంసేవకులను పౌరసైన్యంలో పనిచేయనిచ్చింది. ఒకసారి ఆ లక్ష్యం నెరవేరగానే సంఘ స్వయంసేవకులను

ఒక పథకం ప్రకారం కేవలం పౌరసైన్యంనుండే కాక కాశ్మీర్‌నుండే బైటకు పంపివేశారు.

## పోర్చుగీసు ఆధిపత్యాన్ని అంతం చేయడంలో...

బ్రిటిష్ వారు వైదొలగినంత మాత్రాన స్వాతంత్ర్య పోరాటం ముగిసిపోలేదు. 1954 ఆగస్ట్ 2వతేదీన మిగిలి ఉన్న పోర్చుగీసు స్థావరాలైన దాద్రా, నగర్‌హవేలీల లోనికి వందమంది సంఘ స్వయంసేవకులు జొరబడ్డారు. పుణే సంఘచాలక్ స్వర్గీయ వినాయకరావు ఆప్టే నేతృత్వంలో ఈ దాడి జరిగింది. ఆబృందంలో అనేకమంది ప్రముఖులైన సంఘకార్యకర్తలు ఉన్నారు. గొరిల్లా వ్యూహాన్ని రూపొందించి, సెల్వాసాలోని ప్రధాన పోలీసు కేంద్రకార్యాలయంపై దాడి చేసి, అక్కడి 175 మంది సైనికులు బేషరతుగా లొంగి పోయేటట్లు చేశారు వారు. జాతీయత్రివర్ణ పతాకం ఎగురవేశారు. అదేరోజున ఆ ప్రాంతాన్ని కేంద్ర ప్రభుత్వానికి అప్పగించారు. ఆ చారిత్రాత్మక సంఘటన యొక్క రజతోత్సవ సందర్భంగా 1979 ఆగస్ట్ 2వ తేదీన సెల్వాసా ప్రజలు ఆ వందమంది స్వాతంత్ర్యవీరులను ఆహ్వానించి ఘనంగా సన్మానించారు. 1987లో మహారాష్ట్రప్రభుత్వం కూడా వారిని స్వాతంత్ర్యసమరయోధులుగా గుర్తించి సత్కరించింది.

అప్పటికి ఇంకా గోవాపై పోర్చుగీసువారి ఆధిపత్యం కొనసాగుతూనే ఉంది. 1955లో పనాజీ సచివాలయం మీద మొట్టమొదటి సారి త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసిన వ్యక్తి గోవాలో అధ్యాపకునిగా పనిచేస్తున్న ఒక స్వయంసేవక్. 1961 లో గోవా విముక్తం అయిన తరువాత కూడా మొత్తం 17సం||లపాటు ఆయన లిస్బన్‌జైలులో ఉన్నాడు. 1955లో గోవావిముక్తికై అన్ని రాజకీయపక్షాలు కలిసి సాగించిన జాతీయపోరాటంలో స్వయంసేవకులుప్రధానపాత్ర నిర్వహించారు. దేశం నలుమూలలనుండి వెల్లువలా వస్తున్న సత్యాగ్రహులకు గోవా సరిహద్దు వెంబడి భోజన వసతి సమకూర్చే కార్యాన్ని స్వయంసేవకులు తమ భుజస్కంధాలపై వేసుకున్నారు. సంఘానికి, జనసంఘానికి చెందిన ప్రముఖ కార్యకర్తలు అనేక సత్యాగ్రహ బృందాలకునాయకత్వం వహించారు. వారిలో అనేకులు తుపాకి గుండ్ల దెబ్బలుతిన్నారు. పోర్చుగీసు జైళ్ళలో అమానుష చిత్రహింసలను అనుభవించారు.

సత్యాగ్రహబృందాలకు నాయకత్వం వహించిన ప్రముఖ స్వయంసేవ

కులలో మధ్యభారత్ బృందానికి నాయకత్వం వహించిన ఉజ్జయినికి చెందిన రాజాభావు మహంకాళ్ ఒకరు. సరిగ్గా సరిహద్దులలోనేపోర్చుగీస్ పోలీసులు తమ తుపాకులు, తూటాలతో ఈ సత్యాగ్రహులకు 'స్వాగతం' పలుకడానికి సిద్ధంగా ఉన్నారు. రాజాభావు గోవా సరిహద్దువైపు సాగుతున్నంతలోనే సత్యాగ్రహుల మొదటి మూడు వరుసలపై కాల్పులు జరిగాయి. వారు గాయపడి నేలకూలారు. మూడవవరుసలోఉన్న సాగర్‌కు చెందిన సాహసి సహోదరాదేవి గాయపడి క్రిందపడిపోగానే రాజాభావు ఆమె చేతిలోని త్రివర్ణపతాకాన్ని తానందుకుని 'భారతమాతాకీజయ్' అని గర్జిస్తూ ముందుకు దూకారు. అంతలోనే దూసుకువచ్చిన ఒక బుల్లెట్ వారి కంటిని ఛీల్చుకుపోగా వారు నేలకూలారు. స్పృహలో ఉన్న కొద్దిక్షణాలలోనే పతాకాన్ని, గాయపడిన సత్యాగ్రహులను జాగ్రత్తగా చూసుకోమని ఇతరులకు ఆదేశాలుఇచ్చారు.మరికొన్ని నిమిషాలలోనే మాతృభూమి స్వాతంత్ర్యసాధనా కార్యంలో అజరామరమైన ఘనతను సాధించుకున్న అమరవీరులవరుసలో వారుకూడా చేరిపోయారు.

## విదేశీ దురాక్రమణ గురించి హెచ్చరిక:

దేశపు కణకణపు జాతీయ సార్వభౌమాధికారం ఎడల ప్రగాఢనిష్ఠ ఎల్లప్పుడు సంఘం యొక్క ఊపిరిగా ఉంటూ వచ్చింది.

బెంగాల్‌లో కొన్ని భాగాలను బహుమానంగా ఇవ్వడం ద్వారా పాకిస్తాన్‌ను సంతృప్తిపరచి, శాంతిని సాధించాలని భారతప్రభుత్వం మరొకమారు ప్రయత్నం చేసింది. ఈ విషయంలో 1959 డిసెంబర్‌లో జరిగిన అఖిలభారతీయ కార్యకారీమండల్ సమావేశాల (All India Executive committee) సందర్భంగా సంఘం "బేరుబారీ, ఇతర భారతభూభాగాలను పాకిస్తాన్‌కు ధారపోసేందుకు వీలుగా రాజ్యాంగాన్ని సవరించడానికి ఉద్దేశించి ప్రవేశపెట్టిన బిల్లు మన జాతీయస్వాభిమానం, సమైక్యతలకు గొడ్డలి పెట్టు కాగలదు" అని ప్రభుత్వాన్ని హెచ్చరించింది. పార్లమెంటు సభ్యులందరినీ "ఆత్మహత్యా సదృశమైన ఈ బిల్లును గట్టిగా వ్యతిరేకించమని, ఈ విషయంలో ప్రజలు చెందుతున్న ఆందోళనను ఉపశమింపజేయమని, తద్వారా జాతి సార్వభౌమాధికారాన్ని పరిరక్షించడం తమ అత్యున్నత కర్తవ్యమని చాటిచెప్పమని" సంఘం అర్థించింది.

కాశ్మీర్ సమస్యను ఐక్యరాజ్య సమితికి తీసుకువెళ్ళినప్పుడు కూడా, ఈ చర్య మనకే ఎదురు దెబ్బ తీస్తుందని, భవిష్యత్తులో దేశభ

ద్రత,సమగ్రతలకు అనేక తీవ్ర సమస్యలను అది సృష్టిస్తుందని శ్రీ గురూజీ బహిరంగంగా హెచ్చరించారు. హిమాలయసరిహద్దులలో మనకు వ్యూహపరంగా ఎంతో కీలకమైన పెద్ద భూభాగాలను చైనా అక్రమంగా ఆక్రమించుకున్న వార్తను బహిర్గతం చేసిన మొట్టమొదటి ప్రజా నాయకుడు శ్రీ గురూజీయే. 1960లో,'హిందీ-చీనీ భాయి భాయి' అంటూ జోలపాటలు పాడుకుంటూ పండిట్ నెహ్రూ , చౌ-ఎన్-లైలు కలిసి దేశమంతా పర్యటిస్తున్నప్పుడు, ఆనినాదాల హోరు వెనుక దాగిఉన్న భయంకర సర్పపు కోరల గురించి బహిరంగంగా హెచ్చరించిన ఏకైక స్వరం శ్రీగురూజీదే.

## 1962 చైనా దురాక్రమణ సమయంలో:

రెండు సంవత్సరాల తరుపరి, 1962లో చైనీయులు బహిరంగంగానే మన భూభాగం మీద దండెత్తినపుడు ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలకు, ప్రధానంగా మన సైన్యానికి మద్దతును సమీకరించడానికి స్వయంసేవకులు రంగంలోకి దూకారు. పండిట్ నెహ్రూ చాలా ప్రభావితుడయ్యాడు. 1963 జనవరి 26నాడు జరిగిన రిపబ్లిక్ దినోత్సవ కవాతులో సంఘ స్వయంసేవకుల దళాన్ని కూడా పాల్గొనవలసిందిగా ఆయన ఆహ్వానించాడు. కేవలం రెండురోజుల వ్యవధిలో పూర్తిగణ వేషధరించిన దాదాపు 3వేలమంది స్వయంసేవకులు సొంపైన పద్ధతిలో కవాతులో పాల్గొన్నారు. నిజానికి వారి బ్రహ్మాండమైన కవాతు ఆనాటి కార్యక్రమంలో ప్రధాన ఆకర్షణ అయింది. ఆతరువాత కొందరు కాంగ్రెస్ వారు సంఘాన్ని ఆహ్వానించడంపట్ల ఆశ్చర్యాన్ని ప్రకటించినపుడు పండిట్ నెహ్రూ వారి అభ్యంతరాలన్నింటినీ త్రోసి పుచ్చుతూ 'దేశభక్తులైన పౌరులందరినీ కవాతులో పాల్గొనమని ఆహ్వానించాం' అని సమాధానం ఇచ్చారు.

యుద్ధసమయంలో కార్మికులు వ్యవహరించే తీరు కీలకపాత్ర వహిస్తుంది. చైనా భారత్‌పై దండయాత్ర చేసినపుడు, భారత కమ్యూనిస్టు పార్టీలోని ఒక వర్గం భారత్‌ను (సామ్రాజ్యవాదుల ఆధిపత్యం నుండి) 'విముక్తం' చేయడానికే చైనాసేనలు వచ్చాయని ప్రకటించింది. బసవపున్నయ్య తదితర కమ్యూనిస్టు నాయకులు అసలు భారతదేశమే దురాక్రమణదారు అని, చైనా భూభాగాన్ని అది ఆక్రమించిందని చెప్పేవరకు వెళ్ళారు. మన రక్షణ ప్రయత్నాలను నిరోధించడానికి, వెన్నుపోటు పొడవడానికి కార్మికసంఘాలను వారు సాధనాలుగా వాడుకొన్నారు. ఈశా

న్యప్రాంతంలో వారి నీటిసరఫరా కార్మిక సంఘం సమ్మె ప్రకటించింది. యుద్ధరంగంలోని సైనికులకు ఆహారం,ఇతరవస్తువుల రవాణాకు అనేక ఆటంకాలు కల్పించారు.

అయితే భారతీయమజ్దూర్ సంఘ్ నిర్ణయం మరొక విధంగా ఉంది. తన కార్మికసంఘాలుచేస్తున్న ఉద్యమాలన్నింటినీ మజ్దూర్‌సంఘ్ తక్షణం ఉపసంహరించుకుంది. అపరిష్కృతంగా ఉన్న సమస్యలన్నీ తాత్కాలికంగా ప్రక్కనపెట్టబడ్డాయి. రక్షణావసర వస్తువుల ఉత్పత్తిని పెంచడానికి, అన్ని రక్షణ ప్రయత్నాలకు అవసరమైన సహకారం అందించడానికి అత్యధిక ప్రాధాన్యత నీయవలసిందని కార్మికులకు పిలుపు ఇచ్చారు.

బి.ఎమ్.ఎస్. అంతటితో ఆగలేదు. భవిష్యత్తులో ఈ పంచమాంగ దళాలు సాగించే దుశ్చర్యల ఉధృతిని అరికట్టాలని నిశ్చయించుకుంది. రక్షణోత్పత్తులు, రవాణా, విద్యుచ్ఛక్తి ఉత్పాదన, విద్యుత్తు సరఫరా వగైరా వ్యూహాత్మకంగా కీలకమైన రంగాలలో ప్రత్యేక కృషి జరిగింది. రెండు దశాబ్దాల ఆ నిరంతర కృషి ఫలితంగా రక్షణరంగంలో బి.యమ్.యస్. అనుబంధ సంస్థఅయిన 'భారతీయప్రతిరక్షా మజ్దూర్‌సంఘ్' ఒక ప్రముఖ స్థానాన్ని సంపాదించుకోగలిగింది. భవిష్యత్తులో ఇంకెప్పుడూ 1962నాటి వ్యవహారాలు మళ్ళీ చేయడానికి వామపక్షాలు సాహసం చేయ బోవని నేడు బి.యం.యస్. విశ్వాసం కలిగి ఉంది. అలాగే జాతియొక్క జీవనరంగాలైన విద్యుదుత్పత్తి, రహదార్లు, రైల్వేల రవాణా మొదలైన రంగాలలో బి.యం.యస్. మిగిలినవారి కంటే స్పష్టమైన ఆధిక్యతను నిరూపించుకుంది.

## కచ్ రంగంలో లొంగుబాటును వ్యతిరేకించడం:

కచ్ ప్రాంతంపై పాకిస్తాన్ దురాక్రమణ సాగించిన నేపథ్యంలో 1965 జూన్ 30వతేదీన సంతకాలు చేసుకున్న కచ్ ఒప్పందం నిజానికి భారత భూభాగంపై నిఘాఉంచడానికి పాకిస్తాన్‌కు హక్కు ఉన్నదని గుర్తించడమే కాక, కచ్ ప్రాంతంలోని సుమారు 9వేల చ.కి.మీ.ల భారతభూభాగంపై ఉన్న వివాదంపై అంతర్జాతీయ ట్రిబ్యునల్ మధ్యవర్తి త్వానికి అంగీకరించినట్లే కాగలదు. ఇదంతా పాకిస్తాన్ మన భూభాగంపై అక్రమంగా చేసిన దురాక్రమణకు ప్రతిగా బంగారు పళ్ళెంలో పొందిన బహూమానం. బదులుగా భారతదేశానికి లభించిన దేమిటి? భారత ప్రభుత్వం కోరికను అనుసరించి 1965 జనవరి 1 నుండి యధాస్థితి

పునరుద్ధరింపబడింది. అయితే చివరికి ఇది 'దురాక్రమణకు వ్యతిరేకంగా యథాస్థితి' కాకుండా 'దురాక్రమణ తదుపరి యథాస్థితి' గా రూపొందింది. ఎందుకంటే 1965 జనవరి 1తేదీకి ముందు పాకిస్తాన్ ఆప్రాంతంలోకి జొరబడిందని ఆతరువాత మన ప్రభుత్వమే స్వయంగా అంగీకరించింది. ఇదంతాప్రభుత్వపు తీవ్ర నిర్లక్ష్యం మాత్రమే కాక, జాతీయ హక్కులకు, ప్రయోజనాలకుతీరని ద్రోహం అయింది. రాజకీయపక్షాలన్నింటిలోను కచ్ ఒప్పందం వెనుక ఉన్న జాతీయ సార్వభౌమాధికారపు అతిక్రమణకు వ్యతిరేకంగా పెద్దఎత్తున ప్రజల నిరసనను నిర్వహించడానికి ముందుకు వచ్చిన ఏకైక రాజకీయ పక్షం భారతీయజనసంఘమే. ఈ ఒప్పందపు ప్రమాదకర పరిణామాలను గురించి ప్రజలకు తెలియజెప్పడానికి, వారి నిరసనను ప్రదర్శించడానికి 1965 జూన్ 4వతేదీన దేశంలోని అన్ని ప్రాంతాలలో పెద్ద ఎత్తున ర్యాలీలు, ప్రదర్శనలు, ఊరేగింపులు జనసంఘం నిర్వహించింది. ఆగస్ట్ 16నాడు ఢిల్లీలో పార్లమెంటు భవనం బైట ఒక విశాలమైన నిరసన ర్యాలీ వారు నిర్వహించారు. అందులోపాల్గొన్న సంయుక్త సోషలిస్ట్‌పార్టీ, రిపబ్లికన్ పార్టీలకు చెందిన మరియు స్వతంత్రులైన అనేకమంది పార్లమెంటు సభ్యులు కూడా జనసంఘ్ నాయకులతో బాటు కచ్ ఒప్పందాన్ని వ్యతిరేకించారు. విశేషమేమిటంటే కొందరు కాంగ్రెస్ పార్లమెంటు సభ్యులు కూడా ర్యాలీలో పాల్గొనడానికి పార్లమెంటు నుండి బైటకు వచ్చి వేదిక పై ఆశీనులయ్యారు. 'ది స్టేట్స్‌మన్' పత్రిక ఈ ర్యాలీని 'ఇంతవరకు రాజధానిలో చూసిన ర్యాలీలన్నింటికంటే చాలా పెద్దదిగా' వర్ణించింది. దైనిక్ హిందుస్తాన్, బి.బి.సి.లు ర్యాలీలో పాల్గొన్న వారి సంఖ్య5లక్షలు ఉంటుందని అంచనా వేశాయి. సాధారణంగా జనసంఘ్‌కు వ్యతిరేకంగా ఉండే మద్రాసునుండి వెలువడే 'బ్రాడ్‌వే టైమ్స్' పత్రిక కూడా ఈ ర్యాలీ 'రాజధాని ఎన్నడూ చూడనంతటి విశాల నిరసన ర్యాలీ' అని అభివర్ణించింది.

## 1965 పాక్ దండయాత్ర సమయంలో:

తిరిగి 1965లో పాకిస్తాన్ భారత్‌పై దండెత్తినపుడు ప్రధాని శ్రీలాల్‌బహదూర్‌శాస్త్రి ఆసమయంలో మహారాష్ట్రలో పర్యటనలో ఉన్న శ్రీగురూజీతో స్వయంగా టెలిఫోన్‌లో మాట్లాడారు. మరుసటిరోజు జరుగనున్న సర్వనాయక సమావేశంలో పాల్గొనడానికి ఢిల్లీలో అందుబాటులో ఉండమని ప్రార్థించారు. ఆసమావేశంలో శ్రీగురూజీ సంఘంవైపునుండి సంపూర్ణ సహకారం అందిస్తామని వాగ్దానం చేశారు.ఆత్మరక్షణ పేరిట

భారతీయసైనికుల చేతులు కట్టివేయరాదని, తామే స్వయంగా ఆక్రమణ చేసే వ్యూహాన్ని రూపొందించుకునేందుకు అంగీకారం తెలపాలని ఆయన అర్థించారు. ఆసమావేశంలో శాస్త్రీజీని సంబోధిస్తూ ఒకానొక ప్రతినిధి 'మీసైన్యం' అనేమాటను పదేపదే ఉపయోగిస్తున్నపుడు శ్రీ గురూజీ 'మనసైన్యం అనండి' అని తీవ్రంగా హెచ్చరించారు.

యుద్ధం సాగిన 22రోజుల కాలంలో ఢిల్లీ పోలీసులను మరింత ఆవశ్యకమైన పనులకు పంపించడానికై, వారివిధులైన వాహనాల నియంత్రణ, తదితరపనులు స్వయంసేవకులకు అప్పగించబడ్డాయి. యుద్ధంమొదలైననాటినుండి తమరక్తం దానం చేయడానికై స్వయంసేవకులు జట్లుజట్లుగా ఢిల్లీలోని మిలిటరీ ఆసుపత్రికి వెళ్ళేవారు. సంఘాన్ని' కష్టసమయాలలో ఆదుకునే ఒక ఆప్తునిగా' సైన్యం భావిస్తూండేది. ఏవిధమైన పౌరసహకారం అవసరం వచ్చినా వెంటనే వారు సంఘ కార్యాలయానికి ఫోన్ చేసేవారు. యుద్ధం తీవ్రంగా జరుగుతున్న సమయంలో ఒకరోజు గాయపడిన సైనికులను తీసుకుని ఒక సైనికరైలు ఢిల్లీకి చేరుకుంది. వారిలో వందలమందికి అత్యవసరంగా రక్తం ఎక్కించవలసివచ్చింది. సైనికాధికారులు వెంటనే ఢిల్లీ సంఘకార్యాలయానికి ఫోన్ చేశారు. అప్పటికి అర్ధరాత్రి సమయం అయింది. కానీ మరునాటి ఉదయానికల్లా 500మంది స్వయంసేవకులు రక్తాన్ని దానం చేయడానికి మిలిటరీ ఆసుపత్రికి చేరుకున్నారు. ఆసుపత్రి నియమాలననుసరించి వారికి ఒక్కొక్కరికి 10 రూపాయలు ఇవ్వజూపారు. కానీ ఆధనాన్ని కూడా గాయపడిన సైనికుల కోసం వినియోగించడం ఉచితంగా ఉంటుందని చెబుతూ స్వయంసేవకులు తిరిగి ఇచ్చేశారు.

అమృతసర్ సంఘస్వయంసేవకులు సరిహద్దులలో శత్రువు యొక్క కాల్పుల పరిధిలోనే నాలుగు అల్పాహారశాలలు నిర్వహించారు. అప్రమాదకరమైన ప్రదేశాలలో పనిచేస్తున్న నవయువకుల అద్భుత ధైర్యం చూసితీరవలసిందే. ఈ అల్పాహారశాలలకి స్థానిక గ్రామాలప్రజలు పెద్దమొత్తంలో పాలు ఉచితంగా సరఫరా చేస్తూండేవారు. స్వచ్ఛమైన నేతితో తయారు చేసిన భోజనాన్ని వారు ఈ అల్పాహారశాలలకు తీసుకుని వచ్చేవారు. అక్కడ వందలాదిసైనికులు దానిని భుజించేవారు. సెప్టెంబర్ 8న గాయపడిన సైనికుల కోసం పెద్దసంఖ్యలో దుస్తులు కావాలని ప్రభుత్వఅధికారులు కోరినపుడు, కేవలం నాలుగు గంటల వ్యవధిలో స్వయంసేవకులు వాటిని సిద్ధంచేశారు.

ఆక్లిష్టమైన దినాలలో స్వయంసేవకులైన ఇద్దరు జనసంఘ్ శాసనసభ్యులు నాయకత్వం వహించినతీరు అతిశ్రేష్ఠమైనది.

## ప్రజల మనోబలాన్ని సుదృఢం చేసేకార్యం:

అప్రకటితంగా యుద్ధం ప్రారంభం కావడానికి ముందు, ప్రజలను యుద్ధానికి సిద్ధంచేసే చర్యలన్నీ కేవలం కాగితాలకే పరిమితంగా ఉన్నాయి. కానీ సామాన్యపౌరులు అపూర్వమైన రీతిలో బ్లాక్-అవుట్లు, రాత్రిగస్తీలు, ఇతర పౌరరక్షణ చర్యలు నిర్వహించిన తీరు నిజంగా ఒక అద్భుతం. పుష్కలంగా ఆయుధాలు ధరించి దిగిన పాకిస్తానీ పారాట్రూప్‌సైనికులను నిరాయుధులైన పౌరులు పట్టుకుని బంధించారు. రైలుమార్గమంతటినీ, నదులు, కాలువలపై ఉన్న ప్రతి బిడ్జిని, ప్రతివంతెనను, ప్రతి విమానాశ్రయాన్ని అపూర్వ ధైర్యసాహసాలతో, దృఢమైన దీక్షతో పౌరులే కాపలాకాశారు. ఈ అన్ని ప్రయత్నాలలోనూ స్వయంసేవకులు అగ్రేసరులుగా నిలిచారని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు.

ఫిరోజ్‌పూర్ జిల్లాలో స్వయంసేవక్ అయిన జనసంఘ్ శాసనసభ్యుడు ఒకరున్నారు. ఆయన స్వగ్రామం యుద్ధరంగానికి చాలా సమీపంలో, సరిహద్దులలో ఉంటుంది. యుద్ధం ప్రారంభం కాగానే ఆయన గ్రామస్తులందరితో 'నేను గ్రామంలోనే ఉంటాను. ఎటువంటి పరిస్థితులు వచ్చినా గ్రామాన్ని విడిచిపెట్టను' అని చెప్పారు. పాకిస్తాన్ కురిపిస్తున్న తుపాకి గుళ్ళ వర్షానికి భయకంపితులై గ్రామస్తులు ఎప్పుడైనా గ్రామం విడిచిపెట్టి వెళ్ళిపోవడానికి ఆయన అనుమతిని అడిగితే "మీ కిష్టమైతే మీరుగ్రామం విడిచిపెట్టి వెళ్ళిపోండి. కానీ ఒక్కటి మాత్రం ఖాయం. నేను ఇక్కడే ఉంటాను. నా చివరిశ్వాస వరకు పాకిస్తాన్‌తో పోరాడుతాను" అని ఆయన సమాధానం చెప్పేవారు. పౌరుషం నిండిన ఆమాటలు వినగానే, గ్రామస్తుల ఆత్మస్థైర్యం బలపడేది. తిరిగి కర్తవ్యోన్ముఖులయ్యేవారు. స్వయంసేవక్ అయిన మరొక జనసంఘు శాసనసభ్యుడు ఫిరోజ్‌పూర్ పట్టణంపై పాకిస్తాన్ ప్రత్యక్షంగా బాంబులు, తుపాకిగుండ్ల వర్షం కురిపిస్తున్నా లెక్కజేయక అక్కడే ఉండిపోయారు. ఫజిల్కా పట్టణసాధారణ జనాభా 40 వేలు. వారిలో చివరికి 5 వేల మంది మాత్రమే అక్కడ నిలబడ్డారు. వారంతాదాదాపు సంఘ స్వయంసేవకులు, వారి కుటుంబసభ్యులే.

జమ్మూలోని రాజౌరీలో పాకిస్తానీ దళాలు పట్టణంవైపు సాగుతున్న విషయం ఇద్దరు స్వయంసేవకుల - వారిలో ఒకరు జనసంఘనాయకులు కూడా - దృష్టిలోపడింది. వెంటనే ఈ వార్తను అందించడానికి వారు సైనికస్థావరంవైపు పరుగుతీశారు. అక్కడి సైనిక అధికారి శత్రువును ఎదుర్కొనడానికి అప్పటికే సిద్ధంగా ఉన్నాడు. అయితే ఈ ఇద్దరు స్వయంసేవకులను జమ్మూకు వెళ్ళిపోయి ప్రాణాలు కాపాడుకొమ్మని సలహాఇచ్చాడు. అందుకోసం ఒక సైనికవాహనాన్ని ఇస్తానని కూడా అన్నాడు. కానీ తమ స్వస్థలంలోనే ఉంటూ ప్రజలమనోధైర్యాన్ని కాపాడవలసిన, సైనికులకు పౌరమద్దతు సమీకరించవలసిన బాధ్యత తమపైనే ఉందని చెబుతూ వారు ఆ సహాయాన్ని తిరస్కరించారు. మరుసటి రోజు, ఈ దృష్ట్యా ఒకసమితి ఏర్పడింది. ఆ సమితి ఎంతో ప్రశంసనీయంగా పని చేసింది. శత్రువుల చేతుల్లో నుండి రాజౌరీని కాపాడడంలో ఎంతో సహాయపడింది.

అదే ప్రాంతంలోని మొయిన్ ధర్ లో శత్రుసైనికుల గోతుల (Trenches) లోనికి చొరబడడానికి ప్రయత్నం చేసిన ఒక సాహసి అయిన స్వయంసేవక్ గాధ ఉంది. ప్రక్కగ్రామం మీద కాల్పులు జరుపుతున్న ఒక పాకిస్తానీ సైనికుడి చేతులలో నుండి స్టెన్ గన్ ను అతడు స్వాధీనం చేసుకుని ఆసైనికుడిని, గోతులలో ఉన్న అతడి సహచరులను కాల్చి చంపాడు. ఆవిధంగా వందలాది ప్రజల ప్రాణాలు కాపాడాడు. నౌషేరాతాలుకాలోని పఠానీ గ్రామానికి చెందిన మరొక స్వయంసేవక్, భారతసైన్యపు ఒక విభాగాన్ని చుట్టుముట్టి, అకస్మాత్తుగా వారిపై దాడిచేసిన పాకిస్తాన్ సైనిక వలయాన్ని ఛేదించుకుని, లోపలకు దూరి భారతసైనికులకు అత్యావశ్యకమైన నీరు, ఆహారపదార్థాలు అందజేశాడు. ఆ సైనికులు అతడిపై బహుమానాల వర్షం కురిపించబోయినప్పుడు మాతృభూమి ఎడల తన కర్తవ్యాన్ని కేవలం తాను పూర్తిచేశానని చెబుతూ అతడు వాటిని తిరస్కరించాడు.

జమ్మూలో నిర్వాసితులైన ప్రజల ప్రవాహం రోజురోజుకు వృద్ధిచెంది లక్షలుగా మారినపుడు వారి పునరావాసానికై జమ్మూ పౌరుల నుండి సహకారం సాధించే కృషిలో సంఘం ప్రోద్బలంతో నడిచిన సహాయతా సమితి అగ్రగామిగానిలిచింది. ఆగస్ట్ 15వ తేదీనుండి సెప్టెంబర్ 6వ తేదీ వరకు సమితి రోజుకు 25-35 వేలమంది ప్రజలకు భోజనాలను

ఏర్పాటుచేసింది. వారికి నిత్యావసర వస్తువులన్నింటినీ సరఫరా చేసింది.

గుజరాత్‌లో కూడా, ద్వారక సమీపంలోని ఓఖాలో పనిచేస్తున్న ఒక సంఘ స్వయంసేవక్ ద్వారక నౌకాశ్రయాన్ని ప్రేల్చివేసేందుకు తక్కువఎత్తులో ఎగురుతూ వస్తున్న రెండు పాకిస్తానీ శాబర్‌జెట్ యుద్ధవిమానాలను నేలకూల్చాడు. సైనికులు ఆయనను అభినందనలతో ముంచెత్తినపుడు ఆయన నిజమైన స్వయంసేవకత్వాన్ని ప్రదర్శిస్తూ 'నేను నా విధినిర్వర్తించానంతే' అని వ్యాఖ్యానించాడు.

యుద్ధం పూర్తి అయిన తరువాత ఒక సంఘ కార్యకర్తతో జనరల్ కుల్వంత్ సింగ్ ఇలా అన్నారు. "పంజాబ్ భారతదేశానికి కరవాలం లాంటిది. ఆర్.యస్.యస్ పంజాబ్‌కు కరవాలం లాంటిది."

## తాష్కెంటు విషయంలో హెచ్చరిక:

యుద్ధానంతరం ప్రధానమంత్రిని తాష్కెంటుకు ఆహ్వానించినపుడు వారిని వెళ్ళవద్దని కోరుతూ శ్రీ గురూజీ ఒక సందేశం పంపించారు. కానీ ప్రధాని వెళ్ళాలనే నిర్ణయించుకున్నారు. అప్పుడు శ్రీ గురూజీ శ్రీ అటల్ బిహారీ వాజ్‌పాయ్ ద్వారా వారికి ఒక లేఖ పంపించారు. ఎన్ని రకాల ఒత్తిడులు తెచ్చినప్పటికీ ప్రజలకు చేసిన వాగ్దానాలకు దృఢంగా కట్టుబడి ఉండమని వారు ఆ లేఖలో ప్రధానిని అభ్యర్థించారు. రాబోయే తాష్కెంటు సంభాషణలను గురించి చెలరేగుతున్న రకరకాల అపోహలు, భయాల గురించి తనకు తెలుసునని శ్రీ శాస్త్రి, శ్రీవాజ్‌పాయ్‌తో చెప్పారు. అయితే దేశం యొక్క ప్రతిష్ఠ, ఆత్మగౌరవాలపై రాజీపడే ఏ చర్యకుతాను పాల్పడబోనని ప్రజలకు తెలియజేయదలచినట్లు కూడా ఆయన చెప్పారు.

కానీ తాష్కెంట్ ఒప్పందం శ్రీ గురూజీ భయాలను అక్షరాలా నిజం చేసింది. మార్చి 1966లో అఖిలభారతీయ ప్రతినిధి సభ ఇలా వ్యాఖ్యానించింది: "కాశ్మీర్‌లో మనకు ఎంతో కీలక ప్రాంతాలైన హాజీపూరా, టిట్వాల్, కార్గిల్‌ల నుండి మనసైన్యాలను ఉపసంహరించుకోవడానికి అంగీకరించడం ద్వారా మనంతట మనమే కాశ్మీర్ విషయంలో ఇంతవరకు ప్రదర్శించిన దృఢవైఖరిని తీవ్రంగా దెబ్బతీసుకున్నాం."

## నేపాల్‌తో స్నేహ సేతువును సుదృఢం చేసుకోవడంలో:

మన జాతీయ సరిహద్దులను పరిరక్షించే విషయంలో, ప్రధానంగా హిమాలయ ప్రాంతంలో చైనీయుల ఆక్రమణకారీ చర్యల దృష్ట్యా, శ్రీ గురూజీ చాలా చింతితులయ్యారు. ఆ చింతే 1963లో వారిని నేపాల్ సందర్శించేటట్లు చేసింది. అది నేపాల్‌తో మన సంబంధాలు అట్టడుగున ఉన్న సమయం. మహాశివరాత్రి రోజున పశుపతినాథుని దర్శనం చేసుకున్న తదుపరి శ్రీ గురూజీ మహారాజును కలిశారు. హిందువులు, హిందుత్వం ఎదుర్కొంటున్న సమస్యలను గురించి సవిస్తరంగా చర్చించారు. ఒక సంఘర్యాలీలో ప్రసంగించవలసిందిగా కూడా వారు ఆయనను ఆహ్వానించారు. మహారాజు కూడా సుముఖంగానే ఉన్నట్లు కనిపించారు. తిరిగి వచ్చిన తరువాత శ్రీ గురూజీ ప్రధాని నెహ్రూకు, లాల్‌బహదూర్ శాస్త్రికి ఉత్తరాలు వ్రాసి చర్చల వైఖరి తెలియజేశారు. నాగపూర్‌లో 1965 జనవరి 14 నాడు జరిగే మకరసంక్రాంతి ఉత్సవంలో ప్రసంగించడానికి సంఘం ఇచ్చిన ఆహ్వానాన్ని రాజుమహేంద్ర అంగీకరించినట్లు 1964 డిసెంబర్ 25న నేపాల్‌రేడియో ప్రకటించింది.

ఈ వార్త చైనా, పాకిస్తాన్‌లను దిగ్భ్రాంతులను చేసింది. ఎందుకంటే, ఆ సమయంలో తన అంతర్గత వ్యవహారాలలో భారత్ రెచ్చగొట్టే విధంగా వ్యవహరిస్తున్నందుకు ప్రతిక్రియగా నేపాల్ ఆ దేశాలకు సన్నిహితం అవుతోంది. నిజానికి, ఉత్తరాన రక్షణస్థావరం లాంటి ఆదేశంతో దెబ్బతిన్న మన సంబంధాలను తిరిగి ఏర్పరచుకునేందుకు ఒక అవకాశంగా మనప్రభుత్వం ఈ పరిణామాన్ని హృదయపూర్వకంగా స్వాగతించవలసింది. రెండు దేశాలమధ్యగల ప్రాచీన మత, సాంస్కృతిక సంబంధాలకు ప్రాధాన్యత కల్పించడం నేపాల్‌తో విడదీయలేని సంబంధాలు ఏర్పరుచుకొనడానికి చక్కని ఆధారం అయి ఉండేది. దురదృష్టవశాత్తు, భారతప్రభుత్వం నేపాల్ మహారాజును రావద్దని 'సలహా' ఇచ్చింది. ఏ కారణాలవల్ల అలా ఇచ్చిందో వారికే బాగా తెలియాలి. 1965 జనవరి 11 నాడు మహారాజు శ్రీ గురూజీకి ఉత్తరం వ్రాస్తూ 'ఒక హిందువుగా తనను హిందూ ఉత్సవంలో పాల్గొనడానికి అనుమతించకపోవడం పట్ల తన మనస్సు ఎంతో వ్యాకులత చెందిందని' తెలియజేశారు. సుదీర్ఘమైన, ఎంతో ప్రేరణదాయకమైన ఒక సందేశాన్ని వారు పంపించారు. అందులో

హిందూసమాజానికి సంఘటితం కావలసిన ఆవశ్యకతను, మానవజాతి కంతటికీ హిందుత్వపు ఆత్మీయతాస్పర్శను అందజేయవలసిన జగత్కార్యాన్ని వారు గుర్తు చేశారు. ఈ దిశలో సంఘం చేస్తున్న కృషిని వారు ప్రశంసించారు.

భారతప్రభుత్వపు విచిత్రవైఖరిపై నేపాల్ ప్రధాని డా.తులసిగిరి విచారాన్ని వ్యక్తం చేశారు. "మహారాజు ఆర్.యస్.యస్ ను ఉద్దేశించి ప్రసంగించడంలో తప్పేముంది? బొంబాయిలో 'యూకారిస్టిక్ కాంగ్రెస్' (క్రైస్తవమహాసభలు)లో పోప్ ప్రసంగానికి ఎవరూ అభ్యంతరం తెలుపలేదు. మరి ఒక హిందూరాజు ఒక హిందూసంస్థనుద్దేశించి ప్రసంగించడానికి గానీ, ఆవిధంగా హిందుత్వపు సమైక్యతను చాటిచెప్పడానికి గానీ ఎవరైనా అభ్యంతరం ఎందుకు చెప్పాలి?" అని ఆయన వ్యాఖ్యానించారు.

## 1971లో బాంగ్లాదేశ్ విముక్తి సమయాన:

1971 డిసెంబర్‌లో మరల పాకిస్తాన్‌తో యుద్ధం మొదలైంది. ఆ సందర్భాన శ్రీ గురూజీ ప్రభుత్వానికి, ప్రజలకు చేసిన మార్గదర్శనం చాలా స్పష్టంగాను, హత్తుకునేదిగాను ఉంది. "తథాకథిత 'అంతర్జాతీయ ధర్మాధర్మవిచక్షణ శక్తి'ని జాగృతంచేస్తే అది అద్భుతాలు సృష్టిస్తుందన్న మన భ్రమలు ఇప్పటికైనా తొలగిపోవాలి." వారింకా ఇలా అన్నారు. "మన యుద్ధలక్ష్యాలు స్పష్టంగా ఉండాలి. మన శాస్త్రాలు ప్రతిపాదించిన విధంగా శత్రుశేషం ఏ మాత్రం ఉండనీయరాదు." అయితే మనసైనికుల వీరత్వం కారణంగా బాంగ్లాదేశ్ విముక్తం అయిన వేకువలో మనప్రభుత్వం తిరిగి పాతపంథాలోనే నడువసాగింది. ఫలితాలు ఎలా ఉన్నాయో మనకందరికీ తెలిసినదే. అటుపాకిస్తాన్, ఇటుబాంగ్లాదేశ్ తరచు కయ్యానికి కాలుదువ్వుతూనే ఉన్నాయి.

యుద్ధసమయంలో, అంతకుముందులాగే, బెంగాల్‌లో, బీహార్‌లో, ఉత్తరప్రదేశ్‌లో, జమ్ములో, ఉత్తర పంజాబ్‌లో, రాజస్థాన్‌లో స్వయంసేవకులు పౌరసహకారాన్ని అన్నిరకాలుగా అందించడంలో ప్రభుత్వానికి తమసేవలను అంకితం చేశారు. అనేక ముఖ్య నగరాలు, పట్టణాలలో, వందలాది మంది స్వయంసేవకులు రక్తదాతలుగాను, పౌరరక్షణసైన్యంలో, ప్రాథమిక చికిత్సలో వాలంటీర్లుగాను తమంతటతాము నమోదు చేసు

కున్నారు. బ్లాక్‌అవుట్ సమయాలలో గస్తీ తిరగడం, పునరావాసచర్యలు చేపట్టడం వారి సాధారణ కర్తవ్యాలుగా మారాయి. ఉత్తరప్రదేశ్‌లో ప్రజలను చైతన్యవంతులను చేయడానికై ఒక దీర్ఘకాలిక కార్యక్రమం వారు రూపొందించారు. ప్రభాతఫేరీలు, ప్రజలను కలుసుకునే కార్యక్రమాలు నిర్వహించారు. పాక్ అనుకూలవర్గాల విషయంలోను, పంచమాంగదళాల విషయంలోనూ జాగ్రత్త వహించమని ప్రజలను ఉద్బోధించారు. ఢిల్లీలో రేడియోకాలనీలోని ఆకాశవాణి, ఇతర భవనాలను, వజీరాబాద్‌లో వాటర్‌వర్క్స్ భవనాలను పహరా కాయడానికి కింగ్స్‌వేకాంప్ పోలీస్‌స్టేషన్ అధికారులు స్వయంసేవకుల సేవలను అభ్యర్థించారు. అనేకస్థలాలలో ఆసుపత్రులలో ఉన్న క్షతగాత్రులైన సైనికుల మంచి చెడ్డలను స్వయంసేవకులే చూశారు. గాయపడిన సైనికుల కోసం పంపించిన పండ్లు, ఇతర వినియోగ పదార్థాలతో సైనికాసుపత్రులు తరచు నిండిపోతుండేవి.

1971 డిసెంబర్ 7 నాడు, పాకిస్తాన్ విమానాలు రాజస్థాన్‌లోని బర్మేల్ రైల్వే స్టేషన్‌పై బాంబులు వేశాయి. వెంటనే ఆ ప్రమాదకర స్థలానికి 40, 50 మంది స్వయంసేవకులు పరుగెత్తి వెళ్ళారు. పెట్రోలు తీసుకుని వెళ్తున్న ఒక గూడ్సురైలుకు కొద్దిలో నిప్పంటుకునేదే. ఎడతెరిపి లేకుండా బాంబులు పడుతున్నా లెక్కజేయకుండా స్వయంసేవకులు పెట్రోలు డ్రమ్ములను సురక్షితస్థలాలకు తరలించారు. ఆ క్లిష్టసమయాలలో సున్నితమైన సరిహద్దు ప్రాంతాలలో సంఘంవారే అల్పాహారశాలలు నడపాలని అనుభవజ్ఞులైన సైనిక, ప్రభుత్వ అధికారులు సైతం పట్టుబట్టేవారు.

## మరుపురాని సంఘటనలు:

పంజాబ్‌లోని ఫజిల్కాలో జరిగిన సంఘటన మరపురానిది. సరిహద్దుకు దగ్గరలో ఉన్న ఈ పట్టణంపై హటాత్తుగా పాకిస్తాన్ బాంబులతో దాడి చేసింది. చాలామంది ప్రజలు పట్టణం వదిలి చిందరవందరగా సురక్షితస్థలాలకు పారిపోయారు. జిల్లాకలెక్టర్, ఇతరప్రభుత్వ అధికారులు కూడా ఆ ఊరినుండి ఖాళీ చేయడానికి సిద్ధపడుతున్నారు. ఈదశలో, ఫజిల్కాజిల్లా సంఘచాలక్ జిల్లా కలెక్టర్‌ను కలుసుకొని, పౌరరక్షణ ఏర్పాటు చేసుకోవడానికి ఆయన సూచనలను అడిగారు. కలెక్టర్ ఇరకాటంలో పడ్డాడు. ఎందుకంటే ఆయనే స్వయంగా ఆస్థలాన్ని విడిచిపెట్టి

వెళ్తున్నాడు. అప్పుడు ఆసంఘచాలక్ ఆరోజులలో శాఖల్లో జరుగుతున్న ఒకప్రేరణదాయకమైన పంజాబీగీతాన్ని పాడారు. ఆపాటవల్ల మేల్కొన్న ప్రఖరదేశభక్తి, వీరత్వభావనలు కలెక్టర్‌పై కూడా తక్షణం ప్రభావం చూపాయి. పట్టణాన్ని విడిచిపెట్టే ఆలోచనను ఆయన విరమించాడు. వెంటనే సైన్యాన్ని పంపించవలసిందిగా పై అధికారులకు ఫోన్ చేశాడు. వెంటనే పై నుండి ప్రతిస్పందనవచ్చింది. ఒక గంటలోగా సైన్యం అక్కడికి చేరుకుంది. పాకిస్తాన్ చేతుల్లో చిక్కకుండా పట్టణం అలా కాపాడబడింది. అప్పటి జిల్లా కలెక్టర్, ప్రస్తుతం డివిజనల్ కమిషనర్, ఏప్రిల్ 1988లో ఒక బహిరంగ ఉత్సవంలో ఆ సంఘచాలక్‌ను సన్మానించారు. భావోద్వేగంతో ఆనాటి సంఘటనను గురించి వర్ణించారు.

బెంగాల్‌లో 1950లో ప్రారంభించిన 'బాస్తుహర సహాయతా సమితి'ని పునరుద్ధరించారు. ఏప్రిల్ 1971 నుండి అది పెద్దఎత్తున పునరావాస కార్యక్రమాలను ప్రారంభించింది. తూర్పుబెంగాల్ శరణార్థుల సహాయార్థం సంఘస్వయంసేవకులు దేశం మొత్తంలో ధనం, బట్టలు సేకరించారు. మన సైనికులు ముందుకు సాగుతున్న మార్గాలలో వివిధస్థలాలలో ఉచిత అల్పాహారశాలలు నిర్వహించడం ఆనాడు వారు నిర్వహించిన ప్రధాన పనులలో ఒకటిగా ఉండేది. పాకిస్తాన్ సైన్యపు పాశవిక అత్యాచారాల కారణంగా పారిపోయివచ్చిన వేలాది ముస్లింలు కూడా శరణార్థులలో ఉండేవారు. చక్కటి వ్యవస్థతో కూడిన పద్ధతిలో స్వయంసేవకులు చాలావేగంగా గుడారాలు, పాత్రలు, ఆహారపదార్థాలు, బట్టలువగైరా సేకరించడం చూసి ప్రభుత్వాధికారులు ఆశ్చర్యపోయారు. ఆ తరువాత అధికారులు ఇంకా అనేక కేంద్రాలు తెరవవలసిందిగా స్వయంసేవకులను ఆహ్వానించారు. త్వరలోనే 35 వేలమంది శరణార్థులకు స్వయంసేవకులు ఏర్పాట్లు చేశారు.

బెంగాల్‌లో స్వయంసేవకులు ఒక వినూత్నకార్యక్రమం నిర్వహించారు. సైన్యాధికారులకు డ్రైఫ్రూట్స్ పొట్లాలను బహుమతిగా ఇచ్చేవారు. ప్రతి పొట్లంలోను ఒక చీటీ ఉండేది. అలాంటి 15 వేల పొట్లాలను మేజర్ కౌశల్, జనరల్ అరోరాలకు అందజేశారు. ఆ చీటీలలో సైనికులను ఉద్దేశించి కదిలించే విధంగా వ్రాయబడి ఉంది. "బాంగ్లాదేశ్‌పై అమానుష అత్యాచారాలు సాగించిన పాకిస్తాన్ సైన్యాన్ని అతి తక్కువ సమయంలో ఓడించి మీరు మీ అసమాన సాహసాన్ని ప్రదర్శించారు.

అంతేకాక భారతీయ సైనికుల వీరత్వపు ప్రేరణదాయక పరంపరను మరింత ముందుకు తీసుకువెళ్ళారు. జాతిమొత్తం మీ ఎడల ఎంతోగర్వం చెందుతున్నది."

ఒకచిన్న గ్రామశాఖ కూడా స్వయంసేవకులలో పరిపూర్ణమైన జాతీయ జాగృతిని ఎలా నిర్మాణం చేస్తుందో తెలియజేసే సంఘటన ఇది.

సంఘటన 1971 నాటిది. అప్పటికి బాంగ్లాదేశ్ యుద్ధం ఇంకా ప్రారంభం కాలేదు. భారత - పాక్ సరిహద్దువెంబడి తూర్పున, పశ్చిమాన కూడా సరిహద్దు ఘర్షణలు, కాల్పులు ప్రారంభమయ్యాయి. ఒకరోజు ఉదయం పశ్చిమబెంగాల్‌లోని పశ్చిమ దీనజ్‌పూర్ జిల్లాలో చక్రాం గ్రామంలో చెరువుదాటుతున్న పాకిస్తాన్ ఖాన్‌సేన సైనికులు కనబడ్డారు. భారతీయసైనికులు బాగా జనుము పంటమొలచిఉన్న దగ్గరలోని ఒక పొలంలో హడావుడిగా దాక్కున్నారు. పాకిస్తాన్ కాల్పుల పరిధిలో కొన్ని ఆయుధాలపెట్టెలు ఉండిపోయాయి. ఆ పెట్టెలను తిరిగి తెచ్చుకునే ఆలోచనను మనసైనికులు విడిచి పెట్టేశారు. ఎందుకంటే, అలాంటి ప్రయత్నం చేయడం చావుకొని తెచ్చుకోవడమే. అయితే స్కూల్ ఫైనల్ విద్యార్థి, స్థానికశాఖ ముఖ్యశిక్షక్ అయిన ఛుర్కాముర్ము మాత్రం అంత విలువైన ఆయుధాలు శత్రువుల చేతులలో పడడం ఏమాత్రం సహించలేకపోయాడు. తనంతటతానే పూనుకున్నాడు. ఒక తాడుకు కొక్కేలను తగిలించాడు. కొన్ని పెట్టెలను కొక్కేలకు తగిలించాడు. కొక్కేలకు తగిలించలేని పెట్టెలను చెరువులోకి త్రోసివేశాడు. నెమ్మదిగా వందగజాలు ఆ పెట్టెలతో ప్రాకుకుంటూ వచ్చాడు. ఇంతలో అతడిపై తుపాకి గుండ్ల వర్షం కురిసింది. పెదవులపై భారతమాతాకీ జయ్ నినాదం వినిపిస్తూ రక్తపుధారలతో అతడు నేలకూలాడు. తరువాత ఆపెట్టెలను మనసైనికులు సురక్షితస్థలాలకు చేర్చారు. చివరికి ఆనాటి సంఘర్షణలో విజయం మనపక్షం వహించడానికి ఆ ఆయుధాలే కారణం అయ్యాయి.

## 2

# అంతరిక శత్రువులకు సింహస్వప్నం

బాహ్య శత్రువులను ఎదుర్కొనడంలో చూపిన సాహసాన్ని స్వయంసేవకులు అంతర్గత ప్రమాదాలను ఎదుర్కొనడంలో కూడా ప్రదర్శించారు. ప్రధానంగా హిందువులు అల్పసంఖ్యాకులుగా ఉన్న ప్రాంతాలలోనే ఈ సమస్యలు తలఎత్తాయి.

## కాశ్మీర్‌లో వేర్పాటు వాదంపై పోరాటం:

1947లో పాక్ దురాక్రమణదారులను తరిమివేసి కాశ్మీర్‌రాష్ట్రాన్ని భారత్‌లో విలీనం చేయడంతో అక్కడి ప్రజల కష్టాలు తొలగిపోలేదు. దేశ సమగ్రతకు భంగం కలిగించే ప్రమాదం కాశ్మీర్‌లోపలే ప్రారంభమైంది. ఆ రాష్ట్రంలో హిందువుల భవిష్యత్తు ఏమిటి? అనే సందేహం కలిగించే పరిస్థితులు ఏర్పడ్డాయి.

1947 వరకు షేక్ అబ్దుల్లా కార్యకలాపాలు ప్రధానంగా కాశ్మీర్ లోయకు మాత్రమే పరిమితంగా ఉండేవి. జమ్మూను ద్వేషించండి. హిందువులను ద్వేషించండి' అంటూ అతడు దుష్ప్రచారం చేస్తూ వచ్చాడు. ముస్లిం కాన్ఫరెన్స్ పేరిట, అభ్యుదయ నినాదాలపేరిట వేర్పాటువాదాన్ని ప్రేరేపించాడు. పగ, అణచివేత, నిరంకుశత్వం అతడి వ్యవహారసరళిలో ప్రస్ఫుటమయ్యేవి. మతోన్మాద కలుషితము, వేర్పాటు వాదాన్ని పోత్సహించేది అతడి దృష్టి. పార్టీ నియంతృత్వాన్ని ఆయన నెలకొల్పాడు. పత్రికల నోరు నొక్కాడు. తన విధానాలను వ్యతిరేకించిన వారిని ఇచ్ఛానుసారంగా జైళ్ళలో కుక్కాడు. అధికారపార్టీని వ్యతిరేకించిన నేరానికి విద్యార్థులు పాఠశాల బహిష్కరణకు గురి అయ్యారు. పాలనా

యంత్రాంగాన్ని త్రోసిరాజని ముస్లిం కాన్ఫరెన్స్ పార్టీయే పరిపాలనను తన చేజిక్కించుకుంది. ప్రత్యేకప్రధాని, ప్రత్యేకన్యాయవ్యవస్థ, ప్రత్యేక రాష్ట్రపతి, వేరేజెండా, వేరేపాస్‌పోర్ట్ (పర్మిట్) మొదలైనవన్నీ కాశ్మీర్ భారత్‌కంటే భిన్నమైనదనే అభిప్రాయాన్ని కలుగజేయసాగాయి.

కేంద్రంలో మిగిలిన రాష్ట్రాలన్నింటి వ్యవహారాలను హోంమంత్రిత్వ శాఖ చూస్తే, కాశ్మీర్ వ్యవహారాలను మాత్రం విదేశాంగశాఖ చూసేది. రాష్ట్రానికి వెలుపల ఉన్న ఏ జాతీయ నాయకుడు కాశ్మీర్ ప్రజల మంచి చెడులను గూర్చి మాట్లాడరాదు. ఇక కాంగ్రెస్ నాయకుల దృష్టిలో కాశ్మీర్‌పై హక్కు షేక్ అబ్దుల్లాది. ఆయన మాట వేదవాక్కు. ఆయన ఫర్మానా సుగ్రీవాజ్ఞ.

మరొకవైపు జమ్మూరాజకీయాలలో కులతత్వ ప్రభావం ఎక్కువగా ఉంది. అన్నివర్గాలవారికి ప్రాతినిధ్యం వహించే ప్రజాస్వామిక రాజకీయప క్షమేదీ అక్కడలేదు. 1947 తరువాత షేక్ అబ్దుల్లా అధికారంలోకి వచ్చాడు. వెంటనే కులతత్వం స్థానంలో మతతత్వం ప్రవేశపెట్టబడింది. అచటి ప్రజలను అణచివేసే చర్యలను అతడు చేపట్టాడు.

ఈ పరిస్థితులలో ప్రజాస్వామిక పద్ధతులలో నడిచే ఒకరాజకీయ పార్టీ అవసరమని అందరూ అనుకోసాగారు. షేక్‌అబ్దుల్లా వేర్పాటుధోరణిని గమనించిన జాతీయవాదులు అప్రమత్తతతో మెలగసాగారు. రాష్ట్రంలో రానున్న ప్రమాదాలను ఎదుర్కొనడం కోసం కొందరు స్వయంసేవకులు ప్రజాపరిషత్ పేరుతో 1947 నవంబర్‌లో ఒక క్రొత్త పార్టీని ప్రారంభించారు.

1. కాశ్మీర్ భారత్‌లో పూర్తిగా విలీనం కావాలి.
2. జమ్మూ - కాశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తి రద్దుకావాలి.
3. ఒకే రాష్ట్రపతి, ఒకే పతాకము, ఒకే రాజ్యాంగము దేశమంతటికీ ఉండాలి. అదే జమ్మూ - కాశ్మీర్‌కు కూడా వర్తించాలి.
4. జమ్మూ, లఢక్ ప్రాంతాల ప్రజల పట్ల, మైనారిటీ హిందువుల పట్ల విపక్షత అంతం కావాలి.
5. షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయాలి.

- అన్నవి తన లక్ష్యాలుగా ప్రజాపరిషత్ పేర్కొంది. ఆ తరువాత కాశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తిని కల్పిస్తూ భారతప్రభుత్వం రాజ్యాంగంలో

మార్పు చేసింది. అలా ఆవిర్భవించిన రాజ్యాంగపు 370వ అధికరణాన్ని రద్దుచేయాలని ప్రజాపరిషత్ ఆందోళన చేస్తూవచ్చింది.

ప్రజాపరిషత్‌కు ఆనాడు నెలకొని ఉన్న పరిస్థితులలో ఆందోళనకు దిగడం మినహా మరోగత్యంతరం లేకపోయింది. షేక్‌అబ్దుల్లా, పండిట్ నెహ్రూలమధ్య పరిమిత ఒప్పందం జరిగిందని 1952 జూలైలో పార్లమెంటులో ప్రకటించారు. కనీసం ఆ ఒప్పందంలోని అంశాల అమలుకు కూడా ఎలాంటి చర్యలు తీసుకోలేదు. మరోవైపు, అబ్దుల్లా కోరికననుసరించి ప్రత్యేకరాజ్యాధిపతి, ప్రత్యేకరాజ్యాంగము, ప్రత్యేకపతాకం ఆరాష్ట్రంకలిగి ఉండడానికి మాత్రం కేంద్రం అంగీకరించింది.

1947 తరువాత కాంగ్రెస్ నాయకులు 'షేక్‌అబ్దుల్లా సెక్యులరిజానికి ప్రతీక' అని పెద్దఎత్తున ప్రచారం చేస్తూవచ్చారు. ఆయన జాతీయ వాదులలో అగ్రగణ్యుడని, ఆయనను శంకించడం మహాపచారమని వాదిస్తూవచ్చారు. ఇదంతా అతడిని విమర్శలకు అతీతుడనే విధంగా చేసింది. ఉక్కుమనిషిగా కీర్తించబడిన మన ఉపప్రధాని సర్దార్ పటేల్ సైతం షేక్‌అబ్దుల్లాముందు తలవంచక తప్పలేదు. అబ్దుల్లా కోరిక మేరకు జమ్మూ-కాశ్మీర్ వ్యవహారాలను చూసే బాధ్యత గృహమంత్రిత్వ శాఖనుండి విదేశాంగశాఖకు బదిలీ చేయబడింది.

## నిరుపమాన సంఘర్షణ:

1947 నుండి కేవలం 5 ఏళ్ళ పరిధిలో షేక్ అబ్దుల్లా మతోన్మాద, జమ్మూ వ్యతిరేక, వేర్పాటువాద విధానాలకు వ్యతిరేకంగా 1948, 1951-52, 1952-53లలో ప్రజాపరిషత్ మూడు ముఖ్యమైన ప్రజాపోరాటాలను నడిపింది.

1952 డిసెంబర్‌లో ప్రజాపరిషత్ నిర్వహించిన సత్యాగ్రహం అనేక విషయాలలో దానికదే సాటి. వేర్పాటుకోరికలు లేవు. ప్రత్యేక హక్కుల కోరికలులేవు. ఉద్యమవాదుల కోరికల్లా ఒక్కటే. భారతదేశంలో సంపూర్ణంగా విలీనం కావాలి. భారత జాతీయ జీవన ప్రవాహంలో సంపూర్ణంగా మిళితంకావాలి. ఇంతకంటే దేశభక్తియుతమైన కోరిక మరేది ఉంటుంది! అయినప్పటికీ షేక్‌అబ్దుల్లాకు సహాయంచేసి, ఉద్యమాన్ని ఉక్కుపాదంతో అణచి వేయడానికి ఇతర ప్రాంతాల నుండి ప్రత్యేక రిజర్వు పోలీసుదళాలను

స్వతంత్రభారత ప్రభుత్వం పంపించింది. పెద్ద సంఖ్యలో మహిళలు కూడా పాల్గొన్న సత్యాగ్రహుల శాంతియుత ఊరేగింపులపై అనేకస్థలాలలో క్రూరంగా లాఠీఛార్జి, కాల్పులు జరిపారు. సామూహిక అరెస్టులు, ఆస్తుల జప్తులాంటి చర్యలు సాగించారు. ఉద్యమానికి నాయకత్వం వహించిన గౌరవనీయులు, 75 సం.ల వయోవృద్ధులు అయిన ప్రాంతసంఘచాలక్ పండితప్రేమనాథ్ డోగ్రాను సైతం కటకటాల్లోకి నెట్టారు.

ప్రజాపరిషత్‌ను అపకీర్తిపాలు చేయడానికి కేంద్రం అన్నివిధాల ప్రయత్నించింది. కాశ్మీర్‌లో పత్రికలపై ఆంక్షలు విధించారు. నిష్పాక్షికంగా వార్తలు ప్రకటించే ఆర్గనైజర్ వంటి పత్రికలను రాష్ట్రంలో ప్రవేశించకుండా చేశారు.

మిగిలిన భారత దేశంలో ఉన్న నాయకులకు, ప్రజలకు కాశ్మీర్‌లోని పరిస్థితులను తెలియజెప్పవలసిన అతిముఖ్యమైన అవసరాన్ని ప్రజాపరిషత్ నాయకులు గుర్తించారు. 18 నెలల నిర్బంధం తరువాత జైలునుండి విడుదలకాగానే పండితప్రేమనాథ్ డోగ్రా ఇతర నాయకులతో కలిసి ఢిల్లీ మొదలైన నగరాలలో పర్యటించారు. అనేక బహిరంగ సభలలో, పత్రికా విలేఖరుల సమావేశాలలో ఉపన్యసించారు. రాష్ట్రపతిని, కేంద్రమంత్రులను, పార్లమెంటు సభ్యులను, ప్రముఖ రాజకీయ నాయకులను వారి బృందం కలుసుకుంది. జమ్మూ-కాశ్మీర్‌లో నెలకొని ఉన్న ప్రమాదకర పరిస్థితులను వారు మేధావివర్గాలకు వివరించారు. వారి ప్రయత్నాలకు త్వరలోనే ఫలితం కనిపించింది. షేక్ అబ్దుల్లాను విమర్శించడం ఒకనాడు మహాదోషంగా పరిగణించేవారు. ఇప్పుడు పరిస్థితి మారింది. పార్లమెంటులోను, పత్రికలలోను షేక్‌పై విమర్శలు రాసాగాయి. తమ విభేదాలు విస్మరించి ప్రజానాయకులందరూ కాశ్మీర్ విషయంలో శ్రద్ధ వహించడం మొదలుపెట్టారు.

కాశ్మీర్‌లో వేర్పాటువాదధోరణులకు వ్యతిరేకంగా జాతీయస్థాయిలో ఉద్యమాన్ని నిర్మాణం చేయడంలో చొరవచూపిన ఘనత భారతీయ జనసంఘ్‌కు దక్కుతుంది. జనసంఘ్ ఆధ్వర్యంలో 1952 జూన్ 26వ తేదీన పార్లమెంటు భవనం ముందు 15వేల మంది ప్రదర్శన జరిపారు. ఆ రోజున పార్లమెంటు కాశ్మీరు సమస్యను గురించి చర్చించవలసి ఉంది. దేశసమైక్యతను చాటి చెప్పే దేశభక్తి పూరితమైన నినాదాలు

మార్మోగాయి. డా. శ్యాంప్రసాద్ ముఖర్జీ, రామచంద్రారెడ్డి, సర్దార్ హుకుంసింగ్, ఎన్.సి.చటర్జీ, తదితర పార్లమెంటు సభ్యులు బయటకు వచ్చి ప్రదర్శకులకు స్వాగతం పలికారు.

1952 ఆగస్ట్ నెలలో జమ్మూలో ప్రజాపరిషత్ ఒక చారిత్రాత్మక సదస్సును నిర్వహించింది. అందులో కాశ్మీర్ పూర్తిగా భారత్‌లో విలీనం కావాలని ఏకగ్రీవంగా తీర్మానించారు. "ఒకవేళ కాశ్మీరీలు అందుకు సిద్ధంగా లేనట్లైతే జమ్మూ, లఢక్ ప్రజలు భారత్‌లో బేషరతుగా, సంపూర్ణంగా విలీనానికి సిద్ధంగా ఉన్నారు" అని చాటి చెప్పారు. అంతకు ముందు డా. ముఖర్జీ, వి.జి. దేశపాండే, పండిత ప్రేమనాథ్ డోగ్రాల పర్యటన కారణంగా జమ్మూ అంతటా నిరసన వెల్లువలు పెల్లుబికాయి.

రోజులుగడచినకొద్దీ అది ఒక బ్రహ్మాండమైన ప్రజాఉద్యమంగా మారింది. డిసెంబర్ నెలచివరిలో 'విలీనం లేకపోతే పన్నులులేవు' అనే పిలుపు ఇవ్వడం జరిగింది. ఈ ఉద్యమానికి మతతత్వపు రంగు పులమాలని నెహ్రూ, అబ్దుల్లాలు ప్రయత్నించారు. కానీ ముస్లింలు కూడా పెద్దసంఖ్యలో ఉద్యమంలో పాల్గొనడంతో నెహ్రూ-అబ్దుల్లాల ప్రయత్నం వమ్మయింది. జమ్మూప్రాంతంలో పశ్చిమసరిహద్దుకు సమీపంలోని చాంబ్ వద్ద సత్యాగ్రహంలో అనేకగ్రామాల ప్రజలు పూర్తిగా పాల్గొన్నారు. తాలూకా కార్యాలయం మీద త్రివర్ణపతాకం ఎగుర వేయడానికి వెళ్ళారు. ఆ ప్రయత్నంలో మేలారాం అనే స్వయంసేవక్ పోలీసుల కాల్పులకు నేలకూలాడు. చేతిలో త్రివర్ణపతాకంతో నేలకూలిన ఆ మేలారాం జమ్మూప్రజల పోరాటాలు, త్యాగాలకు ఒక జ్వలంత ప్రతీకగా నిలిచాడు.

జమ్మూలో పెల్లుబుకుతున్న అసంతృప్తిని బలప్రయోగంతో, భీతావహాన్ని సృష్టించి అణచివేయాలని పాలకులు నిర్ణయించారు. డా.ముఖర్జీ విజ్ఞప్తిని పెడచెవినపెట్టారు. వందలాది సంఘ, జనసంఘ, హిందూ మహాసభ కార్యకర్తలను ఢిల్లీలో అరెస్ట్ చేశారు. వారి కార్యాలయాలపై అకస్మాత్తుగా దాడి జరిపి, సోదాచేశారు. రామరాజ్యపరిషత్, హిందూమహాసభలకు చెందిన సత్యాగ్రహులు కూడా ఈ సత్యాగ్రహాలలో పాల్గొన్నారు.

పొరుగున ఉన్న పంజాబ్‌లో కూడా అమానుష లాఠీఛార్జీలు, బాష్ప

వాయు ప్రయోగాల కథే కొనసాగింది. సత్యాగ్రహుల కాళ్ళు విరిగాయి, తలలు పగిలాయి. చివరకు ప్రతిష్ఠితులైన పెద్దలు, స్త్రీలను కూడా వదిలిపెట్టలేదు. ఉత్తరప్రదేశ్‌లో కూడా జనసంఘ కార్యకర్తలపై పెద్దఎత్తున నిర్బంధాలు, అణచివేతల రాజ్యం సాగించారు. జైళ్ళలో కూడా హింసాకాండ కొనసాగింది. ఈ అణచివేత చర్యలు సత్యాగ్రహుల పట్టుదలను మరింత పదునెక్కించాయి. అఖిలభారతీయ ఆయుర్వేద మహాసభ అధ్యక్షులు పండిత రామనారాయణ శాస్త్రిని ఢిల్లీలో పోలీసులు తీవ్రంగా కొట్టారు. కాళ్ళతో, చేతులతో, లాఠీలతో పోలీసులు కొట్టిన దెబ్బలకు ఆయన తలపగిలి నెత్తురు ధారలా ప్రవహించసాగింది. ఆయన స్పృహ కోల్పోయారు. ఆరోజులలో శ్రీ శాస్త్రి బేగం అబ్దుల్లాకు వ్యక్తిగత వైద్యులుగా ఉండేవారు. పోలీసుల పాలిటపడిన మరొకవ్యక్తి అలహాబాద్ విశ్వవిద్యాలయంలో ఆంగ్లశాఖాధిపతిగా ఉన్న శ్రీ శివధర్‌పాండే. నిర్దాక్షిణ్యంగా పోలీసులు కొట్టినదెబ్బలకు ఆయనకు బాగా రక్తస్రావం జరిగింది. తీవ్రమైన నరాల బలహీనతకు ఆయన లోనయ్యారు. ఢిల్లీ మేజిస్ట్రేట్, ఇంకా అనేకమంది పార్లమెంటు సభ్యులు, నలుగురు కేంద్రమంత్రులు ఆయన దగ్గర చదువు నేర్చుకున్నవారేనని మనం గుర్తుచేసుకోవాలి.

వివిధ ప్రాంతాలలో డా. ముఖర్జీ విస్తృత పర్యటన కొనసాగుతూనే ఉంది. అప్పటికే కాశ్మీర్‌లో 11 దిన, వార పత్రికల ప్రవేశాన్ని నిషేధించారు. కాశ్మీర్‌లో ముద్రింపబడే నాలుగు పత్రికలను కూడా మూసివేయించారు.

లఢక్ ప్రాంతంలో ఎదురులేని నాయకుడైన శ్రీ కుశక్ బకుల కాశ్మీర్ భారత్‌లో పూర్తిగా విలీనం కావడాన్ని సమర్థించారు. అది జరుగకపోతే లఢక్ ప్రజలు టిబెట్‌లో చేరిపోయే ప్రమాదం ఉందని ఆయన హెచ్చరించారు.

మార్చి 1953లో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ అఖిలభారతీయ ప్రతినిధిసభ సత్యాగ్రహులపై సాగుతున్న హింస, దమనకాండలను నిరసిస్తూ, జమ్మూ-కాశ్మీర్ ప్రభుత్వాన్ని, కేంద్ర ప్రభుత్వాన్ని హెచ్చరించింది. న్యాయసమ్మతము, దేశభక్తిపూరితము అయిన ప్రజా పరిషత్ కోర్కెలు ఆమోదించవలసిందిగా కోరింది.

చివరికి డా.ముఖర్జీ స్వయంగా జమ్మూ-కాశ్మీర్‌కు తన మహాప్రస్థా

నాన్ని ప్రారంభించడంతో అంతిమ ఘట్టం ప్రారంభమైంది. 1953 మే 11న మధోపూర్ వంతెన వద్ద ఆయన జమ్ములో ప్రవేశించగానే ఆయన ప్రవేశాన్ని నిషేధిస్తూ ఒక ఉత్తర్వును ఆయనకు అందజేశారు. దానిని ఆయన తిరస్కరించడంతో ఆయనను అరెస్ట్ చేసి జైలుకు తరలించారు. ఉద్యమం మరింత తీవ్రరూపం దాల్చింది. 'జమ్మూ చలో' రణనినాదంతో అనేకమంది పార్లమెంట్ సభ్యులు, ఇతరప్రముఖులు వివిధప్రాంతాలలో ఉద్యమ జ్వాలలలోకి దూకారు.

జూన్‌నాటికి పోలీసులు విచక్షణా రహితంగా జరిపిన కాల్పులలో మృతుల సంఖ్య జమ్మూలో 37కు చేరింది. జమ్మూజైలులో సత్యాగ్రహుల మీద అమానుషంగా లాఠీ ఛార్జి చేసారు. ఆఖరికి ప్రేమనాథ్ డోగ్రానుసైతం వారు విడిచిపెట్టలేదు. షేక్ అబ్దుల్లా పార్టీ అయిన నేషనల్ కాన్ఫరెన్స్ (పూర్వపు ముస్లింకాన్ఫరెన్స్) కూడా తన విధానాలలో మార్పులు చేసింది. దాని కార్యనిర్వాహక సభ్యులు 19 మందిలో 14 మంది కాశ్మీర్ భారత్‌లో విలీనం కావాలని కోరారు.

## బలిదానం సాధించిన ఘనవిజయం:

జూన్ 23 నాడు జమ్మూజైలులో శ్రీశ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ మరణించారు అన్న వార్త దేశం మొత్తాన్ని కుదిపివేసింది. జమ్మూలోకి ఆరోగ్యంగా నడచివెళ్ళిన ఆ మహామనీషి శవమై తిరిగి వచ్చారు. ఆయన మరణం సహజమైనది కాదనడానికి, వైద్యపరంగా జరిగిన హత్య అనడానికి అనేక ఆధారాలు లభించాయి. మొదటిసారిగా జాతీయపత్రికలు, షేక్‌అబ్దుల్లా స్వతంత్రకాశ్మీర్ కోసం చేస్తున్న కుట్రలను గురించి స్పష్టంగా వ్రాయసాగాయి.

మరొకప్రక్క పాక్ అనుకూలవర్గం కాశ్మీర్‌లో జనవాక్య సేకరణ జరగాలని పట్టుబట్టసాగింది. కాశ్మీర్‌ను పాకిస్తాన్‌కు అప్పగించడం కోసం జరుగుతున్న ఆ కుట్రను ప్రజాపరిషత్ బట్టబయలు చేసింది. 1953 ఆగస్ట్‌లో శ్రీ గురూజీ నాగపూర్‌లో జరిగిన ఒక ఉత్సవంలో ప్రసంగిస్తూ "కాశ్మీర్‌పై ఒకవేళ జనవాక్యసేకరణ జరుపవలసి వస్తే అది కేవలం కాశ్మీర్‌లో కాక దేశమంతటా జరగాలి. కేవలం కాశ్మీర్‌కే దానిని పరిమితం చేయడం మిగిలినదేశాన్ని వంచించడమే అవుతుంది." అని స్పష్టంగా పేర్కొన్నారు.

హటాత్తుగా పరిస్థితులు తల్లక్రిందులై అందరినీ ఆశ్చర్యపరచాయి. 1953 ఆగస్ట్ 9న షేక్ అబ్దుల్లాను పదవినుండి తొలగించి, అరెస్ట్ చేశారు. అతని కుట్ర బైటపడింది. ఆఖరికి నెహ్రూకూడా ఆయనను కాపాడలేక పోయాడు. ఆగస్ట్ 21న తిరుగుబాటు జరిపి సదర్-ఎ-రియాసత్‌ను (తరువాతికాలంలో గవర్నర్) నిర్బంధించి, భారత అనుకూలవర్గాల పీకనులిమి, ఐక్యరాజ్యసమితి మద్దతుతో కాశ్మీర్‌ను స్వతంత్రరాజ్యంగా ప్రకటించాలని అబ్దుల్లా ప్రణాళిక వేశాడు. ఈ అంతర్జాతీయ సమితి గురించిగానీ, కాశ్మీర్‌లో దాని ఏజెంట్లను గురించి గానీ గతచరిత్ర అందరికీ తెలిసినదే. సామ్రాజ్యవాద దేశాలన్నీ షేక్‌ను సమర్థించడానికి ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాయన్న విషయంలో ఎవరికీ సందేహం లేదు.

స్వయంసేవకుల తోడ్పాటుతో ప్రజాపరిషత్ నిర్వహించిన ఉద్యమం సరియైనదేనని ఆ విధంగా ఋజువయింది. భారతదేశానికి మణికిరీటం లాంటి కాశ్మీర్ ఆవిధంగా రక్షింపబడింది. అది జమ్మూ-కాశ్మీర్ ప్రజల రెండవ స్వాతంత్ర్య పోరాటం. అయితే ఈ పోరాటం జాతీయప్రభు త్వంపైన జరుపవలసి వచ్చింది. ఆనాటి పోరాటంలో స్వయంసేవకులు కార్చిన కన్నీరు, ఓడ్చిన నెత్తురు వృధాకాలేదు. వారి మరణానంతరమే కావచ్చు, కానీ ఆ మృతవీరుల జీవనస్వప్నాలకు సార్థకత లభించింది.

షేక్‌అబ్దుల్లా తొలగింపు, అరెస్ట్‌లతో భారతప్రభుత్వవైఖరిలో మౌలి కమైన మార్పు ప్రారంభమైందని చెప్పవచ్చు. కాశ్మీర్‌ను దేశంలో మరింతగా విలీనం చేయడానికి ఆ తరువాత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ స్థాయిలలో అనేక చర్యలు తీసుకునేందుకు మార్గం సుగమం అయింది.

i. అంతకు ముందు బైటనుండి ఎవరైనా కాశ్మీర్ వెళ్ళాలన్నా, కాశ్మీర్ నుండి ఎవరైనా దేశంలోని ఇతర ప్రాంతాలకు వెళ్ళాలన్నా 'పర్మిట్' (అనుమతిపత్రం) అవసరం ఉండేది. దానిని రద్దు చేశారు.

ii. ఆర్థికవిషయాలలో రాష్ట్రం కేంద్రం పరిధిక్రిందకు వచ్చింది. భారత కంట్రోలర్ జనరల్ అధికారాలు జమ్మూ-కాశ్మీర్‌కు విస్తరింపచేశారు. అప్పటి వరకు రాష్ట్రానికి స్వతంత్ర ఆర్థిక వ్యవస్థ ఉండేది.

iii. భారత రాజ్యధ్వజమే జమ్మూ-కాశ్మీర్‌కు కూడా ధ్వజం అయింది.

iv. సదర్-ఎ-రియాసత్ పేరును గవర్నర్‌గాను, కాశ్మీర్ ప్రధానమంత్రిని ముఖ్యమంత్రిగాను మార్చారు.

v. ఎన్నికల కమీషన్, సుప్రీంకోర్టుల అధికారాలను జమ్మూ-కాశ్మీర్‌కు వర్తింపజేశారు.

vi. అంతకు ముందు వర్తించని అనేక కేంద్రశాసనాలు ఆరాష్ట్రంలో కూడా అమలులోకి వచ్చాయి.

1954లో ప్రజాపరిషత్ భారతీయ జనసంఘ్‌లో విలీనం అయింది. రాష్ట్ర రాజకీయాలను జాతీయజీవనంలోనికి చేర్చడంలో అది మొదటి మెట్టు అయింది.

## మినీ పాకిస్తాన్‌కు తీవ్ర నిరసన:

1967లో కమ్యూనిస్టుల నాయకత్వంలోని యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం కేరళలో అధికారంలోకి వచ్చింది. ముస్లింలీగ్ అందులో ఒక భాగస్వామ్య పక్షం. దేశవిభజనకు పూర్వం ప్రత్యేకముస్లిం జిల్లా 'మోప్లాస్థాన్' కోసం వారు కలలు కనేవారు. ఇప్పుడు దానికోసం ఆందోళన ప్రారంభించారు. అదేసమయంలో పాకిస్తాన్ 10వేలమంది కేరళముస్లింలతో ఒక ప్రత్యేక నౌకాదళాన్ని తయారు చేసింది.

మొట్టమొదట పాకిస్తాన్‌కు రూపకల్పన చేసినవాడు చౌదరి రహ్మత్ఆలీ. (వాస్తవానికి ఆపథకాన్ని లండన్‌లోని బ్రిటీష్ అధికారులు తయారు చేశారు) ఆయన పాక్‌కూటమిలో ఒక స్వతంత్ర రాష్ట్రంగా 'మోప్లాస్థాన్' ను పరిగణించాడు. ముస్లింలీగ్ అధ్యక్షుడైన మహమ్మద్ ఇస్మాయిల్ పార్లమెంటు సభ్యుడైన సేతీసాహెబ్‌కు వ్రాసిన లేఖలో "నేను ఖైద్-ఎ-అజమ్‌తో ప్రత్యేక మోప్లాస్థాన్ గురించి చర్చించాను. స్వతంత్ర హిందుస్థాన్ రాజ్యాంగపరిషత్ ముందు మీ కోర్కెను ఉంచమని ఆయన సలహా ఇచ్చారు. ఏమైనప్పటికీ అసెంబ్లీవెలుపల ఉద్యమాన్ని నిర్వహించడం మంచిది. సరియైన సమయంలో దానిని పాకిస్తాన్‌తో కలుపవచ్చు" అనివ్రాశాడు.

కమ్యూనిస్టుల ఆధిపత్యంలోని యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం ముస్లింలీగ్ ఒత్తిడికి లొంగి ముస్లిం ఆధిక్యతగల మల్లపురంజిల్లా ఏర్పాటుకు అంగీకరించింది. జాతీయపత్రికలన్నీ ఆ చర్యను దుయ్యబట్టాయి. హిందుస్థాన్ టైమ్స్ పత్రిక ఒక ప్రత్యేక వ్యాసం వ్రాస్తూ "ఇది దురుద్దేశంతో కూడిన చర్య. మత పరమైన సమస్యలను ఇది రేకెత్తించి తీరుతుంది" అని అభిప్రాయపడింది. టైమ్స్ ఆఫ్ ఇండియా 'ఇది ముస్లింలీగ్‌ను బుజ్జగించడానికి చేసినపని. కేరళలో వేర్పాటువాదులను ప్రోత్సహించడమే ఈ చర్య. అంతేకాదు. ఇతరరాష్ట్రాలలో కూడా ఇలాంటి కోర్కెలు తలెత్తవచ్చు' అని ఆందోళన వ్యక్తం చేసింది. కలకత్తానుండి వెలువడే

హిందుస్థాన్ స్టాండర్డ్ "మోప్లాస్థాన్ ఏర్పాటు జాతి భద్రతకు భంగం కలిగిస్తుంది. పాకిస్తాన్ ప్రచారానికి అనుకూలమైన ప్రాంతంగా మారుతుంది" అనిస్పష్టంగా హెచ్చరించింది. బొంబాయి నుండి వెలువడే ఫ్రీప్రెస్ జర్నల్ "ప్రమాదాన్ని సూచిస్తున్న కేరళలోని మినీ పాకిస్తాన్ యోజన" అనే శీర్షికన ఇలావ్రాసింది. "కమ్యూనిస్టులు, ముస్లిం మతమౌఢ్యులు ఏకమై రాజ్యాంగపద్ధతుల ద్వారానే జాతీయసమైక్యతను దెబ్బతీయడానికి కుట్రలు పన్నుతున్నారు."

ఈ విధంగా కమ్యూనిస్టులు, ముస్లింలు కుమ్మక్కై వ్యవహరించడం జాతివ్యతిరేకంగా తయారయ్యే ప్రమాదముందని భావించిన జాతీయవాదులు ప్రముఖగాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధులు అయిన శ్రీ కేలప్పన్ నాయకత్వాన భారతీయ జనసంఘ్ ఆధ్వర్యంలో సత్యాగ్రహాన్ని ప్రారంభించారు. 1969 జూన్ 2 వ తేదీ నుండి కాలికట్ కలెక్టర్ కార్యాలయం ముందు రోజూ 20 నుండి 30 మంది సత్యాగ్రహులు పికెటింగ్ చేస్తూ వచ్చారు. జూన్ 6వతేదీన క్రొత్తజిల్లా ప్రకటన జరిగింది. ఆరోజున శ్రీకేలప్పన్ నాయకత్వంలో సత్యాగ్రహం జరిగింది. నల్లజెండాలతో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. సత్యాగ్రహంలో పాల్గొన్న జనసంఘ్ అఖిలభారత అధ్యక్షులైన శ్రీబచ్‌రాజ్ వ్యాస్‌ను 15రోజుల పాటు జైలులో నిర్బంధించారు. రోజులుగడుస్తున్న కొద్దీ వివిధ ప్రాంతాల నుండి వెల్లువలా సత్యాగ్రహులు రాసాగారు. వారిసంఖ్య వేలల్లోకి చేరింది.

ఆసమయంలో ముస్లింలీగ్ పార్లమెంట్ సభ్యుడు ఇబ్రహీం సులేమాన్ సేఠ్ చేసిన ప్రకటన జాతీయవాదులు భయపడినదంతా నిజమేనని ఋజువు చేసింది. సులేమాన్ తన ప్రకటనలో "ప్రత్యేకమైన ముస్లిం జిల్లాను ఏర్పాటు చేయడం భారతదేశంలోని ముస్లింలందరికీ ఉత్తేజాన్ని కలిగించింది" అన్నారు.

తరువాత ప్రభుత్వం తీసుకున్న చర్యలు మోప్లాస్థాన్ అవతరణకు అనుకూలంగా ఉన్నాయి. కాలికట్ విశ్వవిద్యాలయానికి మొదట కాలికట్ నగరానికి ఉత్తరదిశలో 13 కి మీ. దూరంలో శంకుస్థాపన చేశారు. తరువాత అస్థలాన్ని 20 కి.మీ. దక్షిణానికి మార్చారు. విశ్వవిద్యాలయం మల్లపురం జిల్లాలో ఉండాలని అలా చేసారు. ఒక అరబ్బీ మౌల్వీని ప్రాచ్య విభాగానికి డీన్‌గా నియమించారు. ఆరు ముస్లిం కళాశాలలతో విశ్వవిద్యాలయం ప్రారంభమైంది. అందులో రెండు కళాశాలలు కేవలం

ఉర్దూ, అరబ్బీ మాత్రమే బోధించేవి. ఒక్కటిమాత్రమే హిందూకళాశాల. అదే ఇస్లామీకరణ విధానం నేటికీ కొనసాగుతోంది.

## పరోక్ష దురాక్రమణ గురించి హెచ్చరిక:

దేశవిభజన ప్రధానంగా సరిహద్దు ప్రాంతాలలో మన జాతీయ సమైక్యతకు, సార్వభౌమాధికారానికి ఒక కొత్త ప్రమాదాన్ని సృష్టించింది. సరిహద్దు రాష్ట్రాలలోనికి ముస్లింలను ప్రవేశపెట్టడం ద్వారా హిందువులసంఖ్యను తగ్గించే ప్రయత్నాన్ని తూర్పున బాంగ్లాదేశ్, పశ్చిమాన పాకిస్తాన్ చేయసాగాయి. మనదేశంలోని పాకిస్తానీ తొత్తుల పెదాలపై తరచు వినిపిస్తూ ఉండిన నినాదం 'హస్‌తే లియేహై పాకిస్థాన్; లడ్‌కే లేంగే హిందుస్థాన్' అనేది. (ఆడుతూపాడుతూ పాకిస్తాన్‌ను సాధించుకున్నాం. పోరాడిహిందుస్థాన్ సాధించుకుంటాం). నేడు దానిని 'ఘుస్‌కే లేంగే హిందుస్థాన్'.... దొంగచాటుగా జొరబడి హిందుస్థాన్‌ను సాధిస్తాం... అని మార్చుకోవచ్చు.

## అస్సాం:

దేశవిభజనకు ముందు నుండే ఒక పథకం ప్రకారం తూర్పుబెంగాల్ నుండి ముస్లింలు అస్సాంలో ప్రవేశించసాగారు. 1906లోనే ఢాకానవాబు సమీఉల్లాఖాన్ బెంగాలీముస్లింలను అస్సాంలో ప్రవేశించి, దానిని ముస్లిం ఆధిక్యరాష్ట్రంగా మార్చవలసిందని ప్రేరేపించాడు. 1921, 1931 సంవత్సరాల నివేదికలో జనాభాలెక్కల అధికారి 'ఈ విధంగా తూర్పుబెంగాల్ ముస్లింలు అస్సాంలో ప్రవేశించడం కొనసాగితే జనాభాసరళి 50 సం.లలో పూర్తిగా మారిపోతుంది. అస్సాం జీవనవిధానాన్ని మనం ఒక్క శివసాగర్ జిల్లాలో మాత్రమే చూడగలుగుతాం.' అని హెచ్చరించాడు. కానీ అది కొనసాగుతూనే వచ్చింది. 1939లో బెంగాల్‌లో ముస్లింలీగ్ మంత్రివర్గం ఏర్పడడంతో అది మరింత వేగాన్ని పుంజుకుంది.

1947 తరువాతకూడా అస్సాంలోని కాంగ్రెస్ మంత్రివర్గంలో ఉన్న ముస్లిం మంత్రుల అండదండలతో దొంగచాటుగా ముస్లింల ప్రవేశం కొనసాగింది.

1947కు ముందు అస్సాంలో బెంగాలీముస్లింల అక్రమప్రవేశాన్ని అగ్రశ్రేణి జాతీయ నాయకులైన గాంధీజీ, సుభాష్ చంద్రబోస్, సావర్కర్, ఆఖరికి నెహ్రూ కూడా గట్టిగా విమర్శించారు. విచిత్రమేమిటంటే

1947 తరువాత స్వయంగా అస్సాంలోని కాంగ్రెస్ ప్రభుత్వమే ఈ అక్రమ ప్రవేశకులకు సహాయంచేసే ఒక సాధనంగా మారింది. రానున్న ప్రమాదాన్ని గురించి ఆనాడు అఖిలభారత నాయకులలో మాట్లాడినవారు కేవలం శ్రీగురూజీ ఒక్కరే. 1950 దశకపు ప్రారంభంలోనే అస్సాం ప్రజలను, ప్రభుత్వాన్ని వారు ఈ దురాక్రమణల వల్ల కేవలం అస్సాంకే గాక, మొత్తం దేశ భద్రతకు, రక్షణకు ముప్పువాటిల్లగలదని హెచ్చరించారు.

1950-51లో వారు అస్సాంలో పర్యటించారు. ఆ తరువాత తూర్పుపాకిస్తాన్ నుండి ముస్లింలు పెద్దసంఖ్యలో జొరబడడం వల్ల ఎటువంటి ప్రమాదాలు ఎదురయ్యేది వివరిస్తూ ప్రధాన మంత్రికి ఒక లేఖవ్రాసారు. 1964-65లో భారతీయ జనసంఘ్ చొరవతీసుకుని అక్రమ ప్రవేశాన్ని నిరోధించేందుకు ప్రముఖులతో ఒక కమిటీని ఏర్పాటుచేసింది. ఆ కమిటీ అస్సాం గవర్నర్‌కు, ప్రధానమంత్రి శ్రీలాల్ బహదూర్ శాస్త్రికి విజ్ఞాపన పత్రం సమర్పించింది. మన దేశంలోనికి పెద్దఎత్తున అక్రమప్రవేశం జరుగుతోందన్నది వాస్తవమేనని ప్రభుత్వం కూడా అంగీకరించింది. వెంటనే హోంమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా, హోంశాఖ కార్యదర్శి శ్రీ ఎల్.పి.సింగ్, కేంద్ర ఇంటిలిజెన్స్ విభాగపు అధిపతి శ్రీ మల్లిక్‌లు అస్సాంలో పర్యటించారు. ప్రత్యక్షంగా పరిస్థితిని సమీక్షించి, అంచనా వేసిన తరువాత ప్రత్యేక ట్రిబ్యునల్స్‌ను ఏర్పాటుచేసారు. ఆ ట్రిబ్యునల్స్ బాగా పరిశీలించిన మీదట 2,20,000 మందిని విదేశీయులుగా గుర్తించి త్రిప్పిపంపివేశాయి. 1960 దశకపు ప్రారంభదినాలనుండి స్వయంసేవకులు నడుపుతున్న 'ఆలోక్' అస్సామీవారపత్రిక పెరుగుతున్న ఈ అక్రమప్రవేశకుల సంఖ్యను, దానివల్ల ఉత్పన్నమయ్యే దుష్పరిణామాలను గురించి అస్సాం ప్రజలను జాగృతం చేయడంలో ప్రముఖపాత్ర వహించింది.

35 లక్షల బంగ్లా ముస్లింల అక్రమ ప్రవేశం రూపంలో అస్సాంలో పడగవిప్పిన ప్రమాదాన్ని ఈనాడు దేశమంతా గుర్తిస్తోంది. 1978 నుండి ఆల్ అస్సాం స్టూడెంట్స్ యూనియన్ (ఆసు) చేపట్టిన పెద్ద ఉద్యమం కారణంగా దేశప్రజల దృష్టిలోకి ఈ విషయం వచ్చింది. మొదటిగా ఈ సమస్యను సరిగ్గా విశ్లేషించిన వారు శ్రీబాలాసాహెబ్ దేవరస్. అస్సాంలోకి ప్రవేశిస్తున్న లక్షలాది హిందువులు శరణార్థులు. బాంగ్లాదేశ్‌లోని ముస్లిం ప్రభుత్వం వారిని తరిమివేస్తోంది. వారికి ఆశ్రయం, రక్షణ కల్పించడం మన విద్యుక్తధర్మం. అయితే రెండవ వైపున ఆరాష్ట్రాన్ని ఇస్లామిక్ అస్సాంగా మార్చేందుకై దశాబ్దాలతరబడి సాగుతున్న కుట్రలో భాగంగా బాంగ్లాదేశ్ ప్రభుత్వం పథకం ప్రకారం అస్సాంలోకి పంపుతున్న

బంగ్లాదేశ్ ముస్లింలు 'అక్రమ ప్రవేశకులు'. దేశంలో హిందువులు అల్ప సంఖ్యాకులుగా మారిన ప్రతి ప్రాంతంలోనవుతున్న దుస్థితిని గురించి శ్రీ బాలాసాహెబ్ అస్సాం హిందువులను హెచ్చరించారు. ఆయాప్రాంతాలు మాతృభూమి నుండి ఖండించబడ్డాయని, అక్కడి హిందువులు ఊచకోత కోయబడ్డారని చరిత్ర సాక్ష్యం చెబుతున్నది. అనేక బహిరంగసభ లలో, ముఖ్యంగా అస్సాంలో, శ్రీ బాలాసాహెబ్ అస్సాంను హిందూ ఆధిక్యత కలిగిన ప్రాంతంగా పరిరక్షించవలసిన ప్రధానఅవసరాన్ని నొక్కి వక్కాణించారు.

వాస్తవాలను ప్రజలకు తెలియజేసేందుకు, హిందువులలో ఐకమత్యాన్ని నిర్మాణం చేసేందుకు విశ్వహిందూపరిషత్ ఈశాన్యరాష్ట్రాలలో 27 హిందూసమ్మేళనాలు నిర్వహించింది. సాధారణ హిందూ సమాజాన్ని, ముఖ్యంగా గ్రామీణ హిందువులను ముస్లింల పన్నాగాలను, వాటిని సమైక్యంగా ఎదుర్కొనవలసిన పద్ధతులను గురించి జాగరూకులను చేసేందుకై చాలాకాలం పాటు కరపత్రాల పంపిణీ ఉద్యమం సాగించింది.

అస్సామీ హిందువులను, బెంగాలీ హిందువులను భాషల ఆధారంగా ఒకరిపై ఒకరిని రెచ్చగొట్టడం, తమకు అనుకూలంగా ఉండేపక్షం వహించి ఇరువురిపైన అత్యాచారాలు చేయడం లాంటి ముస్లింల కుతంత్రాలను గురించి 1950 ప్రారంభదినాలనుండి శ్రీ గురూజీ బహిరంగంగా హెచ్చరిస్తూ ఉండేవారు. నాటినుండి స్వయంసేవకులు అస్సామీ హిందువులు, ఇతరహిందువుల.... ప్రధానంగా బెంగాలీ హిందువుల... మధ్యనున్న అపోహలను దూరం చేయడానికి ఎంతోకృషి చేస్తూవచ్చారు.

అస్సాం సమస్యను గురించి దేశప్రజలకు తెలియజెప్పడంలో అఖిల భారతీయ విద్యార్థిపరిషత్ జాతీయస్థాయిలో నిర్వహించిన పాత్ర ఎంతో ప్రముఖమైనది. ప్రతినియోజకవర్గాన్ని నిశితంగా పరిశీలించి, విదేశీయుల పేర్లను ఓటర్ల జాబితానుండి తొలగించవలసిందని అధికారులను విద్యార్థి పరిషత్ గట్టిగా కోరింది. ఈ విషయాన్ని గురించి తెలుపుతూ ఎన్నికల కమీషనర్ శ్రీ షక్ధర్‌కు 1981లో వారు ఒక వినతిపత్రాన్ని సమర్పించారు. అస్సాం సమస్యను దేశమంతటికీ తెలియజెప్పడంలో విద్యార్థిపరిషత్ ఢిల్లీలో 1981లో నిర్వహించిన జాతీయ సదస్సు ఎంతగానో ఉపకరించింది. 'సేవ్ అస్సాం టుడే; టు సేవ్ ఇండియా టుమారో' (రేపు భారత్‌ను కాపాడాలంటే నేడు అస్సాంను కాపాడండి) అనే నినాదంతో పరిషత్ 1983 అగస్ట్ 15న ఒక బ్రహ్మాండమైన

ఉద్యమాన్ని నిర్వహించింది. దానికి దేశంలోని అన్నివర్గాల నుండి అపూర్వ ఆదరణ లభించింది. ఆసు, ప్రభుత్వం, ప్రతిపక్షాలు కలిసి సమస్యకు పరిష్కారం కోసం త్రైపాక్షికచర్చలు జరపాలని వివిధరాజకీయ పక్షాల అగ్రనాయకులు, ప్రముఖ పత్రికారచయితలు, అస్సాం, బెంగాల్ లకు చెందిన సర్వోదయనాయకులు ముక్తకంఠంతో కోరారు. విదేశీయులను గుర్తించి, వారి పేర్లను ఓటర్ల జాబితాల నుండి తొలగించాలని, 1961 జనాభాలెక్కలు ప్రాతిపదికగా విదేశీయులను దేశం నుండి పంపివేయాలని వారు ప్రభుత్వాన్ని గట్టిగా కోరారు. 'జాతీయ పౌరుల జాబితా' (నేషనల్ రిజిష్టర్ ఆఫ్ సిటిజెన్స్)ను తయారు చేయాలని వారు వాదించారు. 250 జిల్లాలలో 'అస్సాంను రక్షించండి' నినాదంతో పెద్ద ఎత్తున సదస్సులు, సమావేశాలు నిర్వహించారు.

1983 అక్టోబర్ 2వ తేదీన గాంధీజయంతిని పురస్కరించుకుని సత్యాగ్రహులు దేశం నలుమూలలనుండి గౌహతికి చేరుకోసాగారు. సత్యాగ్రహానికి వేదికగా జడ్జెస్ ఫీల్డ్‌ను ఎన్నుకున్నారు. ప్రభుత్వం అనేకమంది సత్యాగ్రహులను మార్గంమధ్యలోనే నిలిపివేసింది. అయినప్పటికీ వెయ్యిమంది సత్యాగ్రహులు సమావేశ స్థలానికి చేరుకోగలిగారు. వారిని మైదానంఖాళీ చేసి వెళ్ళి పోవలసిందిగా పోలీసులు ఆజ్ఞాపించారు. "మీరుమమ్మల్ని గవర్నర్‌కు మాకోర్కెల పత్రం అందించనివ్వండి లేదా అరెస్ట్ చేయండి" అని సత్యాగ్రహులన్నారు. పోలీసులు రెండూ చేయలేదు. లాఠీఛార్జి చేశారు. స్త్రీలను కూడా చితకబాదారు. సత్యాగ్రహులు పారిపోలేదు. తిరగబడలేదు. రక్తాలు కారుతున్నా లెక్కజేయక 'భారత్ మాతాకీ జయ్' అంటూ అలాగే నిలబడి ఉండిపోయారు. గాంధీ జయంతినాడు వారాయనకు నిజమైన నివాళులర్పించారు.

చివరకు తమలాఠీలు ఎందుకు కొరగావని పోలీసులు గుర్తించారు. సత్యాగ్రహులందరినీ అరెస్ట్ చేసి సుదూర మేఘాలయ తదితర ప్రాంతాలకు, అడవులలోకి తీసుకుని పోయారు. అక్కడ వారిని అనేకవిధాలుగా హింసించారు. అనేకఅగ్రశ్రేణి అస్సాం పత్రికలు ఈ విషయాన్ని ప్రముఖంగా ప్రచురించాయి. 'గాంధీజయంతినాడు గాంధేయవాదులపైన దాడి' అని వ్రాసాయి.

## బెంగాల్‌లో:

అయితే పశ్చిమ బెంగాల్‌లో ప్రజలు, నాయకులు అస్సాం ఉద్యమం తమకు ప్రమాదకరమైనదని భావిస్తూవచ్చారు. వివిధపత్రికలు, నాయ

కులు కూడా అస్సాంలో నివసిస్తున్న బెంగాలీలను తరిమివేస్తారని, తమరాష్ట్రంలోకి వారు శరణార్థులై పారిపోయివస్తారని అపప్రచారం సాగించారు. ఈ అపోహలను తొలగించడానికి విద్యార్థిపరిషత్ తీవ్రమైన కృషి చేసింది. 'పూర్వాంచల అక్రమప్రవేశకుల నిరోధసమితి'ని ఏర్పాటు చేసింది. బెంగాల్‌తో సహా వివిధరాష్ట్రాలలో అక్రమప్రవేశకుల వల్ల ఉత్పన్నమయ్యే సమస్యలను గురించి సవివరంగా ప్రజలకు తెలియజేశారు. కలకత్తాలో జరిగిన ఒక సదస్సులో బెంగాల్, అస్సాం, బీహార్, త్రిపుర, రాజస్థాన్, గుజరాత్ రాష్ట్రాల నాయకులు పాల్గొన్నారు. వారు తమతమ రాష్ట్రాలలో అక్రమప్రవేశకులెందరున్నారో, తాము ఎదుర్కొంటున్న సమస్యలేవో వివరిస్తూ పత్రాలను సమర్పించారు. 1984 ఫిబ్రవరి నెలలో నేటి అస్సాం ముఖ్యమంత్రి అయిన ప్రఫుల్లకుమార్ మహంతా, జస్టిస్ హెచ్. ఆర్.ఖన్నా, జగ్‌జిత్‌సింగ్ అరోరా, రాంజెఠ్మలానీ, సమర్‌గుహ మొదలైన సార్వజనీన జీవనంలో ప్రముఖులైన పెద్దలు ఒక సదస్సులో పాల్గొన్నారు. మొట్టమొదటిసారిగా కలకత్తా వాసులకు తమరాష్ట్రం కూడా ఎటువంటి ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నదో అర్థమైంది. సరిహద్దు జిల్లాలలో ప్రత్యేకంగా జనాభాలెక్కల సేకరణ జరగాలని, జాతీయపౌరుల జాబితా తయారుచేయాలని సదస్సు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

పశ్చిమబెంగాల్‌లో ఎంతపెద్దఎత్తున అక్రమప్రవేశం జరుగుతున్నదో నేటి వరకు బైటి ప్రపంచానికి తెలియదు. మొన్నమొన్నటి వరకు తమపై ఆవరిస్తున్న ప్రమాదపు నీలినీడల గురించి పశ్చిమ బెంగాల్ ప్రజలెరుగరు. కారణం లోక విదితమే. ప్రధాన రాజకీయ పక్షాలైన వామపక్షకూటమికి, కాంగ్రెస్‌కు ముస్లింలను విమర్శించడానికి ధైర్యం చాలదు. ఇరువర్గాల వారు బాంగ్లాదేశ్ నుంచి వచ్చిన ముస్లింల ఓట్లపై ఆశలు పెట్టుకుని ఉన్నారు. ఈ విషయాన్ని ప్రజలదృష్టికి తెచ్చిన ఘనత 'సీమాంత శాంతి-ఓ-సురక్షాసమతి'కి చెందుతుంది. నేతాజీ సహచరుడైన నిహారేందుదత్తమజుందార్ దానికి అధ్యక్షుడు. మాజీ న్యాయమూర్తి, మాజీరాయబారి, మాజీ ఎకౌంటెంట్ జనరల్ తదితరప్రముఖులు అందులోసభ్యులు. కార్యకర్తలు విస్తృతంగా పరిశోధించి, అందించిన వివరాల ఆధారంగా సమితి ఒక్క పశ్చిమబెంగాల్‌లోనే కాక, అనేక ఇతరప్రాంతాలు, పట్టణాలలో అక్రమంగా ప్రవేశించిన ముస్లింల గణాంకవివరాలను బైటపెట్టింది. పశ్చిమబెంగాల్, అస్సాంలలో 5 లక్షల చొ॥న అక్రమ ప్రవేశకులుండగా, బీహార్‌లో 12 లక్షలు, త్రిపుర, మణిపూర్, సిక్కిం, రాజస్థాన్, గుజరాత్, జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రాలలో 1 నుండి 2 లక్షల

చొ॥న, హైదరాబాద్, భోపాల్, ఢిల్లీ, బొంబాయిలలో 50వేల నుండి 3లక్షల చొ॥న ఈ అక్రమప్రవేశకులు ఉన్నారు. వీరిలో పాకిస్తాన్ నుండి వచ్చిన అక్రమప్రవేశకులు కూడా ఉన్నారు. ప్రధానంగా వారు సరిహద్దు రాష్ట్రాలలోని పట్టణాలలోనే ప్రవేశించారు. 1981 జనాభా లెక్కలనాటికే బెంగాల్‌లో 5 జిల్లాలు, అస్సాంలో ఆరుజిల్లాలు ముస్లింలు అధికసంఖ్యాకులుగా గల జిల్లాలుగా మారిపోయాయని కుడా సమితి ప్రజల దృష్టికి తీసుకుని వచ్చింది.

సమస్య తీవ్రతను గురించి పశ్చిమ బెంగాల్ పత్రికారంగానికి నిన్నమొన్ననే మెలుకువవచ్చింది. ఇప్పుడిప్పుడే ఒళ్ళుగగుర్పొడిచే వివరాలను అవి బైటపెడుతున్నాయి. స్టేట్స్‌మన్ (1985 నవంబర్3) ప్రతిసంవత్సరం బాంగ్లాదేశ్ నుండి అయిదులక్షలకు పైగా ముస్లింలు భారతదేశంలో ప్రవేశించి, ఇక్కడే తిష్ఠవేస్తున్నారని వ్రాసింది. ఆనందబజార్ పత్రిక (1985 నవంబర్ 22) బెంగాల్ జనాభాకంటే కొన్నిలక్షలు ఎక్కువ రేషన్‌కార్డుల పంపిణీ జరిగిందని వ్రాసింది. 'బర్తమాన్' బెంగాలీదిన పత్రిక 'సరిహద్దుకావలనుండి వచ్చిన ముస్లిం దుండగుల విధ్వంసకాండ ఫలితంగా పశ్చిమబెంగాల్‌లోని సరిహద్దుజిల్లాలలో నివసించే భారత పౌరులు స్వంత మాతృభూమిలోనే శరణార్థులైపోయారు. మామూలు పండుగలు, పబ్బాలలో కలుసుకోవడం కూడా అక్కడి హిందువులకు ప్రమాదకరంగా తయారైంది?' అని వ్రాసింది.

సమితి పత్రికావిలేఖరుల సమావేశాలద్వారా, బహిరంగసభలద్వారా, ప్రతినిధివర్గాలద్వారా తన ప్రచారాన్ని ఉధృతం చేయడంతో ప్రభుత్వం కూడా కదిలింది. సరిహద్దుభద్రతా దళాలసంఖ్యను మూడురెట్లు, గస్తీ కేంద్రాల సంఖ్యను ఆరురెట్లు పెంచుతున్నట్లు కేంద్రమంత్రి శ్రీ అరుణ్‌నెహ్రూ ప్రకటించారు. ప్రత్యేకరక్షణదళం (Special Task Force) ఏర్పాటు చేస్తున్నట్లు కూడా ప్రకటించారు. మొట్టమొదటిసారి ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ఈ అక్రమప్రవేశాల విషయాన్ని బాంగ్లాదేశ్ అధ్యక్షుడు జనరల్ ఎర్షాద్‌తో ప్రస్తావించారు. సమితి నాయకులు వివిధజిల్లాలలో పర్యటించారు. ప్రజలను, న్యాయవాదసంఘాలను, పత్రికావిలేఖరులను ఉద్దేశించి వారు ప్రసంగించారు. కార్మికులతో చర్చలు జరిపారు. సమితి సంస్థాగత స్వరూపాన్ని సుదృఢం చేసేందుకై ఒకరిద్దరు సంఘపూర్తిసమయ ప్రచారకులు నిర్విరామంగా రాష్ట్రమంతటా పర్యటన చేస్తూ వచ్చారు. మొన్న జరిగిన పశ్చిమబెంగాల్ అసెంబ్లీ ఎన్నికలకు ముందు సమితి ఎన్నికల కమీషన్‌కు ఒక పిటీషన్ దాఖలు చేసింది.

ఎన్నికల జాబితాలను సునిశితంగా పరిశీలన చేయాలని, లేకపోతే అనేక నియోజకవర్గాలలో విదేశీయులఓట్లు ప్రముఖపాత్ర వహించగలవని సమితి అర్థించింది. కమీషన్ ఈ చర్యల అవసరాన్ని కాదనలేదు. అయితే సిబ్బంది కొరత మొదలైన ప్రత్యేక సమస్యలున్నాయని బదులిచ్చింది.

బంగ్లాదేశ్ నుండి ఎదురౌతున్న ఈ ప్రమాదాన్ని ఎదుర్కొనడంలో హిందువుల ఆత్మస్థైర్యాన్ని సుదృఢ పరచడానికి పశ్చిమబెంగాల్‌లోని సరిహద్దు ప్రాంతాలలో వేగంగా పెరుగుతున్న శాఖలు ఎంతో సహాయపడ్డాయి. అక్రమప్రవేశం ఇకపై జరుగకుండా నిరోధించడానికి స్వయంసేవకులు, విశ్వహిందూపరిషత్ కార్యకర్తలు ఎంతో కృషిచేస్తున్నారు. ఈ ప్రయత్నాలఫలితంగా కొన్నిస్థలాలలో క్రొత్తగా అక్రమప్రవేశం చేయబోయినవారికి సరిహద్దులు దాటడమే కష్టంగా మారింది. రహస్యంగా దాగి ఉన్న అక్రమప్రవేశకులను గుర్తించి, బహిష్కరించడంలో ఈ కార్యకర్తలు ప్రభుత్వాధికారులకు సహకరిస్తున్నారు. ఈ బాధ్యతాయుతమైన కృషిలో ముస్లింలనుండి వ్యతిరేకతను ఎదుర్కొనడంతో బాటు, తరచు స్వార్థ రాజకీయశక్తుల వ్యతిరేకతను కూడా వారు ఎదుర్కొనవలసి వస్తోంది.

## బీహార్‌లో:

నానాటికీ వృద్ధిచెందుతున్న బాంగ్లాదేశీ అక్రమప్రవేశకుల ప్రమాదం విషయంలో బీహార్‌ప్రభుత్వాన్ని, పత్రికలను, ప్రజలను మేల్కొల్పేందుకు విద్యార్థిపరిషత్ కార్యకర్తలు విశేషంగా ప్రయత్నం చేస్తున్నారు. ఈ సమస్య పరిష్కారానికి కృషిచేస్తున్నట్లు పరిపాలనాయంత్రాగం చేస్తున్న ప్రకటనలు కేవలం కంటితుడుపు చర్యలు మాత్రమేనని వారు ఆరోపిస్తున్నారు. ఓటుబ్యాంకులపై ఆశతో కాంగ్రెస్ (ఐ), కమ్యూనిస్టులు ఇరువురూ ఈ బంగ్లాదేశీయులను కాపాడుతున్నారని కూడా వారు ఆరోపిస్తున్నారు. వాస్తవాలు, వివరాల ఆధారంగా ఈ ఆరోపణలను వారుచేశారు. అధికారులకు సమర్పించిన విజ్ఞాపనపత్రంలో ప్రతిజిల్లాలోనూ ఈవిషయంలో విచారణజరుపడానికి ఒకట్రిబ్యునల్‌ను నియమించాలని విద్యార్థిపరిషత్ కోరింది. 1956 పంచాయితీచట్టం, 1951 జనాభాలెక్కల నివేదిక, 1952 ఓటర్లజాబితాల ఆధారంగా ఈ అక్రమప్రవేశవిషయాన్ని పరిశీలించి, అక్రమప్రవేశకులను గుర్తించే పనిని ఈ ట్రిబ్యునల్స్ చేపట్టాలని విద్యార్థి పరిషత్ కోరింది. మొదటి మెట్టుగా విద్యార్థిపరిషత్ కార్యకర్తలు ఓటర్లజాబితాలో 20 వేల క్రొత్త పేర్లకు వ్యతిరేకంగా అభ్యంతరాలు లేవనెత్తడం ప్రారంభించారు.

## రాజస్థాన్ లో:

పాకిస్తాన్ సరిహద్దు నుండి అక్రమప్రవేశం రాజస్థాన్‌లో.... ప్రధానంగా సరిహద్దుజిల్లాలైన బర్మేర్, జైసాల్మేర్‌లలో... నిరంతర సమస్యగానే ఉంటూవచ్చింది. 1985-86లో రాజస్థాన్ కాలువ ప్రాజెక్టు సందర్భంగా భూముల పంపకం జరిగినపుడు పాకిస్తాన్ ముస్లింల ఈ అక్రమప్రవేశం స్పష్టంగా కనబడింది. భూమి కేటాయింపుకు వారుకూడా అభ్యర్థన పత్రాలు దాఖలు చేయసాగారు. వందల సంఖ్యలో తప్పుడు అభ్యర్థనలు పెట్టడంలో స్థానిక ముస్లింలు కూడా వారితో చేతులు కలిపారు. స్వయంసేవకులు వెంటనే సంబంధిత అధికారులను కలిశారు. వాస్తవాలను వారిముందు విశదీకరించారు. 1965,71 యుద్ధాల సమయంలో పాకిస్తాన్‌నే కోరుకుని వెళ్ళిపోయి, మళ్ళీ ఇప్పుడు తిరిగివచ్చి ఈ సారవంతమైన భూములను పొందగోరుతున్న ముస్లింల జాబితాలు పత్రికలలో ప్రకటించారు. ఫలితంగా వారి అభ్యర్థన పత్రాలు తిరస్కరించ బడ్డాయి.

మొట్టమొదటిసారి, స్వయంసేవకుల ప్రోత్సాహంతో అసలు అక్రమ ప్రవేశకుల కారణంగా తలెత్తుతున్న రకరకాల సమస్యలు, ప్రమాదాలపై సవిస్తరంగా ఒక విజ్ఞాపన తయారు చేయబడింది. దానిని 1985 ఆగస్ట్ 10 నాడు సీమాజనకళ్యాణసమితి ప్రధానమంత్రి జైసాల్మేర్ సందర్శించిన సందర్భంలో అందజేసింది. ముఖ్యమైన వివరాలన్నింటినీ సమితి సభ్యులు ప్రత్యక్షంగా అర్ధగంటపాటు ప్రధానికి వివరించారు. విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు. సరిహద్దులలో నివసించే ప్రజలకు గుర్తింపుకార్డులివ్వాలని ఆసమయంలో చేసిన సలహా తరువాత అంగీకారం పొంది ప్రస్తుతం అమలులో ఉంది. 1986 జనవరి 9న సమితి గవర్నర్‌కు మరొక విజ్ఞాపనపత్రం అందజేసింది. పత్రికలలో ప్రచురితమైన వార్తలు, వ్యాసాలు సమస్యకు విస్తృత ప్రచారాన్నిచ్చాయి.

ఈ సుదీర్ఘప్రయత్నాలు అనుకున్న సత్ఫలితాలనిచ్చాయి. ప్రజలకు గుర్తింపుకార్డు లివ్వడానికి అనుసరించే విధానాలు 1988 ప్రారంభం నుండి క్రమబద్ధం అయ్యాయి. అంతకు ముందు లోపభూయిష్టంగాను, అసమగ్రంగాను ఉండే విధానాల కారణంగా వందలాదిమంది 'బాగుపడుతూ ఉండే' వారు. రేషన్‌కార్డుల దుర్వినియోగం జరిగేది. ఈ దేశవ్యతిరేక చర్యలన్నింటినీ అనేకమంది అవినీతిపరులైన సర్పంచులు ప్రోత్సహించేవారు. ఇప్పుడు నియమాలు కఠినం చేశారు. చాలావరకు ఈ అక్రమప్రవేశాన్ని ఆపడానికి ఆనియమాలు ఎంతో దోహదపడ్డాయి.

## 3

# మతమార్పిడుల ప్రమాదాన్ని ఎదుర్కొనడం

బ్రిటిష్ వారు వెళ్ళిపోయారు. కానీ మతం మార్పిడుల ద్వారా హిందూజనాభాను తగ్గించాలని ముస్లిం, క్రైస్తవ సంస్థలు చేస్తున్న ప్రయత్నాలు మాత్రం కొనసాగుతూనే వచ్చాయి. మన జాతీయ భద్రతకు, సమగ్రతకు అవి అత్యంత ప్రమాదకరంగా తయారయ్యాయి. అయితే, గతకొద్ది సంవత్సరాలుగా ఈ విషయాలను గమనిస్తున్న హిందువులు అప్రమత్తులు అయ్యారు. చరిత్రలో మొట్టమొదటిసారిగా, విశ్వహిందూ పరిషత్, ఇతరహిందూసంస్థలు నిర్వహించిన విశాల హిందూసమ్మేళనాలు న్యాయవిరుద్ధంగాను, నీతి విరుద్ధంగాను జరుగుతున్న మతం మార్పిడులను నిషేధించవలసిందని ప్రభుత్వాన్ని గట్టిగా కోరసాగాయి. విదేశీక్రైస్తవమిషనరీలను దేశం నుండి బహిష్కరించాలని; మానవసేవ ముసుగులో మతంమార్పిడులు సాగిస్తున్న వివిధసంస్థలకు విదేశాల నుండి ప్రవాహంలా వస్తున్న ధనంపై వెంటనే నిషేధం విధించాలని ప్రజలనుండి ఒత్తిడి పెరగసాగింది.

కొద్దిరోజులక్రితం కేంద్ర గృహమంత్రిత్వ శాఖ సంప్రదింపులకమిటీ సమావేశంలో, ఒక్క ముస్లింలీగ్ మినహా మిగిలిన అన్నిపార్టీల ప్రతినిధులు ప్రైవేట్ సంస్థల చేతులలోకి ప్రవహిస్తున్న విదేశీనిధులను ఆపడానికి వెంటనే చట్టం చేయాలని కోరిన సంగతి మనం గమనించాలి.

### ముస్లింల సామూహిక మత మార్పిడులకు అడ్డుకట్ట:

మతం మార్పిడులు ఎక్కువగా జరుగుతున్న అనేకప్రాంతాలలో హిందువులు వాటికి వ్యతిరేకంగా ఉద్యమించడం అనుభవంలోకి వస్తోంది. ఈ మధ్యకాలంలో బాగా ప్రచారం జరిగిన సంఘటనగా చెప్పాలంటే: తమిళనాడులోని మీనాక్షిపురంలో 1981 ఫిబ్రవరిలో 800

మంది హిందువులను సామూహికంగా ముస్లింలుగా మతంమార్చారన్న వార్త దేశాన్ని దిగ్భ్రాంతి పరచింది. మీనాక్షీపురం సంఘటనవల్ల కలిగిన అత్యుత్సాహంలో అక్కడ మతం మార్పిడులకు సారధ్యం వహించిన దక్షిణభారత్ ఇషాదుల్ ఇస్లాంసభ మరొక అడుగు ముందుకు వెళ్ళి తమిళనాడులో దాదాపు లక్షమంది హరిజనులు ఇస్లాంస్వీకరించడానికి తహతహలాడుతున్నారని ప్రకటించింది.

ఆసమయంలో తమిళనాడు దక్షిణ ప్రాంతాలలో ఉధృతంగా సాగుతున్న మతంమార్పుడుల ప్రభంజనం నిజానికి ఆందోళనకలిగించే స్థాయిలో ఉంది. సంఘం, హిందూమున్నని, విశ్వహిందూపరిషత్, ఆర్యసమాజ్, హిందుసముదాయ వలార్చి మన్రమ్, హిందూదేవాలయ పరిరక్షణ సమితి, తదితర హిందూ సామాజిక, ధార్మిక సంస్థలు వెంటనే రంగంలోకి దూకాయి. 'హిందూఒట్రుమైమైయం' (హిందూఐక్యతాకేంద్రం) గా ఏర్పడ్డాయి. రాష్ట్రంలో మతంమార్పిడులకు గురైన నాలుగు జిల్లాలలోని గ్రామాలను ఒక ఆర్.యస్.యస్. అధ్యయనబృందం పర్యటించి వచ్చింది. వారినివేదిక ఆధారం చేసుకుని ఇకపై మతంమార్పిడులు సాగకుండా నిరోధించడానికి, మతం మారిన వారందరినీ తిరిగి హిందూమాత ఒడిలోనికి తీసుకునిరావడానికి విస్తృతమైన ఉద్యమాన్ని ప్రారంభించాలని హిందూఒట్రుమైమైయం నిర్ణయించింది.

ఈలోగా, మధురైలో సంఘ కార్యకర్తలకు ఒక దిగ్భ్రాంతి కలిగించే వార్త అందింది. రామనాథపురం జిల్లా మొత్తం నుండి సుమారు లక్షమంది హరిజన హిందువులు ముదుకలట్టూరులో సమావేశమవుతున్నారని, స్సామూహికంగా ఇస్లాంను స్వీకరించే విషయంలో అక్కడవారు నిర్ణయం తీసుకోనున్నారని ఆవార్త తెలియజేసింది. తిరునల్వేలి, మధురై జిల్లాలకు చెందిన హరిజన నాయకులను కూడా ఆ సమావేశానికి ఆహ్వానించారు. ఆ సమావేశాలలో హరిజన సమాజం మొత్తానికి ఇస్లాం స్వీకరించవలసిందిగా పిలుపునివ్వాలని కూడా నిర్ణయించారు. తమ సమావేశాలకు మార్గదర్శనం చేయవలసిందిగా మలేషియాలో పరమ ఆదరణీయ మఠాధిపతి అయిన స్వామీరామదాస్‌ను వారు ఆహ్వానించారు. స్వామి ముదుకలట్టూర్ తాలుకాకు చెందినవారే. అదే వర్గానికి చెందినవారు కూడా. తమిళసాహిత్యంలోను, హిందూ ధార్మిక సాహిత్యంలోను ఆయనకు పాండిత్యం ఉంది. హరిజనుల దురవస్థపై ఆయన కూడా చాలా బాధ పడుతున్నారు. తన అనుచరులకు ఎలా మార్గదర్శనం చేయాలో తెలియక ఆయన అయోమయంలో పడ్డారు.

సంఘ, విశ్వహిందూపరిషత్ నాయకులు రాత్రికిరాత్రి ఆయనుండే చోటికి చేరుకున్నారు. హరిజనులకు న్యాయం కల్పించడానికి, హిందూ సమాజంలో వారికి సమానస్థాయి, ప్రతిష్ఠ కల్పించడానికి అనేకమంది ప్రముఖులైన మఠాధిపతులు, అనేక హిందూసంస్థలు చేస్తున్న నిర్మాణాత్మక ప్రయత్నాలను ఆయనకు వివరించారు. స్వామీజీకి ఈ విషయాలు ఎంతోసంతోషాన్ని, విశ్వాసాన్ని కలిగించాయి. ఆ తరువాత ఆయన హరిజన నాయకుల ఉద్రిక్త మనోభావాలను ఉపశమింపజేయడంలో విజయాన్ని సాధించగలిగారు. వారికి గౌరవప్రదమైన స్థాయి కల్పించడానికి వివిధమఠాధిపతులు, విశ్వ హిందూపరిషత్, సంఘ కార్యకర్తలు చేస్తున్న నిజాయితీతో కూడిన ప్రయత్నాలను గురించి ఆయన ఆనాయకులకు నచ్చజెప్పారు.

ఆ తరువాత రామనాథపురంలో జరిగిన హిందూసమైక్యతా సమ్మేళనంలో ఆస్వామీజీ సంతృప్తహృదయంతో పాల్గొన్నారు. అక్కడ సంప్రదాయ హిందూమఠాధిపతులు, జ్యేష్ఠ సంఘ, విశ్వ హిందూపరిషత్ పెద్దలతో బాటు తానుకూడా సమానమైన ఆదరణ అనుభవించిన స్వామీజీ, కార్యకర్తల కోరికమేరకు మలేసియాకు తిరిగి వెళ్ళే ప్రయాణాన్ని వాయిదావేసుకుని, వారితో కలిసి గ్రామాలలో పర్యటనకు అంగీకరించారు. ఆ తరువాత అనేకచోట్ల హిందూసమైక్యతా సమ్మేళనాలు జరిగాయి. వాటిలో అన్నికులాలు, వర్గాలకు చెందిన నాయకులు, ప్రతినిధులు పెద్దసంఖ్యలో పాల్గొన్నారు. అందరినోట సమానత, సామరస్యాల బోధనలే వినిపించసాగాయి. ధార్మిక, సామాజిక నేతలు ఈ ఉపేక్షితబంధువులను సందర్శించడం ప్రారంభించారు. వారి సమస్యలను గురించి తెలుసుకున్నారు. సామాజిక జీవనంలో సమానత్వాన్ని, ప్రతిష్ఠను వారికి కల్పించే హామీఇస్తూ వారిని సంతుష్టులను చేశారు. అన్నింటికంటే ముఖ్యమైన దేమిటంటే, హిందూధర్మం ఎడల వారి నిష్ఠకు వారు మరింత మెరుగు పెట్టారు.

ఈ ప్రయత్నాలన్నింటి ఫలితంగా అక్కడక్కడ దూరగ్రామాలలో చెదురుమదురుగా ఒకటిరెండు సంఘటనలు మినహాయిస్తే సామూహిక మతమార్పిడుల పెనుభూతం తమిళనాడులో త్రొక్కి పెట్టబడింది. ఎక్కడైనా మతంమార్పిడుల వార్త బైటకు పొక్కితేచాలు, అప్రమత్తంగా ఉన్న హిందూకార్యకర్తలు వెంటనే అక్కడకు చేరుకుని వారి ఆటలు కట్టిస్తున్నారు. ఉదాహరణకు, శివకాశిలో కూడా ఇలాగే క్రైస్తవంలోకి సామూహిక మతం మార్పిడులు జరుగవలసింది. స్వయంసేవకులకు

ఈ విషయం తెలిసింది. హుటాహుటిన వారు ఆప్రాంతానికి వెళ్ళి ఒక్క హిందువు కూడా హిందూత్వాన్ని వదిలి వెళ్ళకుండా చూశారు. స్థానిక హిందూ జనబాహుళ్యం కూడా ఈ హిందూసోదరులను రక్షించే ప్రయత్నంలో మన స్వయంసేవకులకు పూర్తి సహకారాన్నందించడం చాలా ప్రోత్సాహకర విషయం.

కేరళలో కూడా, హిందువులలో పెరుగుతున్న చైతన్యం ప్రభావం చూపుతోంది. కేరళ తీరంలోని పొనని పట్టణం దక్షిణ భారతదేశమం తటికీ ముస్లిం మత మార్పిడులకు కేంద్రస్థానం. మునావర్-ఉల్-ఇస్లాం సభ కేంద్ర కార్యాలయం అక్కడే ఉంది. పురుషులు, స్త్రీలు, పిల్లలను ప్రలోభపెట్టి, అపహరించి అక్కడకు తీసుకుని వచ్చి మతం మారుస్తూ ఉంటారు. అయితే, సంఘ శాఖలు విస్తరించిన కారణంగా స్వయం సేవకులు, ఇతర హిందువులు రైల్వేస్టేషన్లు, బస్‌స్టాండ్ల వద్ద వారిని నిర్బంధించి వారి ప్రయత్నాలను వమ్ముచేస్తున్నారు.

## క్రైస్తవమిషనరీల ఎత్తులను చిత్తుచేయడం:

బ్రిటిష్‌వారు ఈదేశాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయిన సమయంలో తమ ఆటలు ఇకసాగవని నిజానికి విదేశీ క్రైస్తవ మిషన్లు భావించాయి. భారత్‌ను వదిలిపెట్టి వెళ్ళిపోవడానికి ప్రయత్నాలను కూడా వారు ప్రారంభించారు. ఇంతలో మన ప్రభుత్వపు 'సెక్యులర్' విధానాలు వారికి వరప్రదానంలా తోచాయి. పూర్వంలోలాగానే తమకార్యకలాపాలు సాగించు కొనడానికి వారికి అనుమతి లభించింది. అంతేగాక, అప్పటివరకు వారికి ప్రవేశం నిషేధించబడిన క్రొత్తక్రొత్త హిందూ సంస్థానాలలో కూడా వారికి ద్వారాలు తెరువబడ్డాయి. ఫలితంగా, క్రైస్తవ మిషనరీల మతం మార్పిడి కార్యకలాపాలు చాపకిందనీరులా చాలా విస్తరించి పోయాయి. మొత్తం మీద, దాదాపు 1లక్షమంది మిషనరీలు... 9,400 మంది విదేశీయులు, మిగిలినవారు స్థానికులు వివిధ సేవాపథకాల ముసుగులో తమ సమాజవ్యతిరేక, వేర్పాటువాద కార్యకలాపాలు సాగిస్తున్నారు.

మనదేశంలో గిరిజనులు అధికంగా నివసించే ప్రాంతాలను సుమారుగా మూడుభాగాలుగా విభజించవచ్చు: ఈశాన్యప్రాంతం, ఛోటానాగపూర్; మిగిలిన ప్రాంతాలు. వీటిలో, మిషనరీ కార్యకలాపాల పరిణామాలు ఈశాన్యప్రాంతాలలో ప్రధానంగా అనుభవంలోకి వచ్చాయి. విదేశీక్రైస్తవ మిషనరీల ప్రోత్సాహంతో నడిచిన వేర్పాటు ఉద్యమాల ఒత్తిడికి లొంగి

అక్కడ చిన్నచిన్న రాష్ట్రాలు ఏర్పాటు చేశారు. వాటిలో నాగాలాండ్, మిజోరాం, మేఘాలయలు ఇప్పటికే దాదాపు క్రైస్తవరాజ్యాలుగా మారి పోయాయి. కాగా ఈశాన్యప్రాంతమంతటా క్రొత్తరాష్ట్రాల కోర్కెలతో వేర్పాటువాద ఉద్యమాలు ఉధృతరూపం దాలుస్తున్నాయి.

## 'ప్రకృతి ఉపాసన' అనే అసత్యాన్ని ప్రచారం చేయడం: (Animism) :

ఈరోజు గిరిజనులలో ద్యోతకమౌతున్న 'ప్రధాన జాతీయ జీవనస్రవంతి నుండి మేం వేరనే' భావన ముఖ్యంగా బ్రిటిష్‌వారు సృష్టించినదే. వారు నివసించే ప్రాంతాలను 'రక్షితప్రాంతాలు'గా ప్రకటించారు. క్రైస్తవ మిషనరీలు తప్పవేరే ఎవరూ అక్కడికి వెళ్ళకుండా చేసారు. ఒకప్రక్క భౌగోళికంగా ఒంటరితనం. రెండవప్రక్క తమ సంస్కృతీసంప్రదా యాలకు వ్యతిరేకంగా క్రైస్తవ మిషనరీల దాడి....రెండూ కలిసి ఆ కారడవులలో, కోనలలో నివసించే గిరిజనులకు మరిన్ని కష్టాలు తెచ్చిపె ట్టాయి. అదిగాక గిరిజనులలో 182 తెగలు ఉన్నాయి. వారు వేరువేరు మాండలీకాలు మాట్లాడుతారు. వేరువేరు వాతావరణ పరిస్థితులలో నివసిస్తూ ఉంటారు. వేరువేరు సమస్యలు ఎదుర్కొంటూ ఉంటారు. కనుక వారిమధ్య సంబంధాలు కూడా చాలా తక్కువ.

దురదృష్టవశాత్తు, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఏర్పడిన ప్రభుత్వం కూడా గతంలో బ్రిటిష్ పాలకులు నడిచిన అడుగుల జాడల్లోనే నడువసాగింది. గిరిజన హిందువుల నుండి మతం మారినవారిని 'క్రైస్తవులు'గా జనాభాలెక్కల్లో నమోదు చేస్తున్నారు. కానీ, మిగిలిన వారిని మాత్రం హిందువులు కారనే అర్థం వచ్చేటట్లు వారి గిరిజన తెగల పేర్ల మీద నమోదు చేస్తున్నారు.

విదేశీ మిషనరీలు కల్పించిన అపోహల కారణంగా ప్రభుత్వం, గిరి జనులు చెట్లను, రాళ్ళను, సర్పాలను పూజిస్తారని, వారు ప్రకృతి ఆరాధకులని, కనుక వారిని 'హిందువులు'గా పరిగణించరాదని భావిస్తోంది.

" 'ప్రకృతిఉపాసకులు', 'ఆదిమవాసులు' వగైరా విభజన మనకు క్రొత్త. ఆంగ్ల పాలకులనుంచి మనం ఇది నేర్చుకున్నాం. అనాదికాలం నుండి ఈ గిరిజనులు హిందుత్వంలో అంతర్భాగంగా ఉన్నారు. స్థానిక

వన ఔషధుల వంటి వారు వారు. వారివేర్లు ఈ భూమిలో చాలా లోతుగా పాతుకుని ఉన్నాయి." అన్నారు గాంధీజీ. జనాభాలెక్కల అధికారులైన హెర్బర్ట్ రిస్లే (1901), బీహార్‌లోని పి.సి.టాలెంట్స్, బొంబాయికి చెందిన సెడ్విన్ (1921)లు కూడా 'ప్రకృతి ఉపాసన', 'హిందుత్వాల'ను వేరుచేయడం సాధ్యంకాదని, గిరిజన మతాలను ప్రత్యేకంగా గుర్తించరాదని, మిగిలిన హిందువులతో గిరిజనులను కూడా కలిపివేయాలని పేర్కొన్నారు.

మనపై రుద్దబడుతున్న ఈ 'గిరిజన వేర్పాటువాదం' అనే హానికర మైన ప్రచారాన్ని శ్రీగురూజీ పటాపంచలుచేశారు. "ప్రకృతిఉపాసకులు' (Animists) అనేది హిందూత్వాన్ని గురించి ఓ,న,మలు కూడా తెలియని అవివేకులు చేసే వాదం. 'ప్రకృతిఉపాసన' అనేపదం అర్థం 'సృష్టిఅంత టిలో దాగిఉన్న ఒకే జీవనసూత్రం' అని. బాహ్య ప్రకటీకరణ ఏ విధంగా ఉన్నా 'అంతర్నిహితంగా ఉన్న చైతన్యాన్ని' మనం పూజిస్తాం. దేశమంత టిలో హిందువులు చెట్లనుపూజించరా? తులసి, బిళ్వ, అశ్వత్థ... ఇవన్నీ హిందువులకు పవిత్రమైన చెట్లు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఆంతరికమైన చైతన్యం ఎక్కువగా ప్రకటితమయ్యే చెట్లలో అశ్వత్థవృక్షాన్ని పేర్కొన్నాడు. వివిధసర్పాలు, జంతువులు, పక్షులగురించి, నదులు, పర్వతాలగురించి కూడా ఆయన వర్ణించాడు. ఆ ఆవిష్కారాల గురించిన వర్ణనను ముగిస్తూ ఆయన 'తేజస్సును, దివ్యత్వాన్ని, శక్తిని అనుగ్రహించగల ప్రతి అంశం నాదివ్యతేజపు కిరణాల ఆవిష్కారమే ననితెలుసుకో' అంటాడు." అన్నారు గురూజీ.

"నాగదేవత ఉపాసన మనదేశమంతా ఆచరణలో ఉన్నదే. దక్షిణాదిన 'నాగదేవత'కు 'సుబ్రహ్మణ్యస్వామి' అనేపేరు ఉంది. అక్కడ ఆయనకు అనేక దేవాలయాలున్నాయి. మరి ఆ భక్తులందరినీ మనం 'ప్రకృతి ఉపాసకులు'గా పరిగణించి, హైందవేతరులుగా ప్రకటించాలా?" అని శ్రీ గురూజీ సవాలు విసిరారు.

## హిందూత్వపు పిలుపు అద్భుతాలు సృష్టిస్తుంది:

గిరిజనులందరికీ మూలమైన హిందూత్వపు పిలుపు ఎలా అద్భుతాలు సృష్టిస్తుందో తెలిపే ఆసక్తికరమైన సంఘటనలు ఉన్నాయి. ఆదరణీయ నాగా స్వాతంత్ర్య సమరయోధురాలు జెలిఅంగ్‌రాంగ్ హెరక ఉద్యమా

నికి నాయకురాలు అయిన రాణీమాగైడిన్లూను 1979 జనవరిలో ప్రయాగలో విశ్వహిందూపరిషత్ నిర్వహించిన ప్రపంచ హిందూ సమ్మేళనానికి ఆహ్వానించారు. ఆమె ఆశ్చర్యపోయారు. 'హిందువు'కాని 'ప్రకృతిఉపాసకురా'లైన తనను హిందూ సమ్మేళన కార్యక్రమానికి ఎలా ఆహ్వానిస్తారు? - అని ప్రశ్నిస్తూ ఆమె తిరస్కరించారు. అయితే పరిషత్ కార్యకర్తలు హిందూత్వపు దృష్టికోణాన్ని రాణికి విశదపరచారు. ఆమెకు ఆ విషయం చాలా నచ్చింది. తన శిష్యబృందంతోబాటు ఆమె ఆ సమ్మేళనంలో పాల్గొన్నారు. సంక్షిప్తం, భావోద్వేగభరితం అయిన తన ప్రసంగంలో అనేకమంది స్వాతంత్ర్యసమరయోధులు... వారిలో నాగాలాండ్ వారుకూడా ఉన్నారు.... గతంలో చేసిన మహా త్యాగాలను ఆమె శ్రోతలకు గుర్తుచేశారు. చివరిలో "కానీ విదేశీమిషనరీలు మన స్వాతంత్ర్యాన్ని మ్రింగి వేస్తున్నారు. వారి కుట్రలను వమ్ముచేసేందుకు హిందూధర్మప్రచారకులు పెద్దసంఖ్యలో ఆ ప్రాంతాలకు రావాలి" అని ఆమె పిలుపునిచ్చారు. రాణి ఎంత ప్రభావితులయ్యారంటే ఆ ప్రాంతాలలో హిందూ పునర్జాగరణ కార్యానికి ఆమె ప్రేరణశ్రోతస్సు. అయ్యారు.

ఆ సమ్మేళనంలో పాల్గొనడానికి వచ్చిన ఒక ఖాసీతెగకు చెందిన వృద్ధ మహిళ చేసిన వ్యాఖ్యలు ఎంతో ప్రాముఖ్యతకలవి. "మేం షిల్లాంగ్‌లో ఉన్నంతసేపు అన్నివైపుల పెరిగిపోయిన క్రైస్తవ జనాభాలో ఉక్కిరిబిక్కిరౌతున్నట్లు అనుభూతి చెందుతూ ఉంటాం. మిగిలిన దేశమంతా క్రైస్తవంలోకి మారిపోయిందని కూడా వారు మాకు అసత్యాలు చెప్పారు. కానీ అలహాబాద్‌లో విశ్వహిందూసమ్మేళనాన్ని చూసిన తరువాత హిందూసమాజం ఒక మహాసముద్రం వంటిదని నేను గ్రహించాను. ఆ మహాసముద్రపు ఒక కెరటం మేఘాలయపై విరుచుకు పడితే చాలు, క్రైస్తవం అనే కళంకం మరుక్షణం రూపుమాసిపోతుంది"

స్వచ్ఛమైన హిందూవాతావరణం ఆ వర్గాల హృదయాలలో ఎటువంటి సహానుభూతిని నిర్మాణం చేస్తుందో తెలిపే మరొక సంఘటన ఉంది. నాగాలాండ్‌కు చెందిన శాసనసభ్యులు శ్రీ ఎన్.సి.జెలియంగ్ 1981లో కొత్తఢిల్లీలో వనవాసీ కళ్యాణాశ్రమ్ నిర్వహించిన ఒక శిక్షణ శిబిరానికి అతిథిగా విచ్చేశారు. తన ప్రారంభోపన్యాసంలో ఆయన తన రాష్ట్రంలో క్రైస్తవ కార్యకలాపాలను ఎదుర్కొనేందుకు ఒక క్రైస్తవేతరఫ్రంట్‌ను ఏర్పాటుచేసే ఆలోచనను ముందుపెట్టారు. అయితే, శిబిరం చివరిలో

ఆయన 'నన్ను నేను కేవలం క్రైస్తవేతరునిగా భావించుకోవడంలేదు. నేను పూర్తిగా హిందువునని అనుభూతి చెందుతున్నాను' అని అన్నారు.

## సాంస్కృతిక పునరుజ్జీవన ప్రభావం - నాగాలపై:

సంఘస్వయంసేవకులు నిర్మించిన సాంస్కృతిక పునరుజ్జీవన తరంగాలు ఈశాన్య ప్రాంతంలో 'భారతీయ జనజాతి సాంస్కృతిక మంచ్' ఆవిర్భావానికి దారితీశాయి. గిరిజనసోదరులు ఒకప్రక్క ప్రధాన భారతీయ జీవనస్రవంతి నుండి వేరుగా ఉండడం, రెండవప్రక్క తమలోని విభిన్న తెగల కారణంగా వేరుగా ఉండడం.. ఈ రెండురకాల ఒంటరితనం నుండి గిరిజనులను రక్షించడం సమితి ఉద్దేశం. ఈకృత్రిమమైన అడ్డుకట్టలను ఛేదించి, భారతీయ సంస్కృతియొక్క వాస్తవసారమైన 'వైవిధ్యంలో ఏకత్వం' అనే సూత్రాన్ని ప్రోత్సహించడం, తమప్రత్యేక సమస్యల పరిష్కారానికై ప్రతి తెగకు విడిగా ఒక వ్యవస్థను రూపొందించడం, వారివారి పరంపరాగత జీవనపద్ధతులు, ఆచారవ్యవహారాలను పరిరక్షించడం, ప్రోత్సహించడం, గిరిజనసాహిత్యాన్ని ప్రజలలో వ్యాప్తిచేయడం తన లక్ష్యాలుగా సమితి స్వీకరించింది.

క్రైస్తవప్రచారపు అష్టదిగ్బంధనాన్ని ఛేదించడానికి చివరిలో పేర్కొన్న కార్యక్రమం చాలా ప్రభావవంతమైనదిగా కనబడింది. ప్రస్తుతం వారి విద్యాసంస్థలన్నింటిలోను గిరిజనులకు బైబిల్‌ను స్థానిక గిరిజన భాషలలోనికి (రోమన్ లిపిని ఉపయోగించి) అనువదించి బోధిస్తున్నారు. ప్రభుత్వ పాఠశాలల్లో అయితే సెక్యులర్ విద్యను మాత్రమే బోధిస్తున్నారు. ఫలితంగా, తమ పిల్లలకు ప్రాచీనమైన తమ మత విశ్వాసాలను అందించలేని పరిస్థితి అక్కడి గిరిజనులకు ఏర్పడింది. ఆవిధంగా వారి హృదయాలలో ఏర్పడిన శూన్యత కారణంగా వారు క్రైస్తవమతం మార్పిడి కారులకు సులభంగా ఎఱ అవుతున్నారు.

మంచి ప్రయత్నాల ఫలితంగా, వివిధ గిరిజన తెగలలో వారివారి ప్రాచీన ఆధ్యాత్మిక, సాంస్కృతిక విలువల పునర్జాగరణ వేగాన్నందుకుంది. రాణీమాగైడిన్లూ మార్గదర్శనంలో నాగాలలోని మూడు ప్రధాన శాఖలయిన - జేమి, రెంగ్మాయి, జెలింగ్ ఒకే ఉద్యమంగా రూపొందుతున్నాయి. వారు దానిని 'హేరక' - స్వచ్ఛమైన మతం అనిపిలుస్తారు. 1981 జనవరిలో మంచ్ సమర్థనతో 'హేరక మండలి' నిర్వహించిన హేరకసమ్మేళనం చారిత్రాత్మకమైనది. అస్సాం, నాగాలాండ్, మణిపూర్ రాష్ట్రాలలోని

81 గ్రామాలనుండి 2వేలమంది ప్రతినిధులు ఈ మూడురోజుల సమ్మేళనంలో పాల్గొన్నారు. అస్సాంలోని ఉత్తరకచార్ జిల్లాలో కొరైరాం అనే నాగాగ్రామంలో జరిగిన ఈ సమ్మేళనంలో పాల్గొనటానికి కొందరు ప్రతినిధులు ఆరురోజులు నడచివచ్చి తిరిగి అంతదూరం నడిచివెళ్ళవలసి వచ్చింది. మొట్టమొదటి సారిగా ఈ సమ్మేళనంలో ఖాసీ మతపెద్దలు నాగాసోదరులతో కలిసి మెలిసి ఉన్నారు. తమ సమాన ఆధ్యాత్మిక అనుబంధాలను గుర్తించారు.

1988 ఫిబ్రవరి 1, 2 తేదీలలో జరిగిన వార్షికసమ్మేళనంలో 'హేరక మండలి' హేరక అనుయాయులలో పెరుగుతున్న హిందూజాగృతికి అధికారిక అనుమతి ముద్రవేసింది. "'హేరక' నిజానికి హిందుత్వానికి చెందినదే. నాగాల సంప్రదాయాలను, ఆచారాలను, సంస్కృతిని కాపాడడానికి నాగాలలో గల మతం అదొక్కటే. హేరకమండలి హిందూసంస్థలో ఒకభాగం లాగానే పనిచేస్తుంది" అని ఆ సమ్మేళనంలో తీర్మానించారు.

ప్రధానంగా నాగాబాలురు చదువుకుంటున్న హాఫ్లాంగ్‌లోని సరస్వతీ శిశుమందిర్ గ్రామపెద్దల హృదయాలను జయించింది. కొద్ది సంవత్సరాలక్రితం ప్రభుత్వ అధికారులు, స్వయంగా గవర్నర్ ఒక భూభాగాన్ని పళ్ళరసాల ఫ్యాక్టరీకి వదిలివేయమని వారిపై వత్తిడి తీసుకుని వచ్చారు. అయితే ఆ ప్రస్తావనను వారు తిరస్కరించి 8 భీఘాలు ఉండే ఆ స్థలాన్ని పాఠశాలకు కేటాయించారు. "ఒక హిందూసంస్థ మాపిల్లలకోసం నడుపుతున్న ఈ పాఠశాల మా మాతృభాష మాధ్యమంగా విద్యాబోధ చేస్తోంది. ఏవో కొన్ని ఆర్థిక ప్రయోజనాలకంటే ఇదే మాకు విలువైన అని వారు చెప్పారు.

లైనింగ్ గ్రామంలో హేరకనాగాపెద్దల సహకారంతో వనవాసీ కళ్యాణాశ్రమం నడిపిస్తున్న ఒక పాఠశాల, వైద్యకేంద్రం ఉన్నాయి. కేవల 3వేల జనాభా ఉండే ఆగ్రామంలో రెండు పెద్ద ఆవాస విద్యాలయాలు (Residential School) కూడా ఉన్నాయి. వాటిలో ఒకటి రోమన్ క్యాథలిక్‌లదికాగా, రెండవది బాప్టిస్ట్‌లది. కళ్యాణాశ్రమం నడుపుతున్న పాఠశాలలో బాప్టిస్టు చర్చికి చెందిన అనేకక్రైస్తవబాలురు చదువుకుంటున్నారు. బాప్టిస్ట్‌క్రైస్తవుడు అయిన నగరపాలకమండలి ఉపాధ్యక్షుడు, తనసంతానాన్ని తమరెండు చర్చి పాఠశాలలకుకాక హిందూ పాఠశాలకు పంపించాలని ఎందుకు భావించాడో ఇలా వివరించాడు. "కళ్యాణాశ్రమ పాఠశాలలో సరస్వతి ప్రార్థన ఉంటుందని నాకు తెలుసు.

సంస్కృతం, హిందీ అక్కడ నేర్పిస్తారు. అయితే బాప్టిస్ట్, కాథలిక్ పాఠశాలలలో బైబిల్ బోధనపైనే ఎక్కువ సమయం వెచ్చించ బడుతుంది. హిందూపాఠశాలలో పిల్లల విద్య, ప్రవర్తనలపై శ్రద్ధచూపుతారు."

నిజానికి కళ్యాణాశ్రమపాఠశాలలో తమ పిల్లలు సంప్రదాయ హిందూ పద్ధతులలో కల్పిపోవడం పెద్దలకు ఏమాత్రం తప్పుగా అనిపించలేదు. ఒకనాటి ఉదయం వ్యాహ్యాళికి వెళ్ళిన పాఠశాల అధ్యాపకులు ఒకరు 'యాకుందేందు తుషారహారధవళా' అని మాటలు ఒక గుడిసెనుండి వినిపించడం విన్నారు. లోపలకు తొంగిచూశారు. అక్కడ తమ పాఠశాలకు చెందిన ఒక బాలుడు పద్మాసన్‌లో కూర్చుని, చేతులు నమస్కార స్థితిలో ఉంచి పాఠశాల ప్రార్థనలో భాగంగా నేర్చుకున్న సరస్వతీస్తోత్రాన్ని వల్లెవేస్తున్నాడు. ఆ బాలుడు ఎవరిఫోటో ముందు కూర్చున్నాడో తెలుసా? జీసస్‌క్రీస్తు ముందు. అతడొక క్రైస్తవనాగా కుటుంబపు బాలుడని వేరే చెప్పనవసరంలేదు.

తమ సంతానాన్ని వనవాసీ కళ్యాణాశ్రమం హర్యానా, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ లలో నిర్వహిస్తున్న హాస్టళ్ళలో చేర్చడానికి వారు ఆనందంగా ముందుకువస్తున్నారు.

## ఖాసీలలో:

మరొక ప్రధాన వర్గం ఖాసీలు. వారిలో 50 శాతం మంది ఇప్పటికే క్రైస్తవులుగా మతం మారిపోయిఉన్నారు. మతం మారిన ఖాసీలే విద్యావకాశాలను, రాజకీయ ప్రత్యేకావకాశాలను, లాభదాయకస్థానాలను చేజిక్కించుకుంటున్నారు. ఫలితంగా ఖేంజీ ఖాసీలు రెండవతరగతి పౌరులుగా జీవించవలసి వస్తోంది. అయితే నెమ్మదిగా వారిలోకూడా స్వాభిమానం, స్వీయ జాగృతి బలం పుంజుకుంటున్నాయి. గత శతాబ్దాంతంలో ప్రారంభమైన 'సెంగ్ ఖాసీ' సంస్థ సంస్కృతి సంప్రదాయాల ఎడల వారినిష్ఠను జ్వలంతంగా కాపాడుతూ వచ్చింది. గొప్ప భారతదేశభక్తుడు జీబన్‌రాయ్ దానివెనుక ఊపిరిగా ఉన్న ప్రముఖుడు. గొప్ప విద్యావేత్త, పండితుడు, మేధావి అయిన ఆయన ఖాసీమతం, రామాయణం, భగవద్గీత, బుద్ధుడు, చైతన్యప్రభువుల జీవనలీలపై పుస్తకాలను వ్రాశారు, అనువాదం చేశారు, ముద్రించారు. సెంగ్ ఖాసీ, మంచ్‌ల ప్రస్తుతనాయకుడు హిప్సన్‌రాయ్ మత మార్పిడుల వల్ల తలెత్తేసవాళ్ళను గ్రహించారు. క్రైస్తవాన్నిస్వీకరించడం అంటే పాశ్చాత్యజీవనవిధానాన్ని స్వీకరించడమే

నని దానివలన కాలపరీక్షకు నిలచిన తమ జీవనవిధానం, సంస్కృతి నాశనం కాగలవు అని ఖాసీసోదరులకు ఆయన నచ్చజెబుతున్నారు.

హెచ్. అండర్సన్ మారీ మరొక చురుకైన సెంగ్ ఖాసీ, మంచ్‌ల నాయకుడు. మేఘాలయలోని నాంక్రమ్ ఉన్నతపాఠశాలలో ఆయన ప్రధానోపాధ్యాయులు. ఆయన మేధావి. మహాపాండిత్యంగల తత్వవేత్త. అంతేగాక మంచి ఉపన్యాసకర్త కూడా. ఇతరుల పునాదులపై తాము నిర్మాణం చేయడం ఆత్మహత్యాసదృశం అని ఆయన తన ప్రజలను హెచ్చరిస్తూంటారు. ప్రస్తుత జాగరణ ఫలితంగా ఖాసీలు క్రైస్తవం లోకి మారడం దాదాపు ఆగిపోయిందని, వారి పునరాగమనం - 'స్వగృహాగమనం' - మొట్ట మొదటిసారిగా ప్రారంభమైందని గట్టిగా అభిప్రాయపడుతూంటారు. 'ప్రస్తుతం మేం దెబ్బకొట్టేస్థితిలో ఉన్నాం. వారు ఆత్మరక్షణలో ఉన్నారు' అంటారాయన ప్రశాంతంగా.

గాలి ఎటువీస్తోందో తెలియజేసే సంఘటన ఒకటి ఉంది. మేఘాలయ లో ఇప్పటివరకు ఎటువంటి అడ్డులేకుండా ఉండిన క్రైస్తవ ఆధిక్యతప్రభావాన్ని నేడు ప్రజలు నిరసిస్తున్నారు. సవాలు చేస్తున్నారు. శాసనసభలోను, పరిపాలనావ్యవస్థలోనూ మంచి ఆధిక్యత ఉన్నకారణంగా ప్రభుత్వం ఇంతకాలం క్రిష్టమస్ పండుగను ప్రభుత్వఉత్సవంగా ఎటువంటి ఆటంకం లేకుండా జరుపుతూ వచ్చింది. మేఘాలయ ఒక క్రైస్తవ రాజ్యం అన్నట్లు ప్రభుత్వకార్యాలయాలు, శాసనసభాభవనం దీపాలతో అలంకరించేవారు. 1979లో ఖాసీలలో చైతన్యం వచ్చింది. ఈసంప్రదాయం భారతరాజ్యాంగపు లౌకిక భావనకు వ్యతిరేకమని అభ్యంతరం లేవదీస్తూ వారు ముఖ్యమంత్రికి ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు. ప్రధానమంత్రికి, దేశవ్యవహారాల మంత్రికి కూడా ప్రతులను పంపించారు. మరుసటి సంవత్సరమే దాని ప్రభావం కనిపించింది. ఏ ప్రభుత్వభవనాన్నీ భవిష్యత్తులో మతపరమైన ఉత్సవాలకు ఉపయోగించరాదని మేఘాలయ ప్రభుత్వం అన్ని ప్రభుత్వకార్యాలయాలకు ఆదేశాలు జారీ చేసింది.

జాతీయభావనను నాశనంచేసే క్రైస్తవప్రభావంతో పోల్చినపుడు హిందూ ప్రభావాన్ని గురించి వివిధ గిరిజన సోదరుల దృష్టి ఏవిధంగా ఉంది? క్రైస్తవ ప్రభావాన్ని హిందూ ప్రభావాన్ని, పోలుస్తూ అండర్సన్ మారీ ఇలా అంటాడు:

"మొదటిదాని విషయంలో భౌతిక, సాంస్కృతిక ఆక్రమణలు రెండూ సన్నిహితంగాను, అవిభాజ్యంగాను పెనవేసుకుని ఉన్నాయి. హిందూత్వం విషయంలో అలాకాదు." గతఅనేక శతాబ్దాలలో గిరిజన సంస్కృతి

విశిష్టతలు ఏమాత్రం నష్టపోలేదు. కొన్ని గిరిజనతెగలు తమకుతాము హిందువులుగా పిలుచుకొనడానికి ఏమాత్రం సంకోచించడం లేదు. కాగా, ఖాసీల వంటి కొందరు మాత్రం అందుకు వ్యతిరేకంగా ఉన్నారన్నది వాస్తవం. అయితే వారుకూడా 'భారతీయ మతాలలో హిందూత్వం జ్యేష్ఠసోదరి లాంటిది' అని నిర్మొహమాటంగా అంగీకరిస్తారు.

తన ఒక సంచికలో 'సేన్ ఖాసీ' పత్రిక "బ్రిటిష్ పరిపాలనకాలంలో ప్రతి ఐరోపారచయిత ఈశాన్య ప్రాంతాన్ని గురించి వక్రీకరించిన, హేయమైన అంశాలను మాత్రమే ముందుపెడుతూండేవారు. హిందువుల సహనాన్ని, ఉదారబుద్ధిని గురించి ఏనాడూ ఒక్కమాట కూడా మాట్లాడలేదు. ఖాసీమతం ఎడల హిందూధర్మం యొక్క దృష్టి తల్లిప్రేమ కన్న మిన్న అయినది" అని వ్రాసింది.

పైన పేర్కొన్న చివరివాక్యం మంచ్ సాధించిన భావనాప్రధానసమైక్యతను, దాని సమగ్రమైనప్రభావాన్ని ఎత్తి చూపుతుంది.

## ఆవిర్భవిస్తున్న శ్రేష్ఠ ధోరణులు:

మంచ్ యొక్క నిర్విరామ కృషికారణంగా, అనేక ఇతర గిరిజన తెగలలో కూడా సముచితమైన ధోరణులు దర్శనమిచ్చారు. అరుణాచల్ ప్రదేశ్‌లో ఈ ఉద్యమంలో చొరవతీసుకున్న వారు తుమ్-పాక్-ఎట్. మంచ్‌లో చేరడానికి ముందు చాలా మంచి ప్రభుత్వోద్యోగానికి రాజీనామాచేసి తన 'ఆది' గిరిజనతెగయొక్క మత సాహిత్యంలో అంతర్గతంగా ఉన్న ఔన్నత్యాన్ని వెలికితీసేందుకు ఆయన అంకితమయ్యాడు. ఆయన నిష్ఠాపూర్వక కృషిలోంచి ఆవిర్భవించిన ఫలమే 'ఆది పరిశోధనాకేంద్రం'.

కార్బి గిరిజనులలో ఒకవర్గం లఖిమన్‌సింగ్ ద్వారా తమపరంపరాగత వైష్ణవసంప్రదాయాన్ని గురించి అనేక నూతన విషయాలు తెలుసుకోసాగింది. మైదాన ప్రాంతంలోని బోడోలలో ఒక వర్గం సమధికోత్సాహంతో, పెద్ద ఎత్తున పరంపరాగతమైన 'బాతో పూజ' (పంచముఖి శివపూజ)ను ప్రారంభించారు. కాగా, 'బ్రహ్మ' అని పిలువబడే రెండవ వర్గం 'యజ్ఞాలు' చేస్తున్నారు.

గిరిజనులలో సమాన భారతీయ అస్తిత్వాన్ని చాటిచెప్పేకృషిలో వనవాసీ కళ్యాణాశ్రమ కార్యకర్తలు వారి ప్రాచీన జానపదకళలు, జానపదగాధలు, జానపదగీతాల గురించి కూడాశ్రద్ధ వహించారు.

కార్బి గిరిజనులు తమను వాలి, సుగ్రీవ వంశజులుగా భావిస్తాంటారు.

'తివా' గిరిజనులు తాము సీత వంశజులమని గర్వపడుతూ ఉంటారు. అరుణాచల్‌ప్రదేశ్‌లోని 'మిశ్మి' గిరిజనులు తమ వారసత్వాన్ని రుక్మిణి వరకు, ఆమెద్వారా శ్రీకృష్ణుని వరకు కలుపు కుంటారు.

1988లో 'ఈశాన్యభారతపు గిరిజనులలో రామకధ' అనే అంశం మీద గౌహతి విశ్వవిద్యాలయం ఒక సంగోష్ఠి (సెమినార్) నిర్వహించింది. అందులో క్రైస్తవమిజో అయిన ఐజ్వాల్ కళాశాల ప్రిన్సిపాల్ 'మిజోలలో ప్రచారంలో ఉన్న రామ కథ' అనే అంశం పై ఒక పత్రాన్ని సమర్పించారు. రామకథ సీతారామలక్ష్మణ హనుమంతుల కథలతో, రావణవధతో నిండి ఉంటుంది. మిజోలో ఒకమంత్రం "ఓ ధాన్యమా? సత్యాన్ని చాటిచెప్పమని రామలక్ష్మణులు నిన్ను సృష్టించారు. కనుక మాకు సత్యాన్ని చెప్పు (ఇలామూడుసార్లు)" అని ఉంటుంది.

వనవాసీ కళ్యాణాశ్రమ కార్యకర్తలు ఇలాంటి సమాచారాన్నంతటినీ సేకరిస్తున్నారు. మిగిలినదేశంతో ఆ ప్రాంతాల ప్రజలు ఏకాత్మతానుభూతి పొందడానికి దోహదపడే ఈ అంశాలను పాఠశాలల పాఠ్యప్రణాళి కలో చేర్చాలని సంబంధిత విద్యాశాఖాధికారులను అర్థించాలని వారు అనుకుంటున్నారు.

గిరిజన సోదరుల భాషకు సంబంధించిన ఒక ప్రముఖమైన అంశం చాలా ఆసక్తికరంగా ఉంది. నిరక్షరాస్యులైన గిరిజనులలో అధికశాతం ప్రజలు కొద్దోగొప్పో హిందీని అర్థం చేసుకుంటారు. ఇంగ్లీషుమాత్రం రాదు. ప్రస్తుతం, ఇంగ్లీషును ప్రభుత్వసంస్థలు, మిషనరీలు కలిసి వారి గొంతుల్లో కుక్కుతున్నారు. ఏమైనా, రాబోయే రోజులలో వివిధతెగల మధ్య సహజ మైన అనుసంధానభాషగా హిందీయే వృద్ధిచెందగలదు. ఒకసారి హిందీ ప్రవేశించడం అంటూ జరిగితే, వారి మాండలీకాలకు రోమన్‌లిపిస్థానంలో దేవనాగరిలిపి ప్రాచుర్యం పొందగలదు. దేవనాగరిని తమలిపిగా బోడోలు అంగీకరించారు. ఈమధ్యలోనే 'దిమాచా'లు, 'జెమినాగా'లు కూడా దానిని తమలిపిగా స్వీకరించారు. కార్బిలు అస్సామియాలిపిని, త్రిపురీలు బెంగాలీ అక్షరాలను ప్రస్తుతం ఉపయోగిస్తున్నారు.

## వెల్లితలలు వేస్తున్న క్రైస్తవం రట్టయినవేళ:

1982 ఫిబ్రవరిలో గౌహతిలో జరిగిన 'పూర్వాంచల హిందూసమ్మే ళనం' ఈశాన్యప్రాంత చరిత్రలో ఒక నూతనాధ్యాయానికి నాంది పలికింది. ఆ సందర్భంలో, మైదాన ప్రాంతాలలోని హిందువులు,

20 గిరిజన తెగల ప్రతినిధులు భుజం భుజం కలిపి పనిచేశారు. ఆ ప్రాంతంలో నిశ్శబ్దంగా సాగుతున్న జాతీయ సమైక్యతా యత్నాలకు ఇది మంచి ఊపు నిచ్చింది. పదేపదే జరుగుతున్న ఇలాంటి అనుభవాల వల్ల హిందూమాత ఒడిలోనే తమ అస్తిత్వానికి రక్షణ ఉన్నదని వివిధగిరిజన తెగలు గ్రహిస్తున్నాయి. క్రైస్తవంలోకి మతం మారినందువల్ల తాము పాశ్చాత్య అలవాట్లు, అభిరుచులకు ఒక ఊరుపేరులేని నమూనాగా మాత్రమే మిగిలిపోతున్నామని, అంతేగాక తమ ప్రాచీన విలువలన్నీ తుడిచిపెట్టుకుపోతున్నాయని, నీచంగా చూడబడుతున్నామని కూడా వారు గ్రహించారు. ఈ దిగ్భ్రాంతి కలిగించే వాస్తవాలు మతం మారిన గిరిజనులు సైతం పునరాలోచనలో పడేటట్లు చేస్తున్నాయి.

కొద్ది సంవత్సరాల క్రితం, ఒక నాగాసాంస్కృతిక ప్రతినిధి వర్గం అమెరికా సందర్శనకు వెళ్ళింది. అందులో ముఖ్యమంత్రి భార్యకూడా ఉంది. అందులో సభ్యులు అందరూ క్రైస్తవులే. ఒక సమావేశంలో వారిని నాగాసంగీతం వినిపించవలసిందిగా కోరారు. నాగాముఖ్యమంత్రి భార్య ఒకపాట పాడింది. 'ఇది మా పాశ్చాత్య పాప్ సంగీతం. ఒక సంప్రదాయ నాగాగీతం మాకు వినాలని ఉంది' అని వారు అడిగారు. ఆమె సిగ్గుపడుతూ 'తాను క్రిస్టియన్‌నని, స్థానిక పద్ధతులన్నింటినీ విడిచిపెట్టేశానని, కనుక నాగాసంగీతం తనకు రాదని బదులిచ్చింది. అమెరికన్లు నిర్ఘాంత పోయారు. 'మతం మారితే ఏం? మీరు నాగా కాకుండా పోతారా?' అని వారు ప్రశ్నించారు. భారత్‌కు తిరిగి వచ్చిన తరువాత ఆమె ఒక సమావేశంలో అరుణాచల్‌ప్రదేశ్ ముఖ్యమంత్రితో మనం క్రైస్తవులుగా మారినప్పటికీ బైటి ప్రపంచం మన ప్రాచీన సాంస్కృతిక సంప్రదాయాలను, వారసత్వాన్ని మనం అంటిపెట్టుకునే ఉండాలని ఆశిస్తుందని' అన్నారు.

మణిపూర్‌లో, మైథేయీ, పీపుల్స్ లిబరేషన్ ఆర్మీల పేరున వేర్పాటువాదులు మణిపూర్ ప్రజల బుర్రలలో తాము మైథేయులమని, హిందువులం కామని, మణిపూర్ ఎప్పుడూ భారత్‌లో భాగంగాలేదనే భావాన్ని ఎక్కించడానికి ప్రయత్నం చేస్తూ వచ్చారు. తమమతం, తమ పద్ధతులు భాష, లిపి అన్నీ ప్రత్యేకమైనవని, భారతీయ జీవనవిధానంలో అవి అంతర్భాగాలు కావని వారు వక్కాణిస్తూ వచ్చారు. 1960 వ దశకపు ప్రారంభం నుండి ఈ వేర్పాటువాద ప్రభంజనం ఉధృతం కాసాగింది. రామాయణం, మహాభారతం, భగవద్గీతవంటి పవిత్రగ్రంథాలను వారు నిందించసాగారు. అగౌరవ పరచసాగారు. కొన్నిచోట్ల

వాటిని తగులబెట్టారు కూడా. ఈ దహనకార్యక్రమంలో ఒకచోట ఒక మంత్రికూడా పాలుపంచుకున్నాడు.

అయితే ఈ విధ్వంసపు జ్వాలలను అంతమొందించాలని విశ్వహిందూపరిషత్ నిర్ణయించింది. ఈ లక్ష్యంతో 1981లో ఇంఫాల్‌లో పెద్ద హిందూసమ్మేళనం నిర్వహించారు. వేలసంఖ్యలో అన్నివర్గాల హిందువులు పాల్గొన్న ఈ సమ్మేళనం హిందూసమైక్యతా యత్నాలకు బలమైన ఊపునిచ్చింది. వేర్పాటువాద మైథేయీవాదపు హిందూవ్యతిరేక, జాతివ్యతిరేక ప్రచారాన్ని అణచివేయడానికి ఎంతో సహాయపడింది. వేర్పాటువాదుల దాడుల కారణంగా ప్రతి సంవత్సరం జరిగే మహాశివరాత్రి ఉత్సవాన్ని కొంతకాలంగా నిలిపివేశారు. అయితే మరుసటి సంవత్సరం నుండి ద్విగుణీకృత ఉత్సాహం, ఉద్వేగంతో అది పునః ప్రారంభం చేయబడింది.

హిందూ మత ప్రచారకుల కృషి యొక్క కాంతి కిరణాలు వేర్పాటువాదులలోని కొన్ని వర్గాలను కూడా ప్రభావితం చేశాయి. మణిపూర్‌లో కళ్యాణాశ్రమం నడుపుతున్న సరస్వతీ శిశుమందిరాలు చాలా ప్రజాదరణ పొందాయి. ప్రస్తుతం (1988) 1700 మంది విద్యార్థులు వాటిలో ఉన్నారు. ఒకసారి కొద్దిమంది వేర్పాటువాదులు ఒక పాఠశాల నిర్వాహకులను కలువడం తటస్థించింది. వారు నిస్సంకోచంగా చెప్పారు. "మీ ప్రకల్పానికి మేం వ్యతిరేకులం కాదు. నిజానికి, మాపిల్లలు కూడా అలాంటి శ్రేష్ఠమైన, ఉదాత్తమైన వాతావరణంలోనే పెరగాలని మేము కూడా కోరుకుంటున్నాం."

కచార్ జిల్లాలోని సిల్చార్‌కు చెందిన ఒక కళ్యాణాశ్రమ కార్యకర్తకు ఆశ్చర్యపరచే ఒక అనుభవం ఎదురైంది. మిజోరాంలోని గిరిజనుల స్థితిగతులను సర్వేక్షణ (సర్వే) చేసేందుకు ఆయన అక్కడకు వెళ్ళాడు. వేర్పాటువాద కార్యకలాపాలకు పెట్టిందిపేరైన ఒకగ్రామంలో, క్రైస్తవులైన గిరిజనులు చుట్టుముట్టి, అతడిని గురించి, కళ్యాణాశ్రమ కార్యక్రమాల గురించి, అక్కడికి రావడం వెనుక అతని ఉద్దేశాన్ని గురించి ప్రశ్నలవర్షం కురిపించారు. ఆ కార్యకర్త వారి మధ్య చిక్కుకుపోయాడు. ఒక గిరిజనుడు ఆయనను తన ఇంటికి ఆహ్వానించగానే అతని అనుమానాలు మరింత బలపడ్డాయి. 'రాను' అని చెప్పలేని నిస్సహాయస్థితిలో అతడిని అనుసరించాడు. ఇంట్లోకి వెళ్ళిన తరువాత ఆ గిరిజనుడు పానీయం తీసుకునివచ్చాడు. ఇదే తన 'చివరి పానీయమని' అనుకున్నాడు ఆకార్యకర్త. అయితే, అతని భయాలు త్వరలోనే దూరం అయ్యాయి.

వాటిస్థానంలో ఎంతో ఉపశమనం, సంతోషం చోటుచేసుకున్నాయి. ఆ గిరిజనుడు 500 రూ॥లు తీసి కార్యకర్త చేతిలో పెట్టాడు. "మీ ఉదాత్త కార్యం కోసం దీనిని స్వీకరించండి. అయితే మీరు మావద్దకు చాలా ఆలశ్యంగా వచ్చారు. 30 సం.ల క్రితమే మీరు ఇక్కడికి రావలసింది" అని అన్నాడతడు. కళ్యాణాశ్రమ కార్యకర్తకు తెలుసు పరిస్థితి ఇంకా చేజారిపోలేదని.

## యువహృదయాలను జతకూర్చడం:

ఈ దిశలో విద్యార్థి పరిషత్ కూడా ఎంతో కృషి చేస్తోంది. మిగిలిన దేశంతో భావాత్మక ఏకాత్మతను నిర్మించేకృషిలో విద్యార్థిపరిషత్ వారు ప్రభావయోగ్యము, స్వచ్ఛము అయిన విద్యార్థిలోకంపైనే ప్రధానంగా దృష్టిని కేంద్రీకరించారు. 1966లో వారు అస్సాం గవర్నర్ విష్ణు సహాయ్‌ని కలిసి విద్యార్థుల అంతర్‌రాష్ట్ర జీవనానుభవ పథకాన్ని (Students Experience in Inter-State Living) ఆయనకు వివరించారు. అదే సంవత్సరం మేనెలలో మణిపూర్, మేఘాలయ, అస్సాం, నాగాలాండ్, అరుణాచల్‌ప్రదేశ్‌లకు చెందిన 80 మంది విద్యార్థులు బొంబాయికి వచ్చి ిక్కడ వేరువేరు కుటుంబాలతో కలిసి జీవించారు.

తాము 16 విభిన్న గిరిజన తెగలకు చెందిన వారమని, 16 ాండలీకాలు మాట్లాడుతామని బొంబాయి వచ్చిన తరువాత ఆ ఈశాన్యభారత విద్యార్థులకు తెలిసింది. అక్కడే మొట్టమొదటి సారిగా వారు ఒకరితో ఒకరు కలుసుకున్నారు. ఆనాటి బృందంలో ప్రస్తుత అరుణాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రి (శ్రీ) గెగాంగ్ అపాంగ్ ఒకరు. తరువాత మరల ఒకసారి అరుణాచల్ విద్యార్థుల బృందం బొంబాయి వచ్చినపుడు అప్పటి అక్కడి ముఖ్యమంత్రి పి.కె.తుంగన్ తన మంత్రివర్గంలో పి.డబ్ల్యు.డి మంత్రి గాఉన్న (శ్రీ) అపాంగ్‌ను ఆ బృందంతోపాటు పంపించాడు. అపాంగ్ 1966లో తనకు ఒకనెల ఆతిథ్యమిచ్చిన కుటుంబాన్ని బొంబాయిలో కలుసుకున్నాడు. అరుణాచల్ నుండి వచ్చిన 'గౌరవనీయ అతిథిగా' ఆయనను ఆ కుటుంబసభ్యులు అమితానందంతో స్వాగతించారు. అయితే అపాంగ్ వెంటనే వారిని సరిదిద్దాడు. తాను అతిథిని కానని, ఆకుటుంబంలో ఒక కుమారుడి లాంటి వాడినని, కేవలం అరుణాచల్ నుంచి వస్తున్నానంతేనని ఆయన వారితో అన్నాడు.

ఆనాటి నుండి ఈ SEIL పథకం విద్యార్థిపరిషత్ వార్షిక కార్యక్రమం

అయింది. 1980 డిసెంబర్ 30 నుండి వివిధ ఈశాన్యరాష్ట్రాల విద్యార్థులను దేశంలోని వివిధప్రాంతాలకు ఆహ్వానించారు. ప్రతిచోట, విద్యా సాహిత్యరంగాలలో ప్రముఖులు, అధ్యాపకులు, విద్యార్థులు వారికి హృదయపూర్వక స్వాగతం పలికారు. ఆంధ్రప్రదేశ్‌లో వారు వారంరోజులు పర్యటించారు. హైద్రాబాద్, విశాఖలలో వారికి సన్మాన కార్యక్రమాలు జరిగాయి. ఉస్మానియా, ఆంధ్ర విశ్వవిద్యాలయాల వైస్‌ఛాన్స్‌లర్లు ఆ కార్యక్రమాలలో పాల్గొని వారిని అభినందించారు. విశ్వవిద్యాలయాలలో జరిగిన సన్మానాల కంటే, వారిని తమ ఇళ్ళకు ఆహ్వానించి, స్వంత సంతానం వలే ఆదరించి, రకరకాల వంటకాల వడ్డించిన అనేక మంది తల్లుల ఆత్మీయతే వారిని కదిలించివేసింది.

ఖాసీ విశ్వాసాలు, సంప్రదాయాలలోని ముఖ్యాంశాలను గురించి తెలుసుకొనడానికి ప్రతి ఒక్కరు చూపిస్తున్న అంతులేని ఆసక్తి ఆఖాసీ విద్యార్థులను ఆశ్చర్యపరిచింది. అయితే, వారి ఆసక్తికి తగిన సమాధానాలు ఇవ్వలేనందుకు వారు విచారపడ్డారు. ఇది వారిని అంతర్ముఖులను చేసింది. తమ గురించి మరింత లోతుగా తాము తెలుసుకోవాలని వారికి అనిపించింది. తిరిగి వెళ్ళిన తరువాత వారు సామాజిక- ఆధ్యాత్మిక సంస్థ అయిన 'సేంగ్ ఖాసీ' వైపు ఈ దృష్టితో అధికంగా ఆకర్షితులయ్యారు. ఒకప్పుడు వృద్ధ ఖాసీ ప్రజలకు మాత్రమే పరిమితంగా ఉంటూ వచ్చిన సేంగ్ ఖాసీ కార్యక్రమాలకు ఇప్పుడు యువకులు, మహిళల నుండి కూడా ప్రోత్సాహకరమైన ప్రతిస్పందన లభిస్తోంది.

వివిధరాష్ట్రాల నుండి, వివిధకార్యక్రమాలద్వారా SEIL ప్రతిసంవత్సరం కొత్త విద్యార్థులను విశేషంగా ఆకర్షిస్తోంది. ఈశాన్యరాష్ట్రాలకు, మిగిలిన భారతదేశానికి మధ్య ఒక సమాన సాంస్కృతిక అస్తిత్వాన్ని మేలుకొల్పడానికి, ప్రతిష్టించడానికి ఈ ప్రయత్నాలన్నీ ఉద్దేశింపబడ్డాయి. ఇప్పటి వరకు 10 బృందాలు దేశమంతటా పర్యటించాయి. అందుకు బదులుగా ఇతరప్రాంతాల నుండి నాలుగు బృందాలు ఈశాన్యప్రాంతంలోను, ఒకబృందం అండమాన్-నికోబార్ దీవులలోను పర్యటించాయి.

'అలగ్ భాషా, అలగ్ వేశ్, ఫిర్ భీ అపనా ఏక్ దేశ్' (వేషం, భాష వేరైనా - మనదంతా ఒకటే దేశం) అనే నినాదం పాల్గొన్న వారిపై మంచిప్రభావం కలిగించినట్లు కనబడుతోంది. 1987లో ఖాసీ విద్యార్థిసంఘం మేఘాలయలో గిరిజనేతర హిందువులను భయభ్రాంతులను చేసి, బైటకు తరిమివేయసాగింది. ఒక సేంగ్ ఖాసీ ఆసుపత్రిలో

వైద్యునిగా పనిచేస్తున్న గిరిజనేతరునిపై ఆ విద్యార్థులు దాడిచేసినపుడు, అంతకుముందు SEIL కార్యక్రమంలో పాల్గొన్న ఇరువురు ఖాసీ విద్యార్థినులు అతడికిరక్షణగా, వారిని ఎదిరించి నిలబడ్డారు. 1987లో ఇతర ప్రాంతాల విద్యార్థులు ఈశాన్య రాష్ట్రాలను సందర్శించినప్పుడు కూడా ఉరకలెత్తే యువోత్సాహం రూపంలో అదే ప్రేరణ కనబడింది. హాఫ్లాంగ్, షిల్లాంగ్, ఇటానగర్, ఇతరప్రదేశాలలో రైల్వేస్టేషన్లు, బస్స్టాండుల వద్ద స్థానిక గిరిజన యువతీయువకులు 'భారత్ మాతకీ జై' నినాదంతో వారికి స్వాగతం పలికారు. గిరిజన విద్యార్థుల సమూహం నుండి ఈ ప్రేరణదాయక మంత్ర వాక్యాలను విన్న హిప్పన్‌రాయ్ 'ఖాసీలాండ్‌లో 'భారత్ మాతాకీజయ్' నినాదం వినవస్తుందని నేనెన్నడూ ఊహించలేదు' అని ఆనందంతో అన్నాడు.

## మధ్యప్రదేశ్‌లో:

గిరిజనులు నివసించే రెండవ పెద్ద భూభాగమైన ఛోటానాగపూర్ ప్రాంతాన్ని కూడా బ్రిటిష్ వారు 'పరిమిత ప్రవేశప్రాంతం'గా ప్రకటించి ఇతరులు ప్రవేశించకుండా చేశారు. వ్యక్తిగత స్థాయిలోను, సామూహికంగాను పెద్దఎత్తున అక్కడ మతం మార్పిడులు సాగిపోతున్నాయి. మిషనరీలు గ్రామపెద్దలపై దృష్టిని కేంద్రీకరించారు. వారు గనుక మతం మారితే గ్రామం మొత్తం వారిని అనుసరిస్తుంది. ఆకలి, అనారోగ్యం, పేదరికం, నిరుద్యోగం, అనాథతనం లాంటి వారి అవసరాలు, ఇక్కట్లన్నింటినీ మిషనరీలు తమకనుకూలంగా వాడుకున్నారు. తమ పాఠశాలలలో చేరిన హిందూ బాలబాలికలకు క్రైస్తవపేర్లు పెట్టడం వారు సాగించిన దుశ్చర్యలలో ఒకటి. మధ్యప్రదేశ్‌లోని జస్పూర్‌లో గిరిజనులను క్రైస్తవ మిషనరీలు ఎంతగా అణచివేతకు గురిచేసారన్నది ఒక విషయం చదివితే అర్థమౌతుంది. మిషనరీలు గుర్రంమీద వెళ్తున్నప్పుడు ఎదురుపడిన గిరిజనుడెవరైనా సలాం చేయకపోతే వెంటనే తనచేతిలోని కొరడాతో అతడు ఆ గిరిజనుడ్ని కొట్టేవాడు. స్వాతంత్ర్యానంతరం కూడా ఈ పద్ధతికొనసాగింది.

అయితే ఇప్పుడు పరిస్థితి మారింది. ఎక్కడెక్కడైతే వనవాసీ కళ్యాణాశ్రమ శాఖలు ప్రారంభం అయ్యాయో, అక్కడ సామూహిక మతం మార్పిడులు నిరోధించబడ్డాయి. వైయక్తిక మతం మార్పిడులు కూడా చాలా వరకు తగ్గుముఖం పట్టాయి. ఈ సందర్భంగా ఒక సంఘటనను

మనం గుర్తుచేసుకోవచ్చు. మధ్యప్రదేశ్‌లో సంప్రదాయంగా జరుపుకునే 'ఇండల్ పూజ'ను చాలా ఖర్చుతో కూడుకున్న పండుగ అన్న దృష్టితో గిరిజనులు పూర్తిగా ఆచరించడం మానివేశారు. క్రైస్తవ మిషనరీలు రంగప్రవేశం చేసి, అమాయక హిందూ గిరిజనులను వలలోవేసేందుకై చర్చిలలో ఈపూజను నిర్వహించడం మొదలుపెట్టారు. వనవాసీ కళ్యాణాశ్రమం ఈపూజను పురాతన పద్ధతిలో, తక్కువ ఖర్చుతో నిర్వహించి మిషనరీల కుట్రను నివారించింది.

మిగతాచోట్ల లాగే జస్పూర్‌లో కూడా ప్రభుత్వం పేదలకు ఇచ్చే వివిధ వస్తువుల పంపిణీ క్రైస్తవ సంస్థల ద్వారానే జరుగుతుంది. ఆ పంపిణీలో వారు వివక్షత చూపుతున్నారని ఆరోపిస్తూ 25వేలమంది గిరిజనులు ఈమధ్య తమ సంతకాలతో జిల్లా కలెక్టర్‌కు ఒక పిటీషన్‌ను దాఖలు చేశారు.

రాజస్థాన్‌లోని బాన్స్‌వాడ జిల్లాలో టిబేదివాడ గ్రామం క్రైస్తవులకు బలమైన కేంద్రం. ఆ ప్రాంతంలోని హిందూ గిరిజనులు సైతం 'జయ్‌ఏసు' అనే ఒకరినొకరు అభినందించుకోవడం మొదలుపెట్టారు. కళ్యాణాశ్రమం తరపున అక్కడికి వెళ్ళిన ఒక సన్యాసి దానినంతటినీ మార్చి వేశాడు. ఇప్పుడు అక్కడ 'జయ్‌సీతారాం' అలవాటుగా మారింది. దసరా సమయంలో జరిగే 'రామలీల'కు కూడా బాగా ప్రజాదరణ లభిస్తోంది.

ఈ మధ్య ఒక బెల్జియన్ మిషనరీని దేశం నుండి బహిష్కరించినందుకు దేశం మొత్తంలో క్రైస్తవ మిషనరీలు పెద్దఎత్తున రభస చేశారు. ఆబహిష్కరణకు నిరసనగా బీహార్‌లో క్రైస్తవ పాఠశాలలన్నీ మూసివేశారు. బహిష్కరణను వెనుకకు తీసుకునే వరకు పాఠశాలలు తెరువబోమని వారు బెదిరించారు. సంఘ, కళ్యాణాశ్రమ కార్యకర్తలు ఒక శక్తివంతమైన ప్రచారదాడి ప్రారంభించారు. క్రైస్తవుల బెదిరింపుధోరణి వెనుకగల జాతివ్యతిరేక విధానాలను బహిర్గతం చేస్తూ, వారి పాఠశాలలన్నింటినీ స్వాధీనం చేసుకోవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ విద్యార్థులతో పెద్దపెద్ద నిరసనోద్యమాలను నిర్వహించారు. ప్రభుత్వం కూడా పాఠశాలలు వెంటనే తెరువకపోతే తీవ్ర పరిణామాలను ఎదుర్కొనవలసి ఉంటుందని హెచ్చరిస్తూ క్రైస్తవ సంస్థలకు తాఖీదులు పంపించింది. దాంతో బెంబేలెత్తిన క్రైస్తవసంస్థలు వెంటనే పాఠశాలలను తెరిచాయి.

ఛోటానాగపూర్ ప్రాంతంలో ప్రత్యేక జార్ఖండ్ రాష్ట్రంకోసం జరు

గుతున్న ఉద్యమ నాయకత్వం మొదటినుండి పూర్తిగా క్రైస్తవ సంస్థల చేతుల్లోనే ఉంది. ఇష్టం ఉన్నాలేకున్నా హిందూ గిరిజనులు వారి శిబిరంలోకి లాగబడేవారు. కళ్యాణాశ్రమ కార్యకలాపాలు విస్తరించిన కారణంగా ఇప్పుడు పరిస్థితి నెమ్మదిగా మారుతోంది. హిందూవనవాసులు క్రైస్తవాధిపత్యం నుండి తొలగిపోయి, తమస్వంత నాయకత్వాన్ని ముందుపెట్టడం ప్రారంభించారు. ఇప్పుడిక ఉద్యమం హింసాత్మకంగా, జాతివ్యతిరేకంగా రూపొందదని నమ్మకం కలుగుతోంది.

## మిషనరీ కార్యకలాపాలపై కమీషన్ విచారణ:

క్రైస్తవ మిషనరీల కార్యకలాపాల వెనుక ఉన్న దురుద్దేశాన్ని బట్టబయలు చేయడానికి ప్రభుత్వస్థాయిలో చర్యలు తీసుకున్న మొట్టమొదటి ప్రభుత్వం మధ్యప్రదేశ్ ప్రభుత్వం. 1950 దశకపు మధ్యభాగంలో ఈ ఉద్దేశంతో జస్టిస్ భవానీశంకర్ నియోగి అధ్యక్షతన ఒక విచారణ సంఘాన్ని ప్రభుత్వం నియమించింది. విచారణ సంఘానికి అవసరమైన సాక్ష్యాధారాలను సేకరించే పనిని మధ్యప్రదేశ్‌లో పనిచేస్తున్న ఒక సంఘప్రచారక్ స్వీకరించాడు. అతడిప్రయత్నాల కారణంగానే 5వేల మందికి పైగా గిరిజనులు, ఇతరులు విచారణ సంఘం ముందు ప్రత్యక్షంగా సాక్ష్యం ఇవ్వడానికి ముందుకు వచ్చారు. లిఖిత ఆధారాలతో కూడిన, అధికృత నివేదికను తయారుచేయడంలో విచారణసంఘానికి ఆ సాక్ష్యాలు ఎంతగానో దోహదపడ్డాయి. క్రైస్తవ మిషనరీ కార్యకలాపాల వెనుకగల ఉద్దేశాలను ఆ నివేదిక బహిర్గతం చేసింది. ఈ చారిత్రాత్మక నివేదిక కారణంగానే మొట్టమొదటిసారిగా క్రైస్తవ మిషనరీలు సాగిస్తున్న మోసపూరిత కార్యకలపాలు వెలుగుచూసాయి.

విచారణసంఘపు నివేదిక ఆధారంగా మధ్యప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రంలో చట్ట వ్యతిరేక, బలవంతపు మతం మార్పిడులను నిషేధిస్తూ చట్టం చేసింది. అయితే కేంద్రం కూడా అందుకనుగుణమైన చర్యలు తీసుకోని కారణంగా, దేశంలో మిషనరీ కార్యకలాపాలు అడ్డు అదుపు లేకుండా సాగుతూనే ఉన్నాయి.

కన్యాకుమారి జిల్లా మండైకాడులో 1982 మార్చిలో జరిగిన అల్లర్లపై విచారణ జరిపిన జస్టిస్ వేణుగోపాల్ కమీషన్ మొన్నమొన్ననే సమర్పించిన తన నివేదికలో క్రైస్తవులకు, హిందువులకు మధ్య అక్కడ జరిగిన ఘర్షణలకు ముఖ్యకారణం క్రైస్తవ చర్చి అక్కడ సాగిస్తున్న మతం

మార్పిడి కార్యకలాపాలేనని స్పష్టంగా అభిప్రాయపడింది. తమిళనాడు ప్రభుత్వాన్ని మతం మార్పిడులపై నిషేధం విధించమని కమీషన్ సలహా ఇచ్చింది. దేశమంతటా అదేవిధంగా చేయమని కేంద్ర ప్రభుత్వాన్ని కూడా అర్థించింది. అయితే ఇంతవరకు ఏమీ జరుగలేదు.

## పునరాగమనానికి పిలుపు:

జాగృతులను చేయడం, నివారణోపాయాలను వెదకడం వరకే హిందూ జాగరణ ఉద్యమం పరిమితం కాలేదు. అది మరొక అడుగు ముందుకు వేసింది. పునరాగమనం విషయంలో హిందూమనస్తత్వంలో ఉన్న ఆత్మహత్యాసదృశమైన వ్యతిరేకభావనను తొలగించడానికి తీవ్రమైన కృషి జరుగుతోంది. మతం మారిని వారిని తిరిగి హిందూత్వంలోకి తీసుకొనడానికి ధార్మిక పరమైన అనుమతి లేదనే ఛాందసవాదం ఒకటి ఉంది. ఆ కారణంగానే, అనేకశతాబ్దాలుగా హిందూత్వంలో నుండి ఇతరమతాలలోనికి ఎటువంటి ఆటంకం లేకుండా ఒకేదిశలో ప్రవాహం సాగింది. నేటి గుండెలపై కుంపటిలాంటి కాశ్మీర్ సమస్యకు మూలం అనాటి ఆత్మవినాశక దృష్టికోణం కారణంగా సంభవించినదే. సుమారు వంద సంవత్సరాల క్రితం కాశ్మీర్‌లో, హిందూత్వంలోకి స్వచ్ఛందంగా తిరిగిరావాలని అభిలషించిన మొత్తం ముస్లిం సమాజాన్ని స్వీకరించకుండా రాజుకు పండితులు అడ్డుపడ్డారు.

స్వయంగా బంధించుకున్న ఈ సంకెళ్ళను ఛేదించడానికి గతంలోను, ఈమధ్య కాలంలోను కూడా దూరదృష్టికల మత, సామాజిక సంస్కర్తలు సాహసోపేతమైన ప్రయత్నాలు సాగించారన్న విషయంలో అనుమానం లేదు. స్వామిదయానంద, స్వామి శ్రద్ధానంద, సావర్కర్ వంటి ఈ శతాబ్దపు హిందుపునరుజ్జీవనోద్యమ నాయకులు ఇచ్చిన బలమైన ఊతం యొక్క ప్రభావం ఈ ఉద్యమంపై తప్పనిసరిగా ఉంది. ఏమైనా సాధారణ హిందూ హృదయానికి ఈ అంశం యొక్క ప్రాధాన్యత అర్థ కావడానికి సమయం పట్టింది. అంతేగాక హిందువులుగా పునరాగమ: చేసిన వారిని కూడా ఇంకా సంపూర్ణంగా జీర్ణం చేసుకోలేకపోయ

పూర్వమహాపురుషులు ప్రారంభించి వెళ్ళిన ఈ కార్యాన్ని స్వీక ముందుకు నడిపించాలని శ్రీ గురూజీ నిర్ణయించారు. మన మనస్తత్వాలలో తగిన మార్పును సాధించేందుకు అనుగుణమైన ఈ ఉద్యమాన్ని వారు నడిపించారు. తన 51వ జన్మదిన

సందర్భంలో వారిచ్చిన పిలుపు వల్ల ఈ కార్యానికి తిరిగి చలనం వచ్చింది. మృత్యుభయం, ఒత్తిడి లేదా అధికార, పదవీ వ్యామోహాల కారణంగా మతం మారినవారిని 'మత పరమైన దాస్యానికి' గురియైన వారుగా శ్రీ గురూజీ అభివర్ణించారు. తమ సంఖ్యాబలం పెంచుకుని, రాజకీయాధిపత్యానికి మార్గం సుగమం చేసుకొనాలనే దురాక్రమణకారుల మతదురహంకారంలోనే ఈ మతం మార్పిడుల మూలం ఉందని వారు అన్నారు.

ఈ దిశలో మన ప్రజలకు సకారాత్మక నాయకత్వం వహించవలసిందిగా సామాజిక, ధార్మిక నేతలను ఒప్పించే ప్రయత్నాలు సత్ఫలితాలనివ్వడం ప్రారంభించాయి.

1966లో ప్రయాగలో విశ్వహిందూపరిషత్ నిర్వహించిన విరాట్ విశ్వహిందూసమ్మేళనం చరిత్ర సృష్టించింది. విభిన్న హిందూ ధార్మిక, ఆధ్యాతికధ్రుంథాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న మఠాధిపతులు, ధర్మాచార్యులు, ప్రముఖ సంతులు కలిసి శతాబ్దాల తరబడి పునరాగమనంపై ఉన్న నిషేధాన్ని తొలిగించాలని తీర్మానించారు. తీర్మానం చివరిలో, కర్నాటకలోని ఉడిపి శ్రీ పెజావర్ మఠాధీశ్వరులు 'న హిందు: పతితోభవేత్'- అనే కొత్త మంత్రాన్ని ఉచ్చరించగానే సభా భవనమంతా చప్పట్లతో మార్మోగింది. హిందువువెన్నటికీ పతితుడు కాబోడని ఆ మంత్రం సంస్కృతంలో పేర్కొంది. తద్వారా మతం మారిన వ్యక్తి పతితుడవుతాడని, అతనిని తిరిగి తీసుకోలేమనే పొరపాటు అభిప్రాయం తొలగించటానికి దోహదపడింది. కేవలం ఆరాధనా విధానం మార్చుకొన్నంత మాత్రాన అతడి మౌలిక హిందూ అస్తిత్వం రద్దయిపోదని ఆ నూతన మంత్రం స్పష్టం చేసింది. ఈ ప్రకటన ఒక నూతన 'స్మృతి' లాంటిది. ఆధునిక కాలానికి అనుగుణంగాను, సమాజసంఘటనకు దోహదకారి అయ్యేవిధంగాను మన ప్రాచీన ధర్మశాస్త్రాలకు ఇచ్చిన సరికొత్త వ్యాఖ్యానం ఇది.

ఈ ప్రకటన అమలుకు వివిధస్వామీజీలు కృషిచేస్తూనే ఉన్నారు. 'పరావర్తన' కార్యక్రమాలకు సారథ్యం వహించి, పునరాగమనం చేస్తున్నవారిని ఆశీర్వదిస్తున్నారు. ఈ 'పరావర్తనం' అనే పదాన్ని విశ్వహిందూపరిషత్ ప్రచారంచేసింది. ఇది పునరాగమనం యొక్క సరియైన స్వభావాన్ని ప్రకటిస్తుంది. మతం మారిన వారందరూ మన సోదరీసోదరులేనని, వారందరినీ ప్రేమతో స్వగృహానికి ఆహ్వానించాలని 'పరావర్తన' పదం గుర్తుచేస్తుంది.

## పురాతన మతానికి పునర్జన్మ:

హైందవేతర మతాలలోకి జరిగిన మతం మార్పిడులన్నీ న్యాయవిరుద్ధము, నీతి విరుద్ధము అయిన పద్ధతిలో జరిగినవే నన్న విషయం అందరికీ తెలిసినదే. గతంలో ముస్లిం పరిపాలన సమయంలో అన్నిరకాల ఒత్తిడి పద్ధతులను వారు ఉపయోగించారు. ఆ తరువాత కాలంలో క్రైస్తవ మిషనరీలు చేసిన మోసాలు కూడా అందరూ ఎరిగినట్టివే. క్రైస్తవులుగా మతం మారిన వారిని గాంధీజీ 'కూటికక్కుర్తి క్రైస్తవులు' అని పిలిచేవారు. ముఖ్యంగా మూకుమ్మడిగా మతం మారిన వారి విషయంలో అయితే, ఈ క్రొత్తమతం వారి పైపై పూతలకు మాత్రమే పరిమితమైవుంది. వారి హృదయాలలో ప్రాచీన హిందూ ధార్మిక విశ్వాసాలు భద్రంగానే ఉన్నాయి. కనుక నిరుపేదలు, నిరక్షరాస్యులు అయిన ఈ మతం మారిన సోదరులను వారి హిందూ వారసత్వాన్ని గుర్తుచేసి, తిరిగి మాతృధర్మం ఒడిలోకి రప్పించడానికి చాలా ప్రభావవంతమైన మార్గం వారిలో అంతర్గతంగా ఉన్న ఈ ధార్మిక జ్ఞాపకాలను జాగృతం చేయడమేనని గమనించబడింది.

పుల్బనీ, గంజాం, కోరాపుట్, సుందర్‌గర్, కియోంజర్, మయూర్ భంజ్ జిల్లాలలోని వనవాసీ గ్రామాలలో విస్తృతంగా పర్యటించిన జగన్నాథ రథయాత్ర హిందూ, క్రైస్తవ వనవాసు లిరువురిలోనూ నిద్రాణంగా ఉన్న నిష్ఠను, సామూహిక సంకల్పాన్ని మేల్కొల్పడంలో బలమైన కారణం అయింది. 1986 మార్చి నుండి 1988మే వరకు గల సమయంలో ఆరథయాత్ర వెయ్యి స్థలాలను స్పృశించింది. ప్రతిచోట 3,4 వేలమంది ప్రజలు ఆకర్షితులయ్యారు. అలా దాదాపు 30,40 లక్షలమంది ప్రజలు ఈ రథయాత్రలో పాల్గొన్నారు. దీనినిబట్టి ఈ రథయాత్ర ఎంత పెద్ద స్థాయిలో జరిగిందో ఊహించవచ్చు. రకరకాల కార్యక్రమాలకోసం ఎక్కడికక్కడ స్థానిక ప్రజలు ఖర్చుచేసిన ధనం మొత్తం దాదాపు 30-40 లక్షల రూపాయలకు చేరింది. అయిదు స్థలాలలో ఒకే సమయంలో జరిగిన ప్రారంభోత్సవ కార్యక్రమాలలో 6.5 లక్షల వనవాసులు పాల్గొన్నారు. ఆ యాత్ర సందర్భంగా ఆవిర్భవించిన ధార్మిక జాగరణకు విశ్వహిందూపరిషత్, వనవాసీ కళ్యాణాశ్రమాలు కీర్తనమండలులు, సత్సంగాలు, యువకేంద్రాల రూపంలో శాశ్వతమైన సంస్థాగత స్వరూపం కల్పించాయి. ఇప్పటివరకు 500 కమిటీలద్వారా, అలాంటి 1600 కేంద్రాలు ప్రారంభమయ్యాయి.

ధార్మిక, సమాజసేవా సంస్థలు నిర్వహించే వివిధ కార్యక్రమాలకు ఒరిస్సాలోని 'ప్రకల్ప సమన్వయసమితి' ఒక మార్గదర్శక, సమన్వయ ఆలంబనంగా పనిచేస్తోంది. చాకపాడ్‌లో 120 మంది విద్యార్థులతో నడుస్తున్న దైనందిన పాఠశాలతోబాటు 3 విద్యార్థుల వసతి గృహాలు, 20 సాప్తాహిక బాల్వాడీలు, 300 రాత్రి పాఠశాలలు కూడా పనిచేయడం ప్రారంభించాయి. మూడు సంచార (Mobile Vans) వైద్యశాలలతో బాటు అనేక మందుల పంపిణీ కేంద్రాలు నెలకు 20వేలమంది రోగులకు సేవచేస్తున్నాయి.

దీనంతటి ప్రభావం క్రైస్తవ వనవాసులపై పడకుండా ఉండదుకదా! ఈ మధ్య కాలంలో 15వేలమంది హిందూ ధర్మంలోకి తిరిగివచ్చారు.

మధ్యప్రదేశ్‌లో కూడా కళ్యాణాశ్రమం నిర్వహించే యజ్ఞయాగాలు, సామూహికస్థాయిలో జరిగే ఇంద్రపూజా కార్యక్రమాలలో వందలాది క్రైస్తవ వనవాసులు సైతం వచ్చి పాల్గొంటున్నారు. వాటి ఫలితంగా వారిలో దాదాపు 2 వేలమంది, హిందుత్వంలోకి తిరిగి వచ్చారు. వారి పరంపరాగత ధర్మం చాచిన చేతులలోనికి మహారాష్ట్రలో 4వేల మంది, బీహార్‌లో 13వేల మంది వచ్చిచేరారు. దక్షిణ భారతదేశంలోకూడా, ఆంధ్రప్రదేశ్‌లో ఇస్లాం, క్రైస్తవాలలోనికి మతం మారిన 19,000 మంది హరిజనులు పరావర్తన కార్యక్రమాలద్వారా మాతృధర్మంలోనికి తిరిగివచ్చారు. వీరిలో 1200 మంది ముస్లింలు. మంచిర్యాలలో జరిగిన ఒకేకార్యకమంలో 2000 మంది స్వధర్మంలోకి వచ్చారు. ఈ పరిణామాలన్నీ ఈ మధ్యకాలంలో సంభవించినవేనని మనం గుర్తుంచుకోవాలి.

రాజస్థాన్‌లో ఏర్పడిన ఒరవడి నిజంగా విశిష్టమైనది. వారంతా పృథ్వీరాజ్ చౌహాన్ పతనం తరునాత ఇస్లాం మ్రింగివేసిన చౌహాన్ రాజ పుత్రులు. అయితే వారి ప్రాచీన హిందూరక్తం ఇన్నాళ్ళుగా సజీవంగానే ఉండింది. ఈద్, మొహరంలతో బాటు వారు దసరా, దీపావళికూడా జరుపుకుంటూ వచ్చారు. వారి సంతానానికి హిందూ, ముస్లిం పేర్లు రెండూ ఉండేవి. ఇస్లామేతర అంశాలన్నింటినీ తొలగించివేయాలన్న ఉన్మాదంలో ముస్లిం మౌల్వీలు వారిని హిందూపేర్లను, హిందూపండుగలను విడిచిపెట్టి వేయవలసిందిగా ఒత్తిడి చేసినపుడు వారిలో ఆలోచన ప్రారంభం అయింది. కొన్ని అనుచిత విషయాలను విడిచిపెట్టడం అంటూ వస్తే, శతాబ్దాలక్రితం తమపై బలవంతంగా రుద్దబడిన ఇస్లాంనే త్యజించడం బాగుంటుందని వారు భావించారు.

ఒక గ్రామంలో ఉన్న అలాంటి ముస్లిం ప్రజలు శ్రీ పుష్కరతీర్థం యొక్క ప్రధాన అర్చకుల వద్దకు వచ్చారు. తాము హిందూధర్మంలోకి తిరిగి రావచ్చా? అని ఆయనను అడిగారు. స్థానిక సంఘచాలక్ అయిన ఆ ప్రధాన అర్చకులు వెంటనే అంగీకారాన్ని తెలిపారు. అయితే ఈ చర్య మౌల్వీలకు ఆగ్రహం కలిగించింది. ఇస్లాంను విడిచిపెడితే తీవ్ర పరిణామాలను ఎదుర్కొనవలసి వస్తుందని ఆగ్రామస్తులను బెదిరించడానికి కొందరు గూండాలను వారు పంపించారు. అయితే ఆ గ్రామస్థుల సంకల్పాన్ని మరింత ప్రోత్సహించడంకోసం స్వయంసేవకులు ఆ గ్రామంలో ప్రభావ వంతమైన రీతిలో సైకిల్ర్యాలీ నిర్వహించడంతో గూండాల ఆటలు సాగలేదు. ఆ తరువాత, మహాశివరాత్రి పర్వదినాన, ఆ గ్రామంలోని ముస్లింలందరూ ఉపవాసంచేసి, రాత్రంతా శివుని భజన చేశారు. మరుసటి రోజు, అర్చకులు కొన్ని ప్రాథమిక ధార్మిక విధులను పూర్తిచేసిన తరువాత వారందరిని హిందూధర్మంలోకి తిరిగిస్వీకరించారు. చౌహాన్రాజపుట్ మహాసభ, విశ్వహిందూ పరిషత్లు మాతృధర్మంలోకి తిరిగివచ్చినవారికి సమాన, గౌరవనీయస్థానం కల్పించబడుతుందని హామీ ఇవ్వడంతో ఈ ప్రక్రియకు మరింత ప్రోత్సాహం లభించింది.

రోజులు గడిచేకొద్దీ ప్రతి సంవత్సరం జరిగే పృథ్వీరాజ్ చౌహాన్ జయంతి వేలసంఖ్యలో రాజపుట్ ముస్లింలు పాల్గొనే ఒక సామూహిక ఉత్సవంగా మారింది. ఇవన్నీ గ్రామం తరువాత గ్రామం మాతృ ధర్మం స్వీకరించడానికి ముందుకు వచ్చేటట్లు చేశాయి. అలా తిరిగి వచ్చిన వారిలోనే కొందరు కార్యకర్తలు మిగిలిన వారిని కూడా తమ పురాతన సంప్రదాయంలోనికి తిరిగితీసుకుని వచ్చే బాధ్యతను స్వచ్ఛందంగా స్వీకరించి ముందుకు రావడంతో ఈ ప్రక్రియ మరింత బలం పుంజుకుంది. తన తాత తండ్రుల ధర్మంలోకి తిరిగి వచ్చినవారి సంఖ్య ఇప్పటికి 40 వేల వరకు పెరిగింది.

## మరువలేని మనసులోని జ్ఞాపకాలు:

రాజస్థాన్లో మాదిరిగానే, ఇంకా అనేక ఇతర ప్రాంతాలలో కూడా ఇప్పటికీ తమ ప్రాచీన హిందూ కట్టుబాట్లు, సంప్రదాయాలను అంటిపెట్టుకుని ఉన్న ముస్లిం వర్గాలు ఉన్నాయి. జమ్మూలోని ఒక గ్రామంలో స్వయంసేవకులు, మిగిలిన గ్రామస్తులతో మహాదేవుని దేవాలయం ఒకటి నిర్మించే విషయమై చర్చిస్తున్నారు. ఫలానా పరిమాణం గల శివ లింగం ఉండాలని వారు నిర్ణయించగానే, అక్కడ ఉన్న స్థానిక ముస్లింలు

"మీరేం హిందువులు? అంత చిన్న పరిమాణం గల మహాదేవుడినా మీరు పూజించేది? మేం అంతకంటే పెద్ద పరిమాణంగల శివుడిని పూజిస్తాం" అని వ్యాఖ్యానించారు. స్వయంసేవకులు ఆశ్చర్యపడి 'మీరు ఏ శివలింగాన్ని గురించి చెబుతున్నారు?' అని ప్రశ్నించారు. 'అదేమిటి? ప్రతి సంవత్సరం మేం చేసే మక్కాయాత్ర అందుకోసమేనని మీకు తెలియదా? కాబాలో ఉన్నది శివలింగమే, మరేదికాదు. అని ఆ ముస్లింలు సమాధానం ఇచ్చారు.

తమ పురాతన ధర్మంలోకి తిరిగి రావాలన్న కోరిక దేశం మొత్తంలో అలాంటి ముస్లిం వర్గాలలో ప్రబలంగా కనబడుతోంది. తమ గతించిన హిందూ అనుబంధాల గురించిన మధుర స్మృతులు వారిలో ఇంకా తిరుగాడుతూనే ఉన్నాయి. అనుకోకుండా ఒకసారి, లక్నోలోని ఒక ప్రముఖ సంఘకార్యకర్తకు, ఒక మౌల్వీకి మధ్య జరుగుతున్న చర్చలో ఉద్రిక్తత చోటుచేసుకుంది. చర్చ ముస్లింల వేర్పాటువాద ధోరణులు, జాతీయ జీవనం నుండి దూరంగా ఉండడంపై జరుగుతోంది. తీవ్రస్థాయిలో వాదోపవాదాలు జరుగుతుండగా, సంఘ కార్యకర్త మౌల్వీతో కొన్ని దశాబ్దాల, శతాబ్దాల క్రిందట అతడి పూర్వీకులు కూడా హిందువులేనని గట్టిగా అన్నాడు. వెంటనే ఆ మౌల్వీ చర్చించడం ఆపి వేసి మౌనంగా ఉండిపోయాడు. కొంతసేపు తరువాత అతడు ఆ సంఘకార్యకర్తను తన ంటికి రావలసిందిగా ఆహ్వానించాడు. ఆ కార్యకర్త అంగీకరించాడు. ఒక ుసీదు రెండవ అంతస్తులో ఉన్న ఆమౌల్వీ ఇంటికి అతను వెళ్ళాడు. ెౌల్వీ తలుపులు లోపలనుండి గడియపెట్టి ఇంట్లోకి వెళ్ళాడు. ఈ మౌల్వీ ుమి చేయనున్నాడని కార్యకర్త ఆశ్చర్యపడుతున్నాడు. కొద్దిసేపటిలోనే, ఆ మౌల్వీ తిరిగివచ్చాడు. ఆయనచేతిలో ఆయన వంశవృక్షాన్ని తెలియజేసే పత్రం ఉంది. పైన ఉన్న ఒకపేరును చూపిస్తూ, మొట్టమొదటిగా ఇస్లాం స్వీకరించినది అతడే అని చెప్పాడు. 'మేం ఈ పత్రాలను చాలా జాగ్రత్తగా భద్రపరుస్తున్నాం. హిందూ సమాజం తన ద్వారాలు తెరిచి, కారణాంతరాలవల్ల బైటకు వెళ్ళిన తన సంతానాన్ని తిరిగి తీసుకునే రోజుకోసం ఎదురుచూస్తున్నాం.' అని ఆ మౌల్వీ చెప్పాడు. చివరిలో 'మీరు మమ్మల్ని స్వాగతించడానికి సిద్ధంగాఉన్నారా?' అని ఆయన అడగడంతో సన్నివేశం పతాకస్థాయిని చేరింది.

జమ్మూలోకూడ అదే విధమైన అనుభవం సంఘకార్యకర్తలకు ఎదురైంది. స్థానిక ముస్లిం పెద్దలు తమ పూర్వీకులు తరువాతి తరాలవారికి అందజేస్తూ వచ్చిన ఒక తామ్రపత్రాన్ని వారికి చూపించారు. 'మా

చేతులలో లేని పరిస్థితులలో మేము ఇస్లాంలోకి మార్చబడ్డాం. భవిష్యత్తులో ఎప్పుడైనా హిందువుల పరిపాలన వస్తుంది. అప్పుడు మీరంతా హిందూ ధర్మాన్ని తిరిగి స్వీకరించాలని ఆదేశిస్తున్నాం.' అని ఆ తామ్రపత్రంలో వ్రాసి వుంది.

ఈశాన్య భారతంలోని వనవాసుల ప్రాచీన సాంస్కృతిక బంధనాలు క్రైస్తవులుగా మతం మారినా కూడా తెగత్రెంపులు చేసుకోలేనంతటి బలమైనవి. వారిని పరంపరాగత ధర్మంలోనికి తిరిగి తీసుకునిరావడానికి దొక బలమైన ఆధారంగా ఉంటోంది. 1986-88 మధ్య 2 వేలమంది మతం మారిన ఖాసీలు ఈ పిలుపుకు ప్రతిస్పందించారు. పత్రాలపై అవసరమైన సంతకాలు చేశారు. (వాటి ప్రతులు చర్చికి కూడా పంపించబడ్డాయి.) తమ పూర్వీకుల ధర్మంలోకి తిరిగివచ్చారు.

## పునరాగమనంలో ఆటంకాల ఎదురీత:

కొన్ని వనవాసీ తెగలలో ఈ పునరాగమన ప్రక్రియ అంత సులభంకాదు. పునరాగమనానికి సామాజిక మాన్యత లభించడానికి కొన్ని క్లిష్టమైన సమస్యలను ముందుగా పరిష్కరించవలసి వుంటుంది.

ఉత్తర కచార్ జిల్లాలోని 'దిమాచా' తెగ వలే చాలా వనవాసీ తెగలు ఎంత గట్టి హిందువులంటే, గత వందసంవత్సరాలలో క్రైస్తవ మిషనరీలు వారి మత విశ్వాసాలను ఏమాత్రం కదిలించలేకపోయారు. 4, 5 సం.ల క్రితం మాత్రమే మొట్టమొదటిసారిగా 10, 12 మంది దిమాచాయువకులను ప్రలోభపెట్టి క్రైస్తవులను చేశారు. వారిలో ఇద్దరు యువకులు చాలా ప్రతిష్ఠిత కుటుంబాలకు చెందినవారు. దిమాచాలలో చాలా తీవ్ర ప్రతిక్రియ వచ్చింది. ఆయువకులను తమ తెగనుండి వెలివేశారు. అయితే, ఆ విధమైన చర్యలవల్ల వచ్చే ప్రమాదాన్ని పసిగట్టిన విశ్వహిందూ పరిషత్, మతం మారినవారిలో కొందరిని తిరిగి హిందూత్వంలోకి వచ్చేటట్లు ఒప్పించింది. అయితే, వారి తెగలో పునరాగమనం నిషిద్ధం. మరొక ఆటంకం కూడా ఎదురైంది. మతం మారిన ఇద్దరు యువకులూ ఇద్దరు క్రైస్తవ మ్హార్ (మిజో) యువతులను వివాహం చేసుకున్నారు. దిమాచాలలో విభిన్న తెగల మధ్య వివాహాలుకూడా నిషిద్ధమే. పునరాగమనం తరువాత ఆ యువతులగోత్రం ఏది అవుతుందన్న విషయం సమస్యను మరింత జటిలం చేసింది. ఎందుకంటే దిమాచాలలో స్త్రీ పురుషులకు వేరువేరు గోత్రాలు ఉంటాయి. మొత్తంమీద, దిమాచా తెగ పెద్దలు,

విశ్వహిందూ పరిషత్‌ల మధ్య సుదీర్ఘ చర్చల అనంతరం పునరాగమనం తరువాత ఆ యువకులను దిమాచాలుగానే స్వీకరించాలని, ఆ క్రైస్తవ మ్హార్ యువతులనుకూడా తమలో కలుపుకుని దిమాచాస్త్రీల గోత్రం వారికి ఇవ్వాలని నిర్ణయించారు. ఆ రకంగా మొట్టమొదటిసారి, మతం మార్పిడులలో ఒకే వైపు ప్రవాహానికి అడ్డుకట్టవేసి, తమ సమాజ సమైక్యతకు వాకిలి తెరిచిన ఘనత దిమాచాలకు దక్కింది.

సంప్రదాయ పద్ధతులు, నమ్మకాలవల్ల తల ఎత్తే సమస్యల పరిష్కారంలో చాలా సుదూరంగా ఉండే వర్గాలకు కూడా విశ్వహిందూ పరిషత్ కార్యకర్తలపై ఉండే ప్రగాఢమైన నమ్మకానికి, విశ్వాసానికి అద్దంపట్టిన మరొక సంఘటన ఉంది.

అస్సాంలోని రంగియాకు చెందిన ఒక అస్సామీ హిందూకుటుంబం తమ కుమారులలో ఒకడు ముస్లిం యువతిని వివాహం చేసుకున్న కారణంగా వారి కులం నుండి వెలివేయబడింది. ఆ యువకుడి సోదరుడు సహాయంకోసం విశ్వహిందూ పరిషత్ కార్యకర్తల వద్దకు వచ్చాడు. ఆ కార్యకర్తలు ఆ విధంగా వెలివేయడం వల్ల వారి కులానికి ఎటువంటి హాని కలుగుతున్నదో తెలిపి కులపెద్దలకు నచ్చచెప్పే ప్రయత్నంచేశారు. 10 రోజుల చర్చల తరువాత కూడా ఆ నాయకులలో భిన్నాభిప్రాయలు కొనసాగాయి. ఆ కుటుంబపు పునఃప్రవేశాన్ని ఒక వర్గం సమర్థిస్తుండగా, మరొక వర్గం వ్యతిరేకించసాగింది. చివరికి, వారి పూర్వ మహాపురుషులే అటువంటి వారిని వెనుకకు తీసుకున్నారని గుర్తుచేసిన తరువాత పెద్దలు దిగివచ్చారు. అయితే సత్రాధికారి ఈ జంటను ఆశీర్వదిస్తారోలేదోనన్న అనుమానాన్ని వారు వ్యక్తంచేశారు. విశ్వహిందూ పరిషత్ గనుక పరావర్తనం నిర్వహించేటట్లైతే తాను వారికి శరణం ఇవ్వడానికి సిద్ధమేనని సత్రాధికారి తెలియజేశారు. అందరికీ ఆనందం కలిగిస్తూ ఆ ధార్మికవిధి పూర్తి అయింది.

# జాతి ఆత్మవిశ్వాసాన్ని సుదృఢం చేసే కృషి

దేశ దక్షిణాగ్రాన నాగరకోయిల్ నుండి, ఉత్తరాన అమృతసర్, జమ్మూల వరకు, పశ్చిమాన బొంబాయి నుండి, తూర్పున పట్నా, గౌహతిలవరకు స్వయంసేవకులు, ఇతర సమర్పితులైన హిందూ కార్యకర్తల కృషి ద్వారా జరిగిన విశాలహిందూసమ్మేళనాలు ప్రస్తుతం దర్శనమిస్తున్న హిందూ చైతన్యం కేవలం ఎగిసిపడే కెరటంలాంటిది కాదని, ఏదో ఒక ప్రాంతానికి పరిమితమైనది కూడా కాదని సూచిస్తున్నాయి.

ఈ మహాజాగరణలో ఒక ముఖ్యమైన అంశం 'హిందు' పదానికి సంబంధించినది. గత వందసంవత్సరాలపైనుండి ఆ పదాన్ని తృణీకార భావంతో చూస్తూ, జాతి హృదయంలోనుండి దానిని పూర్తిగా తొలగించివేయాలని ప్రయత్నాలు జరిగాయి. హిందూత్వానికి సంబంధించిన ప్రతి అంశము సంకుచితమైనదని, మత తత్వమని, మూఢనమ్మకాల తోకూడినదని, ఛాందసవాదం అని బ్రిటిష్‌వారు హిందువుకు పాఠాలు చెప్పారు. బ్రిటిష్‌వారు దేశాన్ని విడిచిపెట్టి వెళ్ళడానికి హిందూ, ముస్లిం ఐక్యత ఒక నియమం అయింది. కాగా హిందూత్వాన్ని విడిచిపెట్టడం హిందూ-ముస్లిం ఐక్యతకు ముందు నియమం అయింది. నిజమైన జాతీయ స్వాభిమానం, సమైక్యత నిప్పురవ్వలు ఆ హిందూ పదంలోనే ఉన్నాయని మనకంటే బాగా బ్రిటిష్ వారికి తెలుసు. వాటిని రగిలిస్తే, అవిభగ్నన మండి వారి సామ్రాజ్యానికి మృత్యుగంట మ్రోగిస్తాయి అని కూడా వారికి తెలుసు. సమాజ మనస్థితిపై వారు చేస్తున్న ఈ దాడికి వ్యతిరేకంగా జాతీయ పునరుజ్జీవనోద్యమపు ఆధునిక మహానాయకులైన స్వామీదయానంద, స్వామీ వివేకానంద, శ్రీ అరవిందులు, లోకమాన్యతిలక్, గాంధీజీలు పోరాటం సాగించారు.

ఈ దేశపు ఆత్మ - హిందూత్వ భావనాజాగరణ - నేడు స్పష్టంగా పునరావిష్కారం అవుతున్నది.

## సమైక్య సంకల్పపు ఆవిష్కారం:

ప్రాచీన మహావీరులు, జాతీయనాయకులు, ద్రష్టలు, మహర్షులు విని పించిన అమరమైన సందేశం దేశంలో ఈ మూలనుండి ఆ మూలవరకు మార్మోగసాగింది. ఏ ప్రాంతాన్నీ, ఏ వర్గాన్నీ అది విడిచిపెట్ట లేదు. ఈ స్వచ్ఛమైన హిందూ సమైక్యతాపవనాలు అన్ని కులాలు, వర్గాలు, భాషా సమూహాలు, పట్టణ, గ్రామీణ, గిరిజన ప్రజలంద రినీ స్పృశిస్తున్నాయి. ఇంతటి విస్తారమైన, లోతైన హిందూచైతన్యం భారతదేశచరిత్రలో ఇంతకుముందెన్నడూ లేదంటే అతిశయోక్తి కాదు.

శంకరాచార్య, మధ్వాచార్య, రామానుజాచార్య, వల్లభాచార్యాది మహాగురువులు స్థాపించిన పీఠాలఅధిపతులైన ప్రముఖ ఆచార్యులు, వేదాంతవేత్తలు, ఆధ్యాత్మిక ద్రష్టలు ఒకే వేదికమీదకు వస్తున్నారు. సిక్కు, వీరశైవ, జైన, బౌద్ధ ధర్మగురువులతో వేదిక పంచుకుంటున్నారు. సంప్ర దాయవాదులైన పీఠాధిపతులుసైతం స్వచ్ఛమైన సమానత, సౌభ్రాతృత్వ భావనలతో ఇతర మఠాధిపతులతో కలిసి మెలిసి పనిచేస్తున్నారు.

జాతీయ జీవనంలోని ప్రతిరంగంలో ప్రముఖ సాధువులు, మహానుభా వులు సమాన హిందూవేదికలపై కలవడం దానికి ఒక అధికారిక ధార్మిక, సామాజిక మాన్యతను ఇచ్చింది.

కొన్ని ప్రముఖమైన సమ్మేళనాలను పరిశీలిస్తే ఈ నవీన హిందూ జాగరణ యొక్క విశాలత, అది ఇచ్చే సందేశం మనకు స్థూలంగా గోచరమౌతాయి. 1981 మార్చిలో కర్నాటక ప్రాంతంలో వరుసగా జరిగిన హిందూ సమాజోత్సవాలలో షిమోగా, మంగుళూరులలో జరిగిన వాటిని గురించి వర్ణిస్తూ అగ్రశ్రేణి కన్నడ దినపత్రికలు 'అవి ఆ పట్టణాలు ఇంతవరకు చూడనంతటి విశాలమైనవని' వ్రాశాయి.

## ఢిల్లీలో:

ర్యాలీలనగరమైన ఢిల్లీలో, 1981 అక్టోబరులో జరిగిన విరాట్ హిందూసమాజోత్సవము చాలా పెద్దది. పరిమాణంలోగానీ, క్రమశిక్షణ లోగానీ, జాతీయ ప్రయోజనాల స్పృహవిషయంలోగానీ అలాంటి సమ్మేళనం

అంతకుముందు ఎప్పుడు జరుగలేదు. "హిందూ జాతి సముద్ధరణకై ఈ యుగంలో ఉద్భవించిన అవతారమే ఈ విరాట్ హిందూసమాజ్" అని స్వామీ సత్యమిత్రానందజీ పలికిన పలుకులకు 10 లక్షల హృదయాలు స్పందించాయి. "ఇదొక యజ్ఞం. లక్షలాది ప్రజలు ఇందులో పాల్గొం టారు. ఈ యుగంలో హిందూసమాజాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకుని వెళ్తారు" అని గర్జించారు డా. కరన్‌సింగ్.

## తమిళనాడులో:

దేశ దక్షిణాగ్రాన ఉన్న కన్యాకుమారి జిల్లాలో నాగర్‌కోయిల్‌లో 1982 ప్రారంభంలో జరిగిన కన్యాకుమారి జిల్లా సమ్మేళనం చరిత్ర సృష్టించింది. ద్రవిడ ర్యాలీలను మాత్రమే చూడడానికి అలవాటు పడ్డ ఆ జిల్లాలో, హిందుత్వం ఇచ్చిన పిలుపుకు ప్రజలు పెద్దసంఖ్యలో తరలివచ్చారు. జిల్లా మొత్తం ఉత్సవ వాతావారణంతో కళకళలాడింది. 420 రెవిన్యూ గ్రామాలకుగాను, 350 గ్రామాలనుండి ప్రజలు ఊరేగిం పులో పాల్గొన్నారు. ఆనాటి ఊరేగింపులో 1 లక్ష మంది పాల్గొనట్లు పత్రికలు వ్రాశాయి. వయోవృద్ధ స్వాతంత్ర్యసమరయోధులు, తమిళ నాడు సర్వోదయ సంఘ అధ్యక్షులు అయిన శివన్ పిళ్ళై, గాంధీజీ ఆ ప్రాంతాన్ని పర్యటించినపుడు కూడా అంతటి విశాల జనసందోహాన్ని తాను చూడలేదని ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని వ్యక్తం చేశారు. స్వాతంత్ర్య పోరాటపు రోజులలో కూడా ఇంతటి ఉత్సాహం, ప్రేరణ కనిపించలేదని ఆయన అన్నారు. హిందూ రెలిజియస్ ఎండోమెంట్స్ విభాగంలోని ఒక ఉన్నతాధికారి, ధార్మిక, సామాజిక, రాజకీయ రంగాలలో ప్రముఖ నాయకులు ఆ సమ్మేళనంలో పాల్గొనడం తమిళనాడులో సామాజిక వాతావారణంలో ఒక హర్షించదగ్గ మార్పుకు సంకేతంగా నిలిచింది.

## అస్సాంలో:

అదే సమయంలో ఈశాన్య భారతంకూడా జోర్హాట్‌లో ఒక ప్రచం డమైన పూర్వాంచల హిందూ సమ్మేళనాన్ని వీక్షించింది. ఈశాన్య రాష్ట్రాలలోని అన్ని హిందూవర్గాలు, వివిధ గిరిజన తెగలకు చెందిన 6వేలమంది పాల్గొన్న ఆ సమ్మేళనం ఆ ప్రాంతపు చరిత్రలో మొట్ట మొదటిది. ఒక వృద్ధ హరిజనుడైన బాషాసింగ్ తన చేతులతో ఓం

పతాకాన్ని ఆవిష్కరించడంతో సమ్మేళనం ప్రారంభమయింది. ప్రారంభ సమావేశంలో ఇరువురు ప్రముఖ సత్రాధికారులు మార్గదర్శనం చేశారు. ఖాసీ నేత హిప్సన్‌రాయ్, నాగానేత రాణి గైడిన్ల్యూ, ఇంఫాల్‌కు చెందిన నీల్‌వీర్‌శాస్త్రి, హోఫ్లాంగ్‌కు చెందిన కచరీ తెగనేత కుంభహోజాయ్ దిమాసా, నాగానేత రుంగయ్ వాంగ్, బోరో నేత అవినాశ్ బ్రహ్మ, విశ్వహిందూ పరిషత్ అధ్యక్షులు మహారాణా భగవత్ సింహ, శ్రీ బాలా సాహెబ్ దేవరస్, శ్రీమతి విజయరాజె సింధియా తదితర అనేకమంది ప్రముఖులు ఆ సమ్మేళనపు సమైక్యజాతీయవైశిష్ట్యానికి ప్రత్యక్ష సాక్షులుగా నిలిచారు.

1980 - 82 మధ్య అస్సాంలో విశ్వహిందూపరిషత్ జిల్లా, తాలుకా స్థాయిలలో 27 చిన్న, పెద్ద హిందూ సమ్మేళనాలను నిర్వహించింది. ఒక ప్రత్యేక విషయంలో ఇవి ఎంతో కీలక పాత్ర వహించాయి. ఆ సమయంలో, అస్సాం రాష్ట్రం 'ఆసు' ప్రారంభించిన అక్రమ ప్రవేశకుల వ్యతిరేక ఉద్యమపు అగ్నిపర్వత శిఖరంపై కూర్చొని ఉంది. మణిపూర్ వేర్పాటువాదుల తీవ్రవాద చర్యలతో అట్టుడికి పోతున్నది. ఈ సమ్మేళనాలలో 2 లక్షలమంది ప్రతినిధులు పాల్గొన్నారు. కొందరు దగ్గరనుండి వచ్చారు. కొందరు దూరంనుండి వచ్చారు. కొండ ప్రాంతాలలో చాలా లోపల నివసించే వేలాదిమంది వాటిలో పాల్గొన్నారు. అనాదిగా వస్తున్న కుల, తెగ, భాషా వైరుధ్యాలన్నింటినీ వారు మరచిపోయారు. దిబ్రూగర్, ధూబ్రి, సిల్చార్ సమ్మేళనాలలో "న హిందుః విదేశీ భవేత్" - 'ఈ భూమిలో ఏ హిందువు విదేశీయుడుగాదు' - అనే క్రొత్త నినాదం ప్రజాదరణ పొందింది. అస్సాంలో అస్సామీ, బెంగాలీలమధ్య గల పరస్పరవిశ్వాసరాహిత్యం, ద్వేషభావనలను దూరంచేయడంలో కొంతవరకు ఇది దోహదం చేసింది.

## కేరళలో:

1982లో ఎర్నాకులంలో జరిగిన విశాల హిందూసమ్మేళనంలో అన్ని కులాలకు, వర్గాలకు చెందిన 5 లక్షలమంది హిందువులు పాల్గొన్నారు. ఒక అద్భుతమైన రీతిలో కేరళలోని 95 విభిన్న సామాజిక, ధార్మిక సంస్థలు తమ ప్రత్యేక గుర్తింపును విడనాడి, ఒకే విరాట్ హిందూ స్వరూపంగా ఏకమై నిలబడ్డాయి. బహిరంగసభానంతరం, తదుపరి కార్యక్రమాలను

నిర్ణయించేందుకై స్వామి చిన్మయానంద మార్గదర్శనంలో 500 వివిధ హిందూసంస్థల ప్రతినిధులు సమావేశమయ్యారు.

## బీహార్‌లో:

ఉత్తరభారతాన్ని ముంచెత్తిన వెల్లువ 1982 నవంబర్‌లో పాట్నాను తాకింది. మహాబోధిసమాజానికి చెందిన భిక్షుజ్ఞానజగత్‌జీ మాటలలో హిందూపునరుజ్జీవనంలో ఒక నూతనయుగానికి నాంది పలుకుతున్న రీతిలో వివిధ పంథ, కుల, వర్గాలకు చెందిన, చివరికి పొరుగున వున్న నేపాల్‌కు చెందిన హిందువుల ప్రవాహంతో ఒక మానవసముద్రం అక్కడ ప్రత్యక్షమైంది.

తఖ్త్ హర్‌మందిర్ (పట్నాసాహెబ్‌గా కూడా పిలువబడుతూ ఉంటుంది. గురుగోవిందసింగ్ జన్మస్థలంలో కట్టబడిన ప్రఖ్యాత గురుద్వారా) ప్రధాన కార్యదర్శి సర్దార్ హర్‌భజన్ సింగ్ సచ్‌దేవ మాట్లాడుతూ హిందూ ధర్మసంస్కరణకే గురునానక్ జన్మించాడన్నారు. తమను ఇస్లాంలోకి బలవంతంగా మతం మార్చేందుకు జరుగుతున్న ప్రయత్నాలను ఎదుర్కొనేందుకు సహాయం చేయమని కాశ్మీరీ పండితులు అర్థించినపుడు గురుతేగ్ బహదూర్ చేసిన మహాబలిదానాన్ని వారు గుర్తు చేశారు.

సంతాల్ పరగణాలలో హిందూత్వంనుండి క్రైస్తవులుగా మారిపోయినవారికి అన్ని రకాల ప్రత్యేక సదుపాయాలను నిలిపివేయాలని సంతాలీనేత శివముర్ము కోరారు.

జైన సన్యాసిని 'చందనాజీ మాట్లాడుతూ 'హిందూ తత్వజ్ఞానం సమస్త ప్రజలకు వర్తించే తత్వజ్ఞానం. భారతదేశంలో నివసించే ప్రతిఒక్కరు హిందువే' అన్నారు.

## ఉత్తరప్రదేశ్‌లో:

గోరక్షాపీఠాధీశ్వరులు మహంత్ అవైద్యనాథ్‌జీ దర్శనంతో 1983 ప్రారంభంలో మథురలో జరిగిన విరాట్ హిందూ సమాజ సమ్మేళనం పునీతమైంది. స్థానిక లోకదళ్ పార్లమెంటు సభ్యులు దిగంబరసింగ్, హరిజన నాయకులు చింతామణి తదితరులు బలమైన హిందూ ఆరా

ధకులువలే మాట్లాడారు. 1983 మార్చిలో ముజఫర్‌నగర్‌లో మరొక బ్రహ్మాండమైన సమ్మేళనం జరిగింది.

## అండమాన్ దీవులలో:

సుదూర అండమాన్ దీవులకు సైతం ఈ కెరటాలు చేరుకున్నాయి. 1983 ఏప్రిల్‌లో పోర్ట్‌బ్లెయిర్‌లో జరిగిన హిందూ సమ్మేళనంలో పెద్ద సంఖ్యలో స్థానిక గిరిజన స్త్రీలు, పురుషులు పాల్గొనడం చెప్పుకోదగ్గ విశేషం. వివిధ ధార్మిక నేతలతోబాటు, అండమాన్ నికోబార్‌ల విద్యాశాఖ డైరక్టర్ సోందదత్త దీక్షిత్, స్థానిక పార్లమెంటు సభ్యులు మనోరంజన్ భక్తలు కూడా సమ్మేళనంలో పాల్గొనడం అన్ని వైపులనుండి వస్తున్న సవాళ్ళను ఎదుర్కొనడానికి జాతి కృతసంకల్పంతో ఉందన్న సత్యాన్ని ప్రకటించే విధంగా ఉంది.

## కర్నాటకలో:

1983 డిసెంబర్‌లో కర్నాటకలోని ఉజిరె ధర్మస్థల్‌లో విశ్వహిందూపరిషత్ 3 రోజుల ప్రాంతీయ హిందూసమ్మేళనాన్ని నిర్వహించింది. ధర్మస్థల్‌కు చెందిన వీరేంద్ర హెగ్గడే దాని స్వాగతసమితి అధ్యక్షులుగా ఉన్నారు. విశ్వహిందూపరిషత్ అధ్యక్షులు మహారాణా భగవత్ సింగ్ సమ్మేళనాన్ని ప్రారంభించారు. 50 వేలకు పైబడి ప్రతినిధులు సమ్మేళనంలో పాల్గొన్నారు. అగ్రశ్రేణి కన్నడ పత్రికలన్నీ హిందూమహాసాగరంగా దానిని వర్ణించాయి. మమదీక్షా హిందూరక్షా హిందువుల రక్షణే నా వ్రతం) మమమంత్రః సమానతా (నా ధ్యేయం సమానత) అనే రెండు నూతన మంత్రవాక్యాలను ఉడిపి పెజావర్ మఠాధిపతి స్వామీ విశ్వేశ్వరతీర్థులు ఉచ్చరింపజేశారు. ఈ చారిత్రాత్మక సమ్మేళనాన్ని గురించి మద్రాస్‌నుండి వెలువడే హిందూ పత్రిక (1983 డిసెంబర్ 23) ఇలా సమీక్షించింది.

"అంటరానితనాన్ని నిర్మూలించవలసిందిగాను, హిందూ సమైక్యతకై కృషి చేయువలసిందిగాను 170 హిందూ మఠాల అధిపతులు ఏకకంఠంతో ఇచ్చిన పిలుపు ఉజిరే సమ్మేళనం సాధించిన ఘనవిజయంగా పేర్కొనవచ్చు. వారిలో చాలామంది మతవైషమ్యాలను కూడా నిరసించారు."

అయితే, హరిజనులు, ఇతర బలహీనవర్గాలలో ఇస్లాం, క్రైస్తవాలలోనికి కొనసాగుతున్న మతం మార్పిడులు సమ్మేళనంలో పాల్గొన్న వారిముందు

ప్రధాన సమస్యగా నిలిచాయి. గల్ఫ్ దేశాలలో ఉద్యోగాలు, ధనం మొదలైన వ్యామోహాలతో మతం మార్పిడులు జరుగుతున్నాయని అభిప్రాయ పడుతూ సమ్మేళనం చట్టంద్వారా వాటిని నిషేధించాలని ప్రభుత్వాన్ని కోరింది.

## ఆంధ్ర ప్రదేశ్, మహారాష్ట్రలలో:

ఈ వరుసలో ఈ మధ్య కాలంలో రెండు పెద్ద ప్రాంతీయ హిందూ సమ్మేళనాలు జరిగాయి. వాటిలో ఆంధ్ర ప్రదేశ్‌లోని తిరుపతిలో జరిగిన సమ్మేళనంలో 40 వేలమంది ప్రతినిధులు పాల్గొనగా, మహారాష్ట్రలోని (విదర్భ ప్రాంతం మినహాయించి) అలండిలో జరిగిన సమ్మేళనంలో సంఖ్య లక్షయాభై వేలకు పైబడి ఉంది. రెండు చోట్లకూడా ప్రముఖ సాధుసంతులు, తమ న్యాయపరమైన హక్కులను సాధించుకొనడానికి, అల్పసంఖ్యాక వ్యామోహంలో మునిగి ఉన్న రాజకీయనాయకులను దారిలో పెట్టడానికి, హిందువులు ఓటుకుగల కీలకమైన ప్రాముఖ్యం అర్థం చేసు కోవాలని తెలియజెప్పారు. తిరుపతిలో స్వామి చిన్మయానంద 'హిందూ ఓట్‌బ్యాంక్' నిర్మాణానికై పిలుపునివ్వగా, అలండిలో వారకరీసంప్రదా యానికి చెందిన ప్రఖ్యాత వైష్ణవ సన్యాసి శ్రీ ధోండు మహరాజ్, వోటును వినియోగించే సమయంలో హిందువులు జాగరూకత వహించాలని ఉద్బోధించారు.

## కాశ్మీర్, జమ్మూలలో:

కాశ్మీరీహిందువులు, ముస్లింలు కూడా సమానంగా గౌరవించే శ్రీభట్ పావనస్మృతికి నివాళులర్పించడాన్ని 1988 మార్చిలో మహాశివరాత్రి పర్వదినంతో ముడిపెట్టడం కాశ్మీర్‌లోయలో స్వయంసేవకులు చేసిన చక్కని కల్పన. శతాబ్దాల పూర్వం, ఒక కాశ్మీరీ వైద్యుడైన శ్రీ భట్, కాశ్మీరీసుల్తాన్ జైద్ బీన్‌ను దీర్ఘవ్యాధినుండి విముక్తుడిని చేశాడు. అతడికి ఏ సత్కారం కావాలని సుల్తాన్ అడిగినపుడు శ్రీ భట్ కాశ్మీర్‌లోయ నుండి బహిష్కరించిన హిందువులందరు తిరిగి లోయలో స్థిరపడడానికి అనుమతిని అభ్యర్థించాడు. ఆ అభ్యర్థనను సుల్తాను అంగీకరించాడు.

ఆ రోజున శ్రీ నగర్‌లో విశేషరీతిలో ఉత్సవం జరిగింది. రోజంతా సంకీర్తనలు, ధార్మిక ప్రవచనాలు జరిగాయి. మొట్టమొదటిసారిగా ఒక బహిరంగ కార్యక్రమంలో వేలాది హిందువులు పాల్గొన్నారు. బహిరంగంగా

వచ్చి, తమ ధార్మిక, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించుకునేందుకు హిందువులకు అత్యావశ్యకమైన ఆత్మస్థైర్యానికి ఈ కార్యక్రమం మంచి ప్రోత్సాహకంగా పనిచేసింది.

అంతకు ముందు, 1988 ఫిబ్రవరిలో జమ్మూ ప్రాంతంలోని హిందువులు 10 రోజులపాటు మహారుద్రయాగాన్ని, రాష్ట్రీయ జాగరణ సమ్మేళనాన్ని నిర్వహించారు. అవి ఘనవిజయం సాధించాయి. 10వ రోజు జరిగిన శోభాయాత్రలో స్త్రీలు, పురుషులు, యువకులు, పిల్లలు సుమారు 20 వేలమంది పాల్గొన్నారు. 5 కి. మీ. దూరం సాగిన యాత్రను వేలాదిమంది ప్రజలు దారిపొడుగునా ఇరువైపుల బారులు తీరి తిలకించారు. ఒక హరిజన నాయకుడు మూలారాం జాగరణసమ్మేళన్‌కు ప్రారంభోత్సవం చేయడం మరొక విశేషం. ఆ ప్రాంతంలో హిందూ సమైక్యత విషయంలో పెరుగుతున్న అవగాహనకు ఇదొక నిదర్శనం.

## బ్రహ్మాండమైన శిబిరాలు:

1982 జనవరిలో కర్నాటకలోని బెంగుళూరులో, 1983 జనవరిలో మహారాష్ట్రలోని పుణెలో జరిగిన రెండు పెద్ద ఆర్.యస్.యస్. యువజన శిబిరాలు, ప్రపంచ చరిత్రలోనే పెద్దవిగా చెప్పకోదగ్గ క్రమశిక్షణాయుత శిబిరాలు. బెంగుళూరు నుండి వెలువడే 'కన్నడ ప్రభ' దినపత్రిక బెంగుళూరు పథసంచలనాన్ని 'క్రమశిక్షణ, ఆకర్షణల ప్రతిరూపం'గాను, ప్రజలు తమంతటం తాము చూపిన ప్రతిస్పందనను 'ప్రచండ హిందూ శక్తి ప్రవాహానికి బ్రహ్మాండమైన స్వాగతం' గాను వర్ణించింది. ది హిందూ పత్రిక (1982 జనవరి 5) పథ సంచలనాన్ని గురించి వ్రాస్తూ "అది ఎంత పద్ధతిగా జరిగిందంటే పోలీసులకు కూడా దానిని చూసి ఆనందించడం మినహా మరేం పనిలేకుండా పోయింది. ఆ పథసంచలనాన్ని తిలకించడానికి పెద్ద ఎత్తున తరలి వచ్చిన ప్రజలంతా స్వచ్ఛందంగా వచ్చినవారే" అని వ్రాసింది.

పుణె శిబిరం కలిగించిన అనుభూతిని బొంబాయికి చెందిన 'టైమ్స్ ఆఫ్ ఇండియా' (1983 జనవరి 28) పత్రిక సరిగ్గా వర్ణించింది. 'శక్తి, క్రమశిక్షణల విరాట్ ప్రదర్శన' అని ఆ పత్రిక వ్రాసింది. 'పుణే గృహిణుల ఉత్సాహం పట్టలేనంతగా ఉండింది. సంఘనాయకులు ఇచ్చిన పిలుపును పురస్కరించుకుని మొదటిరోజైన మకర సంక్రాంతినాడు 3 లక్షల బొబ్బట్లు సేకరించి, శిబిరంలోని స్వయంసేవకులకు వారు పంచిపెట్టారు' అని కూడా ఆ పత్రిక వ్రాసింది.

బొంబాయి నుండి వెలువడే మరాఠీ దినపత్రిక 'లోక్‌సత్తా' (1983 జనవరి 18) "రాజకీయ వైరుధ్యాల వల్ల ఏర్పడుతున్న విభజనకు సాంస్కృతిక సంఘటనే సమాధానమనే భావం పెరుగుతోంది. కుటిల రాజకీయాల కతీతంగా, విభిన్న సమాజసేవారంగాలలో నిమగ్నమై ఉన్న యువకులను చూస్తుంటే కారుమబ్బులలో వారు కాంతిరేఖలా కనిపిస్తున్నారు" అని వ్రాసింది.

బొంబాయి నుండి వెలువడే 'మహారాష్ట్ర టైమ్స్' పత్రిక (18 జనవరి 1983) "అనేక ఇతర స్వచ్ఛంద సంస్థలు బలహీనపడి, అదృశ్యమైపోతూఉంటే సంఘం మాత్రం పెరుగుతూ ఉండడం అనేకులకు సంభ్రమం కలిగిస్తోంది. సంఘం ఏ రాజకీయ పక్షానికీ అనుబంధంగా ఉండకపోవడం దాని పెరుగుదలకు ఒక కారణం. రెండవ కారణం సంఘ కార్యానికి తమను తాము సమర్పితం చేసుకున్న వందలాది మంది ఉన్నత విద్యావంతుల అంకిత భావన" అని వ్యాఖ్యానించింది.

రెండు శిబిరాలలోనూ, శ్రీ బాలాసాహెబ్ దేవరస్ ప్రేరణదాయక ప్రసంగం సంఘస్వయంసేవకుల నేతృత్వంలో ముందుకు సాగుతున్న ఈ పునరుజ్జీవనోద్యమం వెనుకగల హిందూ ఆలోచనా విధానాన్ని ప్రతిబింబించింది.

## హిందు వ్యతిరేకులదాడిని ఎదుర్కొనడం:

తన సమగ్రతను, స్వాతంత్ర్యాన్ని, గౌరవాన్ని పరిరక్షించుకోవాలనే ఆకాంక్ష జవసత్వాలు గల ఏ సమాజానికైన మొదటి గుర్తు. కనుక జాగృత, సంఘటిత సమాజ శక్తికి కేంద్రస్థానాలైన శాఖలు వృద్ధిచెందాలని, స్వయంసేవకులు హిందూ సమాజపు భద్రత, స్వాభిమానాలకు రక్షణ కవచాలుగా నిలబడాలని అపేక్షించడం సహజం.

## జమ్మూలో:

1940 నాటికి జమ్మూలో ముస్లింల దాడుల కారణంగా, హిందువులను భయం, భద్రతారాహిత్యం పీడించసాగాయి. హిందూ యువతులను అల్లరిపెట్టడం, హిందూ యువకులను గాయపరచడం నిత్యకృత్యాలుగా మారాయి. ముస్లిం ఉత్సవాలను అడ్డంపెట్టుకుని శిరమెత్తిన ముస్లిం మూకలు దోపిడీలకు, హత్యాకాండకు పాల్పడుతూండేవారు. 1940నుండి

శాఖలు పెరగడంతో పరిస్థితిలో వెంటనే మార్పువచ్చింది. అప్పటివరకు ఆత్మవిశ్వాసహీనంగా పడివున్న హిందువులు ధైర్యంగా ఆత్మరక్షణచేసుకోవడం ప్రారంభించారు. ఫలితంగా, హిందూ ప్రయోజనాలు, విశ్వాసాల ఎడల నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తే, అది నిప్పుతో చెలగాటమే అవుతుందని త్వరలోనే ముస్లింలు గ్రహించారు.

1980-81లో జమ్మూ-కాశ్మీర్ ప్రభుత్వం రాష్ట్రంలోని హిందూ దేవాలయాల, యాజమాన్యాన్ని, నిర్వహణను ప్రభుత్వాధీనం చేసే ఒక పథకాన్ని రూపొందించింది. దీనికోసం దేవాదాయ, ధర్మాదాయ బిల్లును కూడా శాసనసభలో ప్రవేశపెట్టారు. హిందూ దేవాలయాలను పూర్తిగా ముస్లిం ప్రభుత్వపు చేతులలో పెట్టడం వల్ల కలిగే ప్రమాదాలు వర్ణించవలసిన అవసరంలేదు. సంఘ ప్రేరణతో జమ్మూపౌరులు ఆ బిల్లును ఉపసంహరించుకోవాలని కోరుతూ హిందూరక్షణ సమితి పేరున ఉద్యమాన్ని ప్రారంభించారు. సమితి సాగించిన దృఢమైన దీర్ఘకాలిక పోరాటం కారణంగా చివరికి ప్రభుత్వం వెనుకకు తగ్గక తప్పలేదు.

తిరిగి, 1985 వేసవిలో, రాష్ట్రంలో హిందువులు ఉద్యమాన్ని నడపవలసిన అవసరం ఏర్పడింది. శ్రీనగర్‌లోని ప్రభుత్వ సచివాలయ ఆవరణలో అక్రమంగా ఒక మసీదును నిర్మించారు. శీతాకాల రాజధాని జమ్మూకు ప్రభుత్వం మారినపుడు, జమ్మూ సచివాలయ ఆవరణలో సచివాలయం నిర్మాణానికి ముందునుండి ఉన్న ఒక హిందూ దేవాలయాన్ని కూలగొట్టి, దాని స్థానంలో మసీదును నిర్మించారు. హిందూ రక్షా సమితి ఉద్యమాన్ని ప్రారంభించింది. సమితి జ్యేష్ఠకార్యకర్త ఒకరు ఆమరణ నిరాహారదీక్షకు దిగారు. ప్రభుత్వం ఉద్యమాన్ని ప్రక్కదారి పట్టించేందుకు, చీల్చేందుకు ప్రయత్నించింది. జమ్మూ సచివాలయ ప్రాంగణంలో హిందూ దేవాలయంకోసం మరొక స్థలం కేటాయిస్తామని ప్రకటించింది. కానీ సమితి గట్టిగా నిలబడింది. చివరికి ప్రభుత్వం దిగివచ్చింది. రెండు మసీదులను కూడా వదులుకుంది.

## కేరళలో:

కేరళలో 1920-21లలో మోప్లా ఘర్షణల సమయంలో హిందువులపై, ముఖ్యంగా స్త్రీలపై ఘోరమైన అత్యాచారాలు జరిగాయి. 20 వేలమందిని ఇస్లాంలోకి మతం మార్చారు. వీటన్నింటి ఫలితంగా హిందువులు తీవ్రభయాందోళనలకు గురి అయ్యారు. హిందూ

మహా మండలం పేరున, 1950 దశకంలో వచ్చిన హిందూ జాగరణ ఉద్యమం క్షణభంగురం అయింది. ఫలితంగా హిందువులు నిస్తబ్ధతకు లోనయ్యారు. స్వయంసేవకులు శాఖలు ప్రారంభమైన క్రొత్తలలోనే సంఘర్షణకు సిద్ధంకావాలని నిర్ణయించుకున్నారు. మసీదుల ముందునుండి హిందూ ఊరేగింపులు పోకూడదు- మొదలైన న్యాయవిరుద్ధమైన కట్టుబాటు లను తమ ప్రాణాలకు తెగించి, వ్యతిరేకించడం ప్రారంభించారు. ఫలితంగా హిందువుల హృదయాలలో స్వాభిమాన జ్యోతి వెలిగింది. కులాలు, వర్గాల కతీతంగా వారు సన్నిహితం కాసాగారు. ప్రముఖ హిందూ పెద్దలు సైతం ముస్లిందాడులను, పోలీసుల అరెస్టులను, చిత్రహింసలను ఎదుర్కొనడానికి ముందుకు వచ్చారు. హిందూ జాలరులను శుక్రవారం నాడు సముద్రంలోకి వేటకు వెళ్ళకుండా ముస్లింలు నిరోధించడం, ముస్లింల దుకాణాల ముందునుండి వెళ్ళివలసివచ్చిన ప్రతిసారి హిందువులు వారికి సలాం చేయాలని కోరడం, అందమైన ప్రతి హిందూ యువతి ముస్లింల ఆస్తి అన్నట్లు భావించడం లాంటి విపరీత పద్ధతులను వివిధ స్థలాలలో ఎదుర్కొని వాటిని రూపుమాపారు. హిందువులను అవమాన పరచినట్లైతే భారీమూల్యం చెల్లించుకోవలసి వస్తుందని ఈ అత్యాచారాలకు పాల్పడుతూ వచ్చిన ముస్లిం మత మౌఢ్యులు గుర్తించారు.

కేరళలో అనేకసంవత్సరాలుగా మతంమార్పిడులు, దేవాలయవిధ్వంసం మొ॥వి క్రైస్తవ మిషనరీలకు ఒక ఆటగా నడిచేవి. వారి నిరంతర దాడిలో భాగంగా కీలకస్థానాలలో వారు మతం మార్పిడి కేంద్రాలను ఏర్పాటు చేసుకున్నారు. 1950మేలో పవిత్రమైన శబరిమలై దేవాలయంతో బాటు 106కు పైబడి దేవాలయాలను క్రైస్తవ పోకిరీలు ధ్వంసంచేశారు. అయితే, జాగృతుడైన హిందువు నేడు ఈ ఆకతాయి చేష్టలను ఎదిరించడం మొదలుపెట్టాడు. అదీ విజయవంతంగా.

నీలక్కల్ సంఘటన ఇందుకు ఉదాహరణ. పశ్చిమకనుమలలో దట్టమైన అడవుల ఒడిలో ఒదిగియుండే చిన్నగ్రామం అది. అలాంటి చోట, 1983లో ఒకనాటి ఉదయం, ఉన్నట్టుండి ఒక శిలువ, ఒక చర్చి దర్శనమిచ్చాయి. మామూలు పరిస్థితులలో అది అసలు ఒక విషయమేకాదు. ఎందుకంటే కేరళలో అక్రమంగా శిలువలు, చర్చిలు నిర్మించడం సర్వసాధారణ విషయం. కానీ, స్వయంసేవకుల ప్రేరణతో అక్కడ నీలక్కల్ కార్యాచరణ సమితి ఆవిర్భవించింది. విభిన్న హిందూ వర్గాలకు చెందిన 23 సంస్థలు దీనిలో భాగస్వామ్యం వహించాయి. ప్రతిసంవత్సరం అయ్యప్పదర్శనం కోసం లక్షలాది హిందూభక్తులు

శబరిమలై తరలివెళ్ళే మార్గంలో నీలక్కల్ చర్చిని నిర్మించడం వెనుకగల కుట్రను గురించి వారు హిందువులను హెచ్చరించారు. మిషనరీల కుట్ర బట్టబయలైంది. అక్కడ మతకల్లోలాలను సృష్టించి, హిందువుల భక్తి ప్రవాహానికి అడ్డుకట్టవేయాలన్నది వారి దురుద్దేశం.

కార్యాచరణసమితి రంగంలోకి దూకింది. 3వేల మంది స్వయంసేవకులు అరెస్ట్ అయ్యారు. పోలీస్‌స్టేషన్లలో చిత్రహింసలను అనుభవించారు. సన్యాసులు, ప్రతిష్ఠిత మహిళలు సైతం పోలీసుల లాఠీలు, అరెస్ట్‌లు, కోర్టువిచారణలను లెక్కజేయకుండా, ఆస్థలాన్ని పవిత్రంచేసి, తిరిగి హిందువులకు అప్పగించేందుకై నీలక్కల్‌కు తరలి వెళ్ళారు. కేరళలోని మారుమూల ప్రాంతాలకు కూడా ఈ ఉద్యమం వేగంగా విస్తరించసాగింది. క్రైస్తవుల ఒత్తిడికి తలఒగ్గి కాంగ్రెస్ ప్రభుత్వం ఉద్యమాన్ని ఉక్కుపాదంతో అణచివేస్తామని ప్రతిజ్ఞ చేసింది. చివరికి ప్రభుత్వంతో కుమ్మక్కై స్థానిక పత్రికలుకూడా ఉద్యమానికి సంబంధించిన వార్తలేమీ ప్రచురించరాదని నిర్ణయించాయి. హిందూమున్నని, ఆర్.యస్.యస్.ల కారణంగా 'మతసామరస్యాల ద్వీపం' గా పిలువబడుతూవచ్చిన కేరళ 'మతద్వేషాల అగ్నిగుండం' గామారనున్నదని పెద్దఎత్తున రభస మొదలైంది.

కానీ, పెరుగుతున్న హిందూ నిరసనను ఇవేవీ నిరోధించలేకపోయాయి. చివరికి ప్రభుత్వం కళ్ళుతెరిచింది. కార్యాచరణసమితి నాయకులు, బిషప్‌లు చర్చించి అంగీకరించిన వేరేస్థలాన్ని అది చర్చికి కేటాయించింది. అందుకనుగుణంగా, కేరళలోని బిషప్‌లు ఒక ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేసి నీలక్కల్ చర్చిని మార్చాలని నిర్ణయించారు. అలా తమ స్వహస్తాలతోనే దానిని తొలగించి వేశారు.

40 సంవత్సరాల క్రితం క్రైస్తవ ఆకతాయిలు శబరిమలై దేవాలయాన్ని తగులబెట్టినప్పుడు హిందువుల నిరసన చాలా తక్కువ స్థాయిలో మాత్రమే ఉండిందని ఈ సందర్భంగా మనం గుర్తు చేసుకోవడం బాగుంటుంది. నాలుగుదశాబ్దాలపాటు నిశ్శబ్దంగా, నిరంతరంగా సంఘ స్వయంసేవకులు పడిన కష్టాల ఫలితంగా నేడు ఆ పరిస్థితి మారింది. మతసామరస్యానికి ప్రమాదం ఏర్పడిందనే ప్రచారాలు, ప్రభుత్వపు బెదిరింపులు, అణచివేత చర్యలు ఇవేవీ పెరుగుతున్న హిందూవాణిని ఏమాత్రం ఆపలేవు. 'మతసామరస్యం లాంటి అందమైన మాటలకు అర్థం హిందువులే ఎప్పుడు దెబ్బతింటూ ఉండడం కాదని, అవి ఒక వైపు వ్యవహారం కావని కేరళలోని హిందువులు ప్రభుత్వానికి శాశ్వతంగా పాఠం నేర్పించారు.

1986 ఫిబ్రవరిలో పోప్ కేరళను సందర్శించిన సందర్భంలో, పెద్దఎత్తున ప్రభుత్వస్థలాలను ఆక్రమించడానికి క్రైస్తవచర్చి చేసిన ప్రయత్నాలను వమ్ము చేసేందుకు హిందువులకు అవకాశం లభించింది. పోప్ ప్రసంగించేందుకని నాలుగు పెద్దపట్టణాలలో ప్రతిష్ఠాకరమైన, విశాలమైన స్థలాలలో లక్షలాది రూపాయలు ఖర్చుచేసి అందమైన వేదికలను చర్చి నిర్మించింది. వాటిని పోప్ రాకకు జ్ఞాపకాలుగా అలాగే తమ ఆధీనంలో ఉంచుకోవచ్చని వారు ఆశించారు. కానీ హిందువులు పెద్దఎత్తున వ్యతిరేకించడంతో వారి పథకం ఫలించలేదు. నీలక్కల్ వ్యవహారంలో అటు ప్రభుత్వం, ఇటు చర్చి కూడా చేతులు కాల్చుకున్నాయి. గట్టి గుణపాఠం అవి నేర్చుకున్నాయి. తిరువనంతపురం, త్రిసూర్, కొట్టాయం, ఎర్నాకులం - నాలుగుస్థలాలలోను పోప్ వెళ్ళిన మరునాడే చర్చి అధికారులు స్వయంగా ఆ కాంక్రీటు సిమెంటు వేదికలను కూల గొట్టవలసి వచ్చింది.

## బీహార్‌లో:

బీహార్‌లోని చాలా వెనుకబడిన, నిరక్షరాస్యులతో నిండిన వనవాసీ ప్రాంతాలు కూడా ప్రేరణదాయకమైన ఒక సంఘటన ముందు పెడతాయి. 1986 ఫిబ్రవరి 1న పోప్ రాంచీ పర్యటన సందర్భం అది. మధ్యప్రదేశ్ నుండి ఈశాన్య భారతం వరకు వ్యాపించి ఉన్న వనవాసీ ప్రాంతాలలో క్రైస్తవకార్యకలాపాలకు రాంచీ గుండెకాయలాంటిదని మనం మరచిపోరాదు. క్రైస్తవం యొక్క బలాన్ని, గొప్పతనాన్ని అమాయకులైన గిరిజనుల హృదయాలలో ముద్రించడానికి ఈ పర్యటన పెద్దఎత్తున ఏర్పాటు చేయబడిందన్న వార్త కార్చిచ్చులా వ్యాపించింది. 10 వేల మంది వనవాసులను క్రైస్తవులుగా మార్చడానికి కూడా ఈ సందర్భాన్ని వినియోగించుకోవాలని చూసారు.

కళ్యాణాశ్రమ కార్యకర్తలు ఈ సవాలును స్వీకరించారు. వందలాది గ్రామాలను పర్యటించి వనవాసులను మేల్కొల్పారు. పోప్ సందర్శనకు వ్యతిరేకంగా, పోలీసుల నిషేధాజ్ఞలను సైతం ధిక్కరించి వేలసంఖ్యలో వారు రాంచీకి చేరుకున్నారు. పరంపరాగత ఆయుధాలను ధరించి అక్కడ చేరి ఉన్న విశాలమైన వనవాసీ ప్రజాశక్తిని చూసి ప్రభుత్వం బెదిరిపోయింది. రాంచీలో పోప్ కార్యక్రమాన్ని గనుక అంగీకరిస్తే గందరగోళం అవుతుందని గ్రహించింది. తక్షణమే కేంద్రప్రభుత్వం

భద్రతాపరమైన సమస్యలను క్రైస్తవ కేంద్రాలకు తెలియజేసింది. ఆమేరకు విమానాశ్రయంలోనే ఒక వేదిక ఏర్పాటయింది. అక్కడి నుండే పోప్ తన అనుచరులనుద్దేశించి ప్రసంగించాడు. రాంచీలో కాలుమోపకుండానే వచ్చిన విమానంలోనే తిరిగి వెళ్ళిపోయాడు.

ఈమధ్య 1986లో, మధ్యప్రదేశ్, బీహార్‌లలోని గిరిజన ప్రాంతాలలో క్రైస్తవ మిషనరీలు సంఘంపై వ్యతిరేకంగా పెద్దఎత్తున ప్రచారదాడి సాగించారు. వారి పత్రిక 'నిష్కళంక' సంఘ మనుషులు, ప్రభుత్వ సంస్థలు కలిసి వనవాసీ ప్రాంతాలలోని త్రాగునీటి బావులను విషపూరితం చేసారని ఒకపుకారు పుట్టించింది. హిందూవ్యాపారులు గిరిజనబాలురకు ప్రమాదకరమైన మందులు ఇచ్చి వారిని నపుంసకులుగా చేస్తున్నారని, వనవాసీ యువతులను వ్యభిచారిణులుగా మారుస్తున్నారని అపవాదు సృష్టించింది. అయితే, సంఘ, కళ్యాణాశ్రమ కార్యకర్తలు వెనువెంటనే గ్రామగ్రామానికి వెళ్ళారు. పోలీసు, ప్రభుత్వ అధికారులను తమవెంట తీసుకుని వెళ్ళారు. ఈ పుకార్లకు లోనైన గ్రామస్తుల సమక్షంలోనే, విషపూరితం అయినట్లు ప్రచారమైన బావులలోని నీటిని వారు త్రాగారు. మత విద్వేషాన్ని ప్రచారం చేస్తున్నందుకు ఆ పత్రికపై కేసు నమోదయింది. పోలీసులు స్వతంత్రంగా విచారణ జరిపి క్రైస్తవ మిషనరీల దురుద్దేశాలను బహిర్గతం చేసారు. ఆ పత్రిక సంపాదకుడు, ముద్రణకర్త అయిన మిషనరీలు క్షమాపణ చెప్పుకున్నారు. అయితే వారు ప్రసరించిన విషం దాని పని అది చేసింది. క్రైస్తవులుగా మతం మారినవారు చేసిన దాడిలో 9 మంది హిందూ గిరిజనులు మరణించారు. వారిలో ఒకడైన సంఘ క్రియాశీల కార్యకర్త సుఖరాంధన్ ముండాను దారికాచి, హత్యచేశారు. అతడుచేసిన నేరం? క్రైస్తవం స్వీకరించిన ఒక గ్రామం మొత్తాన్ని ఒప్పించి తిరిగి హిందూధర్మంలోకి తీసుకుని రావడమే. అలాంటి దాడులు నేటివరకు కొనసాగుతూనే ఉన్నాయి.

హిందూ కార్యకర్తలపై ఈ హింసాత్మకదాడుల వెనుక కారణం స్పష్టమైనదే. కళ్యాణాశ్రమ ప్రయత్నాల ఫలితంగా ఆ ప్రాంతంలోని గిరిజనులలో హిందూ స్వాభిమానం పెరుగుతోంది. దానివలన మిషనరీల మతంమార్పిడి కార్యకలాపాలు బాగా దెబ్బతిన్నాయి. హిందూ గిరిజనులలో ఈనూతన జాగృతి కారణంగా ప్రభుత్వంపై ఒత్తిడిపెరిగి ప్రముఖ బెల్జియం మిషనరీ విల్లీవాన్ ఖార్కోవ్‌ను దేశం నుండి బహిష్కరించేటట్లు చేసింది. మరి కొందరు క్రైస్తవ మిషనరీలకు వ్యతిరేకంగా ఇంటిలిజెన్స్ నివేదికలు కేంద్రానికి అంది ఉన్నాయి. ఇదంతా క్రైస్తవ

సంస్థల ధైర్యాన్ని పోగొట్టింది. నిస్పృహ కలిగించింది. అయితే ఈ చర్యల ఫలితం మాత్రం స్వాగతించదగినది. ఎందుకంటే, 'మానవతా దృక్పథం' పేరిట నడుస్తున్న పాఠశాలలు, కళాశాలలు, స్త్రీలు, పిల్లల అనాధాశ్రమాలు, వైద్యాలయాలు మొ॥న వాటన్నింటి వెనుక దాగిఉన్న దురుద్దేశాలను అది బట్టబయలు చేసింది.

## బెంగాల్ లో:

బాంగ్లాదేశ్ నుండి పెద్దఎత్తున ముస్లింలు అక్రమప్రవేశం చేసిన కారణంగా పశ్చిమ బెంగాల్ లోని సరిహద్దు జిల్లాలయిన మాల్డా, ముర్షిదాబాద్‌లలోని హిందువులు బాగా భయభ్రాంతులయ్యారు. అక్రమప్రవేశకులు, స్థానిక ముస్లింలిరువురి దాడికి వారుగురయ్యారు.

ఈ పెరుగుతున్న సమస్యను నిరోధించేందుకు ఆప్రాంతాలలో విశ్వహిందూపరిషత్ పెద్దసంఖ్యలో పూర్తి సమయ కార్యకర్తలను నియమించింది. భజనమండలులు, సంస్కారకేంద్రాలు ఇతర కార్యక్రమాలద్వారా వారు ఒక క్రమపద్ధతిలో హిందువులను సంఘటితపరచసాగారు. సమస్యాగ్రస్త ప్రాంతాలలో పెద్దపెద్ద ధర్మసభలను నిర్వహించారు. వేలసంఖ్యలో హిందువులు వాటిలో పాల్గొనసాగారు. ఆవిధంగా వారిలో హిందూసమైక్యతా భావన జాగృతం అయింది. ముస్లింల దాడులను ఎదుర్కోవడం ప్రారంభించారు. ఒక వేయిమంది అక్రమ ప్రవేశకులను వెనక్కు త్రిప్పి పంపడంలో కూడా వారు కృతకృత్యులయ్యారు. హిందువులలో పెరుగుతున్న ఈ ఆత్మవిశ్వాసం కారణంగా కొన్ని క్రైస్తవకుటుంబాలు కూడా హిందువుల వైపు ఆకర్షితులౌతున్నారు.

## తమిళనాడులో:

నాగర్ కోయిల్ లో జరిగిన సంఘటన, తమిళనాడులోని హిందువులలో హిందూత్వభావనకు కొత్త ఊపునివ్వడంలో ఒక మలుపు అయింది. హిందువులు ఇకపై అవమానాలను కడుపులో దాచుకొనడానికి గానీ, తమ న్యాయపరమైన హక్కుల అణచివేతనుగానీ ఏమాత్రం అంగీకరించబోరని నిస్సందేహంగా ధృవపడింది. 1983 ఫిబ్రవరి 13 నాడు కన్యాకుమారి జిల్లాలోని నాగర్ కోయిల్ లో ఒకపెద్ద హిందూ పునరుజ్జీవన సమ్మేళనం జరుగవలసి ఉంది. 8వతేదీన, క్రిస్టియన్ డెమొక్రాటిక్ ఫ్రంట్ (CDF) నాయకులు కలెక్టర్‌ను కలిసి సమ్మేళనాన్ని నిషేధిం

వలసిందిగా కోరారు. అయితే ఆయన నిర్మోహమాటంగా అందుకు తిరస్కరించాడు. నిజానికి, న్యాయసూత్ర నియమాలననుసరించి జిల్లా కలెక్టర్, పోలీసు డిప్యూటీ సూపరింటెండెంట్‌లు హిందూసమ్మేళన నిర్వాహకులతో సమావేశమయ్యారు. ఊరేగింపు, సమ్మేళనాలకు సంబంధించిన వివరాలకు తుదిరూపం ఇచ్చారు. నినాదాలను కూడా వారు అంగీకరించారు. వాతావరణం సుహృద్భావపూర్ణంగానే ఉంది. ఎక్కడా నిషేధపు వాసనే లేదు.

కానీ, ఉన్నట్టుండి, ఫిబ్రవరి 11వ తేదీ అర్ధరాత్రి జిల్లా అంతటా 144వ సెక్షను విధించారు. ప్రజలను భయకంపితులను చేశారు.

12వ తేదీన, అకస్మాత్తుగా దాడిచేసి, హిందూమున్నని అధ్యక్షులు శ్రీ తానులింగనాడార్‌తో సహా 59 మంది హిందూ నాయకులను అరెస్ట్ చేశారు. నాగర్‌కోయిల్‌ను పోలీసువలయంలో బంధించారు. నగరానికి వచ్చే ప్రతివాహనాన్ని 10కి.మీ. దూరంలోనే ఆపివేశారు. అయినాసరే, ప్రజలు వేలసంఖ్యలో వచ్చారు. 13వ తేదీన, నిషేధాజ్ఞలను వారు ఉల్లంఘించారు. సుమారు 1500 మంది ప్రజలు అరెస్టు అయ్యారు. ఉన్న 30 వేలమందిని అరెస్ట్‌చేయడానికి తమ యంత్రాంగం చాలదని గ్రహించిన పోలీసులు ప్రజలను వెళ్లిపోవలసిందిగా ఒప్పించమని హిందూ మున్నని నాయకులను ప్రార్థించారు. అయితే అంతలోనే మరలవారు పైశాచికంగా ప్రజలపై విరుచుకుపడ్డారు. విచక్షణారహితంగా లాఠీఛార్జి, కాల్పులు జరిపారు. ప్రక్కనే ఉన్న నాగరాజదేవాలయంలో తలదాచుకున్న వారిని కూడా వదలలేదు. వందలాది మంది గాయపడ్డారు. వికలాంగులయ్యారు. కుమార్ అనే ఆటోరిక్షాడ్రైవరు తనను అరెస్ట్ చేయమని లేదా కాల్చివేయమని పోలీసులను సవాలు చేసినపుడు పోలీసులు అతడిని దగ్గరలో నుండి కాల్చిచంపారు. 'ఓంకాళి, జైకాళి' నినాదం పెదాలపై నర్తిస్తూండగా అతడు నేలకూలాడు.

## రాజకీయరణరంగంలో:

రాజకీయరంగంలో కూడా ఈ పెరుగుతున్న హిందూజాగృతి ప్రభావం తప్పక పడుతుందని ఆశించడం సహజం. జాతీయసమగ్రతకు భంగంకలిగించే విధంగా వివిధ రాజకీయ పార్టీలు ముస్లిం, క్రైస్తవ మూకుమ్మడి ఓట్లకోసం దురాశపడడం వల్ల కలిగే ప్రమాదాలను హిందువులు అర్థం చేసుకోసాగారు. విద్య, మతసంబంధ వ్యవహారాలలో అధికసంఖ్యాక

హిందువుల కంటే అల్పసంఖ్యాకులే ఎక్కువ హక్కులు కలిగిఉండే హాస్యాస్పదస్థితి దేశంలో ఏర్పడింది. ఈ తల్లక్రిందులు వ్యవహారానికం తటికీ తమ అనైక్యతే కారణమని హిందువులు గుర్తిస్తున్నారు. వారి వోట్లు చీలిపోయినందువల్ల రాజకీయరంగంలో వారు నోరులేని అనాథలు అయిపోయారు.

పరిస్థితులను సరియైన మార్గంలో పెట్టే ప్రయత్నం మొట్టమొదట తమిళనాడులో హిందూ మున్నని చేసింది. 1984 డిసెంబర్‌లో రాష్ట్ర శాసనసభ ఎన్నికల సందర్భంగా డి.ఎమ్.కె.కు వ్యతిరేకంగా మున్నని పెద్దఎత్తున ప్రచారం సాగించింది. చాలాకాలంగా డి.ఎమ్.కె., ముస్లిం లీగ్, క్రైస్తవచర్చి, కమ్యూనిస్టులు, డికె. లాంటి హిందూవ్యతిరేక శక్తులతో చేతులు కలుపుతోంది. హిందూధర్మాన్ని, హిందూదేవీదేవతలను అవమానపరుస్తోంది. ఈ హిందూవ్యతిరేక పార్టీలను ఓడించవలసిందని హిందూమున్నని ప్రజలకు పిలుపునిచ్చింది.

హిందూప్రయోజనాలను కాపాడే వారికి మాత్రమే ఓటు వేయ వలసిందిగా 1984 విజయదశమిరోజున శ్రీ బాలాసాహెబ్ దేవరస్ హిందువులకు ఇచ్చిన పిలుపు ఈ కృషికి ఒక మార్గదర్శనంగా నిలిచింది. స్వామీచిన్మయానంద పదేపదే ఇచ్చిన హిందూ ఓటు బ్యాంకునిర్మాణమనే ప్రేరణదాయకమైన పిలుపు హిందూమున్నని ఉద్యమానికి మరింత ఊపు నిచ్చింది. హిందువుల నూతన ఆలోచనా విధానాన్ని తమిళనాడులోని పత్రికలు కూడా గ్రహించాయి. హిందూధర్మాన్ని, సంస్కృతిని విమర్శించే ధైర్యం ప్రస్తుతం ఏరాజకీయ పక్షానికీ లేదని, ఎందుకంటే అటువంటి విమర్శలను తలవంచి స్వీకరించడానికి వారిక ఏమాత్రం సిద్ధంగాలేరని అవి వ్రాయసాగాయి. దారినపోయే ప్రతివ్యక్తి, చివరికి గ్రామాలలో నివసించే నిరక్షరాస్యులైన స్త్రీలుసైతం డి.ఎమ్.కె. అభ్యర్థులను నిలదీయసాగారు. వారి హిందూ వ్యతిరేక ధోరణిని నిందించసాగారు. డి.ఎమ్.కె కు ప్లేటు ఫిరాయించక తప్పలేదు. గణేశ్, మురుగన్, ఓం మొదలైన చిత్రాలను ప్రదర్శించడం, హిందూదేవాలయాలకు ఊరేగింపుగా వెళ్ళడం మొదలైనవి వారి అభ్యర్థులు కూడా మొదలుపెట్టారు. అధికార ఎ.ఐ.ఎ.డి.ఎమ్.కె. నాయకులు డి.ఎమ్.కె. యొక్క ముస్లిం అనుకూల, క్రైస్తవ అనుకూల, హిందూవ్యతిరేక ధోరణిపై గొంతెత్తి విమర్శలు గుప్పించసాగారు. ఒక్క సారిగా 'తమిళ విధేయత' స్థానాన్ని 'హిందూ విధేయత' ఆక్రమించింది. తమిళుల ప్రయోజనాలను నిజంగా కాపాడేవారం మేమేనని ఒకరితో ఒకరు పోటీ పడుతూ ఉండే ఈరెండు పార్టీలు ఈ సారి ఆ విషయంలో

పూర్తిగా మౌనం వహించడం స్పష్టంగా కనబడింది. మొట్టమొదటిసారిగా కన్యాకుమారి జిల్లాలోని పద్మనాభపురం నియోజకవర్గంలో హిందూము న్నని సమర్థనతో ఒక స్వతంత్రహిందూ అభ్యర్థి హిందూఓట్ల బలంతో విజయంసాధించాడు. రెండుబలమైన రాజకీయ ఫ్రంట్లు బలపరచిన ఇద్దరు అభ్యర్థులను అతడు ఓడించాడు. ఎన్నికల ఫలితాలు డి.ఎమ్.కె.ను బాగాదెబ్బతీసాయి. 237 స్థానాలుండే శాసనసభలో వారి బలం 22కు పడిపోయింది.

ఈ గట్టిగుణపాఠం నేర్చుకున్న తరువాత డి.ఎమ్.కె. మెత్తబడింది. ఆ తరువాత జరిగిన స్థానిక సంస్థల ఎన్నికలలో, హిందూధర్మానికి వ్యతిరేకంగా గానీ, చివరికి హిందూమున్నని, ఆరెస్సెస్‌లకు వ్యతిరేకంగా గానీ ఒక్కమాట కూడా మాట్లాడవద్దని డి.ఎమ్.కె. నాయకులందరికీ ఖచ్చితమైన ఆదేశాలు జారీఅయ్యాయి. తీవ్ర హిందూవ్యతిరేకులైన ద్రవి డకజగం నాయకులను డి.ఎమ్.కె. వేదికలపై నుండి మాట్లాడకుండా నిషేధించారు. ఈ క్రొత్తరూపం డి.ఎమ్.కె.కు మంచిఫలితాల నిచ్చింది. ఎన్నికలలో విజయం సాధించిన వెంటనే కరుణానిధి దేవాలయ పరిస రాలనుండి మత్తుమందుల దుకాణాలను తొలగింపజేస్తానని ప్రకటించాడు - బహుశః హిందూఓటర్లకు కృతజ్ఞతా పూర్వకంగా అయి ఉండవచ్చు. పాపం! డి.కె.నేత వీరమణి నెత్తి నోరు బాదుకున్నాడు. తన దినప త్రిక "విడుదలై"లో డి.ఎమ్.కె. హిందూ ఓట్ల కోసం అన్నాదురై (డి.ఎమ్.కె. సంస్థాపకులు) విశ్వాసాలన్నింటికీ తిలోదకాలిచ్చిందని, డి.కె. నుండి దూరమైందని ఆక్రోశం వెలిబుచ్చాడు.

కేరళలో తమ 42శాతం జనాభాపై ఆధారపడిన బలమైన, సంఘ టితమైన ముస్లిం, క్రైస్తవ రాజకీయ వర్గాలు ఉన్నాయి. కాగా మిగిలిన 58శాతం హిందువులు కులాలు, పార్టీల పేరున చీలిపోయి ఉన్నారు. నిజానికి, ఇంతకాలంగా కేరళలో హిందూప్రయోజనాలకు భంగకరంగా హైందవేతరులు రాజకీయాలలో గుత్తాధిపత్యంసాగించారు. గత అనేక దశాబ్దాలుగా జరిగిన సంఘటనలు హైందవేతరుల చేతులలో ధార్మిక, ఆర్థిక, సామాజిక, రాజకీయ, విద్యారంగాలన్నింటిలోనూ హిందువులు ఎంతగా ఇబ్బందులకు లోనయ్యారన్నది స్పష్టం చేస్తాయి.

అయితే ఇప్పుడు ప్రాంతంలోని 9,200 స్థలాలకు గాను 3 వేల స్థలాలలో సంఘశాఖలు ప్రారంభంకావడంతో సామాన్య హిందువులు కేరళరాజకీయాల నిజస్వరూపాన్ని గ్రహించసాగారు. దాదాపు 50 నియో

జకవర్గాలలో ఎన్నికల ఫలితాలపై హిందూత్వ ప్రభావం కీలకపాత్ర వహించిందని ఎన్నికల విశ్లేషణ సూచించింది.

1986లో అసెంబ్లీ ఎన్నికలు దగ్గరపడగానే, హిందూమున్నని నుండి హెచ్చరిక సంకేతం గ్రహించిన సిపిఐ (ఎమ్) ముస్లింలీగ్, కేరళకాంగ్రెస్ వర్గాలతో వేరుపడి జాతీయవాద, హిందూ అనుకూల వేషంధరించింది. ఆ క్రొత్తరూపం బాగాపనిచేసింది. సి.పి. ఎమ్. కాంగ్రెస్‌ను అధికారభ్రష్టం చేయగలిగింది. అదే సమయంలో హిందూమున్నని సమర్థించిన స్వతంత్ర అభ్యర్థులు, బిజెపి అభ్యర్థులు హిందూ ఓట్లబలాన్ని విస్తరింపజేయడంతో కృతకృత్యులయ్యారు. అయితే, అధికారంలోకి రాగానే, కమ్యూనిస్ట్‌ఫ్రంట్ ప్రభుత్వం సంఘం, దాని అనుబంధసంస్థలపై గతంలో మాదిరిగానే హత్యారాజకీయాలకు పాల్పడింది. ఫలితంగా తదుపరి స్థానిక సంస్థల ఎన్నికలలో హిందూ ఓటు వారికి వ్యతిరేకంగా నిర్ణయాత్మకంగా మారింది.

5

# జాతీయ సమగ్రతకు శక్తి కేంద్రం

బ్రిటిష్‌వారి రాజకీయ ఉక్కుపిడికిలి 1947తో విడివడింది. అయితే మన ప్రజలలో వారు ప్రవేశపెట్టిన విభజన సిద్ధాంతాలు కొనసాగాయి. తమ విభజించి, పాలించే సూత్రానికి అనుగుణంగా హిందూ సమాజ స్వాభావిక వైవిధ్యాలయిన ప్రాంతం, భాష, వర్గాలు, సాంస్కృతిక ప్రవాహాలను వైరుధ్యాలకు, భేదాభిప్రాయాలకు సంకేతాలుగా వారు వర్ణించారు. అయితే హిందూ సమాజంలోని అన్ని వర్గాల హృదయాలలోనూ నిద్రాణంగా ఉన్న హిందూ ఆత్మ ప్రభావం అప్రతిహతమైనదని, భారత జాతీయ జీవనాన్ని కలిపిఉంచే శక్తి కేంద్రమదేనని బ్రిటిష్‌వారికి బాగాతెలుసు. అందుకనే వారు హిందూభావనను బలహీనపరచడానికి, ప్రాబల్యం తగ్గించడానికి అన్ని రకాలుగాను ప్రయత్నించారు. ఈ ఉద్దేశ్యంతోనే హిందువుల ఉజ్వల చరిత్రను పూర్తిగా తొలగించారు. లేదా వక్రీకరించారు. వారి ధార్మిక సంప్రదాయాలన్నింటినీ అంధవిశ్వాసాల చెత్త అని నిందించారు. వారి సంస్కృతి, నాగరికతలను అనాగరికమైనవిగా వర్ణించారు. ఇలా ఇంకా ఎన్నో చేశారు. హిందువులు ఈ భూమి బిడ్డలు కారని సూచించే తళుకుబెళుకు సిద్ధాంతాలను ప్రతిపాదించారు.

## తమిళనాడులో హిందూ మలయమారుతం:

బ్రిటిష్‌వారు ప్రతిపాదించిన అలాంటి ఒక వినాశకరసిద్ధాంతం ఆర్య, ద్రవిడ వేర్పాటు సిద్ధాంతం. ఒక శతాబ్దంక్రిందట తమిళనాడులో విదేశీక్రైస్తవ మిషనరీలు, బ్రిటీష్ సామ్రాజ్యవాదులతో కుమ్మక్కై వేర్పాటువాద ద్రవిడ ఉద్యమాన్ని సృష్టించారు. ప్రత్యేక తమిళ సంస్కృతి, ప్రత్యేక భాష, ప్రత్యేక గుర్తింపులు కలిగిన స్వతంత్రద్రవిడనాడు కావాలనే నినాదం త్వరలోనే విద్యావంతులైన తమిళుల దృష్టిని ఆకర్షించింది. దానిని

ప్రచారం చేస్తున్నవారు సాగించిన హిందూవ్యతిరేక, ఉత్తరభారత వ్యతిరేక, ధర్మవ్యతిరేక ఉద్యమం తమిళరాజకీయాలలో నిర్ణయాత్మక అంశంగా రూపొందింది. గట్టిగా వ్రేళ్ళూనుకున్న కాంగ్రెస్‌కూడా తల్లక్రిందులైంది. అనేక ముద్రలతో ద్రవిడ పార్టీలు పుట్టుకొచ్చాయి. వారి ఇష్టారాజ్యం ఏర్పడింది. సేలంలో ఒకసారి డి.కె. శ్రీ రాముని పటానికి చెప్పులదండవేసి, చెప్పులతో ఆ పటాన్ని కొడుతూ ఒక పెద్ద ఊరేగింపును కూడా నిర్వహించింది. సంఘ కార్యకర్తలు మినహా ప్రజలలో మరెవరూ దానిని అభ్యంతరపెట్టే వారే లేకపోయారు. ద్రవిడ వేర్పాటువాద రాజకీయాలు అంత అణచివేసేవిగాను, ఉక్కిరిబిక్కిరి చేసేవిగాను ఉండేవి. అయితే సంఘ కార్యకర్తలు ఒకేదేశం, ఒకే ప్రజ, ఒకే సంస్కృతి, ఒకే సమైక్య జాతీయ అస్తిత్వం అనే సత్యాన్ని దేశమంతటా ప్రచారం సాగిస్తూనే ఉన్నారు.

## హిందూచేతన - తొలివెలుగులు:

1975-77 అత్యవసర పరిస్థితి సమయంలో ఈ సత్యతేజపు తొలి కాంతులు ప్రజల హృదయాలలో ప్రసరించసాగాయి. అత్యవసర పరిస్థితి విధించబడే సమయానికి డి.ఎమ్.కె. ఏకచ్ఛత్రాధిపత్యం నడుస్తోంది. అయితేనేం, ఒక దెబ్బతో ఢిల్లీ వారిని అధికార భ్రష్టుల్ని చేయగానే డి.ఎమ్.కె. మహామహులంతా కుప్పకూలిపోయారు. జైళ్ళలో ఉన్న వారి మనుషులు దీనత్వానికి ప్రతిరూపంగా నిలిచారు. తమ ఖర్మకాలిందని వాపోయారు. ఆ సమయంలో ఒక సరికొత్త దృశ్యాన్ని తమిళనాడు దిగ్భ్రమతో తిలకించింది. ఒకవైపు మహామహులంతా బిక్కచచ్చిపోయి ఉన్న సమయంలో, మరొకవైపు అంతవరకు పేరు ఊరులేని ఒక చిన్న యువకులబృందం ఈ సవాలును స్వీకరించి ధృఢంగా నిలబడింది. రహస్యంగా ఉద్యమం నడిపించింది. వారు వీధులలో నిలబడి 'భారత్‌మాతాకీ జయ్, ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి, నియంతృత్వం నశించాలి', అని నినాదాలు చేశారు. అరెస్టు అయ్యారు. స్వాతంత్ర్య వీరులవలే జైళ్ళలోకి నడిచారు.

మొదట్లో పెద్ద ప్రభావం కనిపించకపోయినా, నెమ్మదిగా అదే మార్పుకు ఆధారం అయింది. ప్రఖర జాతీయవాద వాతావరణం ద్రవిడవాద ప్రచారకులు దర్శించిన మొదటి సందర్భమిది. వీరంతా బ్రాహ్మలనీ, హిందూమతమూఢులనీ, ఉత్తరభారతీయులనీ ఇంకా ఏవేవో వారు ఏ స్వయంసేవకుల గురించి అన్నారో, ఆ స్వయంసేవకులలో తమ స్వంత కులాలకు చెందిన సహచరులు, తమిళ విజ్ఞానంలో తమకంటే

ఎక్కువ పట్టు కలిగినవారు ఉండడంచూసి వారు నిర్ఘాంతపోయారు. రోజులు గడిచిన కొద్దీ, స్వయంసేవకుల హుందా అయిన, శ్రేష్ఠమైన ప్రవర్తన, వారి సమర్పణ భావన, వారి ఆత్మస్థైర్యం, వారి విశాల దృష్టి, ఇవన్నీ ఆ ద్రవిడవాదులకు స్వచ్ఛమైన, సౌగంధభరితమైన జాతీయభావ పరిమళాన్ని రుచిచూపించాయి. 'హిందు' పేరున జరిగే ప్రతి విషయంలోనూ డి.ఎమ్.కె వ్యతిరేకత అందరికీ తెలిసినదే అయినా, స్వయంసేవకులు వారి ఎడల ఏమాత్రం, అయిష్టంగా వ్యవహరించకపోవడం వారికెంతో ఆశ్చర్యం కలిగించింది. అందుకు విరుద్ధంగా వారు జైలు లోనూ బయటకూడా నిస్వార్థ ప్రేమ, సేవాభావనలనే ప్రదర్శించారు. జైళ్ళలో ఉన్న డి.ఎమ్.కె., ఇతర కార్యకర్తల కుటుంబాలతో సన్నిహిత సంబంధాలను వారు కొనసాగించారు. ఆ కుటుంబాలకు అవసరమైన సహాయాన్ని, ఓదార్పును అందించారు.

## దాగిఉన్న హిందూ దావాగ్ని ధరణిదూకినవేళ:

ఇంతలో అందరినీ దిగ్భ్రాంతులను చేస్తూ రామనాథపురం, కురియూర్‌లలో ఇస్లాంలోకి మతం మార్పిడులు జరిగాయి. 1981లో మీనాక్షిపురంతో అవి తారస్థాయికి చేరుకున్నాయి. పరిస్థితుల పిలుపునందుకున్న స్వయంసేవకులు హిందువులలో ఆత్మవిశ్వాసాన్ని సుదృఢంచేసేందుకు, హిందూ పునర్జాగరణోద్యమాన్ని నడిపించేందుకు ముందుకు దూకారు. 'హిందూమున్నని' స్థాపించారు. డి.కె. వాదాలలోని అవాస్తవికత బట్టబయలుచేసారు. అదొక బూటకపు సంస్థ అని బైట పెట్టారు. ప్రాంతం అంతటా. జరిగిన 2వేల బహిరంగసభలలో మతం మార్పిడి వల్ల కలిగే ప్రమాదాలను ప్రజలకు తెలియజెప్పారు.

తమ వేర్పాటువాద, హిందూవ్యతిరేక వాదం చతికిలబడడంతో, డిఎమ్‌కె, డికెలనాయకులు సంఘానికి వ్యతిరేకంగా, హిందూత్వానికి వ్యతిరేకంగా తమిళనాడు అంతటా విషంగ్రక్కుతూ ప్రచారం సాగించారు. ఈ 'పవిత్ర యుద్ధం'లో వారి సన్నిహిత సహచరులు ఎవరో తెలుసా? ఇంకెవరు! ఇస్లామీ, క్రైస్తవ దురభిమానులే. ఈ కూటమి వారి ముగ్గురి బలహీనతలను మరింత బైటపెట్టడానికే పనికివచ్చింది. హిందూధర్మాన్ని, హిందూ సమాజాన్ని విధ్వంసం చేసేందుకై నడుం కట్టిన ఈ శక్తులతో డికె- డిఎమ్‌కె చేతులు కలపడంతో వారి అనుచరులు మరింతమంది వారి నుండి దూరం అయ్యారు.

ఇది కేవలం డి.కె- డి.ఎమ్.కె లు బలాన్ని కోల్పోవడం, సంఘం బలం పుంజుకోవడాలకు సంబంధించిన ప్రశ్నకాదు. ఇది మరెంతో లోతైన విషయం. గాఢంగా నాటుకున్న హిందూత్వపు పిలుపు వేర్పాటు వాద ద్రవిడ ఉద్యమపు సైద్ధాంతిక పునాదులను పెకిలించి వేసింది. స్థానంలేకుండా చేసింది. ఉదాహరణకు, దేవాలయాలను బహిష్కరించమని పిలుపునిస్తూ, వాటిముందు ధర్నాచేయాలని డి.కె. ప్రయత్నించినపుడు ప్రజలు స్పందించలేదు. మరో ప్రక్క, అటువంటి సందర్భాలలో భక్తులు మరింత సంఖ్యలో రావాలని హిందూమున్నని ఇచ్చిన పిలుపుకు అద్భుత ప్రతిస్పందనలభించింది.

మరొక ముఖ్యమైన అంశంకూడా ఉంది. మతతత్వ, మతదురహంకార ముస్లిం సంస్థలైన ముస్లింలీగ్, జమాత్-ఎ-ఇస్లామీల వంటి వాటితో డికె- డిఎమ్‌కెలు కుమ్మక్కు కావడం వల్ల సంభవించే ప్రమాదాలు ప్రజలముందు కళ్ళకు కట్టినట్లు బైటపడ్డాయి. అనేక స్థలాలలో సామూహిక మతంమార్పిడులలో ప్రధాన పాత్ర వహించిన వ్యక్తులు, వారి రాజకీయ సంబంధాల గురించి విచారణ జరిపినపుడు, వారు డి.కె - డి. ఎమ్.కెల కార్యవర్గసభ్యులుగానీ, సానుభూతిపరులుగానీ అని తేలింది. ధనానికీ, ఇతర వ్యామోహాలకు దాసులై తమ తోటి సహచరులను వారు తప్పుదారి పట్టించారు. వీరి తీవ్రమైన హిందూవ్యతిరేక ప్రచారం ఆ అమాయక ప్రజల ప్రాచీన ధార్మిక మూల్యాలను నాశనంచేసింది. ఫలితంగావారు ఇస్లాంకు సులభంగా ఎఱ అయిపోయారు. హిందూధర్మానికి, హిందూసంఘటనకు సారధులైన సంఘస్వయంసేవకులు క్లిష్టసమయంలో ఆ సోదరులను ఆదుకున్నారు.

ద్రవిడ, ఇతర పార్టీల కార్యకర్తలు, అనుచరులపై ఇది సత్ప్రభావాన్ని చూపించింది. ఎ.ఐ. ఎ.డి. ఎమ్.కె, డి.ఎమ్.కె., కాంగ్రెస్, జనతా వగైరాలకు చెందిన అనేకమంది కార్యకర్తలు తమరాజకీయ విభేదాలన్నీ విస్మరించి, అందరినీ కలిపేది సమాన హిందూత్వ భావనే అని గుర్తించి, సంఘం, హిందూమున్నని లాంటి హిందూ ఉద్యమాలలో వచ్చి చేరారు. ఒకనాటి ద్రవిడ ఉద్యమ మహారధులు హిందూ వేదికలపైనుండి హిందువుల కోర్కెలను గురించి మాట్లాడడం సర్వసాధారణ దృశ్యం అయింది.

సి. ఆర్ముగం, డి.కె ఉద్యమ ప్రారంభకుడైన ఇ.వి. రామస్వామి నాయకర్‌కు సన్నిహితసహచరుడు. ప్రస్తుత డి.కె. ప్రధాన కార్యదర్శి,

ఇ.వి.ఆర్. వారసుడు అయిన కె. వీరమణికి గత 35 సం.లుగా సహచరుడాయన. డి.కె. ఉద్యమం తీసుకున్న హిందూ వ్యతిరేక ధోరణికి ఆయన అసంతృప్తి చెందాడు. హిందూ సంఘటనా కార్యాన్ని బహిరంగంగానే సమర్థించడం మొదలుపెట్టాడు. దినమలార్ (1982 ఏప్రిల్ 20) పత్రికలో వీరమణికి ఒక బహిరంగ లేఖ వ్రాస్తూ ఆయన "ఇ.వి.ఆర్. చెప్పిన కొన్ని శ్రేష్ఠవాక్యాలను మీకు గుర్తుచేయవలసిన సమయం వచ్చింది. మన సమాజంలోని 97 శాతం యొక్క స్వాభిమానాన్ని జాగృతం చేయవలసిన అవసరాన్ని వారు నొక్కి వక్కాణించేవారు. మన సమాజం అని ఉపయోగించడంలో ఆయన ఉద్దేశం హిందూ సమాజం అని. కానీ, ఇ.వి.ఆర్. దర్శించిన పరివర్తననే హిందూ సమాజంలో తీసుకుని వచ్చేందుకు అంకితమైన సంస్థలపై మీరు విమర్శలకు దిగడం దురదృష్టకరం" అని వ్రాశారు.

ఆ తదుపరి సంఘ కార్యకర్తలతో మాట్లాడుతూ శ్రీ ఆర్ముగం మరికొంత ప్రముఖమైన సమాచారాన్ని తెలియజేశారు. "కొంతకాలం క్రితం అంబేద్కర్ మరొక మతాన్ని స్వీకరించాలని ఆలోచిస్తున్న తరుణంలో, ఇ.వి.ఆర్. హిందూత్వాన్ని విడిచిపెట్టే ఆలోచన చేయవద్దని ఆయనకు వ్రాశారు. సమాజంలోనే ఉంటూ, వెనుకబడిన వర్గాల హక్కులు, గౌరవం కోసం పోరాడడం ద్వారానే సమాజంలో సంస్కరణ సాధ్యమని ఆయన నొక్కిచెప్పారు. ఇదే విషయంపై 'విడుదలై' పత్రికలో ఇ.వి.ఆర్. అనేక వ్యాసాలు వ్రాశారు."

## ఏకతను సాధించే హిందూభావన:

మరొక ముఖ్యమైన అంశంకూడా వుంది. తమిళ ప్రజలందరినీ తనవైపు త్రిప్పుకోవాలని ద్రవిడవాదం ఆశించింది. కానీ వారిలోని కుల తత్వం, అంటరానితనాల విషాన్ని విరుగుడు చేయడంలో అది ఘోరంగా విఫలమైంది. తమిళనాడులోని దక్షిణ ప్రాంతాలలోగల ద్రవిడ కంచు కోటలు ఈ మధ్య కాలంవరకూ కూడా తేవర్-హరిజన ఘర్షణలకు రంగంగా ఉండేవి. అవకాశాన్ని సద్వినియోగం చేసుకునేందుకు ముస్లిం, క్రైస్తవ మత దురహంకారులు ఎప్పుడూ కాచుకుని ఉండేవారు. చాలా సందర్భాలలో ఈ హిందూవ్యతిరేక శక్తులే స్వయంగా ఘర్షణలను రెచ్చగొట్టారుకూడా. ఆ ఘర్షణలలో పెద్ద ఎత్తున హత్యలు, గృహదహనాలు తరచు సంభవించేవి.

రామనాథపురం జిల్లా ఈ కుల ఘర్షణలకు తరచు గురి అయ్యేది. 1981 ఫిబ్రవరిలో జరిగిన ఘర్షణల సందర్భంలో, వాటిని అడ్డంపెట్టుకుని ముస్లిం మత తత్వ శక్తులు పెద్ద ఎత్తున హింసాకాండకు,దాడులకుదిగేవారు. స్వయంసేవకుల ఆధ్వర్యంలోని హిందూ ఒట్రుమై మైయం (హిందూ ఐక్యతా కేంద్రం) వేదికగా అనేక హిందూ సంస్థలు ఒక్కటై హిందువులలోని ఈ అంతఃకలహాలకు స్వస్తిచెప్పాలని నిర్ణయించాయి. జిల్లాలోని లోతట్టు గ్రామాలకు సైతం చెందిన వందమందికి పైగా అన్నికులాల నాయకులు, ప్రతినిధులు ఈ ఉద్యమంలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

1984 జనవరిలో ఘర్షణలతో అట్టుడికిన, మతం మార్పిడులకు గురైన ప్రాంతాలలో పాదయాత్రలు జరిగాయి. సంఘ ప్రాంత సంఘచాలకులు, ఇతరకార్యకర్తలు అందులో పాల్గొన్నారు. చివరిలో జరిగిన వివిధ కులాలు, ఉపకులాల ప్రతినిధుల ఒకరోజు సమ్మేళనం తమ పరస్పర విభేదాలు విస్మరించి, హిందూ సమైక్యత, సమరసతలకై పాటుపడాలని చారిత్రక నిర్ణయంచేసింది. ఆ తరువాత జరిగిన పెద్ద బహిరంగసభ, సామాన్య ప్రజలలో సైతం ఈ పిలుపు రగిలించిన ఉద్వేగానికి ఒక స్పష్టమైన నిదర్శనంగా నిలిచింది.

ఫలితాలు త్వరలోనే కనిపించసాగాయి. గతంలో ఘర్షణలకు కారణం అవుతూ వచ్చిన మురుగన్ దేవాలయ ఉత్సవం, 1984లో ప్రశాంతంగా జరిగిపోయింది. జిల్లా చరిత్రలోనే ఆ ఉత్సవం ఒక మలుపు అయ్యే విధంగా హరిజనులతో సహా అన్ని వర్గాల హిందువులు, ప్రక్కగ్రామాలనుండి కూడా వచ్చి పాల్గొన్నారు. మద్రాస్ నుండి వెలువడే ది హిందూ (1984 మార్చి 18) "రామనాడులోని మురుగన్ దేవాలయంలో "పంగుణి ఉథిరం" ఉత్సవం శాంతియుతంగా ముగిసింది. హరిజనులు - హరిజనేతరుల మధ్య సంపూర్ణమైన అవగాహన ఈసారి ప్రత్యేక విశేషం" అని వ్రాసింది.

రామనాడు రాజవంశస్తులు, ఆ జిల్లాసంఘచాలక్ అయిన స్వర్గీయ ఆత్మనాథస్వామి, ప్రఖ్యాతులైన తమ పూర్వీకుల సంప్రదాయాన్ని కొనసాగించడానికి ముందుకు వచ్చారు. వారి తాతగారైన మహారాజా సేతుపతి స్వామీవివేకానందకు అమెరికా యాత్ర సందర్భంలో చాలా సహకారం అందించారు. వారి వారసులుగా, ఈ సమాజిక ఘర్షణల సవాలును ఆత్మనాథస్వామి స్వీకరించారు. హరిజన గ్రామాలను, బస్తీలను సందర్శించడం ప్రారంభించారు. వారి గుడిసెలలో కూర్చునేవారు.

వారితో కలిసి తేనీరు తీసుకునేవారు. తన ఇంటికి వారిని ఆతిథ్యానికి ఆహ్వానించేవారు. అంతవరకు హరిజనులకు ప్రవేశం నిషేధించబడిన తన రాజకుటుంబానికి చెందిన దేవాలయంలో వారికి ప్రవేశం లభించేటట్లు చూశారు. వారు లేకుండా ఏ పూజా కార్యక్రమంలోనూ, ఇతర ఉత్సవాలలోనూ పాల్గొనరాదని కూడా ఆయన నిర్ణయించుకున్నారు. ఒక రాజ కుటుంబానికి చెందిన వ్యక్తి, అదీ తేవర్ కులస్థుడి ఈ ప్రవర్తన సమాజంలో నేటివరకు ఉపేక్షించబడిన ప్రజలపై ఎంతటి ప్రభావం చూపుతుందో ఎవరైనా సులభంగా ఊహించవచ్చు.

విశ్వహిందూ పరిషత్ యొక్క జ్ఞానరథం ప్రకల్పం హిందూ సమాజంలో సమరసత నిర్మాణానికి జరుగుతున్న ఉద్యమానికి బలమైన ఊపునిచ్చింది. వెనుకబడిన గ్రామీణ ప్రాంతాలకు రథాన్ని ప్రత్యేకంగా తీసుకుని వెళ్ళారు. డి.కె. ధర్మవ్యతిరేక ప్రచారాలదాడికి ప్రధానంగా గురియైనవారు హరిజనులు, ఇతర వెనుకబడిన వర్గాలవారే. ఇవాళ శ్రీ కంచి శంకరాచార్యులు, శ్రీ పెజావర్ మఠాధీశ్వరులచే జ్ఞానరథంలో ప్రతిష్టించబడిన మురుగన్ వారికి దర్శనం ఇవ్వడంకోసం స్వయంగా వారి వాడలకు, గుడిసెలకు తరలి వస్తున్నాడు. శతాబ్దాలుగా ఈ అదృష్టానికి నోచుకోలేదువారు. ఆ క్షణాన వారి భక్తిపారవశ్యం వర్ణనాతీతం. ఒక చోట, మధ్యాహ్నం పూజాభిషేకాలు మొదలైతే అర్ధరాత్రి వరకు భక్త ప్రవాహం వస్తూనే ఉంది. ఆ తరువాత శక్తి రథం, జ్ఞాన దీపకరథం అనే మరిరెండు రథాలు కూడా మొదటి రథంతో చేరాయి. ప్రకల్పానికి మరింత ఊపు వచ్చింది.

## పంజాబ్‌లో సామరస్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని బలపరిచే కృషి:

పంజాబ్‌లో తీవ్రవాదులు అనుసరిస్తున్న వ్యూహం ప్రధానంగా మూడు విధాలు: తుపాకిగుండు ద్వారా, రాజకీయ స్థాయిలో, సామాజిక స్థాయిలో. మొదటి రెండు స్థాయిలలో విజయంగానీ, అపజయంగానీ ఎంత అన్నది నేడు ప్రజలు, పత్రికలు అంచనా వేస్తున్న అంశం. కానీ, బహుశః తీవ్రవాదులు అత్యధికంగా సవాలు ఎదుర్కొంటున్నది సామాజికరంగంలోనే.

పంజాబ్ పరిస్థితి యొక్క వాస్తవ స్థితి తీవ్రవాదులకు బాగాతెలుసు. జనాభాలో 45శాతం సహజధారీ (సిక్ఖేతర) హిందువులు. వారు గనుక

దృఢంగా ఎదిరించి నిలబడినా, తమ స్వస్థలాలలో తమ బలాన్ని ప్రదర్శించడం మొదలుపెట్టినా 'ఖలిస్తాన్ సాధన' అనే స్వప్నం కాస్తా గాలిలో కలిసిపోవడం ఖాయం. కనుక సిక్ఖులను పెద్ద ఎత్తున వారిపై దాడి చేసేటట్లురెచ్చగొట్టగలిగితే వారు సాముహికంగా రాష్ట్రాన్ని వదలిపోయేటట్లు చేయవచ్చు. అలాచేస్తే మిగిలిన దేశంలో గల సిక్ఖులు హిందువుల ఆగ్రహానికి గురియై పంజాబ్‌కు పారిపోయివస్తారని, అటువంటి పరిస్థితి ఏర్పడితే తమ ఖలిస్తాన్ స్వప్నం నిజంకావడానికి రంగం సిద్ధం అవుతుందని తీవ్రవాదులు భావిస్తూ ఉండవచ్చు. రాజకీయరంగంలో తీవ్రవాదుల ఎత్తుల లక్ష్యం అన్ని రకాల రాజకీయ నాయకత్వాన్ని నాశనం చేసి, ప్రజాస్వామ్య రాజకీయ పద్ధతి నిలచిపోయేటట్లు చేయాలని, తద్వారా పంజాబ్ రాజకీయ రంగంలో సిక్ఖేతర ప్రభావాన్ని తొలగించాలని అయిఉండవచ్చు.

ఈ ప్రయత్నంలో తీవ్రవాదులు ఎదుర్కొంటున్న అతిపెద్ద ఆటంకం సిక్ఖులనుండే. అత్యంత ప్రశంశాత్మకమైన రీతిలో సిక్ఖులు తోటి హిందూ సోదరులకు వ్యతిరేకంగా ఆయుధాలు పట్టడానికి తిరస్కరిస్తున్నారు. సహజధారీ హిందువులు అల్పసంఖ్యాకులుగా ఉండే లోతట్టు గ్రామీణ ప్రాంతాలలోకూడా ఇదే స్థితి. మరొక ప్రక్క స్థానిక సిక్ఖులు తమ సహజధారీ సోదరులకు అన్నిరకాల రక్షణకు హామీ ఇవ్వడం, వారిని ఇతర ప్రాంతాలకు వలస పోకుండా నివారించడంలాంటి సంఘటనలకు కూడా కొదవేంలేదు. ఆ విధంగా తీవ్రమైన రెచ్చగొట్టే వాతావరణంలోకూడా రెండు వర్గాలమధ్య అనాదిగా వస్తున్న సోదరత్వ బంధాలు గట్టిగానే నిలబడ్డాయి.

హోషియార్‌పూర్ సమీపంలోని కార సహరిగ్రామంలో, 1988 ఫిబ్రవరిలో జరిగిన ఒక సంఘటన సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ప్రతి ఏడులాగే హోలీ సందర్భంగా జరిగే 'రామలీల' కార్యక్రమంలో తీవ్రవాదులు ప్రవేశించి, అక్కడి ప్రేక్షకులలో ఉన్న సిక్ఖులను బైటకు తొలగి పోవలసిందని లేదా ఇతర హిందువులతోబాటు తుపాకిగుండ్లు రుచి చూడవలసి వస్తుందని హెచ్చరించారు. 'మేం సోదరుల్లా కలిసిమెలసి పుట్టిపెరిగాం. మీ బెదిరింపులకు తలవొంచే కంటే మేం కలిసిమెలిసి మరణిస్తాం. మీ తుపాకిగుండ్లు మా రక్త సంబంధాలను త్రెంచలేవని గుర్తుపెట్టుకోండి.' అని తిరుగు సమాధానం చెప్పారు సిక్ఖులు. తుపాకులు గర్జించాయి. హతులైన 35 మందిలో సగానికిపైగా, అంతకురెట్టింపు గాయపడిన వారిలోనూ సిక్ఖులే ఉన్నారు. సమస్త హిందూ సమాజరక్షణకై తమ ప్రాణాలను మూల్యంగా చెల్లించిన వారి గురువుల మహోన్నత

పరంపరనే వారు కూడా కొనసాగించారు.

## సమైక్యసంకల్పానికి సమర్థన:

ఈ నేపథ్యంలో సంఘస్వయంసేవకులు నిర్వహించిన పాత్ర ప్రాముఖ్యత బహుధా ప్రశంసనీయమైనది. సిక్ఖులు, ఇతర హిందువుల మధ్య పంజాబ్‌లోను, బయటకూడా పరస్పర విశ్వాసం, సద్భావనలను కొనసాగించేందుకు కృషిచేయవలసిందిగా సంఘ అఖిల భారతీయ కార్యకారీ మండలి అనేకసార్లు స్వయంసేవకులకు మార్గదర్శనం చేసింది. సంఘం ఎల్లప్పుడు సిక్ఖులను వీరత్వం, భక్తి, ఆత్మసమర్పణ నిండిన హిందూ సమాజం యొక్క వర్గాలుగానే పరిగణించింది. 1947 మారణహోమం సమయంలో కూడా, ఇతర హిందువులతోపాటు సిక్ఖు పురుషులు, స్త్రీలు, పసిపిల్లల రక్షణకోసం అనేక మంది స్వయంసేవకులు తమరక్తం చిందించారు. దేశవిభజనకు పూర్వరంగంలో జరిగిన హింసాకాండ, భీభత్సం చీకటిరోజులలో అమృతసర్‌లో పవిత్రదర్బారా సాహెబ్ పరిసరాల సంరక్షణలో ముందున్నది సంఘస్వయంసేవకులే. సంఘ శాఖలలో కూడా కేశధారులు, సహజధారులు ఎటువంటి తారతమ్యాలు లేకుండా కలిసిమెలిసి ఉండేవారు.

తీవ్రవాదుల చర్యలకు వ్యతిరేకంగా పంజాబీ ప్రజల సమైక్య సంకల్పాన్ని సుదృఢ పరిచే కృషిలో స్వయంసేవకులు స్వీకరించిన ఉద్యమానికి సిక్ఖు పంథానుండి, ప్రధానంగా అందులోని మేధావి వర్గంనుండి సహజంగానే అంతులేని సమర్థన లభించింది.

1983 మార్చి 12, 13 తేదిలలో అమృతసర్‌లో విశాల ధర్మ సమ్మేళనం నిర్వహించనున్నట్లు విశ్వహిందూపరిషత్ ప్రకటించినప్పుడు, అనేకమంది ఆశ్చర్యచకితులయ్యారు. సిక్ఖుతీవ్రవాదానికి ప్రతిగా ఈ ధర్మసభ సిక్ఖేతరులలో మతద్వేషాన్ని రెచ్చగొట్టనున్నదా? ఈ విశ్వహిందూపరిషత్ చర్యకు సిక్ఖులు ఎలా ప్రతిస్పందిస్తారు? ప్రభుత్వం కూడా ఆతృతతో ఎదురుచూడసాగింది. రాత్రింబవళ్ళు కాపలాకాయడానికై వేయిమందికి పైగా సాయుధ పోలీసులను నియమించారు.

కానీ, ఆ సందర్భాన అమృతసర్‌లో జరిగిన సంఘటనలు విశేషమైనవి. లక్షమందితో 6 కి.మీ. దూరంసాగిన ఊరేగింపులో అన్నివర్గాల హిందువులు పాల్గొన్నారు. ఈ చారిత్రాత్మక ఊరేగింపులో పాల్గొనేం

దుకు వందలాది గ్రామాలనుండి వేలాది కేశధారులు సైతం తమతోటి హిందూసోదరులతో కలసి అమృతసర్‌కు తరలివచ్చారు. ప్రతినిధులకు స్థానిక గురుద్వారాలు 24 గంటలు లంగర్ (ఉచిత భోజనం) ఏర్పాటు చేశాయి. వేలాది ఇండ్ల నుండి సమ్మేళనస్థలానికి 4 ట్రక్కుల నిండుగా పరోటాలు వచ్చాయి.

సమ్మేళనంలో ఎక్కడా సిక్కు, సిక్కేతరుల మధ్య విభేదాలు మచ్చుకైనా కనిపించలేదు. నాంధారీ, మజహబీ, తదితర ఉపశాఖలకు చెందిన ఆదరణీయులైన కేశధారీ గురువులు, పూజ్యులైన హిందూస్వామీజీలు, హిందూనేతలైన మేవార్ మహారాణా శ్రీ భగవత్‌సింగ్, డా. కరణ్ సింగ్, గుల్జారీలాల్‌నందా, ప్రొ. రాజేంద్రసింహ, రాజమాత విజయరాజె సింధియాలతో కలిసి హిందూ ప్రజల ఆంతరంగిక ఏకత్వాన్ని చాటిచెప్పారు. విదేశాలలో ఉన్న నాంధారీ సిక్కుల సద్గురు జగ్జీత్‌సింగ్ సమ్మేళన విజయాన్ని ఆకాంక్షిస్తూ తన ఆశీస్సులను పంపించారు. హిందువులు, సిక్కుల మధ్య తరతరాలుగా వస్తున్న సోదరభావన, ఏకాత్మతను సుదృఢం చేయవలసిన అత్యవసరము, ప్రముఖము అయిన బాధ్యత మనపై ఉన్నది. ఈ వ్రతం విజయం పైననే పంజాబ్, సమస్త భారతవర్షాల భవిష్యత్తు ఆధారపడి ఉంది.' అని ఆయన పేర్కొన్నారు. రాజకీయ శతృత్వం విషం చిమ్మి, జాతీయ జీవనంలోని అన్నిరంగాలు కలుషితం అవుతున్న ఒకానొక సమయంలో, అమృతసర్ సమ్మేళనం సద్భావన, సోదరభావనల అమృతాన్ని వెదజల్లడం ఎలాగో చూపించింది.

బ్లూస్టార్ ఆపరేషన్ - స్వర్ణదేవాలయంలో సైనికచర్య-కు ముందు పంజాబ్‌లో ఒక శాంతి యాత్ర జరిగింది. పూనాలో వి.వి. పెండ్సే అనే స్వయంసేవక్ మార్గదర్శనంలో ఆవిర్భవించిన జ్ఞానప్రబోధిని అనే నిర్మాణాత్మక ఉద్యమానికి చెందిన విద్యార్థులు, అధ్యాపకులు, సామాజిక కార్యకర్తలు 115 మంది ఈ యాత్రలో పాల్గొన్నారు. ఒక స్వచ్ఛంద సంస్థ నిర్వహించిన మొట్టమొదటి యాత్ర అది. తీవ్రవాదులను, సామాన్య ప్రజలను కూడా వారు కలుసుకున్నారు. జాతీయ సమైక్యతా సందేశాన్ని వారి వద్దకు మోసుకుని వెళ్ళారు. అమృతసర్‌లో స్వర్ణదేవాలయంలో వారు బసచేశారు. సంత్‌లాంగోవాల్, భింద్రన్‌వాలేలతో చర్చలు జరిపారు. జాతీయ సమైక్యతకు అత్యధిక ప్రాధాన్యత నీయవలసిందిగా వారికి పిలుపునిచ్చారు.

## సిక్కుసోదరుల రక్షణలో:

1984లో ఇందిరాగాంధీ హత్య సందర్భంగా ఢిల్లీలో చెలరేగిన విధ్వంసకాండలో సిక్కుసోదరీసోదరులను కాపాడడంలో స్వయంసేవకులు నిర్వహించిన పాత్ర ప్రశంశనీయమైనది. స్వయంసేవకుల ఇండ్లల్లో వందలాది సిక్కుకుటుంబాలు ఆశ్రయం పొందాయి. పునరావాస శిబిరాలు ఏర్పాటు అయ్యాయి. వారి వారి గృహాల వద్ద కూడా అవసరమైన సేవల నందించారు. తమ ప్రాణాలను, ఆస్తులను పణంగా పెట్టి అనేక వందల సహజధారీ హిందూ కుటుంబాలు పొరుగున ఉన్న సిక్కు కుటుంబాలకు సంరక్షణ కల్పించడానికి ముందుకు వచ్చాయి. ఢిల్లీ హత్యాకాండ తరు వాత పంజాబ్‌కు తరలివెళ్ళిన సిక్కులు ఆక్లిష్టసమయంలో స్వయంసేవకులు తమనెలా ఆదుకున్నారో తెలిపే వార్తలను మోసుకునివెళ్ళారు.

మిలిగిన చోట్లకూడా, తగిన సమయంలో సంఘపెద్దలు ఇచ్చిన మార్గదర్శనం క్లిష్టసమయాలలో ఉద్రిక్తతలను తగ్గించేందుకు ఎంతో సహా యపడింది. ఢిల్లీలో జరిగిన హత్యాకాండ నేపథ్యంలో ఈ అమానుష చర్యలపట్ల బాలాసాహెబ్ దేవరస్ చేసిన ఖండన విస్పష్టమైన పదాలలో మార్మోగింది. ఎప్పుడైనా బస్సులలో ప్రయాణిస్తున్న సహజధారీ హిందు వులపై తీవ్రవాదులు దాడిచేసినా శ్రీ బాలాసాహెబ్, పంజాబ్ ప్రాంత సంఘచాలకుల ప్రకటనలు పంజాబ్‌లోను, ఇతర చోట్ల ఉన్న సిక్కేతర హిందువులను సిక్కు వ్యతిరేక భావనలకు లోనుకావద్దని హెచ్చరించేవి.

పట్నా, భారతపూర్, రాంచీ లాంటి అనేక స్థలాలలో ఉద్రిక్తవాతావ రణాన్ని చల్లార్చడంలోను, సామూహికావేశం నుండి సిక్కు కుటుంబాలను, గురుద్వారాలను పరిరక్షించడంలోను, స్వయంసేవకులు నిర్ణయాత్మక పాత్ర వహించారు. ఉత్తరప్రదేశ్‌లోని సహరన్‌పూర్ జిల్లా దేవబంద్‌లో జరిగిన సంఘటన చెప్పుకోవలసినది. ఇందిరాగాంధీ హత్య జరిగిన మరునాటి ఉదయం తాలుకా సంఘచాలక్ రోజులాగానే దేవాలయానికి వెళ్తున్నారు. ఇంతలో ఆవేశంగా గురుద్వారావైపు దూసుకుపోతున్న గుంపు కనబడ డంతో ఆయన ఆ వైపు పరిగెత్తారు. గురుద్వారా ద్వారం వద్ద దృఢంగా నిలబడి ఆగుంపును ఆపుజేశారు. ప్రశాంతంగా వారితో మాట్లాడారు. వారు చేయబోయే చర్య హిందూసమాజానికి ఎటువంటి హానికలిగిస్తుందో వారికి నచ్చజెప్పి ఒప్పించారు. చివరికి ఆ గుంపు చల్లబడడానికి కారణం సంఘచాలక్ మాటలలో గల నైతిక బలం. ఆయన మాటల వెనుక తన జీవితమంతా హిందూసమైక్యతకై సమర్పితుడైన ఒక మహామనీషియొక్క తపస్సు ఉంది.

కాన్పూరులో ఆకతాయిల ఆగ్రహానికి సిక్కులు [illegible] కులు ప్రాణాలు కోల్పోయారు. ఆస్తులు కోల్పోయారు. [illegible] దాడులను త్రిప్పికొట్టడానికి స్వయంసేవకులు ముందు [illegible] నెలకొనే వరకు ప్రాంత సంఘచాలక్ గారి ఇంట్లో [illegible] కుటుంబాలు తలదాచుకున్నాయి. ఎస్. డి. కాలేజీకి [illegible] సర్దార్ ప్రద్యుమ్నసింగ్ ఇంటిని గుంపు చుట్టుముట్టినప్పుడు, [illegible] సేవకులు వారిని తరిమికొట్టి, మృత్యువు కోరల్లోనుండి [illegible] రక్షించారు. దక్షిణ భారతదేశంలో కూడా, ఒక [illegible] కార్యకర్త, ఇళ్లు, దుకాణాలు దాడికి గురిఅయిన అనేక [illegible] పదిహేనురోజులపాటు ఆశ్రయం కల్పించాడు.

## సిక్కు మేధావుల వేదిక:

తీవ్రవాదుల చర్యలకు వ్యతిరేకంగా ప్రజలలో [illegible] చేయడానికి, సిక్కులు, సహజధారీ హిందువుల [illegible] చేయడానికి పంజాబ్‌లో స్వయంసేవకులు అనేక [illegible] సిక్కు ప్రజానీకానికి అత్యంతావశ్యకమైన మార్గదర్శనం [illegible] మేధావివర్గానికి వేదిక కల్పించే వివిధ కార్యక్రమాలను [illegible]

న్యూఢిల్లీలోని చెమ్స్‌ఫర్డ్ క్లబ్‌లో 1984 మే 6న [illegible] రిషత్ నిర్వహించిన పంజాబ్ ఏకతాసమ్మేళనం [illegible] ఒకటి దాని ప్రారంభోత్సవోపన్యాసం చేస్తూ లెఫ్టినెంట్ [illegible] అరోరా 'శాంతియుత పౌరులుగా ఇంతవరకు మనం [illegible] త్వానికి రంగాన్ని విడిచి పెట్టేశాం. ఈ మధ్యకాలంలో [illegible] ఏర్పడుతోంది. శతాబ్దాలుగా విలసిల్లిన, ఎన్నో [illegible] నిలచిన హిందూ-సిక్కుసమైక్యత అదృశ్యం అవుతోంది. [illegible] సహించలేం. దానిని ఎట్టి పరిస్థితులలో జరుగనివ్వరాదు' [illegible]

గోవా లెఫ్టినెంట్ గవర్నర్ అయిన డా. [illegible] హిందుత్వం తల్లిలాంటిది. నిజానికి నా తల్లి [illegible] భారతదేశంలో హిందూత్వం లేకుండా సిక్కుమతానికి [illegible] లేవు' అన్నారు. 'ఈ సమ్మేళనం విషాదకరపంజాబ్‌లో [illegible] వచ్చింది.' అన్నారు ప్రముఖ పాత్రికేయులు సర్దార్ [illegible]

స్వర్ణదేవాలయంలో సైనికచర్య అనంతరం, సిక్కు మత పెద్దలు స్వర్ణదేవాలయంలో కార్ సేవకు (స్వచ్ఛంద సేవ) పిలుపునిచ్చినపుడు అందరికంటే ముందు ప్రతిస్పందన చూపినది సంఘస్వయంసేవకులే. నగర సంఘచాలక్ నేతృత్వంలో వందలాది మంది స్వయంసేవకులు గణవేషధరించి ఊరేగింపుగా దేవాలయంవద్దకు చేరుకున్నారు. ఇంత పెద్ద సంఖ్యలో సంఘస్వయంసేవకుల సాక్షాత్కారం కార్ సేవ నిర్వాహకులను కదిలించి వేసింది. సంఘం ఉదాహరణను అనుసరించమని, రాష్ట్రంలో శాంతిని, సామాజిక సమరసతను పరిరక్షించమని దూరశ్రవణసాధనాలద్వారా వారు మిగిలినవారిని ఉద్బోధించారు. కొద్ది రోజుల తరువాత ఢిల్లీ, పంజాబ్‌కు చెందిన బిజెపి ప్రముఖనాయకులుకూడా పెద్ద సంఖ్యలో కార్ సేవలో పాల్గొన్నారు. ఈ నాయకులు, అకల్ తఖ్త్ ప్రధానపూజారి జతేదార్ కిర్పాల్‌సింగ్‌ను కలుసుకుని అమాయకులను చంపుతున్న హంతకులపై అత్యవసరంగా హుకుంనామా జారీచేయవలసిన అవసరాన్ని నొక్కిచెప్పారు.

రాష్ట్రంలోని పరిస్థితులను సమీక్షించి, తదుపరి చర్యల గురించి ఆలోచించడానికి 1986 ఆగస్ట్ 31న ఢిల్లీలో దేశం మొత్తంనుండి ప్రముఖ సిక్కు స్వయంసేవకులు సమావేశం అయ్యారు. 'పంజాబ్‌ను కాపాడండి. దేశాన్ని కాపాడండి.' అన్నది ఆ సమావేశపు ప్రధాన అంశంగా ఉండింది. సిక్కు పంథాకు చెందిన ప్రముఖ సేవకులు, ప్రఖ్యాత న్యాయవాదులు, వైద్యులు, వ్యాపారవేత్తలతోబాటు ప్రత్యేకాహ్వానంపై పట్నాసాహెబ్‌కు చెందిన జతేదార్ రామ్‌సింగ్ కూడా ఆ సమావేశంలో పాల్గొన్నారు. సమాజంలోని హిందూ - సిక్కు వర్గాల మధ్య సమైక్యతను సుదృఢం చేయడంలోను, వేర్పాటువాదుల కుట్రలను భగ్నం చేయడంలోను సిక్కు ప్రజానీకానికి సిక్కు మేధావివర్గం నాయకత్వం వహించవలసిన ఆవశ్యకతను వారందరూ నొక్కివక్కాణించారు.

## వివిధ సంస్థలకు ప్రేరణ నివ్వడం:

కార్మికరంగంలోని స్వయంసేవకులలో కూడా ఉత్సాహానికేంతక్కువ లేదు. అనేకచోట్ల బి.ఎమ్.ఎస్. శాంతియాత్రలు, సమైక్యతా సమ్మేళనాలు నిర్వహించింది. కేశధారులు, సహజధారులు పెద్ద సంఖ్యలో వాటిలో పాల్గొన్నారు. రెండు వర్గాల మధ్య పరస్పర సద్భావనను నిర్మాణం చేసే ఉద్దేశంతో పది అఖిలభారతీయ కార్మికసంఘాలు ఒకే వేదికమీదకు రావడం కూడా ఎంతో సహాయకారి అయింది. 1986మే 11న

కొత్త ఢిల్లీలో వారు నిర్వహించిన జాతీయ సమగ్రతా సదస్సు ఈ కృషిలో మరొక మజిలీ అయింది. దాని యోజనా సమావేశంలో బి.ఎమ్.ఎస్ అధ్యక్షులు జాతీయ సమైక్యత యొక్క భావాత్మక పునాదిని ప్రస్ఫుటంచేశారు. భాషా, ప్రాంత, వర్ణ, వర్గ వైవిధ్యాల మధ్య కూడా భారత ప్రజల ఆంతరంగిక సాంస్కృతిక ఏకత్వంలోనే ఈ అంశం ఇమిడి ఉన్నదని వారు అన్నారు. 1947లో దేశవిభజనకు దారితీసిన అనేక జాతుల సిద్ధాంతం అత్యంత ప్రమాదకరమైనదని వారు ఎత్తిచూపారు.

అదే సంవత్సరం ఆగస్ట్ 9న అన్ని రాష్ట్రాల రాజధానులు కూడా ఇలాంటి సమగ్రతా సదస్సులనే దర్శించాయి. బెంగుళూరులో జరిగిన సదస్సు ముగింపులో కర్నాటక రాష్ట్ర ఎఐటియుసి అధ్యక్షులు ఇలావ్యాఖ్యానించారు. "మనలో కొందరికి జాతీయ సమగ్రత గురించి మాట్లాడడం కొత్త కావచ్చు. కానీ బి.ఎమ్.ఎస్.కు కాదు. ప్రారంభంనుండి వారు దాని ఉపాసకులుగానే ఉన్నారు." ఈ సమ్మేళనాలలో అనేకచోట్ల కమ్యూనిస్టు కార్మికనాయకులు కూడా దేశ విభజనను తీవ్రంగా ఖండించారు. నేటి వేర్పాటువాద శక్తులన్నింటికీ మూల ప్రేరణ ఆనాటి మహాపరాధంలోనే ఉన్నదని వారు చెప్పారు. 1986 నవంబర్ 23న అమృతసర్‌లో రాష్ట్రీయ సురక్షాసమితి నిర్వహించిన పంజాబ్ ఏకతా సమ్మేళనంలో పెద్ద సంఖ్యలో ప్రజలు పాల్గొన్నారు. వేర్పాటువాద, జాతివ్యతిరేక శక్తులతో పోరాడడానికి పంజాబీ ప్రజలు చేసుకున్న కృతసంకల్పాన్ని ఇది స్పష్టంగా ప్రదర్శించింది. అంతులేని హత్యాకాండ పట్ల, ఖలిస్తాన్ అనే అర్థంలేని కోరికపట్ల వివశత్వంతో ప్రజలు చూపిన తక్షణ ప్రతిఘటన ఇది. సమ్మేళనంలో పంజాబ్‌లోని ప్రతి తాలూకా ప్రాతినిధ్యం వహించింది. వి.హిం.ప., అ.భా.వి.ప., బి.ఎం.ఎస్., బి.కె.ఎస్., సేవాభారతి తదితర అనేక సంస్థలు సమ్మేళనాన్ని విజయవంతం చేసేందుకు తమమద్దతుదారులందరినీ సమీకరించాయి.

బిజెపి ఇచ్చిన పిలుపునందుకుని 5 లక్షలమంది ప్రజలు, పార్టీ కార్యకర్తలు 1987 ఫిబ్రవరి 23నాడు సమధికోత్సాహంతో కొత్త ఢిల్లీలోని ఇండియా గేట్ మైదానాన్ని నింపివేశారు. ఆరోజే పార్లమెంటు బడ్జెటు సమావేశాలు ప్రారంభం కావలసివుంది. కేంద్రంయొక్క పంజాబ్ విధానానికి వ్యతిరేకంగాను, రాజస్థాన్, గుజరాత్, పశ్చిమ బెంగాల్‌తో సహా దేశంలోని పశ్చిమ, తూర్పు ప్రాంతాల్లో అక్రమ ప్రవేశాన్ని నిరోధించడంలో ప్రభుత్వ వైఫల్యానికి వ్యతిరేకంగాను పెద్ద ఎత్తున ఈ నిరసన ర్యాలీని నిర్వహించారు.

ఈ మధ్య కాలంలో పార్లమెంట్ భవనం వద్ద జరిగిన అతి పెద్ద ప్రదర్శన ఇదే. వేదికనుండి రెండవచివరివరకు ఒక మానవసముద్రాన్ని ప్రజలు తిలకించారు. అటల్ బిహారీ వాజ్‌పాయ్ మాటలలో చెప్పాలంటే, ఈ ర్యాలీ తీవ్రవాదానికి వ్యతిరేకంగా వారు సాగిస్తున్న పోరాటంలో పంజాబ్ ప్రజలకు వారు ఒంటరివారు కారని తెలియజెప్పడానికి, కేంద్రంలో నిద్రపోతున్న ప్రభుత్వాన్ని మేలుకొలపడానికి ఉద్దేశించబడింది. పాకిస్తాన్ సరిహద్దువెంబడి రక్షణ వలయాన్ని (Security Belt) నిర్మించవలసిందిగా ర్యాలీ కోరింది.

1987 ఫిబ్రవరిలో పంజాబ్‌లో రాష్ట్రీయ సురక్షాసమితి సహజధారులు, కేశధారులిరువురిలో ఆత్మస్థైర్యాన్ని పెంపొందించే ఒక కార్యక్రమాన్ని నిర్వహించింది. పొరుగు రాష్ట్రాలనుండి వచ్చిన స్వచ్ఛంద సేవకులతో కలిపి, 125మందితో కూడిన ఒక 'బలిదాన జథ' పంజాబ్‌లో 34 రోజులపాటు విస్తృతంగా పర్యటించింది. తీవ్రవాదుల అఘాయిత్యాలకు సిక్కులు భయభ్రాంతులౌతున్న స్థలాలలో గురుద్వారాలలోనే సమావేశాలు జరగాలని వారు పట్టుబట్టేవారు. సమావేశాలన్నీ ఎంతో సుహృద్భావపూరితంగా జరిగాయి. గ్రామీణ సిక్కులకు పంజాబ్ సమస్య అసలు స్వభావం అవగతమయింది. సరిహద్దు ప్రాంతాలలో నివసిస్తున్న సహజధారీ హిందువుల ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించడంలో కూడా ఇది ఎంతో సహాయపడింది.

## అఖిల భారత సమర్థన సమీకరణ:

1987ఫిబ్రవరి 28నుండి మార్చి 9వరకు వి.హిం.ప. నిర్వహించిన సద్భావనా యాత్ర మరొక ప్రముఖమైన అడుగు. పంజాబ్‌లో సహజధారులు, కేశధారుల మధ్య పరస్పర అవగాహనావారధులను నిర్మించడానికి దేశం మొత్తంలోని సాధుసంతులు ఏకమై చేసిన వీరోచిత ప్రయత్నం అది. దాదాపు అన్ని ప్రాంతాలనుండి ధర్మాచార్యులు ఆ యాత్రలో పాల్గొన్నారు. 400 మందితో కూడిన ఈ సద్భావనామండలి పంజాబ్ మొత్తంలో 42 స్థలాలను చుట్టివచ్చింది. ఈ సందేశాన్ని వ్యాప్తి చేసేందుకు వందలాదిమంది వి. హిం. ప. కార్యకర్తలు కూడా సాధుసంతులవెంట అనుసరించారు. సద్భావనాయాత్ర సభ్యులకు దారిపొడుగునా సహజధారులు, కేశధారులు సాదరపూర్వక స్వాగతం పలికారు. శ్రీ పెజావర్ మఠాధీశ్వరులవంటి కొందరు ధర్మాచార్యులు ఎటువంటి పట్టింపులు, పటాటోపాలు లేకుండా ప్రజలను, ముఖ్యంగా సిక్కులను

కలుసుకున్నారు. గురుద్వారాలను సందర్శించారు. సిక్కునేతలు, జతేదార్లు, విద్యార్థినాయకులు, ప్రాధ్యాపకులు, ఆఖరికి తీవ్రవాదయువకులతో కూడా వారు మాట్లాడారు. అమృతసర్‌లో వారికి ఆర్ద్రతాపూర్వకమైన స్వాగతం లభించింది.

యాత్రలో పాల్గొన్న సభ్యులలో సర్వశ్రీ సంత్ వామదేవ్ మహరాజ్, కర్ణాటకకు చెందిన పెజావర్, అదమార్ మఠాధీశులు, గోరఖ్‌పూర్ పీఠానికి చెందిన అవైద్యనాథ్, జగదీశ్‌సింగ్, ప్రభుదత్త బ్రహ్మచారి, స్వామి సత్యమిత్రానంద, వి.హిం.ప.కు చెందిన అశోక్ సింఘాల్‌లు ఉన్నారు. యాత్ర ముగింపులో ప్రొ. దర్శన్‌సింగ్ రాగీ, ఇతర సిక్కు గురుద్వారా ప్రబంధక కమిటీ నాయకులు స్వర్ణదేవాలయంలో ఈ ధార్మికనేతలకు స్వాగతం పలికారు. చాలా సుహృద్భావ వాతావరణంలో చర్చలు జరిగాయి.

సిక్కులలోని స్వయంసేవకులు ప్రారంభించిన రాష్ట్రీయ సిక్కు సంగత్ శాఖలు దేశమంతటా విస్తరిస్తున్నాయి. సిక్కులలోని అధికసంఖ్యాకులను ఇంతకాలం అణగద్రొక్కారు. వారి గళాలు మూగవోయాయి. అటువంటి వారికి ఈ శాఖలు భావప్రకటనా స్వాతంత్ర్యం కల్పించాయి. సిక్కు సంగత్ మొదటి అఖిల భారత సమ్మేళనం 1987 మార్చి 17న నాగపూర్‌లో జరిగింది. సిక్కు మేధావి వర్గ అభిప్రాయాలలోని వివిధ అంశాల మధురసమన్వయం అక్కడ ప్రకటితం అయింది. తమిళనాడు నుండి హిమాచల్ ప్రదేశ్‌వరకు, పంజాబ్‌నుండి బెంగాల్‌వరకు దేశంలోని అన్ని ప్రాంతాలనుండి ప్రతినిధులు పాల్గొన్నారు.

డా. హెడ్గెవార్ స్మృతిభవన్‌లో పవిత్ర అర్దాస్ గానంతో ప్రారంభమైన ఉద్ఘాటన కార్యక్రమానికి చంద్రపూర్‌కు చెందిన గౌరవనీయులు మానెక్ సింగ్‌సోనీ అధ్యక్షత వహించారు. ఉద్వేగభరితమైన తన స్వాగతోపన్యాసంలో శ్రీ జయకాంత్ సింగ్‌లాంబా ఆ స్థలంలో సమావేశం నిర్వహించడం ధర్మ పరిరక్షణకై ఉద్భవించిన రెండు మహాశక్తులైన రాష్ట్రీయసిక్కు సంగత్, రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్‌ల సమాగమానికి ఎంతో ప్రాముఖ్యత కల్పించిందని అన్నారు.

వివిధ ఉత్సవాలలో కేశధారులు, సహజధారులను కలిపే కృషిలో గతకొద్ది సంవత్సరాలుగా దేశం మొత్తంలో స్వయంసేవకులు నిమగ్నులై ఉన్నారు. గొప్ప సమైక్యతా సాధకుడు అయిన సంత్‌నామదేవ్ 636వ నిర్వాణదినం పురస్కరించుకుని 1986 ఆగస్టులో బొంబాయిలో "ఏకతా-

దిండి-భక్తుల సమైక్యతాయాత్ర" అనే ప్రభావశాలి అయిన కార్యక్రమం, ఒక బహిరంగ ఉత్సవం జరిగాయి. ఈ విశిష్టకార్యక్రమాన్ని రాష్ట్రీయ ఏకజుట్, మహారాష్ట్ర-పంజాబ్ ఏకతావేదికలు కలిసి నిర్వహించాయి.

ఊరేగింపు ప్రారంభ సూచకంగా సంత్ నామదేవ్ పల్లకీని మేయర్ దత్తాజీ నలావడే స్వయంగా తన భుజాలకెత్తుకున్నారు. పంజాబ్ ప్రజాసం క్షేమశాఖామంత్రి దులీప్‌సింగ్, (ముఖ్యమంత్రి ఎస్. ఎస్. బర్నాలా ఈ కార్యక్రమానికి ఆయనను ప్రత్యేకంగా పంపించారు.) బొంబాయి మాజీ మేయర్ మన్మోహన్‌సింగ్ బేడీ, బిజెపి శాసనసభ్యుడు రామనాయక్ తదితరులు ఊరేగింపులో పాల్గొన్నారు. డా. గోపాల్‌సింగ్, మహారాష్ట్ర ముఖ్యమంత్రి శంకర్రావు చవాన్, అరెస్సెస్ నాయకులు మోరోపంత్ పింగళేలు ఆ సందర్భంగా ప్రసంగించారు.

1987లో బాలాసాహెబ్ దేవరస్ ఇచ్చిన పిలుపును పురస్కరించుకుని దేశంలోని వందలాది స్థలాలలో గురుతేగ్ బహదూర్ బలిదాన దినాన్ని ఆచరించారు. సిక్ఖులు, ఇతర హిందువులు సమధికోత్సాహంతో పాల్గొన్నారు.

ఆసందర్భంలో విద్యార్థి పరిషత్ ఒక భావస్ఫోరకమైన కార్యక్రమాన్ని ప్రకటించింది. ఆ మేరకు 1987 నవంబర్ 25న గురునానక్ జన్మదినం నాడు అమృతసర్‌లో గురుతేగ్ బహదూర్ జన్మస్థలమైన గురు-కా-మహల్ నుండి "షహీద్ సందేశ్ జ్యోతి యాత్ర" ప్రారంభమైంది. పంజాబ్, హర్యానాలగుండా పర్యటించి 1987 డిసెంబర్ 10 నాటికి ఢిల్లీలోని శీష్‌గంజ్ గురుద్వారాను చేరింది. ఒకనాడు హిందూ ధర్మరక్షణకై ఔరంగజేబు చేతులలో గురుతేగ్‌బహదూర్ శిరస్సు తెగిపడిన స్థలం అదే. దేశం మొత్తంనుండి వచ్చిన విద్యార్థి నాయకులు పాల్గొన్న ఆ యాత్ర పంజాబ్ సమస్యపై భారతీయ యువత సమైక్య సంకల్పాన్ని ప్రతిబింబించింది.

## తీవ్రవాదులకు గుణపాఠం:

శాఖలలో తాము జీర్ణించుకున్న వీరత్వభావనను స్వయంసేవకులు 1986 మార్చి 28న లూధియానాలో జరిగిన సంఘటనలో యోగ్యరీతిలో ప్రదర్శించారు. ఆ రోజు అయిదుగురు తీవ్రవాదులు స్కూటర్లపై ఉదయంశాఖ వద్దకు వచ్చారు. దృఢకాయుడైన ముఖ్య శిక్షక్ హరీష్ కట్యాల్ కాల్పులుజరుపుతున్న తీవ్రవాదిపైకి లంఘించాడు. కట్యాల్ అతడితో పెనుగులాడుతున్న సమయంలో వేరొక తీవ్రవాది అతడి తలలో

కాల్చాడు. అనంతరం వారంతా పారిపోయారు. కట్యాల్ సంఘస్థాన్‌లోనే మరణించగా, తుపాకి గుండ్లతో శరీరం తూట్లుపడిన మండల కార్యవాహ కృష్ణలాల్, మరుసటిరోజు ఆసుపత్రిలో మరణించాడు. ప్రభుత్వం హరీష్ కట్యాల్ చూపిన అద్భుత సాహసానికి అతడిని అమరవీరునిగా సన్మానించాలని నిర్ణయించింది. ఆ సందర్భంగా జరిగిన బహిరంగసభలో, అధ్యక్షత వహించిన ఆరోగ్యశాఖామంత్రి బసంత్‌సింగ్ ఖాల్సా కట్యాల్‌కు ఘనంగా నివాళులర్పించారు.

ఇది కేవలం ఒకే ఒంటరి సంఘటనకాదు. పిస్తోళ్ళు ధరించిన ఇద్దరు తీవ్రవాదులు తరన్ తరన్‌కు చెందిన ఒక స్వయంసేవక్‌పై దాడిచేసి, అతడి స్కూటర్‌ను స్వాధీనం చేసుకునేందుకు ప్రయత్నించినపుడు, అతడు వారిలో ఒకరిపై దూకి, అతడిని మట్టికరిపించాడు. పచ్చడి చేసే పిడికిలి దెబ్బలకు తట్టుకోలేక ఆ తీవ్రవాది పిస్తోలు అక్కడే విడిచిపెట్టి ప్రాణాలు కాపాడుకునేందుకై పరుగులంకించుకున్నాడు. అతడి సహచరుడు అప్పటికే పారిపోయాడు. 1986 ఫిబ్రవరిలో జరిగిన సంఘటన ఇది.

పఠాన్‌కోటకు చెందిన ఒక స్వయంసేవక్ బటాలాలో తన మిత్రుని కర్మాగారంలో కూర్చుని ఉన్నాడు. ఇంతలో ఇద్దరు తీవ్రవాదులు అక్కడికి వచ్చారు. వీరిద్దరికీ పిస్తోళ్ళు గురిపెట్టి 5 వేల రూపాయలు చెల్లించాలని అడిగారు. స్వయంసేవక్ యొక్క తిరస్కార ధోరణిని గమనించిన ఒక తీవ్రవాది కాల్పులు జరిపాడు. సరిగ్గా అదే క్షణంలో, ఆ స్వయంసేవక్ మెరుగువేగంతో తీవ్రవాది చేతిపై కొట్టాడు. పిస్తోలు నుండి వెలువడిన గుండు అతడి శరీరంలోని భాగాలను గాయపరస్తూ దూసుకుపోయింది. స్వయంసేవక్ రౌద్రమైన దాడికి తట్టుకోలేక ఆ తీవ్రవాది పరుగెత్తి సైకిల్‌మీద తప్పించుకు పోవాలని ప్రయత్నించాడు. స్వయంసేవక్ అందరినీ హెచ్చరించి, వెంబడించి అతడిని పట్టుకున్నాడు. ఇతర యువకులు కూడా వెంబడించారు. రెండవ తీవ్రవాదిని కూడా పట్టుకున్నారు. ఇద్దరు తీవ్రవాదులు అక్కడే చంపబడ్డారు. ఇది 1987 అక్టోబర్ 21న జరిగిన సంఘటన.

1988 మే 25న తరన్ తరన్‌లో ఒక ప్రముఖ వ్యాపారి అయిన స్వయంసేవక్‌కి 50 వేలరూపాయలధనం ఇచ్చుకోమంటూ ఖలిస్తాన్ కమాండో ఫోర్స్ పేరున ఒక లేఖ అందింది. మరుసటి రోజున, ఆ ఉత్తరానికి సమాధానం తెలుసుకునేందుకు ఒక తీవ్రవాది వచ్చాడు. ఉత్త

రాన్ని ముక్కలుగా చింపి, చెత్తబుట్టలోకి విసిరి వేసానని ఆ స్వయంసేవక్ నిబ్బరంగా చెప్పాడు. అక్కడినుండి ఆ తీవ్రవాది బెదిరింపులు మొదలుపెట్టాడు. అప్పుడే 70 ఏళ్ళ వృద్ధుడైన ఆ స్వయంసేవక్ తండ్రి దుకాణం వద్దకు వచ్చాడు. తీవ్రవాది కంటపడగానే ఆయన 'వచ్చావా! నీకోసమే నిన్నటినుంచి ఎదురుచూస్తున్నాం' అని హూంకరిస్తూ అతడిమీద విరుచుకుపడ్డాడు. ఆ వృద్ధుడి పిడిగుద్దులకు యువ తీవ్రవాదికి ఊపిరిసలపలేదు. ఆ తరువాత అతడిని కేంద్ర రిజర్వుపోలీసులకు (CRP) అప్పగించారు. తరన్ తరన్ పట్టణమంతా ఆనందోత్సాహాలలో మునిగిపోయింది. 25 ఏళ్ళయువకుడిని ఒక 70 సం. ల వృద్ధుడు లోబరుచుకున్నప్పుడు, అదే పనిని మనం ఎందుకు చేయలేం? ఇవే మాటలు ఊరంతావినిపించాయి.

తీవ్రవాదుల దాడులను ఎదుర్కొనేవిధంగా ప్రతిబజారులో, ప్రతివీధిలో ప్రజాశక్తిని జాగృతం చేసేందుకు స్వయంసేవకులు సాగించిన ప్రయత్నాలు సత్ఫలితాలను ఇవ్వడం ప్రారంభించాయి. 1988 ఏప్రిల్24వ తేదీన కొందరు తీవ్రవాదులు అమృతసర్ పట్టణంలోని పుతలీఘర్ బజార్పై దాడిచేశారు. విచక్షణా రహితంగా వారు సాగించిన కాల్పులలో ఒకరు అక్కడికక్కడే మరణించగా మరొకరు ఆసుపత్రి పాలయ్యారు. అయితే అంతకుముందులా కాక ఈసారి ఒక నూతన ప్రతిక్రియ కనిపించింది. మామూలుగా ఉండే గందరగోళం, భయవిహ్వలత ఈసారి లేదు. బదులుగా, స్వయంసేవకుల నాయకత్వాన బజార్లోని ప్రజలు ముందుకురికి, ఒక తీవ్రవాదిని పట్టుకుని, కొట్టి చంపారు. మిగిలిన వారు పారిపోయి, ఒక అనాథాశ్రమంలో తలదాచుకున్నారు. కానీ ప్రజలు చుట్టు ముట్టి సి. ఆర్. పి వచ్చి ఆ పదిమందిని అరెస్ట్ చేసేవరకు వారిలో ఒక్కరిని కూడా తప్పించుకోనివ్వలేదు. ఈ సంఘటన ఆ ప్రాంతంలో ఒక కొత్త సాహసం, ఆత్మవిశ్వాసాల ప్రభంజనాన్ని నిర్మాణం చేసింది.

## ఆపన్నుల సేవలో:

స్వయంసేవకులు నడుపుతున్న పంజాబ్ పీడిత సహాయతా సమితి తీవ్రవాదుల హింసాకాండలో గాయపడి, అమృతసర్, తదితరజిల్లాకేంద్రాలలో ఆసుపత్రిపాలైన వ్యక్తులకు సహాయం అందిస్తోంది. గాయపడిన వారికోసం ఒక్క అమృతసర్లోనే వేయిమందికి పైగా స్వయంసేవకులు రక్తదానం చేశారు. ప్రత్యక్ష సేవతోబాటు, రోగులకు, వారి వద్ద ఉంటున్న వారికి అవసరమైనమందులు, భోజనం, ధనం సమకూర్చడం

అనేక నెలలుగా జరుగుతూనే వుంది. 1988 ప్రారంభంనాటికి, ఇంటి యజమాని తీవ్రవాదుల గుండ్లకు బలైపోయిన 376 కుటుంబాలకు తగినంత ధనసహాయాన్ని వారు అందించారు.

సమితి ప్రారంభించిన 'ఒక బిడ్డ దత్తత పథకం' - దత్తకయోజన - తీవ్రవాదహింసాకాండలో అనాథలయిన పిల్లలకు విద్యాబోధన సహాయాన్ని అందించడానికి ఉద్దేశించబడింది. తరచు ఈ దత్తత విద్యాసహాయందాటి ముందుకు వెళ్తూంటుంది. దత్తత తీసుకున్న కుటుంబం ఆ పిల్లవాడితో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభిస్తారు. పండుగలలో తమ ఇంటికి ఆహ్వానిస్తారు. అలా ఒక కుటుంబపరమైన అనుబంధం వారి మధ్య ఏర్పడుతుంది. ధన సహాయంకంటే, సమాజంయొక్క ఆత్మీయ పూర్ణ ప్రోత్సాహమే ఆ తల్లీబిడ్డలకు తమకు కలిగిన విపత్తునుఎదుర్కొనే సాహసాన్ని గట్టి పరుస్తుంది. వ్యక్తిగత, చిన్న స్థాయి దత్తత కార్యక్రమాలతోబాటు అమృతసర్, అబోహర్, లూధియానా, హోషియార్‌పూర్, బటాలా, పఠాన్‌కోటలాంటి స్థలాలలో పెద్ద కార్యక్రమాలుకూడా జరిగాయి. ఇప్పటి వరకు తక్షణ సహాయం అత్యవసరంగా గుర్తించిన వెయ్యి మంది బాలలను దత్తత తీసుకున్నారు. సహాయం అవసరం ఉన్న ఇతర కుటుంబాలను కూడా గుర్తించే ప్రయత్నం కొనసాగుతోంది.

అనాధ పిల్లల దత్తత కార్యక్రమాలలో కనిపించిన హృదయాన్ని కదిలించే దృశ్యాలు తీవ్రవాదుల మారణకాండ పట్ల, స్వయంసేవకుల పునరావాస ప్రయత్నాలపట్ల, సామాన్యప్రజలు ఏవిధంగా ప్రతిస్పందిస్తున్నారు అనటానికి ఒక స్పష్టమైన నిదర్శనంగా నిలిచాయి. 101 మంది పిల్లల దత్తత జరిగిన అబోహర్ కార్యక్రమంలో కొన్ని విశేషాలివి.

రాష్ట్రంనలుమూలల నుండి వచ్చిన విధవలైన తల్లులు, వారి పిల్లలు స్థానిక గురుద్వారాలో ఉన్నారని వార్త వ్యాపించగానే, వారిని ఓదార్చడానికి, ఉల్లాసపరచడానికి వేలాది మంది స్త్రీ పురుషులు అక్కడికి పరిగెత్తివచ్చారు. మరునాడు ఆ తల్లులు తమ పిల్లలతో సహా చెక్కులను స్వీకరించడానికి వేదిక మీదకు వచ్చినపుడు (ఆ సంవత్సరానికి ప్రతి తల్లికి 5 వేల రూపాయలు, ప్రతిబిడ్డకు 500 రూపాయలు) క్రిక్కిరిసిన ఆసభలో ప్రతి ఒక్కరు కంటతడిపెట్టారు. కార్యక్రమం జరుగుతున్నంతసేపు, తల్లీ బిడ్డలకు కొత్త బట్టల ప్రదానం జరుగుతూనే ఉంది. వాటితో వేదిక మీద పెద్ద గుట్ట ఏర్పడింది. వందలాది తల్లీబిడ్డలు, వారి బంధువులకు స్థానిక గురుద్వారా సమితి ప్రేమపూర్వకంగా భోజన, వసతి సదుపాయాలు

సమకూర్చగా, ఆ రోజు దత్తత తీసుకోబడిన ప్రతిబాలుడికి 10వేల రూపాయల ధనాన్ని, రెండు జతల బట్టలను దుర్గామందిర్ అందించింది. అతి సహజమైన రీతిలో సిక్కు కుటుంబాలు సహజధారీ హిందూ పిల్లలను, సహజధారీ కుటుంబాలు సిక్కు పిల్లలను దత్తత తీసుకున్నారు.

మిగిలిన దత్తతకేంద్రాలలో కూడ ఇలాంటి హృదయాలను కదిలించే దృశ్యాలు అనేకం కానవచ్చాయి. లూధియానాలో స్థానిక పంజ్ స్టార్ క్లబ్ దత్తత కార్యక్రమానికి అయిన మొత్తం 51వేల రూపాయల ఖర్చును భరించింది. పంచ్ కువాలో జైన్ బోర్డింగ్ వారు తమ వసతిగృహంలో యాభై మంది బాలురను ఉచితంగా తీసుకునేందుకు ముందుకు వచ్చారు. భటిండాలో సనాతన ధర్మసభ 30మందిని స్వీకరించింది. ఆపన్న కుటుంబాలలోని యువతుల వివాహానికి అయ్యే ఖర్చును భరించడానికి ధనవంతులైన కుటుంబాలు ముందుకువస్తున్నాయి.

అది నేటి పంజాబ్. తీవ్రవాదుల బెదిరింపులు, వేర్పాటువాదకుట్రల నేపథ్యంలో సైతం తరతరాల తమ రక్తసంబంధాలు, చారిత్రక అనుబంధాలను తెగతెంపులు చేసుకొనడానికి తిరస్కరిస్తూ, ఒకే సమైక్య ఆత్మీయ సోదరభావనతో నేటికి కూడా నిలిచి ఉంది.

## విదేశాలలో సైతం:

విదేశాలలో స్థిరపడిన స్వయంసేవకులు కూడా ఏమాత్రం తీసిపోలేదు. ఇందిరాగాంధీ హత్యకు శ్రద్ధాంజలి ఘటించేందుకు, సంతాప సమావేశాలు నిర్వహించేందుకు, హిందువుల ఐక్యతను చాటి చెప్పడానికి వారు చొరవ తీసుకున్నారు. లండన్ శివారులోని క్రాయడన్ వద్ద 1984 నవంబర్ 2న దక్షిణ లండన్ కౌన్సిల్ ఆధ్వర్యంలో జరిగిన సమావేశంలో అన్ని హిందూ సంస్థలు పాల్గొన్నాయి. గురుసింగ్ సభ అధ్యక్షుడు సర్దార్ హర్ భజన్ సింగ్ చట్వాల్ అధ్యక్షత వహించారు. హౌస్ ఆఫ్ కామన్స్ స్పీకర్ అయిన రైట్ ఆనరబుల్ బెర్నార్డ్ వెదరిల్ ను కార్యక్రమంలోపాల్గొనవలసిందిగా కోరినపుడు, సభలో తన పనులు ముగించుకున్న వెంటనే ఆయన పరుగుపరుగున వచ్చారు.

'మనమంతా హిందువులం' అని ప్రకటించారు సర్దార్ చట్వాల్ జీ. సిక్కులు, సిక్కేతర హిందువుల మధ్యగల తరతరాల సోదరత్వ అనుబంధాలను ఆయన నొక్కి వక్కాణించారు. ఈ విషాదకరసంఘటనవల్ల ఉద్రేకాలకు లోనుకావద్దని ఆయన ప్రత్యేకంగా కోరారు. లీసెస్టర్, బర్మిం

గ్హాం, వెంబ్లీ, ఇతర ముఖ్యనగరాలలో కూడా సమావేశాలు జరిగాయి. ప్రతిచోట ఉద్బోధ ఒక్కటే ఖలిస్తాన్ తీవ్రవాదం, వేర్పాటువాదాల ఖండన, సిక్కులు - సిక్షేతర హిందువుల సమైక్యత పునరుద్ఘాటన.

## కమ్యూనిస్టు విద్రోహుల ప్రమాదాన్ని ఎదుర్కొనడంలో:

సిద్ధాంతపరంగా అయితేనేమి, వివిధ కమ్యూనిస్టు వర్గాల వ్యవహారాల వల్ల నైతేనేమి కమ్యూనిజం మన జాతీయ సమగ్రతను, సంస్కృతిని విధ్వంసం చేసేదని ఋజువయింది. అయితే, మిగిలిన విషయాలకంటే హిందూ జాగృతి పెరుగుదలవల్లనే తమ ప్రచారానికి ఎక్కువ ప్రమాదమని కమ్యూనిస్టులు గ్రహించకపోలేదు.

## కేరళ రంగం ఒక సంకేతం:

1978లో కేరళలో సిపిఐ వారి జనయుగ్ పత్రిక ఓనం విశేష సంచికలో ఒకప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి అచ్యుతమీనన్, పార్టీ రాష్ట్ర కార్యదర్శి ఎన్. ఇ. బలరామన్‌లు, మేధావి రంగంలో కూడా సంఘం పెరిగిపోతున్నదని గగ్గోలు పెట్టారు. 'ఆర్.యస్.యస్. లాంటి దక్షిణ పక్ష తిరోగామి శక్తులు, వాటి ఆలోచనావిధానం కేరళలో ప్రతిచోట తమ తలను పైకెత్తుతున్నాయి. మనం, కమ్యూనిస్టులం బలం కోల్పోతున్నాం. మేధావులు చాలావేగంగా మననుండి దూరం అయిపోతున్నారు. ఇది అత్యంత బాధాకరమైన పరిస్థితి. మన ఉద్యమానికి ముంచుకొస్తున్న ప్రమాదాన్ని ఇది సూచిస్తున్నది' అని వారు పేర్కొన్నారు.

ఒ.ఎన్.వి కురుప్, స్వర్గీయ వాయలార్‌రామవర్మ, పి. భాస్కరన్ వంటి పేర్లను కూడా ప్రస్తావిస్తూ, కొందరు కమ్యూనిస్టుకవులు, మేధావులు తమ బృందంనుండి తప్పుకుని హిందూ శిబిరంలోకి చేరిపోయారని ఈ ఇరువురు కమ్యూనిస్టు నాయకులు వ్రాశారు. వారి కవితలు గతంలో కేరళయువతరాన్ని ఉద్రూతలూగించి, కమ్యూనిజం వైపుకు లాగాయి. నేడు ఆ కవులే భారత మాత ప్రాచీన సంస్కృతీ వైభవాన్ని గానంచేయ డానికి తమ కవిత్వశక్తిని అంకితం చేసారు. రామవర్మ అయ్యప్పస్వామికి గట్టి భక్తునిగా మారాడు. ఆయన వ్రాసిన భక్తిగీతాలు సినిమారంగంలో కూడా ఎంతో ప్రజాదరణ పొందాయి. పి. భాస్కరన్ సమర్థుడైన చలనచిత్ర రచయిత. గతంలో ఆయనవ్రాసిన సామాజిక నాటకాలు శక్తివంతమైన ప్రజాప్రచార సాధనాల ద్వారా కమ్యూనిస్టు ఆలోచనలను

బాగా ప్రచారం చేశాయి. కానీ అదే వ్యక్తి ఆ తర్వాత మళయాళంలో ఆదిశంకరాచార్య చిత్రాన్ని నిర్మించాడు. తన శక్తినంతా ధారపోసి, తన కళాత్మక సామర్థ్యాన్నంతటినీ వినియోగించి ఆ చిత్రాన్ని ఆయన నిర్మించాడు.

'తపస్య' (స్వయంసేవకులు ప్రారంభించిన ఒక వేదిక) ప్రస్తుత అధ్యక్షుడు, ఒకప్పటి కేరళ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షుడు అయిన అక్కిటం అచ్యుతన్ నంబూద్రికూడా గతంలో స్పష్టమైన మార్క్సిస్టు భావాలుగల కవి. అనేక సమాజ సంస్కరణోద్యమాలలో ఆయన ఇ.ఎమ్.ఎస్. నంబూద్రిపాద్‌తో కలిసి పనిచేశాడు. ఆయన వ్రాసిన ప్రఖ్యాత కవిత '20వ శతాబ్దపు చరిత్ర' నిజానికి కమ్యూనిస్టు సిద్ధాంతము, ఆచరణల పట్ల ఆయనకు కలిగిన అసంతృప్తిగాథే.

ఈ సందర్భంలోనే, కేరీర్ పత్రికలో భారతీయ జాతీయత యొక్క నిజమైన సారాన్ని ప్రస్ఫుటంచేస్తూ సి. అచ్యుతమీనన్ వ్రాసినవ్యాసం కమ్యూనిస్టుల గుట్టు రట్టుచేసింది. భారతదేశం విభిన్న భాషాసంస్కృతులు ఆధారంగా గల అనేక జాతుల కలయిక అన్న తమ కమ్యూనిస్టు సిద్ధాంతం శుద్ధ తప్పని ఆయన వ్రాశాడు. అనాదికాలంనుండి భారతదేశం ఒక సమైక్యజాతిగా ఉంటూ వచ్చిందని, ఆది శంకరులు దేశం నాలుగు దిక్కులలోను నాలుగు మఠాలు స్థాపించడంలోనే ఇది ప్రస్ఫుటమౌతుందని ఆయన వ్రాశాడు. చివరిలో ఈ సమైక్య జాతీయత యొక్క మూలం హిందూత్వంలో ఉన్నదని కూడా ఆయన పేర్కొన్నాడు.

సైద్ధాంతిక విరోధులను తొలగించడానికి భౌతికశక్తిని ఆశ్రయించడం కమ్యూనిస్టుల లక్షణమన్నది అందరికీ తెలిసిన విషయమే. కేరళలో కూడా చాలాకాలంగా అదే అనుభవంలోకి వస్తోంది. ఇంతకాలం మార్క్సిస్టుల దాడులకు సంఘస్వయంసేవకులు ఏవిధంగా బలిఅయ్యారన్నది ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. ఇంతకాలం మార్క్సిస్టుల హింసాకాండ భయం గుప్పిటచిక్కి అన్ని వర్గాలు గిజగిజలాడాయి. మొట్టమొదటిసారిగా స్వయంసేవకుల ధీరత్వంతో కూడిన ప్రతిఘటన కారణంగా ఆ భయం పటాపంచలు అయిందని నేడు అందరూ అంగీకరిస్తున్నారు. అవునుమరి! మజ్దూర్ సంఘ్, విద్యార్థి పరిషత్, బిజెపి వంటి సంస్థలలో పనిచేస్తున్న అనేక కార్యకర్తలు, స్వయంసేవకులు మొత్తం 60 మంది చేసిన బలిదానాలు వ్యర్థంగాపుకదా!

## ఎల్డబ్ల్యు సైన్యపు భీతావహ సవాలు స్వీకారం:

ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా ప్రాంతంలో స్వయంసేవకులు - వారిలో కొందరు విద్యార్థిపరిషత్, కిసాన్ సంఘ్‌ల క్రియాశీల కార్యకర్తలు కూడా ఉన్నారు - నక్సలైట్ల దౌర్జన్యాలను ఎదుర్కొన్న తీరు నిజంగా ప్రశంసించదగినది. నక్సలైట్ల విద్యార్థి విభాగాలయిన రాడికల్ విద్యార్థి సంఘం (RSU), ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం (PDSU) లు రెండూ చాలా కాలంగా విశ్వవిద్యాలయాల మీదనే తమదృష్టిని కేంద్రీకరించాయి. హైదరాబాద్‌లోని ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎప్పుడూ వారి ఘర్షణలకు నిలయంగా ఉండేది. వరంగల్‌లోని కాకతీయ విశ్వవిద్యాలయం నక్సలైట్ల శిక్షణ శిబిరంగా మారిపోయిందని కొంతకాలం క్రితం అప్పటి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి వాపోయారుకూడా. ఎస్.సి., ఎస్.టి. విద్యార్థులు ఉండే పౌరసంక్షేమ వసతి గృహాలు వారికి ఆయువుపట్లు. అనేక విద్యార్థివసతి గృహాలు వారి రహస్యదళ సభ్యులకు రక్షణస్థావరాలుగా ఉండేవి. సెలవుదినాలలో, గ్రామీణప్రాంతాలలో నక్సలైట్ సిద్ధాంత ప్రచారానికి విద్యార్థులను వాడుకునేవారు. విద్యార్థులనుండి పూర్తి సమయకార్యకర్తలు కూడా వచ్చేవారు.

తెలంగాణాలో అనేక ప్రాంతాలలో వారి ఇష్టారాజ్యం నడిచింది. వారి మారణాయుధాలు ఎదురుతిరిగిన వారిని అంతంచేసాయి. కాంగ్రెస్, ఆ తరువాత స్థానిక తెలుగుదేశం నాయకులు వివిధ నక్సలైట్ వర్గాలను సంతృప్తి పరచడంకోసం పోటీలుపడ్డారు. ఈ నిరంకుశ ఎల్డబ్ల్యుపాలనను వ్యతిరేకించడం మాట అటుంచి, ప్రశ్నించే సాహసం చేస్తే చాలు, కాళ్ళు చేతులు తెగేవి. ఒక్కొక్కసారి కుత్తుకలెగిరిపోయేవి. వరంగల్, కరీంనగర్ జిల్లాల్లో, అలా తమ అవయవాలను పోగొట్టుకున్న అనేకులను చూడవచ్చు. వారంతా నక్సలైట్లు తరచు చిత్రించేవిధంగా ధనవంతులుగానీ, దౌర్జన్యకారులైన భూస్వాములుగానీ కాదు. వారు చేసిన పాపమల్లా నక్సలైట్ల ఆజ్ఞలను శిరసావహించేందుకు తిరస్కరించడమే. పత్రికా రంగంకూడా మౌనంగా ఉండిపోయింది. స్థానిక విలేఖర్లు నక్సలైట్ల దౌర్జన్యాలను గురించి వార్తలు కూడా పంపలేకపోయేవారు. ఇక వారి హత్యలు, ఇతర దారుణాల గురించి చెప్పేదేముంది? పత్రికారచయితలు తీవ్ర పరిణామాలు ఎదుర్కోవలసిఉంటుందని ఏవిధంగా బెదిరింపులకు గురి అయ్యారో, వార్తలు రాయకుండా నిరోధించబడ్డారో తెలియజేసే కొన్ని సంఘటనలను ఉదయం దినపత్రిక ప్రధానవిలేఖరి ఒకసారి వివరించాడు.

ఎఱ్ఱసేనల భీతావహం ఒక ప్రక్క పెరుగుతూ ఉంటే, పత్రికాధిపతులు తమ స్వీయరక్షణ చూసుకోసాగారు.

పిడియస్‌యు, ఆర్‌యస్‌యులు విద్యార్థి సంఘాల ఎన్నికలలో ఎటువంటి వ్యతిరేకత లేకుండా విజయం సాధించడంలో నక్సలైట్ల రహస్య దళాలు ప్రధాన పాత్ర వహించాయి. ఈ విజయాలతో ప్రభావితులైన గ్రామీణ ప్రాంతాల విద్యార్థులు, తమ అమాయక గ్రామీణ ప్రజానీకానికి నక్సలైట్ల బలాన్ని, ప్రజాదరణను గురించి చెబుతూ ఉండేవారు. నక్సలైట్ల నాయకులు తమ చట్టవ్యతిరేక కార్యకలాపాలకు వసతిగృహాలను వాడుకోవడాన్ని ఏ విద్యార్థి అయినా వ్యతిరేకిస్తే అతడిని చితకకొట్టేవారు. వెన్నెముకలేని అధికారులు సైతం వారి బెదిరింపులకు తలవంచారు. విద్యార్థి సంఘాలు తమ విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించమని నక్సలైట్ మేధావులను ఆహ్వానించేవి. విద్యా కేంద్రాల గోడలపై మావో, లెనిన్ చిత్రాలు చిత్రించేవారు. ఆగస్ట్ 15, జనవరి 26ల సందర్భంలో భారతీయ త్రివర్ణ పతాకాన్ని దించివేసి దగ్ధంచేసేవారు. ఎఱ్ఱజెండాలు ఎగురవేసేవారు.

ఇటువంటి భీతావహ పరిస్థితులలో విద్యార్థి పరిషత్ ఈ సవాలును స్వీకరించడానికి ముందుకు వచ్చింది. జాతీయ భావనను, సాంస్కృతిక విలువలను జాగృతం చేయడం, స్వామి వివేకానందులవంటి మహానుభావులైన జాతినిర్మాతల జీవనాదర్శాలను ప్రేరణగా స్వీకరించడం, విద్యార్థి పరిషత్ సాగించిన సైద్ధాంతిక పోరాటంలో ప్రధానాంశాలు అయ్యాయి. ఊహించినట్లుగానే, విద్యార్థి పరిషత్ కార్యకర్తలపై దాడులు, కత్తిపోట్లు, సాధారణ విషయాలయ్యాయి. కానీ కార్యకర్తల త్యాగనిరతి, దీక్షలు చూసి త్వరలోనే అధిక సంఖ్యాకులైన తటస్థ విద్యార్థులు వారి వైపు ఆకర్షితులయ్యారు. విద్యార్థి పరిషత్‌కు ప్రజాదరణ పెరగడంతో, విద్యార్థి సంఘాల ఎన్నికలలో నక్సల్స్‌ను ఎదిరించాలని వారు నిర్ణయించారు. ఎఱ్ఱజెండాలు, ఎఱ్ఱ నినాదాల స్థానాన్ని కాషాయపతాకాలు ఆక్రమించాయి. భారతమాతాకీ జయ్, లాల్‌గులామీ ఛోడ్‌కర్ బోలో వందేమాతరం (ఎఱ్ఱ దాస్యం విడిచిపెట్టి వందేమాతరం అంటూ గర్జించు) మొదలైన నినాదాలు మార్మోగసాగాయి. విద్యార్థి పరిషత్ కార్యకర్తలు ఎన్నికలలో విజయం సాధించడంచూసి ప్రజలు ఆశ్చర్యపోయారు. స్వామీ వివేకానందుల సందేశంపై సెమినార్లు, భారతీయ జీవన విలువలపైన మేధావుల ఉపన్యాసాలు ఈ విద్యార్థి సంఘాలు ఏర్పాటు చేసే కార్యక్రమాలయ్యాయి.

## బలిదానాల అమరగాథ :

1981 జనవరి 26న వరంగల్ లోని కాకతీయ విశ్వవిద్యాలయం ఆవరణలో జరిగిన సంఘటన ఆణిముత్యంలాంటిది. ఆరోజు నక్సలైట్లు భారత త్రివర్ణ పతాకాన్ని దించివేయడానికి ప్రయత్నించినపుడు సామాజగన్మోహన్ రెడ్డి నాయకత్వంలో విద్యార్థి పరిషత్ కార్యకర్తలు సమర్థవంతంగా దానిని అడ్డుకున్నారు. నక్సల్స్‌పై పోలీసులు నమోదు చేసిన కేసులో ప్రధాన సాక్షిగా నిలబడడానికి కూడా రెడ్డి స్వచ్ఛందంగా ముందుకు వచ్చాడు. ఇది అంతకుముందెన్నడూ జరగని విషయం. ప్రమాదకర పరిణామాలు అతడికోసం కాచుకుని ఉన్నాయని కోర్టు ఆవరణలోనే నక్సల్స్ అతడిని బెదిరించారు. తన జీవితంకంటే సత్యాన్ని పరిరక్షించడానికి, జాతీయ పతాక గౌరవాన్ని కాపాడడానికే ఎక్కువ ప్రాధాన్యతనిస్తానని అతడు బదులిచ్చాడు. ఆ మాటలు అక్షరాలా నిజం చేస్తూ అదేరోజు కొద్దిగంటలలోనే నక్సలైట్ల దాడికి గురై అతడు అమరుడయ్యాడు. విద్యార్థి సంఘాలకు ఎన్నికలు జరిగినపుడు అతడి బలిదానం ప్రభావం స్పష్టంగా తెలియవచ్చింది. పిడిఎస్‌యు, ఆర్ఎస్‌యు తప్ప మరెవరూ పోటీ చేయడానికి వీలులేదని నక్సలైట్లు ప్రకటించారు. అయితే అప్పటికే విద్యార్థి పరిషత్ రంగంలో ఉంది. ఎన్నికలు ఆర్.ఎస్.యు, విద్యార్థి పరిషత్‌ల మధ్య యుద్ధరంగంలా మారాయి. ఆ ఘర్షణలలో నక్సలైట్లు బాగా దెబ్బలు తిని, ప్రాణభీతితో పలాయనం చిత్తగించారని వార్తాపత్రికలు వ్రాసాయి.

ఈ వార్తలు వ్యాపించగానే తెలంగాణా గ్రామీణులు నిర్ఘాంతపోయారు. ఎట్టి దొరలను తరిమికొట్టగల, చితక్కొట్టగల ఈ కాషాయ యువకులెవరు? అని వారు ఆశ్చర్యపడ్డారు. పోలీసులు, వివిధ రాజకీయ పార్టీలు కూడా సంభ్రమం చెందారు. స్వాతంత్ర్యానంతరం తెలంగాణా రాజకీయాలలో కొంతకాలంపాటు ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన సిపిఐ, సిపిఐ (ఎమ్) లు కూడా నక్సలైట్లధాటికి బలహీనపడిన రోజులవి. వారి విద్యార్థి సంఘాలు కళాశాలల ఆవరణలలోనికి అడుగుపెట్టడం, ఆఖరికి వాల్ పోస్టర్లు అతికించడం కూడా మానివేసి చాలాకాలం అయింది. అలాంటి నక్సలైట్ల కంచుకోటలో విద్యార్థి పరిషత్ దృఢంగా నిలబడి, తన ఆధిక్యతను ప్రస్థాపించుకుంది.

తమ సొంత బలంతో విద్యార్థి పరిషత్ కార్యకర్తలను ఎదుర్కోలేక నక్సలైట్లు, 'హిందూప్రమాదాన్ని' అంతం చేసేందుకు పిడిఎస్‌యు, ఆర్

ఎస్‌యులలో చేరవలసిందిగా ముస్లిం విద్యార్థులను ప్రోత్సహించసాగారు. 1983 ఆగస్ట్‌లో తమకు బలమైన స్థావరమైన కరీంనగర్ జిల్లాలో జగిత్యాలలో విద్యార్థి పరిషత్ కార్యాలయంపై వారు హఠాత్తుగా దాడిచేశారు. ఒక గంటసేపు అడ్డుఅదుపులేకుండా పోరాటం జరిగింది. కేవలం 16 మంది విద్యార్థి పరిషత్ కార్యకర్తలు ఒక ప్రక్క, 200 మంది ఆక్రమణదారులు ఒక ప్రక్క... చివరికి ఒక ముస్లిం నక్సలైట్ అక్కడికక్కడే మరణించగా, మిగిలినవారు చెల్లాచెదురుగా పారిపోయారు.

ఈ రోమాంచక సంఘర్షణ వార్త వ్యాపించగానే, చుట్టుప్రక్కల గ్రామీణ ప్రాంతాలలో సైతం నక్సలైట్ల తుపాకి గొట్టం భయం తొలగిపోయింది. భారతీయ కిసాన్ సంఘ్ ఆధ్వర్యంలో దేశభక్త నాయకత్వంగా రూపొందడానికి గ్రామీణ యువకులు ఉత్సాహంగా ముందుకు రాసాగారు. తాము పేదలు, బడుగు వర్గాల శ్రేయోభిలాషులమని నక్సల్స్ చేస్తున్న బూటక ప్రచారాలను కిసాన్ సంఘ్ కార్యకర్తలు చీల్చిచెండాడారు. నక్సలైట్ల చర్యలను వారు బట్టబయలు చేశారు. సామాన్య రైతులను, సమాజసేవకులను వారు ఎలా హతమారుస్తున్నారో తెలియజెప్పారు. అలాంటి అనేక హత్యలు, అత్యాచారాలకు సంబంధించిన చక్కని వివరాలు, ఆధారపత్రాలతో విద్యార్థి పరిషత్ చిన్న పుస్తకాన్ని ముద్రించింది. ఈ ఉద్యమంలో అగ్రభాగాన నిలచిన జగిత్యాలకు చెందిన గోపాలరెడ్డి, రామచంద్రరావులు హత్యగావింపబడ్డారు. సంఘ ప్రాంత కార్యవాహ కుమారుడైన జితేంద్రరెడ్డి నక్సల్స్ ఆగడాలను సమర్థవంతంగా ఎదుర్కొంటూ వచ్చిన కారణాన వారి తూటాలకు బలైపోయాడు.

## ఆశాకిరణం:

వీరత్వం, బలిదానాల ఆ జ్వలంత ఉదాహరణలు గ్రామీణయువకులలో ఆత్మవిశ్వాసాన్ని ప్రతిఘటన మనస్తత్వాన్ని ప్రేరేపించాయి. డబ్బుకోసం రైతులను పీడించే నక్సలైట్ల చర్యలను గ్రామస్తులు మొట్ట మొదటిసారిగా ప్రతిఘటించడం మొదలుపెట్టారు. కరీంనగర్‌జిల్లా నంచెర్ల గ్రామంలో జరిగిన అలాంటి ఒక సంఘటనలో నక్సలైట్ల ప్రముఖ నాయకుడు శంకర్‌ను గ్రామస్తులు నరికి చంపారు.

అయితే, శాంతి భద్రతలను పరిరక్షించవలసిన అధికారుల చిత్త శుద్ధి రాహిత్యాన్ని ఆసరా చేసుకుని, స్వార్థ రాజకీయ నాయకుల నడ్డంపెట్టుకుని నక్సలైట్లు విద్యార్థి పరిషత్ కార్యకర్తలపై దాడులు కొనసాగించారు.

అయినప్పటికీ విద్యార్థిపరిషత్ ఆత్మవిశ్వాసం అదేస్థాయిలో పెరిగింది. గ్రామస్తులు సైతం తమ గోడలపై ఎబివిపి జింబాబాద్, భారత్ మాతాకీ జై వంటి నినాదాలు వ్రాసుకోవడం ప్రారంభించారు. తమ నాయకులు హత్య చేయబడినపుడు లేదా గాయపరచబడినపుడు సైతం సిపిఐ (ఎమ్), సిపిఐలు పోరాటం సాగించలేక, గ్రామస్తులను సమీకరించలేకపోయిన ఒకానొక సమయంలో విద్యార్థి పరిషత్ నాయకత్వంలో నక్సలైట్లను కఠినంగా అణచివేయాలని కోరుతూ రాష్ట్ర రాజధానికి వేలాది మంది తెలంగాణా గ్రామస్తులు తరలివచ్చారు. 1984 డిసెంబర్ 18న జరిగిన ఆ బ్రహ్మాండమైన ప్రదర్శన ఒక పెద్ద మలుపు అయింది. ఆ తరువాత నక్సలైట్ల ఆగడాల గురించి విధాన నిర్ణేతలు సరికొత్త దృష్టితో చూడసాగారు.

అనేకమంది స్వయంసేవకులు, ప్రధానంగా విద్యార్థి పరిషత్ కార్యకర్తలు ఈ పోరాటంలో అసువులు బాసారు. అయితే వారి త్యాగాలు వృధాపోలేదు. హైదరాబాద్‌లోని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వివిధ విభాగాల విద్యార్థి సంఘాలు, వసతి గృహాల సంఘాలు విద్యార్థి పరిషత్ ఛత్రఛాయలలోకి వచ్చాయి. దేశవ్యతిరేక రాతలు, నినాదాల నుండి కళాశాలలు విముక్తం అయ్యాయి. వసతి గృహాలు జాతివ్యతిరేక శక్తుల రహస్య స్థావరాలుగాను, వారి చట్టవ్యతిరేక కుతంత్రాలకు కేంద్రాలుగాను పనిచేసే స్థితి తొలగిపోయింది. విద్యాలయాలలో చదువు నిరాటంకంగా కొనసాగింది. తమ రహస్య స్థావరాలను, గ్రామాలలో అలవాటుగా వస్తున్న సురక్షానిలయాలను కోల్పోయిన నక్సలైట్లకు దట్టమైన అడవులలో తలదాచుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. అక్కడినుంచే వారు అప్పుడప్పుడు ఒక బస్సునో, రైల్వే స్టేషన్‌నో తగులబెట్టడానికో లేదా పోలీసు, ప్రభుత్వ అధికారులను అపహరించడానికో, హత్య చేయడానికో బైటికి వస్తూంటారు. అయితే, ఇంతకాలంగా విద్యార్థులు, గ్రామీణ యువకులపై నక్సలైట్లు సాగించిన ఎదురులేని ఆధిపత్యం ఇప్పుడు చాలావరకు తగ్గిపోయిందని ప్రజలకు తెలుసు. ఈ ఆహ్లాదకరమైన మార్పుకు కారణమైన యువకులెవరన్నది కూడా ప్రజలకు బాగా తెలుసు.

# సామాజిక సమానత, సమరసతలకై తపన

విదేశీ ప్రేరిత, వేర్పాటువాద, సిద్ధాంతాల వల్ల నిర్మాణమౌతున్న విభజనకారీ శక్తులకు, శక్తివంతమైన విరుగుడుగా సంఘం ద్వారా నిర్మితమైన సమైక్య హిందూత్వ పిలుపు ఏవిధంగా పనిచేస్తున్నదో మనం గమనించాం. కులతత్వం, అంటరానితనం, వర్గతత్వాల వల్ల జనిస్తున్న సామాజిక అసమానతలు, సంఘర్షణలనుండి బైటపడడంలో కూడ ఈ పిలుపు ఎంతో సమర్ధవంతంగా పనిచేయగలదని కూడా నిరూపితమైంది. అనేక సందర్భాలలో, ముఖ్యంగా దైవభక్తి కార్యక్రమాల సందర్భాలలో స్వయంసేవకులు ఈ ప్రేరణ జాగృతం చేయడానికి, హిందూ సమైక్యతా స్వప్నానికి సాకార రూపం కల్పించడానికి కృషి చేస్తూనే ఉంటారు.

## ప్రసార కేంద్రాలు:

1970 ప్రాంతాలలో మహారాష్ట్రలోని విదర్భ ప్రాంతంలో 'గడే గాంవ్' అనే చిన్నగ్రామంలో ఒకసారి 'భాగవత' సప్తాహం జరిగింది. అనంతరం అన్నదానం జరుగవలసి వుంది. స్థానిక స్వయంసేవకులకు దాని బాధ్యత అప్పజెప్పారు. ఎటువంటి కుల తారతమ్యాలు లేకుండా అందరికీ ఒకే పంక్తిలో వడ్డించడానికివారు ఏర్పాట్లు చేశారు. ఈ అనూహ్యసంఘటన సంప్రదాయవర్గాలలో కలవరం కలిగించింది. కానీ స్వయంసేవకుల మృదువైన నచ్చచెప్పే తీరు, పట్టుదలలు తమప్రభావం చూపించాయి.

ఈ సమానత, సోదరభావాల ప్రదర్శనవల్ల త్వరలోనే హరిజనులు మిగిలిన సమాజంతో సన్నిహితం అయ్యారు. విజయదశమి సమయంలో దేవాలయాలలో పూజలు చేసుకునేందుకు హరిజనులకు అవకాశం కల్పించడం వంటివి కూడా ఒకదాని తరువాత ఒకటి జరిగిపోయాయి. ఆ

విధంగా పరిపుష్టమైన సామాజిక సామరస్యం, ఆ తరువాత ఆటస్థలాన్ని చదునుచేయడం, పాఠశాల బావి పూడికతీయడం, పాఠశాలకు ప్రహరీ నిర్మించడం, గ్రామ వీధులను బాగుచేయడం లాంటి గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో అన్ని వర్గాల ప్రజలు పాల్గొనడానికి మార్గం సుగమంచేసింది.

విదర్భ ప్రాంతంలోని అకోలా జిల్లాలో 5వేల జనాభా కంటే తక్కువవుండే భంబేరీ గ్రామంలో కూడా ఇలాంటి అనుభవమే జరిగింది. కొద్ది సంవత్సరాలక్రితం వరకు, అంబేద్కర్ జయంతి రోజున స్థానిక హరిజనవాసులు ఊరేగింపు తీసిన ప్రతిసారీ, ఇతర కులాల ప్రజలు వారిపై నీచమైన నిందలకు పాల్పడేవారు. ఒక్కొక్కసారి అవి ఘర్షణలకు కూడా దారి తీసేవి. ఆ తదుపరి, పోలీసులు ఆ ఊరేగింపుపై నిషేధం విధించారు. అయితే జిల్లా సంఘచాలక్ ఆ నిషేధాన్ని తొలగించవలసిందని పోలీసులను ఒత్తిడి చేశారు. మరుసటి సంవత్సరం స్వయంసేవకులను, ఇతర హిందువులను వెంటతీసుకుని ఆయనకూడా ఊరేగింపులో పాల్గొన్నారు. నెమ్మదిగా హిందూ సమైక్యతా భావన నిర్మాణం అయింది. హరిజనేతర హిందువులుకూడా అంబేద్కర్ జయంతి ఉత్సవాలలో పాల్గొని ఉపన్యాసాలు ఇవ్వడం ప్రారంభించారు. శ్రీరామనవమి, గీతాజయంతి ఇప్పుడు హరిజనులతో సహా హిందువులందరూ సమధికోత్సాహంతో పాల్గొనే సామూహిక పండుగలయ్యాయి. ఆ విధంగా నిర్మాణమైన సామాజిక సామరస్యం కారణంగా మొత్తం గ్రామ జీవనంలోనే మంచి స్థాయిలో గుణాత్మక వృద్ధి సాధ్యపడింది.

ఆ సంఘచాలక్ ప్రస్తుతం గ్రామ సర్పంచ్‌గా ఉన్నారు. గ్రామానికి అవసరమైన కనీస పౌర అవసరాలను సమకూర్చడానికి అనేక చర్యలు తీసుకున్నారు. త్రాగేనీటి సరఫరా ఇప్పుడు నియమితంగా తగినంతగా జరుగుతోంది. గ్రామస్తులకు అవసరమైన సర్టిఫికెట్లను ఇవ్వడం మొదలైన చిన్న చిన్న పనులకు సైతం డబ్బుతీసుకునే తనముందువారి అలవాటును సంఘచాలక్ రద్దుచేశారు. గ్రామాభ్యుదయానికి సంబంధించిన వివిధ పనుల నిమిత్తం బైటకు వెళ్ళవలసివచ్చినపుడు ప్రయాణానికి అయ్యే ఖర్చులు వగైరాలన్నింటికీ తన స్వంత ధనాన్నే ఖర్చు చేస్తూ ఉంటారు. ఫలితంగా పంచాయితీ స్థాయిలో అవినీతి చాలావరకు తగ్గింది. త్రాగుడు, పంటలదోపిడి లాంటి దురాచారాలు కూడా చెప్పుకోదగ్గంతగా తగ్గిపోయాయి. సంఘచాలక్, స్వయంసేవకులు గ్రామస్తులతో సన్నిహిత వ్యక్తిగత సంబంధాలను కొనసాగిస్తూ, వారికి నచ్చచెప్పడంద్వారానే వీటన్నింటిని సాధించారు.

అంతకుముందు, పాఠశాల ప్రధానోపాధ్యాయునిగా పనిచేసిన సమయంలో కూడా ఆ సంఘచాలక్ అనేకమంది పేదవిద్యార్థులకు తన స్వంత ఇంటిలో ఆశ్రయం ఇచ్చి, భోజనం పెట్టేవారు. వారిలో హరిజన విద్యార్థులు కూడా ఉండేవారు. పదవీ విరమణ తరువాత ఆయన భంబేరీలో స్థిరపడ్డారు. అది ఆగ్రామం మొత్తానికి ఒక మహావర ప్రసాదం అయింది.

తమిళనాడులోని ఉత్తర ఆర్కాట్ జిల్లా మడప్పల్లి గ్రామ సాయంశాఖలో స్వయంసేవకులకు ఒక వినూత్నమైన అనుభవం ఎదురైంది. సంఘవార్షికోత్సవానికి స్థానిక ద్రవిడ కజగం నాయకుడిని ఆహ్వానించారు. ఆయన ఆ ఆహ్వానాన్ని మన్నించి, ఉత్సవానికి రావడం అందరికీ ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించింది. ఉత్సవం పూర్తికాగానే, ఆయన వెళ్ళి, మిఠాయిలు తీసుకువచ్చి అందరికీ పంచిపెడుతుంటే వారు మరింత ఆశ్చర్యానికి లోనయ్యారు. అప్పుడాయన వివరించారు. 'నిజానికి కొద్దిరోజులక్రితం మిమ్మల్ని వ్యతిరేకించడానికి, మీ కార్యక్రమాలను ఆపుజేయించడానికి నేను ఇక్కడికి వచ్చాను. ఎందుకంటే మాగ్రామంలో కూడా సంఘాన్ని ప్రారంభించినందుకు మా డి.కె. కార్యకర్తలందరూ మనస్తాపం చెందిఉన్నారు. కానీ అగ్రహారానికి (బ్రాహ్మణవాడ) చెందినబాలురు, హరిజన వాడలకు చెందిన బాలురు స్వేచ్ఛగా కలిసిమెలిసి ఆనందోత్సాహాలతో ఆడుకోవడం, ఒకే కుటుంబంలోని సంతానంలా వ్యవహరించడం చూసి నేను పూర్తిగా ప్రభావితుడనయ్యాను. మా సంస్థాపకులు పెరియార్ (ఇ.వి. రామస్వామి నాయకర్) కూడా ఇలాంటి కులాలులేని సమాజాన్ని గురించే కలలు కన్నారు కదా! అని నాకనిపించింది. మేం డి.కె ద్వారా దానిని సాధించలేకపోయాం. వారు కన్న కలలు నిజం చేయడంలో నిజానికి మీరు ఎట్టి ఆర్భాటం లేకుండానే విజయం సాధిస్తున్నారు. అందుకు మీకు నా శుభాకాంక్షలు. ఈ మిఠాయి కూడా అందుకే".

## సంస్కరణ సారథులుగా మారిన సంప్రదాయ వాదులు:

దేశమంతటా వ్యాపించిన వేలాది శాఖల వల్ల నిర్మాణమైన ఈ అతి శక్తివంతమైన సామాజిక సమైక్యత, సమరసతల మహోద్యమం కొత్త పుంతలు త్రొక్కడం చాలా స్వాభావికమైన విషయం. 1969లో ఉడిపిలో జరిగిన విశ్వహిందూ పరిషత్ కర్నాటక ప్రాంత సమ్మేళనం ఈ దిశలో ఒక చారిత్రాత్మక క్షణం అయింది. హిందూ ధర్మంలోని అన్ని పంథాలకు చెందిన 15వేలమంది ప్రతినిధులు, ధర్మాచార్యులు

పాల్గొన్న ఈ సమ్మేళనం, అంటరానితనాన్ని నిర్మూలించవలసిందిగా హైందవ జగత్తుకు పిలుపు నిచ్చింది. జగద్గురువులు, సాధుసంతులు ఇలా ఆదేశించారు.

"యావత్తు హిందూ సమాజం అభేద్యమైన ఏకాత్మభావనతో సమైక్యం కావాలి. అంటరానితనం లాంటి అంధ విశ్వాసాలు, ధోరణుల కారణంగా అది ముక్కలు చెక్కలు కారాదు. ఈ లక్ష్యాన్ని సాధించే కృషిలో ప్రపంచంలోని హిందువులందరూ తమ పరస్పర సంబంధాలలో ఏకత, సమానతా భావనలు ప్రదర్శించాలి."

ఈ సమ్మేళనంలోనే ప్రఖ్యాతమైన మంత్రవాక్యం "హిందవ:సోద రాఃసర్వే' (హిందువులందరూ సోదరులే) ఆవిర్భవించింది.

అప్పటివరకు అనేకమంది మన ప్రముఖ సామాజిక, ధార్మిక సంస్కర్తలు ఈ అంటరానితనం అనే దోషాన్ని నిర్మూలించడానికి ఎంతో కృషి చేశారు. కానీ ప్రజల మనస్సులలో మాత్రం అది మన ధర్మంలోనే ఒక అంతర్భాగం అనే పొరపాటు అభిప్రాయం నాటుకుని ఉంది. ఇప్పుడు సనాతనవాదులైన ధర్మగురువులు, పీఠాధిపతులు సైతం తమంతటతామే బైటకు వచ్చి ధర్మసామ్రాజ్యంలో అంటరానితనానికి స్థానం లేదని బహిరంగంగా, సుస్పష్టంగా ప్రకటించారు. ధర్మం పేరుమీద ఇంతకాలంగా చెలామణీ అవుతూ వచ్చిన ఈ అత్యంత ప్రమాదకారి అయిన వికృత విశ్వాసం మీద నిజమైన ధార్మిక భావన ఘనవిజయం సాధించిన క్షణమిది.

ఈ అద్భుతమైన పరివర్తన వెనుక ధర్మాచార్యులను సమీకృతులను చేయడానికి సంఘం, దాని అనుబంధ సంస్థలలో ఉన్న స్వయంసేవకులు సాగించిన నిశ్శబ్ద, నిరంతర కృషి ఉంది. వీటన్నింటికంటే కూడా ప్రధానమైనది శ్రీ గురూజీ సాగించిన కృషి. సాధారణ హిందూ ప్రజానీకానికి సరియైన దిశాదర్శనాన్ని చేయవలసిన అత్యవసర కార్యాన్ని వారు ధర్మాచార్యులకు నచ్చజెప్పారు. ధర్మాచార్యులు కూడా వారి ప్రయత్నాలకు ఆశీస్సులనందించారు. పైన పేర్కొన్న ఆదేశానికి తమ ఆమోద ముద్ర వేశారు. ఉడిపిలో అశేష ప్రజానీకం యొక్క మిన్నుముట్టే కరతాళ ధ్వనుల మధ్య ఈ తీర్మానం ప్రవేశపెట్టబడినపుడు శ్రీ గురూజీ ఆనందంతో, ఉద్వేగంతో 'ఇది ఎంతో మహత్వపూర్ణమైనది' అన్నారు. వేదికపైన ఆసీనులై ఉన్న ధర్మాచార్యులకు ఘనంగా అభినందనలను తెలియజేయవలసిందని వారు స్వయంగా ప్రజలకు పిలుపునిచ్చారు.

ఉడిపి పెజావర్ మఠానికి చెందిన శ్రీ విశ్వేశ్వర తీర్థస్వామీజీ ఈ తీర్మానాన్ని అమలులో పెట్టడంలో అగ్రతాంబూలం స్వీకరించారు. బెంగుళూరులోని జబ్బార్ బ్లాక్ అనే వెనుకబడిన బస్తీలో వారు పాదయాత్ర సాగించారు. సంప్రదాయ మఠాల చరిత్రలో అనూహ్యమైన ఈ చర్యకు కొన్ని వర్గాలనుండి విమర్శల వెల్లువ వెల్లువెత్తింది. అయితే నెమ్మదిగా వారందరూ కూడా పరిస్థితులను అవగాహన చేసుకున్నారు. హిందూ సమైక్యతా రావానికి ప్రతిస్పందించసాగారు. ఆ తరువాత అనేకమంది ఇతర మఠాధిపతులు కూడా అదే విధమైన పాదయాత్రలు ప్రారంభించారు. హిందూ జాగరణ కార్యానికి ఒక కొత్త ఊపు వచ్చింది.

1981 సెప్టెంబర్‌లో కర్ణాటకలోని కొందరు అగ్రశ్రేణి మఠాధిపతులు మరొక విప్లవాత్మకమైన చర్యకు శ్రీకారం చుట్టారు. అప్పటివరకు తమ స్వంత అనుయాయులకు మాత్రమే పరిమితం చేసిన 'మంత్ర దీక్షా ప్రదాన' అవకాశాన్ని హరిజనులతో సహా హిందువులందరికీ కల్పించాలని వారు నిర్ణయించారు. తమ మఠాలద్వారాలు అందరికీ తెరిచే ఉంటాయని వారు ప్రకటించారు. పూజ, తీర్థ ప్రసాదాల వంటి విషయాలలో అందరికీ సమాన హక్కులను కల్పించారు. ఇప్పటివరకు తమతమ వర్గాలకు మాత్రమే అధిపతులుగా పరిగణింప బడుతూ వచ్చిన అనేకమంది మఠాధిపతులు, నెమ్మదిగా హిందూ మఠాధిపతులుగా రూపొందుతున్నారు. ఇంకా అనేకమంది మఠాధిపతులు, సన్యాసులు కూడా ఈ తీర్మానాలను ఆచరణలో పెట్టే చర్యలను ప్రారంభం చేశారు. ఈ సాధుసంతులు హరిజన బస్తీలలో పర్యటించి వారితో కలిసిమెలిసి తిరగడం, వారి గృహాలను సందర్శించడం, వారి దేవాలయాలలో పూజలు సాగించడం వంటి చర్యలద్వారా ఆ సోదరుల జీవితాలలో ఒక నూతనమైన, స్వచ్ఛమైన సౌరభాన్ని వెదజల్లుతున్నారు.

'ఈ ఉపేక్షితసోదరులతో కలిసిమెలిసి ఉండడం ఒక వరప్రసాదం లాంటి అనుభవం' అంటారు ఈ సాధుసంతులు. 'వారిలో ఉన్న హృదయ నైర్మల్యాన్ని, భక్తి పారవశ్యాన్ని మరెక్కడా మేం చూడలేదు.' అంటారు వారు. అడమార్ మఠస్వామీజీ అయితే 'ఆ సమయంలో నేనే పవిత్రతను పొందినట్లు భావిస్తాంటాను. ధనవంతుల బస్తీలలో ఉండే ఆడంబరాలు, బాహ్యమైన భక్తి ప్రదర్శన నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తూంటాయి. ఆ సందర్భాలలో అంటే మాలిన్యం ఈ ఉపేక్షిత సోదరులను ఒక్కసారి సందర్శించగానే ప్రక్షాళితం అవుతుంది' అని కూడా అన్నారు.

## వేదాలు అందరివీ:

ఉపేక్షిత సోదరులకు, హిందూ ధర్మప్రచారకులకు మధ్య సంబంధాలు వృద్ధి చెందుతున్న కొద్దీ సమాజంలో పరివర్తనకు సంబంధించిన అనేక నూతన దృశ్యాలు సాక్షాత్కరించసాగాయి. మైసూర్‌లోని అశోకపురం అనే హరిజన బస్తీలో పదిరోజుల సంస్కృత సంభాషణ శిబిరం జరిగింది. ముగింపు సందర్భాన అక్కడ విద్యార్థిగా ఉన్న ఒక రైల్వే అధికారి తమ అనుయాయులందరి మనస్సులలో ఉన్న కోరికను బైట పెట్టారు. అక్కడ శిబిరాన్ని నిర్వహించిన సేవావ్రతినుద్దేశించి 'దేవవాణి సంస్కృతాన్ని మీరు మాకు అందించారు. అయితే ఇది సంస్కృతం వరకే ఆగిపోరాదు. మన ధర్మసంస్కృతుల ఉద్గమస్థానాలైన వేదాల వద్దకు మమ్మల్ని తీసుకుని వెళ్ళండి. మిగిలిన హిందువులు వాటికి ఎంత వారసులో మేము కూడా అంత కాదా? పవిత్ర వేదమాతతో సత్సంగం నెరపే అవకాశాన్ని మీరు మాకు కల్పించగలరా?' అని వారు అభ్యర్థించారు.

దక్షిణ కన్నడ జిల్లా నారికొంబు గ్రామంలోను, శృంగేరీ సమీపంలోని హరిహరపుర గ్రామంలోను (రెండూ కర్ణాటకలోనివే) జరిగిన వార్షిక నెలరోజుల వేద శిక్షణ శిబిరం ఈ ధార్మిక, సామాజిక తృష్ణను తీర్చడంలో సాగిన ఒక వినూత్న ప్రయోగం. రెండు శిబిరాలలోను ఒక్కొక్క చోట అనేకమంది హరిజనులతోబాటు అన్నికులాలు, వర్గాలకు చెందిన వందమంది బాలురు ఈ వేద శిక్షణలో పాల్గొన్నారు. వారి నేర్చుకోవాలనే తపనకు, గ్రహణశక్తికి కులం అసలు ప్రమాణమే కాలేదు. నిజానికి ఆశిబిరంలో తయారైన కొందరు ఉత్తమ వేదమంత్రోచ్చారకులు వెనుకబడిన వర్గాలకు చెందినవారే. కేవలం ఒక ప్రత్యేక కులంలో జన్మించినంత మాత్రానే మంచి ఉచ్చారణ, మంచి జ్ఞాపకశక్తి, సుస్వరగానం అలవడుతాయన్న వాదం కేవలం మిథ్య అని తేలిపోయింది.

సంస్కృతం, వేదాలు, ఇతర ధార్మిక సాహిత్యం బ్రాహ్మణుల ప్రత్యేక సంపత్తి అనే ప్రాచీన విశ్వాసం తొలగిపోతున్నదంటే ఆశ్చర్యంలేదు. దానిస్థానంలో కుల, వర్గాలకతీతంగా ఆ సంపద మొత్తం హిందూ సమాజంయొక్క సమాన వారసత్వసంపద అనే భావం బలపడుతోంది.

## ఉపేక్షిత సోదరులకు శిక్షణ:

ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్న హరిజనసోదరుల సమగ్ర ఉద్ధరణకై జరుగుతున్న ప్రయత్నాలకు కొత్త వేగాన్ని కల్పించే

దృష్టితో 1982వ సంవత్సరంలో విశ్వహిందూ పరిషత్ తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు సక్రియసహాయ సహకారాలతో ఒక కార్యక్ర మాన్ని రూపొందించింది. టి.టి.డి. వారు ఏర్పాటుచేసిన వసతిలో ఉపేక్షిత వర్గాలకు చెందిన వారు, కొందరు వనవాసులు కలిపి మొత్తం 120 మందికి రెండు వారాలపాటు శిక్షణ కార్యక్రమం జరిగింది. ఆ శిక్షణలో పాల్గొన్న వారిలో మాలదాసరులుగా పిలువబడుతూ ఉండే అనేకమంది అప్పటికే గ్రామాలలో ధార్మిక, తత్సంబంధ సేవలను ప్రాథమిక స్థాయిలో అందిస్తూనే ఉన్నారు. ఈ కార్యక్రమంలో వారికి పూజ, నామకరణం, పరావర్తనం తదితరక్రతువులలో శిక్షణ నిచ్చారు. నృత్యభజనలు, (కోలాటం, చెక్కభజన వగైరా) తదితర భక్తిసంబంధ కార్యక్రమాలలో కూడా శిక్షార్థులకు విశేష శిక్షణనిచ్చారు. ఉపన్యాసాలు, కథలు, హిందూత్వం, హిందూ సమాజ సంఘటన మొదలైన అంశాలపై చర్చలు, ఉపేక్షిత వర్గాలకు చెందిన సాధుసంతులు, మహావీరుల జీవితాలలోని ఘట్టాలు, అంటరానితనం నిర్మూలించడానికి ఇంతవరకు అనేకమంది ప్రముఖ సమాజసంస్కర్తలు సాగించిన కృషి మొదలైన అనేక అంశాలలో అక్కడ ఇచ్చిన శిక్షణ శిక్షార్థులకు అత్యావ శ్యకమైన బౌద్ధిక, భావాత్మక దృఢత్వాన్ని నిర్మాణంచేయడంలో ఎంతో సహాయపడింది. మొత్తంమీద ఈ శిక్షణ ప్రధాన ఉద్దేశం ఉపేక్షిత వర్గాల ప్రజలకు, మిగిలిన హిందూ సమాజానికి మధ్య సాన్నిహిత్యాన్ని మరింత పెంపొందించడం. క్రైస్తవ, ఇస్లాం మతంమార్పిడి శక్తుల దాడిని ఎదిరించి నిలవాలనే సంకల్పాన్ని సుదృఢంచేయడానికి కూడా ఈ శిక్షణ ఎంతో సహాయపడింది.

ఈ శిబిరంవల్ల నిర్మాణమైన ఉత్సాహాన్ని సరియైన మార్గంలో వినియో గించి నట్లైతే హిందూత్వంలోకి తిరిగిరావాలని, పునరాగమనం కోసం ఉవ్విళ్ళూరుతున్న అనేకమంది మతం మారిన క్రైస్తవులకు ద్వారాలు తెరువడానికి అవకాశం ఏర్పడుతుందని పెద్దలు అపేక్షించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామీణప్రాంతాలలో, ముఖ్యంగా కోస్తాజిల్లాలలో నిరక్షరాస్యులు, నిరుపేదప్రజలలో హిందూ విశ్వాసాలను, సంస్కారా లను నిలిపి ఉంచడంలో, పండరిభజనలు అనే ప్రజాదరణగల ప్రజాకళలు ప్రధాన ప్రచార మాధ్యమంగా ఉండేవి. 1984సం.లో నెల్లూరు జిల్లాలో ఒక్కొక్క బృందంలో 60 మంది సభ్యులుండే 40 భజన మండలులకు పూర్తి ఒకరోజు కార్యక్రమం నిర్వహించారు. పోటీలు నిర్వహించారు. ఉత్తమబృందాలకు, బహుమతులను ఇచ్చారు. వాటి గురువులకు సన్మానం

చేశారు. బ్రహ్మాండమైన ఈ కార్యక్రమాన్ని విజయవాడ రేడియో కేంద్రం రెండుసార్లు ప్రసారం చేసింది. జనహిత పేరున స్వయంసేవకులు నిర్వహించిన ఈ కార్యక్రమంలో పాల్గొన్నవారు వ్యవసాయ కార్మికులు, వృత్తికళాకారులు మొదలైన ఉపేక్షిత వర్గాలవారే. వారిలో అధికశాతం హరిజనులుకూడా. ఈ కార్యక్రమంద్వారా వారు మిగిలిన నగరవాసులైన హిందూ సోదరుల ప్రేమ, సామరస్యాల వెలుగును దర్శించగలిగారు.

## దేవాలయాలు అందరివీ:

సామాజిక పరివర్తన సాధించడంలో స్వయంసేవకులు అన్ని దిశలలో ప్రదర్శించిన చైతన్యానికి కేరళ ఒక ప్రత్యక్ష ఉదాహరణగా నిలుస్తుంది. ఒకనాడు, ఆ ప్రాంతంలో అంటరానితనం తీవ్రస్థాయిలో ఉండడం చూసి నిర్ఘాంతపోయిన స్వామీ వివేకానందులు 'కేరళ ఒక పిచ్చివాళ్ళ నిలయమా?' అని కూడా అన్నారు. అయితే, ప్రాంతంలోని 9 వేల గ్రామాలలో మూడవ వంతు గ్రామాలలో విస్తరించిన 3 వేల శాఖలు సమగ్రరీతిలో తమ ప్రభావాన్ని ప్రదర్శించడం ప్రారంభించాయి.

1983లో ఎర్నాకులంలో జరిగిన విశాల హిందూసమ్మేళనంలో పూజా కార్యక్రమం జరిగిన తీరు సంప్రదాయ ధార్మిక పద్ధతులలో వస్తున్న విప్లవాత్మక పరివర్తనకు సంకేతం అయింది. ప్రధాన అర్చకుడు ఎజవాకులస్తుడుకాగా, అతడి సహాయకుడు సంప్రదాయ పురోహిత వర్గానికి చెందిన నంబూద్రి బ్రాహ్మణుడు. ఆ సమ్మేళనం తరువాత మరొక ప్రముఖ సంఘటన జరిగింది. ఆల్వేలో శ్రీ నారాయణగురు స్థాపిత అద్వైతాశ్రమంలో అర్చన, ఇతర ధార్మిక క్రతువులలో సామాజికంగా వెనుకబడిన వర్గాలకు చెందిన ఔత్సాహికులకు శిక్షణ కార్యక్రమాన్ని నిర్వహించారు. స్వయంగా తంత్రవిద్యలో పండితులైన ఒక జ్యేష్ఠ సంఘప్రచారక్ ప్రేరణతో నడుస్తున్న 'తంత్ర విద్యాపీఠం' ఈ కృషిలో ముందు నిలిచింది. చివరిలో జరిగిన బహిరంగ ఉత్సవంలో కంచికామకోటి పీఠ శంకరాచార్యులు శ్రీ జయేంద్ర సరస్వతి తమ మఠం ముద్రతో ప్రమాణపత్రాలను ప్రదానం చేశారు. ఎర్నాకులంలో ఎజవా కులస్తులకు చెందిన అయ్యప్ప దేవాలయంలో ఈ ఉత్సవం జరిగింది.

హరిజనుల దేవాలయ ప్రవేశంకోసం 1931-32లో జరిగిన సత్యాగ్రహం స్వర్ణోత్సవాలు నిర్వహించాలని విశ్వహిందూపరిషత్ చేసిన నిర్ణయం సామాజిక అంతరాలను తొలగించడంలో మరొక ముందడుగు అయింది.

1982 అక్టోబర్‌లో గురువాయూరులో జరిగిన చిరస్మరణీయమైన ఆ కార్యక్రమంలో సజీవులైఉన్న ఆనాటి 27 మంది సత్యాగ్రహులు పాల్గొన్నారు. దాదాపు వారందరు 75 సం||లు పైబడినవారే. ఈ చర్యకు సామాజిక అంగీకారం బలంగా ఉన్నదనడానికి ఆనాటి కార్యక్రమంలో పాల్గొన్న కేరళలోని ప్రముఖులైన మేధావులు, సామాజిక నేతలే ప్రత్యక్ష నిదర్శనం ఇదంతా ఆర్.ఎస్.ఎస్. వ్యవహారమని కొందరు సి.పి.ఐ. వారు విమర్శించినపుడు మాతృభూమి ఉప-సంపాదకులు శ్రీ వి.ఎమ్. కోరట్ ఇలా బదులిచ్చారు. “ఆర్.యస్.యస్. దైతే తప్పేమిటి? హిందువులను సమైక్యపరచడానికి దేశంమొత్తంలో జరుగుతున్న ఉద్యమమిది. హిందూ సంఘటన అనేది స్వయంగా మహాత్మాగాంధీ మనస్సుకు కూడా ఎంతో ప్రియమైన విషయంగా ఉండేది. హిందూ సమాజంలోని విఘటన ప్రవృత్తులను తొలగించి, వారిని సమైక్యపరిచేందుకే మహాత్ములు గురువాయూరు సత్యాగ్రహాన్ని చేపట్టారు. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమంలో తలమునకలై ఉన్న కారణంగా, హిందూ ప్రజలను సమైక్యపరచి, వారిలో కులతత్వాన్ని పూర్తిగా రూపుమాపే ఈ కృషిని డా. హెడ్గేవార్ స్వీకరించారు. కనుక, ఆర్.యస్.యస్ ముందుకు వచ్చి, ఈ స్వర్ణోత్సవాలను స్వయంగా నిర్వహించడం చాలా సముచితమైన విషయం.”

ఈ స్వర్ణోత్సవాల తరువాత గురువాయూర్‌లోనే మరొక మంచి సంఘటన జరిగింది. అది 1983 ఫిబ్రవరినెల. వందమంది హరిజనులు తిరువనంతపురం నుండి గురువాయూరుకు 200మైళ్ళ పాదయాత్ర ప్రారంభించారు. శ్రీ కృష్ణ దేవాలయంలోపల బ్రాహ్మణ భోజనాన్ని స్వీకరించడంద్వారా ఈ అసమానతలకు ముగింపు పెట్టాలన్న తమ సంకల్పాన్ని వారు ప్రకటించారు. బృందం నాయకుడు సంఘ పెద్దలను కూడా సహకరించవలసిందిగా కోరారు. ఈ యాత్రకు కమ్యూనిస్టు, క్రైస్తవ పత్రికలు ఇచ్చిన విస్తృత ప్రచారాన్ని పరిశీలిస్తే, హిందూ సంఘటన వాద ఉపాసకులను సందిగ్ధంలో పడవేయడానికి వామపక్షవాదులు ఇది చక్కటి అవకాశంగా భావించారని అర్థమౌతుంది. అయితే స్వయంసేవకులను, హిందూసమ్మేళన కార్యకర్తలను దారిపొడుగునా ఈ యాత్రకు అన్ని విధాల సహకారమందించవలసిందిగా కోరుతూ సంఘ, వి.హిం.ప. పెద్దలు పత్రికా ప్రకటనలు జారీచేశారు.

అనూహ్యరీతిలో దారిపొడుగునా యాత్రకు భవ్యస్వాగతం లభించింది. ప్రతిచోట స్వయంసేవకులు వారికి స్వాగతం పలికారు. వారితో కలిసిపోయారు. వారికి భోజనం, వసతి సమకూర్చారు. దారిపొడుగునా

యాత్రికులను అనేక దేవాలయాలకు, సామూహిక భజన, భోజన కార్యక్రమాలకు గొనిపోయారు. కొన్నిచోట్ల వారికి పూర్ణకుంభంతో స్వాగతం లభించిందికూడా. ప్రారంభంలో సంఘంమీద ఎన్నో సంశయాలతో బయలుదేరిన యాత్రికులకు చివరికి ఆ భ్రమలన్నీ తొలగిపోయాయి.

దేవాలయ అధికారులుకూడా ఉత్తమ రీతిలో ప్రతిస్పందించారు. ఉత్తేజభరితమైన భజనలు, స్తోత్రాలు గానం చేస్తూ సంఘ, విశాల హిందూసమ్మేళన కార్యకర్తలు యాత్రికులను దేవాలయంలోపలికి తీసుకుపోయారు. మామూలు భోజనశాలలోనే అందరికీ భోజనం వడ్డించారు. సంప్రదాయ నంబూద్రి కులానికి చెందిన స్వయంసేవకులు, వారి సతీమణులు సైతం యాత్రికులతో కలిసికూర్చుని భుజించారు. అన్ని వైపుల సద్భావన, సౌహార్ద్రతల వాతావరణాన్ని వీక్షించిన ముఖ్యమంత్రి కూడా వారితో కలిసి భోజనానికి కూర్చున్నారు. కేరళ అగ్రశ్రేణి జాతీయ దినపత్రిక మాతృభూమి ఇలా వ్రాసింది. "కార్యక్రమం పొడుగునా యాత్రికులకంటే ఆర్.యస్.యస్ స్వయంసేవకులే ఎక్కువ ఉత్సాహంగా కనిపించారు."

## హృదయాలు కలిసినవేళ:

శతాబ్దాల అంటరానితనం, వికృతకులతత్వాల సవాలును స్వీకరించడానికి మహారాష్ట్రలోని 'సామాజిక సమరసతా మంచ్' ముందుకు వచ్చింది. ఈ వేదిక ప్రజా సదస్సులను (సింపోసియా), సమావేశాలను ఏర్పాటు చేయసాగింది. వాటిలో సంఘ, దళిత నాయకులు తమ ఆలోచనలను పంచుకునేవారు. తమ అభిప్రాయాలు, ఆలోచనలు, అనుభవాలలో చాలావరకు సాన్నిహిత్యం ఉండడం ఇరువురికీ ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించింది.

1987సం.లో పూణేలోని భారత నాట్యమందిర్‌లో మంచ్ ఒక ఉత్సవాన్ని నిర్వహించింది. ఆ ఉత్సవంలో రాలేగావ్‌సిందిలో నమూనా గ్రామవికాస రూపశిల్పి అయిన అన్నా సాహెబ్ హజారే దళితులు, ఇతర పీడిత వర్గాల శ్రేయస్సుకోసం శ్రమించి, తపించిన కార్యకర్తలను సన్మానించారు.

సన్మానానికి సమాధానమిస్తూ షోలాపూర్‌కు చెందిన చంద్రంగురూజీ, బుద్ధుడు, మహావీరుడు, బసవేశ్వరుడి వంటి మహనీయుల పరంపరను మంచ్ ముందుకుతీసుకుని వెళ్తున్నదని అన్నారు. సన్మానం పొందిన

వారిలో పీడిత వర్గాల కేంద్రం (Depressed Classes Mission) కు చెందిన ఎమ్.డి. షేవలే ఒకరు. గతంలో జరుగుతూ వచ్చిన అన్యాయాన్ని రూపుమాపడంలో మంచ్ చేస్తున్న కృషి బహుధా ప్రశంసనీయమైనదని ఆయన అన్నారు. ఈ భావాత్మక, సముచిత ప్రయత్నాలను సక్రమంగా అర్థంచేసుకోవాలని కూడా వారన్నారు. ప్రాంత స్థాయి సంఘ కార్యకర్త అయిన మంచ్ కార్యనిర్వాహకాధ్యక్షులు 'సమరసత' అన్న పదాన్ని గురించి వివరించారు. సమరసత అంటే సమాజంలోని అన్ని వర్గాలు సంపూర్ణంగా కలిసిపోవడం, తాదాత్మ్యం చెందడం అని, సమాజ అంతరాత్మను జాగృతం చేయడం ద్వారానే దానిని సాధించగలుగుతామని ఆయన అన్నారు. వేదికపై వెనుకభాగాన తెరపై మహాత్మా ఫులే, విఠల్‌రామ్‌జీ షిందే, కర్మవీర్ భావూరావ్ పాటిల్, శాహూ మహారాజ్, డా. బాబాసాహెబ్ అంబేద్కర్, స్వాతంత్ర్య వీరసావర్కార్, సంత్ గడ్గే మహరాజ్, అన్నా సాహెబ్ కార్వే, డా. హెడ్గేవార్‌ల చిత్రపటాలను అలంకరించారు.

దళిత కార్యకర్తలు నిర్వహించిన నిర్మాణాత్మక కృషిని వెలుగులోకి తీసుకుని రావడం మంచ్ ఇలాంటి కార్యక్రమాలను నిర్వహించడంలో ఒక ప్రధాన లక్ష్యం.

సంఘ స్వయంసేవకులు దళిత నాయకులతో సన్నిహిత సంబంధాలను నిర్మాణంచేసుకున్నారు. వారి సంక్షేమంకోసం అనేక సేవాకార్యక్రమాలను చేపట్టారు. ఈ ప్రయత్నాలన్నీ సామాజిక సమరసతాసాధనకై వారు చేస్తున్న కృషిని నూతన ప్రమాణాలకు తీసుకువెళ్ళాయి. ప్రతిఏటా డా. అంబేద్కర్ వర్థంతి రోజున బొంబాయి లోని దాదర్ వద్ద గల అంబేద్కర్ సమాధి 'చైత్యభూమి' వద్దకు వేల సంఖ్యలో నవబౌద్ధులు వస్తారు. గత కొద్ది సం.లుగా స్వయంసేవకులు ఆరోజున వారికి పరిశుభ్రమైన త్రాగునీటిని, తక్కువ ధరలో ఆరోగ్యకరమైన భోజనాన్ని అందించడానికి చక్కని ఏర్పాట్లు చేస్తున్నారు.

1987 డిసెంబర్ 6వ తేదిన శ్రీ బాలాసాహెబ్ దేవరస్ 'చైత్యభూమి'ని సందర్శించి, స్వర్గీయ డా. అంబేద్కర్ దివ్యస్మృతికి నివాళులర్పించారు. వారికి స్వాగతం పలుకడానికి అంబేద్కర్ సతీమణి శ్రీమతి మాయి (సవితా) అంబేద్కర్ స్వయంగా తరలివచ్చారు. ఆ సమయంలో మహారాష్ట్ర తీవ్ర సంక్షోభంలో చిక్కుకుని ఉంది. డా. అంబేద్కర్ రచించిన 'రిడిల్స్ ఆఫ్ హిందూయిజమ్' పుస్తకం విషయంలో తీవ్ర ఉద్రిక్తవాతావరణం అలముకుని ఉంది. ఈ విషయం మనం మరచిపోరాదు.

సామాజిక సమరసత, సమానతలకై కృషిచేయడం, తీవ్రేచ్ఛగా ఉంటూ వచ్చింది. సామాజిక సమరసతను నిర్మాణం చేసే దృష్టితో వారి అన్ని శాఖలు ప్రతి ఏటా డిసెంబర్ 6వ తేదీన అంబేద్కర్ వర్ధంతిని జరుపుతూ ఉంటాయి. హరిజన బస్తీలను సందర్శించడం, అంబేద్కర్ సందేశాన్ని చాటి చెప్పడం, హరిజన, వనవాసీ వసతిగృహాలలో కార్యక్రమాలను నిర్వహించడం, ఆ వసతిగృహాలనుంచి విద్యార్థులను తమ ఇండ్లకు టీ, భోజనాదులకు ఆహ్వానించడం లాంటి అనేక కార్యక్రమాలు పరిషత్ నిర్వహిస్తోంది. వాటి కారణంగా ఉపేక్షిత సోదరులకు ఆత్మ గౌరవం, సమానత్వభావనలు నిర్మాణం అవుతున్నాయి. అగ్రవర్ణాలుగా పిలువబడేవారిలో కొందరిలో గల అభిజాత్యాన్ని తొలగించేందుకు అవి సహాయపడుతున్నాయి.

అటువంటి సందర్భాలలో జరిగే ప్రశాంత పరివర్తనను సూచించడానికి ఒక్క సంఘటన చాలు. ప్రొ. యశ్వంతరావు కేల్కర్ (విద్యార్థి పరిషత్ జ్యేష్ఠ కార్యకర్త) ఇంటిలో ఒక సమావేశం సందర్భాన వడ్డన చేస్తున్నవారిలో ఒక విద్యార్థిని ఉంది. ఆమె సంశయిస్తూ ఉండడం గమనించిన శ్రీ కేల్కర్, వంటింట్లోకి వెళ్ళి, పదార్థాలు తీసుకురమ్మని చెప్పారు. ఆమె అలాగే చేసింది. అయితే, కార్యక్రమం పూర్తి అయిన తరువాత ఆమె శ్రీ కేల్కర్ వద్దకు తిరిగివచ్చి, తాను షెడ్యూల్డు కులానికి చెందిన దానినని చెప్పింది. "ఇలాంటివి జరుగుతాయని కూడా నేనూహించలేదు. నా జీవితంలో ఇది సరికొత్త అనుభవం." అని చెబుతున్నప్పుడు ఆమె కళ్ళలోనుండి జలజల కన్నీళ్ళు రాలాయి.

వీరసావర్కార్ కలలుకన్న సామాజిక సమానతను వెలుగులోకి తెచ్చేందుకు ఆయన జన్మశతాబ్ది ఉత్సవాలు విద్యార్థిపరిషత్ కార్యకర్తలకు ప్రేరణదాయక సందర్భం అయ్యాయి. ఆ లక్ష్యంతోనే సావర్కార్ రత్నగిరిలో నిర్మించిన 'పతిత పావన మందిర్' నుండి సమతాజ్యోతి యాత్ర ప్రారంభమైంది. మహారాష్ట్రలో 4,200 కి.మీ. లు ప్రయాణించి ఆజ్యోతి సావర్కార్ నూరవ జన్మదినమైన 1983మే 28న బొంబాయి చేరింది. డా. అంబేద్కర్ చైత్యభూమి వద్ద జ్యోతియాత్ర ముగిసింది. భారతదేశంలో సమాజసంస్కరణోద్యమాలకు సారథులైన ఇద్దరు మహాపురుషుల సమాన హృదయస్పందనకు ప్రతీకగా హృదయాలను స్పందింపజేసే రీతిలో, అక్కడ కార్యక్రమం జరిగింది. దళిత, ఇతర రచయితలు, న్యాయవాదులు, విద్యావేత్తలు, అన్ని వర్గాలప్రజలు జ్యోతికి హృదయపూర్వక స్వాగతం పలికారు. ఈ సమస్యపై విద్యార్థి పరిషత్

యొక్క నిష్ఠాపూర్వక, భావాత్మక దృష్టికోణంలో అంతర్నిహితంగా ఉన్న ప్రభావశాలి అయిన సందేశానికి ఇది ప్రత్యక్ష నిదర్శనం.

## ప్రత్యక్ష ఉదాహరణలుగా:

సామాజిక సామరస్యబంధనాలను సుదృఢంచేయడానికి, ఉచ్చనీచభేద భావాలను తొలగించడానికి వివిధ ధార్మిక సందర్భాలను స్వయంసేవకులు వినియోగించుకున్న విధానాన్ని తెలియజేసే కొన్ని సంఘటనలు ఇవి. లెక్కలేనన్ని ఇతర ప్రయత్నాలకు ఇవి నమూనా మాత్రమే.

తమ జిల్లాలోని ఒక గ్రామంలో హరిజన హిందూ యువకులు మూకుమ్మడిగా ఇస్లాంలోకి మారిపోదామని తమ పెద్దలను బలవంతం చేస్తున్నట్లు ఉత్తరప్రదేశ్‌లోని ఝాన్సీకి చెందిన ఒక జిల్లాస్థాయి కార్యకర్తకు సమాచారం అందింది. గయకు యాత్రకు వెళ్తున్న ఆ పెద్దలకు సంకల్పక్రతువు జరిపించడానికి ఆ గ్రామంలో ఉన్న ఏకైక బ్రాహ్మణ పూజారి నిరాకరించడమే అందుకు కారణం. స్వయంగా బ్రాహ్మణుడైన ఆ సంఘ కార్యకర్త, కిసాన్ సంఘ్ జిల్లా అధ్యక్షులు, మరికొందరు స్వయంసేవకులు కలిసి హుటాహుటిన ఆ గ్రామానికి చేరుకున్నారు. వేదాలు అస్పృశ్యతను ఏనాడూ అంగీకరించలేదని, గతంలో ఆ గ్రామ పూజారి హిందువులందరికీ ఈ క్రతువులన్నింటినీ నిర్వహించేవాడని, తాను స్వయంగా అనేక హరిజన గృహాలకు వెళ్ళి, వారి ఇండ్లలో భోజనం చేశానని, దానికి తన కులంలో ఎటువంటి అభ్యంతరం తలెత్తలేదని ఆ కార్యకర్త పెద్ద సంఖ్యలో గుమిగూడిన గ్రామస్తులకు వివరించి చెప్పారు. అతడి మాటలతో మనస్సు మార్చుకున్న గ్రామస్తులు మొత్తం అందరూ అతడితోబాటు సంకల్పక్రతువులో పాల్గొన్నారు. అర్చకునికి అర్పించే దక్షిణను భక్తురాండ్రైన మహిళలు ఆ కార్యకర్తకు సమర్పించారు. దానిని ఆయన స్థానిక పాఠశాలకు సమర్పించారు. ఇక గ్రామం నుండి తిరిగి ప్రయాణమవడానికి కార్యకర్త సిద్ధపడుతున్న సమయంలో, ఆ గ్రామ పూజారి ఆయనను కలుసుకొనడానికి వచ్చాడు. కార్యకర్త నుండి కొంత అనునయపూర్వక వాక్యాలు విన్న తరువాత, ఆ పూజారి బాధనిండిన స్వరంతో అన్నాడు. 'మీలాంటి పండితులైన పెద్దలు ముందుకు వస్తే, మన కులాన్ని గురించి ఇక భయపడవలసిన అవసరంలేదు. ఇకమీదట నేను అన్ని క్రతువులను హరిజనులకు కూడా జరిపిస్తాను.'

కర్నాటకలోని బీదర్‌లో ఒక జ్యేష్ఠ సంఘ కార్యకర్త ఇంట్లో వివాహ

కలిసిభోజనం చేసారు. ఆ తరువాత నూతన దంపతులు, ఆ బస్తీలోని వయోవృద్ధ మహిళ ఉజాంబెహన్ పూారి గుడిసె వద్దకు వెళ్ళి, ఆశీస్సులను కోరుతూ ఆమె పాదాలను స్పృశించారు. ఈ వినూత్న విచిత్ర దృశ్యాన్ని చూడడానికని అక్కడ గుమిగూడిన చుట్టుప్రక్కల ప్రజలు ఒక బ్రాహ్మణ దంపతులు, ఒక హరిజన స్త్రీ ఆశీస్సులను కోరుతున్న దృశ్యాన్ని చూసి అవాక్కై ఆశ్చర్యంతో నిలబడిపోయారు. కళ్ళనుండి ఆనందాశ్రువులు ధారలు వారుతుంటే అమితానంద భరితులయ్యారు వారు.

కర్నాటకలోని ధర్మాచార్యుల సమన్వయకార్యం చూస్తున్న విశ్వ హిందూ పరిషత్ కార్యకర్త అనుభవం ఒకటి ఉంది. తమకుమార్తె వివాహ సందర్భంగా ఆశీస్సులనందించవలసిందిగా, హరిజన కులానికి చెందిన స్వామి అయిన ఆదిజాంబవ మఠాధీశుని ఆయన ఆహ్వానించారు. ఈ కార్యకర్త షిమోగాలోని ప్రఖ్యాత కోటి ఆంజనేయ దేవాలయంలో ప్రధాన అర్చకుడు. వివాహం కూడా సరిగ్గా దేవాలయంలో, పెద్ద జన సమూహం సమక్షంలో జరిగింది.

మరొక దిశలో కూడా స్వయంసేవకులు చొరవ చూపిన సంఘటనలు అనేకం ఉన్నాయి. స్వయంగా స్వయంసేవక్ అయిన ఆంధ్రప్రదేశ్‌లోని ఒక విభాగ్ ప్రచారక్ సోదరుడు తనకుమార్తెను ఒక హరిజన బాలుడికిచ్చి వివాహం చేయాలని ఆశించారు. అ పెండ్లికుమారుడు, అతని కుటుంబముందు ఈ ప్రస్తావన ఉంచినపుడు, వారు అంత ఉన్నత కులంనుండి అటువంటి ప్రస్తావన రావడం చూసి ఆశ్చర్యపోయారు. అయితే, తమఅంగీకారాన్ని తెలియజేశారు. ఇరువైపుల బంధుమిత్రులు సంతోషంగా వివాహానికి హాజరయ్యారు. నూతన దంపతులకు హృదయపూర్వక ఆశీస్సులనందించారు.

కర్నాటకలోని మంగుళూరులో స్వయంసేవక్ అయిన ఒక కళాశాల అధ్యాపకుడు ఉన్నారు. తన సహచరుడైన సద్గుణవంతుడైన ఒక హరిజన అధ్యాపకుడు తన చెల్లెలికి తగిన జోడీ అవుతాడని భావించారు. ఆమె ముందు ఈ ప్రస్తావన ఉంచినప్పుడు, వెంటనే ఆమె 'నాకు నీమీద పూర్తి విశ్వాసం ఉంది. నీవు ఏం నిర్ణయించినా అది నా మంచికోసమే అని నాకు తెలుసు' అని చెప్పింది. తన తల్లితండ్రులను కూడా స్వయంసేవక్ ఒప్పించగలిగారు. ఆ హరిజన సహచరుడు, కళాశాల ఉద్యోగి బృందం, విద్యార్థులు అందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. ఒక సందేశాన్నిచ్చే సామాజికోత్సవంలా ఎంతో ఆత్మీయ వాతావరణంలో వివాహం జరిగింది.

ఇలాంటి కార్యక్రమంలో తప్పక పాల్గొనాలనే ప్రేరణఅందరికీలభించింది.

## భక్తి భావన ఆధారంగా - సామరస్య నిర్మాణం:

మానవ నిర్మిత వైరుధ్యాలు, అంతరాలను తుడిచివేసేందుకు భగవంతునిపై భక్తి జాగృతం చేయడం కంటే ఉత్తమ మార్గం మరొకటిలేదు. అదీగాక, అనాదిగా హిందూ స్త్రీలు దయ, భక్తి భావనలకు నిలయంగా ఉంటూ వచ్చారు. ఈ దిశలో తమిళనాడు విశ్వహిందూ పరిషత్ అగ్రగామి ప్రయత్నాలు చేసింది. వారికి లభిస్తున్న ప్రతిస్పందన నిజంగా ఉల్లేఖనీయమైనది.

దీపజ్యోతి సర్వవ్యాపి అయిన పరాశక్తికి సంకేతంగా ప్రతీ హిందూగృహంలోనూ పూజలందుకుంటూ ఉంటుంది. కొన్ని ప్రత్యేక సందర్భాలలో సామూహిక దీప పూజలను జరుపుకునే సంప్రదాయం తమిళనాడు గ్రామాలలో ఉంది.

స్వాతంత్ర్యపోరాట కాలంలో స్త్రీలలో జాతీయ స్పృహను జాగృతం చేసేందుకు మహాకవి సుబ్రహ్మణ్యభారతి ఈ సంప్రదాయాన్ని ఉపయోగించుకున్నారు. ఇప్పుడు విశ్వహిందూ పరిషత్ అదే సూత్రాన్ని స్వీకరించింది. నవరాత్రి సందర్భంగా రాష్ట్రమంతటా 1008 దీప పూజలు నియమితంగా జరుగుతాయి. 1987 గణాంక వివరాలను బట్టి మహిళలలో ఎంతటి స్థాయిలో తక్షణ ప్రతిస్పందన లభిస్తున్నదో లెక్క వేయవచ్చు. ఆ ఏడు 243 స్థలాలలో జరిగిన 2842 దీప పూజలలో 1,48,645 మంది స్త్రీలు పాల్గొన్నారు. ఆ సందర్భాలలో వందలాది జ్యోతులు రగిలించే భక్తి భావ ప్రేరణలు వర్ణనాతీతమైనవి.

ఆ కార్యక్రమాలను గురించి వ్రాస్తూ హిందూ (1983 అక్టోబర్ 21) పత్రిక "పాల్గొన్న వారిలో సమాజంలోని వివిధ స్థాయిలవారు వున్నారు. చెప్పుకోదగ్గ సంఖ్యలో హరిజన స్త్రీలు కూడా ఉన్నారు. ఇతర భాషలు మాట్లాడే రాష్ట్రాల ప్రజలుకూడా కొందరు పాల్గొన్నవారిలో ఉండడం మరొక ఆసక్తికరమైన అంశం. అదొక భారతదేశపు సంగ్రహ స్వరూపం. జాతీయ సమగ్రతకు, వర్గ, వర్ణరహితసమాజానికి తేజోమయి ఉదాహరణ. రాజకీయ నాయకులు అత్యుత్సాహంతో చెప్పే చేవలేని, పసలేని నినాదాలను విశ్వహిందూ పరిషత్ రాష్ట్రమంతటా ఇలాంటి ఉత్సవాలను నిర్వహించడం ద్వారా నిరాడంబర పద్ధతిలో వాస్తవాలుగా పరివర్తన సాధించింది." అని పేర్కొంది.

ఏ జాతీయావశ్యకతను దృష్టిలో పెట్టుకుని లోకమాన్యతిలక్ సామూహిక గణేశ్ ఉత్సవాల నిర్వాహణను ప్రారంభించారో, అది దురదృష్టవశాన కొద్ది దశాబ్దాలుగా అదృశ్యం అయింది. అయితే, ఈ మధ్య కాలంలో అనేకచోట్ల స్వయంసేవకులు ఆ ఉత్సవాన్ని సామాజిక జాగృతికి ఒక ప్రభావవంతమైన సాధనంగా మలచేందుకు మరొకసారి కృషిచేసి విజయం సాధించారు.

హైదరాబాద్‌లో పెద్ద సంఖ్యలో గణేశ్ మండలులు గణేశోత్సవాలను నిర్వహిస్తూ ఉంటాయి. కొద్ది సంవత్సరాలక్రితం వరకు వారి వారి నిమజ్జన ఊరేగింపులు వేరు వేరుగా జరుగుతూ ఉండేవి. ఎటువంటి సమన్వయంగానీ, సామూహిక దృష్టిగానీ ఉండేది కాదు. కనుక మొత్తంమీద సమాజంపై ఎటువంటి ప్రభావం ఉండేది కాదు. అయితే స్వయంసేవకులు వివిధ మండలులను సంపర్కం చేశారు. నిమజ్జనం చివరిరోజున సామూహిక ఊరేగింపులో అందరూ కలిసి పాల్గొనవలసిన ఆవశ్యకతను వారికి వివరించి చెప్పారు. కొన్ని మండలులు అంగీకరించి సామూహిక ఊరేగింపు ప్రారంభించాయి. ప్రభావవంతమైన ఆదృశ్యం చూసి మిగిలిన మండలులు కూడా మరుసటి సంవత్సరం వారితో వచ్చి చేరాయి. 3, 4 సం. లలోపల నగరం నలుమూలలనుండి 3 వేల చిన్న, పెద్ద ఉత్సవ మండలులు ఒకే బ్రహ్మాండమైన సామూహిక ఊరేగింపులో కలిసిపాల్గొనడం ప్రారంభించాయి. నేడు ఈ నిమజ్జన కార్యక్రమంలో నగరమంతటినుండి 5000 గణేష్ ఉత్సవమండలులు పాల్గొంటున్నాయి. 15 కి.మీ. పొడుగు మార్గంలో ప్రజాసముద్రం తరలివస్తున్నదృశ్యం కనబడుతుంది. దాదాపు 15 లక్షలమంది ఈ ఉత్సవాలలో పాల్గొంటున్నారు.

10 రోజుల ఉత్సవాల కాలమంతా వాతావరణం దేశభక్తి, ధర్మభక్తితో నిండిపోయి ఉంటుంది. అసహ్య, అసభ్య పాటలు, నృత్యాలు, ఇతర వికృతులు నెమ్మదిగా తగ్గిపోయాయి. పోలీసులు కూడా అలాంటివి జరుగకుండా తగు జాగరూకతతో ఉన్నారు. స్వాతంత్ర్య పోరాట సంఘటనలపై నాటకాలు, కులతత్వం, అంటరానితనంలాంటి సామాజిక దోషాలను గురించి తెలియజెప్పే నాటకాలు ప్రవేశించాయి. వందలాది స్థలాలలో వివిధ కులాలవారి సహపంక్తి భోజనాలు జరుగుతాయి. ఉత్సవాలలో అవి ఒక విడదీయలేని అంతర్భాగమైపోయాయి. మురికి వాడలలో నివసించే ప్రజలు, ఇతర వెనుక బడిన వర్గాల ప్రజలు ఉత్సాహంగా, ఎటు

వంటి అరమరికలు లేకుండా పాల్గొనడానికి ఇది ఎంతో ప్రోత్సాహాన్నిచ్చింది. గణేశోత్సవాల సామాజిక, జాతీయ ప్రాధాన్యతను గుర్తించి, ఆర్యసమాజ వాదులుకూడా హృదయపూర్వకంగా ఆ ఉత్సవాలలో పాల్గొనసాగారు. నిజానికి, సార్వదేశిక ఆర్యప్రతినిధి సభ అధ్యక్షుడే అన్ని గణేశ్ మండలుల కేంద్రీయ సమన్వయ సమితికి మొట్టమొదటి అధ్యక్షుడుగా కూడా ఉన్నారు.

ఈ ప్రచండమైన హిందూవెల్లువ ముస్లిం మనస్సులపై కూడా ఒక మంచి ప్రభావాన్ని కలిగించింది. వారిలోని అతి ఛాందసులైన వర్గాల వారుకూడా మెత్తబడ్డారు. అనేకచోట్ల ఏర్పాట్లలోను, అలంకరణలలోను, ఊరేగింపులో పాల్గొనే వారికి మంచినీటి సదుపాయం కల్పించటంలోను హిందువులకు స్థానిక ముస్లింలుకూడా సహకరిస్తుంటారు. మిగిలిన సమయాలలో కూడా హిందువులతో ముస్లింల వ్యవహారం మరింత హృదయపూర్వకంగాను, సహకారవంతంగాను మారింది.

హైదరాబాద్ ఉత్సవాల ప్రభావం త్వరలోనే ఆంధ్ర ప్రదేశ్ అంతటా విస్తరించింది. రాష్ట్రమంతటా షుమారు 100 స్థలాలలో గణేశ ఉత్సవాలు హిందూ సమాజోత్సవాలుగా జరుగుతున్నాయి. ఆదిలాబాద్, కర్నూలు, తాడిపత్రివంటి స్థలాలలో పెద్దఎత్తున నిమజ్జనోత్సవాలు జరుగుతున్నాయి. ఉదాహరణకు ఆదిలాబాద్‌లోకూడా బ్రహ్మాండమైన సామూహిక నిమజ్జన ఊరేగింపును నిర్వహించడం ప్రారంభించారు.

## సాంస్కృతిక వేర్పాటుధోరణులను అంతంచేసేందుకు:

ఈశాన్య ప్రాంతంలోని వనవాసుల విషయంలో, హిందువులుగా వారి అస్తిత్వాన్ని నిరూపించడానికి ఒక పెద్ద అవరోధం వచ్చిపడింది. 1967లో గువాహాటీ (గౌహతి) లో ఆ ప్రాంత మొదటి విశ్వహిందూ పరిషత్ సమ్మేళనం జరిగినపుడు అరుణాచల్‌ప్రదేశ్, మేఘాలయ, నాగాలాండ్‌లనుండి పెద్ద సంఖ్యలో వనవాసీ ప్రతినిధులు పాల్గొన్నారు. ప్రతి వనవాసీ ప్రతినిధికి పెజావర్ మఠాధిపతి శ్రీ విశ్వేశ్వరతీర్థుల చేతులమీదుగా ఓంకారం గుర్తుగల గొలుసును బహూకరించాలని నిశ్చయించినపుడు సత్రాధికారులలో ఆందోళన చెలరేగింది. వారిని వేధిస్తున్న ప్రశ్న ఇది. వనవాసులు గోమాంస భక్షణ చేసేవారైనప్పుడు వారిని హిందువులుగా ఎలా పరిగణిస్తారు? శ్రీ గురూజీ సమ్మేళనంలో పాల్గొన్న ద్వారకా పీఠ శ్రీ శంకరాచార్యులతోను, అస్సాంలోని వివిధ వైష్ణవ సత్రాలకు చెందిన

ప్రముఖులైన సత్రాధికారులతోను మాట్లాడారు. వనవాసులు మౌలికంగా అనాదిగా హిందువులేనని, మిగిలిన సమాజంతోను, సంస్కృతితోను అనేక సంవత్సరాలుగా సంబంధాలు లేని కారణంగా సరియైన హిందూధార్మిక ప్రబోధాల ప్రయోజనం వారు పొందలేకపోయారని ఆ పెద్దలందరికీ శ్రీ గురూజీ నచ్చజెప్పారు. గోవు ఎడల భక్తి లాంటి మన ధార్మిక, సాంస్కృతిక విలువలనుండి వారు దూరంగా ఉండిపోవడానికి దోషం వారిది కాదు. కనుక ఎటువంటి సంకోచం లేకుండా వనవాసులను హిందూ సమాజంలో భాగంగా స్వీకరించడం మన బాధ్యత.

సాయంత్రం జరిగిన బహిరంగ సభలో ద్వారకాపీఠాధిపతి వనవాసులుకూడా హిందువులేనని, గోమాంసభక్షణంవారి ఆర్థిక పరిస్థితుల ఫలితం మాత్రమేనని, ఆ కొండ ప్రాంతాలలోని లోతట్టు ప్రదేశాలలో అంతకంటే చౌకగా లభించే ఆహారం మరేదీ లేదని ప్రకటించారు. సాంస్కృతికంగా ప్రగతి సాధించామని చెప్పుకునే ప్రజలు ఇంతకాలంగా ఆ కొండ ప్రాంతాలకువెళ్ళి, అక్కడి ప్రజలకు హిందూ సంస్కృతి, పరంపరలను బోధించవలసిన బాధ్యతను పట్టించుకోలేదని, కనుక దోషమంతా వారిదేనని కూడా ఆచార్యులు అన్నారు. తమ హిందూ అస్తిత్వాన్ని గురించిన సందేహాలన్నింటినీ తరిమికొట్టిన ఈ అధికారిక ప్రకటన విని వనవాసీ నాయకులు, ప్రతినిధులు ఆనందంతో, గర్వంతో ఉప్పొంగిపోయారు.

సమ్మేళనంలో శ్రీ గురూజీ భోజన సమయంలో ఆవనవాసీ నేతలతో కలసి కూర్చున్నారు. వాస్తవజీవితంలో హిందూ ఏకాత్మతాభావన యొక్క అనుభూతిని ఆ నేతలు పొందే రోమాంచక అవకాశాన్ని ఆ రకంగా వారు కల్పించారు.

మరొక విషయంలో కూడా సమ్మేళనం ఒక విశేషమైన అవకాశాన్ని కల్పించింది. సత్రాధికారులు సమ్మేళన స్థలం వద్దకు రాగానే శ్రీ గురూజీ వారిని ఒకరి నొకరికి పరిచయం చేశారు. ఎందుకంటే, గతనాలుగు శతాబ్దాలుగా ఒకే ప్రాంతానికి చెందిన ఆ వివిధ ధార్మిక నేతల మధ్య కూడా ఎటువంటి సంబంధాలు లేకుండా పోయాయి.

సమ్మేళన సమయంలో, ఉడిపి అడయార్ మఠానికి చెందిన శ్రీ విభూదేశతీర్థస్వామి ఒక మత్స్యకారుడి ఇంట్లో ఉన్నారు. ఆ ఇంటిలోనే సంప్రదాయంగా వస్తున్న తన నిత్యపూజాదికాలు కొనసాగించారు. మత్స్యకారుల సమూహం అంతటికీ ప్రసాదం పంచి పెట్టారు. ఆ

మత్స్యకారులు అమితానంద భరితులు కావడంలో ఆశ్చర్యమేముంది! 'భగవంతుడే స్వామీజీ రూపంలో మా ఇండ్లకు వేంచేశారు.' అని వారు అనుభూతి చెందారు.

మధ్యప్రదేశ్‌లోను, ఇతరచోట్ల మన వనవాసీ సోదరులు ప్రధాన హిందూ సమాజంనుండి అనేక సంవత్సరాలుగా భౌతికంగా దూరంగా ఉంటూవచ్చారు. అదే సమయంలో క్రైస్తవ మిషనరీలు తమ ప్రచార ప్రవాహంతో వారిని ముంచెత్తారు. అయినప్పటికీ అధికశాతం వనవాసులు తమ హిందూ ధార్మిక విశ్వాసాలను, సంప్రదాయాలను యథాతథంగా నిలబెట్టుకోగలిగారంటే ఆశ్చర్యం కలుగుతుంది. విశ్వహిందూ పరిషత్, వనవాసీ కళ్యాణాశ్రమాలు ఆ ఉదాత్త సంప్రదాయాలను పెంచి పోషించడం, వారికి, మిగిలిన సమాజానికి మధ్య వారధులను పునర్నిర్మించడం ప్రధాన కార్యక్రమాలుగా స్వీకరించాయి.

వనవాసులు అత్యంత నిష్ఠతో పాల్గొనే యజ్ఞాలు, యాగాల ఆధారంగానే వారిని ఆకర్షించే ప్రయత్నం జరిగింది. యాగాగ్నిలో స్వయంగా వచ్చి తమ సమర్పణను సమర్పించమని వారిని ప్రోత్సహించారు. చూడడానికి అతి సాధారణంగా కనిపించే ఈ క్రతువు వారిలో ధార్మిక పవిత్రతాభావాన్ని, సామాజిక సమానత్వ భావాన్ని నిర్మాణం చేస్తుంది. కళ్యాణాశ్రమం నడుపుతున్న వసతి గృహాలలోని వనవాసీ విద్యార్థులు శ్రీరామ నవమి పండుగ సమయంలో కొత్త వనవాసీ క్షేత్రాలకు వెళ్తూ ఉంటారు. హిందూ సౌభ్రాతృత్వ సందేశాన్ని వారు తమ వెంటతీసుకుని వెళ్తారు. ధార్మిక రంగంలో ఇలాంటి కార్యక్రమాలు అనేక ప్రాంతాలలో ప్రారంభం అయ్యాయి. మహారాష్ట్రలోని ఠాణే జిల్లాలో తలసరి వద్దగల ఆశ్రమంలో అనుభవంకూడాఇదే. తలసరి చుట్టుపక్కల 5 తాలూకాలలోని 192 గ్రామాలలో గల 55 వేలమంది వనవాసులలో ఇలాంటి భక్తి ప్రేరకాలైన అనేక కార్యక్రమాలను ఆశ్రమం నిర్వహిస్తోంది.

## ధార్మిక సామరస్యాన్ని పెంపొందించడం:

ఒకే మహోన్నత సత్యాన్ని చేరుకొనడానికి వివిధ మార్గాలకు అవకాశం కల్పించడమే భారతీయ ఆధ్యాత్మిక పరంపర విశిష్టత. ఈ ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమే వివిధ పంథ, సంప్రదాయాలు, దర్శనాలు ఉద్భవించడానికి ఆధారం అయింది. అయితే ఇవన్నీ ఒకే మౌలిక విశ్వాసాలు, జీవన విలువలకు సాక్షాత్కారములు మాత్రమే. ఈ మౌలిక

ఆకాంక్షలు దృఢంగా, చైతన్యవంతంగా ఉన్నంతవరకు, ఈ వైవిధ్యాలు సమాజంలో ఎటువంటి విభేదాలకు దారితీయలేదు. కానీ, కాలగమనంలో ఈ సమైక్యతా ఝురి పలుచబడినపుడు, ఈ వైవిధ్యాలు, విభేదాలరూపం ధరించసాగాయి. ఒకదానికొకటి శత్రువులుగా కూడా రూపొందసాగాయి. విదేశీ దురాక్రమణలకు వ్యతిరేకంగాకానీ, తమ ఆంతరంగిక వైఫల్యాలకు వ్యతిరేకంగా గానీ మన సమాజం ఒక సామూహిక సంకల్పంతో పోరాటం సాగించలేకపోవడానికి ఇది కూడా ఒక కారణం.

ఈ దిశలో ప్రస్తుతం కనబడుతున్న జాగరణ ఒక గొప్ప పరివర్తనను సాధించింది. హిందూత్వపు జీవలక్షణమైన వైవిధ్యంలో ఏకత్వం యొక్క సరియైన అవగాహనకు పుష్టిని చేకూర్చింది.

ప్రయాగలోని త్రివేణీ సంగమం వద్ద 1979 జనవరిలో జరిగిన విశ్వహిందూ పరిషత్ సమ్మేళనం అనేక విషయాలలో ఒక సంగమంగా రూపొందింది. అనేక పంథాలు, సంప్రదాయాలు, కులాలు, తెగలు, భాషలు, ప్రాంతాల పవిత్ర ధారల సంగమం అది. ప్రారంభక్షణాలలోనే అందుకు ఒక అర్థవంతమైన సూచకం అక్కడ ప్రత్యక్షం అయింది.

2500 సం.లకు పూర్వం బుద్ధ భగవానుడికి కాశీలో ప్రవేశం నిషేధించారు. ఆ రోజునుండి వైదిక పంథానుయాయులు, బుద్ధుని అనుచరుల మధ్య సంఘర్షణ కొనసాగుతూనే ఉంది. ఈ రోజున ఆ కృత్రిమ అవరోధాన్ని కూల్చి వేసే చారిత్రాత్మక క్షణాలు వచ్చాయి. ఈ ప్రపంచ హిందూ సమ్మేళనాన్ని ప్రారంభించడానికి టిబెట్‌కు చెందిన లామా-బౌద్ధుల తెగకు అధిపతి అయిన దలైలామాను ఆహ్వానించారు. ఆయన రైలు దిగగానే, కాశీ నివాసులైన వేద పండితులు చతుర్వేద పారాయణంతో వారికి స్వాగతం పలికి, పుష్పమాలాలంకృతుని చేశారు. ప్రారంభోత్సవం లోకూడా పవిత్ర వేదోచ్చారణలతో దలైలామాకు స్వాగతం పలికారు. అందుకు ప్రతిగా, ఆయన టిబెట్టు సంప్రదాయ పద్ధతిలో ఆ పండితులను సత్కరించారు. ఆ సందర్భాన దలైలామా పలికిన తొలిపలుకులు భావోద్వేగ భరితంగాను, ఆలోచనలను రేకెత్తించేవిగాను ఉన్నాయి. "ఒక బౌద్ధ భిక్షువుగా ఒక హిందూ సమ్మేళనానికి నారాక మన ఆంతరిక ఏకాత్మతను గురించిన లోతైన జ్ఞానంలేని కొందరికి వింతగా తోచవచ్చు. గౌతమబుద్ధుడు ఈ భూమి కన్న ఉత్తమ సంతానంలో ఒకరు. ఆ విధంగా, బౌద్ధధర్మంకూడా ఈ భూమి ప్రసాదమే. ఇక్కడకు వచ్చాక నేను మన ఇరువురి తత్వజ్ఞానాలు, ముఖ్యమైన సాధనా మార్గాల వైశిష్ట్యం

గురించి వేదపండితులతో చర్చించాను. ఆ రెండు ఒకే విధమైనవని గ్రహించాను.”

విశ్వహిందూ పరిషత్ నిర్మాణం చేసిన ‘ధర్మసంసద్’ ప్రధాన హిందూ మూలకందం నుండి మొలకెత్తిన వివిధ పంథాలకు చెందిన ప్రముఖ సాధువులు, మఠాధిపతులతో నిండి ఉంది. హిందూత్వపు సమాన ఆధారాలను వెలుగులోకి తేవడంలోను, అన్ని హిందూ హృదయాలను స్పృశించే అంశాలను తీసుకుని ఉద్యమించడంలోను ధర్మసంసద్ ప్రభావవంతంగా పనిచేస్తోంది. అందువల్లనే నేడు అనేక హిందూ సమ్మేళనాలలో అన్ని పంథ సంప్రదాయాలకు చెందిన మఠాధి పతులు, మహంతులు, మండలాధీశ్వరులు ప్రత్యక్షం కావడాన్ని, అందరి నోట ఒకే సమైక్య హిందూ వాణి ప్రభవించడాన్ని దర్శిస్తున్నాం. అస్పృశ్యత, కులతత్వం, వర్గతత్వాలను రూపమాపే కృషిలో గానీ, రామజన్మభూమి విముక్తి, దేవాలయాల సంరక్షణ, గోవధనిషేధం, మతాంతరీకరణలపై నిషేధం, హైందవేతర మతం మార్పిడి సంస్థలకు విదేశీ ధన ప్రవాహంపై నిషేధం, విదేశీ క్రైస్తవ మిషనరీల దేశబహిష్కరణ మొదలైన అంశాలపై పోరాటం సాగించటంలో గానీ శైవ, వైష్ణవ, జైన, బౌద్ధ, వీరశైవ, సిక్కు మొదలైన అందరూ సమైక్యప్రయత్నం సాగించడానికి ముందుకు వచ్చిన అరుదైన దృశ్యం నేడు దర్శించగలుగుతున్నాం.

## ప్రధాన జాతీయ జీవన స్రవంతికి హిందూత్వపు పిలుపు:

ఇంతవరకు తమ సంపర్కంలో లేని వ్యక్తులను సోదరత్వ బంధనాలలో బంధించడానికి రక్షాబంధన్ స్వయంసేవకులకు సహజంగానే అవకాశాన్ని కల్పిస్తూంటుంది. ఈ ఆత్మీయతా వ్రతంలో వారు హిందూ, ముస్లిం, క్రైస్తవ వైవిధ్యాలు చూడరు. వారి సోదరభావనను సమాన ఆత్మీయతతో అందరూ స్వీకరించినట్లు వారి అనుభవం చెబుతుంది.

1985లో, తమిళనాడులోని కోయంబత్తూర్ సమీపంలో గల జ్యోతిపురం స్వయంసేవకులు పక్కనేఉన్న వీరపాండి గ్రామంలో క్రైస్తవ మిషనరీలు నడుపుతున్న పాఠశాల ప్రధానోపాధ్యాయిని వద్దకు వెళ్ళారు. పాఠశాలలో రక్షాబంధనోత్సవాన్ని జరుపుకునేందుకు అనుమతినీయవలసిందిగా వారామెను అభ్యర్థించారు. ఆమె ఇచ్చిన సమాధానం స్వయంసేవకులను ఆశ్చర్యపరచింది. ‘నిజానికి, ఇన్ని రోజులుగా మిమ్మల్ని కలవాలని నేనే ఎంతో ఆతృతతో ఉన్నాను. గత సంవత్సరం నేను ఇక్కడ బాధ్యతలు

స్వీకరించి నపుడు మీనుండి రాబోయే ఇబ్బందులను గురించి మావాళ్ళు కొందరు నన్ను హెచ్చరించి ఉన్నారు. కానీ నేను మీ సభ్యులలో ఉన్నతమైన క్రమశిక్షణ, సంస్కారవంతమైన ప్రవర్తన మినహా మరేదీ చూడలేదు.' స్వయంసేవకులు సంఘం యొక్క హిందూ సంఘటన దృష్టిని గురించి ఆమెకు వివరించినపుడు, దానిని స్వాగతిస్తూ ఆమె 'మీ దృష్టిఅంతటి విశాలమైనదైతే నేనుకూడా హిందువునే - నేను క్రైస్తవ హిందువుని' అన్నారు. ఉత్సవం సమధికోత్సాహంతో జరిగింది. ఆమె తన సహచరులకు, మిత్రులకు కట్టడానికని మరొక 3వందల రాఖీలు అదనంగా తీసుకున్నారు.

అంతకు ముందు ఒక సందర్భంలో, తమిళనాడులోని తిరునల్వేలి జిల్లాలోగల శ్రీ వైకుంఠపురంలో జరిగిన రక్షాబంధన్ ఉత్సవంలో క్రైస్తవుడైన స్థానిక ప్రముఖ న్యాయవాది అధ్యక్షత వహించారు. డయొసీస్ సంస్థలో ఆయన ప్రముఖులు. ఆయన ఇలా అన్నారు. "హిందూ సంస్కృతి, కళలు, సంప్రదాయాలు నా రక్తంలో కూడా ఉన్నాయి. నేను గర్వపడే సంపద అది. మా పూర్వీకులు అందించిన విలువైన వారసత్వం అది. దానిని పరిరక్షించడం నా పవిత్ర కర్తవ్యంగా నేను భావిస్తూంటాను." ఆయన ఇంకా ఇలా అన్నారు. "ఇకముందు నేను నా క్రైస్తవ మిత్రులతో మాట్లాడి, సంఘం యొక్క ఉన్నతాదర్శాలగురించి వారికి నచ్చజెప్పేందుకు ప్రయత్నంచేస్తాను."

హైందవేతరుల పిల్లలకు సంబంధించినంతవరకు, హిందూ పిల్లలంత సహజంగా వారుకూడా హిందూ పద్ధతులకు అలవాటు పడిపోతారు. కర్ణాటకలో పాఠశాల విద్యార్థినీ విద్యార్థులకు విశ్వహిందూపరిషత్ నిర్వహించే వార్షిక 'భారతీయ సంస్కృతీ పరిచయ పరీక్ష' లో ప్రవేశానికి వందలాది క్రైస్తవ, ముస్లిం పిల్లలు కూడా వస్తూంటారు. 1983లో ఒక క్రైస్తవ బాలిక పరీక్షలో ప్రథమ బహుమతి పొందింది. శృంగేరి జగద్గురు శంకరాచార్యుల చేతులమీదుగా ఆబాలిక బంగారు పతకాన్ని అందుకుంది. అనేక చోట్ల 'హిందూసేవాప్రతిష్టాన' నిర్వహించే సంస్కృత శిబిరాలకు కూడా అలాంటి బాలలు అనేకులు ఆకర్షితులయ్యారు. వారుకూడా ఒకరినొకరు 'హరిఓం' అనిపలుకరించుకుంటున్నారు. సేవావ్రతులు నేర్పించిన హిందూజీవనంలోని సాంస్కృతిక అంశాలను వారుకూడా గ్రహిస్తున్నారు. శ్లోకాలు, భజనలు, ఇతిహాసాలలోని కథలను ఆత్రుతగా నేర్చుకుంటున్నారు. తమ పిల్లలు అలాంటి నైతిక గుణాలను పెంపొందించుకోవడం చూసిన తల్లితండ్రులు కూడా హిందూ పద్ధతులవైపు ఆకర్షితులౌతున్నారు.

ఫలితంగా, ఆప్రాంతంలోని హిందువులతో వారికి నెమ్మదిగా చక్కటి సంబంధాలు, సమరసత అభివృద్ధి చెందుతున్నాయి.

1977లో అస్సాంలోని దిబ్రూగర్‌లో వివేకానంద కేంద్ర నిర్వహించిన యోగ శిబిరంలో జరిగిన ఒక సంఘటన గుర్తు చేసుకోవలసినది. పాల్గొన్న వారిలో నాగాలాండ్‌లోని మిషనరీ పాఠశాలలకు చెందిన 15మంది నాగా క్రైస్తవ అధ్యాపకులు కూడా ఉన్నారు. చివరి రోజున వారు ప్రధాన యోగ శిక్షకుని వద్దకు వచ్చి "ఈ 20 రోజులుగా మతం, యోగ, ఆధ్యాత్మికతలపై మేం విన్న ప్రసంగాలు మాకొక నూతన వెలుగును చూపాయి. ఇప్పటి వరకు మాకు క్రైస్తవ మొక్కటే నిజమైన మతమని, ఏసుక్రీస్తు ఒక్కడే నిజమైన దేవుని సంతానమని, క్రైస్తవులు మాత్రమే స్వర్గప్రాప్తికి అర్హులని, మిగిలినవారికి నరకవాసం తప్పదని, ఇంకా అనేక విషయాలు మాత్రమే నేర్పించారు. కానీ ఇప్పుడా నమ్మకాలన్నీ చెదిరి పోయాయి. అన్ని మతాలలోను ఒక మౌలిక ఏకత ఉన్నదని మేం గుర్తించాం. ఇతర మతాలను నిందించడానికి, విమర్శించడానికి అందులో స్థానంలేదని కూడా మేం గ్రహించాం" అని అన్నారు.

దక్షిణాగ్రానకూడా అలాంటి సంఘటనే ఒకటి జరిగింది. 1978 సెప్టెంబర్‌లో కన్యాకుమారిలో వివేకానంద కేంద్రలో పనిచేస్తున్న ఒక జ్యేష్ఠ స్వయంసేవక్ ఒక అగ్నిప్రమాదంలో చిక్కుకున్నారు. వెంటనే ఆయనను నాగర్‌కోయిల్‌లో ఉన్న ఒక మిషనరీ ఆసుపత్రికి తరలించారు. శస్త్ర చికిత్సకు అని ఏర్పాట్లు జరిగాయి. అక్కడ ఉన్న నర్సుతాను ఏసుక్రీస్తును ప్రార్థించి, అతడిని కూడా అలాగే చేయమని కోరింది. స్వయంసేవక్ ప్రశాంతంగా సమాధానం ఇచ్చారు. "అలాగే! నాకభ్యం తరంలేదు. మీరు మీదేముడైన ఏసుక్రీస్తు ప్రభువును ప్రార్థించినట్లే నేను మాదేముడైన శ్రీరాముని ప్రార్థిస్తాను."

నర్సు గతుక్కుమంది. అందుకు వ్యతిరేకతప్రకటిస్తూ "లేదులేదు. మీజీవితానికే ప్రమాదం ఏర్పడిన ఇటువంటి సమయాలలో ఏసుక్రీస్తు మాత్రమే కాపాడగలడు. మరేదేవుడు కాపాడలేడు" అంది. కానీ, ఆస్థితిలో ఉండి కూడా స్వయంసేవక్, శరీరమంతా విపరీతమైన నెప్పితో మండుతున్నా, క్రైస్తవ వైద్యుల చేతిలో తన ప్రాణాలున్నట్లు కనబడు తున్నా ప్రశాంతంగానే ఉన్నారు. "చూడండి! ఇక్కడ మా వైద్య మిత్రుడు ఉన్నారు. ఇంటి దగ్గర ఆయనను ఆయన సంతానం 'నాన్న' అని పిలుస్తారు. ఆయన భార్య ఏదో ప్రియమైన పేరుతో ఆయనను

సంబోధిస్తుంది. ఆయన సోదరీసోదరులు ఆయనను పేరుపెట్టి పిలుస్తారు. నాలాంటి రోగులు వైద్యునిగా ఆయనను సంబోధిస్తారు. అందరూ ఆయనను వైద్యుడనే పిలవరు. వ్యక్తి ఒకరే అయినప్పటికీ, ఆయనతో గల సంబంధాన్ని బట్టి సంబోధన మారుతూ ఉంటుంది. భగవంతునితో మన సంబంధం విషయంలో కూడా అంతే. మనందరికీ భగవంతుడు ఒక్కడే. అయితే మనం వేరువేరు పేర్లతో ఆయనను పిలుస్తాం. మరి, ఎందుకు ఒక పేరుగురించి మీరు ఒత్తిడి చేస్తారు?" అని ఆయన వారిని ప్రశ్నించారు.

నర్సు అయోమయంలో పడిపోయింది. ఇంతలో పశ్చిమ జర్మనీ నుండి వచ్చిన మిషనరీ అయిన ఎనస్తటిస్ట్ (Anaesthetist) (మత్తుమందిచ్చేవైద్యుడు) సిద్ధం అయ్యాడు. రోగినుద్దేశించి ఆయన "నాజీవితంలో మొట్టమొదటిసారిగా భగవంతుని గురించి ఈ విధమైన దృష్టికోణాన్ని వింటున్నాను. దీనిలో చాలా శక్తి ఉన్నట్లు నాకనిపిస్తోంది. మీరు కోలుకున్న తరువాత మనం దానిని చర్చిద్దాం. ప్రస్తుతానికి దిగులు చెందకండి. మీకు నచ్చిన రీతిలో ప్రార్థన చేసుకోండి" అన్నాడు. శస్త్ర చికిత్స విజయవంతంగా పూర్తయింది. స్వయంసేవక్ పూర్తిగా కోలుకున్నారు.

సంఘం చేసే ప్రయత్నాలలో స్థానిక హిందువులతో బాటు ఇరుగుపొరుగున ఉండే క్రైస్తవులు, ముస్లింలు కూడా సహాయసహకారాలందిస్తూ ఉండడం సాధారణ అనుభవం. తమిళనాడులోని ట్యుటికోరన్‌లో ఒక సమయంలో బాగా నీటి ఎద్దడి ఏర్పడింది. ఆసమయంలో అక్కడ సంఘ శిక్షణ శిబిరం జరుగుతోంది. మిగిలిన హిందూ కుటుంబాలతో బాటు ఒక క్రైస్తవ కుటుంబం కూడా కొందరు స్వయంసేవకులను పదిహేనురోజులపాటు రోజూ తమఇంటికి కూడా స్నానానికి పంపించమని శిబిరనిర్వాహకులను కోరింది.

1986లో తమిళనాడులోని రామనాథపురంలో శ్రీ బాలాసాహెబ్ దేవరస్ ప్రసంగించిన ఒక సమావేశానికి తన హిందూ సహచరులతో కలిసి ఒక విద్యాధికుడైన ముస్లిం ప్రభుత్వాధికారి కూడా వచ్చారు. "ఇవాళ నాఅంతట నేను ఆరెస్సెస్ నాయకుని ఉపన్యాసం వినాలని వచ్చాను. ఎందుకంటే ఆరెస్సెస్ తీవ్రమైన ముస్లిం వ్యతిరేకతగల సంస్థఅని, ఈరోజు రామనాథపురంలో వారి ఊరేగింపు ఉంది గనుక హింసాకాండ చెలరేగవచ్చని, కనుక ముస్లింలెవరు రామనాథపురం వెళ్ళరాదని జమాత్ నాయకులు సలహా ఇచ్చారు. నిజానిజాలను తెలుసుకోవాలని తెగించి

వచ్చాను. ఉపన్యాసమంతా ముస్లిం వ్యతిరేక విషంనిండి ఉంటుందని, ఇస్లాంపైన, మహమ్మదీయులపైన నిందలు కురిపిస్తారని నేను ఊహించాను. కానీ ఆరెస్సెస్ అధినేత ఉపన్యాసం ఉన్నతమైన దేశభక్తి భావనతో నిండి ఉంది. ఆయన తన ప్రసంగంలో చేసిన ఏ విషయానికీ ఎవరూ అభ్యంతరం తెలుపడానికి వీలులేదు. నాకెంతో ఆశ్చర్యం కలిగింది. నిజమైన ఆలోచనలను, సత్యాన్ని వారు వ్యక్తీకరించారు. జమాత్ నాయకులు ముస్లింలను అనవసరంగా పెడదారి పట్టిస్తున్నారు. ఆరెస్సెస్ గురించి పొరపాటు అభిప్రాయాలను వాళ్ళు కలుగజేస్తున్నారు." అని ఆయన వ్యాఖ్యానించారు.

ముస్లిం, క్రైస్తవ బాలురు, యువకులు, సంఘ శాఖలకు రావడం, క్రియాశీల కార్యకర్తలుగా రూపొందడం లాంటి సంఘటనలు చాలా ఎక్కువ కాకపోయినప్పటికీ తరచు జరుగుతూనే ఉంటాయి. దేశమంతటా ఇదే రకమైన అనుభవం ఉంది. కేరళలో ఇలాంటి సంఘటనలు అధికం. ఉదాహరణకు, కొట్టాయంకు చెందిన ప్రొ.మాథ్యూస్ గట్టి సంఘ స్వయంసేవక్. హిందూప్రయోజనాలన్నింటికీ గట్టి సమర్థకులు కూడా. క్రైస్తవుడై ఉండి, పూర్తిగా హిందూ సంస్థ అయిన ఆరెస్సెస్‌తో ఆయన ఎలా సంబంధం పెట్టుకోగలిగారని కలకత్తానుండి వెలువడే 'అమృతబజార్ పత్రిక' (1982 జూలై27)లో సునీల్ ఘోష్ అడిగిన ప్రశ్నకు ప్రొ.మాథ్యూస్ ఇలా సమాధానం ఇచ్చారు. "నిజమే, నేను క్రైస్తవుడనే. అంతమాత్రాన భారతీయ సంస్కృతి, విలువల ప్రధాన ప్రవాహం నుండి నేను ఎందుకు దూరంకావాలి? స్వామీ వివేకానందుని ఆలోచనల నుండి ఆరెస్సెస్ ప్రేరణ పొందింది. మరి స్వామీజీని మతతత్వవాదిగా పిలిచే సాహసం ఎవరైనా చేయగలరా?"

అజీజ్ హుస్సేన్ రాజస్థాన్‌లోని బాన్స్‌వాడలో శాఖకు నిష్ఠగా హాజరయ్యే స్వయంసేవకులలో ఒకరు. ఆసమయంలో ఆయన బి.కాం. చదువుతూ ఉండేవారు. సంఘ ప్రత్యేక శిక్షణ కూడా ఆయన పొందారు. ఇది అస్వాభావికంగా భావించిన కొందరు పత్రికా విలేఖరులు "మీరు సంఘంలో చేరడానికి మీ తల్లితండ్రులు అభ్యంతరం తెలుపలేదా? ఆరెస్సెస్ లాంటి హిందూ మతమౌఢ్య సంస్థలో కలువడం వల్ల మీ అలవాట్లు, సంప్రదాయాలకుభంగం వాటిల్లుతుందని వారు భయపడలేదా?" అని ఆయనను ప్రశ్నించారు. అజీజ్ వారికి ఇలా సమాధానం ఇచ్చారు. "నా తండ్రి దుబాయిలో ఉంటారు. ఒకసారి ఆయన ఇక్కడికి వచ్చినపుడు కొందరు ముస్లిం మిత్రులు నాపైవ్యతిరేకంగా ఆయనకు ఫిర్యాదు

చేసారు. అప్పుడు మాతల్లి అందులో చింతించవలసిందేమీలేదని మా తండ్రికి నచ్చజెప్పారు. 'ఇక్కడి సంఘప్రచారక్ చాలా మంచియువకుడు. చాలా సద్గుణాలు కలవాడు. అతడి సంరక్షణలో అజీజ్ చాలాబాగు పడ్డాడు' అని ఆమె మాతండ్రిగారికి వివరించారు. మాతండ్రి గారు ఇక్కడ ఉన్న సమయంలోనే ప్రచారక్ మా ఇంటికి భోజనానికి వచ్చారు. మాతండ్రిగారి మనస్సులో ఉన్న అనేక సందేహాలను ఆయన సమాధానపరచారు. మానాన్నగారు సంతృప్తులయ్యారు. మాతమ్ముడు ఇలియాజ్‌నుకూడా శాఖలో చేరమని ప్రోత్సహించారు."

సంఘంమీద ఇదే విశ్వాసం బొంబాయిలోని గులాం దస్తగీర్ తన పిల్లలను సంఘంలో చేర్పించాలని కోరికను వ్యక్తం చేయడానికి కారణం అయింది. సంస్కృతం, అరబ్బీ భాషలలో మహాపండితుడైన ఆయన ప్రస్తుతం విశ్వసంస్కృత ప్రతిష్టాన్‌కు ఉపాధ్యక్షులుగా ఉన్నారు. తమ పిల్లలకు శాఖలో ప్రవేశానికి అనుమతి కల్పించమని, దానివల్ల వారు స్వచ్ఛమైన దేశభక్తి పూరితమైన వాతావరణంలో పెరగడానికి అవకాశం కలుగుతుందని ఆయన నేరుగా శ్రీ బాలాసాహెబ్ దేవరస్‌కే ఉత్తరం వ్రాశారు. "నిరభ్యంతరంగా మీపిల్లలను శాఖకు పంపించండి" అని శ్రీ బాలాసాహెబ్ వారికి సమాధానం వ్రాసారు.

స్వయంసేవకులలో కలుగజేసే ఇతర సంస్కారాలు, సద్గుణాలతో బాటు హైందవేతరుల ఎడల ఈదృష్టికోణం కూడా వారి జీవితంలోని అన్ని అంశాలలోను వ్యక్తమౌతుంది. హమీద్ దల్వాయ్ పుణేకు చెందిన ఒక అభ్యుదయ వాది అయిన ముస్లిం. 'సత్యశోధక మండల్' పేరుతో ఆయన ముస్లింలలోని మూఢ నమ్మకాలకు, పిడివాదాలకు వ్యతిరేకంగా పోరాటానికి సారధ్యం వహించారు. ఫలితంగా తోటిమతస్థుల సామాజిక బహిష్కరణకు ఆయన గురి అయ్యారు. ఆయన కుమార్తె కూడా ముస్లింలలోని బహుభార్యాత్వం, 'తలాక్'లాంటి దురాచారాల ఎడల విముఖతతో ఉంది. సహజంగానే ఆమె ఒక హిందువును వివాహం చేసుకోవాలని సంకల్పించింది. దల్వాయ్ ఒక సమాజవాది(Socialist). అనేకమంది ఆయన మిత్రులు కూడా సమాజవాదులే. కేవలం ఆమె ముస్లిం అయిన కారణంగా ఈఅభ్యుదయవాద యువతిని వివాహం చేసుకోడానికి ఏ సమాజవాదయువకుడు ముందుకురాలేదు. చివరికి ఆమెను వివాహం చేసుకొనడానికి ముందుకు వచ్చిన వాడు మూడుసంవత్సరాల సంఘ శిక్షణ పూర్తి చేసిన ఒక స్వయంసేవక్.

# 7

# శీలం, క్రమశిక్షణలను పెంపొందించేకృషి

హిందూసమాజ పునర్నిర్మాణం, సంఘటనలకై సంఘం రూపొందిం చిన ప్రణాళికలో శీలం, నైతిక విలువల నిర్మాణానికి సర్వోచ్ఛ స్థానం ఇవ్వబడింది. ఈ ఉదాత్త సంస్కారాలు లేకుండా సామాజిక పరివర్తనకు సంబంధించిన మిగిలిన అంగాలైన సామాజిక సమరసత, సామాజిక న్యాయం, జీవన ప్రమాణాల వృద్ధి వంటివి అపరిపక్వంగానే ఉండిపో తాయి. నిజమైన ప్రయోజనాన్ని సాధించడంలో విఫలం అవుతాయి. కనుక సంఘంయొక్క మనుష్య నిర్మాణ ప్రక్రియలో ఈ సంస్కారని ర్మాణంపైనే ప్రధానంగా దృష్టికేంద్రీకరించబడింది.

తమిళనాడులో గతకాలపు హిందూ ధార్మిక పునరుజ్జీవన ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన స్వామి చిద్భవానంద, సంఘశిక్షావర్గలో శిక్షార్థులనుద్దేశించి ప్రసంగిస్తూ ఒకసారి ఇలా అన్నారు: "సంఘంలో మీరు పొందుతున్న ఈవ్యక్తి నిర్మాణ శిక్షణ, సరిగ్గా మనయువకుల కోసం స్వామీవివేకానందులు దర్శించినట్టిదే."

శాఖాతంత్రాన్ని దగ్గరనుండి పరిశీలించే ఎవరికైనా ఏవిధంగా, ఎన్ని పద్ధతులలో శాఖలో ఈ వ్యక్తి నిర్మాణ ప్రక్రియ ఆవిష్కారమౌతుందో అర్థమౌతుంది.

## నైతిక సముద్ధరణ శక్తి:

అది కర్ణాటకలోని బెల్గాంలో ఒక వెనుకబడిన బస్తీ. అక్కడ ఒక స్వయంసేవక్ తనతల్లి, సోదరుడితో కలిసి నివసిస్తున్నాడు. బస్తీలోని పిల్ల లందరూ చినిగిపోయిన, మురికి బట్టలను ధరిస్తూండేవారు. పగటిపూట వాళ్లు భిక్షాటనకు వెళ్ళేవారు. రాత్రిళ్ళు చిన్న చిన్న దొంగతనాలకు పాల్పడుతూ ఉండేవారు. ఈ స్వయంసేవక్ అక్కడ శాఖ ప్రారంభం

చేసిన తరువాత ఈబాలురు కూడా శాఖకు రావడం మొదలు పెట్టారు. స్వయంసేవక్‌కు వారు చేసే పనులన్నీ తెలుసు. కానీ ఎప్పుడూ ఇది చెయ్యి, ఇది చెయ్యవద్దు, అని బోధించేవాడు కాదు. అయితే, చుట్టుప్ర క్కల ప్రజలు నెమ్మదిగా ఒకమార్పును గమనించసాగారు. ఈబాలురు వారి ఇండ్లముందు భిక్షాటనకు రావడం మానివేసారు. దొంగతనాలు కూడా తగ్గిపోయాయి. అదే బాలురు ఇప్పుడు స్వాభిమానంతో తిరగడం ప్రారంభించారు. కారణం చాలా సాధారణమైనది. వారిదృష్టిలో ఈస్వయంసేవక్ 'అగ్రవర్ణాల' బ్రాహ్మణుడు. అతడు బి.ఎ. చదువుతూ కూడా వారితో కలిసి మెలిసి ఆటపాటలలో పాల్గొన్నాడు. వారి గుడిసెల వద్దకు వచ్చాడు. వారు కూడా ఒక సమానత్వ భావనతో అతడి ఇంటికే వెళ్ళసాగారు. ఇదంతా సహజంగానే వారిని తమ దిగజారిన పద్ధతిలో ఆస్వయంసేవక్, ఇతరుల ముందునిలబడడానికి సిగ్గు పడే విధంగా చేసింది.

సమాజంలో బలహీనవర్గాలుగా పరిగణింప బడేవారిలో సైతం నిహితంగా ఉన్న ఆత్మాభిమానమనే నిప్పురవ్వలను రగిలించే ప్రక్రియలోనే వ్యక్తి నిర్మాణ రహస్యం ఉంది. భిక్షాటన, తదితర అల్పబుద్ధి ధోరణులకు అటువంటి జాగరణ ఒక్కటే సరియైన పరిష్కారం.

బొంబాయిలోని ఒక వెనుకబడిన బస్తీలో ఉన్న శాఖ కథ చాలా ఆసక్తికరమైనది. మరొకబస్తీకి చెందిన కార్యకర్త ఒకరు ఆశాఖను ప్రారంభించాడు. శాఖకు వస్తున్న కొందరు పిల్లలు చేస్తుండే పనులు అంతమంచివి కావని కొద్దిరోజులలోనే అతడు గ్రహించాడు. వారిలో కొంతమంది జేబులు కొట్టడంలో సిద్ధహస్తులు! అయితే ఈ కార్యకర్త వాటి గురించి ఒక్కమాట కూడా మాట్లాడలేదు. శాఖలో వివిధ సంస్కార నిర్మాణ కార్యక్రమాలను నిర్వహిస్తూ వచ్చాడు. మిగిలిన సమయాలలో వారితోను, వారికుటుంబసభ్యులతోను సన్నిహిత సంబంధాలు కొనసాగించాడు. కొంతకాలం తరువాత, ఆప్రాంతంలో జేబుదొంగతనాలు పూర్తిగా నిలిచిపోవడం అక్కడి పోలీసు అధికారులకు ఆశ్చర్యం కలిగించింది. 'పాత మిత్రులి'ద్దరిని పట్టుకుని సంగతేమిటని వారు అడిగారు. వారు ఎంతో హుందాగా సమాధానం చెప్పారు: "ఇప్పుడు మేం సంఘ శాఖకు వెళ్తున్నాం. మంచి స్వయంసేవకులం అయ్యాం." పోలీసులకు మరే వివరం అవసరం లేకపోయింది.!

పశ్చిమ బెంగాల్‌లోని మాల్డాలో, ఒకరాత్రి శాఖలో జరిగే వినూత్న

మైన కార్యక్రమాల వల్ల అన్నిరకాల యువకులు విశేషంగా ఆకర్షితులు కాసాగారు. వారిలో చాలామంది పోలీసులకు 'కావలసిన జాబితా'లో ఉన్న సంగతి ఆముఖ్యశిక్షక్‌కు తెలుసు. వారిలో ఒకరు కొన్ని తీవ్ర నేరాలకు పాల్పడినట్లు బలమైన అనుమానాలు కూడా ఉన్నాయి. అతడిని అదుపులోకి తీసుకొనడానికి పోలీసులు అవకాశం కోసం ఎదురుచూస్తున్నారు. దాదాపు ఒక సంవత్సరం తరువాత, ఒకనాడు అతడు నేరుగా పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు. అక్కడ ఉన్న అధికారులతో "నాగురించి మీసమయాన్నీ, శక్తినీ ఇకపై దయచేసి వృధాచేయకండి. ఇప్పుడు నేను సంఘంలో చేరి పూర్తిగా మారిపోయాను. ఆ మహాసంస్థకు అపఖ్యాతి తెచ్చే ఏపనికీ నేను పాల్పడను." అని నిర్మొహమాటంగా చెప్పాడు.

సంఘంవల్ల తనలో వచ్చిన సంపూర్ణమైన పరివర్తన గురించి మహారాష్ట్రలోని నాసిక్ జిల్లా సంఘచాలక్ చెప్పిన విషయాలిలా ఉన్నాయి"ఒక సంచార తెగ అయిన బేల్దార్‌లలో నేను జన్మించాను. రాళ్ళ క్వారీలలో కూలీపని మా కుటుంబవృత్తి. సంఘంలో చేరిన తరువాత మంచి నాణ్యతను కొనసాగించడం , పనిలో సమయపాలనను పాటించడం నాకు అభిరుచిగా మారాయి. ఇతరకూలీలతో, యాజమాన్యంతో సత్సంబంధాలనే డబ్బుకంటే ఎక్కువ విలువైనవిగా పరిగణించసాగాను. మా తెగలలో సర్వ సాధారణమైన అనేక దురలవాట్లనుండి నేను, నాకుటుంబ సభ్యులు దూరంగా ఉండడానికి ఘనత అంతా సంఘం ఇచ్చిన సంస్కారాలకే చెందుతుంది."

"స్వభావరీత్యా నాకు రాజకీయాలలో ఏమాత్రం ఆసక్తిలేదు. అయితే, నంద్‌గాంవ్ పురపాలక సంఘంలో కండబలం సాగిస్తున్న ఆధిపత్యానికి అంతం పలుకడం నాకర్తవ్యంగా నేను భావించాను. కౌన్సిలర్‌గా పోటీ చేసి గెలుపొందాను. ఎన్నికల సమయంలో ఎటువంటి అక్రమ పద్ధతులకు నేను పాల్పడలేదు. ప్రత్యర్థిని కూడా పాల్పడనీయలేదు. ముస్లింల ఓట్లను నానుండి దూరం చేయాలన్న అతడి ప్రయత్నాలు విఫలం అయ్యాయి. కారణం చాలా సాధారణమైనది. వారి ఎడల నేను ప్రదర్శించిన నిజమైన ప్రేమ కారణంగా ముస్లింలకు నాపైన అమితమైన విశ్వాసం ఏర్పడింది. ఈగుణం కూడా నాలోసంఘం నింపినదే.

సంఘం బ్రాహ్మణుల వ్యవహారమని కొందరు సమాజవాదులు(Socialists) నాకు చెప్పబోయినప్పుడు నేను నవ్వానంతే. ఇప్పుడు వారికే బాగా తెలుసు. నా దేశదిమ్మరి సోదరుల దీనావస్థను చూసి, వారి జీవితాలలో

స్థిరత్వాన్ని సాధించే దిశలోనే నా ప్రయత్నాలన్నింటినీ కేంద్రీకరించాను. విద్యయొక్క ప్రాముఖ్యతను వారికి తెలియజేసే ప్రయత్నంలో నేను విజయం సాధించాను. నాలో ఈమార్పులన్నింటికీ కారణభూతమైన సంఘానికి కృతజ్ఞతలు తెలుపడానికి నావద్ద మాటలు చాలవు."

## సంఘర్షణలు, దురలవాట్లను దూరం చేయడం:

దేశంమొత్తంలోని మన గ్రామాలలో కులాలు, వర్గాలు, వ్యక్తుల మధ్య గ్రామీణ జీవితానికి ఒక అభిశాపంలా అనాదికాలంగా వస్తున్న శత్రుత్వాలు, ఘర్షణలు శాఖలవల్ల పరిష్కారమైన ఉదాహరణలు కూడా కోకొల్లలు.

విదర్భలో సాత్పూరా పర్వతాల ఒడిలో ఒదిగి ఉండే బుల్ఢానా జిల్లాలోని పెసోడా అనే గ్రామజనాభా కేవలం 1,300. ప్రకృతి మాత అందించిన సమృద్ధికి నిలయం ఆప్రాంతం. కానీ అందుకు పూర్తి విరుద్ధంగా అక్కడి ప్రజలు మాత్రం అన్నిరకాలుగా వెనుకబడినవారు, అజ్ఞానులు. త్రాగుడు లాంటి ఇతర దురలవాట్లు చాలా ఎక్కువ. చిన్నచిన్న తగాదాలు పెద్దపెద్ద కొట్లాటలకు దారితీసేవి. ఒక్కొక్కసారి హత్యలు కూడా జరిగేవి. త్రాగేనీరు భౌతికావసరాలకు కూడా చాలా కొరత ఉండేది. పేదరికం గుప్పెట్లో ఉండేదాగ్రామం.

అయితే, అక్కడ ప్రారంభమైన శాఖ వాటన్నింటినీ సవాలు చేసింది. కొట్లాటల స్థానంలో పరస్పరసహకార ధోరణి చోటు చేసుకుంది. ధార్మిక కార్యక్రమాలు, సామాజిక ఉత్సవాలు ఆగ్రామజీవనానికి ఒక పవిత్రతను, శోభను ప్రసాదించాయి. అంటరానితనం, కులతత్వం అదృశ్యం అయ్యాయి. సమాజజీవితంలో మత్తుపదార్థాలకు స్థానం లేకుండా పోయింది. ఎన్నికల సమయంలో కూడా పరస్పర వైషమ్యాలు, దురభిప్రాయాల భూతం ప్రజలను భయభ్రాంతులను చేయడం మానివేసింది. పరస్పర వివాదాలన్నింటినీ గ్రామపెద్దలే పరిష్కరిస్తారు. ఏకొద్దిమందో మాత్రమే న్యాయస్థానాలకు వెళ్తుంటారు. గ్రామయువకులు తమగ్రామానికి కనీస భౌతికావసరాలను తీసుకువచ్చే కృషిలో నిమగ్నులై ఉన్నారు. విద్యుచ్ఛక్తి వచ్చిన కారణంగా ఎత్తిపోతల వ్యవసాయం (Lift Irrigation) వారు ప్రారంభించారు. వారిపొలాలు పైర్లతో కళకళలాడసాగాయి.

ఇప్పుడు పెసోడా యాత్ర అంటే ఒక ఆహ్లాదకరమైన అనుభవం. కేవలం దాని ప్రకృతి సౌందర్యం దృష్ట్యా మాత్రమేకాదు. సంఘసంస్కారాల వల్ల గ్రామీణ జీవితంలో ప్రవేశించిన సామాజిక అవగాహన దృష్ట్యా కూడా.

రాజస్థాన్‌లోని కోట జిల్లాలో గల కేశవపుర, సహ్రోద్, జెరోద్ గ్రామాల ఉదాహరణలు కూడా ఇలాంటివే. శాఖప్రారంభించిన కొద్ది సంవత్సరాలలోనే, ఏవో ఒకటి రెండు కుటుంబాలు మినహా మిగిలిన అందరూ త్రాగుడు, జూదం, గంజాయి వంటివి విసర్జించారు. ఫలితంగా ఏర్పడ్డ మంచి వాతావరణం గ్రామజీవితంలో అనేక నిర్మాణాత్మక కార్యక్రమాలకు ఆస్కారం కల్పించింది. తమ నిత్యకృత్యాలలో మునిగి ఉన్నప్పుడు గ్రామంలోని మహిళలు కూడా శాఖలో తమపిల్లలకు నేర్పిం చిన దేశభక్తి పాటలనే పాడుతూ ఉంటారు. ఆంధ్రప్రదేశ్‌లోని దీనదయాళ్ పురం గ్రామం కేంద్రంగా గ్రామీణ వికాసానికి చేస్తున్న కృషిలో భాగంగా 5గ్రామాల్లో త్రాగుడు మాన్పించే ప్రయత్నంలో సంఘకార్యకర్తలు కృతకృత్యులయ్యారు. సారాకాంట్రాక్టర్లు అనేకరకాలుగా వత్తిడి తెచ్చినా గ్రామస్తులు లొంగి రాలేదు. తమ వ్యాపారం కొనసాగ నిస్తే గ్రామఅవసరాలకు విరాళాలు ఇస్తామని సారావ్యాపారులు ముందుకు వచ్చినపుడు గ్రామ మహిళలే గట్టిగా సమాధానం చెప్పి వారిని వెనక్కి పంపించి వేశారు.

## సేవద్వారా శీల నిర్మాణం:

స్వయంసేవకులు నిర్వహించే వివిధ సేవాకార్యక్రమాలద్వారా సమాజంలో అనేక రకాలుగా పరివర్తన జరుగుతోంది. స్వయంసేకుల దృష్టిలో కేవలం భౌతికావసరాలను తీర్చడం మాత్రమే సేవకాదు. అయితే, ఆదృష్టితో కూడా అనేక పథకాలు నిర్వహిస్తున్నారనుకోండి! ఉదాహరణకు, ఢిల్లీలో సేవాభారతి బాల్వాడీలు, బాలసంస్కార కేంద్రాలు, కుట్టుపని తరగతులు, బోధనాకేంద్రాలు, ఆరోగ్యకేంద్రాలు, రాత్రి పాఠశాలలు, కీర్తనమండలులు, పఠనాలయాలు, ఒక వసతిగృహం మొదలైన 200 ప్రకల్పాలను నిర్వహిస్తోంది. మొత్తం మీద 75 మురికి వాడలలో ఈకార్యక్రమాలు జరుగుతున్నాయి. అయితే ఈవిషయంలో సేవాభారతి సాధించిన విజయాల విశిష్టత మరొక విషయంలో ఉంది. నమూనాగా ఈక్రింది ఉదాహరణలను చెప్పుకోవచ్చు.

మురికివాడలలో నివసించే వారిలో ఎక్కువ ఉపేక్షకు గురయ్యే వారు అక్కడి పిల్లలు. వారు ప్రత్యక్షంగా రోడ్లమీదే పెరుగుతూ ఉంటారు. ఒక సంఘప్రచారక్ ఆపిల్లలతోనే తనపనిని ప్రారంభం చేసారు. బాలసంస్కార కేంద్రాలను, బాల్వాడీలను ప్రారంభించినపుడు వారితల్లితండ్రులు పెద్దగా పట్టించుకోలేదు. అయితే పిల్లలు ఉదయాన్నే

వారి పాదాలను స్పృశించడం ప్రారంభించేసరికి వారికి ఆశ్చర్యం కలిగింది. ఇదంతా ఏమిటో వారికి అర్థం కాలేదు. కొంతమంది తమపిల్లలను కోప్పడ్డారు కూడా. "ఏమిటి ఇదంతా మీరుకొత్తగా నేర్చుకున్నది? ఇవన్నీ చెయ్యమని మీకెవరు చెప్పారు?'. పిల్లలు గర్వంగా సమాధానం చెప్పారు. "మా ఉపాధ్యాయుడు. తల్లితండ్రులే మనకు మొదటి దేవుళ్ళని ఆయన మాకు చెప్పారు. ఉదయాన్నే నిద్ర లేవగానే వారికి ప్రణామాలర్పించాలని కూడా చెప్పారు." ఈసమాధానం తల్లితండ్రులను అయోమయంలో పడవేసింది. తమ పిల్లల దృష్టిలో భగవంతుడిగా చూడబడుతున్న తమలో త్రాగుడులాంటి దురలవాట్లు ఉన్నందుకు వారు సిగ్గుపడసాగారు. ఫలితంగా, వారిలో చాలామంది ఇండ్లలో త్రాగడం మానివేసారు. ముఖ్యంగా పిల్లల ముందు అసలే లేదు. వారి అంతరాత్మ జాగృతం అయింది.

ఒకసారి బాలసంస్కారకేంద్రానికి హాజరైన ఒక బాలుడు ఇంటికి తిరిగి వెళ్ళడానికి నిరాకరించాడు. తనతండ్రి తాగి వచ్చి, తప్పుడు మాటలు మాట్లాడడం, తరచు తల్లిని కొడుతూ ఉండడం తాను గాసి సహించలేకపోతున్నానని అతడు ఉపాధ్యాయునితో చెప్పాడు. ఆ అసహ్యమైన వాసననేను ఒక్కక్షణం కూడా భరించలేను. అందుకే క ఇంటిలో అడుగుపెట్టనని మాఅమ్మకు చెప్పి వచ్చేసాను." అని అతను చెప్పాడు. చివరికి అతని తండ్రి స్వయంగా వచ్చి, పశ్చాత్తాపాన్ని ప్రకటించి, నెమ్మదిగా త్రాగుడు మానివేస్తానని తనకుమారునికి హామీ ఇచ్చిన తరువాతనే అతడు ఇంటికి వెళ్ళడానికి అంగీకరించాడు. అయితే, మరునాటి ఉదయం యథాప్రకారం తనతండ్రి పాదాలను స్పృశించడం మాత్రం ఆకుమారుడు మరువలేదు!

కేంద్రాలలో గాయత్రి మంత్ర జపం ప్రారంభమైంది. పిల్లలు ఇంటికి వెళ్ళి దానిని వినిపించేవారు. తల్లితండ్రులకు అసలు అదేమిటో కూడా తెలియదు. కానీ తెలుసుకున్న తరువాత మాత్రం వారి ఆశ్చర్యానికి, ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. "ఏమిటీ?" వారు ఆనందంతో అరిచారు. "ఇంతకాలం బ్రాహ్మణులకు మాత్రమే పరిమితమైన గుత్తాధిపత్యంగా ఉండిన ఆ పవిత్ర మంత్రాన్ని మాపిల్లలకు నేర్పించారా! మీసేవాభారతి ఉపాధ్యాయులు ఎంత అద్భుతమైనవారు!"

స్థానిక నగర పాలక సంస్థ పాఠశాలలో చదువుతున్న ఆవెనుకబడిన బస్తీల పిల్లలు నెమ్మదిగా చదువులో ఎక్కువ ఆసక్తి చూపడం ప్రారం

భించారు. వారు వ్రాసే అంకెలు, పదాలు స్పష్టంగా చదువడానికి వీలుగా తయారయ్యాయి. తరగతి పరీక్షలలో వారి స్థాయి కూడా బాగాపెరిగింది. చివరికి ఆబాలుర సాధారణ ప్రవర్తనకూడా వినమ్రంగాను, విశుద్ధంగాను రూపొందింది. మొదట్లో ఆపాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయులకు కూడా ఈమార్పు ఎలా సంభవించిందో అర్థంకాలేదు. ఆపాఠశాలలో ఉత్తీర్ణత శాతం కూడా పెరిగింది. కొందరు బాలురు ప్రథమశ్రేణిని కూడా సంపాదించసాగారు. అలాంటి విషయం ఆపాఠశాలలో అంతకుముందెన్నడూ వినిఉండలేదు.

అలాంటి ఒక ప్రథమశ్రేణి విద్యార్థి, తన ఇంటిలో ఒక విచిత్రమైన అనుభవాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. తన ఉత్తీర్ణతను తెలియజేస్తూ ఆ బాలుడు తన మార్కుల జాబితాను సగర్వంగా తండ్రికి చూపించాడు. తండ్రి ఆగ్రహోదగ్రుడయ్యాడు. "కబుర్లు చెప్పకు. నీ సంగతి నాకు తెలుసు. అబద్ధాలు చెప్పి నీ మందబుద్ధిని మరింత పెంచుకోకు" అన్నాడు. బాలుడిని బాగా కొట్టాడు కూడా. మరుసటిరోజు నిజం తెలుసుకొనడానికి పాఠశాలకు వెళ్ళాడు. ఆ బాలుడికిఉపాధ్యాయుడు హృదయపూర్వక అభినందనలు తెలియజేసాడు. ఆబాలుడి నిజాయితీ గురించి తండ్రికి భరోసా ఇచ్చాడు. ఆనందంతోను, పశ్చాత్తాపంతోను కూడా కన్నీళ్ళుకార్చడం ఇప్పుడు తండ్రివంతయింది.

ఒకసారి సంస్కారకేంద్రానికి చెందిన ఒక బాలుడికి జబ్బు చేసింది. ఆసుపత్రిలో చేర్పించారు. అతడి పరిస్థితి గురించి విచారించడానికి వెళ్ళిన ఉపాధ్యాయునితో అక్కడి వైద్యుడు, నర్సు ఆబాలుని సత్ప్రవర్తన, ఇతరరోగుల గురించిన ఆవేదనల పట్ల ప్రశంసలను కురిపించారు. "అతడు ఆత్మీయతతో, అనురాగంతో ఇతరులతో కలిసిపోతాడు. తన స్వంత అనారోగ్యం కంటే ఇతరులగురించే అతడికి చింత ఎక్కువ. తాను వారికి ఎంత చిన్నసహాయం చేయగలిగినా అంత చేస్తాడు. మీకు ఈ బాలుడికి ఏం సంబంధం?" అని వైద్యుడు ఉపాధ్యాయుని అడిగాడు. సేవాభారతి భంగీకాలనీలో నిర్వహిస్తున్న సంస్కారకేంద్రానికి ఈబాలుడు వస్తూంటాడని ఉపాధ్యాయుడు చెప్పాడు. వైద్యుడు ఆశ్చర్యపోయాడు. "నిజమా! ఈ పిల్లలలో ఇంతపరివర్తన తీసుకురాగలిగినంత సమర్థవంతమైనదా మీసేవాభారతి?"

అక్కడి ప్రజల ఆకాంక్షలను దృష్టిలో పెట్టుకుని హరిజనబస్తీ మధ్యలో ఒక వాల్మీకి మందిరం, హనుమాన్ మందిరం నిర్మించారు. "మా

జీవితాలలో మొట్టమొదటిసారిగా స్వయంగా మేమే పూజచేసే అవకాశం లభించింది" అని ఆనందం ప్రకటించారు వారు.

1988 మార్చినాటికి సేవాభారతి యొక్క 252 ప్రకల్పాలలో కలిపి మొత్తం పాల్గొన్న వారి సంఖ్య 1,06,763.

## సామాజిక ప్రతిష్ఠాభావన నింపడం

ఉత్తరప్రదేశ్‌లోని ఆగ్రాలో మురికివాడలలో గతకొద్దిసం||లుగా సేవా భారతి కార్యకర్తలకు లభించిన అపూర్వప్రతిస్పందన వారు కలలోకూడా ఊహించలేదు. బాలలకు సంస్కారకేంద్రాల రూపంలో పని ప్రారంభమైంది. ఆ వాడలలో మొట్టమొదటిగా తీసుకున్న కార్యక్రమం వివేకానంద జయంతి. ఆగ్రామమొత్తంలో గల కేంద్రాల బాలలతోబాటు, వారితల్లితండ్రులు, ఉపాధ్యాయులు, సేవాభారతి పరివారం మొత్తం ఆ కార్యక్రమంలో కలిసారు. యజ్ఞం, హోమం, హవనాల తర్వాత ఆటలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. అనంతరంసామూహిక భోజనాలలో అందరూ పాల్గొన్నారు.

ఈ సంప్రదాయం కొనసాగింది. ప్రతికార్యక్రమంలోను వైద్యులు, ఇంజనీర్లు, న్యాయవాదులు, ప్రాధ్యాపకులు (professers), వ్యాపారవేత్తలు, ఇతరపెద్దలు పాల్గొనేవారు. ఆ మురికివాడలలో నివసించే ప్రజానీకం చేతుల మీదుగా భుజించడం వారందరికీ ఒక సరికొత్త అనుభవం.

మానసిక అంతరాలను కూల్చివేసే ఈకృషిని ఆ తర్వాత ఇండ్లలోకి తీసుకుని వెళ్ళారు. సంస్కారకేంద్రాలకు చెందిన పిల్లలను బృందాలుగా చేసి, ఇతర బస్తీలలోని ఇండ్లకు భోజనానికి పంపించే వారు. ఈ పిల్లలు వెళ్ళి ఆ ఇండ్లలోని తల్లుల పాదాలు స్పృశించినపుడు, వారు అమితానంద భరితులయ్యేవారు. వారికి తమ ప్రేమపూర్వక ఆశీస్సులను అందించేవారు. పిల్లలకు కడుపునిండా భోజనం పెట్టడమే కాదు, ఆ కుటుంబసభ్యులు కూడా వారితో బాటు కలిసి కూర్చుని భోజనం చేసేవారు.

కేంద్రాలకు చెందిన 50 బాలుర మధురసైకిల్ యాత్ర వారికి ఒక చిరస్మరణీయమైన అనుభవం అయింది. వివిధ దేవాలయాలలో దర్శనం పూర్తి చేసుకున్న తరువాత, ఆబాలురు సంత్ ప్రభుదత్త బ్రహ్మచారిజీ, రమణరేతి ఆశ్రమ మహామండలేశ్వరుల ఆశీస్సులను కూడా అందుకు న్నారు. ఆ మహా ఆచార్యుల చేతుల మీదుగా ప్రసాదాన్ని అందుకున్నప్పుడు

ఆ బాలురు పొందిన ఆనందం, పవిత్రభావనలను వర్ణించడానికి మాటలు చాలవు.

తిరుగు ప్రయాణంలో, వారు అగయిగావ్ అనేగ్రామం చేరుకున్నారు. ఈ క్రొత్త యువకుల మొహాలు చూడగానే ఒక వృద్ధుడైన పెద్దమనిషి, 'ఎవరుమీరు?' అని ప్రశ్నించాడు. "మేం హిందువులం. ఆగ్రానుండి మధురకు తీర్థయాత్రగావెళ్ళి తిరిగివెళ్తున్నాం" అని ఆ బాలురు సమాధానం ఇచ్చారు. "మీరు హిందువులు సరే! మీదేకులం?" అని ఆ వృద్ధుడు రెట్టించాడు. ఆ బాలురుకూడా తక్కువ తినలేదు. "మాకు తెలిసినది ఒకటే కులం. అది హిందూ" అని సమాధానం ఇచ్చారు. ఈ సమాధానానికి ఆ వృద్ధుడు ఎంత ప్రభావితుడయ్యాడంటే, వారందరినీ తన ఇంటికి ఆహ్వానించి , పెరుగుతో భోజనం పెట్టాడు.

ఆగ్రాసమీపంలో 3,4వేల జనాభా ఉండే 'నైరాయిచ్' అనే గ్రామం ఉంది. అనేక సంవత్సరాలుగా ఆ గ్రామంలో హోమం, హవనం, కథ, భజనలాంటి ధార్మిక కార్యక్రమాలేవీ జరుగటం లేదు. సేవాభారతి ప్రవేశంతో గ్రామస్తులు హవన్ నిర్వహించడానికి ముందుకు వచ్చారు. అనంతరం వి.సి.ఆర్.పై రామాయణాన్ని ప్రదర్శించారు. ఇప్పుడు ధార్మిక భావనలతోను, సామూహిక జీవనంతోను ఆ గ్రామ జీవితం చైతన్యవంతంగా రూపొందింది.

గణాంక వివరాలకువస్తే, సేవాభారతి పనిప్రారంభించిన కేవలం $2\frac{1}{2}$సం.ల కాలంలోనే సాధించిన వేగమైన ప్రగతి కళ్ళకు కట్టినట్లు కన బడుతుంది. ఆగ్రాపట్టణంలో మొత్తం మీద 200 మురికివాడలున్నాయి. వాటిలో ఇప్పటి వరకు 50 వాడలు సేవాభారతి సంపర్కంలోకి వచ్చాయి. 25 వాడలలో సంస్కారకేంద్రాలు ప్రారంభమయ్యాయి. వాటిలో దాదాపు వెయ్యిమంది పిల్లలు పాల్గొంటున్నారు. 30 వాడలలో దాదాపు 100 కార్యక్రమాలు ఇప్పటి వరకు నిర్వహించారు. సంస్కారకేంద్రాలను నిర్వ హించే బాధ్యతను 26 మంది ఉపాధ్యాయులు తమ భుజస్కంధాలపై వేసుకున్నారు.

## ముందుకు దూకిన మాతృశక్తి:

రాష్ట్రస్య సుదృఢాశక్తిః సమాజస్యచ ధారిణీ
భారతే సంస్కృతే నారీ మాతానారాయణీ సదా||

"భారతీయనారీత్వం సుదృఢంచేసే, సంరక్షించే, వెలుగుచూ

సముద్ధరించే శక్తి కేంద్రం - మాతృదేవతగా జాతిని ఎల్లప్పుడు అది పెంచి పోషిస్తూ ఉంటుంది."

భారతీయ దృష్టికోణంలో స్త్రీ పాత్రను ఈ శ్లోకం సంక్షిప్తంలో మనముందు ఉంచుతుంది.

1936లో వార్ధాలో రాష్ట్ర సేవికాసమితి ప్రారంభమైంది. అటువంటి పాత్రను పోషించే విధంగా హిందూ స్త్రీలకు ప్రేరణనిచ్చేందుకు, వారిని తీర్చి దిద్దేందుకు డా. హెడ్గెవార్ ఆశీస్సులతో శ్రీమతి లక్ష్మీబాయి కేల్కర్ (మౌసీజీ అని ఆత్మీయంగా పిలువబడుతూ ఉంటారు) ఆ సంస్థను ప్రారంభించారు. సమితి శాఖలలో స్వయంసేవకుల కుటుంబాలలోని మహిళలే మొదటి జట్టు సేవికలు అయ్యారన్నది స్వాభావికమైన విషయం. ఇప్పటివరకు సమితి తన కార్యకలాపాలను 16 రాష్ట్రాలలో విస్తరింపజేసింది. విదేశాలకు వెళ్ళిన సేవికలు ఇంగ్లాండ్ వంటి దేశాలలో కూడా హిందూస్త్రీలను సంఘటిత పరచడం ప్రారంభించారు.

బహిరంగ స్థలాలలో కలుసుకుని చురుకైన శారీరికవ్యాయామం చేయడం, దానితో బాటు తమ బౌద్ధిక, మానసిక వికాసం కోసం కార్యక్రమాలు నిర్వహించడం ద్వారా సేవికలు ఇక తాము 'అబలలం' ఏమాత్రం కామని, సంఘటిత స్త్రీశక్తి ద్వారా విజ్ఞానరోచిస్సులు వెదజల్లి, సమాజసముద్ధరణను సాధించడానికే తాము ఉన్నామని నిరూపిస్తున్నారు.

సమితి దైనందిన శిక్షణద్వారా పెంపొందే విశుద్ధమైన శీలాన్ని ప్రస్ఫుటం చేసే కొన్ని సంఘటనలు ఇవి.

1975-77 అత్యవసర పరిస్థితి రోజులలో పుణేలోని ప్రస్తుత సమితి సంచాలిక అయిన తాయి ఆప్టే గృహం నిర్బంధితులైన స్వయంసేవకుల కుటుంబాలకు ఓదార్పునిచ్చే కేంద్రంగా ఉండేది. నిర్బందిత బంధువులను కలువడానికి జైలు ద్వారాల వద్దకు వెళ్ళే వారి పిల్లలను ఆమె అమ్మమ్మవలే శ్రద్ధగా చూస్తుండేవారు. అత్యవసర పరిస్థితి కాలమంతా ఇదినడిచింది.

సమితి ఉజ్జయిని శాఖ ఒక ఉపన్యాసాల శృంఖలను ఏర్పాటు చేసింది. ఒక ప్రఖ్యాత సాహితీవేత్తను వారు ఆహ్వానించారు. ఆయన త్రాగుడుకు అలవాటు పడినవాడు. కనుక సాధారణంగా హోటళ్ళలో ఉండడానికే ఇష్టపడతాడు. కానీ ఉజ్జయినిలో ఆయన వసతి ఒక సమితి కార్యకర్త ఇంటిలో ఏర్పాటు చేసారు. దినమంతా ఆయన తలుపులు బిగించుకుని కూర్చునే వాడు. నెమ్మదిగా ఆ ఇంటిలోని పవిత్ర వాతావరణం అతడిపై

ప్రభావం చూపసాగింది. కొద్దిరోజుల తరువాత, తనకాతిథ్యమిచ్చిన ఆమెను ఆయన అడిగాడు. "ప్రాతఃస్మరణ, ఆరతి సమయాలలో నేను కూడా మీకుటుంబసభ్యులతో కలువవచ్చా?" మరుసటిరోజు ఆ పవిత్ర పఠనంలో పాల్గొన్న తరువాత ఆయన చెప్పాడు. "సోదరీ! జీవితంలో నిజమైన శాంతి, ఆనందం ఏమిటో ఈరోజే నేను గ్రహించాను. ఈ రోజంతా ఒక్కసారి కూడానేను మత్తుపదార్థాలను ముట్టలేదు. ప్రతిఒక్కరు నన్ను త్రాగుబోతుగానే చూస్తారు. కానీ మీరు ఒక్కమాట కూడా మాట్లాడకుండానే నన్ను ఆ బురదలోనుండి బైటకు లాగడంలో విజయం సాధించారు. నా జీవితంలో ఎప్పుడూ దీనిని మరిచిపోను."

జబల్‌పూర్‌కు చెందిన ఒక సమర్పిత సేవిక, ఒక నిష్ఠావంతుడైన స్వయంసేవక్‌ను వివాహం చేసుకుంది. తన సర్దుబాటు స్వభావం ద్వారాను, దైనందిన కుటుంబ వ్యవహారాలను సమర్థంగా నిర్వహించడంద్వారాను ఆమె తన భర్త పనిని మరింత సులభతరం చేసింది. అంతే కాక, తాను సమితి పని చేయడానికి కూడా కొంత సమయం కేటాయించగలిగింది. ఆ తర్వాత కొంతకాలానికి, తమ ఇద్దరు కుమారులు ప్రచారకులుగా వెళ్ళాలని నిర్ణయించుకున్నప్పుడు తల్లితండ్రులిద్దరు వారిని ప్రోత్సహించి, ఆశీర్వదించి పంపించారు.

ఒక రక్షాబంధన్ దినాన రాష్ట్రసేవికాసమితి, షోలాపూర్ జిల్లా ప్రముఖ్ జిల్లా కలెక్టర్‌ను కలిసి అయన చేతికి రక్షకట్టారు. సంప్రదాయ పద్ధతిననుసరించి అతడు కొంతధనాన్ని ఆమె చేతిలో ఉంచాడు. కానీ ఆమె దానిని తిరస్కరిస్తూ ఇలా అన్నారు. "మీ హోదాకు తగ్గరీతిలో మీరు సహాయం చేస్తే సంతోషిస్తాను". కొద్దిగా ఆశ్చర్యపడి కలెక్టర్ అడిగాడు. "మీ బంధువులెవరికైనా ఉద్యోగం కావాలా?" "లేదు. లేదు. అలాంటిదేమీలేదు. బట్టల దుకాణాల వారు స్త్రీల లోపలి వస్త్రాలను ప్రదర్శించే తీరు స్త్రీత్వం యొక్క మర్యాదను కించపరచే విధంగా ఉంది. అదినాకు బాధకలిగిస్తున్నది. అది చాలా భయావహమైనస్థితి. దానిగురించి దయజేసి ఏదైనా చర్యతీసుకోండి". ఏవిధమైన వ్యక్తిగతప్రయోజనం లేని ఒక విజ్ఞప్తిని అందుకోవడం కలెక్టర్‌కు అదే మొదటిసారి. తన అధికారపరిమితులకు లోబడి తాను చేయగలిగినది చేస్తానని ఆయన హామీఇచ్చారు.

1971 బాంగ్లాదేశ్ యుద్ధసమయంలో సైనిక అధికారుల సతీమణుల సంఘం నుండి నాగపూర్‌లోని సమితి కార్యాలయానికి ఫోన్ వచ్చింది.

మరునాటి ఉదయం నాగపూర్ రైల్వే స్టేషన్‌లో సైనికులకు అల్పాహారాన్ని అందించే బాధ్యతను స్వీకరించమని వారు సమితిని అభ్యర్థించారు. అప్పటికి రాత్రి 8.30గం. అయింది. అయినప్పటికీ నగరంలోని మిగిలిన అన్నిమహిళా సంస్థల కంటే సమితి మాత్రమే అటువంటి అత్యవసర పరిస్థితులను సమర్థంగా స్వీకరించగలదని, ఎందుకంటే సమితికార్యకర్తలు ఎంతో క్రమశిక్షణ కలిగినవారు, దేశభక్తులు అని ఆ సంఘం కార్యదర్శిని విశ్వాసాన్ని వ్యక్తపరిచారు. నాగపూరు సేవికలు తమ చురుకుదనాన్ని ప్రదర్శించారు. మరునాటి ఉదయం అనుకున్న సమయానికి ఆ వీర సైనికులకు ఆహారాన్ని అందించారు.

## అన్యాయాలను ఎదిరించడంలో:

భారతీయ సంస్కృతిని అపఖ్యాతిపాలు చేసే ఎటువంటి సంఘటనలు తమ దృష్టికి వచ్చినా సమితి కార్యకర్తలు వాటిని ఎదుర్కొనడంలో ఎప్పుడూ వెనుకకు తగ్గలేదు. విదేశాలలో ప్రచురితమైన 'రెడ్‌ఫ్లోస్ ది గాంజెస్' (Redflows the Ganges) అనే పుస్తకంలో ఝాన్సీరాణి లక్ష్మీబాయిని అనుచితమైనరీతిలో వర్ణించారు. ఈ సాంస్కృతిక అత్యాచారం ఎడల సమితి నిరసనను తెలియజేస్తూ మౌసీజీ ఒకప్రతినిధి బృందంతో కేంద్ర ప్రభుత్వం వద్దకు వెళ్ళి ఆ పుస్తకాన్ని నిషేధించాలని కోరారు. భారతీయ మహిళల మనోభావాలను గుర్తించిన ప్రభుత్వం వెంటనే 1977లో ఆ పుస్తకాన్ని నిషేధించింది.

దేశవిభజనకు బలిపశువు అయిన జమ్మూకు చెందిన ఒక హిందూయువతి ముస్లింల చేతులలో పడి, వారిలో ఒకరిని వివాహం చేసుకుంది. కానీ ఆమెలోని హిందూత్వపు అగ్ని శిఖలు చల్లారిపోలేదు. సుదీర్ఘకాలం ఓపికతో ఆమె వేచి ఉంది. చివరికి తన ఇద్దరు కుమార్తెల వివాహ సమయం వచ్చినపుడు వారిని హిందూ యువకులకే ఇచ్చి వివాహంచేస్తానని, తాను కూడా తిరిగి హిందూత్వాన్ని స్వీకరిస్తానని ఆమె దృఢంగా ప్రకటించింది. సమితి, సంఘ కార్యకర్తలు ఆ స్త్రీల పునరాగమనానికి ఏర్పాట్లు చేయడం మాత్రమేగాక, ఆ యువతులకు తగిన వరులను వెదికే బాధ్యతను కూడా తమ భుజాలపై వేసుకున్నారు. ఇప్పుడు ఆ తల్లి, ఇద్దరు కుమార్తెలు... ముగ్గురు మంచి సమితి కార్యకర్తలు.

1940ల మధ్యకాలంలో జమ్మూ ప్రాంతంలో ప్రారంభమైన సమితి, 1951-53 మధ్య ప్రజాపరిషత్ జరిపిన రాజకీయ పోరాటంలోని

మహిళావిభాగంలో పోరాట బృందంగా రూపొందింది. ఉద్యమపు రహస్య వార్తాప్రసార మార్గాల యోజనను సేవికలు నిర్వహించారు. ముఖ్యంగా ఊరేగింపులు, ప్రదర్శనలు, నిరాహారదీక్షలు, ఆఖరికి స్వచ్ఛంద అరెస్టులకు సైతం స్త్రీలను ప్రోత్సహించే పనిని వారు చేపట్టారు. వారిలోని కొందరు ఉగ్ర ఉపన్యాసకారిణులు ఆ క్లిష్టమైన రోజులలో ప్రజలను కదిలించినంతగా చాలాకొద్దిమందే చేయగలిగేవారు.

## కార్మికులలో కర్తవ్యభావన పెంపొందించే కృషి:

కార్మికరంగంలో కూడా స్వయంసేవకుల సహకార, కర్తవ్యభావనలు తరచు ప్రకటితమౌతూనే ఉంటాయి. మజ్దూర్‌సంఘ్ కార్మికసంఘాల సహకారం కారణంగా యాజమాన్యం సమస్యల నుండి బైటపడి, పరిశ్రమలను సమర్థంగా నడిపించిన ఉదాహరణలు అనేకం. రాజస్థాన్‌లో రోడ్డురవాణా సంస్థ ఎప్పుడూ సమస్యలతో మండుతూ ఉండేది. ఎ.ఐ.టి.యు.సి. సంఘం నాయకత్వంలో తరచు జరిగే కార్మికుల సమ్మెలు, అధికారుల అవినీతి, ఇతరవిషయాలు కలిపి సంస్థకు విపరీతమైన నష్టం తెచ్చి పెట్టాయి. ఉద్యోగస్తులలో మజ్దూర్‌సంఘ్ కార్మికసంఘం స్థిరపడిన తరువాత కార్మికులలో వృత్తి ధర్మాన్ని పాటించే భావనను జాగృతం చేయడంలో కృతకృత్యం అయింది. తనసేవలను సమర్థవంతంగా నడిపించడంలోను, అవినీతిని అరికట్టడంలోను అధికారులకు ఎంతో సహాయపడింది. ఫలితంగా మూడు సంవత్సరాలలో సంస్థ లాభాలు సంపాదించడం మొదలుపెట్టింది. 1986లో మొట్టమొదటిసారిగా, నిర్బంధకనీస బోనస్ కంటే కొంత ఎక్కువగా.. అంటే 10 శాతం బోనస్ ఉద్యోగులకు లభించింది.

పునే సమీపంలో అర్లాబ్ లిమిటెడ్ అనే రసాయనాల కర్మాగారం ఉంది. అక్కడ రెండు కార్మిక సంఘాలు ఉన్నాయి. వాటిలో ఒకటి మజ్దూర్ సంఘ్‌కు అనుబంధమైనది. ఒక విదేశం తన సరకుల కొనుగోలును హటాత్తుగా ఉపసంహరించుకోవడంతో కర్మాగారానికి పెద్ద ఎత్తున నష్టం వచ్చింది. కర్మాగారం నడవాలంటే వేతనస్తంభన (Wage Freeze) కు కూడా అంగీకరించవలసివచ్చింది. ఆ తరువాత రెండవ సంఘం నిష్క్రియంగా మారింది. మజ్దూర్ సంఘ్, యాజమాన్యం కలిసి కర్మాగారాన్ని తిరిగి దారిలోనికి తెచ్చారు. త్వరలోనే కర్మాగారం లాభాలు సంపాదించడం ప్రారంభించింది. ఇవాళ, ఆ కర్మాగారం

విస్తరణకు పథకాలు వేస్తోంది. కొత్త కార్మికులను నియమించుకుంటోంది.

వృత్తి ధర్మంపై నిష్ఠను ప్రకటిస్తున్న పద్ధతిలోనే మజ్దూర్ సంఘ్ ఉత్పాదనలోగానీ, మరే ఇతర కర్మాగార సేవలలోగానీ ఉత్తమ నిర్వహణాస్థాయిని ప్రోత్సహిస్తుంది. ఈ దిశలో కొన్ని కార్మిక సంఘాలు ఉత్తమంగా పనిచేసిన వారికి గుర్తింపుగా విజయస్మారికలు (Trophy) , పురస్కారాలు ప్రకటించాయికూడా. హరిద్వార్‌లోని బి.హెచ్.ఇ.యల్‌లో ఉత్తమంగా నిర్వహించిన విభాగానికి మజ్దూర్ సంఘ్ రోలింగ్ షీల్డ్‌ను అందిస్తోంది. అదే విధంగా, వారణాసిలోని డీజిల్ లోకోవర్క్స్‌లో మజ్దూర్‌సంఘ్ కార్మిక సంఘం ప్రతిఏటా విశ్వకర్మ జయంతినాడు ఉత్తమ నిర్వాహణకుగాను కార్మికులకు వ్యక్తిగతంగా బహుమతులను ఇస్తూ ఉంటుంది.

## స్వయంప్రేరిత అనుశాసన శక్తి:

సంఘంలో నేర్పించే క్రమశిక్షణ మౌలికంగా స్వయంప్రేరితం. శాఖలలో పెంచి పోషించే ప్రఖర ఆదర్శవాద ప్రేరణవల్ల, ప్రశాంత సందేశాన్ని ప్రసరింపజేసే జ్యేష్ఠ కార్యకర్తల స్వీయ జీవితాల వల్ల ఇది అలవడుతుంది. స్వయంసేవకులకు ఇచ్చే ఈ శిక్షణ ప్రభావం ప్రారంభదినాల నుండి స్పష్టంగా కనబడుతూనేవచ్చింది.

1937నాటి సంఘటన. నాగపూర్‌లో 2వేల మంది స్వయంసేవకులతో ఒక శిబిరం జరిగింది. ఆ ప్రక్కనే ఉన్న కమలాఫలాల తోటలో గల చెరువులో స్వయంసేవకులు స్నానం చేయడానికి దాని యజమాని దిలావర్‌ఖాన్ అనుమతి నిచ్చాడు. అయితే, ఒక్క సంత్రాపండు కూడా ఎవరూ తాకకపోవడం అతడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. ఈ అద్భుత క్రమశిక్షణకు తన అభినందనలు తెలియజేస్తూ ఆయన డా. హెడ్గెవార్ వద్దకు వెళ్ళి అనేక బుట్టలతో పండ్లు స్వయంసేవకులకు బహూకరించారు.

అయితే, స్వయంసేవకుల ఈ గుణానికి నిజమైన పరీక్ష 1948లో గాంధీజీ హత్య జరిగిన సమయంలో వచ్చింది. ప్రభుత్వం, అధికార కాంగ్రెస్ పార్టీ, కమ్యూనిస్టులు, ఇతరులు చేతులు కలిపి సంఘానికి వ్యతిరేకంగా ప్రజలలో ఉద్రేకాలను రెచ్చగొట్టసాగారు. ముఖ్యంగా మహారాష్ట్ర, చుట్టు ప్రక్కల ప్రాంతాలలో సంఘకార్యాలయాలు, స్వయంసేవకుల గృహాలు వారి మొదటి లక్ష్యం అయ్యేవి. వందలాది స్వయంసేవకుల ప్రాణాలకు, ఆస్తులకు తీవ్ర ప్రమాదం ఏర్పడిన ఆ సమయంలో

శ్రీ గురూజీఇచ్చిన ఆదేశం సంక్షిప్తంగాను, స్పష్టంగాను ఉంది. - 'ఎట్టి పరిస్థితులలోను ప్రశాంతంగా ఉండండి.' ఉద్రిక్తులైన ఒకగుంపు నాగపూర్‌లోని శ్రీ గురూజీ ఇంటిని చుట్టు ముట్టినపుడు స్వయంసేవకులు సహజంగానే వారిని కాపాడడం తమ బాధ్యతగా భావించారు. కానీ శ్రీ గురూజీ చెప్పారు. 'ఎవరికోసమైతే మనం మన జీవితాలనే సమర్పణ చేసామో, ఆ హిందూ సోదరులే మనను వ్యతిరేకించాలని వస్తే అలాగే కానివ్వండి. కానీ వారిపై మనం చేయి ఎత్తడానికి వీలులేదు. భగవంతుడు కోరుకున్న విధంగా అన్నీ జరుగుతాయి.'

దేశమంతటా కూడా ఇదే పద్ధతి కొనసాగింది. ప్రతిచోట స్వయం సేవకులు ప్రశాంతధోరణినే ప్రదర్శించారు. కానీ ప్రభుత్వం న్యాయము, విచక్షణాపూర్ణము అయిన వాదాలను సైతం వినడానికి సిద్ధంగా లేనప్పుడు, సంప్రదింపులద్వారా అనేక ప్రయత్నాలు, అభ్యర్థనల తరువాత కూడా సంఘంపై నిషేధం తొలగించడానికి వ్యతిరేకించినపుడు శ్రీ గురూజీ శాఖలను తిరిగి ప్రారంభించవలసిందని, తమ సాధారణ కార్యకలాపాలు కొనసాగించుకోవటానికి తమకుగల హక్కును చాటి చెప్పవలసిందని పిలుపునిచ్చారు. ఉద్యమాన్ని అణచివేసేందుకు ప్రభుత్వం మరొకసారి దమనకాండకు దిగింది. 70 వేల మంది స్వయంసేవకులు అరెస్ట్‌అయ్యారు. జైళ్ళలో లెక్కలేనన్ని చిత్రహింసలను అనుభవించారు. కాని ఉద్యమం మొత్తంమీద ఎక్కడా ఒక్క హింసాత్మక సంఘటన గాని, ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేసిన సంఘటనగానీ జరుగలేదు. శాంతియుత, అహింసాయుత ఉద్యమాల చరిత్రలో ఇది ఒక విశిష్టమైనది.

ఈ స్వచ్ఛంద అనుశాసనమనే విశిష్ట పరంపర ఈనాటి వరకు కొనసాగుతూనే ఉంది. వేలాదిమంది స్వయంసేవకులు పాల్గొనే బ్రహ్మాండమైన ర్యాలీలు, పథసంచలనాలు, బహిరంగఉత్సవాల సందర్భంలో అది స్పష్టంగా కనబడుతూనే ఉంది. ఈ గుణాలన్నింటినీ స్వయంసేవకులు సంఘ కార్యక్రమాల వరకే పరిమితం చేయలేదు. పెద్ద పెద్ద సభలలో కూడా మంచి ప్రభావాన్ని చూపించడానికి కొద్ది మంది స్వయంసేవకుల ఉపస్థితి చాలు.

1987 డిసెంబర్‌లో బెంగుళూరులో జరిగిన మజ్దూర్‌సంఘ్ సమ్మేళనం యొక్క వ్యవస్థితమైన నిర్వహణ, క్రమవర్తనలపై వ్యాఖ్యానిస్తూ స్థానిక కన్నడ ప్రభ దినపత్రిక 'ఒక కార్మిక సమ్మేళనం ఎలా నిర్వహించాలనడానికి ఇది తేజోవంతమైన ఉదాహరణ' అని వ్రాసింది.

## విద్యార్థుల గురించిన అభిప్రాయంలో మార్పు:

ఈ రోజులలో విద్యార్థులంటే విచ్చలవిడిగా, హింసాత్మకంగా వ్యవహరిస్తారనే భావన ఉంది. అంతర్జాతీయ యువజన సంవత్సరం సందర్భంగా కొత్త ఢిల్లీలో 1985 వ సం.లో విద్యార్థి పరిషత్ ఒక జాతీయ సమ్మేళనాన్ని నిర్వహించింది. 11వేలమంది విద్యార్థులు పాల్గొన్న ఆ సమ్మేళన ప్రారంభోత్సవానికి విచ్చేసిన రామకృష్ణా మిషన్‌కు చెందిన స్వామీ రంగనాథానంద అనుభవం మాత్రం పూర్తిగా భిన్నంగా ఉంది. అన్ని రాష్ట్రాలనుండి దాదాపు 350 జిల్లాల నుండి విద్యార్థి ప్రతినిధులు ఆ సమ్మేళనానికి విచ్చేశారు. ఆ పెద్ద సమ్మేళనంలో పూర్తి నిశ్శబ్దాన్ని తిలకించిన స్వామీజీ అమితాశ్చర్యంతో "బైటప్రజలకు నేను గనుక 10 వేలమంది విద్యార్థులు పాల్గొన్న ఒక కార్యక్రమం ఎంతో నిశ్శబ్దంగా, శోభాయమానంగా జరిగిందని చెబితే వారు నామాటలు నమ్మరు. ఈ అత్యంత క్రమశిక్షణాయుతము, దేశభక్తి ప్రేరితము అయిన విద్యార్థి సంఘటన మన జాతికే గర్వకారణమని చెప్పడానికి నేనే మాత్రం సంకోచించను" అన్నారు. దేశం సుదూర ప్రాంతాలనుండి వచ్చిన వేలాదిమంది విద్యార్థులు ప్రతిఒక్కరూ టిక్కెట్లు కలిగిఉండడం రైల్వే అధికారులకు సైతం ఆశ్చర్యం కలిగించింది.

అంతకుముందు 1971లో కొత్తఢిల్లీలో జరిగిన విద్యార్థిపరిషత్ అఖిల భారత సమ్మేళనంలో ముఖ్యఅతిధిగా విచ్చేసిన శ్రీ ఎమ్.సి. చాగ్లా కూడా అమితానందభరితులయ్యారు. ఉత్సాహం ఉరకలు వేస్తూకూడా ఎంతో క్రమశిక్షణాయుతంగా ఉన్న ఆ 4 వేలమంది దేశం నలుమూలల నుండి వచ్చిన విద్యార్థిప్రతినిధులను చూస్తూ ఆయన కొన్ని క్షణాలపాటు మౌనంగా ఉండిపోయారు. ఆ తరువాత తన ప్రసంగాన్ని ప్రారంభిస్తూ చెప్పారు. "మీ అందరినీ చూసి నేను ఎందుచేత స్పందించిపోయానో మీకు అర్థం అయి ఉండకపోవచ్చు. జాతీయ పునరుత్థానాన్ని చిన్ని రూపంలో ఇక్కడ నేను దర్శిస్తున్నాను. చైతన్యవంతమైన యువభారతం ఇది."

అటువంటి అరుదైన దృశ్యాలు చూసి పెద్దలు, మహానుభావులు మాత్రమే కాదు ప్రభావితం అయ్యేది. 1985లో చారిత్రాత్మక ఢిల్లీ సమ్మేళనంలో, అక్కడ మత్తుపదార్థాల సీసాలుగానీ, సిగరెట్టు పీకలుగానీ ఒక్కటికూడా కనిపించకపోవడం చూసి పందిరి కాంట్రాక్టరు సైతం ఆశ్చర్యపోయారు. 1984 పాట్నా సమ్మేళనమప్పుడు, అక్కడ ఉన్న

పారిశుధ్యపనివారు సైతం 'శిబిరస్థలంలోను, దాని చుట్టుప్రక్కల ఆ యువకులు పూర్తిగా పరిశుభ్రతను, శోభను నిలిపిఉంచటం మాజీవితంలోనే మొట్టమొదటి అనుభవం' అని ఆనందపడ్డారు. గుజరాత్‌లోని గిర్ అడవులలో విద్యార్థి పరిషత్ నిర్వహించిన సామాజిక సేవా శిబిరంలో వంటకోసం నియమితురాలైన ఒక మహిళ తన జీతాన్ని తిరిగి ఇచ్చివేసింది. నిరుపేద గ్రామస్తులకోసం ఈ యువతీ యువకులు చేసిన నిస్వార్థసేవకు తన ప్రేమపూర్వక సమర్పణ ఇది అని ఆమె పేర్కొంది.

## అశేష ప్రజానీకంపై ప్రభావం:

అనేక లక్షల సంఖ్యలో ప్రజలు పాల్గొన్న విరాట్ హిందూసమైక్యతా సమ్మేళనాలు సైతం సమయపాలన, క్రమశిక్షణ, శాంతియుత నిర్వహణల విషయంలో తమ విశిష్టతను చాటి చెప్పుకున్నాయి. ఏకాత్మతా యజ్ఞాన్ని గురించి వర్ణిస్తూ 'ఇండియా టుడే' (1983 నవంబరు 16-30) పత్రిక: "కార్యక్రమాల నిర్వాహణలోను, సవివరంగా యోజన చేయడంలోను, సుశిక్షిత కార్యకర్తలను సమీకరించడంలోను విఖ్యాతమైన ఆరెస్సెస్ అభిరుచికి ఈ యజ్ఞం ఒక నిదర్శనం. ఈ యాత్రలకు ప్రత్యక్ష సారథులైన 50వేలమంది స్వచ్ఛందసేవకులు అభేదానంద చెప్పిన దానిని బట్టి నిస్సందేహంగా ఆరెస్సెస్‌లో శిక్షణ పొందినవారే. అదే వారి ముఖ్యమైన ప్రత్యేకత. నిర్ణయించిన స్థలంలో రథాలు వచ్చి నిలుస్తాయి. ప్రార్థనలు జరుగుతాయి. అక్కడే ఉపన్యాసాలుకూడా జరుగుతాయి. ఇవన్నీ ఒక్క సెకనుకూడా తేడాలేకుండా జరుగుతాయి. అక్కడినుండి తరువాతి గమ్యానికి చేరుకునేందుకు ఖచ్చితంగా కార్యక్రమాన్ననుసరించి రథాలు బయలుదేరివెళ్ళిపోతాయి" అని వ్రాసింది.

1989లో ఉజిరేలో జరిగిన కర్ణాటక ప్రాంత విశ్వహిందూపరిషత్ సమ్మేళనంలో చిట్టచివర ఒక సంఘటన జరిగింది. ప్రతినిధులు, సుమారు లక్షమంది ఆహూతులకు అది మరుపురాని సంఘటన అయింది. ముగింపు కార్యక్రమంలో చిట్టచివరి అంశమైన వందేమాతరం కూడా పూర్తయిన తరువాత, అందరికీ తిరిగివెళ్ళవచ్చని సూచనలు అందించిన తదుపరి, హటాత్తుగా విద్యుచ్ఛక్తి సరఫరా నిలిచిపోయింది. ఒక్కసారిగా ఆప్రాంతమంతా గాఢాంధకారంలో మునిగిపోయింది. వేలాదిమంది పురుషులు, స్త్రీలు, పిల్లలు ఒకచోట చేరడం, హటాత్తుగా దీపాలు ఆరిపోవడం! ఆ గందరగోళంలో అనేకమంది ఇబ్బందులపాలయి ఉండి

ఉంటారు- త్రోసుకోవడాలు, చిందరవందరగా పరుగులు, త్రొక్కిసలాట - ఒకటేమిటి! ఎన్నో జరిగిఉండేవి.... కొద్ది నిముషాలపాటు అంధకార బంధురంగానే ఉండింది. కానీ దీపాలు వెలుగగానే ఒక అద్భుత దృశ్యం ప్రత్యక్షమైంది. అందరూ తమ తమ స్థలాలలో నిలబడి ఆనందంగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఎక్కడా ఎటువంటి అవాంఛనీయ సంఘటనలేదు. విశాలమైన శిబిరస్థలంలో ఒక్క చిన్న దొంగతనం కూడా జరుగలేదు.

ఇదంతా చూసిన ఒక వృద్ధసన్యాసి రక్షణ వ్యవస్థలో ఉన్న ఒక యువ స్వయంసేవక్‌ను పిలిచి చెప్పారు. 'ఎంత నమ్మశక్యంకాని విషయాన్ని మీరు సాధించారు! మేం మాట్లాడడానికి వెళ్ళే చిన్న చిన్న సభలలో సైతం, దీపాలు పోయినట్లైతే సభికులలో ఎంతో గందరగోళం, అస్త వ్యస్త స్థితి ఏర్పడతాయి. కానీ ఇక్కడ, ఎంతటి క్రమశిక్షణ, ఎంతటి సౌభ్రాతృత్వ పూర్ణ వ్యవహారం!' స్వామీజీ ఆనందంపట్టలేక ఇంకా ఇలా అన్నారు: 'నేను మీకంటే పెద్దవాడిని, సన్యాసిని అయిపోయాను. లేకపోతే మన ప్రజలలో మీరు తీసుకు వచ్చిన సంపూర్ణమైన పరివర్తనను చూస్తుంటే, మీపాదాలకు నమస్కారం చేసిఉండేవాడిని.'

## పసిపిల్లలలో కూడా:

విద్యాభారతి వివిధ వయస్సులపిల్లలకు నిర్వహించే శిశుసంగమ్ కార్యక్ర మాలలో కూడా ఈ సర్వవ్యాపి క్రమశిక్షణ దర్శనమిస్తూనే ఉంటుంది. పూర్వక్షేత్రంలో జరిగిన 'సంగమ'లో 8వేల మంది పాల్గొంటే, హైదరా బాద్, భోపాల్‌లలో 10వేలమంది చొప్పున పాల్గొన్నారు. జైపూర్‌లో జరిగిన రాజస్థాన్ శిబిరంలో 5వేల మంది ఉన్నారు. ఈ శిబిరాలన్నీ క్రమశిక్షణకు, ఋజువర్తనకు నమూనాలుగా ప్రశంశలందుకున్నాయి.

భోపాల్‌లో ముగింపు ఉత్సవం జరుగుతున్న సమయంలో ఒక గాలి పటం ఎగురుకుంటూ వచ్చి సరిగ్గా పిల్లలముందు నేలపై వాలింది. కానీ ఒక్క పిల్లవాడుకూడా తనస్థానంలోనుండి కదలలేదు. ఈ దృశ్యం ప్రేక్ష కులకు అమితాశ్చర్యం కలిగించింది. ఈ సంఘటనకు ఎంత ప్రాముఖ్యత లభించిందంటే మరుసటిరోజు నవభారత్ పత్రిక .దానిని ప్రత్యేకంగా గడికట్టి (Box Item) ప్రచురించింది.

1978 నవంబర్‌లో ఢిల్లీలో జరిగిన సంగమ్ అన్ని విధాలుగా అతి శోభాయమానంగా జరిగింది. ఉత్తరాదిలో అనేక రాష్ట్రాలలోని శిశుమం దిరాల నుండి వచ్చిన 9-11 సం.ల మధ్య వయస్సుగల 15వేలమంది

పిల్లలు పాల్గొన్న పెద్ద కార్యక్రమం అది. పాల్గొన్నవారిలో 1/3 వంతు బాలికలు, 2,500 మంది అధ్యాపకులు ఉన్నారు. శిబిరానికి భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేయగా, ముఖ్యఅతిథిగా విచ్చేసిన శ్రీ జగజ్జీవనరాం ప్రసంగించారు. చక్కటి క్రమశిక్షణను, సద్వర్తనను, కార్యక్రమాలన్నింటినీ స్వయంగా తామే నిర్వహించిన ఆ బాలల నిర్వాహణ సామర్థ్యాన్ని తిలకించిన రాష్ట్రపతి ఇలా అన్నారు: "ఈ ముద్దులొలికే బాలల విశాలసమ్మేళనాన్ని చూసి నేను అమితానంద భరితుడనయ్యాను. వీరి తేజస్సు నిండిన ముఖాలలో, కాంతి నిండిన కళ్ళల్లో భవిష్యత్తుమీద ఆశ, విశ్వాసం గోచరమవుతున్నాయి. ఈ చిరుమొగ్గలు, సువాసనలు వెదజల్లే రంగు రంగుల పుష్పాలుగా వికసించి, మనకలల పంట అయిన భారతాన్ని అలంకరిస్తాయని నా విశ్వాసం."

## పరీక్షా సమయాలగుండా:

క్రమశిక్షణ, నైతిక ఋజువర్తనలకు అతి క్లిష్టమైన పరీక్ష బహుశ రాజకీయాలలోనే ఎదురౌతుంది. అక్కడకూడా స్వయంసేవకులు మొత్తంమీద తమతోటి వారికంటే ఉన్నతంగానే నిలిచారు.

ఈ సంఘటన 1970 తొలి రోజుల నాటిది. ఉత్తర ప్రదేశ్ శాసన సభా నియోజకవర్గం నుండి రాజ్యసభకు ఒక ప్రముఖ పారిశ్రామికవేత్తను కాంగ్రెస్ అభ్యర్థిగా నిలబెట్టారు. శాసనసభ్యుల ఓట్లు కొనివేయడానికి ఎప్పటిలాగే రహస్యంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. భారతీయ జన సంఘ్ శాసనసభ్యులలో అధికులు స్వయంసేవకులే. వారికి కూడా మంత్రి పదవులు, ఇతర పదవుల ఆశచూపించారు. పెద్ద మొత్తాలలో ధనం విషయం అయితే చెప్పనక్కరలేదు.

ఒక నిరుపేద హరిజన శాసనసభ్యుని కూడా వ్యామోహపరిచే ప్రయత్నం చేశారు. మొదటవిడతగా, ఒకనాటి రాత్రి 60వేల రూపాయలను అతనికి పంపించారు. మరునాటి ఉదయమే అయన నేరుగా ఆ పారిశ్రామిక వేత్త యొక్క అనుచరుడి దగ్గరకు వెళ్ళి, అందరూ చూస్తుండగానే ఆనోట్ల కట్టలను అతడి ముఖంపై విసిరికొట్టారు. లక్నో నగరమంతా ఆశ్చర్యంలో మునిగిపోయింది. ఆ తరువాతనుండి తమ కొనుగోలు కార్యక్రమంమీద శాసనసభ్యుల వసతిగృహాలలో తిరుగాడే ఈ అనుయాయులు జనసంఘ్ వారి గదుల ముందునుండి మాత్రం త్వరత్వరగా నడిచి వెళ్ళి పోయే వారు. 'మనం మన సమయాన్ని వృధాచేసుకోవద్దు. ఇవి సిక్కార్ వాలాల గదులు' అని అనేవారు.

రాజకీయాలలో నైతికతకు పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ ప్రత్యక్ష ఉదాహరణగా నిలిచారు. లోక్‌సభ ఎన్నికలలో నిలబడవలసిందిగా జనసంఘ్ ఆయనను కోరింది. ప్రత్యర్థి కాంగ్రెస్ అభ్యర్థి అక్రమ, అనైతిక పద్ధతులను అవలంబించసాగాడు. ఈ అక్రమాలు గనుక కొనసాగినట్లైతే పండిట్‌జీకి నష్టం కలుగుతుందని కొందరు కొత్తగా జనసంఘ్‌లో చేరిన వారికి అనిపించింది. వారు పండిట్‌జీ వద్దకు వెళ్ళి ప్రత్యర్థి వర్గాలు అనుసరిస్తున్న కులతత్వాన్ని రెచ్చగొట్టడం, దొంగవోట్లను ప్రోత్సహించడం లాంటి పద్ధతులు తాము కూడా అనుసరించడానికి అనుమతినిమ్మని వాదించారు. అప్పుడు పండిట్‌జీ చాలా గంభీరంగా చెప్పారు: "మనం జనసంఘ్‌లో రాజకీయాలను సమాజ పరివర్తనకు ఒక సాధనంగా పరిగణిస్తాం. అలాంటి అవినీతి పద్ధతులను అనుసరించే పాపం కంటే ధరావత్తు కోల్పోవడాన్నే నేను ఇష్టపడతాను." చివరిలో పండిట్‌జీ ఒక కఠినమైన హెచ్చరిక కూడా చేశారు. "మన పార్టీ కార్యకర్త ఎవరైనా అలాంటి తప్పుడు పద్ధతులకు దిగినట్లు తెలిస్తే, నేను పోటీనుంచే విరమించుకుంటాను." అక్కడితో ఆ ప్రస్తావన ముగిసింది.

మజ్దూర్ సంఘ్ ఆదర్శాల ఎడల తమనిష్ఠకు, తమకు, తమ కార్మిక సంఘాలకు లభించే తక్షణ ప్రయోజనాలకు మధ్య నిర్ణయంతీసుకోవలసిన సమయం వచ్చినపుడు కార్యకర్తలు కూడా క్లిష్ట పరీక్షను ఎదుర్కోవలసి వచ్చింది. 1962లో ప్రారంభమై, మజ్దూర్ సంఘ్‌కు అనుబంధంగా పనిచేస్తున్న ఈశాన్య రైల్వే కార్మిక సంఘం వేగంగా అభివృద్ధి చెందుతున్న సమయంలో, మజ్దూర్ సంఘ్ వెన్ను విరగ్గొట్టాలని కేంద్ర రైల్వేమంత్రి పథకం వేశారు. మజ్దూర్ సంఘ్‌తో అనుబంధాన్ని గనుక వదులుకుంటే ప్రభుత్వ గుర్తింపునిస్తామని ఆశచూపారు. కానీ సంఘ నాయకుల సమాధానం స్పష్టంగా ఉంది. అలాంటి వ్యామోహాలకు తాము లొంగబోమని వారు స్పష్టంచేశారు. 'మా సంఘాన్ని మజ్దూర్ సంఘ్‌కు సంబంధించిన సంఘంగానే ప్రభుత్వం గుర్తింపు ఇచ్చినపుడే మేం స్వీకరిస్తాం, లేకపోతే లేదు. ఇప్పుడు కాకపోతే కొద్దిరోజుల తరువాతనైనా మా స్వంత బలంతో మేం సాధించుకుంటాం' అని వారు చెప్పారు.

8

# సామాజిక న్యాయ సాధనలో

ఏ సమాజం అన్యాయం, దోపిడీల నిలయంగా ఉంటుందో, ఆ సమాజం శక్తివంతంగాను, సౌభాగ్యవంతంగాను రూపొందడం అసాధ్యమని స్వయంసేవకులకు తెలుసు. అలాంటి సమాజం ఎప్పుడూ ఆంతరిక ఒత్తిడులకు, సంఘర్షణలకు లోనవుతూ ఉంటుంది. సామాజిక స్వరూపాన్ని అవి చిందరవందర చేస్తాయి. ఒక సమాజపు స్వస్థతను నిర్ణయించడానికి ఆసమాజం తనలోని చిట్టచివరి సభ్యుడికి సైతం న్యాయాన్ని, భద్రతను కల్పించగలగడమే కొలమానం.

మన సమాజంలో చాలాకాలంగా ఉపేక్షకు, దోపిడీకి గురి అయిన వర్గం వనవాసులు. అన్ని రకాల కష్టాలకు, అన్యాయాలకు వారు గురిఅయ్యారు.

## వనవాసులకు భూమి హక్కుల సాధనలో:

మిగిలిన ప్రాంతాలకంటే బీహార్‌లో వనవాసుల పరిస్థితి మరింత అధ్వాన్నంగా ఉండేది. విదేశీ మిషనరీలు, ముస్లిం తాబేదార్లు, స్వార్థపరులైన కాంట్రాక్టర్లు, వ్యాపారస్తులు, ప్రభుత్వ, పోలీసు అధికారులు, అందరూ కలిసి వారిని పీల్చి పిప్పిచేసేవారు. క్రైస్తవ మిషనరీలు, ఇతర క్రైస్తవ నాయకులనే ఆ ప్రాంతమంతటికీ ప్రతినిధులుగా అధికార రాజకీయ నేతలు పరిగణించేవారు. అలాంటి అణచివేత పరిస్థితులలో హిందూవనవాసుల దుస్థితిని ఎవరైనా ఊహించవచ్చు.

అయితే ఈ ఉక్కు సంకెళ్ళను ఛేదించాలని లోహర్‌దాగా జిల్లాలోని వనవాసులు నిర్ణయించుకున్నారు. 1986లో పవిత్ర శ్రావణ పౌర్ణిమదినాన నీనా గ్రామానికి చెందిన వనవాసులు తమ సంప్రదాయ బద్ధమైన 'కరమా' ఉత్సవం జరుపుకున్నారు. అదే రోజు మొహరం కూడా అయింది.

చిన్న వివాదం తలెత్తింది. దీనిని ఆసరాగా తీసుకుని ఆగ్రామంపై ముస్లింలు దాడిచేశారు. ఇద్దరు వనవాసులు మరణించారు. వారి స్త్రీలు అవమానాలకు గురిఅయ్యారు. పోలీసులు దోషులను శిక్షిస్తున్నట్లు బొంకారు కానీ ఏమీ జరుగలేదు.

స్వయంసేవకుల నేతృత్వంలో నడుస్తున్న వనాంచల్ జాగరణ పరిషత్ ఈ పరిస్థితిని స్వయంగా ఎదుర్కోవాలని నిర్ణయించింది. ఇంతకాలంగా వారు పాఠశాలలు, వసతిగృహాలు, వైద్యశాలలు నడపడంలాంటి నిశ్శబ్ద నిర్మాణాత్మక కార్యక్రమాలకే పరిమితంగా ఉన్నారు. పరిషత్ అధ్యక్షుడు స్థానిక బి.ఎమ్.ఎస్, బి.జె.పి ల నాయకుడు. దాని ఉపాధ్యక్షుడు ధాను భాగర్ అనే ప్రముఖ హిందూ వనవాసీ నాయకుడు, మొదటగా వనవాసీ జాగరణోద్యమంలో భాగంగా పరిషత్ కార్యకర్తలు, గోవధ, గోమాంస భక్షణ, త్రాగడం లాంటి వాటికి వ్యతిరేకంగా స్వీయ సంస్కరణ ఉద్యమాన్ని ప్రారంభించారు.

ఆ తరువాత ఆ ప్రాంతంలోని వనవాసుల ఆర్థిక దోపిడీ విషయాన్ని చేపట్టారు. ప్రతిఏటా ఆప్రాంతంనుండి లక్షలాది రూపాయల విలువచేసే అల్యూమినియం ఖనిజాన్ని తీసుకువెళ్తూవుంటారు. దానినుండి కాంట్రాక్టర్లు, పారిశ్రామికవేత్తలు అమిత లాభాలు గడిస్తూవుంటారు. కానీ, దానిలో కొద్ది భాగం కూడా ఈ ప్రాంతపు అభివృద్ధికై తిరిగి రాదు. నిజానికి ఇక్కడ వైద్యశాలలు, పాఠశాలలు, రవాణాసంబంధాల అవసరం చాలా తక్కువ ఉంది. ఆ దృష్ట్యా పరిషత్ ఈ సుదీర్ఘకాలం నుండి వాయిదా పడుతున్న సమస్యల పరిష్కారానికై వత్తిడితెచ్చేందుకు వనవాసీ సభలను, ఊరేగింపులను నిర్వహించింది.

కరువు రక్కసి కోరలలో కూడా వనవాసులు తరచు చిక్కుకుంటూ వుంటారు. అటువంటి సమయాలలో బలవంతాన వారి చిన్న భూ కమతాలను ముస్లిం వడ్డీ వ్యాపారస్తుల వద్ద తాకట్టు పెట్టవలసి వస్తూవుంటుంది. అసలు, వడ్డీ మొత్తం తీర్చేదాకా వారికి పంటను ముట్టుకునే అధికారంలేదు. పంటల కోతల సమయంలో పెద్ద సంఖ్యలో అక్కడకు చేరే ముస్లింలు దౌర్జన్యంగా ఆ పంటనంతా కోసుకుని పోతూ ఉంటారు. గ్రామస్తులకోసం సామూహికంగా కేటాయించిన మైదానాలను కూడా తరచు క్రైస్తవ మిషనరీలు అక్రమంగా ఆక్రమించుకుంటూ ఉంటారు.

పరిషత్ కార్యకర్తలు గ్రామగ్రామానికి తిరిగారు. సభలు నిర్వహించారు. ఈ అన్యాయాలు, అవమానాలకు వ్యతిరేకంగా వనవాసులను

జాగృతులను చేసారు. 1986 నవంబర్ 13న లోహర్‌దాగాలో బ్రహ్మాం డమైన నిరసన ప్రదర్శనలో పాల్గొనవలసిందిగా వారికి పిలుపునిచ్చారు. ఈ మధ్యకాలంలో తమ సొంత పొలాలలో కోతకు వచ్చిన పంటను కోసుకోవడానికి 2, 3 వేలమంది వనవాసులు కలిసి సామూహికంగా వెళ్ళమని పరిషత్ కార్యకర్తలు ప్రోత్సహించారు. ఇంతలో, ఒక్కసారిగా ప్రభుత్వం, రాజకీయ నాయకులు కలిసి దోపిడీదారులను రక్షించేందుకు క్రియాశీలురయ్యారు. ఈ ప్రదర్శనకు వ్యతిరేకంగా ప్రచారం ప్రారంభిం చారు. దానిని బహిష్కరించవలసిందిగా వనవాసులకు పిలుపునిచ్చారు. రాంచీ, టాటానగర్, గుమ్లా వంటి పరిసర పట్టణాలనుండి పోలీసు బలగాలను పిలిపించారు. చివరికి ప్రభుత్వం ఆ నిరసన ర్యాలీపై నిషేధం కూడా విధించింది. ఆ నిషేధం ఎట్టి పరిస్థితులలోను అమలు జరిగేటట్లు చూడమని పోలీసులకు ఖచ్చితమైన ఆదేశాలు జారీ చేశారు. వనవాసులు ప్రయాణిస్తున్న ప్రతిబస్సును, ట్రక్కును, లోహర్‌దాగాకు చాలాదూరంలో నిలిపివేసారు. ఆనాటి సభలో ప్రసంగించవలసి ఉన్న జన్‌పూర్‌కు చెందిన రాజాదిలీప్‌సింగ్‌కు, మరొక బిజెపి కార్యకర్తకు లోహర్‌దాగాలో ప్రవేశా నికి అనుమతి నిరాకరించారు. ప్రజలను భయభ్రాంతులను చేసేవిధంగా ఎనిమిది బెటాలియన్ల సాయుధ పోలీసులు పట్టణాన్ని చుట్టుముట్టారు.

కానీ వనవాసుల సంకల్పం కూడా తక్కువేంకాదు. అనేక సందులు గొందుల గుండావారు పట్టణంలోకి చొరబడ్డారు. సమావేశ స్థలంలోకి చేరుకోవడం ప్రారంభించారు. ఇంతలో ఊరేగింపుకు నాయకత్వం వహి స్తున్న ప్రముఖ బిజెపి కార్యకర్తను అరెస్టు చేసారన్న వార్త ప్రాకింది. తమ సంప్రదాయ ఆయుధాలను ధరించిన వందలాది మంది వనవాసులు ముందుకు ఉరికారు. కొద్ది సేపటిలోనే సమూహం 2వేలకు చేరింది. పోలీసు ఉన్నతాధికారులు హడావిడిగా సంభాషణలు జరిపారు. ఉద్యమకా రులను చెల్లాచెదరు చేసేందుకు బలాన్ని ఉపయోగించాలని ఒకరు సలహా ఇచ్చినపుడు, మరొక అధికారి అతడిని హెచ్చరించాడు. 'మనదగ్గర లాఠీలు, తుపాకులు ఉంటే వారి దగ్గర అతి ప్రమాదకరమైన విల్లంబులు, శూలాలు ఉన్నాయని మరచిపోకు.' దాంతో సమస్య పరిష్కారం అయిపోయింది. పోలీసులు వైదొలగారు. ర్యాలీ జరుపుకోవడానికి అనుమతి లభించింది. ఊరేగింపు, సభ ప్రశాంతంగా జరిగిపోయాయని ప్రత్యేకంగా పేర్కొనవలసిన అవసరం లేదు.

ఇది జరిగిన వెంటనే ఫలితాలు కనబడడం ప్రారంభించాయి. వనాంచల్ జాగరణ పరిషత్, ముస్లింల ప్రతినిధులిరువురిని పోలీసులు

ఆహ్వానించారు. భూములపై హక్కులు తిరిగి వనవాసులకు లభించే టట్లు చూశారు. వనవాసీ యువతులను అపహరించుకునిపోవడం వంటి చట్టవ్యతిరేక, అనైతిక కార్యకలాపాల విషయంలో ముస్లిం నాయకులను వారు గట్టిగా హెచ్చరించారు. ఆ తరువాత పరిషత్ ఆ ప్రాంతంలో చాలాకాలంగా, నలుగుతున్న ఇతర సమస్యలవైపు దృష్టిసారించింది.

## వెట్టిచాకిరీ నుండి విముక్తి :

మహారాష్ట్రలోని వనవాసులలో అనేక లోతైన కారణాల వల్ల వెట్టి చాకిరీ బాగా పెరిగిపోసాగింది. సంప్రదాయ వివాహ పద్ధతి కూడా వాటిలో ఒకటి. వివాహం అయిన యువకుడు నిరుపేద వాడైనాసరే, మొత్తం గ్రామస్థులందరికీ విందు, ఆ తరువాత 'మందు' ఏర్పాటు చేయవలసిందే. గత్యంతరంలేక ఆ యువకుడు వడ్డీ వ్యాపారుల నాశ్రయి స్తాడు. నాలుగైదు వేల రూపాయలకు తక్కువకాకుండా అప్పు చేయవలసి వస్తుంది. అందుకు ప్రతిగా వెట్టిచాకిరీకి అతడు అంగీకరిస్తాడు. అలా, నూతన దంపతులు తమ జీవితాన్ని వెట్టి చాకిరీతో ప్రారంభిస్తారు. ఈ బానిసత్వం వారికి జీవితాంతం ఉంటుంది. వారి పిల్లలకు కూడా ఒక్కొక్కసారి సంక్రమిస్తూ ఉంటుంది.

'ధనం, కన్నీళ్లులేని వివాహం' అనే ఆలోచనను కళ్యాణాశ్రమం ఠిపాదించినపుడు వనవాసులకది నమ్మశక్యంకాలేదు. దానివెనుక ఏవో రుద్దేశాలున్నాయని కూడా వారు అనుమానించారు. ఈ ప్రయోగాన్ని ్యాణాశ్రమం మహారాష్ట్రలోని ఠానే జిల్లాలో చలట్వాడ్ గ్రామంలో ారంభించాలనుకుంది. కానీ ఆ గ్రామపెద్దలు మాత్రం ఇది తమ వనవాసీ సంప్రదాయానికి విరుద్ధమని చెబుతూ, అలాంటి దంపతులను బహిష్కరిస్తామని కూడా బెదిరించారు.

అయితే, కళ్యాణాశ్రమ కార్యకర్తలు తలవంచలేదు. నూతన వధూవరు లను ఒప్పించడంలో వారు కృతకృత్యులయ్యారు. వనవాసీ సంప్రదాయంలో అంతకుముందెన్నడూ లేని ఒక నూతన ఒరవడికి శ్రీకారం చుట్టడానికి 38 జంటలు ముందుకు వచ్చాయి. హుందా అయిన వనవాసీ పద్ధతిలో ఆ జంటలను అలంకరించారు. ఠాణే నుండి ఆ నూతన దంపతులను ఆశీ ర్వదించడానికి వందలాది మంది విచ్చేశారు. పవిత్ర మంత్రోచ్ఛారణలు, మంగళ వాద్యాల మధ్య జిల్లా కలెక్టర్ శ్రీమతి జోయిస్ శంకరన్, ఆమె భర్త ఆ నూతన దంపతులను ఆశీర్వదించారు. సామూహిక విందులో

అందరూ పాల్గొన్నారు. అయితే, 'మందు' మాత్రం లేదు. ఆ పద్ధతివల్ల వెట్టి చాకిరీ బెడద తొలగి పోవడం మాత్రమేకాక, చాలామంది ఇంకెప్పుడు మత్తుపదార్థాలను ముట్టమని ప్రమాణం చేశారుకూడా. ములుంద్‌లోని లయన్స్ క్లబ్ తనపేరుకు త ట్టుగా, ఆ కార్యక్రమానికి అయిన ఖర్చులలో సింహభాగాన్ని (lions share) భరించింది. ప్రభుత్వం కూడా ప్రశంశనీయమైన రీతిలో వ్యవహరించి, నూతనదంపతులకు జ్ఞాపికలను బహూకరించింది. ఒకేచోట, ఒకేసారి సామూహికంగా వివాహాలు జరిగిన కారణంగా ఖర్చు కూడా అతి తక్కువలోనే పూర్తయింది.

## పేదరైతులు, కార్మికులకు బాసటగా:

ఆర్థిక ప్రగతికి సంపద యొక్క మొత్తం పెరుగుదలగానీ, ఉత్పత్తిలో వచ్చిన సరాసరి పెరుగుదలగానీ కొలమానంకాదని, సమాజంలోని అట్టడుగు వర్గాలకు దక్కేది అందులో ఎంత? అన్నదే దానికి కొలమానమని మజ్దూర్‌సంఘ్ మొదటినుండి భావిస్తూ వచ్చింది. అందుకే వారు పట్ట ణ పేదవర్గాలను, గ్రామీణకార్మికులను, వనవాసులను సంఘటితం చేసే కృషిని అతిముఖ్యమైనదిగా పరిగణించారు. కార్మిక సంఘాల ద్వారా ఆయా వర్గాలను సంఘటితం చేయడంతో బాటు, గ్రామీణ కార్మిక సంఘాలకు నిర్మాణాత్మక సహకారం అందించవలసిందిగా సంఘటిత కార్మికులను ప్రోత్సహించడానికి కూడా మజ్దూర్ సంఘ్ కృషిచేస్తోంది. ఈవర్గాలకు సామాజిక న్యాయాన్ని కల్పించడంలో గ్రామీణ కార్మిక సంఘాలు ఏవిధంగా సహాయపడతాయనడానికి ప్రత్యక్ష ఉదాహరణ 1980లో మజ్దూర్ సంఘ్ కార్యకర్తలు ప్రారంభించిన 'విదర్భ కృషి ఆదివాసీ మజ్దూర్ సంఘ్'. (వనవాసీ వ్యవసాయ కార్మికులు) సాత్పూరా పర్వతాలకు ఉత్తరాన బుల్దానా జిల్లాలో నివసించే 15-20 వేలమంది వనవాసులు చాలా వెనుకబడినవారు. రహదారులు, ఇతర సంబంధాలు చాలా తక్కువ. విద్య, వైద్య సదుపాయాలు కూడా అంతంతమాత్రమే. దోపిడీలు, దురాగతాలతో వారి జీవితాలు మరింత దుర్భరం అయ్యాయి. 1978లోనే మహారాష్ట్ర ప్రభుత్వం ప్రభుత్వ భూములను దున్నుకుం టున్నవారికి వాటిపై యాజమాన్య హక్కులను కల్పించింది. ఆక్రమిత భూముల విషయంలో కూడా అలాగే చేసింది. కానీ ఆ ఉత్తరువులు మృతప్రాయంగానే ఉండిపోయాయి. మజ్దూర్ సంఘ్ ఈ సమస్యను తీసుకుని సంబంధిత 150 వనవాసీ కుటుంబాలకు యాజమాన్యపు పట్టాలు పంచిపెట్టవలసిందిగా కలెక్టర్‌ను ఒత్తిడిచేసింది. 1985జూన్‌లో

సునాలా గ్రామంలో జరిగిన ఒక ఉత్సవంలో ఈ కుటుంబాలు 700 ఎకరాల భూమికి యజమానులయ్యారు. ఇలాంటి ఇంకా అనేక కుటుంబాలకు యాజమాన్యపు హక్కులను సంపాదించేందుకు మజ్దూర్ సంఘ్ కార్యకర్తలు తమ కృషిని కొనసాగిస్తున్నారు.

అయితే, అసలైన సవాలు ఆ తరువాత వచ్చింది. ప్రభుత్వ ఉత్తర్వులను అటవీ శాఖ సానుభూతితో పరిగణనలోకి తీసుకోలేదు. శి..నారా, చాలీస్తాప్రి, గోమాల్ గ్రామాలలో కోతకు వచ్చిన పంటను నాశనం చేయాలని వారు నిర్ణయించారు. మరునాటి ఉదయమే ఈ విధ్వంస కార్యక్రమం ప్రారంభం అవుతున్నదన్న వార్త మజ్దూర్ సంఘ్ కార్యకర్తలకు తెలిసింది. ఆ పర్వతాలలో ఎదురయ్యే ఇబ్బందులకు తెగించి, చిమ్మచీకటిలో అటవీ అధికారులు, పోలీసులు విడిది చేసిన గ్రామానికి వారు పరుగుతీశారు. భయభ్రాంతులైన వనవాసీ గ్రామస్తులలో ధైర్యాన్ని నింపారు. మరునాడు, అంటే 1985 సెప్టెంబర్ 6వ తేదీ ఉదయం 4, 5 వందల మంది పురుషులు, స్త్రీలు, పిల్లలు అందరూ సమీకృతం అయ్యారు. పోలీసులదాడిని ఎదుర్కొని, తమ పంటలను కాపాడుకోవడానికి ఎటువంటి త్యాగాలకైనా వారు సిద్ధపడ్డారు. హటాత్తుగా ఎదురునిలిచిన ఈ మానవ గోడను చూసి అటవీ అధికారులు, పోలీసులు వివేకంతో వ్యవహరించి వెనుకకు తగ్గారు. ఆ విధంగా 600 ఎకరాలలో కోతకు వచ్చిన ఆ నిరుపేద వనవాసుల పంటలు కాపాడబడ్డాయి.

జిల్లాలోని అనేక గ్రామాలలో త్రాగేనీరు, పాఠశాలలు, వైద్యశాలలు మొదలైనవి సమకూర్చడానికి కూడా మజ్దూర్ సంఘ్ కార్యకర్తలు పెద్ద ఎత్తున ఉద్యమం నిర్వహించారు. అమాయక వనవాసులకు మత్తు మందు బిళ్లలను అమ్ముతున్న చీకటి వ్యాపారులపట్ల పోలీసులనిష్క్రియతను గురించి కూడా వారు ఫిర్యాదు చేశారు. వనవాసులను చైతన్యవంతులను చేసే ప్రచారం ఒకవైపు సాగుతుండగా, మరొకవైపు ఉద్యమాలకు భయపడి పోలీసులు రంగంలోకి దిగి మాదకద్రవ్యాల రవాణాను నిలువరించారు. ఫలితంగా ఒక యోగ్యమైన మార్పు గోచరం కాసాగింది.

అనుచిత రీతిలో జీవిస్తూ, అతి తక్కువ జీతాలు పొందుతూఉండే మరొక వర్గం నగరాలలో ఉండే ఇండ్లలో పనిమనుషులు. ఈ అభాగ్యులైన కార్మికులకు ఉద్యోగభద్రత, వేతన సెలవు, గుర్తింపు పత్రాలు, ఉద్యోగ విరమణ తరువాత ప్రయోజనాలు మొదలైన కనీస అవసరాలను సాధించడంలో బొంబాయిలోని కామగార్ సంఘ్' విజయం సాధించింది.

గ్రామీణ కార్మిక సంఘాలు, భూమిలేని కూలీల సంఘాలకు ఆర్థికంగా సహాయం చేయవలసిందని తనకు అనుబంధంగా ఉన్న సంఘాలపై మజ్దూర్ సంఘ్ ఒత్తిడి తెచ్చింది. నేషనల్ ఆర్గనైజేషన్ ఆఫ్ బ్యాంక్ ఆఫీసర్స్, మహారాష్ట్ర విజ్-మజ్దూర్ కామ్‌గార్ మహాసంఘ్ (రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు ఉద్యోగుల సంఘం) లు సంఘటిత కార్మికులు, గ్రామీణ కూలీలకు సహకార హస్తాన్నందించడం విషయంలో ఉదాహరణలుగా నిలిచాయి. అదే విధంగా, మహారాష్ట్ర ఆరోగ్య కామ్‌గార్ సంఘ్ (వైద్య శాఖలో కార్మికులు) కూడా వ్యవసాయ కార్మికులను సంఘటితం చేసే కృషిలో నేరుగా పాల్గొంటున్నది.

ఉద్యోగుల న్యాయమైన హక్కులను సాధించుకొనడానికి సమ్మె ఆయుధాన్ని వినియోగించడాన్ని మజ్దూర్ సంఘ్ పూర్తిగా నిరాకరించలేదు. అయితే, తన పారిశ్రామిక కుటుంబ సిద్ధాంతాన్ననుసరించి దానిని చిట్టచివరి ఆయుధంగా మాత్రమే ప్రయోగించాలని అది విశ్వసిస్తున్నది.

ఇతర కార్మిక సంఘాలు సమ్మెకు పిలుపు నిచ్చిన సందర్భాలలో, అది కార్మికుల ప్రయోజనాలకు భంగకరంగా ఉందని భావించినపుడు, మజ్దూర్ సంఘ్ ఆ పిలుపును వ్యతిరేకించిన సందర్భాలు కూడా లేకపోలేదు. 1967లో మహారాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి ప్రతినిధులతో చర్చలు జరుగుతున్న సమయంలో, చర్చల మధ్యలోనే కమ్యూనిస్ట్ కార్మిక సంఘాలు సమ్మెకు పిలుపునిచ్చాయి. ఆ పిలుపు న్యాయబద్ధమైనది కాదని, కార్మికుల వాస్తవ ప్రయోజనాలకు వ్యతిరేకమైనదని మజ్దూర్ సంఘ్ దానిని వ్యతిరేకించింది. ఫలితంగా ఒక వర్గం కార్మికుల అవమానాలను, ఆక్షేపణలను సహించవలసి వచ్చింది. కానీ వారు తమ నిర్ణయానికి కట్టుబడి దృఢంగా నిలబడ్డారు. అదే విధంగా, 1987లో బెంగుళూరులోని రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో మార్క్సిస్ట్ కార్మిక సంఘం ఇచ్చిన సమ్మె పిలుపు అనావశ్యకమైనది, న్యాయవిరుద్ధమైనదిగా పేర్కొంటూ మజ్దూర్ సంఘ్ కార్మిక సంఘం దానిని సవాల్ చేసింది. మజ్దూర్ సంఘ్ కార్యకర్తలు కమ్యూనిస్టుల బెదిరింపులకు సైతం చలించక బ్యాంక్‌ను యథాతథంగా నడిపించడంలో కృతకృత్యులయ్యారు.

## మత్స్యకారుల స్థితిగతుల అభివృద్ధికై:

కేరళలో సమాజంలో అత్యంత దోపిడీకి గురయ్యే వర్గం హిందూ మత్స్యకారులు. ధనవంతులైన ముస్లింలకు తరతరాలుగా ఋణగ్రస్తులుగా

ఉంటూ వస్తున్న ఈ వర్గం, తాము పట్టుకున్న చేపలను అతి తక్కువ ధరలకు వీరికే అమ్ముకోవలసి వచ్చేది. తరచు వారి స్త్రీలు ముస్లింలకు ఎఱగా మారేవారు.

కానీ తీరప్రాంతంలో శాఖలు ప్రారంభమైన తరువాత పరిస్థితులు వేగంగా మారిపోసాగాయి. హిందూ దేవీదేవతల ఎడల మత్స్యకారుల భక్తి శ్రద్ధలు మరింత దృఢం అయ్యాయి. తమ హక్కులు, ప్రయోజనాల విషయంలో వారు జాగరూకులు అయ్యారు. తమ అస్తిత్వాన్ని ప్రకటించుకోసాగారు. ఊహించినట్లుగానే ముస్లింల బెదిరింపులు, దాడులు ప్రారంభమయ్యాయి. శాఖా శిక్షణలో సుదృఢంగా రూపొందిన యువకులు వాటిని విజయవంతంగా త్రిప్పికొట్టారు. వారిలో కొందరు తమరక్తాన్ని అందుకు మూల్యంగా ధారపోయవలసి వచ్చింది. నిజానికి కేరళలో ముస్లింల చేతిలో హతుడైన మొట్టమొదటి స్వయంసేవక్ పయ్యోలికి చెందిన ఓ జాలరి యువకుడే. గోసంరక్షణ కార్యంలో అతడు తన ప్రాణాల నర్పించాడు.

స్వయంసేవకులు మత్స్యకారుల సామాజిక-సాంస్కృతిక సంస్థగా మత్స్య ప్రవర్తక సంఘాన్ని స్థాపించారు. అనతికాలంలోనే అది వారి సామాజిక భద్రతకు ఒక సాధనంగా రూపొందింది. ఈ నూతన జాగృతి కారణంగా వారిలో అక్షరాస్యత కూడా బాగా పెరిగింది. అనేకమంది మత్స్యకార స్వయంసేవకులు ఇప్పుడు సమాజంలోను, ప్రభుత్వ యంత్రాంగంలోను ఉన్నత, ప్రతిష్ఠిత స్థానాలను చేరుకున్నారుకూడా. భగవాన్ వేదవ్యాసుని మత్స్యకారులు అమిత శ్రద్ధతో పూజిస్తారు. ఆ పవిత్ర విశ్వాసాన్ని సుదృఢం చేసేందుకు వివిధ ఉత్సవాలను నిర్వహించడం ద్వారా స్వయంసేవకులు ఆ ప్రాంతాలలో హిందూ సంఘటనా కార్యానికి ఒక కొత్త వేగాన్ని కల్పించారు.

కోస్తా ఆంధ్ర ప్రదేశ్‌లోని నెల్లూరు జిల్లాలో గల సుమారు 20 గ్రామాలలోని మత్స్యకారులలో కూడా ఇదే విధమైన పరివర్తన గోచరమౌతుంది. మత్స్యకారులు శ్రీరామునికి మహాభక్తులు. కానీ వారు సంపాదించినదంతా శ్రీరామనవమి పండుగనాడే ఖర్చయిపోయేది. పేదరికం, అమాయకత్వం, సంఘ వ్యతిరేక శక్తుల దోపిడీలు బాగా విస్తరించి ఉండేవి.

శాఖలు ప్రారంభం కావడంతో అదంతా మారింది. ఉత్సవాలు ఇప్పుడు మహోత్సాహంతో జరుగుతాయి. కానీ తక్కువ ఖర్చుతో...

అదే విధంగా వారి జీవన ప్రమాణాలలో కూడా సమగ్రమైన అభివృద్ధి వచ్చింది. ఇటీవల జరిగిన గంగా మాత జాతరలో 10 వేల మంది మత్స్యకారసోదరులు పాల్గొన్నారు. దివి సీమలో జరిగిన సాగరమాత ఉత్సవాలలో 50 గ్రామాలనుండి వేలాదిమంది మత్స్యకార కుటుంబాలవారు పాల్గొన్నారు. విద్య, సామాజిక, సాంస్కృతిక వ్యవహారాలలో వారి ఆసక్తి పెరిగింది. వారి పిల్లలను చుట్టుప్రక్కల పట్టణాలలోని స్వయంసేవకులు తమ ఇండ్లకు తీసుకుని వెళ్తూంటారు. అక్కడ వారు పరిశుభ్రతకు సంబంధించిన అనేక విషయాలు నేర్చుకుంటారు. చక్కని సామాజిక అవగాహనను, సమరసతను పెంపొందించే కృషిలో భాగంగా పట్టణ వాసులైన కుటుంబాలు తరచు ఈ గ్రామాలను సందర్శిస్తూ ఉంటారు.

## వెనుకబడిన వర్గాల విద్యార్థులకు సౌకర్యాలు:

వసతి గృహాలలో షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలకు చెందిన విద్యార్థులకు న్యాయం జరిగేటట్లు కర్ణాటకలో విద్యార్థి పరిషత్ విశేషంగా కృషిచేస్తోంది. ఈ విషయంలో పరిశీలన జరుపడానికి నియమించిన కమీషన్ తమ నివేదికలో చేసిన సూచనల గురించి విద్యార్థి పరిషత్ వారితో చర్చించింది. నివేదికలోని లోపాలను ఎత్తి చూపించింది. వాటిని సవరించడానికి కొన్ని సూచనలు కూడా చేసింది. తదుపరి అవి జోడించబడ్డాయికూడా. 1988లో కమీషన్ చేసిన అనేక సూచనలను విద్యా మంత్రిత్వశాఖ అంగీకరించేటట్లు చేయడంలో విద్యార్థి పరిషత్ సఫలీకృతం అయింది. ఆ వసతి గృహాల దయనీయస్థితిగురించి, నిధులను అక్కడి ఉద్యోగులు దుర్వినియోగం చేయడం గురించి ప్రభుత్వానికి వాస్తవాలను సాక్ష్యాల సహితంగా విద్యార్థి పరిషత్ నివేదించింది. వెంటనే ప్రభుత్వం వసతి గృహాలలో సౌకర్యాలను మెరుగుపరచడానికి, సామగ్రి, ఇతర కనీసావసరాలు కల్పించడానికి ముందుకు వచ్చింది. ఆహారం, బట్టలు, పాఠ్యపుస్తకాలు, స్టేషనరీ సామగ్రి, వైద్య సదుపాయాలు, ప్రత్యేక బోధన, గ్రంథాలయం, పఠనాలయం వగైరా సౌకర్యాలు ప్రతి విద్యార్థికి ఏమేరకు కల్పించబడుతున్నాయో వాటి వివరాలను వసతి గృహాలలో ప్రదర్శించాలని, దాని వలన విద్యార్థులకు తమ హక్కులను గుర్తించి, న్యాయంగా రావలసిన వాటిని పొందడానికి అవకాశం ఏర్పడుతుందని ఆదేశిస్తూ ప్రభుత్వం సమాజ సంక్షేమ శాఖకు చెందిన ఉన్నతాధికారులకు సూచనాపత్రాలను జారీచేసింది.

మహారాష్ట్రలో కూడా, ఈ విషయాలపై విద్యార్థి పరిషత్ బహిరంగ సభలు, సంగోష్ఠుల ద్వారా ఉద్యమం నిర్వహించింది. హరిజన విద్యార్థులకు ఇచ్చే స్కాలర్‌షిప్పులు, ఇతర ఉచిత సౌకర్యాల పరిమాణాన్ని పునరాలోచించి, మారిన జీవన ప్రమాణాల కనుగుణంగా వాటెని కూడా మార్పు చేయవలసిందని ప్రభుత్వాన్ని విద్యార్థి పరిషత్ అభ్యర్థించింది. ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా ఎబివిపి వెనుక బడిన తరగతుల విద్యార్థులకు, ఆర్థికంగా బలహీనులైన వారికి వసతిగృహససదుపాయాలు పెంచాలని, స్కాలర్‌షిప్‌లు పెంచాలని ఉద్యమాలు నిర్వహించింది.

## వ్యవసాయదారుల బాగోగుల కోసం:

ఈ మధ్యకాలంలో గుజరాత్, ఆంధ్ర ప్రదేశ్‌లలో భారతీయ కిసాన్ సంఘ్ బలమైన రైతుశక్తిగా ఆవిర్భవించింది. మిగిలిన ప్రాంతాలలో కూడా వేగంగా పురోగమిస్తోంది. రైతుల సమస్యలు పరిష్కరించడానికి, వారి న్యాయమైన కోర్కెల సాధనకు కిసాన్ సంఘ్ విజయవంతమైన ఉద్యమాలెన్నింటెనో నడిపింది. వాటిలో సుదీర్ఘకాలం నడిచిన గట్టి పోరాటాలు కూడా కొన్ని లేకపోలేదు. ఆంధ్ర ప్రదేశ్ కిసాన్ సంఘ్ విద్యుచ్ఛక్తి వినియోగంలో ఫ్లాట్ రేట్ పద్ధతి కోసం, నీటి తీరువా పన్నువసూలు నిలిపివేత కోసం ఉద్యమాలు నడిపి ఘన విజయం సాధించింది. కొన్ని చోట్ల కిసాన్ సంఘ్ పిలుపుకు రైతన్నలు పెద్ద సంఖ్యలో ప్రతిస్పందన చూపారు. కిసాన్ సంఘ్ అట్టుడుకుతున్న సమస్యలను తీసుకుని ఉద్యమించడం మాత్రమేకాక, గ్రామీణ ప్రజలలో వారి కార్యకర్తల ఎడల ఉన్న గౌరవం, విశ్వాసం కూడా అందుకు కారణం.

వ్యవసాయరంగంలో సమస్యల విషయంలో లోతైన అధ్యయనం, నిర్మాణాత్మక దృష్టికోణం కిసాన్‌సంఘ్ ఉద్యమంలోని విశిష్టతలు. ప్రభుత్వం వాటి పరిష్కారానికి తగిన చర్యలు తీసుకునేందుకు ఈ అంశాలు తరచు ఎంతగానో ఉపకరిస్తున్నాయి. పంటలు, పశువుల భీమా గురించి మొట్ట మొదట గొంతెత్తినది కిసాన్ సంఘ్. ఇప్పుడు కేంద్ర ప్రభుత్వం, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు కూడా దానిని అంగీకరించాయి. వ్యవసాయ ధరల సంఘం స్వరూపంలో కిసాన్ సంఘ్ సూచించిన మార్పుకు ప్రభుత్వం అంగీకరించింది. సంఘం సభ్యులలో రైతు ప్రతినిధులు, వ్యవసాయ విశ్వవిద్యాలయాలకు చెందిన మేధావులు, ప్రభుత్వ ప్రతినిధులు ఒక్కొక్కరు 1/3 వంతు ఉండాలన్నది కిసాన్

సంఘ్ సూచన. వ్యవసాయోత్పత్తుల గిట్టు బాటు ధరలను ప్రభుత్వమే ప్రకటించాలని కూడా అదే సందర్భంలో కిసాన్ సంఘ్ కోరింది. ముగ్గురు రైతు ప్రతినిధులను సంఘంలో చేర్చుకుంటున్నట్లు ప్రభుత్వం ఇప్పుడు (1988) ప్రకటించింది. సంఘం పేరును కూడా అగ్రికల్చరల్ కాస్ట్ అండ్ ప్రైస్ కమీషన్ గా మార్పు చేసింది.

1985-86లో ఆ కమీషన్ అధ్యక్షుడు ఉత్తర ప్రదేశ్‌లోని హమీర్‌పూర్ జిల్లాకు వచ్చారు. అక్కడ అనేకమంది రైతులతో ఆయన మాట్లాడారు. వ్యవసాయోత్పత్తుల ధరలను నిర్ణయించడానికి ఉత్తమ విధానం ఏమిటని ఆయన వారిని ప్రశ్నించారు. మిగిలిన రైతు ప్రతినిధులంతా అమ్మకం రేటునే ప్రధానంగా ప్రతిపాదించారు. కానీ కిసాన్ సంఘ్ ప్రతినిధి వెల నిర్ణయించడానికి ఆలోచించవలసిన అంశాలను గురించి సునిశితంగా వివరించారు. కమీషన్ అధ్యక్షుడు ఆ సూత్రాలను అంగీకరించారు. అధ్యయనంలో కూడుకున్న కిసాన్ సంఘ్ సూచనలను ఆయన ఎంతో ప్రశంసించారు.

కొద్ది సంవత్సరాలక్రితం బెల్జియం, హాలెండ్‌లనుండి అంతర్జాతీయ కార్మిక సంఘటన (International Labour Organisation) కు చెందిన ప్రతినిధులు వారణాసికి వచ్చారు. మన దేశంలోని రైతు ఉద్యమాలను వారు అధ్యయనం చేశారు. మిగిలిన రైతు సంఘాలతో పోలిస్తే దేశంలోని వనరులు, అవసరాలను దృష్టిలో పెట్టుకుని రైతుల సమస్యలపై సరియైన దృష్టికోణంతో వ్యవహరించినది కిసాన్ సంఘ్ మాత్రమేనని వారు వాఖ్యానించారు.

## వినియోగదారుల ప్రయోజనాలు కాపాడడంలో:

1974లో మహారాష్ట్రలో హటాత్తుగా, విపరీతంగా పెరిగిపోయిన నిత్యావసర వస్తువుల ధరలకు వ్యతిరేకంగా ప్రారంభమైన ఉద్యమం, నేడు దేశమంతటా విస్తరించి వినియోగదారుల ఉద్యమం రూపం దాల్చింది. అఖిల భారతీయ గ్రాహక్ పంచాయత్ అనే పేరున దానిని వ్యవహరిస్తున్నారు. కొద్ది మంది స్వయంసేవకులు తీసుకున్న చొరవతో పుణెలోని వివిధ కాలనీలలో 25 కుటుంబాలు ఒక బృందంగా ఏర్పడసాగాయి. కొన్ని వస్తువులను సహకార పద్ధతిలో స్థానికంగా సమీకరించి, పంపిణీ చేయడం వాటి ఉద్దేశం. ఈ ఆలోచన ప్రజలకు బాగా నచ్చింది. మూడు రోజులు తిరగకుండానే 200 వినియోగదారుల సంఘాలు ప్రారంభం అయ్యాయి.

మొత్తం నగరానికి సంబంధించిన అవసరాలను కేంద్రీకృతం చేసే, మధ్య దళారులను నివారించి, ఉత్పత్తిదారులు, వినియోగదారుల మధ్య నేరుగా సంబంధాలు ఏర్పరచిన కారణంగా వినియోగదారుల సంఘాలు ప్రతికుటుంబం 20 శాతం ఖర్చు తగ్గించుకునే విధంగా సహాయపడ్డాయి.

సమాజంలోని ఉపేక్షిత వర్గాలకు ఆర్థికంగా సహాయపడడం గ్రాహక్ పంచాయత్ ప్రముఖ లక్ష్యాలలో ఒకటి. ఆ లక్ష్యంతోనే పుణేలో, సరుకులను సాధ్యమైనంతవరకు వెనుకబడిన వర్గాలకు చెందిన వారి వద్దనే కొనాలని నిర్ణయించారు. ఉదాహరణకు, అనేక హరిజన మహార్ కుటుంబాలు సాంగ్లీ సమీపంలో ద్రాక్ష పండ్లను పెంచుతున్నాయి. వాటికి కిలోకు కేవలం రూ.3.50 మాత్రమే లభిస్తోంది. పుణే గ్రాహక సంఘ్ వాటిని వారివద్ద రూ 4.50కు కొని రూ.5 లకు విక్రయించసాగింది. అది అప్పటి మార్కెట్ ధరకంటే కూడా తక్కువ. వాటి అమ్మకం ద్వారా లభించే లాభాలన్నీ హరిజనోద్ధరణకే వినియోగపడతాయని ఆ ద్రాక్ష పండ్ల పెట్టెలపై వ్రాసి ఉండేది.

వినియోగదారులను నీతి నిజాయితీలేకుండాదోచుకునే వ్యాపారుల మీద ప్రజల నుండి ఒత్తిడి తీసుకుని రావడం వినియోగదారుల ఉద్యమం యొక్క మరొక అంశం. పుణేలోని లక్ష్మీరోడ్‌లో కోట్లాది రూపాయల విలువైన బట్టల అమ్మకం జరుగుతూ ఉంటుంది. సంఘటితంగా ఉన్న వ్యాపారస్తులు హటాత్తుగా ధరలను విపరీతంగా పెంచేశారు. గ్రాహక్ పంచాయత్ ధరలను తగ్గించవలసిందిగా వారిని అభ్యర్థించింది. వారు తిరస్కరించడంతో వారిని బహిష్కరించమని పిలుపు నిచ్చింది. అగ్రస్థాయి ప్రజానాయకులు కూడా ఈ నిరసనోద్యమంలో వచ్చి చేరడంతో, చివరికి వ్యాపారస్తులు ప్రజల ఒత్తిడికి తల ఒగ్గక తప్పలేదు.

ఈ అధిక ధరల కంటే మరింత తీవ్రమైన సమస్య కల్తీవ్యాపారం. ప్రమాదకరమైన మందులు, టానిక్‌లకు పెద్ద ఎత్తున జరుగుతున్న ప్రచారం కూడా అంతే ప్రమాదకరమైనది. గ్రాహక్ పంచాయత్ ఈ ప్రమాదాలగురించి ప్రజలకు తెలియజేస్తూ, వాటి ఉచ్చులో పడకుండా జాగ్రత్త వహించమని హెచ్చరిస్తూ పోస్టర్లను పంపిణీచేసింది.

ఇప్పుడు దాదాపు అన్ని రాష్ట్రాలలోను విస్తరించి ఉన్న గ్రాహక్ పంచాయత్ వినియోగదారులను మోసం, దోపిడీలకు గురిచేసే అనేక అంశాలను ఎదుర్కొంటోంది. వంటగ్యాస్ కృత్రిమకొరత, ఖాద్య పదార్థాల రవాణా ధరలలోను, అమ్మకం ధరలలోను విపరీతమైన పెరుగుదల, మాదక

ద్రవ్యాల అక్రమ వ్యాపారం, పాఠ్యపుస్తకాల అధిక ధరలు మొదలైనవి వాటిలో కొన్ని. ప్రభుత్వ దోపిడీని కూడా వారు ఎదుర్కొన్నారు. వివిధ హైకోర్టులు, సుప్రీంకోర్టు స్థాయిలో అనేక అంశాలపై చట్ట పరమైన పోరాటం సాగించారు. 1979నుండి సాగిన గ్రాహక్ పంచాయత్, ఇతర వినియోగదారుల సంఘటనల యొక్క ఈ నిరంతర కఠోర పరిశ్రమ వల్ల 1986వ సం॥ ములో కేంద్ర ప్రభుత్వం వినియోగదారుల రక్షణ చట్టం తీసుకువచ్చింది.

గ్రాహక్ పంచాయత్ ప్రత్యేకంగా లేవనెత్తిన ఒక మౌలిక అంశం వస్తువుల యొక్క అసలు ఉత్పత్తి ధర తెలుసుకోవడంలో వినియోగ దారుడికి గల హక్కు. ఈ కృషిలో భాగంగా గ్రాహక్ పంచాయత్ దేశమంతటా 'ఉత్పత్తి ధరను తెలుసుకోండి' ఉద్యమాన్ని నిర్వహించింది. విపరీతంగా పెరిగిపోతున్న ద్రవ్యోల్బణానికి కారణం ఉత్పత్తి ధర, అమ్మకం ధరల మధ్య ఉన్న నమ్మలేని వ్యత్యాసం. వినియోగదారుడిని పీల్చి పిప్పిచేసే ఈ స్థితిని నివారించడానికి ఈ వ్యత్యాసాన్ని గురించి అతడికి తెలియజేసి, దానిని వ్యతిరేకించేటట్లు చేయడమే సరియైన మార్గం. గ్రాహక్ పంచాయత్ నిర్మాణాత్మక పథంలో సాగే సంస్థ. జిల్లా, రాష్ట్ర కేంద్ర స్థాయిలలో అనేక చోట్ల వారి కార్యకర్తలను ప్రభుత్వ కమిటీలలో చేరి పనిచేయవలసిందిగా కూడా ఆహ్వానించారు.

మొన్నటివరకు ఈ వినియోగదారుల ఉద్యమం సహకార దుకాణాలకు, కొన్ని చోట్ల కొన్ని వర్గాల ప్రజలకు సంబంధించిన ప్రత్యేక సమస్యలకు మాత్రమే పరిమితంగా ఉంటూ వచ్చింది. కానీ గ్రాహక్ పంచాయత్ ఆవిర్భావంతో అది ఒక విలక్షణమైన భారతీయ దృష్టికోణం కలిగిన జాతీయోద్యమంగా నెమ్మదిగా రూపుదిద్దుకుంటోంది. పాశ్చాత్య దేశాల భౌతిక వాద దృష్టికోణం కారణంగా ఉపభోగానికి సంబంధించిన వస్తువులను కుప్పలు పేర్చుకుంటూ పోవడమే జీవన ప్రమాణాలకు, మానవ సుఖాలకు కొలమానంగా మారింది. ఈ దృష్టికోణం వినియోగలాలసత (Consumarism) కు దారితీసింది. సరిక్రొత్త వినియోగవస్తువులకై అంతులేని వ్యామోహం పెరిగింది. కానీ హిందూ తత్వజ్ఞానం భౌతిక సుఖాల పరిపూర్తికి సముచిత స్థానాన్ని కల్పిస్తూనే, ఆత్మ సంయమనాన్ని ప్రబోధించింది. వినియోగంలో అటువంటి ఆత్మ సంయమనం మాత్రమే శోషణ ముక్త సమాజాన్ని నిర్మించడంలో సహాయకారి కాగలుగుతుంది. సహజవనరులను నిర్లక్ష్యంగా దోచుకున్న కారణంగా అవి పూర్తిగా అంతరించిపోయే ప్రమాదం ఏర్పడింది. భూ, జల, వాతావరణ

కాలుష్యాలకు, అడవుల నరికివేతకు కారణమైన ఈ దోపిడీవల్ల ఇవాళ మానవాళి ముందు వినియోగానికి సంబంధించిన భారతీయ దృష్టికోణాన్ని స్వీకరించడం మినహా మరొక గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడింది.

గ్రాహక్ పంచాయత్ వినియోగదారుల శక్తిని నిర్మించడంతోబాటు, ఈ మౌలిక జీవన దృష్టిని ప్రచారం చేయడానికి కూడా అధిక ప్రాధాన్యత నిస్తున్నది.

## అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాటం:

వ్యక్తిగత స్థాయిలో సైతం స్వయంసేవకులు అనేక సందర్భాలలో అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాడడంలో తమ పట్టుదలను ప్రదర్శించారు.

1984 మార్చిలో, హోంగార్డుగా పనిచేస్తున్న 19 సం.ల సౌరజ్‌సింగ్ అనే హరిజన యువకుడిని పాత కక్షలను అడ్డంపెట్టుకుని ఇద్దరు పోలీసు కానిస్టేబుళ్ళు అతడి ఇంటినుండి బలవంతంగా తీసుకుని వెళ్ళిపోయారు. ఈ సంఘటన ఉత్తర ప్రదేశ్‌లోని ముజఫర్ నగర్ జిల్లా హుస్సేన్‌పూర్‌లో జరిగింది. మార్గమధ్యంలో సౌరజ్‌సింగ్‌ను ఉడుకుతున్న చెరుకు రసం గల పెద్ద ఇనుప పాత్రలోకి విసిరివేశారు. శరీరమంతా కాలిపోయి, మృతప్రాయంగా మారిన అతడిని పోలీసులు అక్కడినుండి సైకిల్‌మీద పోలీస్ స్టేషన్‌కు తీసుకుని వెళ్ళారు. ప్రక్కగ్రామంలో ఉన్న ఒక సంఘ కార్యకర్తకు ఈ విషయం తెలిసింది. ఆగ్రహోదగ్రులైన గ్రామస్తులను తీసుకువెళ్ళి, పోలీస్ స్టేషన్ ముందు ఘెరావ్ చేసాడు. పోలీసులు వారిపై కాల్పులు సాగిస్తామని బెదిరించారు. కాల్చమని గ్రామస్తులు సవాలు చేసారు. కేసును నమోదు చేసుకొనడానికి కూడా పోలీసులు నిరాకరించడంతో ఆగ్రహంచెందిన గ్రామస్తులు పోలీసు వలయాన్ని ఛేదించుకుని పోలీస్ స్టేషన్‌లోనికి వెళ్ళి సౌరజ్‌సింగ్‌ను త్వరగా ముజఫర్ నగర్‌లోని ప్రభుత్వ ఆసుపత్రికి తరలించారు. సౌరజ్ సింగ్ మరణ వాంగ్మూలం రూపంలో సంఘటనకు సంబంధించిన పూర్తి నివేదిక సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్‌కు అందేటట్లు సంఘ కార్యకర్త, ఇతరులు శ్రద్ధ వహించారు. సౌరజ్‌సింగ్ మృతదేహాన్ని తీసుకుని, అంత్యక్రియలు జరిపించడం కోసం కూడా గ్రామస్తులకు పోలీసులతో మరల పోరాడవలసి వచ్చింది.

ఉత్తర ప్రదేశ్ శాసనసభలోని బిజెపి సభ్యులు ఈ అంశాన్ని లేవనెత్తి, ప్రభుత్వం ఒక విచారణ సంఘాన్ని నియమించేటట్లు చేశారు. ప్రత్యక్ష

స్వయంసేవకులు సమస్య యొక్క మూలాలను త్రవ్విపట్టుకోవాలని నిశ్చయించారు. రేషన్‌వస్తువులను తీసుకుని వస్తున్న ట్రక్కులను పట్టణంబైటే దారిమళ్ళించి, సరుకును నల్లబజారులో అమ్ముకుంటున్నారని వెల్లడైంది. స్వయంసేవకులు పట్టణం బైట కాపలాకాసి, ట్రక్కులను పట్టుకుని పోలీసులకు అప్పగించారు. ప్రత్యక్షంగా ఘర్షణలు జరిగే అవకాశం ఉందని ముందే ఊహించి, తగు తయారీతోనే వారు వెళ్ళారు. కానీ స్వయంసేవకులను చూస్తూనే నల్లబజారు వ్యాపారులకు తమ ఆటలు సాగవని అర్థమైంది. వారు లొంగిపోయారు. ఆరోజునుండి సహకార సొసైటీ భవనంముందు 'సరుకులేదు' అన్న బోర్డు కూడా అదృశ్యం అయిపోయింది.

## పరిపాలనా పరమైన న్యాయం సాధించడం:

రాజకీయ రంగంలో అభిరుచికలిగి, 1977కు ముందు భారతీయ జనసంఘ్‌లోను, ఆ తరువాత భారతీయ జనతా పార్టీలోను క్రియాశీలంగాఉన్న స్వయంసేవకులు వివిధ స్థానాలకు తాము ఎన్నికైన ప్రతీసారి, తోటి సహచరుల సహకారంతో పరిపాలనా యంత్రాంగంద్వారా సామాజిక న్యాయాన్ని సాధించడానికి అనేక పథకాలను రూపొందించడంలో ఎంతో కృషి చేసారు. వివిధ స్థాయిలలో విజయాన్ని సాధించారు కూడా. ఉదాహరణకు కర్ణాటకలో, మానవ మలాన్ని తలపై మోసుకువెళ్ళే అసహ్యమైన పద్ధతికి 1970లో స్వస్తి చెప్పిన రాష్ట్రంలోని మొట్టమొదటి పురపాలక సంఘం భారతీయ జనసంఘ్ ఆధీనంలోని ఉడిపి పురపాలక సంఘమే. షెడ్యూల్డు కులాలు, తెగలకు చెందిన ప్రజల అభివృద్ధికోసం కేటాయించిన 18 శాతం నిధులను అందరికంటే ముందు పూర్తిగా వినియోగించిన పురపాలక సంఘం కూడా అదే.

ఢిల్లీ నగరపాలక సంస్థ, ఢిల్లీ మెట్రోపాలిటన్ కౌన్సిల్‌ల అధికార పీఠాలు తమచేతులలో ఉన్నకాలంలో భారతీయ జనసంఘ్, ఆ తరువాత భా.జ.పా.లు పరిపాలనా యంత్రాంగం సామర్థ్యం పెంపొందించడానికి తీసుకున్న చర్యలు ఎన్నో!

కోటాలు, పర్మిట్లు, లైసెన్సుల పంపిణీలో అంతవరకు ఇష్టారాజ్యంగా ఇస్తూవచ్చిన పద్ధతికి స్వస్తిచెప్పి, లాటరీ పద్ధతిని ప్రవేశపెట్టడం ద్వారా బంధుప్రీతి, అవినీతులను ఒక్క దెబ్బతోవారు కొట్టిపారవేశారు. ఉదాహరణకు, ఢిల్లీ అధికారులు సంగ్రహించిన 10 వేల ట్రాక్టర్లను

5 ఎకరాలు, అంతకంటే ఎక్కువ వ్యవసాయ భూములు ఉన్నవారికి పంపిణీ చేసారు. ఫలితంగా అప్పటివరకు విపరీతంగా ఉన్న ట్రాక్టర్ల నల్లబజారు ధరలు త్వరలోనే తెరమరుగయిపోయాయి. అదే విధంగా, లాటరీ పద్ధతిలో భూముల కేటాయింపులోను, వైద్య, ఇంజనీరింగ్, పాలిటెక్నిక్, పారిశ్రామిక శిక్షణ సంస్థలలో సీట్ల పంపకంలో విచక్షతను అంతం చేసి ప్రతిభకే ప్రాధాన్యత కల్పించడంలోను, కార్పొరేషన్ కార్యాలయాలలో అనవసర జాప్యం తగ్గించడంలోను, మొట్టమొదటిసారిగా ధనికులకు, పేదలకు అందరికీ సమానంగా ఉంటూ వచ్చిన పన్నుల నియమాలను మార్పుచేసి, ధనవంతులకు అధిక పన్నులు, పేదవారికి తక్కువ పన్నులు నిర్ణయించడంలోను అనేక చర్యలు వారు తీసుకున్నారు. ఫలితంగా పరిపాలనా యంత్రాంగం మొత్తంలో ఒక ఆరోగ్యప్రదమైన ప్రజా ప్రధాన మార్పు సంభవించింది.

ఉద్యోగుల నియామకాలలో ఖచ్చితమైన నియమాలు రూపొందించి, అమలు చేసారు. దరఖాస్తుల విషయంలో నియామకాలు చేసే అధికారులు అనుభవిస్తూ వచ్చిన విస్తృత విచక్షతా పూర్ణ అధికారాలను తొలగించారు. ఉదాహరణకు, ఉన్నత విద్యా కోర్సులకు జరిగే ఎంపికలో అవినీతికి, బంధుప్రీతికి గల అనంతమైన అవకాశాన్ని, అనుశీలన (ఇంటర్వ్యూ)కు గల అత్యధిక మార్కులను కనీసానికి తగ్గించడం ద్వారా తొలగించగలిగారు. సంబంధిత నియామకాలకు కావలసిన కనీస మార్కుల శాతం ఒక ప్రకటన ద్వారా తెలియజేయసాగారు. ఈ చర్యలు ఎంత కఠినమైన పద్ధతిలో అమలు చేయబడ్డాయంటే, మొత్తం 5 ఏళ్ళ వ్యవధిలోను అర్హుడైన అభ్యర్థికి న్యాయం నిరాకరించబడిన ఫిర్యాదు ఒక్కటికూడా అందలేదు.

పాఠశాల విద్య విషయంలోకూడా, ధనవంతుల వర్గాలలో అధికమార్కులు సాధించుకున్న వారినే పాఠశాలలో చేర్చుకునే కొన్ని పాఠశాలల పద్ధతిని నిరోధించారు. ఆ బస్తీలోని అన్ని వర్గాలు, అన్ని స్థాయిలకు చెందిన పిల్లలు అదే పాఠశాలలో చేరేటట్లు చేశారు. వెనుకబడిన బస్తీలలోని వందలాది పాఠశాలలకు కనీస బోధనా సాధనాలను సరఫరా చేశారు.

# సమాజ సేవ - సమగ్ర స్వరూపం

సమాజంలోని బలహీన, ఉపేక్షిత వర్గాలకు సేవ చేయడంద్వారా హిందూ పునర్జాగరణోద్యమానికి ఒక పెద్ద ఊపు నివ్వాలని స్వయం సేవకులు ప్రయత్నం చేస్తున్నారు. ఈ ప్రయత్నాలలో ప్రజలచొరవకూడా చాలా అవసరం ఉంటుంది. అది గ్రహించిన స్వయంసేవకులు ప్రజలలో తమలాంటి ప్రేరణనే కలిగిన వ్యక్తుల సహకారంతో అనేక సేవా సంస్థలను ప్రారంభించారు.

## వనవాసీ జీవనంలో నవయౌవనం:

ఈ సేవా పథకాలలో వనవాసులకే అధిక ప్రాధాన్యత లభించింది. వారు ఎదుర్కొంటున్న సమస్యలు, సవాళ్ళు సంక్లిష్టమైనవి. అనేక కోణాలనుండి వాటిని పరిష్కరించవలసి ఉంటుంది. ఈ రంగంలో అంకితం అయిన మొట్టమొదటి వ్యక్తి శ్రీ బాలాసాహెబ్ దేశపాండే అనే నిష్ఠావంతుడైన సంఘ కార్యకర్త. ఈ రంగంలో మరింత ప్రభావవంతంగా కృషి చేయడంకోసమని ఆయన గిరిజన సంక్షేమ శాఖలోని తన ప్రభుత్వోద్యోగానికి సైతం రాజీనామా చేశారు. న్యాయవాదవృత్తి చేపట్టారు. 1952లో జస్‌పూర్ మహారాజు అందించిన సహకారంతో మధ్యప్రదేశ్‌లోని జస్పూర్ కేంద్రంగా వారు వనవాసీ కళ్యాణాశ్రమాన్ని ప్రారంభించారు.

ఒక వసతి గృహం, ఒక ప్రాథమిక పాఠశాలతో జస్పూర్‌లో పని ప్రారంభం అయింది. యజ్ఞాలు, యాగాలు, రామచరిత మానస్‌లను ప్రచారం చేసే కృషి ఆతరువాత ప్రారంభమైంది. క్రొత్త హనుమంతుని మందిరాలు వెలిశాయి. పాతవాటిని పునరుద్ధరించారు. ప్రముఖ సాధుసంతుల సందర్శనలతోను, వనవాసీ సాధువైన గహీరా గురూజీ

కూడా కలిసి రావడంతోను ఉద్యమం వేగం పుంజుకుంది. వనవాసుల సంప్రదాయ పండుగలు, ఉత్సవాలతోబాటుగా శ్రీరామనవమి సందర్భాన ప్రతి ఏటా పెద్ద ఎత్తున జాతర జరగడం ప్రారంభమైంది. 1963లో ధార్మిక జాగరణకు ఒక పెద్ద ఉద్యమం ప్రారంభమైంది. దీపావళిరోజున గోవర్ధన పూజతో ప్రారంభమైన ఆ ఉద్యమం శ్రీరామ నవమి వరకు కొనసాగింది. అనేక ధార్మిక కార్యక్రమాలు జరిగాయి. ధార్మిక, జాతీయనాయకులపై హరికథలు, సాధుసంతుల ప్రవచనాలు, రామాయణ మండలుల ఆవిర్భావం, రామాయణంపై ప్రసంగాలు, జస్పూర్‌లో జరిగే శ్రీరామ నవమి ఉత్సవాలలో చుట్టు పట్ల నుండి అనేక భజనమండ లులు పాల్గొనడం-ఇవన్నీ కలిసి వనవాసులలో అపూర్వమైన ఉత్తేజాన్ని నిర్మాణంచేశాయి. కళ్యాణాశ్రమ భవన ప్రారంభోత్సవ సందర్భంగా శ్రీ గురూజీ, జస్పూరు మహారాజుల సమక్షంలో 10 వేలమంది వనవా సులు పాల్గొన్నారు. కళ్యాణాశ్రమ పిలుపు వెనుక వున్న అద్భుతమైన శక్తికి ఆ దృశ్యం ఒక సాక్షిగా నిలిచింది. ఆనాటినుండి కళ్యాణాశ్రమ కార్యకలాపాలు మధ్యప్రదేశ్ అంతటా విస్తరించాయి. చుట్టు ప్రక్కల ప్రాంతాలలో కూడా వ్యాపించాయి. కళ్యాణాశ్రమం ప్రారంభించిన పథకాలు, ప్రకల్పాలు వందల సంఖ్యలో ఉన్నాయి.

కళ్యాణాశ్రమం నడుపుతున్న ఆవాస విద్యాలయాలు, వసతి గృహాలు కేవలం పాఠ్యప్రణాళికను బోధించే కేంద్రాలు మాత్రమే కాదు. ఉదాత్త హిందూ విలువలను అవి ఆ యువకుల హృదయాలలో నింపుతున్నాయి. ముఖ్యంగా మహిళలకు, పిల్లలకు ఉద్దేశించి అనేక స్థలాలలో సంస్కార కేంద్రాలు ప్రారంభం అయ్యాయి. ఫలితంగా త్రాగుడు, జూదంలాంటి దురలవాట్లు తగ్గుముఖం పట్టడం స్పష్టంగా కనిపించింది. వనవాసులలోని వివిధ వర్గాలను ఒకచోట కలపడానికి, పట్టణ ప్రజలతో వారి కలయికకు రక్షాబంధన్ ఉత్సవాలు చక్కటి అవకాశం కల్పించాయి. పాఠశాలలు, దేవాలయాలు, విద్యార్థుల వసతి గృహాలు, పఠనాలయాలు, ఆటల పోటీలు వంటివి పెరుగుతూ వచ్చాయి. వైద్య సదుపాయం తక్కువగా ఉన్న స్థలాలలో ఉచిత వైద్యశాలలు, ఆసుపత్రులు ప్రారంభం అయ్యాయి. కళ్యాణాశ్రమం నిర్వహించే వైద్యకేంద్రాలకు వచ్చేవారు క్రమక్రమంగా త్రాగుడు మొదలైన దురలవాట్లను వదులుకోవడం సాధారణ అనుభవం అయింది. లాభదాయక ఆదాయాలకు నూతన మార్గాలు తెరిచే ఉద్దేశంతో గ్రామీణ, కుటీర పరిశ్రమలు ప్రారంభించారు. అంబర్ చరఖా, కుట్టుపని, తేనెటీగల పెంపకం మొదలైన వాటిలో శిక్షణ కేంద్రాలు నెలకొల్పారు.

సామూహిక భోజనాల ద్వారా సామాజిక సమానత, ప్రతిష్ఠాభావన లను పెంపొందించే ప్రయత్నం జరిగింది. బైటనుండి వచ్చిన ప్రముఖ వ్యక్తులు వాటిలో పాల్గొనేవారు. 1968లో జస్పూర్ కార్యక్రమంలో రాజమాత విజయరాజె సింధియా పాల్గొనడం ఈ పథకాలకు సరి క్రొత్త ప్రోత్సాహాన్నిచ్చింది. 1985లో భిలాయిలో కళ్యాణాశ్రమ మహిళా కార్యకర్తల శిబిరం జరిగింది. పట్టణ, వనవాసీ ప్రాంతాలు రెండింటికీ చెందిన 1200 మంది మహిళలు పాల్గొన్న ఈ శిబిరం భావనాత్మక ఏకాత్మతను నిర్మించడంలో చక్కని అవకాశం అయింది.

1978లో ప్రధాని శ్రీ మొరార్జీదేశాయి జస్పూర్ ఆశ్రమాన్ని సందర్శించారు. అక్కడ సాధించిన బహుముఖ పరివర్తనను ఆయన ఆశ్చర్యంతో, ఆనందంతో తిలకించారు. "ఈ రంగంలో మీరు చాలా ముందంజ వేశారు. క్రైస్తవ మిషనరీలు చాలా వెనుకబడిపోయారు" అన్నారాయన.

రాజస్థాన్‌లో ఉదయపూర్, బాన్స్‌వాడ, బీర్‌వాడ, ఝూలావాడ్‌లలో ఖాద్యనిధి, రక్తనిధి, మందుల నిధి మొదలైనవాటిని కళ్యాణాశ్రమం ప్రారంభించింది.

మహారాష్ట్రలోని ఠానే జిల్లాలో గల తలసరిలో 1967 నుండి ఒక జ్యేష్ఠ కార్యకర్త ఇదే పనికి అంకితమై పనిచేస్తున్నారు. అక్కడ వనవాసీ బాలురకు, బాలికలకు విద్యార్థి వసతి గృహాలు నడుస్తున్నాయి. వాటిలో వృత్తివిద్యాబోధనతోబాటు నైతిక విలువలు, జాతీయ స్పృహ నిర్మించే కృషి కూడా జరుగుతోంది. ఆ విద్యార్థులలో చాలామందిని కోళ్ళపెంపకం, కుట్టుపని, వడ్రంగం, విద్యుత్తుపని మొదలైనవాటిలో శిక్షణకై కళ్యాణ్‌కు పంపించారు. మరికొందరు వ్యవసాయం, మొక్కల పెంపకంలలో కూడా ప్రత్యేక శిక్షణ పొందారు. వారిలో కొందరు విద్యార్థులు ఇప్పుడు ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలలో ఉన్నారు.

మరొక అంశంలో కూడా తలసరి ప్రయోగం విజయం కనబడుతుంది. పాల్ఘార్, జవహర్, మోఖాడా, తలసరి, వాడ - ఈ అయిదు తాలూకాలు పూర్తిగా వనవాసీ ప్రాంతాలే. అవే ఆ తరువాత చుట్టుప్రక్కల తాలూకాలలో కూడా ఇలాంటి కార్యకలాపాలు విస్తరించడానికి కేంద్రం అయ్యాయి. కొద్ది కాలం క్రితం ఆ ప్రాంతంలో కమ్యూనిస్టులు తమ ప్రాబల్యాన్ని విస్తరింపజేశారు. మొత్తం ప్రాంతం దృష్టిని ఆకర్షించిన ఒక హింసాత్మక ఉద్యమం అక్కడ జరిగింది. అయితే సంఘ, వి. హిం. ప.

కార్యకర్తలు భావాత్మక దృష్టితో హిందూసేవా సంఘ్ (హెచ్.ఎస్.ఎస్) పేరున పని ప్రారంభించారు. ఆర్థిక, విద్యా, సామాజిక, సాంస్కృతిక, ధార్మిక రంగాలలో వనవాసులను ఉద్ధరించడం వారి ప్రధాన లక్ష్యంగా ఉండేది. వ్యవసాయంకోసం అయిదు చేతి పంపులను హెచ్.ఎస్.ఎస్. వేయించింది. నాసిక్ సమీపంలోని మోఖాడా జిల్లాలో సహ్యాద్రి ఆదివాసీ సేవా సంఘ్ మరొక కేంద్రం. భివాండిలో గోపాల్ గణేశ్ దండేకర్ ప్రతిష్ఠాన్, వసాయి తాలూకాలోని విరార్‌లో రుగ్ణోపచార్ కేంద్ర, గోపాలన సమితులు మరికొన్ని సంస్థలు. వనవాసులకు సేవ చేయడంలో ఈ సంస్థలన్నీ అగ్రగాములుగా నిలిచాయి.

కళాశాల విద్యను ముగించుకున్న వనవాసులు తిరిగి తమ స్వగ్రామాల లోనే స్థిరపడేటట్లు చేయడంలోనే తలసరి పథకం సాధించిన ఘనవిజయం అవగతమౌతుంది. వారి వృత్తుల అభివృద్ధికి స్వయంసేవకులు ఎన్నో నూతన మార్గాలు తెరిచారు. వాటి కారణంగా బొంబాయి తదితర స్థలాలలో మంచి ఉద్యోగావకాశాలను కూడా వదులుకుని ఆ యువకులు తమ వనవాసీ సోదరులకు సేవచేయడానికి ఆకర్షితులు అయ్యారు.

కళ్యాణాశ్రమం పెంపొందించే ఉత్తమ సంస్కారాలవల్ల ప్రభావితులైన వనవాసులు తమతమ ప్రాంతాలలో అలాంటి అనేక పాఠశాలలు కావాలని ఆకాంక్షించారు. ఉత్తరప్రదేశ్‌లో టిబెట్ సరిహద్దులో గఢ్వాల్ జిల్లాలో ఒక గ్రామం, పశ్చిమ బెంగాల్‌లోని పురూలియా జిల్లాలో అయోధ్య కొండలలోని మరొక గ్రామం - ఇలా సుదూర వనవాసీ గ్రామాలు సైతం కళ్యాణాశ్రమ కార్యకర్తలను అక్కడ వారి పాఠశాలలు ప్రారంభించమని అభ్యర్థించసాగాయి.

1987 చివరి భాగంలో లఢక్ జిల్లా కేంద్రమైన 'లే' లో స్వయం సేవకులు భగవాన్ బుద్ధ లోక్ కళ్యాణ్ పరిషత్‌ను ప్రారంభించారు. ఆ ప్రాంతంలో వేగంగా వృద్ధి చెందుతున్న ముస్లిం, క్రైస్తవ ప్రభావం నుండి లఢక్‌వాసులను రక్షించడానికి, వారి వెనుకబడినతనాన్ని దూరం చేయడానికి దానిని ప్రారంభించారు. సాంస్కృతిక, జాతీయ భావనలను, మిగిలిన దేశంతో అనుబంధాలను సుదృఢం చేసేందుకు కార్యక్రమాలను రూపొందించారు. 1988లో మొదటిసారిగా సమితి 'లోసర్' పండుగను జరిపింది. ఒక యోగకేంద్రం, ఒక ఉచిత బోధనా తరగతుల కేంద్రం కూడా ప్రారంభించింది.

పశ్చిమ బెంగాల్‌లోని మిద్నపూర్ జిల్లాలో గోపాలీ గ్రామంలో వి.

హెం. వ. నడుపుతున్న 'గోపాలీ ఆశ్రమం' చుట్టు ప్రక్కల నివసించే వనవాసుల అవసరాలను తీర్చే ఒక చైతన్యవంతమైన కేంద్రం. ఒక వనవాసీ బాలుర వసతి గృహంతోబాటు అనేక రాత్రి పాఠశాలలుకూడా ఆశ్రమం నడుపుతోంది. బిర్సాముండ, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, శివాజీ మొదలైన మహావీరుల పేర్లతో నడిచే ఈ పాఠశాలలలో గ్రామాలలోని పనులు చేసుకునే యువకులకు చదువడం, వ్రాయడం, గణితంలలో బోధన జరుగుతోంది. ఖరగ్‌పూర్ ఐ.ఐ.టి.లో అధ్యాపకులు, విద్యార్థులుగా ఉన్న స్వయంసేవకులు వ్యవసాయం, దాని అనుబంధ వృత్తులలో కొన్ని ఆధునిక శాస్త్రీయ పద్ధతులను వనవాసులకు నేర్పుతున్నారు. జన్మాష్టమి, విజయదశమి, జాతీయ వీరుల జయంతుల వంటి వివిధ ధార్మిక, సాంస్కృతిక కార్యక్రమాలను పునఃప్రారంభించడానికి ఆశ్రమం ఉత్సాహం కల్పించింది.

ఆంధ్ర ప్రదేశ్‌లో నాలుగు జిల్లాలలో 100 బాల సంస్కార కేంద్రాలు విద్యార్థి వసతి గృహం ఒకటి, నాలుగు వైద్య చికిత్సా కేంద్రాలు నడుస్తున్నాయి. విశాఖ జిల్లా మఠం గ్రామంలో ఉపాధి కల్పన క్రింద ఒక స్టోన్ క్రషర్ నడుస్తున్నది. 50 మంది గిరిజన విద్యార్థుల కొరకు ఉచిత ఆవాస విద్యాలయం నడపబడుతున్నది. అలాగే విశ్వహిందూ పరిషత్ కర్నూలులో విజ్ఞాన పీఠం, వంకావారి గూడెంలో వాల్మీకి విజ్ఞాన కేంద్రం, గుంతకల్‌లో బహూళార్థ సాధక పధకం, వెదురునగరంలో గిరిజన వికాస కేంద్రం పేరిట అనాధ పిల్లలకు, గిరిజనులకు వసతి గృహంతోపాటు విద్యాలయాలు నిర్వహిస్తున్నది.

కళ్యాణాశ్రమం కారణంగా వనవాసులలో తమ సంఘటిత శక్తిని గురించిన చైతన్యం జాగృతం అవుతోంది. తమపై జరుగుతున్న అవమానాలు, అన్యాయాలను వారు ఎదిరించడం మొదలుపెట్టారు. ఉదాహరణకు ఉత్తర ప్రదేశ్‌లోని మాణిక్‌పూర్‌కు సమీపంలో గల ఒక గ్రామంలో వనవాసీ స్త్రీలు చాలాకాలంగా పోలీసుల ఆరళ్ళకు బలి అవుతూండే వారు. కాని కళ్యాణాశ్రమం రంగప్రవేశం చేసిన తరువాత, ఆ మహిళలు ఎంత గట్టిగా ప్రతిఘటించారంటే, చివరికి పోలీసులు వారికి క్షమాపణలు చెప్పకోక తప్ప లేదు. వనవాసీ యువతీ యువకులకోసం కళ్యాణాశ్రమం ఏకలవ్య క్రీడా ప్రకల్పం ప్రారంభించింది. వారిలో దాగి వున్న ప్రతిభను వెలికితీయడానికి ఉద్దేశించిన ఈ ప్రకల్పం వారిని విశేషంగా ఆకర్షించింది. ఈ ప్రకల్పం కింద 1987లో దేశం మొత్తంమీద జిల్లా ప్రాంతస్థాయి పోటీలలో 9,500 మంది యువకులు పాల్గొన్నారు. 1988 జనవరిలో బొంబాయిలో జరిగిన

అంతిమదశ పోటీలలో 412 మంది అథ్లెట్లు, ఆటగాళ్ళు పాల్గొన్నారు. ఆ పోటీలలో మారథాన్ పరుగు పందెంలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన మరంగ్రామ క్రీడాకారుడు ప్రథముడుగా వచ్చాడు. ప్రారంభ, ముగింపు ఉత్సవాలలో మహారాష్ట్ర శాసనసభస్పీకర్, బొంబాయి మేయర్, ఒక మంత్రి తదితర పురప్రముఖులు పాల్గొన్నారు. భారతదేశపు అగ్రశ్రేణి పరుగులరాజు మిల్ఖాసింగ్ ఆ యువజనులనుద్దేశించి ప్రసంగించాడు. ఆటలలో భారతదేశపు ఆశలన్నీ వనవాసీ బాలబాలికలపైననే ఉన్నాయని, ఒలింపిక్స్‌లో సైతం భారత కీర్తిపతాకను ఎగురవేయగల శక్తిసామర్థ్యాలు వారికే ఉన్నాయని ఆయన అన్నాడు.

కళ్యాణాశ్రమపనిలో చెప్పుకోవలసిన అంశం వారికి 350 మంది పూర్తి సమయ కార్యకర్తలు ఉన్నారు. అందులో 50 మంది మహిళలు కాగా, 120 మంది కార్యకర్తలు స్వయంగా వనవాసులలో నుండి వచ్చినవారే. దేశంలో మొత్తం 175 వనవాసీ జిల్లాలలో 91 జిల్లాలు; 50 వేల గ్రామాలలో దాదాపు 6½ వేలగ్రామాలు కళ్యాణాశ్రమ పనిద్వారా సన్నిహిత సంపర్కంలోకి వచ్చాయి. మొత్తంమీద 700 కేంద్రాలు నడుస్తున్నాయి. వాటిలో 101 విద్యార్థివసతిగృహాలు, 118 ఉచిత వైద్యసహాయకేంద్రాలు (వాటిలో కొన్ని పూర్తిస్థాయి ఆసుపత్రులు కూడా ఉన్నాయి), 102 వివిధస్థాయిల పాఠశాలలు, 37 వృత్తిశిక్షణ, ఆర్థిక సహాయతా కేంద్రాలు ఉన్నాయి.

అయితే కళ్యాణాశ్రమం సాధించిన నిజమైన విజయాన్ని ఈ గణాంక వివరాలతో కొలువలేం. ఈ అన్నికార్యక్రమాల వెనుక ఉన్న ప్రేరణలోనే అది దాగి ఉన్నది. 1982లో మధ్యప్రదేశ్‌లో కళ్యాణాశ్రమ కార్యకలాపాలను సందర్శించిన తదుపరి హిప్సన్‌రాయ్ ఇలా వ్యాఖ్యానించాడు. "మన ఆలోచనలకు ఉదాత్తత ఏర్పడింది. హృదయానికి సంతృప్తి, ప్రదీప్తి లభించాయి"

'ఆదివాసి' పదానికి బదులు 'వనవాసి' పదాన్నే వాడాలన్న కళ్యాణాశ్రమ నిర్ణయం [illegible] ఒక్కమాట. ప్రభుత్వ, మిషనరీ వర్గాలలో మొదటి పదమే బాగా ప్రచారంలో ఉంది. 'ఆదివాసి' పదం ఉపయోగించడం వల్ల కలిగే ప్రమాదాన్ని ప్రజలందరూ తెలుసుకున్నారు. ఆ పదాన్ని బ్రిటిష్‌వారు వాడుకలోకి తెచ్చారు. వారు ఆదిమవాసులుగా పిలిచిన ఈ వనవాసులే అసలైన భారతవాసులని, మిగిలినవారందరూ బైటనుండి వచ్చి స్థిరపడినవారు లేదా దురాక్రమణకారులేనని అర్థం స్ఫురించేటట్లు

ఆ పదాన్ని బ్రిటిష్‌వారు ప్రయోగించారు. ఒరిస్సాలో కళ్యాణాశ్రమ కార్యక్రమంలో పాల్గొన్న తరువాత శ్రీ హరేకృష్ణ మెహతాబ్ ఇలా అన్నారు. "మీ 'వనవాసీ' పదమే సరియైనది. 'ఆదివాసి' అనే పదం పెడదారి పట్టించేది. అది విభజనకారి".

## గ్రామీణాభివృద్ధికి దోహదకారి:

1978లో కొత్తఢిల్లీకి చెందిన దీనదయాళ్ రీసెర్చిఇన్‌స్టిట్యూట్ (డి.ఆర్.ఐ.) గోండా గ్రామోదయ పథకాన్ని ప్రారంభించింది. ఉత్తరప్రదేశ్‌లోని గోండాజిల్లాయొక్క సమగ్రాభివృద్ధికై ఆ సంస్థచేసిన వినూత్నమైన, మార్గదర్శకమైన కృషి అందరూ ఎరిగినట్టిదే. సంఘ జ్యేష్ఠ ప్రచారకులలో ఒకరైన శ్రీనానాజీదేశ్‌ముఖ్ దాని సంస్థాపక అధ్యక్షులు.

చాలాకాలంగా గోండా దేశంలో అత్యంత వెనుకబడిన జిల్లాలలో ఒకటిగా ఉంటూవచ్చింది. బోరింగుల ద్వారా ఆ ప్రాంతంలో నీటివనరులను అభివృద్ధిచేయడం తన ప్రారంభకార్యక్రమాలలో ఒకటిగా డి.ఆర్.ఐ. స్వీకరించింది. ఎందుకంటే ఆ జిల్లాలోని అధికశాతం ప్రజలకు కేవలం వర్షాధారంపైసాగే వ్యవసాయమే ప్రధాన జీవనాధారం. మొదటి రెండు సంవత్సరాలలో 20 వేల బోరింగులు త్రవ్వడం తమ లక్ష్యంగా డి.ఆర్.ఐ. ప్రకటించినపుడు, అంత తక్కువ సమయంలో అది అసాధ్యమని నిపుణులు కొట్టిపారేసారు. కానీ, 1980 అంతంనాటికి 28 వేల బోరింగులు సిద్ధం అయ్యాయి.

డి.ఆర్.ఐ. స్వయంగా ఈ బోరింగులు త్రవ్వలేదు. ప్రభుత్వ సబ్సిడీలను, బ్యాంకు ఋణాలను ఉపయోగించుకునే పద్ధతిని అది ప్రజలకు నేర్పించింది. ఈ ప్రోత్సాహం ఎంత ప్రభావవంతంగా పనిచేసిందో వేరే చెప్పనవసరం లేదు. ఇదే రకమైన పరిస్థితులు నెలకొని ఉన్న చుట్టుప్రక్కల జిల్లాలలో ఇందులో ఒకవంతైనా అభివృద్ధి జరుగలేదు. సమర్పితులైన సంఘకార్యకర్తల సహకారంతో ప్రజలను ప్రేరితులను చేసే సామర్థ్యంలోనే డి.ఆర్.ఐ. విజయరహస్యం దాగిఉంది. ఋణాల చెల్లింపు మిగిలిన దేశంలో సగటున 40 శాతం ఉండగా, గోండాలో మాత్రం అది 80 శాతం వరకు ఉంది.

ఖరేగావ్ గ్రామంలోని ఒక ఔత్సాహికుడైన రైతు తన వ్యవసాయ సంబంధ సమస్యలు తీర్చుకునేందుకు తన గొట్టపుబావికి లోహపు గొట్టం బదులు, వెదురుగొట్టాలను ఉపయోగించదలచినపుడు ప్రజలు ఆయనను

హేళన చేసారు. కానీ అతడు చలించలేదు. ఇతరులను కూడా ఈ ప్రయోగం విషయంలో ఆకర్షితులను చేసేందుకు ప్రయత్నించాడు. ఉమ్రిబేగం గంజ్, రామ్‌నగర్ జిన్నాలకు చెందిన ఇరువురు ఉత్సాహ వంతులైన వ్యక్తులు పెరుగుదలలో ఏ దశలో వెదురు అత్యధిక శక్తి కలిగి ఉంటుందో అధ్యయనం చేసారు. ఈ ముగ్గురు 'వెర్రివాళ్ళ' ప్రయత్నాలు ఎంత విజయవంతం అయ్యాయంటే, వారి పరిజ్ఞానానికి ఇప్పుడు లభిస్తున్న గిరాకీని తట్టుకోవడం వారికి కష్టంగా ఉంది.

నాటడానికి ముందే గోధుమ విత్తనాలను (K-7410 రకం) బలవర్ధకం చేసే నూతన పద్ధతిని కనుగొని, వ్యాప్తిచేయడం డి.ఆర్.ఐ. సాధించిన గొప్ప విజయాలలో ఒకటి. విత్తనాలను గోమూత్రంలో ఉంచుతారు. మధ్యతరహా ఎరువులను కొద్దిగా కలుపుతారు. ఆ తరువాత నాటిన విత్తనాలద్వారా మామూలుకంటే 20-25 శాతం అధిక గోధుమ దిగుబడి వచ్చింది. మొదట శ్రీ ఎమ్.వి. బాపట్ అనే వ్యవసాయశాస్త్రవేత్త ఈ విత్తన బలవర్ధక పద్ధతిని రూపొందించారు. డి.ఆర్.ఐ. చొరవకారణంగా, నేడది వందలాది రైతులకు ప్రయోజనం చేకూర్చింది. ఈ పద్ధతివల్ల ఎరువుల వాడకం అవసరం కూడా సగానికి సగం తగ్గిపోయింది. పురుగుల మందులైతే అవసరమే లేదు. పెట్టుబడులు కూడా చెప్పుకోదగ్గస్థాయిలో తగ్గిపోయాయి. దిగుబడి ఎకరానికి 40-50 క్వింటాళ్ళ వరకు పెరిగింది.

రైతులు నూతన సాంకేతిక విజ్ఞానాన్ని అనుసరించడానికి వ్యతిరేకిస్తారని తరచు అంటూంటారు. కానీ గోండా అనుభవాన్ని బట్టి, వారి విశ్వాసాన్ని చూరగొన గలిగినట్లైతే అభివృద్ధిచెందిన వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్టడం కష్టమైన విషయం ఏమీకాదు అనేది ఋజువైంది.

డి.ఆర్.ఐ. ప్రారంభించిన అనేక కార్యక్రమాల వల్ల దాదాపు లక్ష కుటుంబాల ఆర్థికస్థితి బాగుపడింది. "గోండా జిల్లాలోని గ్రామోదయ పథకంవైపు దేశమంతా అమితాసక్తితో చూస్తున్నది" అని 1978 నవంబర్ 25న ఈ పథకానికి ప్రారంభోత్సవంచేస్తూ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి అన్నారు. ఆయన వాక్యాలు అక్షరాల నిజం.

ప్రభుత్వం సామాజిక అడవుల పెంపకాన్ని ప్రచారం చేసింది. ప్రోత్సహించింది. కానీ దానివల్ల పరిమిత ప్రయోజనం మాత్రమే కలిగింది. గ్రామస్తులకు అవసరమైన ప్రయోజనాలు కల్పించడంలో ఆ పథకం తీవ్రంగా విఫలమైంది. ఈ అడవుల పెంపకంద్వారా వంట చెరకు, కలపల ఆవశ్యకతను తట్టుకోవడంతోబాటు, ఆరోగ్యకర వాతావరణ నిర్మాణం,

పోషకాహార లోపాల నివారణ మొదలైనవికూడా సాధించాలి. ఈ దృష్టికోణంతో డి.ఆర్.ఐ. గ్రామీణ ప్రాంతాలలో అడవుల పెంపకాన్ని చేపట్టింది. సంవత్సరమంతా వరుసగా పండ్లు దిగుబడి వచ్చే విధంగా అయిదు రకాల పండ్ల చెట్లను నాటవలసిందని గ్రామస్తులను ప్రోత్సహించారు. వారి పిల్లల పేర్లతో చెట్లను నాటించడంవల్ల అవిసరియైన పోషణకు నోచుకునేవి. గోండా పథకంలో భాగంగా జిల్లాలోని 2814 గ్రామాలలో ఏటా 3 లక్షల చెట్లు చొప్పున నాటారు.

బ్రిటిష్ హైకమీషనర్ సర్ జాన్ థామస్ గోండాను సందర్శించడానికి అమితమైన ఆసక్తిని ప్రదర్శించారు. ఆ గ్రామ రహదార్లమీద ఆయన కారు నడవదు కనుక మోటర్ సైకిల్‌పై ప్రయాణించడానికి కూడా ఆయన వెనుకాడలేదు.

## సామాజిక పునర్నిర్మాణ కార్యంలో ఆజీవనకార్యకర్తలు :

కొంతకాలం సర్ కార్యవాహగా పనిచేసి, ఆ తరువాత కన్యాకుమారిలో స్వామీవివేకానంద శిలాస్మారక పనిని స్వీకరించిన జ్యేష్ఠ సంఘ ప్రచారక్ శ్రీ ఏక్‌నాథ్ రానడే ఆ ప్రకల్ప నిర్మాణం పూర్తి అయిన పిదప రెండవదశ పథకానికి రూపకల్పన చేసారు. అలా పుట్టినదే వివేకానంద కేంద్ర. యువకులను ఎంపికచేసి, వారికి శిక్షణనిచ్చి సామాజిక పునర్నిర్మాణ కార్యంలో వివిధరంగాలలో సమర్పిత ఆజీవన కార్యకర్తలుగా వారిని నియమించడానికి వివేకానందకేంద్ర అంకితమైంది. ఇప్పటికే, అలాంటి 110 మంది పూర్తిసమయ కార్యకర్తలు పనిచేస్తున్నారు. అరుణాచల్‌ప్రదేశ్, కాశ్మీర్, తమిళనాడు దక్షిణాగ్రాన - ఇలాదేశంలోని సుదూర ప్రాంతాలను సైతం స్పృశిస్తూ 500 ప్రకల్పాలను వారు దేశమంతటా నడిపిస్తున్నారు.

వివేకానంద కేంద్ర ఒక గ్రామీణాభివృద్ధి కార్యక్రమాన్ని రూపొందించింది. స్థానిక ప్రజల మద్దతు, ముఖ్యంగా యువకుల భాగస్వామ్యం ఆధారంగా కేంద్ర ఈ కార్యక్రమాలలో విజయం సాధించింది. కన్యాకుమారి, తిరునల్వేలి జిల్లాలలోని 75 గ్రామాలలో గల మొత్తం 75 బాల్వాడీలు గ్రామస్తులు స్వయంగా నిర్మించినవి లేదా దానమిచ్చినవి లేదా గ్రామపంచాయితీలు కేటాయించినవి. భవనాన్ని కట్టడానికి ధనం ఇవ్వలేని పేదరికంలో గ్రామస్తులు ఉన్న ఒక గ్రామంలో వారిలో ఒక గ్రామస్తుడు తన స్వంత ఇంటిని కేంద్రకు ఇచ్చి, తన స్వహస్తాలతో మరొక పూరిగుడిసె నిర్మించుకుని తానందులోకి మారాడు.

ఈ బాల్వాడీలలో సాంస్కృతిక సంస్కారాలు, శీలనిర్మాణం జరుగుతాయి. రామాయణ, మహాభారతాల పారాయణం, వాటిపై వ్యాసరచన పోటీలు; శ్రీరామకృష్ణ పరమహంస, శారదామాత, స్వామీవివేకానంద, తిరువళ్ళువార్ తదితర సాధుసంతుల, దేశభక్తుల జీవితాలపై వక్తృత్వ పోటీలు ఈ గుణాల నిర్మాణానికి దోహదంచేస్తాయి. 'రామాయణ, మహాభారత నాటకాలలో ముఖ్యపాత్రలను ధరించడానికి ముస్లిం, క్రైస్తవ బాలబాలికలుసైతం ఎంతో ఉత్సుకతను చూపిస్తూ ఉంటారు. అనేక సాహిత్య, సాంస్కృతిక పోటీలలో క్రైస్తవ పిల్లలు కూడా తరచు బహుమతులు పొందుతూ ఉంటారు.

సంవత్సరంలో 4, 5 యువజన శిబిరాలు నిర్వహిస్తారు. గ్రామాలలో రహదార్ల నిర్మాణం, చెరువులకు కట్టలు కట్టడం, చెరువులను పరిశుభ్రంచేయడం వంటి నిర్మాణాత్మక కార్యక్రమాలలో యువకుల శక్తిసామర్థ్యాలను మళ్ళించడానికి ఆ శిబిరాలు ఉపయోగపడుతూఉంటాయి. ప్రార్థనలు, ధ్యానం, యోగాభ్యాసం, ఉపన్యాసాలు, గోష్ఠులతోబాటు ఈ శిబిరాలలో యువకులకు స్వామి వివేకానందుని వ్యక్తి నిర్మాణ సందేశాన్ని ప్రత్యక్ష రూపంలో అందజేసే ప్రయత్నం జరుగుతూ ఉంటుంది.

అనేక గ్రామాలలో కేంద్ర పొగరాని పొయ్యిలను ఏర్పాటుచేసింది. అలాంటి పొయ్యిలవల్ల వంటచెరకు ఆదాకావడంతోబాటు పొగవలన ఉక్కిరిబిక్కిరి అయ్యేదుస్థితి నుండి స్త్రీలు విముక్తం అవుతారు. ప్రభుత్వ ఆర్థిక సహకారంతో ఒక సంవత్సరములో అలాంటి 2 వేల పొయ్యిలను కేంద్ర ఏర్పాటుచేసింది. కన్యాకుమారి జిల్లాలోని అన్నిగ్రామాలను స్పృశిస్తూ కేంద్రకార్యకర్తలు 'ఇంధన సర్వేక్షణ నివేదిక' [Energy Survey Report] తయారుచేసారు. ఢిల్లీలోని ఉన్నత ప్రభుత్వాధికారులు, పారిశ్రామికవేత్తలు 'ఇప్పటివరకు అన్నింటికంటే ఉత్తమమైన సర్వేక్షణ నివేదిక ఇదే'నని ప్రశంసించారు. ఫలితంగా, భారత ప్రభుత్వ నూతన ఇంధన వనరుల శాఖ (Non-Conventional Energy Department) కేంద్ర ప్రారంభించే అనేక పథకాలకు నిధులనివ్వడానికి ముందుకు వచ్చింది. కన్యాకుమారిలోను, చుట్టుప్రక్కల సహజవనరులను సమీకరించడం ఈ పథకాల ఉద్దేశం. బయోగ్యాస్ ప్లాంట్లు, సౌరశక్తి కుక్కర్లు, సౌరవిద్యుత్తు జనరేటర్లు మొదలైనవాటిని ప్రజాబాహుళ్యంలో విస్తరింపజేయడంవల్ల సత్ఫలితాలు కనిపించడం ప్రారంభించాయి.

కర్ణాటకలోని దక్షిణకన్నడజిల్లా ఇడ్కిదుగ్రామంలో ఒకభాగమైన కంబల్‌బెట్టులో కొందరు ప్రముఖ స్వయంసేవకులు 'ధర్మసేవాప్రతిష్ఠాన' (డి.ఎస్.పి.) అనే సంస్థను ప్రారంభించారు. ఆ చిన్న గ్రామంలో బహుముఖ పరివర్తనకు ఆ సంస్థ ఒక ఉజ్వల ఉదాహరణగా నిలిచింది.

కుటుంబసమ్మేళనాల సమయంలో ప్రతిష్ఠాన కార్యకర్తల ఉద్బోధనల కారణంగా త్రాగుడు, జూదంవంటివి దాదాపు పూర్తిగా మటుమాయం అయ్యాయి. వివిధ కులాలకు చెందిన కుటుంబాలమధ్య సన్నిహిత సంబంధాలు ఏర్పడడానికి, తద్వారా 'ఊరంతా ఒకటే కుటుంబం' అనే భావన అందరిలో కలుగడానికి ఈ సమ్మేళనాలు ఎంతగానో దోహదంచేసాయి.

ఈ సామాజిక చేతన అనేక ప్రయోజనకర ధోరణులకు కారణభూతమైంది. గ్రామంలోని 'సేవ సహకారబ్యాంకు' నిర్వాహక మండలిలో ప్రతిష్ఠానకార్యకర్తలు ఎన్నికైన తరువాత ఒక సంవత్సరం తిరిగేలోగా 3 లక్షల వరకు ఉన్న అప్పులు, ఇతర భారములు చెల్లించివేసి, 50 వేల మిగులును నిర్మాణంచేసారు. రాష్ట్రంలో సహకారరంగంలో అగ్రశ్రేణి బ్యాంక్‌లలో ఇదికూడా ఒకటిగా గుర్తింపు పొందిందంటే ఆశ్చర్యం ఏముంది!

గ్రామీణజీవితంలో సర్వసాధారణదృశ్యాలయిన కుటుంబాలమధ్య కలహాలు, ఆస్తి తగాదాలు, కులఘర్షణలు మొదలైనవాటిని పరిష్కరించడం ప్రతిష్ఠాన కార్యకర్తలు గణనీయమైన విజయాన్ని సాధించిన రంగాలలో ఒకటి. గత 4-5 సంవత్సరాల కాలంలో, అలాంటి అనేక సందర్భాలలో వారు కల్పించుకుని, గ్రామపెద్దల సహకారంతో సంతృప్తికరంగా, వాటన్నింటినీ పరిష్కారం చేసారు. గతకొద్ది సంవత్సరాలుగా తన పరిధిలో ఒక క్రిమినల్ లేదా సివిల్ కేసు కూడా నమోదుకాలేదని అక్కడి పోలీసు సబ్-ఇన్‌స్పెక్టర్ తన సహచరులకు, ఇతరులకు సగర్వంగా చెప్పుకుంటూ ఉంటాడు.

గ్రామీణజీవన ప్రమాణాలలో సమగ్రాభివృద్ధి సాధించే ఉద్యమంలో స్వయంసేవకులు తమ చైతన్యవంతమైన నాయకత్వంద్వారా మహిళలను కూడా భాగస్వాములను చేసారు. సామాజికసమానత, సమరసతలను సాధించడానికి, ఆరోగ్యసంబంధ అవసరాలను తీర్చడానికి, వ్యవసాయాన్ని అభివృద్ధిచేయుడానికి, పశుసంవర్ధనకు, నమూనా పాఠశాలలు వయోజన విద్యా తరగతులు నడిపించడానికి ఉద్దేశించిన అనేక కార్యక్రమాలు

గ్రామీణ పునర్నిర్మాణంలో ఇడ్కిదును అగ్రగామి ఉదాహరణగా నిలుపడానికి కారణభూతమయ్యాయి.

## ఉత్తమ జీవనస్థాయికోసం:

బీహార్‌లోని రాంచీజిల్లాలో విష్ణుపూర్‌వద్ద నిష్ఠావంతులైన కొందరు యువకులబృందం సారధ్యంలో నడుస్తున్న 'వికాస భారతి' అనే సంస్థ ఉంది. ఆ యువకులంతా ఉన్నత విద్యాస్థాయి కలిగిన ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులు. సంఘం, అ.భా.వి.ప.లలో వారు శిక్షణకూడా పొందారు. వనవాసీ గ్రామాల సమగ్రాభివృద్ధికి శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించడం ఈ సంస్థయొక్క విశిష్ఠత. అక్కడదొరికే ముడిపదార్థాలనుండి ఉత్పత్తులను తయారుచేయడం; ఆ ఉత్పత్తులకు విక్రయ కేంద్రాలు చూసుకోవడం; వనవాసులు తమకాళ్ళపై తాము నిలబడేటట్లు చేయడానికి వారికి వ్రాయడం, చదవడం, లెక్కలు నేర్పించడం; సాధారణ విజ్ఞానం, ఆరోగ్య విద్యలను బోధించడం; మూలికావైద్యానికి పనికివచ్చే ఔషధులను శాస్త్రీయపద్ధతులలో తయారుచేసి, వాటిని మరింత ప్రభావవంతంగాను, ప్రజాదరణకారకంగాను రూపొందించడం - 'వికాసభారతి' ?గంగా అభివృద్ధి చెందుతున్న కొన్నిదిశలివి.

కార్యకర్తల అరమరికలు లేని వ్యవహారం కారణంగా ఆడ, మగ, పిల్లలు - అన్నివర్గాలకు చెందిన వనవాసులు, అన్ని కార్యక్రమాలలోనూ స్వచ్ఛందంగా పాల్గొనసాగారు. నైతిక, సాంస్కృతిక ప్రక్షాళన విషయంలో కూడా అంతే. ఒకరకంగా అంతకంటే ఎక్కువ శ్రద్ధను కార్యకర్తలు చూపించారు. భజనలు, కీర్తనలు, కథలు, పాటలు, ఉపదేశాలు వికాస భారతి విస్తరించిన 25 గ్రామాలలో వనవాసీ సమూహానికి ఒకనూతన ప్రేరణనిచ్చాయి.

పుణెలోని జ్ఞానప్రబోధిని సంస్థ తన సమగ్ర గ్రామీ[illegible]వృద్ధి పథకం క్రింద పుణెజిల్లాలోని శివగంగ, గుంజావని నదిలోయల్లోగల 170 గ్రామాలపై తనదృష్టిని ప్రసరింపజేసింది.

ప్రబోధిని స్వీకరించిన విషయం ఆరోగ్యం. గ్రామస్థాయి ఆరోగ్యకార్యకర్తలకు ఇప్పటివరకు ఆ సంస్థ మూడు అధ్యయన తరగతులను నిర్వహించింది. గ్రామీణప్రజలలో వ్యక్తిగత, సామాజిక పరిశుభ్రతను గురించిన స్పృహను నిర్మాణంచేసేందుకు తరచు ఆరోగ్యశిబిరాలను ఆ సంస్థ నిర్వహించింది. కుష్టు, క్షయలను నివారించడంపై అది ప్రత్యేక

శ్రద్ధ వహించింది. రాహత్వాడి గ్రామంలో ప్రబోధిని నిర్మించిన 60 శౌచాలయాలు కొన్ని జబ్బులను తగ్గించడానికి ప్రధానకారణం అయ్యాయి.

ప్రబోధిని ప్రోత్సాహంతో ఒక వ్యవసాయ సేవాకేంద్రం ఏర్పాటయింది. అది బయోగ్యాస్‌ప్లాంట్లు, పొగలేని పొయ్యిల వంటి గ్రామీణ సాంకేతిక పరిజ్ఞానాన్ని వ్యాప్తిచేస్తోంది. గత మూడేళ్ళకాలంలో, ఈ ప్రాంతంలోను, కొల్హాపూర్ జిల్లాలోను మొత్తం 6 వందల బయోగ్యాస్ ప్లాంట్లను నిర్మించారు. శివపూర్‌లో ఏర్పాటుచేసిన యంత్రశాల వెయ్యిమందికిపైగా గ్రామస్తులకు వృత్తి శిక్షణ సదుపాయాలను, 250 మంది గ్రామీణ యువకులకు ఉద్యోగావకాశాలను కల్పించింది. వారిలో అయిదుగురు తమ స్వంత వర్క్‌షాపులను ప్రారంభించి, విజయవంతమైన వ్యాపారవేత్తలుగా రూపొందారు. త్రాగుడు అనే శాపంనుండి గ్రామస్తులకు విముక్తి కల్గించే కృషిలో సారాయి దుకాణాలముందు బైఠాయింపు జరుపడానికి ఇరవై అయిదుగ్రామాలనుండి ఏడువందలమంది మహిళలను సమీకరించారు. దీనివలన ఇప్పటికే సత్ఫలితాలు కనిపిస్తున్నాయి. మొట్టమొదటిసారిగా గ్రామజాతర త్రాగుబోతుల కొట్లాటలు, ఇతర అసహ్యసంఘటనలు లేకుండా జరిగింది.

## అణగారిన ప్రజల సమగ్ర అభివృద్ధికోసం:

మధుకరరావు దేవల్ అనే పుణె స్వయంసేవక్ తన విద్యాభ్యాసం ముగించుకున తాతతండ్రుల ఆస్తులను చూసుకోవడానికి స్వగ్రామమైన మహారాష్ట్రలోని సాంగ్లిజిల్లాలోగల మైసాల్‌కు వెళ్ళినపుడు, అక్కడి హరిజనుల నిరుపేద జీవనం, అణగద్రొక్కే అప్పుల స్థితిచూసి చాలావ్యధకులోనయ్యారు.

శ్రీవిఠల్ వ్యవసాయ సహకార సంఘం స్థాపించేటట్లు హరిజనులను దేవల్ ప్రోత్సహించారు. ఆ సంఘం ద్వారా వారు అప్పులను సంపాదించారు. వారి భూములను వారికే ఇప్పించారు. ఆర్థికలాభం వచ్చేవిధంగా వ్యవసాయోత్పత్తులు సాగించే మార్గాలను వారికి బోధించారు. వారు స్వంత ఇండ్లు కట్టుకునేందుకు సహకరించారు. ఇప్పుడు ఆ గ్రామంలోని 125 దళిత కుటుంబాలు ఋణభారం నుండి పూర్తిగా విముక్తం అయ్యాయి. ప్రస్తుతం ప్రతికుటుంబపు సరాసరి సంవత్సరాదాయం 11 వేల రూపాయిలు ఉంటుంది. అదికాకుండా ఉండడానికి ఒక ఇల్లు.... ఈ వివరాలు ఆ గ్రామాన్ని సర్వేక్షణ చేసిన ఒక్క ప్రతిష్ఠిత

సంస్థ నివేదికలో పేర్కొన్నవి. భూములను అమ్ముకోవడం ఆగిపో యింది. కొన్ని కుటుంబాలు తమ భూములను పెంచుకున్నాయికూడా. గ్రామంలోని పాఠశాలలో హాజరుశాతం పెరిగింది. హరిజన విద్యార్థులలో పాఠశాలమానివేసే వారిసంఖ్య బాగా తగ్గింది.

సమాజ జీవితంలో కూడా ఎంతోమార్పు కనబడింది. అంటరా నివారు, మిగిలినవారి మధ్య నిలచిన అడ్డుగోడలు కూలిపోయాయి. దళితులు ఇప్పుడు గ్రామంలో స్వేచ్ఛగా సంచరిస్తున్నారు. సమానస్థాయిలో సమాజం అంతటితో వారు కలిసిపోయారు. జిల్లాలోను, ఇతరచోట్ల ఇతర స్వయంసేవకులు ఈనమూనాతో పోటీపడడం ప్రారంభించారు.

మైసాల్ ప్రత్యేకతలను గురించిపేర్కొంటూ మహాత్మాగాంధి మను మడైన అరుణ్‌గాంధి 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా' (1977 డిసెంబర్ 2)లో ఇలా వ్రాసాడు: "మైసల్ మహాత్మాగాంధీకి నిజమైన స్మృతిచిహ్నం కాదా!"

## అడవుల సంరక్షణ, పోషణ:

కర్ణాటకలోని షిమోగా జిల్లా సాగర్‌తాలుకాలో స్వయంసేవకులు ప్రారంభించిన 'సేవాసాగర్' పథకం సామాజిక పరివర్తనకు శక్తివంతమైన ఉద్యమాలెన్నో నిర్వహించింది. యోగకేంద్రాలు, సంస్కృత ప్రచారం, మాతృమండలులు, సంస్కారకేంద్రాలు, శిశువిహారాలు, బాలగోకులాలు, ఆరోగ్యకేంద్రాలు, వనవాసీ సంక్షేమ పథకాలు మొదలైన కార్యక్రమాలు తాలుకాలోని అనేక గ్రామాలలో అది నిర్వహించింది.

అడవుల సంరక్షణ, మొక్కలు నాటడం వారి మరొక కార్యక్రమం. ఈ కార్యక్రమానికి గ్రామస్తులనుండి కూడా మంచి ప్రోత్సాహం లభిం చింది. కొద్ది దశాబ్దాల క్రితంవరకు దట్టమైన అరణ్యాలకు నిలయమైన ఆ తాలూకా ఇప్పుడుబోడిగా అయిపోయింది. ఈ ఋతుపవన కారకాలయిన అడవులకు కలిగిన ఆటంకం కారణంగా శతాబ్దాలుగా తమ నిత్యావసరా లన్నింటికే అడవులపైనే ఆధారపడి ఉన్న లక్షలాది ప్రజల జీవనాధారం ఒక్కసారి కుప్పకూలిపోయింది. కలపపైన ఆధారపడిన పరిశ్రమలు, జలవిద్యుత్తుకేంద్రాలు, గనులత్రవ్వకం తమవంతు వినాశనానికి కారణం అయ్యాయి.

1983 వ సం||ములో జిగలేమనే అనేచోట స్వయంసేవకుల నాయ కత్వంలో ఒక వయోజన విద్యాకేంద్రంలో పాల్గొనేవారితో ప్రారంభమైన

ఉద్యమం, త్వరలోనే చుట్టుప్రక్కల గ్రామాలకు కూడా విస్తరించింది. ప్రారంభంలో, 90 ఎకరాల అడవిలో చెట్లునరకడాన్ని ఈబృందం విజయవంతంగా ఎదిరించింది. ఆవిధంగా సంరక్షితమైన ఆ అడవి, చుట్టూ ఉన్న బోడికొండలు, బీళ్ళుగా మారిన మైదానాలకు పూర్తిగా భిన్నంగా నిలచిఉంది. ఆ ఉద్యమం ఇప్పుడు 'వృక్ష సంరక్షిసి వేదికె' పేరున తాలూకా అంతావ్యాపించింది. ప్రభుత్వం, పరిశ్రమలు సాగించే అడవుల నరికివేతపై ఉద్యమం కన్నేసిఉంచింది. అక్రమంగా చెట్లునరకడం, గంధపు చెక్కలు, కలప, వంటచెరకు దొంగరవాణాలను ఎదుర్కొనడానికి కూడా వేదికసిద్ధంగాఉంది.

నిర్మాణాత్మక దిశలో కూడా వేదిక మరిన్నిచెట్లు పెంచేకృషిలో 'వృక్ష లక్ష ఆందోళన' (లక్ష చెట్లు పెంచే ఉద్యమం)ను ప్రారంభించింది. ఆ పేరు క్రింది ప్రతి గ్రామం ఒక గ్రామవనం కలిగి ఉండాలని ప్రోత్సాహించారు. ఈ ఉద్యమం ఫలితంగా వివిధకాలాలలో నాటిన మొక్కలను తమ స్వంతబిడ్డలమాదిరిగా ప్రేమతో పెంచిపోషించే భావన గ్రామస్తులలో జాగృతం అయింది. పర్యావరణానికి సంబంధించిన స్పృహను పెంపొందించే వినూత్న పద్ధతులు కూడా ప్రజలలో ప్రాచుర్యంపొందాయి. శుభసమయాలలో చిన్న చిన్న మొక్కలను బహూకరించడం, వివిధరంగాలలో విజయం సాధించిన వారికి పురస్కారంగా వాటిని ప్రసాదించడంవంటివి నమూనాకు కొన్ని. ఈ అన్నిరకాల ప్రయత్నాల ఫలితంగా తాలూకా మొత్తంలో లక్షలాది క్రొత్త చెట్లు పెరిగాయి.

ఈ జాగృతి కారణంగా కర్నాటక పల్ప్‌ఉడ్ లిమిటెడ్ అనే మిశ్రమరంగసంస్థవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలను సాగర్ తాలూకా ప్రజలు గుర్తించగలిగారు. 75 వేల ఎకరాల భూమిలో యూకలిప్టస్‌వంటి వాణిజ్య పరమైన మొక్కలపెంపకానికి ప్రభుత్వం 1984లోనే ప్రణాళికలు వేసింది. కానీ నిరసన వేగంగాను, శక్తివంతంగాను పెరగడంతో ప్రభుత్వం ఆ కార్యక్షేత్రంలోనుండి సాగర్ తాలూకాను పూర్తిగా తప్పించవలసి వచ్చింది.

ఈపోరాటం కోర్టుల వరకు కూడా వెళ్ళింది. 1986 నవంబర్‌లో కర్ణాటక హైకోర్టు 'స్టే' ఉత్తర్వులు జారీచేసింది. ప్రజలు తమ ఉమ్మడి భూములను అనుభవించడానికి ఆటంకంకలుగకుండా చూడమని జిల్లా కమీషనర్‌ను కోర్టు ఆదేశించింది. షిమోగా, చిక్‌మగళూర్ జిల్లాల్లోని గ్రామాల ప్రజలుకూడా సుప్రీంకోర్టులో అలాంటి ఉత్తర్వులే కోరుతూ పిటీషన్‌దాఖలు చేసారు. ప్రజాప్రయోజనాలకై నిరంతరపో

రాటం సాగించినవ్యక్తి, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా. శివరామకారంత్ వారికి నాయకత్వం వహించారు. పరిశ్రమకు అవసరమైన చెట్లపెంపకం కోసం దట్టమైన అడవులను బుల్ డోజర్లతో నరికివేస్తూన్న ప్రభుత్వరంగ సంస్థఅయిన మైసూర్ పేపర్ మిల్స్‌ను ప్రత్యక్ష చర్యద్వారాను, న్యాయ స్థానాలలో కేసులు దాఖలుచేయడం ద్వారాను నిరోధించడం జరిగింది. పోరాటం కొనసాగుతూఉంది.

'పశ్చిమ కనుమలను కాపాడండి' అనే సందేశంతో కేరళ, కర్ణాటక, గోవా, మహారాష్ట్రలలోని మొత్తం కనుమలను స్పృశిస్తూ సాగిన నూరు రోజుల యాత్రను విజయవంతంగా నిర్వహించిన ప్రముఖ సంస్థలలో హిందూసేవాప్రతిష్ఠాన సేవావ్రతులు కూడా ఉన్నారు. కన్యాకుమారిలో ప్రారంభమై 1988 జనవరి అంతానికి గోవాలో పూర్తయిన ఈ యాత్రలో పాల్గొనడంతోబాటు స్వయంసేవకులు యాత్రకార్యక్రమాలను సమన్వయంచేయడంలో కేంద్ర, రాష్ట్ర, జిల్లాస్థాయిలలో ప్రముఖపాత్ర వహించారు. కర్ణాటకలో యాత్రసాగిన అయిదు జిల్లాలలోను నిర్వహించిన కార్యక్రమాలలో వారే ప్రముఖపాత్ర వహించారు. యాత్రకు కర్ణాటకలో ప్రజలనుండి అద్భుత ప్రతిస్పందన లభించిందని, మిగిలిన ప్రాంతాలలో కంటే ఇక్కడ పర్యావరణ పరిరక్షణ విషయంలో ఎక్కువ జాగృతి గోచరమైందని అనేకమంది యాత్రికులు అభిప్రాయపడ్డారు. విభిన్న సైద్ధాంతిక పునాదులు కలిగిన 170 స్వచ్ఛందసంస్థల సభ్యులు ఒక సమాన ఆశయంకోసం ఒకచోట కలుసుకోవడం ఒకరకంగా విశిష్టమైన సందర్భం. ఫ్రంట్‌లైన్ పత్రిక (1987 నవంబర్ 28 - డిసెంబర్ 11) పేర్కొన్నట్లు, ఈ యాత్ర "ఒకనాడు పచ్చని ఋతుపవన అరణ్యాలకు నిలయంగా ఉండిన ప్రాంతపు ప్రస్తుతస్థితి ఎడల ప్రజల ఆవేదనకు ప్రతిరూపం."

## ఆరోగ్యాన్ని పెంపొందించడం:

స్వయంసేవకులు నడిపే అనేక అభివృద్ధి పథకాలలో అగ్రతాంబూలం ఆరోగ్యసంబంధ కార్యక్రమాలదే. వనవాసీ ఆధిక్య ప్రాంతాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను స్థానిక అవసరాలనుబట్టి వైద్యకార్యక్రమాలు నిర్వహించవలసివస్తుంది. పట్టణ ప్రాంతాలలో మాత్రం ఆరోగ్యం సమగ్ర వికాసానికి కేంద్ర బిందువు.

జామోద్ (విదర్భ), నిజామాబాద్ (ఆంధ్రప్రదేశ్) లలోను ఇంకా

అనేక ఇతర రాష్ట్రాలలోను వి.హిం.ప. వైద్యకేంద్రాలను నడుపుతోంది. షిల్లాంగ్ (మేఘాలయ), ఉదయ్‌గురి (అస్సాం), టేనింగ్ (నాగాలాండ్), నాసిక్ (మహారాష్ట్ర), వల్సాడ్ (గుజరాత్), ఉదయ్‌పూర్ (రాజస్థాన్)లలో కళ్యాణాశ్రమం, దాని అనుబంధసంస్థలు వనవాసులకు వైద్యపరమైన అవసరాలు తీర్చేకృషిలో ఉన్నాయి. తమిళనాడులో గత 16 సం.లుగా స్వయంసేవకులు అనేక వైద్యకేంద్రాలు నడుపుతున్నారు. అమృత్‌సర్‌లో డా. హెడ్గేవార్ మెడికల్ ఎయిడ్ సొసైటీ గత 40 ఏళ్ళుగా సేవచేస్తోంది. ఏటా 40 వేలమంది అక్కడ చికిత్సపొందుతూ ఉంటారు. మహారాష్ట్ర లోని సాంగ్లీ, థాణేలలో, ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరు, విశాఖపట్నం, కృష్ణాజిల్లాలలో, కర్ణాటకలోని షిమోగా, కొడగుజిల్లాలలో గత అనేక సంవత్సరాలుగా స్వతంత్రరీతిలో ప్రాంతీయ ఆసుపత్రులు, ఇతర ఆరోగ్యకేంద్రాలు ఎన్నో నడుస్తూనే ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరులో 50 పడకలతో జైభారత్ హాస్పిటల్, కృష్ణాజిల్లా నాగాయలంకలో 10 పడకలతో దీనదయాళ్ ఆసుపత్రి నిర్వహించబడుతున్నాయి. విశాఖలో వివేకానంద మెడికల్ మిషన్ గత 10 సంవత్సరాలుగా వైద్యసేవలను అందిస్తున్నది. మహారాష్ట్రలోని లాతూర్‌లో ఉన్న సహకార ఆసుపత్రి అత్యంత ప్రతిభావంతులైన కొందరు స్వయంసేవక్ వైద్యుల సమర్పిత కృషిఫలితంగా ఆవిర్భవించినదే. ఆ ఆసుపత్రిచేస్తున్న విశిష్టసేవలను గుర్తించిన కేంద్ర ప్రభుత్వం దానిని వైద్యపరిశోధనా కేంద్రంగా ప్రకటించింది. ఉత్తరప్రదేశ్‌లో 'సేవా ప్రకల్పసంస్థాన్' అనేక ఉచిత చికిత్సాకేంద్రాలను నడుపుతోంది. హిమాలయ పర్వతసానువులలో ఆల్మోరాకు సమీపంలో విజయపూర్ అనే లోతట్టు హిమఫలిత ప్రాంతంలోకూడా అలాంటి ఒక చికిత్సాకేంద్రం నడుస్తోంది.

ఒరిస్సారాష్ట్ర వయోవృద్ధ నాయకుడు శ్రీహరేకృష్ణ మెహతాబ్ ఒకసారి చాకపాడ్, కటింగియాలలో కళ్యాణాశ్రమం నడుపుతున్న ఆరోగ్యకేంద్రాలను సందర్శించారు. ఆ తరువాత నుండి అగ్రశ్రేణి ఒరియా వార్తాపత్రిక ప్రజాతంత్రలో తాను రోజూవ్రాసే శీర్షికలో ఆ కేంద్రాలు చేస్తున్న అద్భుతసేవలను గురించి పదేపదే ప్రస్తావించేవారు. జమ్మూకాశ్మీర్‌లో సంఘం, వి.హిం.ప.ల కార్యకర్తలు కలిసి, ఉపేక్షిత బస్తీలలోను, గ్రామాలలోను ఆరోగ్య సర్వేక్షణ, ఉచిత చికిత్సాకేంద్రాలు, కంటి చికిత్సా శిబిరాలు నిర్వహించారు. "మా హిందూ సోదరులనుండి అంతటి ప్రేమ, అనురాగాలను అనేకతరాల తరువాత మొట్టమొదటిసారి అనుభవిస్తున్నాం" అని ఆనందం వ్యక్తంచేసారు అక్కడి హరిజనులు.

కేరళలోని ముట్టిల్‌లో 25 పడకలతో సకల సౌకర్యాలుగల ఒక ఆసుపత్రి నడుస్తోంది. వైనాడ్ జిల్లా, ఆ చుట్టుప్రక్కల ప్రాంతాలలోని వనవాసుల చిరకాల వైద్య ఆవశ్యకతలను అది పూరిస్తోంది. వారి సంచారబృందం లోతట్టు పర్వతారణ్యాలలో నివసించేవారి వైద్యావసరాలను తీరుస్తూంటుంది. ఆ బృందం 1987లో 144 వైద్యశిబిరాలు నిర్వహించింది. ఆసుపత్రిలో కూడా రోజు 150 మంది రోగులు వస్తూంటారు. రోగులకు సాయం సమయాలలో హారతి, ప్రసాద వితరణ, 'ఓం' లాకెట్లు పంచిపెట్టడంవంటివి జరుగుతూఉంటాయి. వారిలో హిందుత్వంపై విశ్వాసాన్ని అవి మరింత సుదృఢం చేస్తూంటాయి.

ఠాణేలోని ప్రగతి ప్రతిష్ఠాన్ 5 వైద్యకేంద్రాలు, మూగ, చెవిటి వారికి ఒక ఆవాస విద్యాలయం, ఒక నర్సుల శిక్షణాకేంద్రం నడుపుతోంది. వీటితోబాటు ఆర్థిక ఉద్ధరణ, స్వయం ఉపాధిని ప్రోత్సహించడం వంటి వాటికి దోహదంచేసే కార్యక్రమాలను నిర్వహించడంవైపు ప్రతిష్ఠాన్ సహజంగానే దృష్టిసారించింది.

ఆంధ్రలో తుఫాన్ వచ్చిన సందర్భంలో 1977లో జాతీయ వైద్య విద్యార్థుల సంఘటన (NationalMedicos Organisation) ఏర్పడింది. జ్యేష్ఠ సంఘప్రచారక్ అయిన డా. ఆబాజీ థత్తే మార్గదర్శనంలో అది పనిచేస్తోంది. అనేక వైద్యప్రకల్పాల సమన్వయం, మార్గదర్శనంతో బాటు వైద్యవిద్యను పునర్వ్యవస్థీకరించాలని ప్రచారోద్యమం కూడా అదిసాగిస్తోంది.

ఒక నియమిత కార్యక్రమంరూపంలో దేశంలో అనేక ప్రాంతాలలో స్వచ్ఛంద రక్తదానం జరుగుతూనే ఉంటుంది. ఆరెస్సెస్ జనకళ్యాణ సమితి పుణేలో ప్రారంభించిన 'రక్తనిధి', ఈ ఉద్యమంలో ఒక సగౌరవ స్థానాన్ని సంపాదించుకుంది. అది సాధించిన ఘనతకు ప్రశంశాసూచకంగా మహారాష్ట్ర గవర్నర్ సతీసమేతంగా ఆ రక్తనిధి సందర్శనకు వచ్చారు. 1988 తొలిరోజులలో అఖిలభారత రక్తనిధి సంఘం సమ్మేళనాలకు అది ఆతిథ్యం ఇచ్చింది. పుణెలో రక్తసంగ్రహ ఉద్యమంలో సంఘ కార్యకర్తలు పొందిన అనుభవాలపై ప్రసంగించడానికి సంఘప్రాంత కార్యవాహను ఆ సమ్మేళనానికి ప్రత్యేకంగా ఆహ్వానించారు. 'భౌతికమైన ప్రోత్సాహకాల ఆశచూపడంకాక, దేశభక్తి భావనను జాగృతం చేయడం మా విజయానికి కారణం' అని ఆయన చెప్పిన విషయం అందరినీ ఎంతో ఆకట్టుకుంది. 'రక్తనిధి'లోని ప్రధాన పాథాలజిస్ట్‌ను అఖిలభారత సంఘకార్యదర్శిగా ఎన్నుకున్నారు. ఆ తదుపరి లండన్‌లో జరిగిన అంతర్జాతీయ సమ్మేళనంలో పాల్గొనవలసిందిగా కూడా ఆయనకు ఆహ్వానం వచ్చింది.

మంగుళూరులో 1975-77 అత్యవసర పరిస్థితి సమయంలో జైలులోఉన్న స్వయంసేవకుల వద్దకు జిల్లాశస్త్ర వైద్యుని వద్దనుండి ఒక అత్యవసర అభ్యర్ధన వచ్చింది. దాని ననుసరించి, కొద్దిగంటలవ్యవధిలో 60 మంది స్వయం సేవకుల రక్తం జిల్లా ఆసుపత్రి వద్ద సిద్ధంచేయబడింది.

మద్రాస్‌లో హృదయ శస్త్రచికిత్స చేయించుకోవలసి ఉన్న దాదాపు వేయిమందికిపైగా రోగులకు రక్తదాతలు ఉచితంగా రక్తాన్ని అందించారు. (ఒక్కొక్క రోగికి 6-8 సీసాలు). ఒకసారి ఈరోడ్ సమీపంలోని భవానీలో ఒక ముస్లిం తన 10 సం.ల వయస్సుగల కుమార్తెకు శస్త్ర చికిత్సకోసం మద్రాసులోని రైల్వే ఆసుపత్రిలో చేర్పించారు. రక్తంకోసం తన బంధువులవద్దకు వెళ్ళాడు. అయితే వారెవరూ ముందుకురాలేదు. బైటవారు సీసాకు 300 రూపాయిలు అడిగారు. అతడికి అంత చెల్లించుకునే స్తోమతలేదు. తన సంకటపరిస్థితిని వైద్యునికి అతడు తెలిపినపుడు, ఆరెస్సెస్ కార్యకర్తల వద్దకు వెళ్ళమని ఆయన అతడికి సూచించారు. మొదట్లో అతడు కొద్దిగా సంకోచించాడు. కానీ స్వయంగా క్రైస్తవుడైన ఆ వైద్యుడు ఆరెస్సెస్ వారు అలాంటి విషయాలలో మత వివక్షత చూపరని చెప్పి అతడికి ధైర్యం కల్గించారు. అతడు సంఘకార్యాలయం వద్దకు వచ్చాడు. సహాయానికి వెంటనే హామీ లభించింది. శస్త్ర చికిత్సరోజున 6 సీసాల రక్తం అతడికి అందించారు. శస్త్రచికిత్స అనంతరం సంఘకార్యాలయానికి వ్రాసిన లేఖలో అతడు "నిజానికి మా అమ్మాయికి మీరు ప్రాణంపోశారు. ఆరెస్సెస్ అభివృద్ధికి అల్లా సహకారం లభించుగాక!" అని వ్రాసాడు.

ఈ ఆరోగ్యసేవాసంస్థల కార్యకలాపాలు సమాజంయొక్క వైద్యపరమైన అవసరాలను పూర్తిచేయడంకోసం మాత్రమే పరిమితం కాలేదని తప్పక చెప్పవలసి ఉంటుంది. అన్ని రంగాలలో మరింత జాగృతి తీసుకుని రావడానికి, సమాజాన్ని శక్తివంతం చేయడానికి, ప్రగతిగామిగా దానిని రూపొందించడానికి, సామాజిక పరివర్తన సాధించడానికి ఉపయోగపడే ఒక బాహ్యసాధనంగా వైద్యసేవ వినియోగపడింది. సంఘప్రేరణతో నడిచే కార్యక్రమాలకు, వృత్తి కేంద్రితమైన కార్యకలాపాలకు మధ్య అంతరం ఈ అదనపు ప్రత్యేకతలోనే ఉంటుంది.

"మాకు ప్రభుత్వ నిధులువద్దు. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం (IRDP) లాంటి కార్యక్రమాలు కూడావద్దు. మా గ్రామంనుండి

సారాదుకాణం ఎత్తివేయండి చాలు. మా ఆర్థికాభివృద్ధి విషయం మేమే ఆలోచించుకోగలుగుతాం.'' ప్రభుత్వానికి ఈ సవాలు విసిరిన వారు కర్ణాటకలోని షిమోగాకు 10 కి.మీ దూరంలోని 'మండైనకొప్ప' అనే లంబాడీ గ్రామానికి చెందిన ఇద్దరు యువకులు. ఆ లంబాడీ తండా (లంబాడీల నివాసం) జనాభా వెయ్యికంటే కొద్ది ఎక్కువ. వారిలో 90 శాతం మంది వ్యవసాయ కార్మికులే. మొత్తం గ్రామంలో అక్షరాస్యులు డజనుమంది కూడా లేరు. వారు సంపాదించిన దానిలో ఎక్కువభాగం సారాదుకాణానికే ఖర్చయ్యేది. స్త్రీలు తమ పిల్లలకు, చివరకు పసిగుడ్డకుసైతం మద్యాన్నే ఆహారంగా ఇవ్వడంకూడా కద్దు. 1983 ప్రాంతాలలో, ఆ సారాయిదుకాణం ఆదాయం రోజుకు 800 రూ||లు.

ముఖతః, లిఖితంగా లంబాడీ యువకులు చేసిన విజ్ఞప్తులేవీ అధికారుల చెవులలోకెక్కలేదు. 'లైసెన్సు ఇప్పటికే ఇచ్చివేశాం, దానిని రద్దుచేయడం సాధ్యపడ'దన్నదే వారి సాకు. ప్రజలకు ప్రత్యక్షచర్యకు దిగడం అనివార్యమైంది. మద్యాన్ని రవాణాచేస్తున్న వాహనాలను వారు నిలిపివేసారు. ఈ నిరంతర ఉద్యమం ఫలితంగా, మొదటిమెట్టుగా ఆ దుకాణాన్ని దూరంగా తరలించారు. ఊహించినట్లుగానే ఆ తరువాత దుకాణం ఆదాయం చాలాతగ్గిపోయింది.

కర్ణాటకలోని హిందూసేవా ప్రతిష్ఠాన ప్రోత్సాహంతో ప్రారంభమైన ఆరోగ్య వికాస ప్రకల్పంయొక్క వివిధ జాగృతినిర్మాణ కార్యకలాపాలవల్ల లంబాడీ యువకులలో మానసిక పరివర్తన ప్రారంభమైంది. సామూహిక చర్చలు, ఉపన్యాసాలు, అనియత విద్య, రోగనిరోధ విజ్ఞానం, ఆరోగ్య కార్యకర్తలకు నియమిత శిక్షణ మొ||నవి ఆ కార్యకలాపాలలో కొన్ని. ఆర్థికాభివృద్ధిలో అంతర్భాగమైన సమాజంయొక్క నైతిక ఉద్ధరణపైనే వారు ప్రధానంగా దృష్టి కేంద్రీకృతం చేసారు. నైతికమైన వాతావరణం ఏమాత్రం లేకుండా కేవలం ఆర్థిక లక్ష్యాలే కలిగిఉండడం ప్రమాదకరం. ఈ సమగ్ర అవగాహనే ప్రకల్పంయొక్క మౌలికాధారంగా నిలచింది.

## వంచితుల, వికలాంగుల సేవలో:

మూడు సంవత్సరాల క్రితం, ప్రతిష్ఠానకు చెందిన కొందరు సేవావ్రతులు బెంగుళూరు జిల్లాలోని చెన్నపట్న సమీపంలోగల పరిదొడ్డిలో ఒక వ్యవసాయ కూలీకుటుంబాన్ని కలిశారు. వారి 5సం||ల కుమారుని

శిశువిహార్‌కి పంపించమని అడిగారు. ఆ కుటుంబంవారు మొదట్లోఅందుకు నిరాకరించారు. 'వీడి తమ్ముడిని ఎవరు చూస్తారు? అదీగాక, తమలాంటి పేదవారికి పాఠశాలకు వెళ్ళడంవల్ల ప్రయోజనం ఏముంది?' - ఇది వారి ప్రశ్న.

అయితే, ఆమట్టిలో మాణిక్యం ఉజ్వలంగా ప్రకాశించడానికి ఎక్కువ సమయం పట్టలేదు. మిగిలిన పిల్లలలాగే అపరిశుభ్రంగా ఉన్న ఆబాలునికి స్నానం చేయించిన తరువాతే ఆ ఉపాధ్యాయిని విద్యాభ్యాసం ప్రారంభించిందనుకోండి! పాఠశాల వార్షికోత్సవంలో ఆ బాలుడు శ్రీకృష్ణుని పాత్ర పోషించినపుడు తల్లితండ్రులు తమకళ్ళను తామే నమ్మలేకపోయారు. ఆ బాలుడు శిశువిహార్‌లో చేరిన తరువాత ఆ తల్లితండ్రులలో కూడా ఎంతో మార్పువచ్చింది. గతంలోలాగా కాకుండా వారి ఇల్లు ఇప్పుడు శుభ్రంగా, పొందికగా ఉంటుంది.

బెంగుళూరు సమీపంలోని హోసకోటెలో ఒక 6సం||. ల పాప అత్యంత దీనావస్థలో ఉంది. మూర్ఛరోగం కారణంగా ఆమెకు మానసిక వైకల్యం ఏర్పడింది. సరియైన వైద్యం చేయించని కారణంగా మెదడుకి క్షయవ్యాధి వ్యాపించింది. ఆ పాపను ప్రత్యేక చికిత్సకు పంపించాలని స్వయంసహాయబృందానికి చెందిన సేవావ్రతులు నిశ్చయించారు. అందుకు ఆ పాప తల్లిని ఒప్పించడానికి వారు చాలా శ్రమపడవలసివచ్చింది. కొద్దినెలల ప్రయత్నంలోనే ఆ పాప కోలుకోవడం ప్రారంభించింది. ఇదివరకులాగా కాకుండా, ఇప్పుడు ఆ పాప తనంతటతాను నడవగలుగుతోంది. ఇతర పిల్లలతో కలసి ఆడుకుంటోంది. కొత్తకొత్త విషయాలు తెలుసుకోవడంలో అమిత ఆసక్తిని ప్రదర్శిస్తోంది.

పై ఉదాహరణలు గ్రామీణ ప్రాంతాలలోని వికలాంగులు, వంచితులైన పిల్లల కోసం 'సేవఇన్‌యాక్షన్' (SIA) సంస్థ చేస్తున్న సేవను తెలియజేస్తాయి. ప్రతిష్ఠాన ద్వారా ప్రారంభమైన ఈ సంస్థ 80 గ్రామాలలోని 800 మంది పిల్లలకు సేవచేస్తోంది. తనకున్న అనుభవం ఆధారంగా, ఎస్.ఐ.ఎ.సంస్థ మానసిక వైకల్యం గల పిల్లల మధ్య పనిచేసే క్షేత్రస్థాయి కార్యకర్తలకు శిక్షణనివ్వడంలో మిగిలిన సంస్థలతో కలసి కృషిచేస్తోంది.

1962 నాటిమాట. మధ్యప్రదేశ్‌లోని బిలాస్‌పూర్ జిల్లా చంపాలో ఉన్న, కుష్టురోగి అయిన ఒక బక్కపలచటి పెద్దమనిషి కుష్టురోగులకు సేవచేసే సంస్థను నెలకొల్పడం కోసమని ప్రజలవద్ద 25 పైసలు, 50

పైసల చిన్నచిన్న చందాలు వసూలు చేస్తూ తిరుగుతున్నాడు. అతడి ఉత్సాహం, పట్టుదల చూసి ఒకదాత ఒక ఎకరం భూమిని, శిధిలావస్థలో ఉన్న ఒక భవనాన్ని అతడికి దానం ఇచ్చాడు.

శ్రీ గురూజీ ప్రోత్సాహం, మార్గదర్శనంతో ఆ ప్రయత్నాన్ని ప్రారంభించిన వ్యక్తి శ్రీ సదాశివగోవిందకత్రే. అదే స్థలంలో కత్రేతన అంతిమ శ్వాస విడిచిపెట్టేన తరువాత, అంతే సమర్పితభావనతో మరొక సంఘ ప్రచారక్ ఆపనిని చేపట్టారు. పరమ ఉదార స్వభావుడిగా ప్రఖ్యాతిగాంచిన బిలాస్‌పూర్‌కు చెందిన న్యాయవాది శ్రీ జమునా ప్రసాద్‌వర్మ అధ్యక్షతన ఒక సమితి ఏర్పడింది. 'భారతీయ కుష్టు నివారక సంఘం' పేరుతో నడుస్తున్న ఆ కేంద్రం ఇవాళ కుష్టువ్యాధిపీడితులకు అతి చక్కని పునరావాస కేంద్రంగా పరిగణింపబడుతోంది.

ఆంధ్ర ప్రదేశ్‌లోని రాజమండ్రిలో 100 మంది కుష్టు వ్యాధిగ్రస్తుల కోసం వివేకానంద మహారోగి ఆరోగ్య కేంద్రం నిర్వహించబడుతున్నది.

కర్నాటక ప్రాంత విశ్వహిందూపరిషత్ బీజపూర్ జిల్లాలో 'వివేకానంద కుష్టు చికిత్సాకేంద్రం' పేరున అలాంటి కేంద్రాన్నే నడుపుతోంది. ఒక సంఘ ప్రచారక్ దానివెనుక ఊపిరిగా పనిచేస్తున్నారు. అక్కడి ఉన్నతస్థాయి చికిత్సా విధానాన్ని, నైతిక వాతావరణాన్ని చూసి ప్రభావితులై ప్రభుత్వాధికారులు కూడా కార్యకర్తలకు అన్ని విధాల సహకారాన్ని అందిస్తున్నారు.

ఈ రెండు కేంద్రాలలోను కూడా ఆకుష్టురోగులకు చెందిన ఆ వ్యాధి సోకని సంతానంకోసం విడిగా విద్య, వైద్యం, సాంస్కృతిక అవసరాలు తీర్చే ఏర్పాట్లు చేసారు.

## నిలువనీడ లేని వారికి ఆశ్రయం:

డెబ్బైల మధ్యకాలంలో ఒకనాడు, గోవాలో ఒక గూడ్సురైలు పెట్టెలో ఎవరో విడిచిపెట్టి పోయిన ఒక 8సం.ల బాలుడు దొరికాడు. ఎన్నిరోజులు గడిచినా ఆ బాలుని కోసం ఎవరూ రాకపోయేసరికి, ఒక వి.హిం.ప. అభిమాని ఆ బాలుడిని తన ఇంటికే తీసుకుని వెళ్ళాడు. విడిచిపెట్టబడిన పిల్లలకు ఆశ్రయం కల్పించాలన్న ఆలోచన అప్పుడు పుట్టినదే. క్రైస్తవ సంస్థలు అలాంటి అనేక కేంద్రాలను అప్పటికే నడిపిస్తున్నాయి. ఆకేంద్రాలలో పెరిగిన పిల్లలు సహజంగానే క్రైస్తవులయి పోతారు. గోవాలో వి.హిం.ప. స్థాపించిన 'మాతృఛాయ' బహుశః హిందువుల ద్వారా ప్రారంభమైన అలాంటి మొట్టమొదటి కేంద్రం.

తల్లినుండి దూరమైన పిల్లలను పెంచడంలో ఉండే కఠినపరీక్షలు ఊహించవచ్చు. అయితే, అంకితభావంగల ఒక మహిళా కార్యకర్తల బృందం మాతృఛాయను దారిప్రక్కన వదిలివేసిన పిల్లల పాలిట ప్రేమ, సహకారాలను పంచే ఒక విశిష్ట నిలయంగా మార్చివేసింది. దారిప్రక్కన వదిలివేసిన అప్పుడే పుట్టిన, ఒకటి రెండురోజుల పసికందులను కూడా వారు స్వీకరిస్తున్నారు. ఆ కేంద్రాన్ని సందర్శించే మహిళలు విశేషంగా ప్రభావితులౌతున్నారు."పసిపిల్లలను పెంచి పెద్ద చేయడం ఎంత కష్ట మైన, సున్నితమైన, ప్రధానమైన పనో మాకు బాగా తెలుసు. మా ఒకరిద్దరు పిల్లలతోనే మేం అలసిపోతూ ఉంటాం. కానీ ఇక్కడ ఒక్క స్త్రీ ప్రశాంతంగా, ప్రేమగా పదిమంది పిల్లలను పోషిస్తోంది." అంటారు వారు. కొత్తగా వచ్చిన పిల్లలకు సంప్రదాయరీతిలో నామకరణం, కేంద్రంలోని ప్రతి బాలుడికి పుట్టినరోజు పండుగ జరుపడం, కొద్దిగా పెద్ద వయస్సువారికి బాలలపాటలు, సులువైన నృత్యాలు, ఆటలు నేర్పించడం, ప్రాతఃస్మరణ, భజనలు, వివిధపండుగలు జరుపడం, విహారయాత్రలు- ఒక మామూలు కుటుంబంలో జరిగినట్లుగానే ఇవన్నీ అక్కడకూడా జరుగుతూ ఉంటాయి.

ఒకసారి, మాతృఛాయలో పిల్లలకు వైద్యం చేయడానికి వచ్చే వైద్యుడు ఒక బాలుడి క్లిష్టమైన కేసు విషయంలో చాలా ఆందోళన చెందాడు. తన భార్యతో మాట్లాడి, చికిత్సకోసం ఆ బాలుడిని తన ఇంటికి తీసుకునివెళ్ళాడు. అతడి ఆరోగ్య పరిస్థితి చక్కబడ్డాక తిరిగి మాతృఛాయలో అప్పజెబుదామని ఆ వైద్యుని ఉద్దేశం. కానీ, చికిత్స నడిచిన ఆ కొద్దినెలలకాలంలో ఆయన భార్య, పిల్లలు ఆ బాలుని ఎడల చాలా ఇష్టం పెంచుకున్నారు. చివరికి అందరూ కలసి ఆ బాలుని తమతోనే ఉంచుకోవాలని ముక్తకంఠంతో తీర్మానించారు. అతడిని దత్తత తీసుకున్నారు.

ఆ పిల్లలలో ప్రస్ఫుటంగా కనబడుతున్న నైతిక, సాంస్కృతిక, ధార్మిక లక్షణాలు చూసి, సంతానం లేని దంపతులు వారిని దత్తత తీసుకునేందుకు ఎంతో ఇష్టంతో ముందుకు వస్తూంటారు. అలా, గత దశాబ్దకాలంలో, మాతృఛాయలో పెరిగిన 90 మంది పిల్లలలో 60 మంది దత్తత చేసుకోబడ్డారు. వాళ్ళలో 34 మంది ఆడపిల్లలు. అలాంటి కుటుంబాలతో ఆ పిల్లలు పెదనాన్న, పెద్దమ్మ, మామయ్య, అత్తయ్య లాంటి అను బంధాలు పెంచుకుంటారు. దత్తత తీసుకున్న కుటుంబాలు ఆ పిల్లలకు

నియమితంగా ఉత్తరాలు వ్రాస్తూంటారు. శెలవులప్పుడు, పెళ్ళిళ్ళలాంటి సందర్భాలలోను వారిని తమ ఇండ్లకు తీసుకుని పోతుంటారు. ఆ విధంగా ఆ పిల్లలలో తాము ఆ కుటుంబానికి చెందిన వారమేనన్న భావన పెరుగుతుంది. నెమ్మదిగా వారు ఆ కుటుంబపు స్వంతసంతానం మాదిరిగా కలసిపోతారు.

మిగిలిన అనాధాశ్రమాలలో పిల్లలు కొన్నిరకాల మానసిక సమస్యలకు గురి అవుతూ ఉంటారు. కానీ ఇక్కడ సహజమైన, ఆత్మీయపూర్ణమైన కుటుంబవాతావరణం కారణంగా పిల్లలు అటువంటి వాటికి గురికారు. అనాధలైన పసివారిలో అతి తక్కువ మరణ శాతం మాతృఛాయ సాధించిన మరొక ఘనత. ఇందుకు పూర్తిభిన్నంగా, మిషనరీల అనాధశరణాలయాలలో అత్యధికశాతం మరణాలు ఉంటున్నట్లు స్వయంగా అమెరికా వైద్య నివేదికలో పేర్కొన్నారు.

అలాంటి 'మాతృఛాయ'లు ఇంకా అనేక ఇతర స్థలాలలో కూడ నడుస్తున్నాయి. ఆంధ్ర ప్రదేశ్‌లోని విజయవాడలో మాతృఛాయ, సికింద్రాబాద్‌లో వాత్సల్యసింధు పేరున, బెంగుళూరులో 'అనాధ శిశు నివాస'పేరున, కర్ణాటక ప్రాంత వి.హిం.ప. ఆధ్వర్యంలో బెల్గాం, సక్లేశ్‌పూర్, మంగుళూరు, పుత్తూరులలోను; బొంబాయిలో వాత్సల్యపేరున; విదర్భలోని యవత్‌మల్‌లో ఒకటి; ఢిల్లీలోను, ఇతరరాష్ట్రాలలోను ఇవి నడుస్తున్నాయి.

## ప్రతిష్ఠిత వ్యక్తుల సమీకరణలో:

1963లో ఢిల్లీలో ప్రారంభమైన 'భారతవికాస్ పరిషత్' సమాజంలోని ఉన్నత వర్గాలపై తన దృష్టిని కేంద్రీకరించింది. సమాజంలోని ధనవంతులవర్గం సామాన్య ప్రజానీకానికి దూరంగా, ఒంటిస్తంభపుమేడలలో జీవిస్తూండడాన్ని స్వయంసేవకులు తమ స్వీయఅనుభవంద్వారా గమనించారు. తరచు ఈ వర్గం ఆధునికత పేరున పాశ్చాత్య వ్యామోహపు ప్రవాహంలో పడికొట్టుకుని పోతూ ఉంటారు. ఫలితంగా వివిధ రంగాలలో సామాన్యప్రజల సేవలో వినియోగ పడవలసిన వారి మేధస్సు, సమాజంలో వారి ప్రతిష్ఠ, వారి అధికారం నిష్ప్రయోజనంగా మిగిలిపోతూ ఉంటాయి. ఈ ప్రతిష్ఠిత వర్గం యొక్క సేవలను ఆదిశలో సమీకరించడం వికాస పరిషత్ ప్రధానలక్ష్యం.

నిర్ణీతస్థలంలో, నిర్ణీతసమయానికి నెలలో కనీసం ఒకసారి నియమి

తంగా జరిగే సమావేశాలు, కుటుంబ సమావేశాలు, హోలీ, శరత్పూర్ణిమ వంటి జాతీయోత్సవాలు జరుపుకోవడం, పేదలకు, అవసరంలో ఉన్నవారికి సేవాకార్యక్రమాలు - వికాస పరిషత్ కార్యక్రమాల సాధారణస్వరూపం ఇది.

ప్రతి వికాస పరిషత్ శాఖ పట్టణంలో సేవాభావన కలిగిన కనీసం 25 మంది ప్రతిష్ఠిత వర్గానికి చెందిన ప్రతినిధులను సభ్యులుగా చేర్చుకోవలసి ఉంటుంది. 1963లో ఒక శాఖగా ప్రారంభమైన వికాసపరిషత్, నేడు దాదాపు అన్నిరాష్ట్రాలకు విస్తరించింది. ప్రస్తుతం దేశం మొత్తంలో దాదాపు 100 కు పైగా శాఖలు ఉన్నాయి.

1981 జనవరిలో ఢిల్లీలో, వికాసపరిషత్ ఒక ముఖ్యమైన జాతీయ స్థాయి సంగోష్ఠిని నిర్వహించింది. 'జాతీయ పునర్నిర్మాణంలో చరిత్ర నేర్పేపాఠాలు' అనే అంశంపై అక్కడ చర్చ జరిగింది. ఆర్థికవేత్తలు, సామాజికవేత్తలు, భవిష్యత్ద్రష్టలు, సాహితీ ప్రముఖులు, న్యాయవేత్తలు, అనేకరంగాలకు చెందిన మేధావులతో చరిత్రకారులు కలసి చర్చించారు. ప్రఖ్యాత చరిత్రకారుడు శ్రీ జి.సి.పాండే సంగోష్ఠిని ప్రారంభించారు. ఆ తరువాత 'సైద్ధాంతిక సంఘర్షణలు' 'జాతీయ పునర్నిర్మాణంలో మహిళల పాత్ర' అనే అంశాలమీద కూడా సంగోష్ఠులు నిర్వహించారు.

ప్రతిఏటా, వికాసపరిషత్ దేశభక్తి గీతాల బృందగానం పోటీలు నిర్వహిస్తూ ఉంటుంది. ఢిల్లీ చుట్టుప్రక్కల రాష్ట్రాలనుండి కళాశాలలు, ఇతర సంస్థల బృందాలు వచ్చి పాల్గొంటూ ఉంటాయి. ఢిల్లీలో ప్రతిఏటా జరిగే ప్రముఖమైన కార్యక్రమం ఇది. ఇన్ని సంవత్సరాలుగా ప్రతీసారి బహుమతి ప్రదానోత్సవానికి రాష్ట్రపతిగానీ, ఉపరాష్ట్రపతిగానీ విచ్చేస్తూ ఉన్నారు. కన్నాట్ ప్లేస్‌లో ఛత్రపతి శివాజీ స్మారకాన్ని నిర్మించే ప్రతిష్ఠాత్మక పథకాన్ని 1972 లో వికాసపరిషత్ విజయవంతంగా పూర్తిచేసింది.

ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు వికాసపరిషత్ సభ్యులు ఉదారంగా విరాళాలు ఇస్తూ ఉంటారు. కళ్యాణాశ్రమం నిర్వహించే ఏకలవ్య క్రీడాపోటీల ప్రకల్పానికి సహకారం అందించడం; 100 మంది వనవాసీ బాలబాలికల దత్తత; అశక్తులు, అంగవికలురైన వారికి సహాయం చేయడం లాంటివి వికాసపరిషత్ నిర్వహించే విశేష కార్యక్రమాలలో కొన్ని. పేద వెనుకబడిన ప్రజలు నివసించే బస్తీలలో వికాసపరిషత్ వైద్యశిబిరాలను నిర్వహిస్తూ ఉంటుంది. ఆయా బస్తీలలో గ్రంథాలయాలు నెలకొల్పడం కూడా అది తీసుకున్న మరొక సేవా పథకం.

## కార్మికులు, విద్యార్థులను సేవారంగంలో ప్రోత్సహించడం:

అనేక ప్రతికూల పరిస్థితులలో కూడా సమాజశ్రేయస్సుకై తపన చెందడం మజ్దూర్‌సంఘ్ విశిష్టలక్షణం. ఉదాహరణకు, బొంబాయిలోని జామ్ మిల్స్‌లో ఒక కార్మికుడు ప్రమాదవశాత్తు మరణించాడు. అయితే ఈ సంఘటన కారణంగా కర్మాగారంలో పనిని ఆపివేయరాదని, ఆ రోజు జీతంలో సగభాగం మృతుని కుటుంబానికి సహాయంగా ఇవ్వాలని అదే నిజమైన శ్రద్ధాంజలని మజ్దూర్‌సంఘ్‌కు అనుబంధంగా ఉన్న ఆ కర్మాగారపు కార్మిక సంఘం నిశ్చయించింది. ఈ నిర్ణయంతో ఎంతో ప్రభావితమైన యాజమాన్యం కూడా మృతుని కుటుంబానికి తగిన ధనసహాయాన్ని అందించడానికి ముందుకు వచ్చింది. అమరుడైన తమ సహచరునికి నివాళులర్పించేందుకు కార్మికులందరికీ అవకాశం లభించే విధంగా సరిగ్గా షిఫ్టు మారే సమయానికి శవయాత్ర కర్మాగారం ద్వారాల వద్దకు వచ్చేటట్లుగా ఏర్పాటు చేసారు. ఆ తరువాత జరిగిన సంతాపసభలో మృతుని కుటుంబానికి దనసహాయాన్ని అందజేయడానికి విచ్చేసిన కార్మిక మంత్రి, ఈ పద్ధతిని ఎంతగానో ప్రశంసించారు.

1987 లో కేరళలో మార్క్సిస్టుల హింసాకాండకు అనేకమంది సామాజిక కార్యకర్తలు బలైపోయారు. 1987లో బెంగుళూరులో మజ్దూర్‌సంఘ్ జాతీయ సమ్మేళనం జరిగిన సందర్భంలో, ఆ కార్యకర్తల కుటుంబాలకు సహాయమందించడంకోసం విరాళాల నివ్వవలసిందిగా పిలుపునిచ్చారు. 20ని|| సమయంలో మజ్దూర్ సంఘ్‌కు చెందిన వివిధ కార్మికసంఘాల వారు 1,25,000 రూ.ల విరాళాలను ప్రకటించారు.

రక్తదానశిబిరాలు, నేత్ర చికిత్సాశిబిరాల వంటి వాటిలో మజ్దూర్‌సంఘ్ కార్మికసంఘాలు విశేష ఆసక్తిని ప్రదర్శిస్తున్నాయి. అనేక కార్మిక సంఘాలు పదవీ విరమణ చేసిన కార్మికులకు, అనారోగ్యం పాలైన కార్మికుల కుటుంబాలకు ఆర్థికసహాయం అందించడంలాంటి సంక్షేమ పథకాలను నిర్వహిస్తున్నాయి. పుణెలో, గత అనేక సంవత్సరాలుగా మజ్దూర్‌సంఘ్ మురికివాడలలో నివసించే బాలబాలికలకు పాఠ్యపుస్తకాలు, పాఠశాల గణవేషం అందజేస్తున్నది.

విద్యార్థి ఉద్యమానికి విద్యార్థిపరిషత్ కల్పించిన సేవాదృష్టి బహూళార్థ సాధకమైనది. ఆంధ్రప్రదేశ్‌లో అది విద్యార్థులకొరకు శ్రమానుభవ శిబిరాలు నిర్వహిస్తున్నది. వెనుకబడిన గ్రామాల ప్రజలతో కొంతకాలం

కలసివుండి, అక్కడి పేదప్రజల జీవన స్థితిగతులను విద్యార్థులు గ్రహించేందుకు చేస్తున్న ప్రయత్నం ఇది. ఈ ప్రయోగం ఎంతో ప్రేరణదాయకంగా వుంది. రాష్ట్రంలో అనేక స్థలాలలో ఉచిత నేత్ర చికిత్సా శిబిరాలు కూడా పరిషత్ నిర్వహించింది. 1988 జనవరిలో నాందేడ్‌లో మహారాష్ట్ర ప్రాంత విద్యార్థిపరిషత్ సమ్మేళనం జరిగింది. అందులో ఒకపూట భోజనం మానివేసి, ఆ ధనాన్ని కరువు సహాయానికి అందించవలసిందిగా పిలుపునిచ్చారు. మధ్యాహ్నం భోజనం లేకుండా ఉదయం నుండి సాయంత్రం వరకు నిర్విరామంగా కార్యక్రమాలు జరిగాయి. సమ్మేళనంలో పాల్గొన్న వేయిమందిలో ఒక్కరుకూడా కనీసం టీ, బిస్కట్ల కోసమైనా బైటికి వెళ్ళలేదు. ఆ విధంగా ఆదా అయిన 5 వేలరూపాయిలను ఆ రోజు సాయంత్రమే కరువు సహాయానికి విరాళం ఇస్తున్నట్లు ప్రకటించినపుడు, సభికులందరూ ఆనందంతో కరతాళధ్వనులు చేశారు.

ఉత్తరప్రదేశ్‌లో ప్రముఖ సంఘకార్యకర్త అయిన ఒక పారిశ్రామికవేత్త ఉన్నారు. ఆయన అంతరిక్షం, వైమానిక రంగం, సైనికరంగాలలో, ఉపయోగించే ఎలక్ట్రానిక్ వైర్లు, కేబుల్సు తయారుచేస్తారు. తరచు ఆయన అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళివస్తూంటారు. భారతదేశం తిరిగి వచ్చి ఇక్కడ స్వంత పరిశ్రమలు ప్రారంభించుకోమని అక్కడి భారతీయ శాస్త్రవేత్తలు, ఇంజనీర్లకు ఆయన పదేపదే చెబుతూ ఉంటారు. విదేశాలలో ఉన్న అనేకమంది మన యువ ఇంజనీర్లు, శాస్త్రవేత్తలకు ఆయన ఉచితంగా సాంకేతిక సహకారం, మార్గదర్శనం అందించడానికి ముందుకు వచ్చారు: ఆయన ఆహ్వానానికి ప్రతిస్పందించి వారిలో అనేకులు భారతదేశంలో స్వంతంగా చిన్న, మధ్యతరహా పరిశ్రమలను స్థాపించారు. మైక్రో ఫిల్టరేషన్, అల్ట్రాఫిల్టరేషన్, ఇన్‌స్ట్రుమెంట్ కూలింగ్ ఫాన్స్, ఫోటోరెసిస్ట్స్, మైక్రోవేవ్ అబ్జార్బింగ్ మెటీరియల్స్, ఫిలమెంట్స్, ఎలక్ట్రాన్ గన్స్ వగైరా శాస్త్ర, సాంకేతికరంగాలలోని ఉత్తమ విభాగాలలో వారు నిమగ్నులై ఉన్నారు.

## సహకారసంస్థల ద్వారా సేవ:

సహకారరంగం ద్వారా మధ్యదళారుల బెడదను నివారించి, ఆర్థిక న్యాయాన్ని చేకూర్చే దిశలో పెద్ద ముందడుగు వేయవచ్చని, తద్వారా పట్టణ, గ్రామీణ పేదలకు ప్రభావవంతమైన సేవచేసే ఉపకరణంగా ఆ రంగాన్ని తీర్చిదిద్దవచ్చని స్వయంసేవకులు భావించారు.

## మహారాష్ట్రలో :

ఈ దిశలో, మహారాష్ట్రలోని స్వయంసేవకులు బ్యాంకులు, విక్రయ కేంద్రాలు, గృహనిర్మాణం, పారిశ్రామిక రంగాలలో అగ్రగామి ప్రయత్నాలు సాగిస్తున్నారు. వాటితోపాటు బలహీనవర్గాలకు సహాయపడే పథకాలను కూడా రూపొందిస్తున్నారు. 1955లో పుణెలో స్వయంసేవకులు జనతా సహకారీ బ్యాంక్‌ను(జె.యస్.బి) నెలకొల్పారు. 114 కోట్ల మొత్తం డిపాజిట్లతో ఆ బ్యాంకు ప్రస్తుతం సహకారరంగ బ్యాంకులలో ఆసియాలోనే అయిదవ స్థానంలో నిలచిఉంది. జనతా నమూనాలోనే మహారాష్ట్రలోని 7 జిల్లాలలో స్వయంసేవకుల చొరవతో 33 బ్యాంకులు ప్రారంభం అయ్యాయి. అల్పాదాయ వర్గాలు, చిన్న తరహా పారిశ్రామిక విభాగాలకు చెందిన వేలాదిమందికి అవి సేవచేస్తున్నాయి. రిజర్వ్‌బ్యాంక్, సహకార శాఖలలో జె.యస్.బి ప్రతిష్ఠను, విశ్వాసాన్ని చూరగొనగలిగింది. ఆర్థికంగా బలహీనంగా ఉన్న రత్నగిరి అర్బన్ సహకారబ్యాంక్‌ను జె.యస్.బి. లో విలీనం కావలసిందిగా వారు కోరడాన్ని బట్టే ఇది స్పష్టమౌతోంది. జె.యస్.బి. కృషి ఫలితంగా రత్నగిరి బ్యాంక్ యొక్క మొత్తం 7 శాఖలు ఇప్పుడు ఆర్థికంగా బలపడ్డాయి. జిల్లామొత్తంలో మళ్ళీ ఆ బ్యాంక్ ఉన్నతస్థానాన్ని సంపాదించింది. యాజమాన్యం, ఉద్యోగుల మధ్య సామరస్యపూర్ణమైన సంబంధాలు నెలకొల్పేందుకై ఫలవంతమైన ప్రయత్నాలు చేయడం జె.యస్.బి. ప్రత్యేకత.

బార్సిలోని భగవతీ సహకారీ గ్రాహక భండార్, పుణెలోని డిఫెన్స్ కన్స్యూమర్ స్టోర్స్‌లు స్వయంసేవకులు సాగించిన కృషిఫలితంగా వినియోగదారుల సహకారోద్యమంలో బలమైన విభాగాలుగా రూపొందాయి.

ఈ బ్యాంకులన్నీ సహకారరంగంలో మరొకవిధంగా కూడా నూతన ప్రమాణాలను అందుకున్నాయి. వనవాసులు, తదితర సమాజంలోని ఉపేక్షిత వర్గాల సంక్షేమం కోసం లక్షలాది రూపాయిల విరాళాలను అవి నియమితంగా అందజేస్తూనే ఉన్నాయి.

పారిశ్రామిక సహకార సంస్థల రంగంలో, అహ్మద్‌నగర్ జిల్లా రాహూరిలో ఒక ప్రముఖ స్వయంసేవక్ 'రాహూరి సహకార చక్కెర కర్మాగారం' ఒకటి స్థాపించారు. చుట్టుప్రక్కల నివసించే రైతుల జీవన ప్రమాణాలను అభివృద్ధి చేసేందుకు అది ఎంతో సహకరిస్తోంది. సహకార గృహనిర్మాణరంగంలో, నిరుపేదలకు సహాయపడే విధంగా గృహనిర్మాణ సమాఖ్యల నిర్వాహకులకు మార్గదర్శనం చేయడంలో థాణే స్వయంసేవకులు ముందు

న్నారు. కాగా పుణె సమీపంలోని తలెగావ్ స్వయంసేవకులు సహకార విక్రయరంగంలో అగ్రగాములుగా ఉన్నారు. కొల్హాపుర్‌కు చెందిన ఒక స్వయంసేవక్ సహకార సంస్థల ద్వారా దేవదాసీలు, వేశ్యల స్థితిగతులను మెరుగుపరచేందుకు తీవ్రంగా కృషి చేస్తున్నారు.

## కర్ణాటకలో:

స్వయంసేవకుల ప్రమేయం వల్ల సహకార రంగంలో ఎంత స్పష్టంగా, ప్రభావవంతంగా మార్పులు తీసుకుని రావచ్చునడానికి కర్ణాటకలోని దక్షిణకన్నడ జిల్లా ఒక ప్రత్యక్ష నిదర్శనం. ఆ జిల్లాలోని అనేక ప్రాథమిక వ్యవసాయసహకార సొసైటీలు భారీ నష్టాలలో కూరుకుపోయి ఉండేవి. డబ్బు దుర్వినియోగం అక్కడ సాధారణ విషయంగా ఉండేది. కానీ, 1977 తరువాత వాటి యాజమాన్యంలో స్వయంసేవకులు ప్రవేశించడంతో చాలా సొసైటీలు తమ నష్టాలను పూడ్చివేయగలిగాయి. తక్కువ వ్యవధిలో లాభాలను కూడా సంపాదించగలిగాయి. ముఖ్యంగా గ్రామీణ వర్గాల ప్రజలు ఇతరులతో బాటు విశేషంగా వాటివైపు ఆకర్షితులు కాసాగారు. ఆ విధంగా ఆ జిల్లాలో సహకారోద్యమానికి మరల ప్రాణప్రతిష్ఠ జరిగింది.

పుత్తూరులోని తాలూకా వ్యవసాయ ఉత్పత్తుల సహకార విక్రయ సొసైటీ, మంగుళూరులోని జిల్లాస్థాయి జనతాబజార్‌లు 1980 ప్రారంభంలో స్వయంసేవకులు వాటిని తమ నియంత్రణలోకి తీసుకునే నాటికే, ఒక్కొక్కటి 71 లక్షల మేరకు భారీనష్టాలలో నడుస్తూ ఉండేవి. అయితే 3 సం.ల సంక్షిప్త సమయంలో నష్టాలన్నీ దూరం అయ్యాయి. అప్పటి నుండి నిరంతరంగా అవి లాభాలు గడిస్తూనే ఉన్నాయి. జిల్లాలో సహకారోద్యమానికి అవినేడు గర్వకారణంగా నిలిచాయి.

అదేజిల్లాలో ప్రధానంగా వ్యవసాయభివృద్ధికే పరిమితమైన దక్షిణ కెనరా వ్యవసాయభివృద్ధి సంస్థ సహకారరంగంలో మరొక ప్రతిష్ఠాత్మకమైన సంస్థ. ఆ జిల్లా భారీ నీటిపారుదల పథకాలకు తగినది కాదని పరిగణిస్తారు. కనుక ఆ సంస్థలో స్వయంసేవకులు ప్రవేశించిన తరువాత స్వతంత్ర నీటి పారుదల పద్ధతులకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. మర నాగళ్ళు (పవర్ టిల్లర్స్), ధాన్యం పొట్టుతీసే యంత్రాలు (హల్లర్), నీటిపారుదల పంపుసెట్లు, క్రిమిసంహారక మందులు జల్లే యంత్రాలు వంటి చిన్నతరహా వ్యవసాయ యంత్రాలను కొనుగోలుచేయవలసిందిగా

రైతులను సంస్థ ప్రోత్సహించసాగింది. వాటిని నడిపించే పద్ధతులలో రైతులకు శిక్షణకూడా ఇచ్చారు. సంస్థ ప్రతిఏటా వాటాదారులకు 12 శాతం లాభభాజ్యాన్ని (డెవిడెండ్), ఉద్యోగులకు 20 శాతం బోనస్‌ను ఇస్తోంది. ఈ మొత్తం అత్యధిక అనుమతి మొత్తానికి గరిష్ఠ పరిమితి అని గమనించాలి.

స్వయంసేవకుల ప్రభావం మరొక దిశలో కూడా నిర్ణయాత్మక అంశంగా నిలచింది. 1976లో అత్యవసర పరిస్థితి సమయంలో ప్రభుత్వం కర్ణాటక సహకార చట్టానికి సవరణలు చేసింది. ఆ సవరణల బలంతో ప్రతిపక్షాల ఆధీనంలో ఉన్న సహకార సంఘాలన్నింటినీ ఇతర సంఘాలతో కలసిపోవలసిందిగా సిఫారసుచేసారు. అధికారపక్షం వారిని మాత్రం తాకనైనా తాకలేదు. క్రొత్తగా ప్రారంభమయ్యే సహకార సంఘాలకు మూడు సంవత్సరాల వరకు బోర్డ్ ఆఫ్ డైరక్టర్లను, యాజమాన్యాలను నియమించే అధికారాన్ని కూడా ప్రభుత్వం ఆ సవరణలద్వారా తన గుప్పెట్లో పెట్టుకుంది. కానీ, దక్షిణ కెనరా జిల్లాలో సహకార క్షేత్రంలో స్వయంసేవకులు పెద్ద ఉద్యమం నిర్వహించారు. ఫలితంగా, 1977లోనే యాజమాన్యాలకు ఎన్నికలు ప్రకటించడం ప్రభుత్వానికి తప్పనిసరి అయింది. నిజానికి ప్రభుత్వం నియమించిన యాజమాన్యం 1979 వరకు కొనసాగవలసింది. ఆవిధంగా, సహకారరంగంలో ప్రజాస్వామ్యం పునరుద్ధరింపబడింది.

## పూర్తి సమయ హిందూ సేవావ్రతుల సమీకరణ:

అదొక వినూత్నమైన 'జాతికి అంకితం చేసే కార్యక్రమం'. ఒక ఆనకట్టనో, ఆసుపత్రినో జాతికి అంకితం చేసే కార్యక్రమం కాదు. మనుష్యులనంకితంచేసే కార్యక్రమం అది. బెంగుళూరులో స్వయంసేవకులు ప్రారంభించిన హిందూసేవాప్రతిష్ఠాన నిర్వహించిన 6 వారాల శిక్షణను 23 మంది యువతీయువకులు పూర్తిచేసుకున్నారు. దాని కులపతి అయిన పెజావర్‌మఠ్ స్వామీజీ ఆశీస్సులనందుకుని కర్ణాటకలో వివిధ స్థలాలలో సేవావ్రతులుగా - అంటే సమాజసేవావ్రతధారులుగా ... నియమితులయ్యారు. ఇది 1980 నాటిమాట.

మరుసటి సంవత్సరం ప్రతిష్ఠాన యొక్క ఈ ఉద్యమంలో యువతులు పెద్దసంఖ్యలో పాల్గొనడం ప్రారంభించారు. వారికి ప్రత్యేక శిక్షణ శిబిరాలు ప్రారంభమయ్యాయి. గత 6 సం.లుగా అదే పద్ధతిలో - పురుషులకు,

స్త్రీలకు విడివిడిగా శిబిరాలు జరుగుతున్నాయి. ఏటా ఔత్సాహికుల సంఖ్య పెరగుతూనే ఉంది. ఇప్పటి వరకు అలాంటి 500 మంది యువ సేవావ్రతులు కర్ణాటక రాష్ట్రమంతటా పనిచేస్తున్నారు. యోగశిక్షణ, యోగవైద్యం, సంస్కృత సంభాషణను ప్రచారంచేయడం, శిశువిహార్‌లు, సంస్కార కేంద్రాలు, పాఠశాలలు - ప్రధానంగా ఉపేక్షిత, వెనుకబడిన బస్తీలలో వీటిని నిర్వహిస్తున్నారు. ఇవిగాక వైద్యశాలలు, ఆరోగ్యప్రసార పథకాలు, వనవాసుల సంక్షేమం, వ్యక్తిత్వవికాసం, మానసికంగా ఎదుగు దల లోపించిన వారికి పాఠశాలలు, అనాధాశ్రమాలు, వయోజన విద్య, సలహాలు, మార్గదర్శనం, మాతృమండలులు, ధర్మప్రసారం, పర్యావరణ పరిరక్షణ, బాలగోకులాలు - ఇలా సమాజసేవకు చెందిన వివిధ రంగాలలో ఆ సేవావ్రతులు కృషిచేస్తున్నారు.

సేవావ్రతుల ఎంపికకు అవలంబిస్తున్న పద్ధతి సాధారణమైనది, సూటి అయినది. పత్రికలద్వారా ఆసక్తిగల వారిని ఆహ్వానిస్తారు. వారిని అనుశీలన (ఇంటర్వ్యూ) చేస్తారు. సేవావ్రతి జీవితానికి అవసరమైన మానసిక సంసిద్ధత, ఇతరయోగ్యతలు ఉన్నాయా? లేవా? అన్నది పరిశీ లిస్తారు. ఎంపికయిన సేవావ్రతులు 3 సం.ల కనీస కాలం పనిచేయాలి. ఆ పైన వారు కోరుకున్నంతకాలం పనిచేయవచ్చు. వారి కనీసావసరాల విషయంలో ప్రతిష్ఠాన బాధ్యత వహిస్తుంది.

సేవావ్రతులకు సహకరించే విషయంలో స్థానిక ప్రజానీకంనుండి మంచి ప్రతిస్పందన లభిస్తోంది. సేవావ్రతులు ఉద్యమరూపంలో, అంకితభావంతో ఏకార్యానికి తమను తాము అంకితం చేసుకున్నారో, ఆ కార్యం విష యంలో ప్రజల విశ్వాసాన్ని, నమ్మకాన్ని చూరగొనడంలో స్వయంసేవకులు కృతకృత్యులయ్యారని ప్రతిస్పందన నిరూపిస్తున్నది. వివిధ సేవారంగాలలో ప్రవీణులైన పెద్దలనేకులు శిక్షణా శిబిరాలలో సేవావ్రతులకు బోధిం చడానికి, శిక్షణనీయడానికి ముందుకువచ్చారు. విశ్వహిందూపరిషత్, రాష్ట్రోత్థాన పరిషత్‌వంటి ప్రముఖ సేవాసంస్థలు, ఇంకా అనేక స్థానిక సేవాసంస్థలు, ప్రభుత్వ ఆసుపత్రులు కూడా సేవావ్రతుల సేవలను వినియోగించుకుంటున్నాయి.

ప్రతిష్ఠాన రంగప్రవేశం చేసిన ఈ స్వల్పవ్యవధితో పోల్చిచూస్తే, సమాజంపై దాని ప్రభావం ప్రశంసనీయమైనదిగా చెప్పవచ్చు. గౌరవనీయ కుటుంబాలనుండి వచ్చిన అనేకమంది యువతులు - సేవావ్రతులుగా ఉపే క్షిత బస్తీలలోను, గ్రామీణప్రాంతాలలోను పెద్దసంఖ్యలో పనిచేస్తున్నారు.

ఈ దృశ్యం స్థానిక స్త్రీలకుకూడా సేవాకార్యక్రమాలలో పాల్గొనడానికి ప్రేరణనిచ్చింది. సేవావ్రతుల ఆలనపాలన క్రిందకు వస్తున్న పిల్లలు తమ ఇండ్లలోను, చుట్టుప్రక్కల శీలం, సద్వర్తనల ఉదాత్తగుణాల వ్యాప్తికి శక్తివంతమైన మాధ్యమాలుగా ఉపయోగపడుతున్నారు.

బీజపూర్ జిల్లా బసవన బాగెవాడి బస్‌స్టాండ్‌లో ఒక ప్రతిష్ఠాన కార్యకర్త శౌచాలయాన్ని ఉపయోగించిన తరువాత అక్కడి కాపలాదారు చేతిలో రెండురూపాయిలు ఉంచివెళ్ళిపోయాడు. అయితే, ఆ కాపలాదారు ఆయనను మరల వెనుకకు పిలిచి మిగిలిన చిల్లర ఆయన చేతిలోపె ట్టాడు. ఆయన 'ఫర్వాలేదు ఉంచుకో' మన్నారు. అప్పుడా కాపలాదారు సమాధానం ఇచ్చాడు. "లేదండీ! కొద్దిరోజుల క్రిందట, మా అబ్బాయి శిశుమందిరంనుండి తిరిగివచ్చాక నా ఒడిలో కూర్చుని 'అక్రమంగా సంపాదించిన ధనం విషంతో సమానమని, సక్రమంగా సంపాదించినది అమృతమని మా 'మాతాజీ' ఇవాళ మాకు చెప్పారు' అని చెప్పాడు. ఆ రోజునుండి నేను ఆ సూత్రానికి కట్టుబడి ఉన్నాను".

కాడూర్ అనేగ్రామంలో, ఉపవిద్యాశాఖాధికారి 'వందేమాతరం' పూర్తిగీతాన్ని తన కుమార్తె శ్రావ్యంగా పాడడంవిన్నాడు. ఆ పాప సంస్కారకేంద్రానికి హాజరవుతూ ఉంటుంది. అతడెంత ఆనంద భరితుడయ్యాడంటే, తన అధికార పరిధిలో ఉన్న ఉపాధ్యాయులందరికీ, పిల్లలకు జాతీయగీతం పూర్తిగా నేర్పించమని ఆదేశాలు జారీచేసాడు.

1988లో కుందాపూర్ తాలూకాలో సేవావ్రతులు 'సేవామార థాన్'ను నిర్వహించారు. సామాజిక పరివర్తనకు ఒక శక్తివంతమైన ప్రజాఉద్యమంగా ప్రతిష్ఠాన రూపొందుతున్నదనడానికి ఆనాడు లభించిన అమితోత్సాహభరితమైన ప్రజాప్రతిస్పందనే నిదర్శనం. వేయిమంది పాద యాత్రికులతో 18 కి.మీ. దూరం సాగిన ఆ పాదయాత్ర ముగింపు సందర్భంగా జరిగిన బహిరంగసభకు శ్రీ కె. శివరామ కారంత్ అధ్యక్షత వహించారు. ప్రజలలో అద్భుతమైన ఉత్సాహాన్ని రగిలించడంతోబాటు, ఆ మారథాన్ ఆ తాలూకాలో ప్రతిష్ఠాన నిర్వహిస్తున్న సేవాప్రకల్పాలకు లక్షరూపాయిలు కూడా సంపాదించి పెట్టింది. దారిపొడుగునా పెద్దపెద్ద బహిరంగ సభలు జరిగాయి. సామాన్యప్రజలు సైతం సామాజిక కార్య క్రమాలలో పాల్గొనవలసిన అవసరాన్ని ఒకసందేశంగా అనేక గ్రామాలకు తీసుకుని పోవడానికి అవి చక్కని అవకాశం కల్పించాయి.

## సేవకు పాలనాయంత్రాంగాన్ని వినియోగించుకోవడం:

1977 అక్టోబరు 2న గాంధీజయంతి సందర్భంగా రాజస్థాన్‌లో జనతా ప్రభుత్వం 'అంత్యోదయ' పథకాన్ని ప్రకటించింది. గ్రామాలలో నివసిస్తున్న నిరుపేద ప్రజలను గుర్తించి, వారిని ఉద్ధరించడానికై ఉద్దేశించిన మొట్టమొదటి విజయవంతమైన ప్రయత్నం బహుశః అదే. రాష్ట్రం లోని వివిధగ్రామాలలో నిర్ణీతసంఖ్యలో నిరుపేద, అనాధ కుటుంబాలను గుర్తించడం, వారికి జీవనాధారాన్ని కల్పించడం ఈ పథకం యొక్క కార్యక్రమాలు. వారి ప్రస్తుత స్వయంసమర్థన(ఉపాధి) అవకాశాలను ఆధారంచేసుకుని పేదవారిని మూడు వర్గాలుగా విభజించారు. ఎటువంటి ఆర్థిక వనరులు లేని, సంపాదించే సభ్యులు లేని, ఆ విధంగా దాదాపు అనాధలస్థాయికి దిగజారిన కుటుంబాలను అన్నింటికంటే క్రిందిస్థాయిగా గుర్తించారు.

అలాంటి కుటుంబాలను ఎంపికచేసే ప్రక్రియను ఎటువంటి లోపాలకు అవకాశంలేని విధంగా సులభంగాను, సూటిగాను రూపొందించారు. స్థానిక 'గ్రామసభ' సమావేశాన్ని ఏర్పాటుచేసి, దానికి స్థానిక శాసనసభ్యుని, గ్రామాధికారిని, పంచాయితీ సభ్యులను, సంబంధిత ప్రభుత్వాధికారు లను ఆహ్వానిస్తారు. అక్కడ అంత్యోదయ కుటుంబాలను ఎంపికచేసి, వారికి ఇవ్వవలసిన సహాయం స్వరూపాన్ని కూడా నిర్ణయిస్తారు. వృద్ధా వ్యపుపింఛను, భూమికేటాయింపు, ఉద్యోగం, అప్పువంటి రూపాలలో సహాయంతోబాటు, వారి బడికివెళ్ళే పిల్లలకు ఫీజులమాఫీ, పుస్తకాలు, గణవేషం ఉచిత సరఫరా మొ||నవి, ప్రత్యేక ఆరోగ్యసహాయం, పశు సంవర్ధనసదుపాయాలు, ఉచితన్యాయసహాయం, ఉద్యోగాలలో ప్రాధాన్యత, వ్యవసాయ భూములకేటాయింపు వంటి సామాజిక ప్రయోజనాలను కూడా ఆ కుటుంబాలకు కల్పించారు.

అంత్యోదయ పథకం అమలులో మొదటి సంవత్సరం పూర్తయిన అనంతరం ముఖ్యమంత్రి శ్రీ భైరాన్‌సింగ్ షెకావత్ (భారతీయ జన సంఘ్) ఇలా పేర్కొన్నారు: "రాష్ట్రంలోని 33 వేల గ్రామాలలో విస్తరించి ఉన్న 1.6 లక్షల ఆర్థికంగా వెనుకబడిన కుటుంబాలకు సహకారం అందిస్తున్న ఈ పథకం నిర్వహణలో ఎదురయ్యే సవాళ్ళు, ఇబ్బందుల గురించి గత సంవత్సరం అనుభవంతో మేం క్షుణ్ణంగా అర్థం చేసుకున్నాం. అనేక ఇబ్బందులు ఎదురైనప్పటికీ, గత సం.ము ఈ కుటుంబాలలో 80 శాతంమందికి సహాయం అందించగలిగాం. పేదల

అభ్యున్నతిపై నిష్ఠతో, పాలనాయంత్రాంగం సామర్థ్యంపై విశ్వాసంతో ఈ కార్యక్రమాన్ని మేం స్వీకరించాం. దానిని విజయవంతం చేస్తాం కూడా".

ఆ తరువాతి సంవత్సరంలో మరొక లక్షకుటుంబాలు అంత్యోదయ పథకం క్రింద ప్రయోజనం పొందాయి.

రాజస్థాన్‌లో అంత్యోదయ సాధించిన విజయాన్ని శ్రీ జయప్రకాశ్ నారాయణ 'తన సంపూర్ణ విప్లవ స్వప్నంలో రెండవదశ'గా అభివర్ణించారు.

జనతాహయాంలో భారతీయ జనసంఘ నాయకులు ముఖ్యమంత్రులుగా ఉన్న హిమాచల్‌ప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల ప్రభుత్వాలు కూడా అనేక ఘనవిజయాలు సాధించాయి. పనికి ఆహారం, అంత్యోదయ, గ్రామోదయ వంటి పథకాలను త్వరితగతిన అమలుచేయడంద్వారా అందరి ప్రశంశలకు పాత్రాలయ్యాయి. పెద్దఎత్తున గ్రామాలకు మంచినీటిని సమకూర్చడంలో హిమాచల్ ప్రభుత్వం నూతన శిఖరాల నధిరోహించగా; మధ్యప్రదేశ్ ప్రభుత్వం దాదాపు లక్షమంది వనవాసులకు భూములపై యాజమాన్యపు పట్టాలను ఇప్పించడంలో కృతకృత్యం అయింది.

ఢిల్లీ నగరపాలక సంస్థకు అనేక అవలక్షణాలతో నిండిన చరిత్ర ఉంది. ఆ నగరంలో 50 శాతం ప్రజలు మురికివాడలలో, హరిజన బస్తీలలో, అక్రమ ఆక్రమణలలో, 220 పరిసర గ్రామాలలో నివసిస్తారు. జనసంఘ్, భా.జ.పా. అధికారంలో ఉన్న సమయంలో-త్రాగునీటి సరఫరా, విద్యుత్తుకనెక్షన్లు; బావుల శుభ్రత, పూడిక తీయించడం; రహదారుల నిర్మాణం; మురికినీటికాలువల నిర్మాణం; 2 వేల హరిజన బస్తీలు, 4 వేల మురికివాడలు, 700 అక్రమవాడలు, మొత్తం 254 గ్రామాలలో గల వెనుకబడిన, ఉపేక్షిత బస్తీలలో శ్రామికులకు రాత్రి పాఠశాలలు తెరువడం- వంటి అనేక పథకాలు అమలు జరిపారు. ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్., పి.ఎస్.సి., ఐ.పి.సి., బ్యాంకులు తదితర అఖిల భారతస్థాయి ప్రభుత్వోద్యోగాల పరీక్షలకు తయారయ్యేందుకు షెడ్యూల్డు కులాల విద్యార్థులకు ప్రత్యేక శిక్షణకు ఏర్పాట్లు చేసారు. వీటన్నింటితో బాటు, ఢిల్లీ అభివృద్ధిసంస్థ ఆధ్వర్యంలో నూతనంగా ఆవిర్భవిస్తున్న కాలనీలన్నింటిలోను రజకులు, క్షురకులు, చెప్పులుకుట్టేవారు, పారిశుధ్య పనివారు, ఇండ్లలో పనిచేసే వారికోసం ఒక నిర్ణీతశాతం ఇండ్లను కేటాయించడం నియమంగా చేసారు. మొట్టమొదటిసారిగా 5 వేల గృహాలను

నిర్మించి, వాటిని 5 రూ॥ల నామమాత్రపు అద్దెక్రింద షెడ్యూల్డు కులాల వారికి అద్దెకు ఇచ్చారు.

యమునానదికి ఒకవైపున, భూలోక నరకాన్ని తలపింపజేసే విధంగా వ్యాపించి ఉన్న మురికివాడల వాసులను, నదికి రెండవవైపున నూతనంగా నిర్మించిన కాలనీలలోకి తరలించడం కార్పొరేషన్ అమలుచేసిన ప్రత్యేక పథకాలలో ఒకటి.

గతంలో జనసంఘ్, ప్రస్తుతం భా.జ.పా.ల ఆధిపత్యంలో ఉన్న ఉడిపి పురపాలకసంఘం గత మూడుసంవత్సరాలు వరుసగా (1985-87) రాష్ట్రంలో ఉత్తమ పురపాలక సంఘానికి రాష్ట్రప్రభుత్వం ఇచ్చే పురస్కారాన్ని అందుకుంది. త్రాగేనీరు, రహదారుల నిర్మాణం, ఆటస్థలాలు, పార్కులు, చెట్లు నాటడం, ప్రజారోగ్యం, పారిశుధ్యం పెంపొందించడం, మొత్తంమీద ఉత్తమ పరిపాలన మొదలైన ప్రజావసరాల పూర్తి, వివిధరకాల సేవల నందించినందుకు ఈ పురస్కారం లభించింది.

# 10

## ఆపదలలో అండగా...

తమ ప్రాణాలకు ప్రమాదం ముంచుకొస్తున్నా లెక్కజేయక సమాజ సేవకై ముందుకురికే స్వయంసేవకుల సంసిద్ధతకు, సాహస గుణానికి 1947లో దేశవిభజనకు ముందు, ఆ తరువాత కఠినపరీక్ష ఎదురైంది.

దేశం ముక్కలయ్యేనాటికి, పంజాబ్‌లో సంఘం ప్రారంభమై కేవలం 10 ఏళ్ళే అయింది. కానీ దానిముందు నిలిచిన సవాలు మాత్రం జాతి అంతకుముందెన్నడూ ఎదుర్కొననంతటి విస్తారమైనది, సంక్లిష్టమైనది. నిరాశ్రయులైన లక్షలాది ప్రజల మానప్రాణాలను కాపాడవలసి ఉంది. ఆ దురదృష్టకర దినాలలో, స్వయంసేవకులు నిర్వహించిన పాత్ర వీరత్వం, త్యాగం, బలిదానాల వైభవోపేతమైన, రోమాంచకమైన అమరగాథగా సదాసర్వదా నిలిచిపోతుంది.

## 1947లో: సేవ, సమర్పణల అమరగాథ:

1947 మార్చిలో రావల్పిండిలో ముస్లింలు సాగించిన అత్యాచారాల ఫలితంగా లక్షలాది హిందువులు నిర్వాసితులయ్యారు. అది కేవలం ప్రారంభం మాత్రమే. దేశవిభజన విషాదదినం దగ్గరైనకొద్దీ, ఆ తరు వాత ప్రత్యక్షంగా మారణహోమం జరిగింది. యావత్తు ప్రజానీకం నిరాశ్రయులయ్యారు. వికలాంగులుగా మిగిలిపోయారు. అవమానాలకు గురిఅయ్యారు. బైటకు తరిమివేయబడ్డారు. అన్నివైపుల నిరాశ, విధ్వం సాల గాఢాంధకారం అలముకుని ఉన్న ఆ చీకటిక్షణాలలో సంఘమొక్కటే తమకు సహకారం, ఉపకారం అందించే ఏకైక కాంతిరేఖ అని ప్రజలు ఆశతో చూడసాగారు. పంజాబ్ సహాయతా సమితిని నిర్మాణం చేసి స్వయంసేవకులు, ప్రాంతంలోని ప్రతి తాలూకా కేంద్రంలోను సహాయశిబిరాలను ప్రారంభించారు. నిధులకోసం శ్రీగురూజీ ఇచ్చిన

పిలుపుకు దేశప్రజలు అద్భుతరీతిలో ప్రతిస్పందించారు. 50 లక్షల రూపాయిలు వసూలయ్యాయి. సహాయశిబిరాల నిర్వాహణకు ఆ ధనాన్ని ఖర్చుచేసారు. అనాథలైన, అంగవికలురైన వందల, వేల పురుషులు, స్త్రీలు వాటిలో తలదాచుకున్నారు. వారికక్కడ వసతి, భోజనం లభించాయి. అన్నింటినిమించి ఓదార్పు లభించింది. కాంప్‌బెల్‌పూర్ జిల్లాలోని పంజాసాహెబ్ సమీపంలోగల ఒక్క 'వా' సహాయ శిబిరంలోనే 20 వేలమంది శరణార్థులు తలదాచుకున్నారు. ఈ ప్రజలను కాపాడి, సురక్షితంగా వారిని శిబిరానికి చేర్చే ప్రయత్నంలో 87 మంది ఉత్తమ సంఘ కార్యకర్తలు తమ అసువులు బాసారు. లాహోర్‌లోని 'పేరుమోసిన' షాహిఖిలాలో 120 మంది స్వయంసేవకులను అమానుష చిత్రహింసలకు గురిచేసారు. భీమసేన్ సచార్‌లాంటి ప్రముఖవ్యక్తులు, కేంద్రనాయకుల గృహాలను స్వయంసేవకులు రాత్రింబవళ్ళు కాపలాకాసారు.

ఆ రోజులలో, పంజాబ్‌లో హింసాకాండ వాతబడిన ప్రజలకు ఆశాకిరణంగా, సమర్థకునిగా నిలచిన ఏకైక అఖిలభారతనేత శ్రీగురూజీ. ప్రమాదాల కోరలలో సైతం వారు ప్రదర్శించిన ఉన్నతమైన నిర్భయత, ప్రజలకోసం వారి తీవ్రమైన తపన, ప్రమాదాలను లెక్కజేయకుండా, విశ్రాంతి గురించి ఆలోచించకుండా ఆ ఘర్షణలతో అతలాకుతలమైన ప్రాంతాలలో వారు సాగించిన నిరంతర పర్యటన - ఇవన్నీ ఆ నిరాశ్రయులకు సహాయన్నందించే కృషిలో నిమగ్నమయ్యేటట్లు వేలాది సంఘ స్వయంసేవకులకు ప్రేరణస్రోతస్సులయ్యాయి. అలాంటి ప్రేరణదాయక వ్యక్తిత్వం సాక్షాత్తు తమ కళ్ళముందు నిలబడి ఉన్నప్పుడు, పరిస్థితుల నెదుర్కొనడానికి ఎంతటి శ్రమ, ఎటువంటి ప్రమాదం సంఘకార్యకర్తలకు ఆటంకం కాలేదంటే అందులో ఆశ్చర్యం ఏముంది!

ఆ రోజులలో జరిగిన రోమాంచక సంఘటనలలో ఇది ఒకటి. 1947 సెప్టెంబర్‌లో మారణకాండ ఉగ్రస్థాయిలో ఉన్న సమయంలో శ్రీగురూజీ పీడిత ప్రాంతాల పర్యటనను, సహాయ శిబిరాల సందర్శనను ప్రారంభించారు. అది వర్షాకాలం. పంజాబ్‌లో నదులన్నీ పొంగిపొర్లుతూ ప్రవహిస్తున్నాయి. జలంధర్ నుండి శ్రీగురూజీ లూధియానా వెళ్ళవలసిఉంది. అయితే, వరదల కారణంగా రైళ్ళ రాకపోకలకు అంతరాయం కలిగిందని వార్తవచ్చింది. అయినా శ్రీగురూజీ చలించలేదు. వారు, మరికొందరు సంఘకార్యకర్తలు కలిసి రైలుపట్టాలను పరిశీలించే ట్రాలీపై బయులుదేరారు. జలంధర్ నుండి 8 మైళ్ళదూరంలో చహేరు వద్ద, రైలువంతెన స్తంభం ఒకటి వరదలలో కొట్టుకుపో

యింది. రైలుపట్టాలు, వాటిక్రింది చెక్కలు (స్లీపర్స్) ఏ ఆధారం లేకుండా వ్రేలాడుతున్నాయి. ట్రాలీకూడా ఆగిపోయింది. శ్రీగురూజీ వెంటనే ట్రాలీదిగి, ఆ చెక్కలమీదుగా అడుగులు వేసుకుంటూ వేగంగా వంతెనదాటసాగారు. సరిగ్గా రెండడుగులక్రింద పరవళ్ళు త్రొక్కుతున్న ప్రవాహం. కార్యకర్తలు కూడా అనుసరించారు. కొద్ది దూరం నడిచిన తరువాత, ఒక గూడ్సురైలులో ప్రయాణం ప్రారంభమైంది. ఆ తరువాత మరికొద్ది దూరం రైలు ఇంజన్‌లో... అలా తమకు కలిగే ప్రమాదాలు, కష్టాలనేమాత్రం లెక్కజేయకుండా వారు ఒకచోటి నుండి మరొకచోటికి ప్రయాణం సాగించారు.

## "ఆరెస్సెస్ కాక మరెవరు?":

పశ్చిమ పంజాబ్ అంతటా 'జీహాద్ ఉన్మాదుల' నుండి హిందూ సోదరీ సోదరులను కాపాడడంలో సంఘ స్వయంసేవకులు నిర్వహించిన పాత్రను ప్రొ.ఎ.ఎన్. బాలి తన 'నౌ ఇట్ కెన్ బి టోల్డ్' పుస్తకంలో చాలా చక్కగా వివరించారు: "ఆ సమయంలో ఆరెస్సెస్ అని అందరూ పిలిచే కొద్దిమంది నిస్వార్ధ హిందూ యువకుల బృందంగాక మరెవరు ప్రజలను ఆదుకున్నది? ప్రాంతంలోని ప్రతిపట్టణంలోని ప్రతి వీధిలోను ప్రమాదకర స్థలాలనుండి అంతకంటే సురక్షిత కేంద్రాలకు హిందూ, సిక్కు స్త్రీలు, పిల్లలను తరలించేందుకు వారు అన్ని ఏర్పాట్లుచేసారు. వారికి భోజనం, వైద్యసహాయం, బట్టలు, సంరక్షణలన్నీ ఏర్పాటుచేసారు. అనేక పట్టణాలలో అగ్నిమాపక బృందాలు కూడా ఏర్పాటుచేసారు. పారిపోయి వస్తున్న హిందువులకు, సిక్కులకు లారీలు, బస్సులద్వారా రవాణాకు, రైళ్ళలో తగు రక్షణ కల్పించడానికి వారు ఏర్పాట్లు చేశారు. అనేక బస్తీలలో రాత్రింబవళ్ళు గస్తీని ఏర్పాటుచేసారు. ఆక్రమణలు జరిగినపుడు తమను తాము రక్షించుకునే విధానాలను ప్రజలకు నేర్పించారు. కష్టాలపాలైన హిందువులను, సిక్కులను ఆదుకొనడానికి వచ్చిన మొట్టమొదటివారు ఈ యువకులే. అయితే భద్రతకోసం ఆ ప్రాంతాలనుండి తూర్పుపంజాబ్‌లోకి తరలివెళ్ళిన వారిలో వీరు చిట్టచివరివారు మాత్రమే. తమ స్వీయ రక్షణకోసం, తమ బంధుమిత్రుల, ఆస్తిపాస్తుల సంరక్షణకోసం బహిరంగంగా ఆరెస్సెస్ వారిని సహాయం అర్థించిన పంజాబ్‌లోని వివిధ జిల్లాలకు చెందిన ప్రముఖ కాంగ్రెస్ నాయకులనేక మందిని నేను పేర్లతో సహా పేర్కొనగలను. ఎవరు ఏ మూలానుండి సహాయంకోసం అర్థించినా వారు తిరస్కరించలేదు.

లాహోర్‌లో ముస్లింస్త్రీలు, పిల్లలను హిందూవీధుల గుండా సురక్షితంగా బైటకు చేర్చి, వారిని ముస్లింలీగ్ కేంద్రాలకు పంపించిన ఆరెస్సెస్ వారి ఉదాహరణలు కూడా మా దృష్టికి వచ్చాయి."

నిజానికి ఒకపక్క ప్రాంతమంతా అగ్నిజ్వాలలలో మండుతున్న ఆ సమయంలో, కాంగ్రెస్ నాయకులు ఢిల్లీలో నిస్సహాయస్థితిలో భజనచేస్తూ కూర్చొన్నారు. "ఆ విపత్కర పరిస్థితులలో వారు (ఆరెస్సెస్) చూపిన క్రమశిక్షణ, వారి శారీరిక పట్టుత్వం, వారి నిస్వార్థ ప్రవృత్తులే పంజాబ్ ప్రజలను కాపాడాయి. ఇవాళ ఎవరైనా బైటివారు గనుక ఆనాడు భవ్యమైనరీతిలో తమను కాపాడిన సిక్ఖులను, ఆరెస్సెస్ వీరులను తిరస్కరించమని పంజాబ్‌లో హిందువులను, సిక్ఖులను కోరినట్లైతే ఆ మాటలు చెవిటివారి ముందు శంఖం ఊదటంవంటివే అవుతాయని ఖచ్చితంగా చెప్పవచ్చు."

చివరిలో శ్రీ బాలి ఇలా అన్నారు: "పశ్చిమ పాకిస్తాన్ నుండి వచ్చిన శరణార్థులు - దేశంలో వారు ఏమూల నివసిస్తున్నా, చివరివ్యక్తి వరకు తమ కర్మానికి తమను అందరూ వదిలి పెట్టిన ఒకానొక సమయంలో ఆదుకొనడానికి ముందుకువచ్చిన ఆరెస్సెస్‌కు సదా సర్వదా కృతజ్ఞులై ఉంటారు."

## తూర్పుబెంగాల్ శరణార్థుల ఆర్తనాదం (1950):

1950లో పథకం ప్రకారం పెద్దఎత్తున తూర్పుపాకిస్తాన్‌లోని హిందువులపై (ప్రస్తుతం బంగ్లాదేశ్) జరిగిన మారణకాండ ఫలితంగా బెంగాల్, అస్సాంలలోనికి శరణార్థుల వెల్లువ రాసాగింది. మరింత విషాదం కలిగించిన విషయం ఈ పాకిస్తానీ దురాగతాల పట్ల మనకేంద్ర ప్రభుత్వం ఉలుకుపలుకులేకుండా రాయిలా ఉండిపోవడం. ఇది సహించలేని డా. శ్యామప్రసాద్ ముఖర్జీ ప్రభుత్వంనుండి రాజీనామాచేసారు. ఆ సమయంలో, 1950లో కలకత్తా కేంద్రంగా పశ్చిమబెంగాల్, అస్సాంలలో కార్యకలాపాలు సాగించేవిధంగా 'బాస్తుహార సహాయతా సమితి' అనే రిజిస్టర్డ్ సమితి ఏర్పడింది. సంఘస్వయంసేవకులు వెనువెంటనే కార్యరంగంలోకి దూకారు. దేశం మొత్తంలో లక్షలాదిమంది ప్రజలవద్దకు వారువెళ్ళారు. ధనాన్ని, ఆహారపదార్థాలను, బట్టలను సేకరించారు. బెంగాల్‌లో 15 సహాయ కేంద్రాలలోను, అస్సాంలో 11 కేంద్రాల

లోను, 8 నెలలపాటు రాత్రింబవళ్ళు 5 వేలమంది సమితి కార్యకర్తలు శ్రమించారు. 6 నెలలపాటు ఆ శిబిరాలలో రోజూ 80 వేలమంది ప్రజలకు భోజనం పెట్టారు. 1500 బట్టల బేళ్ళను సేకరించారు. సమితియొక్క వివిధ వితరణకేంద్రాలు 1,50,000 మంది ప్రజలకు బట్టలు పంచిపెట్టాయి. సియాల్దా, ఇతర రైల్వేస్టేషన్లలో క్రిక్కిరిసెన రైళ్ళు కుమ్మరించిన లక్షమందికిపైగా శరణార్థులకు ఆహారపొట్లాలను సమితి అందజేసింది.

ఆనాటి దయనీయ దృశ్యాలను వర్ణించడానికి మాటలు చాలవు. శతాబ్దాలుగా ఆ పట్టణాలు, గ్రామాలలో, ప్రశాంత జీవనం గడుపుతున్న ఈ ప్రజలు ఒక్కసారిగా సర్వస్వం కోల్పోయి బికారులుగా మారారు. అనేకమంది తమ బంధుమిత్రులను సైతం కోల్పోయారు. వారికి భోజనం అందించాలి. బట్టలు ఇవ్వాలి. అత్యవసరంగా వైద్యసహాయం అందించాలి. ఈ తక్షణ భౌతికావసరాలతోబాటు వారికి ఓదార్పు, ఉపశమనం కూడా కావాలి. వారికి తగిన నివాసాలు ఏర్పాటుచేయాలి. జీవనాధారాన్ని వెదికిపెట్టాలి. 1950 ఏప్రిల్ తరువాత బాస్తుహార సహాయతాసమితి, వందలాది శరణార్థులకు వివిధ కార్యాలయాలలోను, కర్మాగారాలలోను తగిన ఉద్యోగాలు ఏర్పాటుచేసింది. కూచ్ బిహార్‌లో 150 కుటుంబాలకు వ్యవసాయ భూములను ఇచ్చారు. వారక్కడ స్థిరపడ్డారు. హస్తకళలలోను, ప్లాస్టిక్ బొమ్మల తయారీలోను అనేకమందికి శిక్షణ నిచ్చారు. ఆ తరువాత వేరువేరుచోట్ల వారు పనికి కుదిరారు లేదా స్వంతంగా వ్యాపారం ప్రారంభించారు. శరణార్థి శిబిరాలకు సమీపంలోనే ప్రాథమిక విద్యాకేంద్రాలను ప్రారంభించి, వాటిలో శరణార్థుల పిల్లలకు సంరక్షణ, విద్యాబోధన సాగించారు.

ఆ రోజులలో ఒకసారి శిబిరాలను సందర్శించిన ఒక జ్యేష్ఠ సంఘ కార్యకర్త, ఆ శరణార్థులు అచంచలమైన విశ్వాసంతో తమ దైనందిన కార్యకలాపాలు సాగిస్తూఉండడం చూసి ఎంతో ఆశ్చర్యం పొందారు. అనేకమంది శరణార్థులాయనను చిరునవ్వుతో స్వాగతించారు. వారి స్థితిగతులను గురించి ఆయన వాకబు చేసినప్పుడు, వారు "అవును! మేం భవిష్యత్తును గురించి ఆతృతతో ఉన్నమాట నిజమే. కానీ ఈక్లిష్టసమయంలో మమ్మల్ని ఆదుకున్న ఆరెస్సెస్, మా పునరావాసానికి అవసరమైన ఏర్పాట్లు మేం చేసుకొనడానికి మార్గం చూపుతుందని విశ్వాసం కూడా మాకుంది" అని సమాధానం ఇచ్చారు.

## భూకంపపు కబంధహస్తాలలో అస్సాం చిక్కినవేళ:

1950 ఆగస్ట్ 15వ తేదిన ఒక తీవ్రమైన భూకంపం అస్సాం మొత్తాన్ని కుదిపివేసింది. వేలాదిమంది నిరాశ్రయులయ్యారు. వందలాది మంది మరణించారు. నదులు పొంగిప్రవహించాయి. వెంటనే స్వయంసేవకులు 'భూమికంప పీడిత సహాయతా సమితిగా' ఏర్పడ్డారు. నడుంలోతు, మెడలోతు నీటిలో నడిచివెళ్ళి వారు ప్రజలకు సహాయంచేసారు. ఆహారం, మందులు, పోషకపదార్థాల బిళ్ళలు (విటమిన్ టాబ్లెట్లు) పంచిపెట్టారు. అందరికంటేముందుగా పరవళ్ళు త్రొక్కుతున్న శుబాంగిణి నదిని దాటి అవతలిఒడ్డున చిక్కుకుని పోయిన ప్రజలకు సహాయం అందించి, వారిని సురక్షిత స్థలాలకు చేర్చినది స్వయం సేవకులే. ఈ సహాయ విధులను నిర్వహిస్తూనే ఒక స్వయంసేవక్ జల సమాధి అయ్యాడు.

## మహారాష్ట్రలో కరువు సహాయం:

1972-73 లలో మహారాష్ట్రలోని 4,500 గ్రామాలు కరువు వాత పడ్డాయి. 42 లక్షల ప్రజలు తీవ్ర కష్టాలకు గురిఅయ్యారు. ఆ ప్రాంతంలో బాగా విస్తరించి ఉన్న ఆరెస్సెస్ వెంటనే సహాయక చర్యలను ప్రారంభించింది. 'మహారాష్ట్ర దుష్కాల్ విమోచనా సమితి' ఏర్పడింది. బొంబాయి మహానగరంలో ఒక్కరోజులో 75 వేల దుస్తులు సేకరించారు. సంఘం ద్వారా 45 సహాయకేంద్రాలు ప్రారంభమయ్యాయి. 14,626 గ్రామాలకు చెందిన సుమారు 4,50,000 మంది ప్రజలకు భోజనం, ఆహార పదార్థాలు, మందులు, బట్టలు పంచిపెట్టారు. ప్రభుత్వ పథకాల పరిధిలోకి రాని విద్యార్థులపై ప్రత్యేక శ్రద్ధ చూపించారు. పట్టణాలు, గ్రామాలలో వారికోసం ఉచిత భోజన కేంద్రాలు తెరిచారు. 14 పుస్తకాల సంగ్రహణ కేంద్రాలు ఏర్పాటుచేసారు. వందలాది మంది విద్యార్థులకు గణవేషం, స్టేషనరీ సామగ్రి, ఇతర అవసర వస్తువులు అందజేసారు.

వైద్య సహాయం అతి తక్కువగా ఉంది. చాలా స్థలాలలో ప్రథమ చికిత్స సామగ్రి కూడా లేకపోయింది. సమితి అనేక వైద్యకేంద్రాలను ప్రారంభించింది. అంగవైకల్యానికి గురి అయినవారు, వృద్ధులు, యువకులు, అనారోగ్య పీడితులు- అందరూ అక్కడ వైద్యసహాయం పొందారు. సమితి పథకం క్రింద 250 మందికి ఉద్యోగం లభించింది. శాశ్వతంగా

స్థిరపడడానికి వీలైన వివిధ పథకాలకు గాను 300 కుటుంబాలు ఆర్థిక సహాయాన్ని అందుకున్నాయి. పశువుల శిబిరాలు కూడా రెండుచోట్ల ప్రారంభించారు. అనేకమంది వ్యవసాయదారులు స్వయంగా కొన్నివందల పశువుల పోషణభారం స్వీకరించారు. కరువు పీడిత ప్రాంతాలలో సమితి కొత్తగా బావులను త్రవ్వించింది. నిరుపయోగంగా పడి ఉన్న బావులను పరిశుభ్రం చేసి, తగిన మార్పులు చేసి, అభివృద్ధి చేసే పనిని చేపట్టింది. వనవాసీ ప్రాంతాలలో పంపుసెట్లను పంచిపెట్టింది. 161 గ్రామాలలో సమితి నిర్వహించిన పాలకకేంద్రాలద్వారా 15 వేల మంది పిల్లలు ప్రయోజనం పొందారు. వనవాసులు, హరిజనులకు ప్రత్యేక శ్రద్ధ, ప్రాధాన్యత కల్పించారు.

## పశ్చిమ బెంగాల్: శరణార్థుల వెల్లువ (1964) :

1950-51 తరిమివేతల తరువాత కూడా తూర్పుపాకిస్తాన్ నుండి శరణార్థుల వెల్లువ కొనసాగుతూనే ఉంది. మతకలహాల పరంపర అక్కడ కొనసాగుతూనే వచ్చింది. 1964 లో అలాంటి పరిస్థితులలోనే, లక్షలాది శరణార్థులు భారతదేశంలోకి వచ్చిపడడం ప్రారంభం చేసారు. ప్రభుత్వం వారిలో చాలామందికి పశ్చిమబెంగాల్, ఆచుట్టు ప్రక్కల రాష్ట్రాలలో పునరావాసం కల్పించింది. ఈ ప్రయత్నాలలో స్వయంసేవకులు కూడా తమసహాయహస్తాన్ని అందించారు. ఇదే ఉద్దేశంతో మధ్యప్రదేశ్‌లోని రాయపూర్‌లో రామకృష్ణాశ్రమ సహకారంతో ఒక సమితి ఏర్పడింది. రాయపూర్‌కు 10 కి.మీ. దూరంలోని 'మనాగ్రామం, ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో 36 వేల మంది **శరణార్థులు** స్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

## బీహార్ కరువు:

1966 లో బీహార్‌లో అనేక ప్రాంతాలు భీషణమైన కరువుకులోనయ్యాయి. ఆ క్లిష్ట సమయాలలో, బీహార్‌లో కరువు బాధిత ప్రజానీకానికి సహాయవస్తువులనందించే పనిలో వేలాది స్వయంసేవకులు అహోరాత్రాలు శ్రమించారు. 971 బావులను వారు త్రవ్వారు. సుమారు 21 వేల కుటుంబాలకు ఆహారం, బట్టలు పంచిపెట్టారు. మొత్తం సహాయకార్యక్రమాలకు నాయకత్వం వహించిన శ్రీ జయప్రకాశ్ నారాయణ స్వయంసేవకులు చేస్తున్న కృషిని పరిశీలించారు. సహాయం అందించడంలో హిందూ-ముస్లింల మధ్య ఏవిధమైన విచక్షతను చూపకపోవడాన్ని

వారు గమనించారు. స్వయంసేవకులు స్వయంగా తమస్వంత ధనాన్ని ఖర్చుపెడుతూండడం, ఆపన్నులను ఆదుకోవడం కోసం అందుబాటులో లేని స్థలాలను సైతం వారు కాలినడకన చేరుకోవడం ఆయన దృష్టిని దాటిపోలేదు. గయ సమీపంలోని నావడాలో అలాంటి ఒక కరువు సహాయకేంద్రాన్ని ప్రారంభిస్తూ 1967 ఫిబ్రవరి 6 న ఆయన ఇలా అన్నారు. "స్వయంగా ఈ దేశపు ప్రధానమంత్రితో సహా ఏ ఒక్కరు కూడా ఆరెస్సెస్ స్వయంసేవకులు చేస్తున్న నిస్వార్థసేవతో సరిసమానం కాబోరు."

స్వయంసేవకులు కాలినడకన 7 వందల గ్రామాలకు వెళ్ళారు. 18 వేల కుటుంబాలకు 1500 క్వింటాళ్ళ ఆహారధాన్యాలను పంచిపెట్టారు. 'ముష్టిధాన్య' - ప్రతి కుటుంబంనుండి పిడికెడు ధాన్యం సేకరించడం-అనే అతిసాధారణ కార్యక్రమం ద్వారా ఈ పదార్థాలు సేకరించారు. ఆకలితో అలమటిస్తున్న ప్రజలకు అల్పాహారశాలలు తెరచి నామమాత్రపు ధరలపై తినుబండారాలను సరఫరా చేశారు. అంటు వ్యాధుల వ్యాప్తిని అరికట్టేందుకు 10 వైద్యకేంద్రాలు తెరిచారు. అనేక చోట్ల ప్రారంభించిన పశుపోషణ కేంద్రాలు వందలాది పశువుల ప్రాణాలు నిలబెట్టాయి.

## కరువు రక్కసి కోరలలో కర్ణాటక :

1973 అంతంనాటికి, కర్ణాటకలోని ఉత్తర జిల్లాలు తీవ్రమైన కరువు వాత పడ్డాయి. నదులు, చెరువులలో నీరు ఇంకిపోయిన కారణంగా అనేక స్థలాలలో గణేశ్‌నిమజ్జన కార్యక్రమాలను సైతం రద్దుచేయవలసి వచ్చింది. గ్రామీణప్రాంతాలలో ప్రజలు తిండిలేక అలమటించిపోసాగారు. ప్రభుత్వం ఏర్పాటు చేసిన సహాయక కేంద్రాల నిర్వహణ సరిగ్గా లేదు. వాటి కాంట్రాక్టర్లు అధికారులతో కుమ్మక్కై నిధులను దుర్వినియోగం చేయసాగారు.

ఈ పరిస్థితులనెదుర్కొనడానికి కర్ణాటక ప్రాంత ఆరెస్సెస్ సమాయత్తం అయింది. 'క్షామసంత్రస్తసేవాసమితి' ఏర్పడింది. అనేకనెలలపాటు ఎన్నో కేంద్రాలు నడిచాయి. వేలాదిమందికి అక్కడ భోజనం పెట్టారు. గుల్బర్గా జిల్లాలో ఒక గోసంరక్షణ కేంద్రాన్ని ప్రారంభించి కొన్ని వందల పశువులను కాపాడారు. ఆరెస్సెస్ నడిపే సహాయశిబిరాలకు సహాయసామగ్రిని ఉచితంగా రవాణా చేయమని ప్రభుత్వం డిప్యూటీకమీషనర్లందరికీ

ఆదేశాలు జారీ చేసింది. పరిశీలనకు వచ్చిన ప్రభుత్వాధికారులందరూ ఈ సహాయకేంద్రాల నిస్వార్థ, సమర్థ నిర్వాహణను వేనోళ్ళ ప్రశంసించారు.

1985 లో వచ్చిన కరువు అన్నింటికంటె తీవ్రమైనదిగా చెబుతారు. అప్పుడు కూడా స్వయంసేవకులు ముందుకు వచ్చారు. 2800 పశువులకు ఆశ్రయం కల్పిస్తూ కేంద్రాలు నిర్వహించారు.

## ఆంధ్రప్రదేశ్‌లో తుఫాను భీభత్సం :

1977 నవంబర్‌లో గంటకు 100 కి.మీ. వేగంతో ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా ప్రాంతాన్ని కుదిపివేసిన తుఫాను అతి భీకరమైనది. పెద్ద పెద్ద భూభాగాలను అది నాశనం చేసింది. ఆ ప్రాంతాలలోని తీరాల్లో నివసించే మొత్తం ప్రజానీకాన్ని దిక్కులేని వారిని చేసింది. 20 వేలమంది ప్రజలు తమ ప్రాణాలు కోల్పోయారు. లక్షమంది నిర్వాసితులయ్యారు. 30 అడుగుల కంటేపైకి ఎగిసిన ఉప్పెన గ్రామాలు గ్రామాలనే తుడిచిపెట్టేసింది. నష్టం సుమారు 2 వేల కోట్లని అంచనా వేశారు. మరునాటి ఉదయానికల్లా అక్కడకు చేరుకున్న స్వయంసేవకులు గ్రామాలన్నింటిలోనూ చిందరవందరగా పడిఉన్న వేలాది శవాలను చూసి నిర్ఘాంతపోయారు. కుళ్ళిపోయిన స్థితిలోఉన్న మనుషులు, జంతువుల మృతదేహాల కారణంగా అంటువ్యాధులు ప్రబలే ప్రమాదం ఏర్పడింది. అక్కడి పరిస్థితులు చూసి ప్రభుత్వంలోని వ్యక్తులు, సామాన్య ప్రజలు కూడా కొంతకాలం అచేతనులుగా ఉండిపోయారు. మొట్టమొదటిగా ఆ సవాలును స్వీకరించి, సహాయకార్యక్రమాలు ప్రారంభించినది సంఘస్వయంసేవకులే.

సహాయం కోసం సంఘం జాతిని అర్థించినపుడు, తుఫాను పీడితులకోసం ధనం, వస్తువులు సేకరించడానికి దేశం మొత్తంలో స్వయంసేవకులు ముందుకు వచ్చారు. సహాయ కార్యక్రమాలలో వందలాది స్వయంసేవకులు తమ ప్రాణాలనే పణంగాపెట్టారు. మృతదేహాలను పూడ్చిపెట్టడం కోసం వారు స్వయంగా భుజాలపై మోసుకుని వెళ్ళారు. దహనం చేసేందుకు ఒక్క కట్టెపుల్లకూడా దొరకని పరిస్థితి అది. ఈ 'రోత' పుట్టించే పనిని నిర్వర్తించడానికి ఎవ్వరూ - ఆఖరికి సైన్యం, పోలీసులు కూడా ముందుకు రాలేదు. తక్షణసహాయంగా బాధితులకు లక్షల సంఖ్యలో చపాతీలనందజేశారు. రెండురోజుల్లోనే, 'ఆంధ్రప్రదేశ్ తుఫాను సహాయతా సమితి' ఏర్పడింది. ఆ ప్రాంతమంతటా భోజనకేంద్రాలు ఏర్పాటయ్యాయి. అవనిగడ్డలో, విపత్తు జరిగిన రెండు, మూడు రోజుల

తరువాత కూడా ప్రభుత్వ యంత్రాంగం చేరుకోని ప్రాంతాలలో సైతం స్వయంసేవకులు సహాయకార్యక్రమాలను ప్రారంభం చేసారు. అనేక చుట్టుప్రక్కల పట్టణాలలోని స్వయంసేవకులు ఆహారాన్ని తయారుచేసి, పంచిపెట్టే పనిని స్వీకరించారు. ప్రజలు ప్రభుత్వం నడిపే సహాయ కేంద్రాలకంటే, సంఘం నడిపే సహాయకేంద్రాలకే సహకారమిచ్చేందుకు ఎక్కువగా ముందుకు వచ్చారు. స్వయంసేవకులు చేస్తున్న పని ఎంత ప్రస్ఫుటంగా కనబడిందంటే, శ్రీమతి ఇందిరాగాంధీ "కేవలం ఆరెస్సెస్ వారు మాత్రమే ఈ దెబ్బతిన్న ప్రాంతాలలో పనిచేస్తూండడం నాకు కనిపించింది" అని కాంగ్రెస్ వారిని చివాట్లు పెట్టారు.

అనతికాలంలోనే సంఘం గ్రామాల పునర్నిర్మాణ కార్యక్రమాన్ని, అనాధబాలురను విద్యావంతులను చేసే పనిని, ప్రజలకు పునరావాసం కల్పించే పనిని చేపట్టింది. "రెడీఫర్ సెల్ఫ్‌లెస్ సర్వీస్ (నిస్వార్థసేవకు సదాసిద్ధం-Ready for Selfless Service) అనేది ఆరెస్సెస్‌కు అది చేస్తున్న స్వార్థరహితసేవకు ఇవ్వవలసిన క్రొత్తపేరు" అని వ్యాఖ్యానించారు వయోవృద్ధ సర్వోదయనేత శ్రీ ప్రభాకర్‌జీ. ఆ ప్రాంతానికి చెందిన ఒక మంత్రివర్యులు "ఆరెస్సెస్‌వారు అద్భుతమైన సేవ చేస్తున్నారు" అని ప్రశంసించారు. "నిజంగా మీరు ఎటువంటి ఆడంబరాలు లేకుండా సాక్షాత్తు భగవత్కార్యం చేస్తున్నారు" అన్నారు ఒక ప్రభుత్వ అధికారి. "నేను ఫోటోలు తీసుకుందామని వచ్చాను. అయితే మీరు చేస్తున్న సేవ నన్ను కదిలించివేసింది. నన్నుకూడా అందులో పాలుపంచుకోనివ్వండి" అన్నాడుఒక ఫోటోగ్రాఫర్. ఆ తరువాత అతడు శవాలు మోసే 'శవసేన' లో స్వచ్ఛందసేవకునిగా చేరాడు.

మొత్తంమీద, సహాయశిబిరాలలో 1,352 మంది స్వయంసేవకులు రేయింబవళ్ళు పనిచేశారు. 2,40,000 దుస్తులు, 32 వేల గృహోపయోగపాత్రలు బాధితులకు పంచిపెట్టారు.

మద్రాస్‌నుండి వెలువడే 'హిందూ' పత్రిక ఇలా వ్రాసింది. "ఆంధ్రప్రదేశ్‌లో ఆరెస్సెస్, జనసంఘ్‌ల కార్యకర్తలు ఇప్పటికే ప్రశాంతంగా సహాయకార్యక్రమాలలోనిమగ్నమై ఉన్నారు. దేశంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చిన ఈ యువతీ యువకులే సహాయకార్యక్రమాలలో నిజమైన వీరులు, నాయకులు. నీతినిజాయితీలతో, ఆత్మప్రబోధంతో వారక్కడకు వెళ్ళారు. స్వచ్ఛందసేవకై తమ నాయకులిచ్చిన పిలుపుకు వెనువెంటనే ప్రతిస్పందించి వారక్కడకు వెళ్లారు. వారి ఇండ్లకు ఆ ప్రాంతం

చాలా దూరం కావచ్చు. కానీ వారి హృదయాలకు మాత్రం ఆ కార్యం అతిసన్నిహితం."

## గ్రామాలకు పునర్జన్మ :

మూలపాలెం గ్రామం పూర్తిగా తుడిచిపెట్టుకునిపోయింది. సంఘ కార్యకర్తలు, ఢిల్లీలోని డి.ఆర్.ఐ. సహకారంతో అక్కడ ఒక నమూనా గ్రామాన్ని పునర్నిర్మించాలని సంకల్పించారు. పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ పేరున, దీనదయాళ్‌పురంగా ప్రస్తుతం వ్యవహరిస్తున్న ఆ గ్రామంలో ఆర్.సి.సి. తో కట్టిన 110 పక్కా ఇళ్ళు ఉన్నాయి. త్రాగే నీటి సౌకర్యం, శాస్త్రీయపద్ధతిలో నిర్మించిన శౌచాలయాలు ఉన్నాయి. ఒక కమ్యూనిటీ భవనం, ఒక పాఠశాల, ఒకగుడి, ఒక వైద్యసహాయకేంద్రం, ఒక బ్యాంకు, ఒక తపాలాకార్యాలయం, కొన్ని కుటీర పరిశ్రమలు, వృత్తి శిక్షణ సౌకర్యాలు కూడా ఆ గ్రామంలో ఉన్నాయి. గ్రామస్తులు ప్రధానంగా మత్స్యకారులు. వారికి ఆధునిక పరికరాలను సమకూర్చడానికి కూడా ప్రయత్నాలు ప్రారంభం అయ్యాయి.

దీనదయాళ్‌పురంతో బాటు మరో మూడు గ్రామాలను కూడా పునర్నిర్మించారు. వాటిలో గుంటూరు జిల్లాలోని కేశవపురిలో అడవి యానాదులనే వనవాసులకు పునరావాసం కల్పించారు. కృష్ణాజిల్లాలోని మాధవనగర్ షెడ్యూల్డు కులాల వారి పునరావాసానికి ఉపయోగపడింది. మూడవది విశాఖపట్నం జిల్లాలోని శ్రీరాంనగర్ (అనకాపల్లి). అక్కడ పునరావాసం పొందిన వారందరూ షెడ్యూల్డు కులాలు, ఇతర వెనుకబడిన తరగతులకు చెందినవారే.

శ్రీరాంనగర్ ప్రకల్పం పై 'హిందూ' పత్రిక లో (1979 జూలై 13) ప్రచురితమైన నివేదిక ఈ విధంగా ఉంది.

"విశాఖపట్నం లోని ఆరెస్సెస్ శాఖ వెంటనే రంగంలోకి దూకి, బియ్యం, బట్టలు, పాత్రలు వగైరాలు సరఫరా చేసి, సహాయ కార్యక్రమాలు ప్రారంభించింది. తాత్కాలిక సహాయక చర్యగా 150 కుటీరాలను వారు నిర్మించారు. ఇటుకలతో, సున్నంతో కట్టి, పైన సిమెంటు పూత పూసి, బెంగుళూరు పెంకులతో పై కప్పు వేసిన 108 ఇండ్ల నిర్మాణాన్ని ఇప్పుడు సంఘంపూర్తి చేసింది. ఆ కాలనీలో అడుగు పెట్టిన ప్రతిసందర్శకుడిని ప్రభావితంచేసే అంశం ఆ ప్రకల్పంలో ఆరెస్సెస్ స్వచ్ఛందసేవకుల సంపూర్ణ తాదాత్మ్యత. తాము ఆ కార్యంలో ఉన్న

$1\frac{1}{2}$ సం.ల కాలంలోనే స్వయంసేవకులు 90 మంది విద్యార్థులతో ఒక పాఠశాలను ప్రారంభించారు. ఆ విద్యార్థులకు పలకలు, పుస్తకాలు, బట్టలు సరఫరా చేసారు. 18 నెలల వ్యవధిలోనే ఆ 90 మంది హరిజన పిల్లలు చదవడం, వ్రాయడం నేర్చుకునేటట్లు చేయడంలో స్వయంసేవకులు కృతకృత్యులయ్యారు."

"డా.అంబేద్కర్ జయంతి సందర్భంగా ఏప్రిల్ నెలలో ఆరెస్సెస్ అక్కడొక కుట్టు మిషన్ కేంద్రాన్ని ప్రారంభించింది. అనేకమంది హరిజన స్త్రీలకు కుట్టుపనిలో శిక్షణ నిచ్చింది. ఆ సమయంలో తీసుకున్న మరొక విశేష ప్రకల్పం వయోజన విద్యాకార్యక్రమం. రోజంతా కష్టించి పనిచేసి వచ్చి కూడా, ఆ కాలనీలోని పురుషులు వయోజన విద్యాతరగతులలో ఉత్సాహంగా పాల్గొంటున్నారు. నేర్చుకోవడానికి ఎంతో ఆసక్తిని ప్రదర్శిస్తున్నారు. 'మీ రిక్షాను మీ స్వంతం చేసుకోండి.' పథకం క్రింద బ్యాంకుల ఆర్థిక సహకారంతో 25 మంది దృఢకాయులైన హరిజన యువకులకు రిక్షాలను ఇప్పించారు. "

తుఫాను పీడిత ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించిన 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' ప్రతినిధి స్వయంసేవకులు నిర్వహించిన సహాయకార్యక్రమాలలోని ఒక విశేష అంశం గురించి చక్కని పద్ధతిలో వివరించాడు. "ఒక కుటుంబంలో ఒకే వ్యక్తి బ్రతికి బైటపడ్డట్లైతే అతడి మనస్థితి ఎలా ఉంటుందో ఊహించండి. జీవితంలో అతడు సర్వం కోల్పోయినవాడికింద లెక్క. చివరికతడు తాను జీవించాలనే కోరికను సైతం కోల్పోతాడు. అటువంటి వ్యక్తులతో ఆరెస్సెస్ కార్యకర్తలు ప్రేమతో, ఆత్మీయతతో వ్యవహరించారు. మనసు విరిగిపోయిన ఆ వ్యక్తులకు స్వాంతన కలిగించేందుకు బుర్రకథలు ఏర్పాటుచేసారు. ఇది చాలా అరుదైన పునరావాస విధానం"

సహాయ కార్యక్రమాలలో నిమగ్నమై ఉన్న 250 సంస్థల సమ్మేళనం 1978 మార్చి 22 న హైదరాబాద్‌లో జరిగింది. ఆ సమ్మేళనంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి చేసిన కొన్ని గవ్యాఖ్యలు చాలా ప్రాముఖ్యత కలవి. "ఇవాళ ఆరెస్సెస్ చేస్తున్న పనిని మరునాడు ప్రభుత్వం ప్రారంభిస్తోంది." అన్నారాయన. దీనదయాళ్‌పురం ప్రక్కనేగల సొర్లగొంది గ్రామాన్ని పోలీసులు దత్తత తీసుకున్నారు. అయితే వారింకా పనిని మొదలు పెట్టకపోవడం చూసి ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ వారిని దీనదయాళ్‌పురంకు పిలిచి వారితో చెప్పారు: "ఆర్.ఎస్.ఎస్ వారి ఉదాహరణను చూడండి. వారిని అనుసరించండి."

పూర్తిగా కొట్టుకుపోయిన గ్రామాలను పునర్నిర్మాణంచేసే ఈ పరంపరను పశ్చిమగోదావరిజిల్లాలో గోదావరి వరదల భీభత్సం సమయంలో కూడా ఆంధ్రప్రదేశ్‌లోని స్వయంసేవకులు కొనసాగించారు. ఆ జిల్లాలోని గణేశపురి, సింగనపల్లి గ్రామాలను పునర్నిర్మాణంచేసి, వనవాసులకు పునరావాసం కల్పించారు.

అంతకుముందుకూడా రాష్ట్రంలో 1952 రాయలసీమ కరువుసమయంలో, 1953 గోదావరి వరదల సమయంలో, 1979 నెల్లూరు తుఫానులో, 1981 వంశధార వరదల సమయంలో, 1988 మహబూబ్‌నగర్‌లో ఆకలి చావుల సందర్భంలో, అదే సమయంలో మంచిర్యాల రైలుప్రమాదం సందర్భంలో, తర్వాత 1990 తుఫాను సందర్భంలో స్వయంసేవకులు వివిధ రకాల సేవాకార్యక్రమాలను నిర్వహించారు.

## తమిళనాడు తీరాన్ని తాకిన తుఫాను:

అదేసమయంలో, తమిళనాడు తీరంకూడా తన వాటా తుఫాను భీభత్సాన్ని రుచిచూసింది. అక్కడకూడా తుఫానుకుగురైన నాలుగు జిల్లాలలోను సంఘం సహాయకార్యక్రమాలు ప్రారంభంచేసింది. 'తమిళనాడు తుఫాను, వరద సహాయసమితి' ఏర్పడింది. 3,125 క్వింటాళ్ళ ఆహారధాన్యాలు, $2\frac{1}{2}$ లక్షల రూపాయిల విలువజేసే బట్టలు, మందులు పంపిణీ చేసారు. 10 గ్రామాలలో విస్తరించిన ఈ సహాయ కార్యక్రమాలలో 5773 కుటుంబాలకు సహాయం అందజేసారు.

వరదబాధితులకు తమతమ వృత్తులను తిరిగి ప్రారంభించుకొనడానికె అవసరమైన పనిముట్లను ఉచితంగా సరఫరా చేసారు. 360 గృహాలను క్రొత్తగా నిర్మించి ఇచ్చారు. వివిధ గ్రామాలలో మరో రెండువందల ఇండ్లను మరమ్మత్తులు చేయించారు. తిరుచ్చి జిల్లాలోని తాయనూరు గ్రామంలో నిర్మించిన 30 గృహాల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. అక్కడ రెండు చదరపుమైళ్ళ పరిధిలో ఇళ్ళు విస్తరించి ఉండేవి. నది తన గమనాన్ని మార్చుకుని, ఆ గ్రామాన్ని తుడిచిపెట్టేసింది. ఆ ప్రాంతమంతా ఇసుక, ఒండ్రుమట్టి మేటలు వేసింది. దీనికారణంగా నిర్మాణసామగ్రిని ఇండ్ల స్థలాలవద్దకు చేర్చడం చాలాకష్టం అయింది. దాంతో అక్కడ సహాయ కార్యక్రమాలు నిర్వహించడానికె మిగిలిన సంస్థలు వెనుకడుగు వేసాయి. ముస్లిం, క్రైస్తవ సంస్థలు తమ మతాలకు

చెందినవారికి మాత్రమే సహాయం అందించగా, సంఘంమాత్రం ఎటువంటి విచక్షత ప్రదర్శించక అందరికీ సహాయ హస్తాన్ని అందించింది.

అంతకుముందుకూడా ఒకసారి 1950 చివరిలో, తంజావూరు జిల్లా వరదల తాకిడికి దెబ్బతిన్నప్పుడు, సహాయకార్యక్రమాలను నిర్వహించడంలో సంఘ స్వయంసేవకులు అందరికంటే ముందునిలిచారు. వారి కృషిని కంచికామకోటి పీఠం పరమాచార్యులు ఎంతగానో ప్రశంసించారు. బాధితులకు పంచిపెట్టేందుకై తమ మఠం సేకరించిన దుస్తులు ఆయన వారికి అప్పగించారు. "ఆరెస్సెస్ మీద నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది" అన్నారు వారు.

## రాజస్థాన్‌లో వరద భీభత్సం:

1977 మేలో రాజస్థాన్‌లోని భరత్‌పూర్ జిల్లాలో అనేకగ్రామాలు వరదలలో మునిగిపోయాయి. చుట్టుప్రక్కల జిల్లాలనుండి స్వయంసేవకులు ఏమాత్రం ఆలశ్యంచేయకుండా పరిగెత్తుకుని వచ్చారు. మెడలోతు నీళ్ళగుండా ఆహారం, బట్టలు మోసుకుని ఆ గ్రామాలకు చేరుకున్నారు. రెండువారాలపాటు సహాయ కార్యక్రమాలు కొనసాగించారు. శీతాకాలం రాగానే, ఆ ప్రాంతాలలోని పేద, వెనుకబడిన ప్రజానీకానికి 3 వేల ఉన్ని కంబళ్ళు పంచిపెట్టారు.

1979 జూలైలో రాజస్థాన్‌లోని కొన్ని ప్రాంతాలను ముందెన్నడూ లేని తీవ్రవరదలు ముంచెత్తాయి. జోధ్‌పూర్ జిల్లాలోని అనేక గ్రామాలు పూర్తిగా కొట్టుకుపోయాయి. ప్రభుత్వ అంచనాల ప్రకారం వేయిమంది ప్రజలు, 5 లక్షల పశువులు వాటికి బలిఅయ్యారు. 9 జిల్లాలనుండి వచ్చిన 2 వేలమంది స్వయంసేవకులు వెంటనే సహాయకచర్యలు చేపట్టారు. తక్షణ సహాయచర్యలు 10 రోజులపాటు కొనసాగాయి. ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించడం, అన్నం పొట్లాలను చేరవేయడం, దుప్పట్లు, ఉన్నిదుస్తుల సరఫరా మొదలగునవి వాటిలో కొన్ని.

1981 జూలైలో తిరిగి ఉధృతంగా కురిసిన వర్షాల కారణంగా జైపూర్ పట్టణం, జైపూర్, సవాయి మధోపూర్ జిల్లాలలోని కొన్ని ప్రాంతాలు బాగాదెబ్బతిన్నాయి. 500 మంది ప్రజలు మరణించగా, వేలాదికుటుంబాలు దిక్కులేని వారయ్యారు. సహజంగానే దెబ్బతిన్న ప్రాంతాలన్నింటిలోను స్వయంసేవకులు సహాయచర్యలలో ముందున్నారు. 200 గ్రామాలలో బాధిత కుటుంబాల గురించిన సమగ్రమైన సర్వే

క్షణ(సర్వే) జరిగింది. వివరాలు వార్తపత్రికలలో ప్రచురితమయ్యాయి. బాధితులకు సహాయసామగ్రి తక్షణం అందించడానికి అది ఎంతో సహాయపడింది. క్రొత్తగ్రామమైన కేశవపూర్‌లో నిర్వాసితులైన కుటుంబాలకు పునరావాసం కల్పించేందుకు ఒక సమితి ఏర్పడింది. తొలిదశగా అక్కడ 64 పక్కాఇళ్ళు, ఒక కమ్యూనిటీ భవనం, ఒక గుడి నిర్మించారు.

## ఢిల్లీలో యమునానదికి వరదలు:

1978లో యమునానది పొంగిపొరలింది. ఢిల్లీ, చుట్టుప్రక్కల ప్రదేశాలలో భీభత్సం సృష్టించింది. సంఘస్వయంసేవకులు లోతట్టు ప్రాంతాలలో ముమ్మరంగా పర్యటించి, అక్కడి ప్రజలను తగుసమయంలో హెచ్చరించి, సురక్షిత ప్రాంతాలకు తరలిపోవలసిందిగా ఒత్తిడి తెచ్చారు. ప్రజలు తమ తమ సామాన్లు, పశువులతోబాటు ఆ ప్రమాదకర ప్రదేశాలనుండి బైటపడడానికి కూడా వారు సహకరించారు. కార్యకర్తలను, అత్యవసరవస్తువులను, వైద్యసహాయాన్ని సమీకరించడానికి 6 కేంద్రాలు ఏర్పాడ్డాయి. వైద్యరంగంలో శిక్షితులైన స్వయంసేవకులు పాఠశాలలు, ఇతర స్థలాలలో రాత్రింబవళ్ళు శ్రమించారు. సహాయశిబిరాలు ఏర్పడ్డాయి. జలదిగ్బంధనంలో చిక్కుకున్న ప్రాంతాల ప్రజలను రక్షించేందుకు స్వయంసేవకులు కొన్నిచోట్ల నడుంలోతు నీళ్ళగుండా నడిచివెళ్ళారు. కొన్నిచోట్ల ఈతకొట్టుకుంటూ వెళ్ళవలసివచ్చింది. ఈ ప్రయత్నాలలోనే జరిగిన ఒక పడవ దుర్ఘటనలో 7గురు కార్యకర్తలు ప్రాణాలు కోల్పోయారు. వదంతులవ్యాప్తి, అక్రమపద్ధతులద్వారా ప్రయోజనాలు పొందే ప్రయత్నాలను స్వయంసేవకులు నిరోధించారు.

51 సహాయ శిబిరాలు ఏర్పాటుచేసారు. వాటిలో 1,50,000 ప్రజలు సహాయంపొందారు. ఈ అద్భుతమైన కృషిలో 5 వేలమంది స్వయంసేవకులు పాలుపంచుకున్నారు. వివిధ శిబిరాలలో 5 లక్షల ఆహారపొట్లాలను పంచిపెట్టారు. జలదిగ్బంధనంలో చిక్కుకున్న ప్రాంతాలలో పైనుండి జారవిడిచేందుకు కూడా ఆహారపొట్లాలను ప్రభుత్వానికి అందజేసారు.

సెప్టెంబర్ 4 వ తేదీ ఉదయంనుండి 7వ తేదీవరకు వజీర్‌పూర్ వంతెన నుండి ఓఖ్లావరకు యమునానది గట్లవెంబడి గండ్లు పడకుండా చూసేందుకు 15 వేలమంది స్వయంసేవకులు రాత్రింబవళ్ళు కాపలా కాసారు. సెప్టెంబర్ 5వ తేదీరాత్రి 10 గం. లకు సైన్యం రంగప్రవేశం

చేసింది. అప్పటివరకు రంగంలో వ్యవస్థితంగా పనిచేసిన ఏకైకశక్తి సంఘస్వయంసేవకులే. ప్రమాదం తక్కువగాఉన్న కొన్నిస్థలాలలో గండ్లను స్వయంసేవకులే విజయవంతంగా పూడ్చివేసారు. విద్యుత్ సబ్‌స్టేషన్‌ను కూడా స్వయంసేవకులు కాపాడారు. అదేగనుక పనిచేయకుండాపోయి ఉన్నట్లైతే మొత్తం సహాయ కార్యక్రమాలన్నీ గందరగోళం అయిఉండేవి.

## మోర్వీ: 'మచ్చు' ఆనకట్ట ప్రమాదం:

1979 ఆగస్ట్‌లో గుజరాత్‌లోని మచ్చు ఆనకట్టకు గండిపడిన కారణంగా సంభవించిన మోర్వీ దుర్ఘటన ఆనకట్ట-దుర్ఘటనల చరిత్రలో అతిఘోరమైనది. సంఘం వెంటనే 'మోర్వీ సహాయతా సమితి'ని ఏర్పరచింది. మొట్టమొదటిగా మోర్వీకి చేరుకున్నది రాజకోట్ స్వయంసేవకులే. వెనువెంటనే 10 సహాయకేంద్రాలు ప్రారంభం అయ్యాయి. 1200 కుటుంబాలు, 14 వేల వ్యక్తులు సహాయం అందుకున్నారు.

గుజరాత్ మొత్తం నుండి పరుగుపరుగున వచ్చిన స్వయంసేవకులు మరణించినవారి శవాలు తొలగించి, వాటికి దహనసంస్కారాలు చేయవలసిన కష్టతరమైన పనితో ప్రారంభంచేసారు. అయిదు రోజులలో 1,085 శవాలకు దహన సంస్కారాలు చేసారు. స్వయంసేవకులే గనుక ఆ పనిచేసి ఉండకపోయినట్లైతే, మోర్వీ 'కలరా' అనే మరో మహా విపత్తుకు బలై ఉండేదని పత్రికల వారితో మోర్వీ పురపాలక సంఘాధ్యక్షుడు అన్నారు. వివిధ ప్రదేశాలనుండి వచ్చిన స్వయంసేవకులను రాజకోటలో ఉంచారు. అక్కడి నుండి రోజూ ఉదయంవారు మోర్వీకి వెళ్ళేవారు. మధ్యాహ్న భోజనంకోసం జేబుల్లో వేరుశెనగకాయలు నింపుకుని వెళ్ళేవారు. చీకటిపడేవరకు వివిధ పనులు నిర్వర్తించి, రాజకోట్‌కు తిరిగి వచ్చేవారు.

అవి రంజాన్ రోజులు. రాజకోట్‌లోని ఒక సహాయశిబిరంలో 4 వేలమంది ముస్లింలు ఉన్నారు. ఏరోజూ వారి మతపరమైన విధులు నిర్వహించుకొనడానికి ఆటంకం కలుగకుండా వారికి అవసరమైన అన్ని సదుపాయాలను స్వయంసేవకులు సమకూర్చారు. సూర్యోదయంకంటే ముందేవంటచేసి, వారికి వడ్డించేవారు. అదేపద్ధతిలో జైనులు 'పర్యూషన' విధులు నిర్వహించుకొనడానికి, హిందువులలో కొన్నివర్గాలవారు శ్రావణపూజలు జరుపుకొనడానికి శిబిరాలలోపలే తగిన ఏర్పాట్లుచేసారు.

ఆ తరువాత శ్రీ ఎ.బి. వాజ్‌పాయ్ ఈ శిబిరాలను సందర్శించి

నపుడు కొందరు ముస్లింలు సైతం : "ఆరెస్సెస్ మమ్మల్ని కాపాడి ఉండకపోతే మేం బ్రతికి బట్టకట్టగలిగి ఉండేవారం కాదు" అని నివేదించారు.

కేరళ, తమిళనాడులవంటి సుదూరప్రాంతాల నుండి వచ్చిన, వివిధ వార్తాపత్రికలకు చెందిన ప్రతినిధులు సంఘ స్వయంసేవకులు చేసిన అద్భుతమైన సేవను గురించిన ఫోటోలు, ప్రత్యేక వ్యాసాలు ప్రచురించారు. మద్రాస్‌లోని 'తుగ్లక్' పత్రిక : "మోర్వీ ప్రజలు స్వయంసేవకులను దేవతలవలే చూస్తారు:" అని రాసింది. ఢిల్లీ హిందుస్తాన్ టైమ్స్ (1979 ఆగస్టు 25) తన సంపాదకీయంలో "కొన్ని రాజకీయ పక్షాలు ఈ ప్రకృతివైపరీత్యంనుండి రాజకీయ ప్రయోజనం పొందాలని ప్రయత్నం చేస్తూండగా, ఇలాంటి సమయాలలో స్వచ్ఛందసంస్థలు ఎలా పనిచేయాలన్నదానికి రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ ఒక జ్వలంతఉదాహరణను ప్రస్తుతించింది. అనేక సహాయశిబిరాలను నిర్వహించడం, బాధితులు తమ తమ గృహాలకు తిరిగివెళ్ళేటట్లు సహకరించడంతోబాటు, వేరే ఎవ్వరూ తాకడానికైనా సిద్ధపడని అనేక శవాలను ఆరెస్సెస్ స్వయంసేవకులు తొలగించి, దహనం చేస్తున్నారు. మానవాళికి సేవచేయడం, నిర్వాసిత ప్రజానీకం కష్టాలు తీర్చడం.... ఈ ప్రయత్నాలు సైద్ధాంతిక, స్వార్థ దృష్టికోణానికి అతీతమైనవి. హడావుడిగా పరిశీలనకు వచ్చే రాజకీయ నాయకులు ప్రజలకు సేవచేసేందుకై వచ్చిన స్వచ్ఛంద సంస్థలను 'అనవసరమైన హంగామా చేస్తున్నారం'టూ విమర్శించేకంటే స్వేచ్ఛగా వారి పనివారిని చేసుకోనివ్వడం మంచిది. అదే వారు చేయగలిగిన కనీస సేవ" అని వ్రాసింది.

'ఇలస్ట్రేటెడ్ వీక్లీ' పత్రిక సంపాదకులు శ్రీ ఎమ్.వి. కామత్ : "మీరు ఆరెస్సెస్‌ను గురించి ఏమైనా అనవచ్చుగాక! కానీ తోటి దేశవాసులకు సేవచేసే విషయంలో మాత్రం తమ పనులన్నీ పక్కన బెట్టి, స్వప్రేరణతో, సంసిద్ధతతో ముందుకుదూకేదివారే. అందుకువారేం ప్రతిఫలం ఆశించరు. చివరికి 'వీక్లీ'లో ఒక ఫోటో కూడా" అని వ్రాశారు.

ఆ తరువాత, సహాయతా సమితి 25 లక్షల రూపాయిలు విరాళాలరూపంలో సేకరించి, ఇండ్లుకోల్పోయిన వారికి 500 పక్కాగృహాలను నిర్మించి ఇచ్చింది. శ్రీ బాలాసాహెబ్ దేవరస్ సమక్షంలో ఆ ఇండ్లను పేదలకు పంపిణీ చేసారు. మాజీముఖ్యమంత్రి శ్రీ బాబూభాయిపటేల్

ఆనాటి సభకు అధ్యక్షత వహించారు. ఖచ్చితమైన సమయపాలనతో, అద్భుతరీతిలో స్వయంసేవకులు ఈ పథకాన్ని పూర్తిచేసిన తీరును ఆయన బహుధా ప్రశంసించారు. ఇటువంటి కష్టతరమైన పనులు సైతం నిర్వహించగల సామర్థ్యం స్వయంసేవకులలో ఏర్పడడానికి ఎటువంటి శిక్షణవారికి ఇచ్చారో కదా! అని ఆయన ఆశ్చర్యం వ్యక్తంచేసారు. శ్రీబాలాసాహెబ్ తన ఉపన్యాసంలో: "సంఘశాఖలలో శవాలను తొలగించడం, నిర్వాసితులను ఆదుకోవడంలో శిక్షణ ఇవ్వం. శాఖలో లభించే సంస్కారాలే ఈ సామాజిక కర్తవ్యాల పరిపూర్తికి వ్యక్తికి ప్రేరణనిస్తాయి" అని సమాధానం ఇచ్చారు.

## అస్సాం కలహాలు:

1983లో అస్సాంను కుదిపివేసిన మతకలహాలు బహుశః దేశవిభజన నాటి ఘర్షణల తరువాత వాటితో సమానంగా పోల్చదగ్గవి. అస్సాం ప్రజలపై కేంద్రం బలవంతంగా ఎన్నికలను రుద్దింది. ఫలితంగా ఆరాష్ట్రం సంక్షోభంలో చిక్కుకుంది. ఎన్నికలకు ప్రజలు చూపుతున్న వ్యతిరేకతను అణచివేసేందుకు బంగ్లాదేశ్ ముస్లిం అక్రమప్రవేశకులను, స్థానిక ముస్లింలను హింసాకాండకు ప్రభుత్వం పురిగొల్పింది. ఆ తదుపరి జరిగిన మారణహోమంలో దాదాపు 8 వేలమంది ప్రాణాలు కోల్పోయారు. గ్రామాలకు గ్రామాలు తగులబడిపోయాయి. వేలాది ప్రజలు నిరాశ్రయులు, బికారులు అయిపోయారు. ఘర్షణలలో నష్టపోయినవారికి సహాయాన్ని అందించడంకోసం సంఘస్వయంసేవకులు 'సంఘర్షపీడిత సహాయతాసమితి'గా ఏర్పడ్డారు. 22 లక్షల రూపాయలు వసూలు చేసారు. వాటితోపాటు దైనందిన జీవితంలో ఉపయోగపడే పాత్రలు, బట్టలు, దుప్పట్లు, పుస్తకాలు, గృహనిర్మాణ సామగ్రిలను కూడా 5వేల కుటుంబాలకు పంపిణీ చేసారు.

## భోపాల్ గ్యాస్ దుర్ఘటన:

1984 డిసెంబర్ 3న తెల్లవారే సమయంలో మధ్య ప్రదేశ్‌లోని భోపాల్‌లో గల యూనియన్ కార్బైడ్ వారి క్రిమిసంహారక మందుల కర్మాగారంలో ఒక స్టోరేజీ ట్యాంకులో జరిగిన ప్రమాదకరమైన రసాయనిక సంయోగకారణంగా, 40 టన్నుల మిథైల్ ఐసోసైనేట్ (MIC) అనే విషవాయువు వాతావరణంలోకి ప్రవేశించింది. ప్రపంచంలోని అతి దారుణమైన మానవ నిర్మిత పారిశ్రామిక దుర్ఘటనగా పేరుబడ్డ ఈ

ప్రమాదంలో 3వేలమంది మరణించారు. 2 1/2 లక్షలమంది ప్రజలు కంటి జబ్బులకు, ఇతర వైకల్యాలకు గురి అయ్యారు.

మరునాటి ఉదయం హమీదియా ఆసుపత్రిలోకి రోగులు వరదలా వచ్చి పడ్డారు. దాంతో వారి తక్షణావసరాలు తీర్చేందుకుగల ఏర్పాట్లుకూడా విఫలం అయిపోయాయి. రోగులు బహిరంగ ప్రదేశంలో పడిఉన్నారు. ఆ క్షణాన అతి ప్రధానమైనవి అయిన త్రాగేనీరు, పరిశుభ్రతలు పూర్తిగా లోపించాయి. వాటిని అందుబాటులోకి తేవడంలో సంఘ స్వయంసేవకులు నగర పాలక సంస్థకు సహకరించారు. నిరుపయోగంగా పడిఉన్న శౌచాలయాలను మరమ్మత్తుచేసి వాడకంలోనికి తేవడంలో కూడా వారు సహకారం అందించారు. బాధితుల బంధువులను గుర్తించి, వారిని కలిపేందుకు ప్రయత్నాలు ప్రారంభం అయ్యాయి. మృతులను గుర్తించడంలోను, ఆ మృతదేహాల అంతిమ సంస్కారాల విషయంలోను మృతుల కుటుంబాలకు స్వయంసేవకులు ఎంతో సహకారం అందించారు. 1984 డిసెంబర్ 4 నుండి 8 వరకు మరణించిన వారి సామూహిక దహనం - చిన్న పిల్లల విషయంలో ఖననం - జరిగింది. అస్తికలు సేకరించి వారి వారి బంధువులకు అప్పగించారు.

దాదాపు నెలరోజులపాటు 5, 6 వైద్య శిబిరాలు నిర్వహించారు. ఈ గందరగోళాల మధ్య పట్టించుకోకుండా వదిలివేసిన వృద్ధులు, బలహీనులకు ప్రత్యేకంగా అవి సేవ చేశాయి. ఆగ్రా నుండి వచ్చిన వైద్య విద్యార్థి స్వయంసేవకులు అనేక రోజులపాటు 24 గంటలు పనిచేశారు. ముజఫర్ నగర్ నుండి హడావుడిగా అనేకవేల కంటిమందు సీసాలు తెప్పించారు. ఢిల్లీ విశ్వహిందూ పరిషత్, డి. ఆర్.ఐ.లు. తమ సంచార వైద్య శకటాలను మందులతో సహా పంపించాయి. బాధితులకు సహాయం అందించడంకోసమని దర్‌భంగా, వారణాసిలనుండి 35 మంది వైద్య విద్యార్థులతో బృందాలు వచ్చాయి.

శిబిరాలను సందర్శించిన మధ్యప్రదేశ్ గవర్నర్ ఆ శిబిరాలలో జరుగుతున్న పని తీరును ఎంతగానో ప్రశంసించారు.

విషవాయువు కారణంగా అనేకమందికి కళ్ళు బాగా దెబ్బతిన్నాయి. కనుక వేలాది కుటుంబాలలో చాలా రోజులవరకు వంటచేసుకోవడం సాధ్యంకాలేదు. కనుక స్వయంసేవకులు బాధిత ప్రాంతాలలో ఇంటింటికీ రొట్టె, పాలు, భోజనం పొట్లాలు అందించారు. ప్రభుత్వం నడిపిన శిబిరాలలో కూడా చాలామంది స్వయంసేవకులు స్వచ్ఛంద సేవకులుగా

పాల్గొన్నారు.

మిగిలిఉన్న విషవాయువును శక్తిహీనం చేసే ప్రక్రియప్పుడు మరల వాయువు బైటపడుతుందేమోనన్న భయంతో ప్రజలు పట్టణం ఖాళీచేసి వెళ్ళిపోసాగారు. ఆ పరిస్థితులలో ఈ ప్రక్రియకు స్వయంసేవకులు తమ సహకారాన్నిచ్చేందుకు ముందుకువచ్చారు. కర్మాగారంచుట్టూ ఇసుక బస్తాలు పేర్చి, బస్తాలపై నీళ్ళు జల్లారు. ఈ పనులన్నింటికీ స్వయం సేవకులే ఆధిపత్యం వహించారు. యూనియన్ కార్బైడ్ సంస్థనుండి నష్టపరిహారంకోరే గ్యాస్ పీడితులకు సహాయం అందించడానికి సమితి ఆ ప్రాంతాలలో సర్వేక్షణను నిర్వహించింది.

## ఉజ్జయిని సమీపంలో రైలు ప్రమాదం:

ఫైజాబాద్‌నుండి అహమ్మదాబాద్ వెళ్తున్న ఒకరైలు 1986 అక్టోబర్ 23న ఉజ్జైని సమీపంలోని తాజ్‌పూర్‌వద్ద పెద్ద ప్రమాదానికిలోనయింది. ఈ ప్రమాదంలో 20 మంది ప్రయాణీకులు అక్కడికక్కడే మరణించగా, 50 మందికిపైగా తీవ్రగాయాలతో ఆసుపత్రి పాలయ్యారు.

రాత్రి 9 గం.లకు ఉజ్జైనిలోని సంఘకార్యాలయానికి వార్త తెలిసింది. స్వయంసేవకులు వెంటనే మోటర్‌సైకిళ్ళపై ప్రమాదస్థలానికి చేరుకున్నారు. వారి సహాయంతో రైల్వేపోలీసులు మృతదేహాలను వెలికి తీస్తూ, గాయపడినవారిని ఆసుపత్రికి పంపించసాగారు. మరణించిన వారిని గుర్తించి, ఆ ప్రయాణీకుల బంధువులను సంపర్కించేసే పనిలో కూడా స్వయంసేవకులు సహాయంచేసారు. ఆ క్లిష్టసమయాలలో అత్యావశ్యకమైన సహాయం అందిస్తూనే, స్వయంసేవకులు మధ్యలో చిక్కుకుపోయిన ప్రయాణీకుల సామాన్లు, ధనాన్ని అల్లరిమూకలు కాజేయకుండా భద్రత కల్పించారు. ఎటువంటి విపత్తులు వచ్చినా ఆపన్నులనాదుకొనేందుకు స్వయంసేవకులు సదాసంసిద్ధంగాఉంటారని ఈ సంఘటన ఋజువుచేసింది.

## బెంగాల్ వరదలు:

1987 ఆగస్ట్-సెప్టెంబర్‌లలో రాష్ట్రంలోని ఉత్తర ప్రాంతాలలో సంభవించిన భయంకరమైన వరదల సమయంలో స్వయంసేవకులు నిర్వహించిన సహాయకార్యక్రమాలు వారి విశిష్ట వ్యవహారశైలిని వెలుగులోకితెస్తాయి. ప. బెంగాల్‌లోని మాల్దాలో స్వయంసేవకులు వరదనీటిని చీల్చుకుని, ఈదుకుంటూ చుట్టుప్రక్కల గ్రామాలకు వెళ్ళి, జలదిగ్బంధనంలో చిక్కు

కుపోయిన ఆ గ్రామాల ప్రజలకు సహాయ సామగ్రిని అందించారు. వాహనాలు నీటిలో చిక్కుకుని నిలిచిపోతాయన్న వంకతో జిల్లాకలెక్టర్ మొదట్లో వారికి ఎటువంటి రవాణా సౌకర్యాల ఏర్పాటుకు కూడా తిరస్కరించాడు. అయితే, అప్పటికే స్వయంసేవకులు ఆయా ప్రాంతాలకు చేరుకున్నారని, వాహనాలను సరియైన మార్గంలో తీసుకుని వెళ్ళగలరని తెలిసి ఆశ్చర్యపోయాడు. ఆ తరువాత వారికి వాహనాలు, సహాయ సామగ్రి అందజేసాడు.

స్వయంసేవకుల వెంటవెళ్ళిన ప్రభుత్వాధికారులు వారు చేస్తున్న సేవను ప్రశంశలతో ముంచెత్తడం విని, మరికొంతకాలం గడిచిన తరువాత కలెక్టర్ స్వయంసేవకులకు మరింత సహాయ కార్యక్రమాల పనిని అప్పగించాడు. అయితే, మొత్తం పనిపూర్తి అయిన తదుపరి స్వయంసేవకులు పూర్తి జమాఖర్చుల వివరాలను, లబ్ధిదారుల సూచీని అతడికి అందించినపుడు అతడి ఆశ్చర్యానికి అవధులు లేకుండాపోయాయి: “సహాయ చర్యలకు సంబంధించిన ఇలాంటి సవిస్తరమైన నివేదిక నేను ఇప్పుడే మొట్టమొదటిసారి అందుకుంటున్నాను. సాధారణంగా, ఒకసారి సహాయ సామగ్రి ఏదైనా సంస్థకు అప్పజెప్పడంతోనే మాపని ముగుస్తూఉంటుంది. తగు సమయంలో వాటని పంపిణీచేస్తారని మేం ఊహించుకుంటాం. ఆ విధంగా మీరొక క్రొత్త, శ్రేష్టమైన ధోరణికి శ్రీకారంచుట్టారు” అన్నాడాయన.

## గుజరాత్ కరువు:

గత వందసంవత్సరాల చరిత్రలో ఎన్నడూలేనంత తీవ్రస్థాయిలో 1987-88లో గుజరాత్‌లో విస్తృతమైన కరువు వచ్చింది. వరుసగా నాలుగు సంవత్సరాలబాటు విశాల పరిధిలో గల ప్రాంతాలలో ఒక్క చుక్క కూడా వర్షం కురవలేదు. పంటలు పూర్తిగా నాశనం అయ్యాయి. లక్షలాది ప్రజలు కందమూలాలతో కడుపులు నింపుకోవలసిన దుర్భర పరిస్థితి ఏర్పడింది. పశుసంతతి అంతరించిపోయింది. ప్రఖ్యాత గిర్ అడవులలోని సింహాలకు సైతం ప్రభుత్వం త్రాగునీటి వ్యవస్థ చేయవలసివచ్చింది. 18,275 గ్రామాలలో 15 వేల గ్రామాలను తీవ్రవిద్దడికి గురియైనవిగా ప్రకటించారు.

స్వయంసేవకులు ప్రారంభించిన ‘దుష్కాల్ పీడిత సహాయతాసమితి’ పశుసంతతి పరిరక్షణకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చింది. 123 శిబిరాలను

ఏర్పాటుచేసి 1,45,310 పశువులకు ఆశ్రయం కల్పించారు. మిగిలిన స్వచ్ఛందసంస్థలవారు కూడా అలాంటి శిబిరాలను ఏర్పాటుచేసేందుకు స్వయంసేవకులు వారికి సహాయం అందించారు. బి.జె.పి, కిసాన్ సంఘ్‌ల కార్యకర్తలు ఈ కృషిలో ప్రధాన పాత్ర వహించారు. ఖర్చులో కొంత భాగం భరించడానికి ప్రభుత్వం కూడా ముందుకు వచ్చింది. రైతులను వ్యక్తిగతంగా ఒకటి, రెండు ఆవులను దత్తత తీసుకొమ్మని అభ్యర్థించారు. ఆరకంగా మృత్యువుకోరల నుండి 21వేల గోవులను కాపాడారు.

సాధ్యమైనంత తక్కువ ఖరీదులో పశువులమేతను ఉత్పత్తిచేయడం, సమీకరించడాలను అత్యవసర కార్యంగా ప్రారంభించారు. ఈ కఠినమైన పనిని కిసాన్‌సంఘ్ యుద్ధప్రాతిపదికపై అత్యుత్సాహంతో స్వీకరించింది. నీటిపారుదలలో నూతన పద్ధతులను అవలంబించి, తక్కువ నీటి వినియోగంతో అత్యధిక పశువుల మేతను ఉత్పత్తిచేసారు. అలా పండించిన మేతను గోదాములద్వారా స్వయంసేవకులు అత్యధికంగా కరువు దెబ్బతిన్న ప్రాంతాలలో పంపిణీచేసారు. బోరింగులు, నీటి పారుదల కాలువలు కలిగిన రైతులు చేసిన సహకారం ఈ కృషిలో ఎంతో సహాయపడింది. వారు 240 లక్షల కిలోల పచ్చిగడ్డిని ఉత్పత్తిచేసారు. తక్కువధరలకు దానిని విక్రయించారు. ఈ మానవతా దృష్టితో సాగినకృషిలో ప్రక్కనేగల మహారాష్ట్రనుండి కూడా స్వయంసేవకులు ముందుకువచ్చారు. నామమాత్రపు ధరలకు 2 వేల టన్నుల గడ్డిని వారు సేకరించారు.

ప్రజలకు సంబంధించినంతవరకు, మజ్జిగ చౌక అయిన, బలమైన పోషక పదార్థంగా ఉపయోగపడింది. బాధితులకు సేవచేయడానికి 405 ఉచిత మజ్జిగ కేంద్రాలు ప్రారంభించారు. దాదాపు 5 వేల కుటుంబాలకు కొన్ని నెలలపాటు ఆహారధాన్యాలను సరఫరాచేసారు. స్వయంసేవకుల పిలుపునందుకుని, కరువు పీడిత ప్రజానీకానికి వైద్యసహాయం అందించడానికి అనేక వైద్యబృందాలు స్వచ్ఛందంగా ముందుకువచ్చాయి. అటువంటి ఆకలి పరిస్థితులలో సర్వసాధారణంగా వ్యాపించే అంటువ్యాధులబారినుండి ప్రజలను కాపాడడంలో అవి పెద్దఎత్తున సహాయపడ్డాయి.

కరువు బాధితులకు ఉచితంగా పంపిణీ చేసేందుకు సేకరించిన 'సుఖాడీలు' - గోధుమపిండి, బెల్లం, నెయ్యి కలిపి తయారుచేసిన పౌష్టికాహారం - మరొక ప్రయోజనకరమైన ప్రయత్నంఅయ్యాయి. ఈ వినూత్న ప్రయత్నంవల్ల ప్రఖరమైన ఆత్మీయతా భావన ప్రదర్శితమైంది.

స్వయంసేవకులకు అనేక కదిలించే అనుభవాలు ఎదురయ్యాయి. 1987 లో 16,800 మంది స్వయంసేవకులు తమ తల్లులు, సోదరీమణుల సహకారంతో 2,10,000 కుటుంబాలనుండి 262 టన్నుల సుఖాడీలను సేకరించారు. 6 జిల్లాలలోని 14,500 కుటుంబాలకు వారానికి సరిపడ సుఖాడీల చొప్పున పంపిణీ చేసారు. 64,800 మంది ప్రజలు వాటివలన ప్రయోజనం పొందారు. 1988 మొదటి మూడు నెలలలో మరల మరొక 100 టన్నుల సుఖాడీలను సేకరించి అదే పద్ధతిలో పంపిణీచేసారు.

ఈ సుఖాడీ సేకరణోద్యమంలో భాగంగా కొందరు స్వయంసేవకులు, తల్లులు ఛతన్‌పూర్ గ్రామానికి వెళ్ళారు. ఆ సమయంలో గ్రామంలో జాతర జరుగుతోంది. ఆ బృందం వెంటనే భజన బృందంగా మారి, ఇంటింటికి వెళ్ళి 'సుఖాడీ-దానం' అర్థించసాగారు. గ్రామస్తులంతా రోజు వారీ కూలీ సంపాదించుకునే ఉపేక్షిత వర్గాల ప్రజలే. అయినా కరువుపీడిత ప్రజల కష్టాలు వారినెంతో కలచివేసాయి. ఆ చిన్న గ్రామమొక్కటే అరటన్ను సుఖాడీలను దానంచేసింది.

పిల్వాయి గ్రామంలో, స్వయంసేవకులు మొదట వయోవృద్ధ సన్యాసి శ్రీకృష్ణానందజీ మహరాజ్‌ను దర్శించి, ఈ సుఖాడీ సేకరణోద్యమానికి వారి ఆశీస్సులనర్థించారు. ఆ సాధువు స్వయంగా సుఖాడీల తయారీకి ఉపయోగపడే రూ|| 31 వేల విలువచేసే నెయ్యి సేకరించి ఇచ్చారు. మొదట సుఖాడీలను శ్రీరామచంద్రునికి అర్పించారు. అక్కడినుండి ప్రసాద రూపంలో ఆ సుఖాడీల పంపిణీ జరిగింది. కరువు బాధితులకు స్వామీజీ చేతుల మీదుగా ప్రసాద వితరణ జరుగుతోందని తెలిసి చుట్టు ప్రక్కల 15 గ్రామాల ప్రజలు ఒక్కొక్కటన్ను చొప్పున సుఖాడీలు తీసుకొని ముందుకువచ్చారు.

పటాన్‌పూర్‌లో ఒక ముస్లిం మహిళ టీ దుకాణాన్ని నడుపుతూ ఉండేది. 'ఆరెస్సెస్ సుఖాడీ సేకరణోద్యమం' అన్న బ్యానర్‌ను చూచి ఆమె "మీ ఆరెస్సెస్ వారు ముస్లింలు ఇచ్చే సుఖాడీలు స్వీకరిస్తారా?" అని అడిగింది. "ఎందుకు స్వీకరించం?" సమాధానం వచ్చింది. ఆ తరువాత, స్వయంసేవకులు ఇంటింటికి వెళ్ళినపుడు సుఖాడీలు సిద్ధంగా ఉండడం వారికి ఆశ్చర్యం కలిగించింది. "మీకు ఈ సేకరణోద్యమం గురించి ముందే ఎలా తెలుసు?" అని వారు ఆశ్చర్యంతో అడిగారు. "అదిగో! ఆ మహిళద్వారా!" అందరిదీ అదే సమాధానం.

గుజరాత్‌లో స్వయంసేవకులు నిర్వహించిన కరువు సహాయ కార్యక్ర

మాలలో మరొక ప్రముఖమైన అంశం ప్రభుత్వానికి, పీడిత ప్రజలకు మధ్య వారు నిర్వహించిన అనుసంధానపాత్ర. ప్రభుత్వం నడిపిన అనేక సహాయశిబిరాలలో వారుకూడా స్వచ్ఛందంగా పనిచేసారు. ఆహారం, ఇతర సహాయంతో బాటు ప్రేమ, ఆదరణలను కూడా వారు పంచిపెట్టారు.

## త్రిపుర: చక్మా శరణార్థులు:

ప్రబలమైన హిందూ ఆధిక్యత కలిగి ఉన్నప్పటికీ, తూర్పుబెంగాల్‌లోని చిట్టగాంగ్ పర్వతీయ జిల్లాలను 1947లో బ్రిటిష్‌వారు అన్యాయంగా పాకిస్తాన్‌కు ఇచ్చివేసారు. అప్పటినుండి తూర్పు పాకిస్తాన్, ప్రస్తుత బంగ్లాదేశ్ ఆ ప్రాంతాన్ని ముస్లిం ప్రాంతంగా మార్చివేసేందుకు కుట్రపన్నుతూనే ఉన్నాయి. అందులో భాగంగా అక్కడి వనవాసీ చక్మాలను తరిమికొట్టి, బెంగాలీ ముస్లింలను ఆ ప్రాంతాలలో స్థిరపడేటట్లు చేస్తున్నారు.

ఫలితంగా, అక్కడినుండి పారిపోయివస్తున్న చక్మాశరణార్థుల వెల్లువ ప్రక్కనే ఉన్న చిన్న రాష్ట్రమైన త్రిపురపైపడింది. వారి సంఖ్య 50 వేలు దాటిపోయింది. స్వయంసేవకులు నిర్వహించిన ఒక సర్వేక్షణలో త్రిపురలోని శరణార్థి శిబిరాలలో ఉన్న దుర్భరపరిస్థితులు బైటపడ్డాయి. ప్రభుత్వం యొక్క ఈ దారుణ నిర్లక్ష్యాన్ని బహిర్గతం చేస్తూ వారు విషయాన్ని ప్రజలకు తెలియజేసారు. చక్మాలకు తగు రక్షణ, పునరావాసాలను కల్పించడం నైతిక బాధ్యతగా భావించి స్వీకరించమని సంఘ్ అఖిలభారతీయ కార్యకారి మండలి కేంద్ర ప్రభుత్వానికి పిలుపునిచ్చింది. స్వయంసేవకులు దేశమంతటా బట్టలు, దుప్పట్లను సేకరించారు. వాటిని శరణార్థి శిబిరాలలో తలదాచుకుంటున్న 35 వేలమందికి రెండుసార్లు పంచిపెట్టారు. స్థానిక సి.పి.ఐ.(ఎమ్) రాష్ట్రప్రభుత్వం విశ్వ హిందూపరిషత్, ఆరెస్సెస్‌లకు ఈ వస్తువులు పంచిపెట్టడానికి అనుమతి నిరాకరించినపుడు, ఒక స్థానిక వనవాసీసంస్థ ముందుకు వచ్చి, తమ సంస్థపేరున ఆ కార్యకర్తలను స్వీకరించి, వాటి పంపిణీకి ఏర్పాట్లుచేసింది. ఆ తరువాత స్వయంసేవకులు చక్మా విద్యార్థులకోసం మిజోరాం సరిహద్దులోగల కచార్‌జిల్లాలోని హైలైధాన్‌లో ఒక వసతిగృహాన్ని ప్రారంభించేసారు. సిల్చార్‌లో స్వయంసేవకులు నడుపుతున్న ఒక వసతిగృహంలో కొందరు చక్మా కళాశాల విద్యార్థులకు ఆశ్రయం కల్పించారు.

## కేరళలో: రైలు దుర్ఘటన:

రైలు ప్రమాదాల చరిత్రలో ఈ మధ్యకాలంలో జరిగిన ఘోరప్రమాదం 1988 జూలై 8 మధ్యాహ్నం కేరళలో జరిగింది. ఆ ప్రమాదంలో బెంగుళూరు నుండి తిరువనంతపురం వెళ్తున్న 'ఐలాండ్ ఎక్స్‌ప్రెస్'కు చెందిన 14 పెట్టెలు క్విలన్ సమీపంలోని పెరుమన రైలువంతెన మీద నుండి అష్టముది సరస్సులో పడిపోయాయి.

అనేకమంది ప్రాణాలను కాపాడడంలో స్థానిక మత్స్యకారులు ప్రదర్శించిన సాహసపూర్ణ ప్రాణరక్షణ ప్రయత్నాలను అనేక వార్తాపత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి. ప్రమాదస్థలానికి వెనువెంటనే చేరుకున్న వారిలో స్థానికశాఖల స్వయంసేవకులు కూడా వున్నారు. కొద్దిసేపటిలోనే తిరువనంతపురం సేవాభారతి కార్యకర్తలు, క్విలన్‌శాఖ స్వయంసేవకులు మొత్తం వందమంది వచ్చి వారితో కలిసారు.

ఆంధ్ర, మోర్వీల ఉదాహరణ ఇక్కడకూడా పునరావృత్తం అయింది. మునిగిపోయిన పెట్టెలలో ఇరుక్కుపోయిన మృతదేహాలు కుళ్ళిపోసాగాయి. వాటి దుర్వాసన భరించలేక పోలీసులు, ప్రముఖులైన సేవాభావనగల వ్యక్తులుసైతం దూరంగా ఉండిపోయారు. అగ్రశ్రేణి మళయాళీ దినపత్రిక మాతృభూమి (1988 జూలై 12) ఇలా వ్రాసింది:

"మిగిలిన అందరూ ముక్కులు మూసుకుని సంశయంలో కూర్చుండిపోయిన సమయంలో, ఆరెస్సెస్ స్వయంసేవకులు నీళ్ళలో మునిగిఉన్న క్రుళ్ళిన మృతదేహాలను తొలగించడానికి ముందుకువచ్చారు. ఆరెస్సెస్ సేవావిభాగమైన సేవాభారతికి చెందిన అంబులెన్స్‌లో ఆ దేహాలను తీసుకుని వెళ్ళారు. ఆసుపత్రుల వద్దకూడా, బాధితులకు రక్తం ఇవ్వడానికి స్వయంసేవకులు సిద్ధంగా ఉన్నారు. ప్రమాదం జరిగిన పెరుమనకాయల్ ఉప్పుటేరు స్వయంసేవకుల కార్యకలాపాలకు కేంద్రంగా మారింది. ప్రమాదం జరిగిన రోజునే స్వయంసేవకులు పెట్టెలలో చిక్కుకుని పోయిన అనేకమందిని కాపాడారు. ఈ రక్షణ సహాయక చర్యలలో కొందరు స్వయంసేవకులు కూడా గాయపడ్డారు."

కొచ్చిన్ నుండి వెలువడే 'వీక్' (1988 జూలై 24-30) పత్రిక ముక్కుకు, నోటికి గుడ్డలు కట్టుకుని, శవాలుమోస్తున్న నిక్కర్లు ధరించిన స్వయంసేవకుల ఫోటోను ప్రచురించింది. సేవాభారతి చేసిన రక్షణ, సహాయ చర్యలను గురించి పేర్కొంది.

"సహాయక చర్యలలో పనిచేస్తున్న కార్యకర్తలందరికీ సంఘస్వయంసేవకులు బిస్కట్లు, నిమ్మరసాలను ఉచితంగా సరఫరాచేసారు. మత్స్యకార స్వయంసేవకులు ప్రజలను ప్రమాదస్థలానికి నామమాత్రపు రేటు తీసుకుని తమ పడవలపై జారవేశారు. స్వార్థపరులైన వ్యక్తులు ఈ సమయంలో దోపిడికి దిగకుండా ఈ రెండు చర్యలు ఎంతోసహాకరించాయి. పెరుమన వంతెనను వేగంగా మరమ్మత్తుచేసే కృషిలో రాత్రింబవళ్ళు నిమగ్నులైఉన్న ఇంజనీర్లు, కార్మికులకు స్వయంసేవకులు తమ ఇండ్లనుండి ఆహారపాట్లాలు తయారుచేయించి అందజేసారు. ఆ ప్రాంత పరిశుభ్రత బాధ్యత కూడా స్వయంసేవకులు తమ భుజాలపై వేసుకున్నారు. కలెక్టర్, పోలీసులు, నౌకాదళ అధికారులు, అందరినీ మించి స్థానిక ప్రజానీకం స్వయంసేవకులను ప్రశంశలతో ముంచెత్తారనడంలో ఆశ్చర్యం ఏముంది!"

# 11

# యువహృదయాలను ఉదాత్తంగా తీర్చిదిద్దేకృషి

ఒకజాతి నిరాటంకంగా తన అస్తిత్వాన్ని ప్రకటించుకోగలగాలంటే విదేశీయ బంధనాలనుండి బైటపడడం అత్యంతావశ్యకమైన విషయం. ప్రతిజీవనరంగంలోను, అంతరికమైన తన ఆశయాకాంక్షలను వికసింపజేసే అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగల సామర్థ్యం సాధించుకున్నప్పుడే జాతిస్వాతంత్ర్యానికి పరిపూర్ణత లభిస్తుందన్నదికూడా అంతే వాస్తవం. స్వాతంత్ర్య జ్యోతి ప్రకాశం ప్రసరించవలసిన మొట్టమొదటి రంగం విద్యారంగం.

ప్రస్తుత విద్యావిధానం బ్రిటిష్‌వారు మనదేశం నెత్తిన రుద్దినదని అందరికీ తెలిసిన విషయమే. మనప్రజలను నిజంగా విద్యావంతులనుచేసి, ప్రగతికి సోపానాలుగా తీర్చిదిద్దాలనే సదుద్దేశంతోవారు ఈ విద్యావిధానాన్ని రూపొందించలేదు. కేవలం తమ పరిపాలనా యంత్రాంగాన్ని నడిపించే ఆంగ్లమానసపుత్రులైన ఒక గుమాస్తాలసైన్యాన్ని తయారుచేయడమే వారి లక్ష్యం. ఆ రోజులలోనే మన జాతీయ పునరుత్థానానికి నాయకత్వం వహించిన పెద్దలు, మొత్తం విద్యావిధానం పెద్దఎత్తున పునర్నిర్మాణం జరగాలని కోరారు. ఈ భూమియొక్క అర్హతలు, అవసరాలను దృష్టిలో పెట్టుకుని కొన్ని క్రొత్త నమూనాలను కూడా వారు సూచించారు.

స్వాతంత్ర్యం లభించిన తరువాత ఎప్పుడో జరుగవలసిఉన్న ఈ పరివర్తన శీఘ్రంగా ప్రారంభమౌతుందని అందరూ ముచ్చటపడ్డారు. అయితే, ఈ విషయంలో నియమితమైన ప్రతి ఆయోగం (కమీషన్) చెప్పుకోదగ్గ మార్పేదీ సాధింపబడలేదని మాత్రమే పేర్కొంటూవచ్చింది. విద్యారంగంలో సంస్కరణలకోసం ప్రస్తుత ప్రభుత్వంచేస్తున్న ప్రయత్నాలు కూడా అంతకంటే గొప్పగా ఏం సాధించబోవని ఆ రంగంలో నిపుణులు అభిప్రాయపడుతున్నారు.

## నమూనాల స్థాపన:

అయితే, దేశంలో కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు భారతీయ విద్యా విధానానికి ఒక నమూనాను నిర్మించేందుకు సాహసోపేతమైన కృషిచేస్తూనే ఉన్నాయి. స్వయంసేవకులకు సంబంధించినంతవరకు, అలాంటి పాఠశాలలను ప్రారంభించే ప్రయత్నం మొట్టమొదటగా ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్‌లోను, ప్రస్తుతం హర్యానాలో ఉన్న కురుక్షేత్రలోను జరిగింది. అది తొలియాభైల నాటిమాట. ఆ తరువాత వివిధప్రాంతాలలో అదేవిధమైన అగ్రగామి ప్రయత్నాలు జరిగాయి. క్రొత్త క్రొత్త ప్రదేశాలలో క్రొత్తక్రొత్త పాఠశాలలు అతివేగంగా విస్తరించసాగాయి. వివిధకారణాలవల్ల ప్రజలుకూడా ఈ పాఠశాలలకు మంచి ప్రతిస్పందన చూపసాగారు. పురపాలక సంఘ, ప్రభుత్వపాఠశాలల స్థితి బాగా దిగ జారిపోయింది. ప్రభుత్వేతర విద్యాసంస్థలలో క్రైస్తవ విద్యాలయాలు ప్రముఖస్థానాన్ని ఆక్రమించాయి. పిల్లలపై ఆ క్రైస్తవ విద్యాసంస్థలు కలిగిస్తున్న సంస్కృతి వ్యతిరేక, జాతివ్యతిరేక ప్రభావం దేశభక్త హృదయాలన్నింటినీ కలచివేసింది. ఆ పరిస్థితులలో, స్వయంసేవకులు ప్రారంభించిన పాఠశాలలు వారికి సంతృప్తికలిగించే వ్యత్యాసాన్ని ప్రదర్శించాయి. ఉన్నత ప్రమాణాలలో విద్యాబోధనతోబాటు, శీలం, సంస్కృతి, క్రమశిక్షణ, జాతీయస్వాభిమానం, మాతృభాష ఎడల ప్రేమ, భారతీయ జీవన విలువల ఎడల నిష్ఠ, తదితర గుణాలపై కూడా ఈ పాఠశాలలు శ్రద్ధచూపించసాగాయి. ఫలితంగా, దేశమంతటా అటువంటి పాఠశాలలు కావాలనే కోరిక నానాటికి వృద్ధి చెందసాగింది.

ఆంధ్రప్రదేశ్‌లో శ్రీ సరస్వతీ విద్యాపీఠం నిర్వహిస్తున్న 250 పాఠశాలలలో 120 పాఠశాలలు గ్రామీణ ప్రాంతాల్లో ఉన్నాయి. శ్రీసరస్వతీ విద్యాపీఠం మెదక్ జిల్లాలో ఒక ఉచిత ఆవాస విద్యాలయాన్ని నడుపుతున్నది. 2000 మంది పేద పిల్లలకు ఎలాంటి ఫీజు లేకుండా విద్యాసదుపాయాలు కలుగజేస్తున్నది. భారతీయ విద్యాకేంద్రం, గౌతమి విద్యాసమితి, భారతీయ విద్యాపీఠాల ఆధ్వర్యంలో కూడా మరొక 40 వరకు పాఠశాలలు నడుస్తున్నాయి.

సరస్వతీ శిశుమందిరాలు, తదితరపేర్లతో ఆ విద్యాసంస్థలు సంఖ్యాత్మకంగాను, వివిధ స్వరూపాలలోను పెరగసాగాయి. ఈ ప్రయత్నాలను జాతీయస్థాయిలో సమన్వయం చేసినట్లైతే ఉపయోగకరంగా ఉండగలదని, ఆ సంస్థలను మరింత చైతన్యవంతంగాను, ప్రయోజనకరంగానూ

తీర్చిదిద్దేందుకు వీలౌతుందని భావించారు. ఆలక్ష్యంతోనే 1978లో విద్యాభారతి ఆవిర్భవించింది. ప్రస్తుత 3 వేల పూర్వప్రాథమిక, ప్రాథమిక, పాఠశాలలు, జూనియర్ కళాశాలలు, 40 డిగ్రీ, పోస్ట్‌గ్రాడ్యుయేట్ కళాశాలలు దానికి అనుబంధంగా ఉన్నాయి. అవిగాక, గురుకుల ఆశ్రమాల ఒరవడిలో నడుస్తున్న 30 ఆవాస విద్యాలయాలు కూడా ఉన్నాయి. మొత్తంమీద 30 వేలమంది ఉపాధ్యాయులు విద్యాబోధనలో నిమగ్నమై ఉండగా, 8 లక్షలమంది విద్యార్థులు ఆ పాఠశాలలలో విద్యాభ్యాసం చేస్తున్నారు. అన్ని రాష్ట్రాలలోను ఆ పాఠశాలలు ఉన్నాయి. జమ్మూ-కాశ్మీర్‌నుండి తమిళనాడు, కేరళ వరకు, గుజరాత్, రాజస్థాన్ నుండి అస్సాం, మణిపూర్‌లవరకు ఈ విద్యాలయసూత్రంలో బంధింపబడి ఉన్నాయి. అండమాన్- నికోబార్ దీవులలోని పోర్ట్‌బ్లెయిర్‌లో కూడా ఒక శిశుమందిరం ఉంది.

## ఉపేక్షిత ప్రాంతాలకు ప్రాధాన్యత:

విద్యాభారతి సున్నితమైన వనవాసీ ప్రాంతాలకు ప్రత్యేక ప్రాధాన్యతనిచ్చింది. ఆ సుదూర ప్రాంతాలలో 'ఒక ఉపాధ్యాయుడు-ఒక పాఠశాల' పద్ధతిలో అనేక పాఠశాలలు వేగంగా పెరుగుతున్నాయి. ఉత్తరాదిలో అలాంటి ప్రాంతాలలో ఇప్పటివరకు 115 చిన్న, పెద్ద విద్యాసంస్థలు ఆవిర్భవించాయి. ఉత్తరకచార్ పర్వతీయ జిల్లా హాఫ్లాంగ్‌లో గల ఆవాసవిద్యాలయంలో నాగా, తదితర 20 వనవాసీ తెగలకు చెందిన 90 మంది విద్యార్థులు విద్యాభ్యాసం చేస్తున్నారు. ఆ ప్రాంతంలో నూతనంగా ప్రారంభమౌతున్న పాఠశాలలలో ఉపాధ్యాయులుగా వారిని తీర్చిదిద్దే ఉద్దేశంతో ఆ ప్రకల్పం పనిచేస్తోంది. హాఫ్లాంగ్‌లో విద్యాబోధన వారి మాతృభాషలోనే జరుగుతోంది. వనవాసీ ప్రజలకు వారి స్వంత లిపిలేదు. కనుక దేవనాగరి లిపిని ఉపయోగించి, వారివారి మండలీకాలలో పుస్తకాలను తయారుచేసారు. స్థానిక అవసరాలు, వనరులను దృష్టిలో ఉంచుకుని వారికి వృత్తి శిక్షణనిచ్చేందుకు కూడా ఏర్పాట్లు జరుగుతున్నాయి. 1986 అక్టోబర్‌లో బీహార్‌లోని గుమ్లాలో 'వనవాసీ విద్య'పై అఖిల భారతస్థాయిలో అధ్యయన శిబిరం జరిగింది. ఎంతో ప్రయోజనకరంగా రూపొందిన ఈ వర్గంలో 60 మంది విద్యావేత్తలు, గిరిజన ప్రాంతాల కార్యకర్తలు పాల్గొన్నారు.

విద్యాభారతి పథకాలలో గ్రామీణ ప్రాంతాలలో విద్యది తరువాతి స్థానం. వివిధరాష్ట్రాలలో ఇప్పటివరకు అలాంటి 750 పాఠశాలలు పనిచే

యడం ప్రారంభించాయి. యు.పి.లోని ఘజియాబాద్‌లో గ్రామభారతి, మధ్యప్రదేశ్‌లోని సాగర్ జిల్లాలో దేవరిల లో రెండు ప్రయోగాత్మక కేంద్రాలు కూడా నడుస్తున్నాయి. వాటిలో గ్రామీణాభివృద్ధికి సమగ్ర విద్యావిధానంపై పరిశోధనలు, ఉపాధ్యాయకేంద్రిత, విద్యార్థి కేంద్రిత ప్రయోగాలు, ఉపాధ్యాయ శిక్షణ కార్యక్రమాలు జరుగుతున్నాయి.

హరిజన బస్తీలలో ప్రారంభమౌతున్న పాఠశాలల సంఖ్యకూడా పెరుగుతోంది. పట్టణప్రాంతంలో ఉన్న ప్రతిపాఠశాల ఉపేక్షిత బస్తీలో ఒక సంస్కారకేంద్రాన్ని ప్రారంభించేవిధంగా ప్రయత్నం జరుగుతోంది. ప్రస్తుతం అలాంటి 90 పాఠశాలలు, 100 సంస్కారకేంద్రాలను నడుపుతున్నాయి.

## కొన్ని విశిష్ట లక్షణాలు:

మన జాతీయాదర్శాలు, సామాజిక విలువలపై ఆధారపడిన ఒక విద్యాతత్వజ్ఞానాన్ని రూపొందించడంపై విద్యాభారతి దృష్టిని కేంద్రీకరించింది. భౌతిక, మానసిక, నైతిక, ఆధ్యాత్మిక స్థాయిలలో విద్యార్థి సమగ్రవికాసంపై ప్రత్యేక శ్రద్ధ వహిస్తోంది. విద్యాభారతి సంస్థలలో సంస్కృతం, యోగ, సంగీతం తప్పనిసరిగా ఉంటాయి. అనేక రాష్ట్రాలలో ఉపాధ్యాయుల శిక్షణకు దీర్ఘకాలిక కార్యక్రమాలు, స్వల్పకాలిక కార్యక్రమాలుకూడా అమలులో ఉన్నాయి. విద్యాపరిశోధనారంగంలో జరుగుతున్న కృషిలో మేధావులను భాగస్వాములను చేసే ఉద్దేశంతో లక్నోలోని విద్యాభారతి కేంద్రస్థానంలో 'విద్యాభారతి కేంద్రీయ విద్యా పరిశోధనసంస్థ'ను స్థాపించారు. వివిధ ప్రాంతాలకు, వివిధ విద్యావిభాగాలకు చెందిన 500 మంది విద్యావేత్తలతో 'విద్యాభారతి రాష్ట్రీయ విద్వత్ పరిషత్' అనే సలహామండలిని ఏర్పాటుచేసారు. దానిలో సర్వశ్రీ వి. వి.జాన్, పి.ఎన్. మాథుర్, దేవేంద్రశర్మ, ఎస్.ఆర్. జైస్వాల్, ఆర్.ఎన్. సఫాయావంటి ప్రముఖులు ఉన్నారు.

ఉపాధ్యాయుడు, విద్యార్థిమధ్య కుటుంబపద్ధతిలో ఉండే సంబంధం విద్యాభారతి విద్యాసంస్థల ప్రత్యేకత. ఆ విధంగా జనించిన ప్రేమ, విశ్వాసాలే ఆ విద్యార్థి శీలాన్ని తీర్చిదిద్దడానికి ఆధారం అవుతాయి. ఆవాస విద్యాలయాలలో ఇది అసాధారణరీతిలో ప్రకటితమౌతూ ఉంటుంది. పూర్వకాలపు గురుకుల వాతావరణాన్ని నిర్మించడంలో కొంతవరకు ఆ విద్యాలయాలు కృతకృత్యం అయ్యాయి. ఈ పాఠశాలలలో సమాధాన

పత్రాలను సరిచూచి విద్యార్థికి తిరిగి ఇస్తారు. దానివలన విద్యార్థులు తమను తాము తిరిగి అంచనావేసుకొనడానికి, ఉపాధ్యాయుని సామర్థ్యం, నిష్పక్షపాత ధోరణులపై విశ్వాసం ఏర్పరచుకొనడానికి అవకాశం ఏర్పడుతుంది.

ఈ ఉత్తమ లక్షణాల కారణంగాను, ఉపాధ్యాయుల స్వీయ ఉదాహరణల కారణంగాను, ఈ విద్యాసంస్థలలో విద్యార్థుల క్రమశిక్షణా రాహిత్య సమస్యలు; చూచివ్రాయడం, సమ్మెలు, మతాతత్వం, కులతత్వంవంటి అనైతిక వ్యవహారాలకు స్థానమే ఉండడంలేదు. కొద్దిసంవత్సరాలక్రితం బైట సమ్మెచేస్తున్న కొందరు విద్యార్థినాయకులు కురుక్షేత్ర(హర్యానా)లోని గీతా విద్యాలయ విద్యార్థులను కూడా సమ్మెకు రెచ్చగొట్టే ప్రయత్నంచేసారు. తమకు నిరసన తెలియజేయవలసిన సమస్యలేవీలేవని తెలియజేస్తూ ఆ విద్యార్థులు సమ్మెకు నిరాకరించారు. రక్షాబంధన్‌లాంటి సంధర్భాలలో ఆ విద్యాసంస్థలలోని విద్యార్థులు గ్రామీణ ప్రాంతాల స్థితిగతులను తెలుసుకొనడానికి ఆప్రాంతాలకు తరలివెళ్తుంటారు. బెంగుళూరు సమీపంలోని చెన్నసహళ్ళిలోగల జనసేవావిద్యాకేంద్ర, వైద్యులు, తల్లితండ్రులుకూడా ఆశవదులుకున్న మానసికంగా ఎదగని విద్యార్థులను కూడా తరచు స్వీకరిస్తూ ఉంటుంది. వారిలో వచ్చిన అభివృద్ధికి అప్పుడప్పుడు మానసిక వైద్యులుసైతం ఆశ్చర్యపడుతూఉంటారు. అల్లరిచిల్లరిగా ఉండే కొందరు బాలురు, ఉత్తమ విద్యార్థులుగా, పాఠశాలకే మాణిక్యాలుగా రూపొందారు. పరీక్షలలోను, వక్తృత్వం, ఆటలలోను పైన పేర్కొన్న విద్యాసంస్థల వంటివి అగ్రస్థానంలో నిలుస్తున్నాయి. అంతేకాదు! జూడో, మల్ ఖంబ్, జావెలిన్‌త్రో వంటి యుద్ధ కళలలో జాతీయస్థాయి పోటీలకు కూడా తమ విద్యార్థులను అవి పంపిస్తున్నాయి.

## సద్గుణాలను పెంచిపోషించడం:

శారీరిక, మానసిక, నైతిక విషయాలలో దేనిలోనో ఒకదానిలో తమ విద్యార్థులు ప్రావీణ్యత సంపాదించిన సంఘటనలు ప్రతి పాఠశాలలోను కోకొల్లలు. మణిపూర్‌లోని శిశుమందిరాల విద్యార్థులు శారీరిక ప్రదర్శనలలో అత్యుత్తమ ప్రావీణ్యతను ప్రదర్శించారు. గణతంత్రదినోత్సవాలప్పుడు తమ ప్రతిభను ప్రదర్శించవలసిందిగా ప్రభుత్వాధికారులు తరచు ఆవిద్యార్థులను ఆహ్వానిస్తూనే ఉంటారు. తమ వ్యక్తిగత జీవితాలలో కూడా అత్యుత్తమ గుణాలను ప్రదర్శించిన విద్యార్థుల సంఘటనలు కూడాఅనేకం.

కాన్పూరులోని సరస్వతీ శిశుమందిర్‌లో 5వతరగతి చదువుతున్న ఒక విద్యార్థికి సంబంధించిన ఉదాహరణ ఇది. ఒకరోజు వంటింట్లో గ్యాస్ వెలువడి మండడంవల్ల హటాత్తుగా అన్నివైపుల పొగ అలముకోవడం అతడు చూసాడు. తన 3-4 ఏండ్ల వయస్సు చెల్లాయి వంటింట్లో ఉందని అతడికి తెలుసు. ఇంట్లో ఇంకెవరూ లేరు. ఒక్క క్షణంలో, ఆబాలుడు మంటలలో ఉన్న వంటింట్లోకి పరిగెత్తి ఆపాపను రక్షించాడు. ఒళ్ళుకాలిన ఆబాలుని ఆసుపత్రిలో చేర్పించారు. ఆబాలుడి సాహసిక చర్య వార్తాపత్రికలలో ప్రచురితమైంది. అంతటి ప్రమాదకరమైన సాహసానికి ఏవిషయం పురికొల్పిందని ఆబాలుడిని కొందరు పత్రకారులు ప్రశ్నించినపుడు, అమాయకంగా అతడు జవాబిచ్చాడు: "ఇందులో విశేషంఏముంది? మాచెల్లాయిని రక్షించాలనే నేను ప్రయత్నించాను. శిశుమందిరంలో ఇచ్చిన శిక్షణవల్లే నాకు అంతధైర్యం వచ్చింది."

ఉత్తరప్రదేశ్‌లో పిథోర్‌గర్ జిల్లాలో టిబెట్ సరిహద్దుకు సమీపంలో ఒక చిన్నగ్రామం ఉంది. 'భోతియా' అనే చిన్నవర్గానికి చెందిన ప్రజలు అక్కడ నివసిస్తూ ఉంటారు. వర్షప్రతిపద (ఉగాది)రోజున స్వయం సేవకులు ఆగ్రామం చేరుకున్నారు. నూతన సంవత్సర సందేశంతో ఉన్న విక్రమాదిత్యుని పటం ఒకదాన్ని ఆగ్రామస్తులకు బహూకరించారు. భోతియాలు తాము శకుల సంతతి వారమని భావిస్తూ ఉంటారు. విక్రమాదిత్యుడు శకులను తరిమికొట్టాడు. కనుక ఆగ్రామస్తులు ఆగ్రహంతో ఆపటాన్ని చించివేసారు. అయినా, స్వయంసేవకులు వారితో సంభాషణలు కొనసాగించారు. స్థానిక పరిస్థితులు, వారి సమస్యలనుగురించి విచారించారు. తమకు సమీపంలో ఎక్కడా పాఠశాలలేదని భోతియాలు అసంతృప్తివ్యక్తం చేసారు. తమగ్రామంలో ఒక పాఠశాలను ఏర్పాటు చేయవలసిందని వారు స్వయంసేవకులను అర్థించారు.

కొద్దిరోజుల తరువాత స్వయంసేవకులు అక్కడ ఒక శిశుమందిర్ ప్రారంభించారు. అప్పటివరకు తీవ్రమైన హిందూ వ్యతిరేకత వ్యక్త మౌతూ ఉండిన ఆగ్రామస్తుల ఇండ్లలో ఈపాఠశాల విద్యార్థుల ద్వారా సంస్కృత శ్లోకాలు, మంత్రాలు, దేశభక్తి గీతాలు మార్మోగసాగాయి. మహత్తర జాతీయ పరంపరకు దూరంగా ఉంటూ వచ్చిన వారు మరల దానికి దగ్గరయ్యారు. పాఠశాలలోని సంతృప్తికరవాతావరణాన్ని చూసి ప్రభావితురాలైన ఒక భోతియా మహిళ, జిల్లా కలెక్టర్ నిరుత్సాహపరిచేందుకు ప్రయత్నించినా లెక్కజేయక, పాఠశాల నూతన భవనాలకోసం $2\frac{1}{2}$ లక్షల రూపాయిల విలువచేసే 5వేల వెండినాణాలను పాఠశాలకు

బహూకరించింది. ఇప్పుడా పాఠశాలలో 'భారతమాతాకీజయ్' మంత్రం వినబడుతూ ఉంటుంది. అత్యంత భక్తిశ్రద్ధలతో 'రామలీల' ఉత్సవం జరుగుతూ ఉంటుంది. ఏకాత్మతాయాత్ర సందర్భాన భారతమాత, గంగా మాతలకు తమ దక్షిణ సమర్పించుకునేందుకై 10వేలమంది భోతియాలు తరలివచ్చారు.

## వెలుగుబాటలో ఈశాన్య భారతం:

అరుణాచల్ ప్రదేశ్‌లోని సగాలిలో వివేకానంద కేంద్ర వనవాసుల కోసం ఒక పాఠశాలను ప్రారంభించాలని యోజన చేసింది. ఒక శిక్షణలో ఉన్న ఆజీవన కార్యకర్తను అక్కడికి పంపించారు. అతడికి ఒకవారంరోజులపాటు కొండలు, లోయలు, నదులు కాలినడకన దాటుకుంటూ వెళ్ళవలసివచ్చింది. ఆగ్రామం చుట్టుప్రక్కల గల అడవులలో క్రూరమృగాలు కూడా సంచరిస్తూ ఉంటాయి. హెలికాప్టర్ల ద్వారా జారవిడుస్తున్న ఆహారపొట్లాలు అందుకుంటూ అతడు ముందుకు సాగాడు. అక్కడకు చేరిన తరువాత స్థానిక సంప్రదాయాలు, భాష, ఆచారవ్యవహారాలు అతడు స్వయంగా నేర్చుకున్నాడు. పాఠశాల భవనాన్ని నిర్మాణం చేసాడు. దానికి బాలురను ఆకర్షించాడు.

తరగతులు ప్రారంభమైన తదుపరి, ఉపాధ్యాయులు ఎదుర్కొన్న మొట్టమొదటి సమస్య ఆపిల్లలు కొద్దిగానైనా స్పష్టతతో హిందీగానీ ఇంగ్లీష్‌గానీ మాట్లాడేటట్లు చేయడం. అయితే, సంస్కృతం వారిని ఆదుకుంది. హార్మోనియంపై శృతి కలిపిన సంస్కృత పాటలు, మంత్రాలు, శ్లోకాలు వారికెంతో సహాయపడ్డాయి. నెమ్మదిగా పిల్లల ఉచ్చారణ కూడా స్వచ్ఛం అయింది. ఫలితంగా వారి హిందీ, ఇంగ్లీష్‌లలో కూడా అభివృద్ధి కనబడింది.

పిల్లలకు ధ్యానంలో ఇచ్చిన శిక్షణ వారి మానసిక సామర్థ్యం అభివృద్ధిచెందడానికి దోహదం చేసింది. దానికి దశలవారీ శారీరిక శిక్షణ తోడయింది. 1984లో జరిగిన ఒక ఉత్సవంలో ఉన్నత సైనికాధికారులు, లెఫ్టినెంట్ గవర్నర్, అరుణాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రి పాల్గొన్నారు. అందులో రెండుగంటల పాటు పిల్లలు చేసిన కవాతు, శారీరిక ప్రదర్శనలు, వ్యూహాలు, గోపురాలు, యోగాసనాలు వారిని ముగ్ధులను చేసాయి. "అంత సౌలభ్యంతో, అంత సమన్వయాన్ని మా జవాన్లు కూడా సాధించలేరు" అన్నారు సైన్యాధిపతి.

1988 నాటికి, ప్రభుత్వం యొక్క సంపూర్ణ ఆర్థిక సహాయంతో కేంద్ర 14 ఆవాస విద్యాలయాలను ప్రారంభంచేసింది.

## నాయకత్వంలో శిక్షణ

విద్యాబోధనలో పుణేలోని జ్ఞానప్రబోధినికి ఒక విశిష్టత ఉంది. సమాజంలోని అన్నిస్థాయిలనుండి యోగ్యులైన యువకులను ఎంపికచేసి, వివిధ జీవనరంగాలలో నాయకులుగా వారిని తీర్చిదిద్దే ప్రక్రియే ఈవిశిష్టత. సమాజంపట్ల సేవాభావనతో వారిని ప్రేరితులను చేయడం, క్లిష్టమైన సామాజిక సమస్యల పరిష్కారం కోసం కృషిచేసే సామర్థ్యాన్ని వారిలో నిర్మాణం చేయడం ఈప్రక్రియలో ప్రధానాంశాలు. విద్యార్థుల సమగ్రవికాసానికి వీలు కల్పించే విధంగా కార్యక్రమాలను రూపొందించారు.

ప్రబోధిని మూడు పాఠశాలలను నడుపుతోంది. మొదటిది విశేష మేధాసంపత్తి కలిగిన విద్యార్థులకు ఉన్నత పాఠశాల. నాయకత్వలక్షణాలు, సృజనాత్మక శక్తి, యాజమాన్య సామర్థ్యాలు, కంప్యూటర్ పరిజ్ఞానం - అక్కడి శిక్షణలో ప్రాధాన్యతనిచ్చే అంశాలు. రెండవది పుణె సమీపంలోని పారిశ్రామిక ప్రాంతంలో (నిగాడి) గల పూర్వప్రాథమిక, ప్రాథమిక, మాధ్యమిక పాఠశాల. అక్కడి విభిన్న ప్రాంతాల వారి సాంస్కృతిక అవసరాలను తీర్చేవిధంగా ఆపాఠశాలను రూపొందించారు. మూడవది గ్రామీణ బాలురకోసం వ్యవసాయ పాఠశాల. గ్రామీణ ప్రాంతాలలో జీవనోపాధికి ఉపయోగపడే వృత్తిశిక్షణకు అందులో ప్రాధాన్యత ఇచ్చారు.

ఒక ఉన్నతశ్రేణి సాంకేతిక విద్యాపాఠశాల, ఒక కంప్యూటర్ శిక్షణాకేంద్రం ప్రబోధిని నిర్వహిస్తున్న ఇతర సంస్థలు. ఈపాఠశాలలు, కళాశాలలలో చదువుకునే విద్యార్థులకు జూడో, కరాటేలాంటి యుద్ధ విద్యలలో శిక్షణ నివ్వడానికి పుణెలో 15 కేంద్రాలు నడుస్తున్నాయి. అధ్యయన, విజ్ఞానయాత్రలు, సామూహిక చర్చలలో విద్యార్థులు పాల్గొంటూ ఉంటారు.

ప్రబోధిని పరిశోధనా సంస్థకు ఉన్నతవిద్యాకేంద్రంగా విశ్వవిద్యాలయ, అనుదాన ఆయోగ్(యుజిసి) పుణే విశ్వ విద్యాలయాలు గుర్తింపు నిచ్చాయి. అందులో ప్రస్తుతం 15మంది పరిశోధకులు ఉన్నారు. సంస్థలోని మనస్తత్వ శాస్త్రవిభాగంలోని పరిశోధకులు ఇంతవరకు మహారాష్ట్రలోని 15వేలమంది విద్యార్థులను స్పృశించారు. హిందూ సంస్కారాలకు పునరుజ్జీవనం కల్పించడం,'సూక్ష్మ ఆయుర్వేదం' పై పరిశోధనలు సంస్థ ప్రత్యేకతలు.

## అనియత విద్యాబోధన పై ప్రయోగాలు:

"ఈరోజులలో విద్యార్థులు నిజమైన జ్ఞానం సంపాదించడం కంటే సర్టిఫికెట్లను సంపాదించడం పైనే ఎక్కువ ఆసక్తి చూపుతున్నారు. అసలు ఈ వార్షిక పరీక్షలు, సర్టిఫికెట్ల తతంగం ఏమీలేకుండా విద్యార్థులకు జ్ఞానప్రదానం చేసే సంస్థను ఎందుకు ప్రారంభించకూడదు?" అన్నారు శ్రీగురూజీ ఒకసందర్భంలో.

ఈదిశలో ప్రయోగం చేయాలని డి.ఆర్.ఐ. నిశ్చయించింది. 1986 జూలైలో సోనాదర గురుకుల్ ప్రారంభమైంది. మహారాష్ట్రలోని బీడ్‌జిల్లా, పటోడాతాలూకాలోని దోమరి అనే మారుమూల గ్రామంలో ఇది ప్రారంభమైంది. 11-13 సం.ల వయస్సు గలిగిన 20 మంది పాఠశాలలనుండి తొలగించబడిన పిల్లలతో దానిని ప్రారంభించారు. వారంతా చుట్టుపక్కల గ్రామాలకు చెందిన నిరుపేద కుటుంబాల వారే. తమ వసతికి పూరిగుడిసెలను నిర్మించుకోవడంలో వారేసహకరించుకున్నారు. ఉదయం 4గం. లనుండి రాత్రి 10 గం.ల వరకు ధ్యానం, సూర్యనమస్కారములు, యోగాసనాలు, పరుగు, కబడ్డీ, ఇతరఆటలు; భగవద్గీత శ్లోకాలు, స్తోత్రాల పఠనం; చరిత్ర, భూగోళం, గణితంలలో పాఠాలు; రెండుగంటలు తోటపని; వారంలో ఒకరోజు పండ్లపొడి, అగర్‌బత్తి, 'కుమారిఆసవ', 'శతవారికల్ప' వంటి ఆయుర్వేద మందుల తయారీ వగైరాలతో వారు ఊపిరిసలపని పనులలో మునిగిపోయి ఉంటారు.

రెండు సంవత్సరాలు తిరిగేలోపే, వారు భగవద్గీతలోని ఆరు అధ్యాయాలు, సమర్థ రామదాస స్వామి యొక్క 'మనాచె శ్లోక' లోని 110 శ్లోకాలు వల్లెవేస్తున్నారు. మరాఠ్వాడాప్రాంతంలోని పాఠశాలలకు వెళ్ళే విద్యార్థులు పాల్గొన్న నాటకపోటీలు ఉస్మానాబాద్‌లో జరిగినపుడు, వాటిలో ఈపాఠశాల విద్యార్థులు కూడా పాల్గొన్నారు. నాటక రచన, దర్శకత్వం, నటన, సంగీతం - అన్నింటిలోను బహుమతులు ఈ సోనాదర గురుకుల్‌కే లభించాయి.

అలందిలో జరిగిన విశాల హిందూ సమ్మేళనానికి, 80కి.మీ. దూరంలో ఉన్న రంజన్‌గావ్ నుండి ఈవిద్యార్థులు కాలినడకన వెళ్ళారు. దారిపొడుగునా ప్రతిగ్రామంలో వారు 'పదనాట్య' ప్రదర్శనలు ఇస్తూ గ్రామస్తుల హృదయాలను దోచుకున్నారు.

"ఈ విద్యాసంస్థలో చేరకపోయినట్లైతే 12వతరగతిలో నీకు 96శాతం మార్కులు లభించేవా?" పుణెలోని స్వరూపవర్ధిని (ఎస్.డబ్ల్యు)లో విద్యాభ్యాసం చేసిన ఒక తెలివైన విద్యార్థిని విద్యాశాఖ డైరక్టర్ అడిగిన ప్రశ్న ఇది. ఆవిద్యార్థి ఇలా సమాధానం ఇచ్చాడు: "బహుశః వచ్చిఉండేవి. కానీ ఈ సంస్థలో నేను నేర్చుకున్నది నాతెలివితేటలను, సిరిసంపదలను కేవలం నాకొరకేగాక, ఇతరులకొరకు కూడా వినియోగించాలని."

ఆవిద్యాసంస్థలో నేర్పించిన నైతిక బోధనలు జీవితాంతం నిలచిఉంటాయా? అని మరొక విద్యార్థిని ప్రశ్నించినపుడు అతడు: "త్రాగుడు, జూదంల మాట అలాఉంచండి. నేను తమలపాకులు వేసుకోవడం కూడా మానివేసాను. మరల ఎప్పుడూ ఆ అలవాట్ల జోలికిపోను" అని సమాధానం ఇచ్చాడు. తాము ఉద్యోగాలలో చేరిన తరువాత తమ మొదటి జీతాన్ని ఎస్.డబ్ల్యు.కు సమర్పించుకోవడం విద్యార్థులలో సాధారణ అలవాటు. ఇతర పేద విద్యార్థుల శిక్షణలో కూడా వారు తరచు సహకరిస్తూ ఉంటారు.

విద్యార్థులపై ఎస్.డబ్ల్యు. ప్రభావం అంతటిది. ప్రస్తుత విద్యావిధానానికంటే ఎంతో ప్రశంశనీయంగా పనిచేసే విశిష్ఠ విద్యాసంస్థ అది. ఈరోజులలో విద్యాలయాలలో వ్యక్తిత్వవికాసానికి అవకాశం ఏమాత్రం లేదు. కనుక, ఎస్.డబ్ల్యు. వివిధ పాఠశాలలు, కళాశాలలనుండి విద్యార్థులను ఎంపికచేసి, వారిని రోజూ సాయంత్రం మూడుగంటల పాటు ఆహ్వానించి, వివిధ సంస్కారాలను వారిలో నింపే ప్రయత్నం చేస్తోంది. విద్యాబోధనలో అదనపు అంశాలను జోడించడంతోబాటు ఎస్.డబ్ల్యు. ఆటలు; విహారయాత్రలు; సమావేశాలు, సమ్మేళనాలు, సామాజిక కార్యకర్తలతో సంభాషణలు తదితర కార్యక్రమాలు నిర్వహిస్తూ విద్యార్థుల మానసిక పరిధిని విస్తరింపజేసేందుకు కృషి చేస్తోంది. అనేకమంది వికలాంగులైన విద్యార్థులు, అనాధలు కూడా ఎస్.డబ్ల్యు. ద్వారా ప్రయోజనం పొందారు.

ఈ అసాధారణ సంస్థకు మూలస్తంభాల వంటి వారు ఇద్దరు 'పదవీవిరమణ చేసినా ఉత్సాహ విరమణ చేయని' వర్గానికి చెందిన స్వయంసేవకులు. ఇతర సంఘప్రేరిత ఔత్సాహికులు కూడా దీనిలో కృషిచేస్తున్నారు.

## విద్యాబోధనలో భారతీయత కోసం:

ప్రస్తుత విద్యావిధానంలో భారతీయ సారాన్ని జొప్పించే లక్ష్యంతో ప్రేరితులైన స్వయంసేవక ఉపాధ్యాయులు 1969లో భారతీయ శిక్షణ మండల్ గా ఏర్పడ్డారు. (బి.ఎస్.ఎమ్.) 1నుండి 10వతరగతి వరకు విద్యార్థులకు నైతికవిద్యాబోధనకు ఒక సమగ్రమైన పాఠ్యప్రణాళికను తయారుచేయడంతో 'శిక్షణ మండల్' తన పనిని ప్రారంభించింది. మహారాష్ట్ర ప్రభుత్వం దానిని ఎంతగానో ప్రశంసించింది. కానీ దానిని బీరువాలలోనే శిథిలంచేసింది. విద్యావిధానంలో సంస్కరణలు, శారీరిక విద్యాబోధన తదితర అంశాలపై అఖిల భారతస్థాయిలో సంగోష్ఠులు జరిగాయి. చరిత్రలోని ప్రేరణదాయక ఘట్టాలు, గాథల వర్ణనతో కూడిన 'భారత గౌరవ కథామాల' పుస్తకాన్ని శిక్షణ మండల్ విడుదల చేసింది.

1977లో జనతా ప్రభుత్వం అధికారంలోకి వచ్చినపుడు విద్యావిధానంపై ఒక ప్రత్యామ్నాయ జాతీయ విధానాన్ని రూపొందించి, ప్రభుత్వానికి సమర్పించేందుకు శిక్షణమండల్ జాతీయస్థాయిలో ఉద్యమాన్ని చేపట్టింది. 100 సంగోష్ఠులు జరిగాయి. దేశం మొత్తంలో గల 2వేలమంది విద్యావేత్తలకు ఒక ప్రశ్నాపత్రాన్ని పంపించారు. వారి అభిప్రాయాలు, సలహాలు పరిశీలించి, వాటిని క్రోడీకరించి ఒక ముసాయిదా తయారుచేసారు. భారతీయ విలువలు అంటే ఏవి? వాటిని బోధించే ప్రక్రియ ఏది? అనే విషయాలపై మరొక ప్రశ్నాపత్రాన్ని మరల పంపించారు. వాటి ఆధారంగా, 1నుండి12 వతరగతి వరకు ఒక నూతన పాఠ్యప్రణాళికను ఖరారు చేసారు.

అల్పసంఖ్యాక విద్యాసంస్థల విషయం శిక్షణమండలి ప్రత్యేకంగా శ్రద్ధ వహించిన అంశం. వాటిలో అధికశాతం సంస్థలు విద్యార్థులలో జాతి వ్యతిరేక అల్పసంఖ్యాక మనస్తత్వాన్ని పెంచి పోషించి, వారిని మన సాంస్కృతిక పరంపర ప్రధాన ప్రవాహం నుండి వేరుచేసే కేంద్రాలుగా మాత్రమే పనిచేస్తున్నాయని పరిశోధనలో వెల్లడైంది. శిక్షణమండల్ ఈఅంశంపై అనేక రాష్ట్రాలలో సంగోష్ఠులను నిర్వహించింది. సుప్రీంకోర్టు, హైకోర్టుల న్యాయమూర్తులు, ఇతర న్యాయశాస్త్ర నిపుణులు వాటిలో పాల్గొన్నారు. రాజ్యాంగాన్ని మరింత సకారాత్మకదృష్టితో వ్యాఖ్యానించి, అల్పసంఖ్యాక విద్యాసంస్థలను కూడా మన చట్టాల పరిధిలోకి తీసుకుని రావడానికి అనుగుణంగా, సుప్రీంకోర్టు, వివిధ హైకోర్టులు రాజ్యాంగంలోని వివిధ వ్యాఖ్యానాలకు మరింత సహేతుకమైన వివరణ ఇస్తూండడం ఒక **శుభశకునం.**

ప్రస్తుతం శిక్షణమండల్ క్రింది అంశాలలో ప్రజాభిప్రాయాన్ని సమీకరించేందుకు ఒక జాతీయస్థాయి ఉద్యమాన్ని చేపట్టింది.

1. చరిత్ర, ఇతర విషయాలలో పాఠ్యపుస్తకాలలో ఉన్న వక్రీకరణలను - ముఖ్యంగా "సెక్యులరిజమ్" వంటి పెడదారిపట్టించే అంశాల కారణంగాను, రాజకీయస్వలాభాలు దృష్టిలో పెట్టుకుని సృష్టించిన అంశాలకారణంగాను ఏర్పడిన వక్రీకరణలను అంతం చేయవలసిందిగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కోరడం.
2. శాస్త్రీయ, కళారంగాలవంటి వివిధ రంగాలలో గతంలో మన జాతి సాధించిన ఘనమైన విజయాలను ప్రాథమిక, మాధ్యమిక స్థాయిల నుండి బోధనాంశాలుగా ప్రవేశపెట్టడంపై ఒత్తిడితేవడం.
3. గత వేయి సంవత్సరాల కాలఖండాన్ని స్పృశిస్తూ నిష్పాక్షికంగా, సంపూర్ణంగా స్వాతంత్ర్యపోరాట చరిత్రను బోధించడంపై ఒత్తిడితేవడం.
4. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల బోధనాంశాలలో భారతీయ జీవన విలువలను ప్రవేశపెట్టడంపై ఒత్తిడి తేవడం.
5. సమాజాన్ని అధికసంఖ్యాకులు, అల్పసంఖ్యాకులుగా చీలుస్తున్న విద్యారంగంలోని వివక్షతతో కూడిన చట్టాలు, సౌకర్యాలను తొలగించడంపై ఒత్తిడితేవడం.

## చరిత్రలో మరుగున పెట్టిన అంశాలపై వెలుగులు ప్రసరించడం:

సంఘ అగ్రశ్రేణి ప్రముఖులైన స్వర్గీయ శ్రీ బాబాసాహెబ్ ఆప్టే స్మృతిచిహ్నంగా 1973 లో ప్రారంభమైన శ్రీబాబాసాహెబ్ ఆప్టే స్మారక సమితి 'భారతీయ ఇతిహాస సంకలన యోజన' అనే ఒక ప్రకల్పాన్ని ప్రారంభించింది. 1988నాటికి 5089వసంవత్సరంలో ఉన్న కలియుగ ప్రారంభం నుండి భారతీయ చరిత్రకు అధికారికంగా కాలనిర్ణయం చేయడం కోసం ప్రయత్నించడం యోజన యొక్క కార్యక్రమం. కేవలం రాజకీయ చరిత్ర మాత్రమేకాక, మన జాతీయ జీవనం యొక్క అన్ని రంగాలను స్పృశిస్తూ, ఇంతకాలంగా నిరుపయోగంగా పడిఉన్న అనేక అధికారిక పత్రాలను సేకరించడం యోజన యొక్క పథకం. ఈప్రయత్నం అంతా స్వచ్ఛందంగా జరుగుతున్నదే. చరిత్రలో ఆసక్తి కలిగిన కొందరు

స్వయంసేవకులు చేపట్టిన ఈ కార్యాన్ని, ఒక 'ప్రియమైన కార్యం'గా స్వీకరించిన అనేకమంది ద్రష్టలు మార్గదర్శనం చేస్తూ ముందుకు తీసుకుని వెళ్తున్నారు.

1978-79లో దేశంలోని వివిధ ప్రాంతాలనుండి వచ్చిన మేధావులు యోజన యొక్క ఆధార సూత్రాలను రూపొందించారు. మొదట్లో, జిల్లావారీగా క్రింది సమాచారం సేకరించడంపైనే వారికార్యకర్తలు దృష్టిని కేంద్రీకరించారు.

1. 1857 స్వాతంత్ర్యసంగ్రామం
2. 'సంకల్పం'లోని పదజాలం
3. 22.3.1939 నుండి 6.4.1950 మధ్య చరిత్ర.

ప్రజలలో చరిత్రపై ఆసక్తిని నిర్మాణం చేసేందుకు, చరిత్ర ప్రాధాన్యతను వారు అర్థం చేసుకునేటట్లు చేసేందుకు 'చరిత్రదివస్' కార్యక్రమాన్ని నిర్వహించసాగారు.

1. 1857 స్వాతంత్ర్య సంగ్రామానికి సంబంధించి, బ్రిటిష్ వారి కారణంగా పదభ్రష్టులైన రాజులకే యుద్ధం పరిమితం కాలేదని యోజనకులభించిన ఆధారాలు వెల్లడిస్తునాయి. అలాగే మామూలుగా బోధిస్తున్నట్లు అది ఉత్తరభారతానికే పరిమితం కాలేదుకూడా. సైన్యం, సామాన్యపౌరులు కూడా దానిలో భాగస్వామ్యం వహించారు. దక్షిణాదికి కూడా అది విస్తరించింది.
2. 'సంకల్పం' అనేది ప్రతి శుభకార్యానికి ముందు ఉచ్ఛరించే పాఠం. ఇప్పటివరకు వందకుపైగా జిల్లాల నుండి 'సంకల్పం' లోని పదాలను సేకరించారు. కాలాన్ని సూచించే పదం మాత్రం దేశమంతటా ఒకేవిధంగా ఉన్నట్లు వెల్లడైంది. దీనినిబట్టి పూర్వకాలంలో దేశంలోని పండితులందరూ కలిసి ఈపదజాలాన్ని ఉమ్మడిగా నిర్ణయించి ఉండవచ్చని నిష్కర్ష కలుగుతోంది.

కలియుగాన్ని శతాబ్దాలుగా విభజించలేదు. గ్రహాల ఆవర్తన గతి యొక్క ప్రమాణం 60 సం.లు కనుక దానిని ఆధారంగా తీసుకుని 60సం.ల ఆవర్తనాలుగా విభజించారు. గణాంక వివరాలను సేకరించడానికి గాను, తెలిసిన దానినుండి ప్రారంభించి తెలియనిదానికి వెళ్ళడం సులభంగా ఉంటుందని భావించారు. ఆవిధంగా, ప్రస్తుత ఆవర్తనం అయిన 85వ ఆవర్తనాన్ని ఈగణాంక వివరాల సేకరణకు ఆధారరేఖగా నిర్ణయించారు.

ఈ ఆవర్తనం 22-3-1939 నాడు ప్రారంభం అవుతుంది. మొదటిగా, ఈ ఆవర్తనం యొక్క మొదటి 12సం.ల చరిత్రను సంగ్రహించారు. ప్రముఖ పండితులైన డా. హెచ్.డి.సంకాలియా, డా.ఆర్.ఎస్.వర్లింబే, ఇతరులు తమతమ విషయాలపై సమర్పించిన వ్యాసాలతో పుణెనుండి ఒక ప్రకరణం ముద్రితమైంది.

నాగపూర్‌లో విడుదల చేసిన 'విదర్భ ప్రజ్ఞ' ప్రకరణంలో, నాగపూర్ జిల్లా యొక్క 12 సం.ల చరిత్రను గురించిన 10వ్యాసాలు ఉన్నాయి. పుణెలో తమతమ రంగాలలో నిష్ణాతులైన 20-25మంది పండితులు పుణె జిల్లా యొక్క 12సం.ల చరిత్రపై పరిశోధన చేస్తున్నారు.

మరొక పరిశోధనా ప్రయత్నంలో మహాభారత యుద్ధకాలాన్ని గురించి పరిశోధించారు. 1983లో యోజన 'సెర్చ్ ఫర్ ది ఇయర్ ఆఫ్ మహాభారత్ వార్' (Search for the year of Mahabliarat war) అనే పుస్తకాన్ని ముద్రించింది. దానిలో 120మంది పండితులు ప్రకటించిన అభిప్రాయాలు, వాటికి వారిచ్చిన ఆధారాలు, పట్టికలు సంగ్రహం చేయబడ్డాయి. ఇలాంటి ప్రకరణాలు ఇంతవరకు ఎన్నడూ ప్రచురితం కాలేదు. డా.జయంత్ నార్లీకర్ వంటి పండితులు దానిని ఎంతగానో ప్రశంసించారు. ప్రఖ్యాతిగాంచిన పురాతత్వవిభాగం గల పుణెలోని దక్కన్‌కళాశాలలో ఈపుస్తకంపై చర్చ జరిగింది. తేదీని నిర్ణయించడానికి పురాతత్వశాస్త్ర రీత్యా ఎటువంటి ఆధారాలు లభించని కారణంగా, యుద్ధానికి సంబంధించి ప్రాచీన భారతీయ సాహిత్యంలో గల ఖగోళ శాస్త్ర ప్రస్తావనలనే విశ్లేషించారని అక్కడి పండితులు అభిప్రాయపడ్డారు. ఆమేరకు యోజన 1985లో 'డేట్ ఆఫ్ భారతవార్ - ఆస్ట్రనామికల్ రిఫరెన్సెస్' - 'భారత యుద్ధకాలం-ఖగోళశాస్త్ర సందర్భాలు' అనేపుస్తకాన్ని ప్రచురించింది. అందులో మహాభారత్‌లోని 148 శ్లోకాలకు టీకాతాత్పర్యాలను i. ఇంగ్లీష్-హిందీ ii. ఇంగ్లీష్-మరాఠీ, iii. తెలుగు లలో ఇచ్చింది. గుజరాతీ, అస్సామీ భాషలలో కూడా అలాంటి పుస్తకాలు తయారౌతున్నాయి. ఆంధ్రప్రదేశ్ ఇతిహాస సంకలన సమితి చరిత్ర గురించిన 16 పుస్తకాలను ప్రచురించింది. హైదరాబాద్‌నగర చరిత్రను గూర్చిన పరిశీలనాత్మకగ్రంథం అందులో ఒకటి.

చంద్రగుప్త మౌర్యుని పట్టాభిషేక కాలాన్ని క్రీ.పూ.320గా సర్ విలియంజోన్స్, ఇతర బ్రిటీష్ పండితులు నిర్ణయించారు. భారతీయ పురాణాలలోని'చంద్రగుప్త' నామానికి, గ్రీకు సాహిత్యంలోని 'సాండ్రకో

టస్' నామానికి మధ్యగల ఉచ్చారణ సారూప్యం వారి ఈ నిర్ణయానికి ఆధారం అయింది. అప్పటినుండి ఈ ఊహాజనితమైన కాలాన్నే భారతీయ చరిత్ర కాలనిర్ణయానికి కూడా పరమ ప్రమాణంగా తీసుకున్నారు. అయితే 19వశతాబ్దపు మధ్యభాగంలో ప్రతిపాదించిన ఈకాలనిర్ణయం ఆరోజునుండి వివాదాస్పదంగానే ఉంది. 1985మార్చిలో యోజన 'సాండ్రకోటస్ చంద్రగుప్త మౌర్యుడా?' అనేపుస్తకాన్ని ప్రచురించింది. అందులో ఎటువంటి పక్షపాత ధోరణి చూపకుండా అనుకూల, ప్రతికూల వాదాలు రెండింటినీ క్రోడీకరించారు. అదేవరుసలో ప్రచురించిన 'బుద్ధుని కాలనిర్ణయం' పుస్తకం ప్రజలలో మంచి ఆదరణపొందింది. టిబెట్‌కు చెందిన శ్రీదలైలామా దానికి ముందు మాట వ్రాశారు. భారతీయ చరిత్ర కాలనిర్ణయాన్ని పునః పరిశీలించవలసిన అవసరాన్ని గురించిన జాగరణను ఈప్రచురణలు నిర్మాణం చేసాయి.

వేదకాలం నాటి సరస్వతీనదీ గమనం, ఇంకిపోయిన కాలాలపై 'యోజన' కురుక్షేత్ర శాఖ చేస్తున్న పరిశోధన మరొక పెద్ద ప్రయత్నం. ఈదిశలో, ఈమధ్యకాలంలో జరిగిన శాస్త్రీయ పరిశోధనలు ఎంతో ఉప కరించాయి. 18రోజులకొకసారి భూమిచుట్టూ పరిభ్రమిస్తున్న అమెరికా ఉపగ్రహం'లాండ్‌సాట్' అనేక ఛాయాచిత్రాలను పంపుతూ ఉంటుంది. అహమ్మదాబాద్‌లోని అంతరిక్ష పరిశోధనాకేంద్రం ఆఛాయా చిత్రాలను అధ్యయనం చేసి సరస్వతీ నదీగమనాన్ని కనుక్కోగలిగింది.

'యోజన' కల్పన చాలా విశాలమైనది. భారతదేశం 400జిల్లాలు కలిగిన విశాలదేశం. అయితే, గత కొద్ది సంవత్సరాలలో సాధించిన ప్రగతి ప్రోత్సాహకరంగానేఉంది. మనదేశచరిత్రను, నాగరికతను వాస్త వము, నిష్పాక్షికము అయిన రూపంలో సిద్ధం చేయాలనే ఆసక్తిగలిగిన అనేకమంది పండితులను అది ఆకర్షించగలదని అనిపిస్తోంది.

## వ్యావహారిక సంస్కృతాన్ని వ్యాప్తిచేయడం:

భారతీయ సంస్కృతి, పరంపరల అంతరాత్మను అర్థం చేసుకొడానికి సంస్కృతం అనివార్యమన్న విషయంలో ఎవరికీ భేదాభిప్రాయంలేదు. సంస్కృతం వలే భారతీయాత్మ ప్రకాశాన్ని ప్రతిబింబించగల మరొక మాధ్యమం లేనేలేదు. శాస్త్రీయపరిశోధనలకు సమాచారాన్ని అందించగల ఒక అనంతమైన నిక్షేపం సంస్కృతంలో ఉన్నదని కూడా నేడు గుర్తించారు. అదీగాక, భారతీయ భాషలన్నీ సంస్కృతం పెంచిపోషించి,

సుసంపన్నం చేసినవే. ఆరకంగా, అన్ని వర్గాల ప్రజల భావాత్మక సమైక్యతకు సంస్కృతం ఒక శక్తివంతమైన సాధనంగా పనిచేయగలదు.

దురదృష్టవశాత్తు, మన ఈజాతీయజీవనపు మూలాధారం దిశలో స్వతంత్ర భారతం రెండు కళ్ళూ మూసుకుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ తమ విద్యాప్రణాళికలో దాని ప్రాధాన్యతను పూర్తిగా నిర్లక్ష్యం చేసాయి.

సంఘశాఖలు సంస్కృత ఆజ్ఞలు, సంస్కృత ప్రార్థన ద్వారా సంస్కృతం యొక్క సౌందర్యాన్ని, పవిత్రతను కోట్లాది మనదేశప్రజల వద్దకు తీసుకుని వెళ్తున్నాయి. ఇదేసంస్కారాన్ని మనసులలో నింపుకున్న కర్ణాటకలోని హిందూసేవాప్రతిష్ఠానకు చెందిన అనేకమంది పూర్తిసమయ సేవావ్రతులు, సంస్కృత పండితులు, ఒక సంఘ ప్రచారక్ నేతృత్వంలో సంస్కృతాన్ని సామాన్య ప్రజల జీవనంలో ఒక సజీవ శక్తిగా చేయాలని నిర్ణయించుకున్నారు. అందుకు సరియైన మార్గం సంస్కృతాన్ని వ్యవహార భాషరూపంలో ప్రచారం చేయడమేనని వారు భావించారు.

10రోజుల 'వ్యవహారసంస్కృత శిబిరాల' ద్వారా సంస్కృతాన్ని నేర్పించడంలో ఒక వినూత్న ప్రక్రియను వారు రూపొందించారు. భాషాస్వరూపం, ఉచ్చారణ, సన్నివేశం, ముఖకరచరణాది అవయవాలవి క్షేపం-వీటి ఆధారంగా ఆప్రక్రియ రూపొందింది.

ఈ10రోజుల సంభాషణ శిబిరాలలో పాల్గొనే విద్యార్థులు వివిధ స్థాయిలలో సంస్కృతం మాట్లాడడం నేర్చుకుంటారు. 'సంస్కృతం మాట్లాడండి' తరగతులకు హాజరవడానికి ఏదోఒక భాషలో అక్షరాస్యుడై ఉండాలని కూడా ఏమీలేదు. ప్రారంభం నుండే సేవావ్రతులు విద్యార్థులతో సంస్కృతంలో మాట్లాడుతారు. విషయాన్ని సంకేతాలద్వారా అర్థం అయ్యేటట్లు వివరిస్తారు. అవకాశం ఉన్న సందర్భాలలో చిత్రాలుగీస్తారు. పాల్గొనే వారిని కూడా అదే భాష ఉపయోగించవలసిందిగా ప్రోత్సహిస్తారు.

టైమ్స్ ఆఫ్ ఇండియా(1987నవంబర్16) ఇలా వ్రాసింది: "అతడు (ప్రచారక్) ఇండ్లపై, ఉపేక్షితవాడలపై, వ్యాపారకేంద్రాలపై, విద్యా సంస్థలపై, ఆఖరికి పార్లమెంటుపై తన పది రోజుల సంస్కృతం కార్యక్రమంతో 'దాడి' చేసాడు. ఆశిబిరాల చివరలో పాల్గొన్నవారు చక్కని పద్ధతిలో సంస్కృతం మాట్లాడగలుగుతున్నారు. ఢిల్లీలో జరిగిన కార్యక్రమంలో 40 మంది పార్లమెంటు సభ్యులు పాల్గొన్నారు. బెంగుళూరు, పాండిచ్చేరి, శృంగేరి, తిరువనంతపురం, ఆలంది, నాగపూర్, లక్నో,

వారణాసిలలో ఇప్పటివరకు సుమారు 300 కార్యక్రమాలు జరిగాయి. 10 వేలమంది ప్రజలు పాల్గొన్నారు. ప్రత్యక్షంగా, కాసెట్లద్వారా, యక్షగానం, వీధినాటికల ద్వారా-- సంభాషణల పద్ధతి సర్వోత్తమంగా ఉంది. పోస్టర్లు, చిన్న నిఘంటువులు, బొమ్మలకథల పుస్తకాలు, త్వరగా పదాలు అలవాటు కావడానికి వీలుగా ఇంట్లోని వస్తువులపై సమాంతర సంస్కృత పదాలు వ్రాయడం వంటి ఇతర లేఖన పద్ధతులు కూడా ఉన్నాయి."

కర్ణాటకలోని షిమోగా సమీపంలో వేదపాండిత్యానికి పెట్టిందిపేరైన మత్తూరు గ్రామాన్ని ఒక నమూనా సంస్కృత గ్రామంగా తీర్చిదిద్దాలని ప్రతిష్ఠాన ఎంపిక చేసింది. ఆగ్రామంలో గృహవాతావరణంలో, దుకాణాలలో, వ్యవసాయంలాంటి వృత్తులలో సంస్కృతం ఏవిధంగా వ్యాప్తి అయిందో తెలిపే అనేక అద్భుత విశేషాలను దేశంలోని అగ్రశ్రేణి దిన, వారపత్రికలు ప్రచురించాయి.

1984 నవంబర్‌లో బెంగుళూరులో ఒకేసారి 108 సంస్కృత సంభాషణ శిబిరాలను నిర్వహించాలని ప్రతిష్ఠాన చేసిన మహాప్రయత్నానికి లభించిన ప్రజాప్రతిస్పందన సంస్కృతాన్ని పెద్దఎత్తున వ్యాప్తి చేయడం సాధ్యమేనని నిరూపించింది. సమాజంలోని అన్నివర్గాలకు, అన్నిస్థాయిలకు, 10 నుండి 70 సం.లవరకు అన్ని వయోపరిమితులకు చెందిన 5 వేలమంది ఆశిబిరాలలో పాల్గొన్నారు. 4 శిబిరాలు ఉపేక్షితబస్తీలలో జరిగాయి. 'సంస్కృతసంధ్య'పేరున ముగింపు కార్యక్రమం రోజంతా జరిగింది. శిబిరాలలో పాల్గొన్న మొత్తం 5 వేలమంది విద్యార్థులు అందులో పాల్గొన్నారు. మొత్తం కార్యక్రమాలన్నీ సంస్కృతంలోనే జరిగాయి.

తదుపరి చర్యగా, వారివారి ప్రదేశాలలో స్వయంగా శిబిరాలు నిర్వహించే విధంగా అనేకమంది సంస్కృత ఉపాధ్యాయులను తీర్చిదిద్దేందుకు శిక్షణకార్యక్రమాన్ని నిర్వహించారు. ఆవిధంగా వందలాది మంది సంస్కృత ఉపాధ్యాయులకు తమహృదయాలకు అతి సన్నిహితమైన కార్యం లభించింది.

బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో సంస్కృతసంఘం, ప్రతిష్ఠాన యొక్క సంస్కృత విభాగం కలిసి నిర్వహించిన 'ఆధునిక వ్యావహారిక సంస్కృతం ఒకమృతభాషా?' అనే అంశంపై ఉపన్యాసం ఇస్తూ ఇల్లినాయిస్ విశ్వవిద్యాలయంలోని భాషాశాస్త్ర విభాగానికి చెందిన డా.హాన్స్ హెన్‌రిచ్ హాక్: "నేను పది సంవత్సరాల

క్రితం భారత్‌ను సందర్శించినపుడు, సంస్కృతం నెమ్మదిగా అంతరిస్తున్న దనే భావం నాకుకలిగింది.కానీ 10రోజులలో 'సంస్కృతం మాట్లాడండి' ఉద్యమం లాంటి ప్రయత్నాలద్వారా సంస్కృతాన్ని పునరుద్ధరించడానికి ప్రతిష్ఠాన చేస్తున్న కృషి చూసిన తరువాత అది మరల ప్రాముఖ్యత సంతరించుకుంటున్నదని నాకు నమ్మకం కలుగుతోంది'' అని అన్నారంటే ఆశ్చర్యం ఏముంది?

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో సంస్కృత ఎమ్.ఎ. బోధనాప్రణాళికలో సంస్కృత సంభాషణను కూడా ప్రవేశపెట్టారు. బెంగుళూరు, మైసూరులలోని సంస్కృత కళాశాలలు కూడా వ్యావహారిక సంస్కృతాన్ని ప్రోత్సహిస్తున్నాయి.

## కళారంగంలో: సంస్కారభారతి

కఠినశిలలను సైతం కమనీయ దేవతామూర్తులుగా మలచిన పరంపరాగత నేర్పరితనం కలిగిన మహనీయ కళాకారులకు మనదేశం నిలయం. తమ అవిశ్రాంత సాధనద్వారా, మన సంగీత శాస్త్రజ్ఞులు సమాజంలోని సర్వసాధారణవ్యక్తిముందు అపరనాదబ్రహ్మసాక్షాత్కారంగావించేవారు. 'భగవంతునితో తాదాత్మ్యం చెందేందుకు ఏకాగ్రతతో చేసేతపస్సే కళలు' అని మన పూర్వీకులు చెప్పారు.

అయితే కాలగమనంలో ఈవిశిష్ట పరంపర తన ఉదాత్త ప్రేరణను కోల్పోవడం ప్రారంభించింది. కళలను వ్యాపారసాధనాలుగా, అసభ్యవినోద సాధనాలుగా వాడుకునే ఈ నాటి ధోరణి మరింత ఆందోళన కలిగిస్తున్నది.

ఈనేపథ్యంలో, కళామతల్లి ముద్దుబిడ్డలైన కొందరు స్వయంసేవకుల మనస్సులలో 'సంస్కారభారతి' రూపుదిద్దుకుంది. నిన్నమొన్నటివరకు విశ్వవిఖ్యాతపురాతత్వశాస్త్రవేత్త, సంఘస్వయంసేవక్ అయిన స్వర్గీయ పద్మశ్రీ డా.వి. ఎస్. వాకంకర్ దాని వెనుక ప్రేరణ స్రోతస్సుగా నిలిచారు.

సంస్కారభారతి ప్రధాన లక్ష్యాలు రెండు: 1) కళలలో సహజత్వాన్ని, సృజనాత్మకతను, సామాజిక, ప్రబోధాత్మక అంశాలను పెంపొందించడం 2) ప్రకృతి సృష్టించిన మహనీయకళాఖండం అయిన మానవునిలో సత్యం, శివం, సుందరాల పరిపూర్తిని దర్శించడం.

అన్నిరాష్ట్రాలలో గల తన శాఖల ద్వారా, సంస్కారభారతి కళాకారులు, సాహిత్యకారుల సమ్మేళనాలు, సంగోష్ఠులెన్నింటినో నిర్వహించింది.

శ్రేష్ఠమైన వినోదాన్ని, ఉదాత్త సంస్కారాలను మేళవించి సాహిత్యం, కళలను తీర్చిదిద్దడం ఎంతవరకు సాధ్యం? అనే అంశాన్ని పరిశోధించడం వాటిలక్ష్యం.

ఆంధ్రప్రదేశ్ శాఖ శివాజీ సాహసకృత్యాలు ఇతివృత్తంగా తెలుగు జానపదసంగీతంలో పోటీలను నిర్వహించింది. ఒక్క హైదరాబాద్ నుండే 48 బృందాలు పాల్గొన్నాయి. ఆంధ్రప్రదేశ్ శాఖ ప్రతిఏటా భజన పోటీలనుకూడా నిర్వహిస్తున్నది. మధ్యభారత్ శాఖ భోపాల్‌లో నిర్వహించిన ఒక సాంస్కృతిక సమ్మేళనంలో వివిధ వయస్సులకు చెందిన 230 మంది కళాకారులు పాల్గొన్నారు. ఆగ్రాలో, శ్రీగురూజీ జన్మదిన సందర్భాన 10 నాటక బృందాలు నాటకాలను ప్రదర్శించాయి. బీహార్‌లో రాంచీ, ముజఫర్‌పూర్, మోంఘిర్, పట్నా తదితర అనేక స్థలాలలో చిత్రలేఖనం, సంగీతం, నృత్యాలలో పోటీలు జరిగాయి.

పశ్చిమోత్తర ప్రదేశ్‌లో అనేక చోట్ల నృత్య ప్రదర్శనలు ఏర్పాటయ్యాయి. హాపూర్‌లో అంటరానితనం మీద ఒక నాటకం ప్రదర్శించారు. దాని ప్రభావం వెంటనేకనిపించింది. క్రైస్తవాన్ని స్వీకరించిన కొందరు హరిజనసోదరులు అక్కడికక్కడే హిందూత్వంలోకి తిరిగివచ్చారు.

కలకత్తా శాఖ ప్రారంభోత్సవానికి ప్రముఖ బెంగాలీ నాటక కళాకారుడు శ్రీభావేంద్ర ముఖ్యఅతిథిగా విచ్చేసారు. హిందువులను స్త్రీలపై అత్యాచారాలు సాగించేవారుగా చిత్రీకరిస్తూ బెంగాలీ నాటకరంగంలో వస్తున్న ధోరణిఎడల ఆయన ఆందోళన వ్యక్తంచేసారు. ఆదుష్ప్రచారంలో ముస్లిం శక్తుల ప్రమేయం ఉన్నదని ఆయన హెచ్చరించారు.

'వసుధైవ కుటుంబకమ్' అనే ఇతివృత్తంతో సంస్కారభారతి నిర్వహించిన చిత్రప్రదర్శిని యావత్తు ప్రపంచం దృష్టిని ఆకర్షించింది.

సంస్కారభారతి కేంద్ర కార్యాలయ స్థానమైన ఆగ్రాలో జరిగిన ఒక ఉత్సవంలో 360 మంది యువ కళాకారులను సన్మానించారు.

ప్రజానీకంలో దేశభక్తిగీతాలను ప్రచారం చేయడం మరొక అంశం. సంఘశాఖలు ఈకృషిలో ప్రభావవంతమైన మాధ్యమాలుగా పనిచేస్తున్నాయి. గతకొన్ని దశాబ్దాలుగా మరే ఇతర సంస్థ సాధించలేనంత విస్తృతంగా, విజయవంతంగా ఈప్రయత్నం జరుగుతోంది. దేశంమొత్తంలో అన్నిభాషలల్లో, మాండలీకాలలో వేలాది గీతాలు స్వయంసేవకుల పెదవులపై నాట్యం చేస్తున్నాయి. జాతీయ పునరుత్థానపు వివిధ అంశాలను స్పృశించే సారాంశంతో బాటు, ఉదాత్త జీవనవిలువలు, త్యాగం, సమర్పణ, క్రమ

శిక్షణ, సామాజిక స్పృహ వంటి గుణాలుకూడా ఆపాటల ద్వారా జాగృతం అవుతున్నాయి. వివిధరంగాలలో పనిచేసే స్వయంసేవకులు తమతమ కార్యక్షేత్రాలలో ప్రత్యేక సందేశాన్నిచ్చే అనేక క్రొత్తపాటలను ఎప్పటికప్పుడు రూపొందించుకుంటూనే ఉన్నారు. వీటి సందేశాన్ని ఇంకా విశాల పరిధిలో ప్రజల వద్దకు తీసుకుని పోయే దృష్టితో సంస్కారభారతి ఈమధ్యకాలంలో ఈపాటలు, ఇంకా ఇతర పాటలు కలిపి క్యాసెట్ల రూపంలో విడుదల చేయడం ప్రారంభించింది.

## మేధావులసంగమం: తపస్య

కేరళలో కళాకారులు, పాత్రికేయులు, రచయితలు, వివిధరంగాలకు చెందిన మేధావులందరికీ కలిపి ఒక విస్తృత పరిధిలో వేదిక ఏర్పాటు చేయాలన్న ఆలోచన అత్యవసర పరిస్థితి సమయంలో (1975-77) ఉద్భవించింది. జైలులోను, బైట సంఘ సిద్ధాంతానికి చెందిన, ఇతర మేధావులందరూ కూడా అటువంటి అవసరాన్ని గుర్తించారు. అత్యవసర పరిస్థితి అనంతరం కూడా వారి పరస్పర సంబంధాలు కొనసాగాయి. వాటి ఫలితమే 'తపస్య' ఆవిర్భావం.

'తపస్య' ప్రధానంగా క్రింది అంశాలపై దృష్టి కేంద్రీకరించింది.

i. ఔత్సాహిక కళాకారులను, రచయితలను, పత్రకారులను ప్రోత్సహించడం, శిక్షణనివ్వడం, ఆయారంగాలలో భారతీయ దృష్టికోణాన్ని విస్తృతరూపంలో వారిముందు ఉంచడం.

ii. ఈఆలోచనా ఉద్యమంలోను, యువకులకు శిక్షణనివ్వడంలోను ప్రముఖ రచయితలు, మేధావులు, పత్రకారులు, కళాకారులను భాగస్వాములను చేయడం. వివిధ ప్రముఖులు పాల్గొని, తమ అభిప్రాయాలు వ్యక్తం చేసేందుకు వీలుగా సంగోష్ఠులు, పరిశోధనావర్గలు, సమావేశాలు ఏర్పాటు చేయడం.

iii. నృత్యం, సంగీతం, రంగవల్లులవంటి అనుష్ఠాన కళలను పునరుజ్జీవింపచేయడం.

తపస్య మొట్టమొదటి సమావేశంలో కర్ణాటకనుండి డా. శివరామకారంత్, శ్రీ హెచ్.వి. శేషాద్రిలు ముఖ్యఅతిథులుగా పాల్గొన్నారు. మరొక సందర్భంలో జ్ఞానపీఠపురస్కారగ్రహీత, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారగ్రహీత అయిన శ్రీ అఖిలన్ తమిళనాడునుండి ముఖ్యఅతిథిగా విచ్చేసారు.

'తపస్య'లో పాల్గొన్న వారి మానసిక అవగాహనలో తప్పక మార్పువస్తుంది. త్రిచూర్‌లో 1985లో జరిగిన వార్షిక సదస్సులో ఒక ప్రముఖ విప్లవ మేధావి ఒక కవితను చదివారు. అందులో కథానాయకుడు విప్లవమార్గంలో పయనం ప్రారంభిస్తాడు. కానీచివరికి ఆమార్గంలోని వైఫల్యాలను గ్రహించి హిమాలయాలలోని నరనారాయణ నివాసమైన లోయను చేరుకుంటాడు. అక్కడ ఒక గురువు కృపవల్ల మనశ్శాంతిని పొందుతాడు. పూర్వపు మార్క్సిస్టురచయిత, కవి అయిన శ్రీ విష్ణు నారాయణ నంబూద్రి, వామపక్ష 'దేశాభిమాని' దినపత్రిక మాజీ సంపాదకులు శ్రీ ఇందుచూడన్‌లు ప్రస్తుతం 'తపస్య'లో సహానుయాయులు.

1986నవంబర్‌లో కొట్టాయంలో 'తపస్య' 10వ వార్షికోత్సవం జరిగింది. జ్ఞానపీఠ పురస్కార గ్రహీత శ్రీతక్కాజి శివశంకరన్‌పిళ్ళై, మహాకవి అక్కిటోమ్‌ల సమక్షంలో ప్రారంభమైన ఈ కార్యక్రమం అత్యద్భుతంగా జరిగింది. ప్రముఖ రచయితలు, విమర్శకులు, కవులు, కళాకారులు, పురాతత్వవేత్తలు, పరిశోధకులు అనేకులు పాల్గొన్న ఈ కార్యక్రమం మేధావులకు రుచికరమైన ఆహారం అయింది.

చాలాకాలంగా అణచివేసిన, వక్రీకరించడానికి ప్రయత్నించిన కేరళ ఆంతరిక సాంస్కృతిక తపన తన ప్రాచీన ఔన్నత్యాన్నంతటినీ ప్రోది చేసుకుని తిరిగి జాగృతం అవుతున్నదనడాన్ని తపస్య ప్రతిబింబిస్తున్నది.

## పసిహృదయాలను వికసింపజేసే కృషిలో:

బాలగోకులం కేరళ బాలబాలికలకు స్వచ్ఛమైన సాంస్కృతిక మలయమారుతం వలే తాకింది. ఆప్రాంతం చాలాకాలంగా క్రైస్తవ, ముస్లిం ప్రభావంలోను, ఈమధ్యకాలంలో కమ్యూనిస్టు ప్రభావంలోను ఉంటూవచ్చింది. ఆపరిస్థితులలో పసిహృదయాలపై ఉదాత్త హిందూ సంస్కారాల ముద్ర వేయడానికి బాలగోకులం ఒక చిరకాల వాంఛిత ఉద్యమంగా కేరళ ప్రజానీకం భావించింది. ప్రతివారం 90ని॥లు జరిగే కథలు, ఆటలు, పాటలు, శ్లోకాల పఠనం, నాటకాలలో శిక్షణ, చిత్రలేఖనం, నృత్యం వగైరాలతో నిండి ఉండే ఈకార్యక్రమం పిల్లలకు మంచి పసందుగా ఉంటుంది. ఆఅంశాలలో ప్రత్యేక ప్రతిభకలిగిన పిల్లలకు పోటీలు, శిక్షణ శిబిరాలునిర్వహించడంద్వారా వారిలో దాగి ఉన్న సామర్థ్యాలను, అభిరుచులను బైటకు తెచ్చే ప్రయత్నం జరుగుతుంది. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో బాలగోకులం బాలబాలికలు ప్రదర్శించిన కార్యక్రమాలను తిలకించి ప్రజలు ఎంతో ఆనందించారు.

శ్రీకృష్ణ జయంతి రోజున కేరళ రాష్ట్రమంతటా పండుగ కళవచ్చేస్తుంది. బాలగోకులం శాఖలు దాదాపు వేయి స్థలాలలో బాలబాలికలతో సుందరమైన శోభాయాత్ర నిర్వహిస్తాయి. తమ పిల్లలను శ్రీకృష్ణ,రాధ, ఇంకా అనేక ఇతర దేవతల, పౌరాణిక మహాపురుషుల భంగిమలలో అలంకరించడంలో తల్లితండ్రులు ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ ఉంటారు. కనులవిందైన పసిపిల్లలతో తళతళలాడే ఆశోభాయాత్ర మూర్తీభవించిన దివ్యత్వాన్ని సాక్షాత్కారింపజేస్తుంది. ఈ'చిన్నారిదేవతల' శోభాయాత్ర వెనుక వారి తల్లిదండ్రులు, పురప్రముఖులు అనుసరిస్తారు. ఈకార్యక్రమం ఎంత ప్రజాదరణ పొందిందంటే, 1985లో స్వయంగా ఒక ముస్లింలీగ్ సభ్యుడు విద్యాశాఖమంత్రిగా ఉన్నసమయంలో కేరళ ప్రభుత్వం శ్రీకృష్ణ జయంతిని పాఠశాలలకు శెలవుదినంగా ప్రకటించవలసి వచ్చింది.

వివిధ జానపదకళలను, సంప్రదాయ కట్టుబాట్లను పునరుద్ధరించడంలో 'బాలగోకులం'కృతకృత్యం అయింది. ముస్లిం ఆధిక్య జిల్లా అయిన మలప్పురంలో 'తులసి'నాటే కార్యక్రమాన్ని స్వీకరించారు. కాగా వందలాది ఇతరస్థలాలలో అనేక సంవత్సరాలుగా మరుగునపడిపోయిన వైశాఖిదినాన పెద్దలకు పాదాభివందనం సమర్పించే సంప్రదాయం పునః ప్రారంభం అయింది. అనేకమంది ముస్లింలు, క్రైస్తవులు కూడా తమ పిల్లలను బాలగోకులం తరగతులకు పంపిస్తూఉంటారు. శ్రీకృష్ణజయంతి రోజున పిల్లలకు బహుమతులను ఇచ్చి ప్రోత్సహిస్తూ ఉంటారు. ఒక క్రైస్తవుడైన జిల్లా న్యాయమూర్తికి సంబంధించిన ఆసక్తికరమైన సంఘటన ఒకటి ఉంది. ఆయన కుమారుడు బాలగోకులానికి హాజరౌతూ ఉండేవాడు. అక్కడ పాఠ్యక్రమానుసారం ఉపనిషత్తులలోని శ్లోకాలను అతడునేర్చుకున్నాడు. తనకు కలిగిన కొన్ని తత్వజ్ఞాన సంబంధమైన సందేహాలకు సమాధానం తండ్రి నుండి తెలుసుకోగోరాడు. ఇప్పుడు ఆబాలగోకులం శాఖను నిర్వహిస్తున్న ఉపాధ్యాయుని వద్దకు వచ్చి, ఉపనిషత్తుల పాఠాలు నేర్చుకుని, తనకుమారుని ప్రశ్నలకు సమాధానం ఇచ్చేందుకు సంసిద్ధం కావడం ఆన్యాయమూర్తివంతయింది.

1988లో గీతాజయంతి రోజున బాలగోకులం బాలబాలికలద్వారా పెద్దఎత్తున సాహిత్యవిక్రయ ఉద్యమాన్ని చేపట్టింది. 5,6 గురుబాలబాలికలు కలిసి ఒక బృందంగా ఏర్పడి ఉదయం 9గం.నుండి సాయంత్రం 5గం. వరకు ఇంటింటికి తిరిగారు. మళయాళంలో భగవద్గీత ప్రతులను, భారతమాత చిత్రాల కార్డులను, దేశభక్తిగీతాల పుస్తకాలను వగైరాలను తమవెంట తీసుకుని వెళ్ళారు. 2వేల బృందాలుగా వెళ్ళిన

ఆబాలబాలికలు ఒక్కరోజులో లక్షరూపాయిల విలువైన సాహిత్యాన్ని విక్రయించారు.

పిల్లలకు తాము వెళ్తున్న ఇల్లు హిందువులదా, ముస్లింలదా, క్రైస్త వులదా అన్న తేడా లేదు. అయితే వారు కలిసిన ముస్లిం, క్రైస్తవ కుటుంబాలు కొన్నింటిలో వారికి ఆశ్చర్యకర అనుభవాలు ఎదురయ్యాయి. ఒక క్రైస్తవ పెద్దమనిషి సాధారణ మళయాళంలో భగవద్గీతకోసం తాను ఎంతోకాలంగా వెదుకుతున్నానని, ఎందుకంటే హైందవేతరులలో కూడా దానిని గురించి చాలా విన్నానని అన్నాడు.

ఒక ముస్లిం ఇంటిలో కూడా మరొక ఆసక్తికరమైన అనుభవం ఎదురైంది. తల్లి భారతమాత చిత్రాన్ని కొనాలని ఆరాటపడింది. కాని భారతమాత హిందువులకు సంబంధించినదని, ముస్లింలకు ఆమెతో ఎలాంటి సంబంధంలేదని చెబుతూ ఆమెకుమారుడు ఆమెను వారించాడు. తల్లి సందిగ్ధంలో పడిపోయింది. బాలగోకులం బృందంలోని ఒక చిన్నబాలిక ఆయువకుడికి చురుకుగా సమాధానంఇస్తూ అంది: "మరొకసారి ఆమాట అనవద్దు. హిందువులలాగే మీరుకూడా ఈభూమి మీదే ఉంటూ, తింటూ, శ్వాసపీలుస్తున్నారు. భారత్ మనందరికీ - ఇక్కడ పుట్టిన ప్రతిఒక్కరికీ-తల్లి. మీరు చిత్రంకొనండి. కొనకపొండి. కానీ భారతమాత మీతల్లికాదని మాత్రం అనకండి." ఆయువకుడు నిరుత్తరుడై మౌనంగా ఉండిపోయాడు. కొద్దిగా ధైర్యం వచ్చి ఆతల్లి, వెంటనే ఆబాలికతో: "మాఅబ్బాయి మాటలను పట్టించుకోవద్దు. ఆపటాన్ని నాకియ్యి" అని అడిగింది.

కర్ణాటకలో కూడా బాలగోకులానికి లభించిన ఆదరణ ఎంతో ప్రోత్సాహకరంగా ఉంది. దాని సృజనాత్మక కార్యక్రమాలు వందలాది స్థలాలలో యువకులను విపరీతంగా ఆకర్షిస్తున్నాయి. పంజాబ్‌లోని హోషియార్‌పూర్‌లోగల బాలవికాస్ పరిషత్, పాఠశాలలకు వెళ్ళే విద్యార్థులకు సంస్కృతి గురించిన పాఠాలను ప్రత్యేక పాఠ్యప్రణాళికాంశంగా ప్రారంభించింది. దేశభక్తి, సాంస్కృతిక విలువల సమాచారంతో నిండి ఉండే ఆసక్తిదాయకమైన గాధలను ఈప్రణాళికలో పరిషత్ బోధిస్తున్నది. ఈప్రణాళికలో సగటున ఏటా మూడు వేలమంది విద్యార్థులు శిక్షణ పొందుతున్నారు. ఉపేక్షిత బస్తీలలో నివసించే పిల్లలలో అంతర్నిహితంగా ఉన్న ప్రతిభను గుర్తించి, అభివృద్ధిచేసేందుకు పరిషత్ విశేషంగా శ్రమిస్తోంది.

## 12

# వివిధరంగాలలో విలువల నిర్మాణానికి నూతన ప్రయత్నం

రాజకీయ,ఆర్థిక, కార్మిక, విద్యాది వివిధ రంగాలలో మన జాతీయ ప్రతిభకు అనుగుణమైన నిర్దిష్టమైన, ఆచరణ యోగ్యమైన పరిధులకు లోబడి ఒక స్వరూపాన్ని రూపొందించవలసిన అవసరం ఉంది. ఆదృష్టితోనే శ్రీగురూజీ కొందరు తెలివైన, యోగ్యులైన స్వయంసేవకులను ఆయారంగాలలో ప్రవేశించవలసిందిగా ప్రోత్సహించారు. వారికి నిరంతరం మార్గదర్శనం చేశారుకూడా.

భారతీయ జనసంఘ్‌కు ప్రేరణ స్రోతస్సుగా ఉండిన పండిత దీన దయాళ్ ఉపాధ్యాయ ప్రస్తుతం ప్రఖ్యాతంగా వినిపిస్తున్న 'ఏకాత్మ మానవ దర్శన' సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఒక సమగ్రమైన తత్వ జ్ఞానాన్ని అది వికసింపజేసింది. ఆధునిక కాలపు నాగరికత సృష్టించే సమస్యలను దృష్టిలో పెట్టుకుంటూనే భారతీయ ఆలోచనా విధానపు మూలసూత్రాలను అందులో ఇమిడ్చారు.

### కార్మికరంగంలో:

కార్మికరంగాన్ని ప్రధానంగా కమ్యూనిస్టు సిద్ధాంతపు కంచుకోటగా ప్రపంచమంతా భావిస్తూ వచ్చింది. శ్రీదత్తోపంత్ ఠెంగ్డీ కార్మికక్షేత్రంలో ప్రవేశించినపుడు వారి ముందు నిలిచిన ప్రధాన సవాలు ఆరంగంలో ఒక వాస్తవ భారతీయ దృష్టి కోణాన్ని వికసింపజేయడం. నూతనంగా ఆవిర్భవించిన భారతీయ మజ్దూర్ సంఘ్ నెమ్మదిగా తన సిద్ధాంతాలు, కార్యక్రమాలు, నినాదాలు, చిహ్నాల ద్వారా భారతీయ ఆలోచనను ప్రసరింపజేయడం ప్రారంభించింది.

కార్మిక సమస్యలను పరిష్కరించే సందర్భంలో కార్మికులతో మానవతా సంబంధాలు కొనసాగించాలన్న మౌలిక భారతీయదృష్టికోణం శుక్రనీతి,

అర్థశాస్త్రం తదితర ప్రాచీన ఆధికారిక గ్రంధాలనుండి గ్రహించినదే. వాటిలోని మౌలికసూత్రాలను బి.ఎమ్.ఎస్. క్రోడీకరించింది. 'బి.ఎం.ఎస్. ఎందుకు?', 'శుక్ర నీతిలో కార్మికుడు - యజమాని' వంటి పుస్తకాల ప్రచురణ ద్వారా ఆసూత్రాలకు ప్రాముఖ్యత కల్పించింది. జాతీయస్థాయిలో ఈఆలోచనావిధానాన్ని ప్రసరింపజేసే ఏఅవకాశాన్నీ బి.ఎమ్.ఎస్. విడిచిపెట్టదు.

వివిధ సందర్భాలలో ప్రభుత్వానికి, జాతీయకార్మిక సంఘానికి, బోనస్ పరిశీలన సంఘానికి, వగైరాలకు సమర్పించిన విజ్ఞాపనలలో బి.ఎమ్. ఎస్. ఎల్లప్పుడూ భారతీయ దృష్టికోణాన్నే ప్రస్ఫుటంగా ఎత్తిచూపింది. 1969లో భారతరాష్ట్రపతి శ్రీ వి.వి. గిరికి సమర్పించిన ఒక విజ్ఞాపనలో 'జాతీయ కోర్కెలపత్రాన్ని' బాధ్యతలు, క్రమశిక్షణల క్రమ స్వరూపంగా పేర్కొన్నారు.

ప్రతిహక్కు వెనుక తత్సంబంధితమైన ఒక బాధ్యతకూడా వుంటుం దనే భారతీయ దృష్టికోణం: దానిలో ప్రముఖంగా చోటుచేసుకుంది.

పారిశ్రామిక కుటుంబ కల్పన బి.ఎమ్.ఎస్. ఆలోచనా విధానపు విశిష్టతలలో ఒకటి. ప్రత్యక్షంగాకానీ, పరోక్షంగాకానీ ఉత్పత్తిలో పాలుపంచుకుంటున్న ప్రతిఒక్కరు సమాజానికి సేవచేస్తున్నవారే అన్న ఆలోచనను బి.ఎమ్.ఎస్. తన కార్మిక సంఘాలు బలంగా ఉన్నచోటల్లా నిర్మాణం చేస్తోంది. పారిశ్రామిక కుటుంబాన్ని కూడా మరింత విశాల సమాజకుటుంబంలో అంతర్భాగంగానే అది పరిగణిస్తోంది. యాజమాన్యంతో కార్మికులు సామూహిక బలం ఆధారంగా బేరసారాలు సాగించడం అనేది ఈసమగ్ర దృష్టికి సరిపడని అంశం. ఎందుకంటే, అది చర్చావేదికపై రెండు వర్గాలనే చూస్తుంది. మూడవ ప్రధాన వర్గమైన సమాజాన్ని అది నిర్లక్ష్యం చేస్తుంది. నిజానికి ఈసామూహిక బేరసారాల ఫలితంగా నష్టపోయే వాటిలో సమాజం కూడా ఒకటి. కనుక బి.ఎమ్.ఎస్. ఈపద్ధతిని పూర్తిగా తిరస్కరించి జాతీయ ప్రయోజనాలకే పెద్దపీట వేసింది.

ప్రకృతిలో సంఘర్షణలేదని, సామరస్యం మాత్రమే ఉన్నదనే భారతీయ దృష్టికోణం ఆధారంగా బి.ఎమ్.ఎస్. తన ఆలోచనా విధానాన్ని రూపొందించింది. సృష్టి యొక్క మౌలిక ఏకాత్మతను గ్రహించలేని కారణంగానే సంఘర్షణలు తలెత్తుతున్నాయి. అందువల్ల బి.ఎమ్.ఎస్. వర్గ సంఘర్షణ సిద్ధాంతాన్ని పూర్తిగా నిరాకరిస్తుంది. అందుకు భిన్నంగా పెట్టుబడిదారులు, యాజమాన్య సిబ్బంది, కార్మికులు ఒకే పారిశ్రామిక

కుటుంబానికి చెందిన వారుగా అది గుర్తిస్తుంది. మూడు రకాల పెట్టుబడిని బి.ఎమ్.ఎస్. గుర్తించింది: ధనంపెట్టుబడి, శ్రమపెట్టుబడి, నిర్వాహణసామర్థ్యం పెట్టుబడి. ఈమూడురకాలపెట్టుబడి లేకుండా ఏప రిశ్రమ నడవదు. పరిశ్రమవల్ల జనించిన లాభాలను ధనం పెట్టుబడి పెట్టిన వ్యక్తులు మాత్రమే స్వంతం చేసుకున్నప్పుడు ఘర్షణ తలెత్తుతుంది. కనుక, కర్మాగారంలో పెట్టుబడిదారు స్వయంగా ఎంత భాగస్వామి అవుతాడో, కార్మికులు, యాజమాన్య సిబ్బంది కూడా అంతే భాగస్వాములు అవుతారని బి.ఎమ్.ఎస్. భావిస్తోంది. ఆవిధంగా చూసినపుడు లాభాలలో అందరికీ వాటా ఉంటుంది.

ఈదృష్టికోణం యజమాని-కార్మికుల మధ్య సంఘర్షణ ధోరణిని తొలగించి, పరస్పర అవగాహనకు మార్గం సుగమం చేయడంలో ఎంతో సహాయపడుతుంది. ఉదాహరణకు బొంబాయిలోని ఎక్సెల్ ఇండస్ట్రీస్‌లో గత 30సం.లుగా సమ్మె అనేదే జరుగలేదు. అన్ని కోరికలు, వివాదాలు సామరస్యపూర్వకంగా పరిష్కారం అయిపోయేటట్లు యాజమాన్యం, బి.ఎం.ఎస్. కార్మికసంఘం ప్రయత్నం చేస్తూంటాయి.

స్వయంఉపాధి రంగాన్ని 'విశ్వకర్మరంగం'గా పేరుపెట్టి, దాని సమస్యలను చేపట్టిన మొట్టమొదటి కార్మిక సంఘం బి.ఎం.ఎస్. ఇక్కడ ఉత్పత్తి సాధనాల యాజమానే స్వయంగా కార్మికుడు కూడా. కమ్యూనిస్టులు ఇంతవరకు ఈరంగాన్ని గురించి ఆలోచించనేలేదు. ఇప్పుడు రష్యాలో సైతం దీనిని గుర్తించారు. అక్కడ 10మంది కంటే తక్కువ కార్మికులను నియమించుకున్న యాజమానిని స్వయం-ఉపాధి వ్యక్తిగా పరిగణిస్తారు.

భారతీయ దృష్టిలో, ఆర్థిక వ్యవహారాలన్నింటిలోను 'మానవుడే' ఎల్లప్పుడూ కేంద్రంగా ఉంటూవచ్చాడు. బి.ఎం.ఎస్. పతాకంపై గల చిహ్నంలో ఈదృష్టి ప్రతిబింబించింది. సకల కళలు, రూపకళల సృష్టి కర్తఅయిన మానవహస్తం, బిగించిన పిడికిలి రూపంలో బి.ఎం.ఎస్. చిహ్నలకు కేంద్రంగా నిలిచింది. మరే ఇతర కార్మికసంఘం కూడా తన చిహ్నంలో మానవుడికి ప్రాధాన్యతనీయలేదు. పరిశ్రమలు, వ్యవసాయానికి సంకేతంగా పరంపరాగత చక్రం, ధాన్యపు కంకి ఆచిహ్నంలో చోటు చేసుకున్న ఇతర అంశాలు.

ప్రపంచమంతటా కమ్యూనిస్ట్ పార్టీలు అంతర్జాతీయ కార్మిక దినోత్సవంగా జరుపుకునే 'మేడే'కు భారతదేశంలో కూడా ప్రాముఖ్యత లభించింది. కమ్యూనిస్ట్ వ్యతిరేకినని, జాతీయవాదినని చెప్పుకునే ఐ.ఎన్.టి.యు.సి. కూడా దానినే స్వీకరించింది. బి.ఎం.ఎస్. మాత్రం

సెప్టెంబర్ 17 విశ్వకర్మజయంతిని (కన్యాసంక్రాంతి నాడు)' జాతీయ శ్రామికదినం'గా ప్రచారం చేస్తోంది. కొద్దిసంవత్సరాలుగా దీనికి విస్తృత స్థాయిలో అంగీకారం వ్యక్తం అవుతోంది. కేంద్ర ప్రభుత్వం ఈ మధ్యనే శ్రమవీర పురస్కారాలకు పేరుమార్చి 'విశ్వకర్మశ్రమవీరపురస్కార్' గా ప్రకటించింది. అస్సాం ప్రభుత్వం విశ్వకర్మజయంతిని రాష్ట్రప్రభుత్వ శెలవుదినంగా ప్రకటించింది.

మతవిశ్వాసాల కతీతంగా విశ్వకర్మజయంతిని కార్మికులందరూ జరుపుకుంటున్నారని అనుభవంలో స్పష్టమౌతోంది. కాన్పూర్‌లో గత అనేక సంవత్సరాలుగా అన్ని కార్మికసంఘాలు కలిపి సంయుక్తంగా నిర్వహిస్తున్న విశ్వకర్మజయంతికి 'హింద్‌మజ్దూర్ పంచాయత్ సభ' నాయకుడు శ్రీమక్బూల్ అహ్మద్ అధ్యక్షత వహిస్తున్నాడు.

బి.ఎం.ఎస్. ప్రచారం చేస్తున్న నినాదాలుకూడా దాని ప్రఖర జాతీయ భావనను ప్రతిబింబిస్తాయి. 1987డిసెంబర్‌లో బెంగుళూరులో జరిగిన బి.ఎం.ఎస్. 8వ జాతీయసమ్మేళన ప్రారంభోత్సవానికి ప్రముఖ పత్రికారచయిత శ్రీ ఎమ్.వి.కామత్ వచ్చారు. కార్మికులు గొంతెత్తి పలికిన 'భారతమాతాకీ జయ్' నినాదాన్ని, 'వందేమాతరం'గీతాన్ని విని ఆయన ఎంత ఆనందభరితుడయ్యారంటే, తన ప్రారంభోపన్యాసాన్ని ప్రక్కనబెట్టి, ఇది తనకు పూర్తిగా క్రొత్త, ప్రేరణదాయక అనుభవం అంటూ దాని గురించే మాట్లాడారు.

సాధారణంగా ప్రత్యేక కార్మిక భావనను పెంపొందించే మిగిలిన కార్మికోద్యమాలకు భిన్నంగా బి.ఎం.ఎస్. జాతి సంక్షేమానికి అత్యధిక ప్రాధాన్యతనిచ్చింది. ఉదాహరణకు, వారి నినాదం ఒకటి ఇలా ఉంది: "దేశ్‌కేహితమే కరేంగేకామ్-కామ్‌కో లేంగే పురాదామ్" (దేశశ్రేయస్సుకోసం శ్రమిస్తాం. శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతాం) మరొక నినాదం 'కమానే వాలా ఖిలాయేగా' - 'సంపాదించే వాడు ఇతరులకు తినిపిస్తాడు.' కుటుంబభావనను సమాజానికి విస్తరింపజేస్తుంది. కార్మికుడంటే స్వలాభాపేక్షతో బేరసారాలు లేదా పోరాటం సాగించే వాడు మాత్రమే కాదు; ఉత్పత్తిని సాధించేందుకు శ్రమిస్తాడు. సమాజాన్ని పోషిస్తాడుకూడా. 'శ్రామిక శక్తిని జాతికి అంకితం చేద్దాం.' 'పరిశ్రమలను కార్మికులకు కేంద్రం చేద్దాం.' 'జాతిని పరిశ్రమలమయం చేద్దాం' అన్న బి.ఎం.ఎస్. మూడునినాదాలు కార్మికరంగంలో జాతి, కార్మికులు, పరిశ్రమలు అవినాభావసంబంధం కలిగినవనే సమగ్ర భారతీయ దృష్టిని ప్రతిపాదిస్తాయి.

అంతర్జాతీయస్థాయిలో కూడా 'ప్రపంచ కార్మికులారా! ఏకంకండి'

అనే నినాదంద్వారా కమ్యూనిష్టులు ప్రవేశపెట్టిన ప్రత్యేక కార్మికభావనను ఎదుర్కొనడానికి బి.ఎం.ఎస్. 'కార్మికులారా! ప్రపంచాన్ని ఏకంచేయండి' అనే నూతన నినాదాన్ని ప్రవేశపెట్టింది. చూడడానికి సాధారణంగా కనిపించే ఈ పరివర్తన 'కృణ్వన్తోవిశ్వమార్యం' అనే నినాదంలోని సనాతన భారతీయభావనకు అనుగుణంగా కార్మికుల దృష్టిని విశాలంచేస్తుంది. బి.ఎం.ఎస్. ప్రచారంచేసిన 'శ్రమగీత్' (కార్మికుల గీతం)లో కూడా అదే భావన తొణికిసలాడుతూ ఉంటుంది. 'యుగయుగసే మానవహితకరనా, శాశ్వత ధర్మహమారాహై' - తమ అంతిమలక్ష్యం సమస్త మానవాళియొక్క ఉద్ధరణఅని, కేవలం కార్మికుల శ్రేయస్సు మాత్రమేకాదని అది కార్మికులకు గుర్తుచేస్తుంది.

విదేశాలలో కూడా కార్మికరంగ సమస్యలకు భారతీయ దృష్టిని వివరించి చెప్పడంకోసం ప్రతి అవకాశాన్ని బి.ఎం.ఎస్. వినియోగించుకుంటుంది. అఖిల చైనా కార్మిక సంఘాల సమాఖ్య ఆహ్వానం మేరకు అయిదుగురు సభ్యులుగల బి.ఎం.ఎస్. సద్భావనాబృందం చైనాకు వెళ్ళింది. 1985 ఏప్రిల్ 3-19ల మధ్య చైనాలో వివిధ ప్రదేశాలను అది సందర్శించింది. అక్కడవారి అనుభవాలు చెప్పుకోదగ్గవి. ఇరుదేశాల ప్రజలమధ్య అనాదిగా వస్తున్న సాంస్కృతిక, ఆధ్యాత్మిక సంబంధాలను పునరుద్ధరించుకొనడానికి బి.ఎం.ఎస్. నాయకులు ఈ సందర్భాన్ని వినియోగించుకున్నారు.

క్వవాక్సీ ప్రాంత అధ్యక్షురాలైన శ్రీమతి మ్యా ర్ఝూవో యున్‌తో సియాన్‌లో జరిగిన సంభాషణ సమయంలో 1925 సెప్టెంబర్‌నాటి చైనా చరిత్రలోనే అతిపెద్దదైన సమ్మె విషయం ప్రస్తావనకు వచ్చింది. మేడేకు బదులుగా ఆ ఉద్యమం ప్రారంభమైన దినాన్నే జాతీయ కార్మికదినంగా చైనా స్వీకరించవచ్చని శ్రీ ఠెంగ్డీ సూచించారు. దానివలన కార్మికులలో దేశభక్తి భావన పెంపొందుతుందని ఆయన అన్నారు. గాంగ్‌డాంగ్ ప్రాంత ఉపాధ్యక్షుడు ఈ సలహాను స్వాగతించాడు. తమ సమాఖ్యముందు దానిని ఉంచుతామని తెలియజేసాడు. ఏప్రిల్ 18నాడు చైనానుండి ప్రతినిధివర్గం తిరిగి బయలుదేరుతున్న సందర్భాన బీజింగ్ రేడియోకు చెందిన చెన్‌లికింగ్ వీడ్కోలు సందేశం ఇవ్వవలసిందిగా శ్రీ ఠెంగ్డీనికోరారు. హిందూ-చీనీ సాంస్కృతిక సంబంధాలను, ఇరుదేశాలమధ్యగల పురాతన స్నేహాన్ని శ్రీ ఠెంగ్డీ గుర్తుచేసారు. మజ్దూర్ సంఘ్, సమాఖ్యల స్వభావంలో గల సామీప్యాన్నికూడా ఆయన ప్రస్తావించారు. వేదాల ప్రేరణను రగిలిస్తూ ఆయన అన్నారు:

'పుమాన్ పుమాంసం పరిపాతు విశ్వతః' (మనిషి సాటిమనిషిని అన్నివైపులనుండి కాపాడి, పోషించుగాక)

ప్రతిఏటా జెనీవాలో జరిగే అంతర్జాతీయ కార్మికసమ్మేళనం బి.ఎం.ఎస్. ప్రతినిధులకు తమ అంతర్జాతీయ సంబంధాలను విస్తృతపరచుకొనడానికి, ముఖ్యంగా పొరుగుదేశాల కార్మికసంఘాలతో సంబంధాలు పెంపొందించుకొనడానికి చక్కని అవకాశం కల్పిస్తోంది. ప్రభుత్వాలమధ్య విధాన నిర్ణయాలకు సంబంధించిన వైరుధ్యాలు ఏవిధంగా ఉన్నప్పటికీ ఒకసమాన, విశిష్ట సంస్కృతి, పరంపరలకు వారసులుగా ఈ దేశాల కార్మికులు, కార్మికసంఘాలు సన్నిహితం కావాలని ఆ సంబంధాలద్వారా బి.ఎం.ఎస్. నొక్కి వక్కాణిస్తూఉంటుంది.

## రైతు ఉద్యమంలో:

భారతీయ ఆర్థికరంగంలో అత్యధికంగా దెబ్బతింటున్న వర్గం రైతులు. దేశంలో అనేక ప్రాంతాలు తరచుగా కరువు, వరదలవంటి ప్రకృతివైపరీత్యాల వాత బడుతున్నాయి. పాలకుల కఠిన చర్యలు పరిస్థితిని మరింత దిగజార్చసాగాయి. ఆర్థిక ప్రణాళికలో, వ్యవసాయాన్ని వెనుకకు నెట్టివేసారు. పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకును తగ్గించి, పెట్టుబడిని పెంచడానికి వీలుగా వ్యవసాయోత్పత్తుల ధరలు, రవాణాలపై నియంత్రణ విధించారు. వ్యవసాయోత్పత్తుల ధరలు కాలగమనంలో కొంతపెరిగినప్పటికీ, వ్యవసాయపెట్టుబడుల ధరకూడా పెరిగిపోవడంతో, రైతులకు ప్రయోజనం ఏమాత్రం మిగలకుండా పోయింది. సాధారణ అజ్ఞానం, అసంఘటితస్థితి కారణంగా రైతులపరిస్థితి నిస్సహాయంగా మారింది. ఫలితంగా వారు పట్టణాలకు వలసపోవడం ప్రారంభించారు. దానివలన నగరాలలో మురికివాడలలో నివసించే ప్రజల సంఖ్య పెరిగిపోయింది. అనేక పట్టణ సమస్యలకు అది దారితీసింది.

చాలాకాలంగా వ్యవసాయరంగంలోఉన్న మన స్వయంసేవకులు ఒకచోట సమావేశమై అప్పటివరకు కొన్ని ప్రాంతాలకే పరిమితమై ఉన్న వ్యవసాయదారుల ఉద్యమాలకు ఒక నూతన దిశను కల్పించేందుకు మార్గాలను వెదుకసాగారు. రాజకీయ నాయకుల మాయమాటలకు కూడా అప్పటి వరకు రైతులు మోసపోతూవచ్చారు. అయితే ఆ ఉద్యమాలవల్ల తాత్కాలికంగా కొంత ఉపశమనం, సహాయం లభించిన మాట నిజమే. 1979 మార్చిలో రాజకీయేతర సంస్థగా స్వయంసేవకులు ప్రారంభించిన భారతీయ కిసాన్ సంఘ్ (బి.కె.ఎస్.) ఈ ఉద్యమాలన్నీ

తన కృషికి పోషకాలుగానే భావించింది.

కేవలం వ్యవసాయదారుల భౌతికజీవన ప్రమాణాల అభివృద్ధే తనలక్ష్యంగా బి.కె.ఎస్. భావించలేదు. భారతీయ విలువలకు అనుగుణమైన పద్ధతిలో అది సమగ్ర వికాసంపైననే తన దృష్టిని కేంద్రీకరించింది. ఉద్యమాత్మక కార్యక్రమంతోబాటు ప్రబోధాత్మక కార్యక్రమం కూడా ప్రారంభించింది. పెట్టుబడులకు తగిన నిష్పత్తిలో వ్యవసాయోత్పత్తులకు ధరలుకూడా నిర్ణయించాలని కోరుతూనే, రైతులలో ఆత్మ నిర్భర భావనను పెంపొందించడానికి కృషిచేసింది. ప్రతిచిన్న సమస్య పరిష్కారానికి పాలనాయంత్రాంగంవద్దకు పరిగెత్తడం అనర్థదాయకమని రైతులకు కిసాన్ సంఘ్ ప్రబోధించింది. నిరంతరం అప్పు తెచ్చుకునే అలవాటుకంటే, తగ్గించదగిన ఖర్చును త్యజించడం మంచిదని రైతులకు సలహాఇచ్చింది. బి.కె.ఎస్. వారిలో పెంపొందించిన విలువలు, ఆలోచనల కారణంగా దురలవాట్లను వదిలిపెట్టి, పొదుపుచేసే అలవాటు చేసుకొనడానికి కూడా వారికి ప్రోత్సాహం లభించింది. ఎప్పుడైనా ఉద్యమం చేపట్టకతప్పనిస్థితి ఏర్పడితే ఉద్యమకారులు శాంతియుత, న్యాయసమ్మత మార్గాలకే కట్టుబడి ఉండేవిధంగా చేసేందుకు వారిలో జాతిఎడల అంకితభావనను నిర్మాణం చేయడం కూడా అవసరం అని కిసాన్‌సంఘ్ భావించింది. బి.కె.ఎస్. యొక్క ఈ సకారాత్మక, నిర్మాణాత్మక వైఖరికి పాలనాయంత్రాంగం కూడా తరచు అనుకూల ప్రతిస్పందననే చూపిందంటే ఆశ్చర్యంలేదు.

రైతులకు శిక్షణ తరగతులను నిర్వహించడం బి.కె.ఎస్. కార్యకలాపాలలో ప్రముఖమైనది. మొక్కజొన్న, ఇతర పంటలలో అధిక దిగుబడినిచ్చే రకాల గురించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించడం, పశుసంరక్షణలో శిక్షణ ఆ తరగతులలో ప్రధానమైనవి. శిక్షణలోభాగంగా తమ క్రింద పనిచేసే కార్మికులకు న్యాయపూర్ణమైన రీతిలో డబ్బుచెల్లించమని ఒప్పించేవారుకూడా. తమ సంరక్షణలోగల జంతువులను కూడా తమ కుటుంబంలో సభ్యులుగానే పరిగణించాలని, గోవుకు గౌరవనీయస్థానం కల్పించాలని బోధించేవారు. సంక్షిప్తంగా, 'వ్యవసాయ కుటుంబం' అనేభావన వ్యవసాయరంగం ఎడల బి.కె.ఎస్. దృష్టికోణానికి మూలాధారంగా ఉండేది. భౌతిక, నైతిక, సామాజిక అంశాలన్నింటిలోను రైతుల జీవనాన్ని పైకితీసుకుని రావడానికి ఇది ఎంతో సహాయపడుతుంది. దానివలన నిర్మాణమయ్యే సామరస్యభావన గ్రామీణజీవనాన్ని పట్టిపీడించే పరస్పర కలహాల సమస్య పరిష్కారానికి ఎంతోదోహదం చేస్తుంది.

వ్యవసాయ కుటుంబ భావనపై నిష్ఠ, వ్యవసాయోత్పత్తికి సంబంధిం

చిన వివిధ అంగాల మధ్య సహకార భావనలు; వర్గసంఘర్షణ సిద్ధాంతం, ఇతర స్వయం వినాశకర ప్రచారాలను రూపుమాపడంలో కూడా ఎంతో సహాయపడ్డాయి. ఆర్థికవ్యవస్థకు వ్యవసాయం జీవనరేఖగా గల మన జాతీయ విలువలను వెలుగులోకితెచ్చేందుకు బి.కె.ఎస్. 'కృషిమిత్ కృషస్వ' - వ్యవసాయం సర్వోత్తమమని భావించు - అన్నమంత్రవాక్యాన్ని స్వీకరించింది. నాగలిపట్టిన వీరుడు బలరాముని వ్యవసాయదారులు ప్రత్యేకంగా ఆరాధిస్తారు. ఆయన జన్మదినాన్ని 'జాతీయ రైతుదినం'గా స్వీకరించడం ద్వారా బి.కె.ఎస్. రైతుఉద్యమంలో జాతీయతా ముద్రవేసింది.

## విద్యార్థి రంగంలో:

విద్యార్థి 'రేపటి పౌరుడు' మాత్రమేకాదని, ఇవాల్టి పౌరుడు కూడా అని అ.భా.వి.ప. విశ్వసిస్తుంది. విద్యార్థులు జాతీయ సమాజపు సమగ్ర అంతర్భాగమని, సమాజశ్రేయస్సు వారి ప్రాథమిక ఆలోచన కావాలని అది నొక్కిచెబుతుంది. ఈ దిశలో విద్యార్థిశక్తిని సమీకరించి, సామాజిక, ఆర్థిక, జాతీయ రంగాలన్నింటిలో తగుమార్పులు తీసుకుని రావాలని అ.భా.వి.ప. కృషిచేస్తోంది. సెనేట్లు, ఇతర విశ్వవిద్యాలయపాలకసంస్థలలో విద్యార్థుల భాగస్వామ్యం ఉండాలన్న అ.భా.వి.ప. ప్రతిపాదనను కొన్ని విశ్వవిద్యాలయాలు స్వీకరించాయి. మిగిలిన వాటిలో కూడా సూత్రబద్ధంగా అంగీకారం వ్యక్తమైంది.

కళాశాల, విశ్వవిద్యాలయ సంఘాల ఎన్నికలలో అ.భా.వి.ప. పాల్గొనడం ఆ సంఘాల చరిత్రగతినే మార్చివేసింది. చిన్న, చితక ఉద్యమాలతో సాధారణంగా గడిచిపోతూ ఉండే విశ్వవిద్యాలయ వాతావరణం అ.భా.వి.ప. రాకతో ఉన్నత ప్రమాణాలను అందుకున్నది. జాతీయ సమస్యలలో కూడా అది పాలుపంచుకోసాగింది. 1973 అహమ్మదాబాద్ సభలనాటికి దేశమంతటా అనేక విద్యార్థిసంఘాల పదవులకు అ.భా.వి.ప. కార్యకర్తలు ఎన్నికై ఉన్నారు. అత్యవసరపరిస్థితికిముందు, ఆ సమయంలోను ప్రభుత్వంతో సాగిన నిర్ణయాత్మక పోరాటంలో విద్యార్థి కార్యాచరణ సమితులు కేంద్రం అయ్యాయి. అ.భా.వి.ప. నాయకత్వం కూడా వాటిలో భాగస్వామిగా ఉంది. ఆ సమయంలోనే అవినీతికర కాంగ్రెస్ మంత్రివర్గానికి వ్యతిరేకంగా గుజరాత్‌లో జరిగిన నవనిర్మాణ్‌సమితి ఆందోళనలో అ.భా.వి.ప. ప్రముఖపాత్ర వహించింది. బీహార్‌లో ఛాత్ర యువసంఘర్షసమితికి నాయకత్వం వహించింది విద్యార్థి పరిషత్ కార్యకర్తలే. దాని ప్రభావం ఎంత ప్రబలంగా ఉండిందంటే

స్వయంగా శ్రీ జయప్రకాశ్ నారాయణ దానిని సమర్థించారు. తదుపరి దానికి నాయకత్వం వహించారుకూడా. అనతికాలంలోనే సమితి అనేక ఇతరరాష్ట్రాలలో కూడా విద్యార్థిశక్తి జాగరణకు ప్రేరణ కేంద్రం అయింది.

అయితే, ఉద్యమంలో పూర్తిగా నిమగ్నమై ఉన్నప్పుడుకూడా విద్యార్థిపరిషత్ 'విద్యార్థులు నూతన విప్లవవర్గం', 'ఒక సంవత్సరంపాటు మీ తరగతులను విడిచిపెట్టండి' లాంటి నినాదాల భ్రమలోపడి కొట్టుకుపోలేదు బదులుగా, 'పఢాయి కే సాథ్ లడాయి' - చదువుతోపాటు సంఘర్షణ - అనే పిలుపునిచ్చింది. సామాజిక పరివర్తనకు ఏదో ఒక వర్గం... విద్యార్థులో, కార్మికులో, మరెవరో ఆధారం అవుతారన్న వాదాన్నికూడా అ.భా.వి.ప. అంగీకరించలేదు.

మరే ఇతర విద్యార్థిసంస్థ సరిసమానం కాలేనిరీతిలో అద్భుత పోరాటాన్ని అత్యవసర పరిస్థితికి వ్యతిరేకంగా విద్యార్థి పరిషత్ సాగించింది. 1977లో జనతా విజయానికి విద్యార్థి శక్తిని జాగృతంచేయడంలో వారి ప్రశంశనీయమైనపాత్ర అందరూ గుర్తించారు. అధికారానికి సన్నిహితం కావడంవల్ల కలిగే వ్యామోహాలకు విద్యార్థిపరిషత్ లొంగిపోలేదు. జె.పి. ఉద్యమంలో పాల్గొన్న వివిధ విద్యార్థి, యువజన సంస్థలు అధికారంకోసం ఒకరితో ఒకరు ఘర్షణ పడుతున్నవేళ విద్యార్థిపరిషత్‌మాత్రం వాటిపట్ల నిరాసక్తంగానే ఉండిపోయింది. మూడు సంవత్సరాలలోగానే, ఆ సంస్థలన్నీ తమ అస్తిత్వాన్ని, చైతన్యాన్ని, న్యాయబద్ధతను కోల్పోయాయి. విద్యార్థిపరిషత్ చరిత్రమాత్రం స్వచ్ఛంగా, విశిష్టంగా కొనసాగింది. డెబ్భైలలో ప్రపంచమంతటా కొన్ని రాజకీయ ప్రయోజనాలు లభించిన తరువాత విద్యార్థి ఉద్యమం సహజమరణానికి గురైనవేళ, రాజకీయ మార్పు లక్ష్యంగాకాక, సామాజిక పరివర్తనకోసమే నిలచిన ఏకైకశక్తి విద్యార్థి పరిషత్.

1982 ప్రారంభంలో, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ఉర్దూను రెండవ అధికారభాషగా ప్రకటిస్తూ ఉత్తర్వులు జారీచేసింది. గతంలో ముస్లిం వేర్పాటువాదాన్ని రెచ్చగొట్టి, చివరకు దేశాన్ని చీల్చివేయడానికి కారణమైనది ఉర్దూయేనని ఉత్తరప్రదేశ్ ప్రజానీకానికి తెలుసు. ఈ ఉత్తర్వులను ఒక సవాలుగా తీసుకుని విద్యార్థి పరిషత్, ముఖ్యమంత్రి ఆగ్రా సందర్శించినపుడు అతడిని ఘెరావ్‌చేసింది. శ్రీ మహాదేవీవర్మ, శ్రీ నారాయణ చతుర్వేది తదితర సాహితీ ప్రముఖులు సంరక్షకులుగా ఒక కార్యాచరణసమితి ఏర్పడింది. త్వరలోనే ఉద్యమం రాష్ట్రమంతా ప్రాకింది. ధర్నాలు, ప్రదర్శనలు, సమావేశాలు వగైరాలద్వారా ప్రజలను

ఉర్దూను ద్వితీయ రాష్ట్రభాషగా చేయడంవల్ల తలఎత్తే ప్రమాదకర పరిణామాల గురించి జాగ్రతులను చేసారు. ఉద్యమం ఎంత తీవ్రస్థాయిలో జరిగిందంటే, యు.పి. మంత్రివర్గంలోని ఇద్దరు కాంగ్రెస్ మంత్రులు సైతం ముందుకువచ్చి గవర్నర్ ఆదేశాన్ని తీవ్రంగా విమర్శించారు.

షేక్‌అబ్దుల్లా ప్రభుత్వపు అణచివేత చర్యలకు వ్యతిరేకంగా జమ్మూలో జాతీయవాద యువకులను సమీకృతులను చేయడంలో స్వయంసేవకులు ప్రారంభించిన జాతీయ విద్యార్థిసంఘం ప్రముఖపాత్ర వహించింది. ఉదాహరణకు, 1948లో ప్రభుత్వకళాశాల భవనాలపై నేషనల్ కాన్ఫరెన్స్ పతాకాన్ని ఎగురవేయడానికి అధికారులు ప్రయత్నించినపుడు విద్యార్థిసంఘం పెద్దప్రదర్శనను నిర్వహించి, వారి పథకాలను వమ్ముచేసింది. ప్రభుత్వ సచివాలయంపై ఎగురుతున్న నేషనల్ కాన్ఫరెన్స్ జెండాను కూడా తొలగించి, దానిస్థానంలో త్రివర్ణపతాకాన్ని ఎగురవేయాలని కోరుతూ విద్యార్థిసంఘ విద్యార్థులు పెద్ద ఉద్యమాన్ని నిర్వహించి, నిరాహారదీక్షలు సాగించారు. మూడు నెలలపాటు ఈ ఉద్యమం కొనసాగింది. చివరకు కేంద్ర ప్రభుత్వం జోక్యం కల్పించుకోవలసివచ్చింది. ఈ విషయాన్ని పరిష్కరించేందుకు జమ్మూకు వచ్చిన శ్రీ ఎన్. గోపాలస్వామి అయ్యంగార్‌తో విద్యార్థులు సంభాషణలు సాగించారు. చివరికి విద్యార్థుల కోరికకు ప్రభుత్వం తలఒగ్గక తప్పలేదు. ఆవిధంగా రాష్ట్ర పరిపాలనలో జాతీయ త్రివర్ణ పతాకానికి సముచిత స్థానం లభించింది.

## సహకార రంగంలో:

అనేకమంది వ్యాపారవేత్తలైన స్వయంసేవకులు సహకారరంగంలో కూడా ప్రవేశించారు. సంఘంలో నేర్చుకున్న నిస్వార్థసేవాభావన, పరస్పర సహకార భావన విజయవంతంగా సహకారసంస్థలను నిర్మించడంలో వారికి ఎంతో ఉపయోగపడ్డాయి. సమాజం మొత్తాన్ని ఒకే కుటుంబంగా దర్శించే భారతీయ దృష్టికోణాన్ని ఈ రంగంలో కూడా ప్రవేశపెట్టేందుకు వారు ప్రయత్నిస్తున్నారు. వ్యక్తిగత, సామూహిక శ్రేయస్సులమధ్య సమన్వయాన్ని సాధించడానికి, సహకారోద్యమం యొక్క శ్రేయస్కర వికాసానికి సరియైన ఆధారాన్ని నిర్మించడానికి అదే మార్గంచూపగలదు. ఈ ఉద్యమం సామాన్య ప్రజలను ప్రత్యక్షంగా భాగస్వాములను చేస్తుంది. ఆవిధంగా సమగ్ర ఆర్థిక, సామాజిక అభ్యున్నతిని సాధించడానికి ఇది ఉత్తమమైన మాధ్యమం అవుతుంది.

రాజకీయ కుతంత్రాలనుండి తమ సహకారసంస్థలను దూరంగా

ఉంచడంలో కూడా స్వయంసేవకులు కృతకృత్యులయ్యారు. ఈనాడు రాజకీయనాయకుల చేతులలో కీలుబొమ్మగా మారిన సహకార రంగానికి ఇదొక వరప్రసాదంలాంటిది. ప్రజలకు జవాబుదారీగా ఉండే విషయంలో ఆ రంగంలో కార్యకర్తలు నూతన ప్రమాణాలు సృష్టిస్తున్నారు. "మండు టెండలో నిలబడికూడా చెట్టు బాటసారులకు చల్లని నీడను, తియ్యని ఫలాలను అందిస్తుంది" అన్న శ్రీ బాలాసాహెబ్ దేవరస్ మాటలను వారు తమకు మార్గదర్శక సూత్రాలుగా స్వీకరించారు.

ఈరంగంలో అగ్రగాములుగా ఉన్న సంఘకార్యకర్తలందరూ ఒకచోట చేరి 1978లో జాతీయ స్థాయిలో సహకారభారతి సంస్థను స్థాపించారు. సహకారోద్యమానికి సంఘటిత బలాన్ని సమకూర్చడం, దీనిని కేవలం ఒక ఆర్థిక ఉపకరణంగా మాత్రమే చూడరాదని ప్రజలను జాగృతం చేయడం దాని ఉద్దేశాలు. బ్యాంకులు, మహిళాసంఘటనలతోబాటు, ఋణ, గృహ, మత్స్యసంఘాల ప్రతినిధులుకూడా పాల్గొన్న తృతీయ సమావేశాలలో 1986లో నాగపూర్‌లో విస్తృత అంశాలపై జరిగిన సమాలోచనలు సహకార భారతి సాధించిన ప్రశంసనీయ పురోభివృద్ధికి నిదర్శనంగా నిలిచాయి.

జాతీయ ఆర్థిక ప్రణాళికలో సహకార క్షేత్రానికి న్యాయబద్ధమైన, సముచితమైనస్థానం కల్పించాలని ఆ సమావేశాలలో ఒక తీర్మానంద్వారా కోరారు. పేరుకు మాత్రమే 'సహకారీ' (సహకార)గా ఉంటూ, ప్రత్యక్షంగా మాత్రం 'సర్కారీ' (ప్రభుత్వ) సంస్థలుగా ఈ సహకారసంస్థలు మారిపోయాయని కూడా ఆ సమావేశాలలో ఎత్తిచూపారు. తాము ఇచ్చిన ఆర్థిక సహాయానికి సమాన నిష్పత్తిలో సహకారబాంకుల కార్యనిర్వాహక మండలులలో తమ ప్రాతినిధ్యం ఉండాలని ప్రభుత్వం నిర్బంధం విధించడమే ఇందుకు కారణం. ఫలితంగా ఆ బ్యాంకుల స్వాధీనత దూరమైంది. సహకార సంఘాల రిజిస్ట్రార్‌ల చేతులలో పెట్టిన విస్తృత అధికారాలు ఏవిధంగా దురుపయోగం అవుతున్నాయో, సహకార రంగంలో అధికారుల ప్రమేయం ఏవిధంగా వినాశకారి అవుతున్నదో ఆ సమావేశాలలో ఎత్తిచూపారు.

## అధికార పీఠాలలో ఉన్నప్పుడు:

ఆకాశవాణి, దూరదర్శన్‌లపై ప్రభుత్వం గుత్తాధిపత్యం వహించరాదన్నది భారతీయ జనసంఘ్ మౌలిక ఆదర్శాలలో ఒకటిగా ఉండేది. ఎన్నికల ప్రసారాలు, వాటిలో అధికార జనతాపక్షం, ప్రతిపక్ష కాంగ్రెస్(ఐ)తో

సహా ఇతర ప్రతిపక్షాలకు తగిన అనుపాతంలో సమయం కేటాయించడం అనే సంప్రదాయం ఆకాశవాణి, దూరదర్శన్‌ల చరిత్రలో మొట్టమొదటిసారిగా శ్రీ అద్వానీ సమాచార, పౌరసంబంధ శాఖామంత్రిగా ఉన్న సమయంలోనే ప్రవేశించింది.

జనతా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన కొద్దిరోజులలోనే శ్రీ అద్వానీ లోక్‌సభలో ప్రతిపక్ష నాయకుడైన శ్రీ వై.బి. చవాన్‌ను జాతినుద్దేశించి ప్రసంగించవలసిందిగా ఆహ్వానించారు. శ్రీ చవాన్ ఆశ్చర్యచకితులయ్యారు. అంతకుముందెన్నడూ కూడా ఆకాశవాణి, దూరదర్శన్‌లద్వారా తమ అభిప్రాయాలను వెలిబుచ్చే అవకాశం ప్రతిపక్షాలవారికి లభించలేదు. తన ఉపన్యాసపాఠాన్ని పరిశీలనకోసం ఎప్పటిలోగా పంపించాలని శ్రీ చవాన్ శ్రీ అద్వానీని అడిగారు. "మీరు మాట్లాడదలచుకున్న విషయాలను స్వేచ్ఛగా మాట్లాడండి. ముందుగా పాఠాన్ని పంపించవలసిన అవసరం ఎంతమాత్రంలేదు" అని సమాధానం ఇచ్చారు శ్రీ అద్వానీ. ఆ తరువాత ఈ ఆహ్వానాన్ని గురించి ప్రధానమంత్రి శ్రీ మొరార్జీదేశాయికి కూడా తెలియజేసి, శ్రీ చవాన్ మాట్లాడడానికి ఒక రోజు ముందు జాతిని ఉద్దేశించి ప్రసంగించవలసిందిగా ఆయనను శ్రీ అద్వానీ అభ్యర్థించారు.

బి.బి.సి. మాదిరిగానే ఆకాశవాణి, దూరదర్శన్‌లకు కూడా స్వయం ప్రతిపత్తిని కల్పించే దృష్టితో శ్రీ అద్వానీ ఆ విషయాన్ని పరిశీలించి, దాని అమలుకు మార్గాలను సూచించడానికి ఒక సంఘాన్ని ఏర్పాటుచేసారు. ఆ సంఘం ఆ మేరకు ఒక నివేదికను సమర్పించింది. 1979లో లోక్‌సభలో 'ప్రసారభారతి' పేరుతో ఆకాశవాణి, దూరదర్శన్‌లను స్వయం ప్రతిపత్తిగల సంస్థలుగా చేసే ఒక ముసాయిదా బిల్లు ప్రవేశపెట్టారు. కానీ, సరిగ్గా అదే సమయంలో జనతా ప్రభుత్వం పతనం కావడంతో, ఆ విషయం అక్కడే ముగిసింది.

1978లో చిక్‌మగళూర్ లోక్‌సభస్థానంనుండి జరిగిన ఉపఎన్నికలలో శ్రీమతి ఇందిరాగాంధీ పోటీచేసినప్పుడు, కర్ణాటక రాష్ట్ర, కాంగ్రెస్(ఐ) ప్రభుత్వ ముఖ్యమంత్రి కాంగ్రెస్(ఐ) ప్రభుత్వం సాధించిన విజయాలను ప్రకటిస్తూ ఓటర్లను ఆమెకు ఓటు వేయవలసిందిగా కోరుతూ, రాష్ట్ర ప్రభుత్వ ప్రచారశాఖ ద్వారా ఒక ప్రకటనను ప్రచురించారు. అన్ని వార్తాపత్రికలలోను కొన్ని రోజుల తరబడి అది పూర్తి పేజీ ప్రకటనగా ప్రచురితమైంది. జనతా అభ్యర్థికోసం ప్రచారంసాగించడానికి శ్రీ అద్వానీ చిక్‌మగళూరుకువచ్చినపుడు, అక్కడ ప్రచార విభాగాన్ని నిర్వహిస్తున్న

వ్యక్తి శ్రీ అద్వానీని వారి ఆధీనంలో ఉన్న కేంద్ర ప్రభుత్వ ప్రచార విభాగం ద్వారా కూడా అటువంటి ప్రకటనలను విడుదలచేయించమని అభ్యర్థించారు. ప్రజాధనాన్ని పార్టీప్రచారంకోసం దుర్వినియోగంచేయడం తగదని చెబుతూ శ్రీ అద్వానీ అందుకు తిరస్కరించారు. అటువంటి ప్రకటనలు పార్టీద్వారా ప్రచురించుకోవచ్చుని, ప్రభుత్వం ద్వారామాత్రం కాదని ఆయన స్పష్టంచేసారు.

భారత-పాకిస్తాన్‌మధ్య సంబంధాలు శ్రీవాజ్‌పాయ్ విదేశాంగమంత్రిగా ఉన్న సమయంలో (1977-79) ఉన్నంత చక్కగా మరే సమయంలోను లేవన్నది అందరికీ తెలిసిన విషయం. అయితే అది భారతదేశ ప్రయోజనాలను పణంగాపెట్టి మాత్రంకాదు. శ్రీ వాజ్‌పాయ్ పాకిస్తాన్‌ను సందర్శించినప్పుడు, త్వరలో మరల ఒకసారి రావలసిందని పాక్ అధ్యక్షుడు ఆయనను ఆహ్వానించారు. ఎందుకని శ్రీ వాజ్‌పాయ్ ప్రశ్నించినప్పుడు, ప్రధానాంశమైన కాశ్మీర్ సమస్యను చర్చించవలసిఉందని ఆయన అన్నాడు. ఆ సమస్య అయితే చర్చలకు తాను తక్షణమే సిద్ధంగా ఉన్నానని శ్రీ వాజ్‌పాయ్ అన్నారు. నిపుణులతో సంప్రదించి, పత్రాలు సిద్ధంచేసుకొనడానికి ఇరుదేశాలకు కొంత సమయం అవసరంకదా అని పాక్‌అధ్యక్షుడు అన్నప్పుడు శ్రీవాజ్‌పాయ్, భారత్‌కు అలాంటి తయారీ ఏమీ అవసరంలేదని, నిజానికి పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్‌నుండి వైదొలగి, ఆ ప్రాంతాలను భారత్‌కు అప్పగించడం ఒక్కటే అసలు ఇద్దరిమధ్య ఉన్న విషయమని స్పష్టంగా సమాధానం చెప్పారు.

ఐక్యరాజ్యసమితిలో భారత్ ప్రవేశించిననాటినుండే ఎన్నడూ మనదేశ ప్రతినిధులు హిందీలోగానీ, మరే ఇతర భారతీయభాషలోగానీ మాట్లాడిన పాపానపోలేదు. ఆవేదికపై హిందీలో తనవాణిని వినిపించిన మొట్ట మొదటివ్యక్తి శ్రీవాజ్‌పాయ్. తమిళంలోని తిరుక్కురుల్ నుండి ఒక ప్రస్తావనతో ఆయన తన ప్రసంగాన్ని ముగించారు.

## మేధావి రంగంలో:

మనదేశానికి చెందిన అగ్రశ్రేణి మేధావి ఒకరు ఒకసారి ఇలా అన్నారు: 'స్వతంత్ర భారతదేశంలోకంటే బ్రిటిష్ వలసగా ఉన్న కాలంలోనే మన దేశంలో స్వతంత్రంగా ఆలోచించే మేధావులు ఎక్కువగా ఉండేవారు.' - స్వతంత్రభారత మేధావివర్గాన్ని గురించిన విషాదకర వ్యాఖ్యానం ఇది. మరింత విషాదం ఏమిటంటే, గత 40 సం.లుగా ఈ లోటును పూరించడానికి మన విద్యాసంస్థలు చేసినకృషి చాలా తక్కువ. ఒకవి

ధంగా, ఇప్పుడు మన మేధస్సుపై సంకెళ్ళు మరింత బిగుసుకున్నాయి. కనుక, మన జాతీయ మేధస్సును స్వతంత్రంగా, సృజనాత్మకంగా, చైతన్యవంతంగా తీర్చిదిద్దడం నేడు అత్యవసరం. కేరళలోని 'భారతీయ విచారకేంద్ర' (బి.వి.కె) లక్ష్యం ఇదే.

1982లో విజయదశమి నాడు తిరువనంతపురంలో ప్రారంభమైన 'విచారకేంద్ర' ప్రాంతమంతటా తనశాఖలు విస్తరింపజేసింది. అనియత సమాఖ్య స్వరూపంతో అది పనిచేస్తుంది. ఆ సంస్థ కేంద్రంనుండి సాధారణ మార్గదర్శనం పొందుతూ, వివిధశాఖలు స్థానిక మేధావి వర్గం అండతో స్వతంత్రంగా పనిచేస్తూ ఉంటాయి.

మన ప్రధాన జీవనరంగాలన్నింటిలో నిజమైన జాతీయ దృక్కోణాన్ని ప్రసరింపజేయడమే లక్ష్యంగా బి.వి.కె. తనదైనందిన కార్యకలాపాలను నిర్వహిస్తూ ఉంటుంది. ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, న్యాయ, రాజ్యాంగ, శాస్త్ర, సాంకేతిక -- ఏ రంగమూ కూడా దాని దృష్టిలోనుండి తప్పించుకోలేదు. ప్రజాప్రాముఖ్య తగల తత్కాల సమస్యలను, శాశ్వత ప్రయోజనంగల మౌలికసమస్యలను కూడా అది స్వీకరిస్తూఉంటుంది. చర్చాకార్యక్రమాలు, ఉపన్యాసాలు, సంగోష్ఠులు, సదస్సులు, వక్తృత్వ, వ్యాసరచన పోటీలు అది నిర్వహిస్తూ ఉంటుంది. ప్రముఖులైన మేధావులు కార్యక్రమాలలో పాల్గొనేటట్లు ప్రయత్నం చేస్తూ ఉంటుంది. అయితే దానితోబాటు రాబోయే తరాలవారైన కళాశాల, ఉన్నతపాఠశాల విద్యార్థుల, అధ్యాపకుల భాగస్వామ్యాన్ని కూడా బి.వి.కె. ప్రోత్సహిస్తూ ఉంటుంది.

బి.వి.కె నిర్వహించిన కొన్ని కార్యక్రమాలు ఎంత ప్రభావవంతంగా ఉన్నాయంటే, రాష్ట్రంలో వామపక్ష ప్రాబల్యం ప్రబలంగా ఉన్నా కూడా మేధావులపై అవి చెరగని ముద్ర వేయగలిగాయి. సమాన పౌరచట్టం - కామన్ సివిల్ కోడ్ అన్న అంశంపై కొచ్చిన్‌లో జరిగిన జాతీయ సదస్సు భారతదేశం మొత్తానికే ఉత్కృష్టంగా జరిగింది. తగినంత ప్రభావం కూడా అది చూపించింది. భారత జాతీయకాంగ్రెస్ శతాబ్ది ఉత్సవాలు జరుగుతున్న సమయంలోనే తిరువనంతపురంలో 9 రోజులపాటు 'మన స్వాతంత్ర్య పోరాటంలో విభిన్న ప్రవాహాలు' అనే అంశంపై జరిగిన ఉపన్యాస పరంపర ఎంతో ప్రబోధాత్మకంగా ఉండి, విశేష ప్రజాదరణను పొందింది. 'భారతీయ చరిత్రలో కొన్ని మౌలిక అంశాలు - పరివర్తనయొక్క ఆవశ్యకత' అనే అంశంపై 1985లో కోజికోడ్‌లో ఒక సదస్సు జరిగింది. అందులో ద్వారకవద్ద త్రవ్వకాలు, ఆర్య-ద్రవిడ

వివాదం, ఇండస్ లిపి వగైరాలపై అధ్యయనం జరిగింది. ప్రఖ్యాత పురాతత్వశాస్త్ర నిపుణుడు డా. ఎస్.ఆర్.రావు, తదితరులు అందులో ప్రసంగించారు.

గత 6 సం.లలో బి.వి.కె. కేవలం కేరళనుండి మాత్రమేకాక, దేశం మొత్తంనుండి ప్రముఖమేధావుల సేవలను వినియోగించుకుంది. వారిలో ప్రఖ్యాత శాస్త్రవేత్తలు సర్వశ్రీ ఇ.సి.జి. సుదర్శన్, కె.ఐ. వాసు, వలియథన్, ప్రముఖ విద్యావేత్తలు వి.వి.జాన్, హబీబ్ మహమ్మద్, గోపాల్, వి.కె. సుకుమారన్ నాయర్; విఖ్యాత తత్వవేత్తలు స్వామి రంగనాథానంద, స్వామి చిన్మయానంద; ప్రముఖ రచయితలు, పత్రకారులు అరుణ్ శౌరి, మనోజ్ దాస్; న్యాయకోవిదులు వి.ఆర్. కృష్ణయ్యర్, చంద్రశేఖరమీనన్; రాజనీతికోవిదులు సి. అచ్యుత మీనన్, ఎల్.కె. అద్వాని తదితరులు ఉన్నారు.

బి.వి.కె. కార్యకలాపాలు కేరళ మేధావిరంగంపై పైకి కనిపించని విశేషప్రభావాన్ని కలిగించాయి. జాతీయ పునర్నిర్మాణ సిద్ధాంతాన్ని విస్తృతంగా చాటిచెప్పే ఒక మేధావి ఉద్యమంగా బి.వి.కె.ను జాతీయవాద ప్రజానీకం గుర్తిస్తున్నది. జాతీయదృష్టి అంటేనే విరుచుకుపడే వారికి మాత్రం బి.వి.కె బద్ధశత్రువులా కనబడుతోంది. దాన్ని విమర్శించడానికి ఏ చిన్న అవకాశం లభించినావారు ఒదులుకోవడంలేదు.

బి.వి.కె. రాష్ట్రవ్యాప్తంగా ఇచ్చిన ప్రచారం కారణంగా నేడు కేరళలో సామాన్యప్రజానీకం ఆరెస్సెస్, దాని అనుబంధ సంస్థల కార్యకలాపాలను ఒకగొప్ప సైద్ధాంతిక ఉద్యమంగా చూడడం ప్రారంభించారు. కేరళలోని అగ్రశ్రేణి పత్రికలైన మాతృభూమి, మళయాళ మనోరమ, కేరళ కౌముది వగైరాలలో సంఘంపై వ్యాసాలు, వ్యాఖ్యానాలకు పెరుగుతున్న ప్రజాదరణ ఇందుకు నిదర్శనం. ఆ ప్రముఖ పత్రికలలో ఏకాత్మ మానవదర్శన సిద్ధాంతం వగైరాలపై వ్యాసాల పరంపర కొనసాగింది.

బి.వి.కె. ఒక ద్వైమాసిక వార్తాలేఖను ప్రచురిస్తూంటుంది. మానవీయ విషయాలు (హ్యూమానిటీస్), విజ్ఞాన శాస్త్రరంగాలు రెండింటికీ సంబంధించిన అంశాలతోబాటు, వివిధశాఖల కార్యకలాపాల వివరాలు కూడా అందులో ప్రచురిస్తారు. కేరళలోను, బైట ఇదే పద్ధతిలో పనిచేస్తున్న ఇతర సంస్థల కార్యకలాపాల సమాచారాన్ని కూడా ఆ లేఖద్వారా అందిస్తూ ఉంటారు.

వాస్తవ జాతీయదృష్టిని, విలువలను ప్రచారంచేయడంలో క్రొత్తఢిల్లీ లోని డి.ఆర్.ఐ. అగ్రగామిగా నిలిచింది. డి.ఆర్.ఐ. కేంద్రకార్యాలయంలో పరిశోధనలు, ప్రచురణలు, ఇతర అధ్యయన కార్యకలాపాలు నడుస్తూ ఉంటాయి. అక్కడి గ్రంథాలయంలో సంస్కృతి, మతం, అభివృద్ధి మొదలైన విభిన్న విషయాలకు చెందిన 20 వేల విలువైన సంపుటాలు సేకరించబడి ఉన్నాయి.

తత్కాలీన విషయాలపై సంగోష్ఠులు, అభ్యాసవర్గలను డి.ఆర్.ఐ. ఏర్పాటుచేస్తూ ఉంటుంది. ఈ మధ్యకాలంలో నూతన విద్యావిధానం, గంగాప్రక్షాళనం, పంజాబ్ సమస్య, అక్టోబర్ విప్లవం - ప్రపంచ నాగరిక తపై దాని ప్రభావం వగైరా అంశాలపై సదస్సులు జరిగాయి. 'ప్రగతికై మౌలిక ప్రయోగాలు', 'నిర్మాణాత్మక కార్యోద్యమాన్ని సుదృఢపరచడం' వగైరా అంశాలపై అఖిలభారతస్థాయి అభ్యాసవర్గలు జరిగాయి. ఉన్నత శ్రేణి మేధావులు, సామాజిక కార్యకర్తలు దేశంమొత్తంనుండి వాటిలో పాల్గొన్నారు. జయప్రకాశ్ నారాయణ, ఆచార్యకృపలానీ, ఎమ్.సి. చాగ్లా, ఇంకా అనేక జాతీయ నాయకులు డి.ఆర్.ఐ. నిర్వహించిన కార్యక్రమాలనుద్దేశించి ప్రసంగించారు.

కర్ణాటకలో భారతీయ విలువలు, సాహిత్య ప్రచారంపై ఆసక్తి కలిగిన రచయితలు, మేధావులు, సామాజిక కార్యకర్తలు కలిసి ప్రారంభించిన 'రాష్ట్రోత్థానబలగు' (రాష్ట్రోత్థాన సోదరబృందం) కేంద్రాలు 1987 అంతం నాటికి 112 స్థలాలలో విస్తరించాయి. దేశభక్తులు, సాధుసంతులు, వివిధ జీవనరంగాలలోని ప్రముఖుల జయంతులు నిర్వహించడం, నిర్ణీత కాలవ్యవధిలో సంగోష్ఠులు, సదస్సులు, సాహిత్యప్రదర్శన, విక్రయం మొద లైన కార్యక్రమాలను ఈ బృందం నిర్వహిస్తుంది. వివిధ తాలూకా కేంద్రాలలో జరుగుతున్న ఈ కార్యక్రమాలు ప్రజలకు ఒక పండుగలాంటివి. ఆంధ్రప్రదేశ్‌లో విజయవాడలో ఆలోచనాపరుల కేంద్రంగా 'సమాలోచన' ప్రారంభమైంది. వివిధ విషయాల్లో నిష్ణాతులైన పెద్దలు సమాలోచన కార్యక్రమాల్లో పాలుపంచుకుంటున్నారు.

## విజ్ఞాన శాస్త్రరంగంలో:

బి.వి.కె. కు అనుసంధానంగా ఉన్న 'స్వదేశీ విజ్ఞానశాస్త్ర ఉద్యమం' (Swadeshi Science Movement-SSM) విజ్ఞానశాస్త్ర రంగంలో ఒక పెద్ద ప్రయత్నం. మన వైభవోపేతమైన, సుసంపన్నమైన వైజ్ఞానిక పరంపరను గురించి తెలియజెప్పి, మనశాస్త్రజ్ఞులలో ఆత్మనిర్భరతను నిర్మాణంచే యడం ఎస్.ఎస్.ఎం. ప్రధానలక్ష్యం. తద్వారా మనదేశానికి అనుకూలమైన

స్వతంత్ర శాస్త్రీయ, సాంకేతిక దృక్పధాన్ని అనుసరించే సామూహిక సంకల్పం, దృఢనిశ్చయం వారిలో నిర్మించేందుకు అవకాశం ఏర్పడుతుంది. విజ్ఞానశాస్త్రమంటే పచ్చి భౌతికవాదం కాదని; విజ్ఞానం, ఆధ్యాత్మికతలు పరస్పర విరుద్ధాలు కావని; అవి నిజానికి పరస్పర పూరకాలని; భారతీయులది ఎన్నడూ సమగ్ర ఏకాత్మదృష్టేనని; ఆధునికత అంటే పాశ్చాత్యఅనుకరణగా భావించరాదని - నచ్చజెప్పడానికి ఎస్.ఎన్.ఎం. ప్రయత్నిస్తోంది.

ప్రముఖ భౌతికశాస్త్రవేత్త సర్ సి.వి. రామన్ (1888-1970) జన్మదినం అయిన నవంబర్ 7వ తేదీన ఎస్.ఎన్.ఎం. 'జాతీయ విజ్ఞానశాస్త్ర దినోత్సవం'గా నిర్వహించడం ప్రారంభించింది. వివిధ ఇతర రాష్ట్రాలలో కూడా ఆ కార్యక్రమం నిర్వహిస్తున్నారు. 'జాతీయ విజ్ఞానశాస్త్రదినం'గా ఆ రోజును ప్రకటించమనికోరుతూ కేంద్రప్రభుత్వ శాస్త్ర, సాంకేతిక శాఖకు విజ్ఞప్తులను పంపించారు. ఈ ప్రయత్నాల ఫలస్వరూపంగా కావచ్చు, అనతికాలంలోనే అధికారులలో కదలిక వచ్చింది. ఆ ప్రతిపాదనను కొద్దిగా మార్పుచేసి సర్ సి.వి.రామన్ నోబెల్ బహుమతిపొందిన రోజును 'జాతీయ విజ్ఞానశాస్త్ర దినం'గా ప్రకటించారు.

## ప్రచారసాధనాల ద్వారా సరియైన దృక్పథం:

సంఘ తంత్రంయొక్క సారమంతా దాని నిశ్శబ్ద, నిత్య సంస్కార నిర్మాణ ప్రక్రియలోనే ఉంది. అయితే తక్షణ జాతీయ పరిణామాల గురించి ప్రజలకు ప్రబోధించవలసిన అవసరాన్ని సంఘమెన్నడూ ఉపేక్షించలేదు. 1947 కల్లోల దినాలలో జాగృత భారతపు నిర్భయ కంఠస్వరంలా క్రొత్తఢిల్లీలో ఆర్గనైజర్ పత్రిక ఆవిర్భావం ఆవిధంగా జరిగినదే. సత్యాన్ని, న్యాయాన్ని దృఢంగా సమర్థించే ధోరణికారణంగా అనేకసార్లు ప్రభుత్వ ఆగ్రహానికి ఆ పత్రిక గురిఅయింది. గాంధీజీ హత్యసందర్భంగా సంఘాన్ని హింస, అసత్యం, దుష్ప్రచారాల ప్రవాహం ముంచెత్తినవేళ న్యాయంకోరుతూ ఆర్గనైజర్ శంఖారావం చేసింది. తిరిగి 1975-77 అత్యవసరపరిస్థితి సమయంలో మొట్టమొదట సీలుచేయబడిన పత్రిక ఆర్గనైజర్. మొట్టమొదటిగా 'మీసా' (ఆంతరంగిక భద్రతా చట్టం) క్రింద అరెస్ట్ చేయబడిన వ్యక్తి ఆ పత్రిక సంపాదకుడే.

1947 తరువాత హిందీలో పాంచజన్య వారపత్రికను, రాష్ట్రధర్మ మాసపత్రికను, వివిధ ప్రాంతీయభాషలలో అనేక పత్రికలను స్వయంసేవకులు వెలువరించడం ప్రారంభించారు. ఈనాడు ఏ పెద్దభాషకూడా ఈ దిశలో మిగిలిపోలేదు. ఆంధ్రప్రదేశ్‌లో జాగృతి వారపత్రిక జాతీయ భావాల

ప్రచారానికై ప్రారంభించబడింది. రాష్ట్రంలో జాతీయ భావాలకు అనుగుణంగా అభిప్రాయనిర్మాణం చేయటంలో జాగృతి ప్రముఖపాత్ర వహిస్తున్నది. దినపత్రికల రంగంలో కూడా హిందీలో 'యుగధర్మ', మరాఠీలో 'తరుణభారత్'లతో మహారాష్ట్ర, హిందీలో 'స్వదేశ్'తో మధ్య ప్రదేశ్‌లు అనేక కేంద్రాలనుండి ప్రచురణలుసాగిస్తూ చెప్పుకోదగ్గ ప్రగతిని సాధించాయి. స్థానిక స్వయంసేవకుల ఉత్సాహంవల్ల అనేక ప్రాంతాలలో చిన్నస్థాయి దినపత్రికలు కూడా ప్రారంభమయ్యాయి. ఆ తరువాత, పెద్దసంఖ్యలో గ్రామాలకు అందేవిధంగా పాక్షిక సమాచార పత్రాలను అనేకచోట్ల ప్రారంభించారు. వి.హిం.ప., అ.భా.వి.ప., కిసాన్ సంఘ్, కళ్యాణాశ్రమంలాంటి వివిధ సంస్థలు ప్రచురించే పత్రికలు, వార్తాలేఖలు కూడా వివిధ వర్గాల ప్రజల ఆదరణను విశేషంగా చూరగొన్నాయి. ఉదాహరణకు, గుజరాత్‌లో వి.హిం.ప. వెలువరించే పత్రిక ప్రసారం 40 వేల ప్రతులు దాటింది. మహారాష్ట్రలో 'సంస్కృతి వార్తాపత్రిక' యొక్క 30 వేల ప్రతులు 13 వేలగ్రామాలకు చేరుతున్నాయి.

దాదాపు ప్రతిప్రాంతంలోను స్వయంసేవకుల ఆధ్వర్యంలో ఒక పుస్తకముద్రణ కేంద్రం స్థాపితమైఉంది. హిందీలో లక్నోలో రాష్ట్ర ధర్మప్రకాశన్; న్యూఢిల్లీలో సురుచిప్రకాశన్; జైపూర్‌లో జ్ఞానగంగా ప్రకాశన్; మరాఠీలో నాగపూర్, పుణెలనుండి భారతీయ విచార్ సాధన అనేక విలువైన పుస్తకాలను ప్రచురించాయి. ఆంధ్రప్రదేశ్‌లో నవభారతి సంస్థ పుస్తక ప్రచురణరంగంలో ప్రభావవంతమైన పాత్ర నిర్వహిస్తున్నది. ఇంతవరకు 120కి పైగా పుస్తకాలను ప్రచురించింది. వర్తమాన సమస్యలపై అది ప్రచురిస్తున్న జ్వాలాతోరణం పుస్తకాలు ప్రాంతంలో మంచి ప్రభావాన్ని కలుగజేస్తున్నాయి. దేశంలోని అన్ని ప్రధాన భాషలలోను వివిధ కేంద్రాలనుండి ప్రచురితమౌతున్న సాహిత్యంలో మనచరిత్రలోని వైభవపూర్ణ అధ్యాయాలు, ఆలోచనలను రేకెత్తించే వ్యాసాలు, పాటల సంకలనాలు, తత్కాల జాతీయ సమస్యలపై అవగాహన కల్పించే ప్రేరణదాయక రచనలు, చరిత్ర గాథలు మొదలైన ఇతివృత్తాలు ప్రధానంగా ఉంటున్నాయి. శ్రీ గురూజీ ఆలోచనల సంకలమైన సుమారు 700 పుటల 'ది బంచ్ ఆఫ్ థాట్స్' పుస్తకం అన్ని ప్రధాన భారతీయ భాషల్లోకి అనువదించబడింది. శ్రీ హెచ్.వి. శేషాద్రి రచించిన 'ది ట్రాజిక్ స్టోరీ ఆఫ్ పార్టిషన్', శ్రీ కె. ఆర్. మల్కానీ వ్రాసిన 'ది ఆర్.యస్.యస్. స్టోరీ' పుస్తకాలు విస్తృతస్థాయిలో పాఠకలోకాన్ని చేరుకున్నాయి. మొదటి పుస్తకం వివిధ భాషలలోకి అనువదింపబడింది

కూడా. నాగపూర్‌లోని బాబాసాహెబ్ ఆప్టే స్మారకసమితి హిందీలో ప్రచురించిన 6 సంపుటాల 'శ్రీ గురూజీ సమగ్ర వాఙ్మయ'; బొంబాయి, ఢిల్లీలనుండి మరాఠీ, ఇంగ్లీష్‌లలో వెలువడిన పండిత దీనదయాళ్‌జీ ఉపాధ్యాయ జీవితం, ఆదర్శాల 7 భాగాల పుస్తకాలు కొన్ని ముఖ్యమైన ప్రచురణలు. సకాలంలో బెంగుళూరులోని జాగరణ ప్రకాశన్ ప్రచురించిన 'ది వార్నింగ్ ఆఫ్ మీనాక్షీపురం', 'సమ్ క్వశ్చన్స్ టూ పోప్' పుస్తకాలు ఒక్కొక్కటి లక్షకు పైగా ప్రతులు అమ్ముడుపోయాయి. అనేకభాషల లోకి అనువాదం అయ్యాయి కూడా. జాతిహితంకోసం, ప్రజాస్వామ్య విలువల పరిరక్షణకోసం వార్తలు, వ్యాఖ్యానాలను నిర్భయంగా ప్రకటించిన నేరానికి మూల్యంగా అత్యవసరపరిస్థితి సమయంలో (1975-77) ఈ ప్రచురణలు, ప్రచురణకేంద్రాలనేకం బలవంతంగా మూసివేతకు గురిఅయ్యాయి.

1965లో స్వయంసేవకులు ప్రారంభించిన రాష్ట్రోత్థానపరిషత్ శాఖ అయిన 'రాష్ట్రోత్థాన సాహిత్య', స్వాతంత్ర్యానంతర కాలఖండంలో అద్భుతము, అనితరసాధ్యము అయిన పద్ధతిలో కర్ణాటకలో జాతీయ సాహిత్యాన్ని ప్రజలలోకి పంపించింది. జాతీయ జీవనంలోని వివిధ అంశాలపై 60 ప్రచురణలు 'సాహిత్య' ముద్రించింది. పుస్తకాలను విడుదలచేసే కార్యక్రమాలుకూడా, పుస్తకాలలోని ఇతివృత్తాలకు పోషకంగా ఉండేవిధంగా, ప్రేరణదాయకంగా జరుగుతూ ఉంటాయి. ఉదాహరణకు, సావర్కర్‌పై ప్రచురించిన 'ఆత్మాహుతి' పుస్తకం భగత్‌సింగ్ తల్లి విద్యావతీదేవి చేతులమీదుగా విడుదల అయింది. చంద్రశేఖర్ ఆజాద్‌పై ప్రచురించిన 'అజేయ' పుస్తకాన్ని ఉత్తరప్రదేశ్‌కు చెందిన ఆయన విప్లవ మిత్రులు ముగ్గురి సమక్షంలో బెంగాల్‌కుచెందిన ప్రముఖ విప్లవకారిణి డా. సునీతా చౌధురి ఘోష్ విడుదలచేసారు. ఆలోచనలను రేకెత్తించే వ్యాసాలసంకలనమైన 'తొర్చెరలు', 'అజేయ' పుస్తకాలకు కర్ణాటక రాష్ట్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 600 పేజీల సమగ్ర, అధికారిక అత్యవసరపరిస్థితి వ్యతిరేక పోరాటగాథ - 'భుగిలు' (అగ్నిశిఖలు) ఎంతో ప్రజాదరణపొందింది. కొద్దినెలల వ్యవధిలోనే 20 వేల ప్రతులు పైగా అమ్ముడయ్యాయి.

పిల్లలకోసం ప్రచురించిన 'భారత భారతి పుస్తకమాల' రాష్ట్రోత్థాన సాహిత్య ప్రతిష్ఠాత్మక ప్రకల్పాలలో ఒకటి. 8 సం.ల వ్యవధిలో 510 పుస్తకాలు అమ్మకానికి సిద్ధంచేసారు. 22,410 పుటలలో మహర్షులు, తత్వవేత్తలు, రాజులు, విప్లవకారులు, శాస్త్రవేత్తలు, క్రీడాకారులు మొద

లైనవారి జీవితచరిత్రలను ఆ పుస్తకాలలో ప్రచురించారు. ఇప్పటివరకు కోటికి పుస్తకాలకు పైగా అమ్ముడుపోయాయి. కర్ణాటక ప్రభుత్వం స్వయంగా ప్రతిపుస్తకాన్ని పెద్దసంఖ్యలో కొనుగోలుచేయడానికి ముందుకు వచ్చింది. కర్ణాటకలోని 12 వేల పాఠశాలలు తమ గ్రంథాలయాలలో ఈ 'భారత భారతి పుస్తకమాల' లోని అన్ని పుస్తకాలను కలిగి ఉన్నాయి.

కన్నడంలో ఈ పుస్తకాలకు లభించిన ఆదరణ నాగపూర్‌లోని బాబా సాహెబ్ ఆప్టే స్మారక సమితికి ఉత్సాహాన్నిచ్చింది. ఇప్పటివరకు భారత భారతి పుస్తకమాలలోని 180 పుస్తకాలను వారు హిందీ-మరాఠీ భాషలలో వెలువరించారు. వాటిలో కొన్నింటిని అనేకసార్లు పునర్ముద్రించారు. మొత్తం 30,000 నుండి 50,000 ప్రతులు ముద్రణ జరిగింది. హిందీలో ప్రచురితమైన అభిమన్యు, ద్రౌపది పుస్తకాలను ఫిజీదేశంలో భారతీయసంతతి పిల్లలకుపాఠ్యపుస్తకాలుగా స్వీకరించారు. తిరుమల తిరుపతి దేవస్థానం 60 పుస్తకాలను ఇంగ్లీష్‌లో ముద్రించి, విక్రయించింది. కొన్ని పుస్తకాలకు లభించిన ప్రజాదరణవల్ల వాటిని ఈ అన్ని భాషలలోను అనేకసార్లు పునర్ముద్రించవలసివచ్చింది. భారత భారతి పుస్తకమాల గుజరాతీ, అస్సామీ, తమిళ భాషలలోకూడా వెలువడడం ప్రారంభమైంది.

## ప్రజాచైతన్యాన్ని రగిలించడం:

'విజిల్', పేరులోనే ఉన్నట్లు ప్రజాసంక్షేమంకోరే జాగృత గళముల వేదిక. అది మద్రాస్‌లో ఆవిర్భవించింది. ఒక జ్యేష్ఠసంఘప్రచారక్ ప్రోద్బలంతో 'విజిల్' మొదట పత్రికలలో సంపాదకలేఖలు వ్రాసేవారు, రేడియోశ్రోతలు, దూరదర్శన్ ప్రేక్షకుల వేదికగా ప్రారంభమైంది. ప్రసారమాధ్యమాలద్వారా జాతీయదృష్టిని ప్రసరింపజేయడంలోను, అన్నిరకాల అన్యాయాలకు వ్యతిరేకంగా గళమెత్తడంలోను విజిల్ సభ్యులు ఉత్సాహంగా పనిచేస్తున్నారు. రచయితలు, కవులకు బోధనాశిబిరాలు నిర్వహించడం ఈ సంస్థయొక్క ప్రముఖ కార్యక్రమాలలో ఒకటి. ప్రముఖ పత్రికారచయితలు చోరామస్వామి, అరుణ్‌శౌరీ, ప్రముఖరచయిత కా.నా. సుబ్రహ్మణ్యం తదితరులు 'విజిల్' కార్యక్రమాలలో పాల్గొన్నారు.

తమిళనాడులోని ప్రసారసాధనాలు రామజన్మభూమి, ఈశాన్యప్రాంతాలసమస్యలకు తగిన ప్రాధాన్యతనివ్వడంలేదని 'విజిల్' గమనించింది. ఆ అంశాలపై బహిరంగ చర్చలను నిర్వహించడంవల్ల అటువంటి ప్రధాన సమస్యలపై ప్రజలకు సమగ్రవివరాలు అందించడానికి అవకాశం కలిగింది.

నగర నీటి సరఫరా కేంద్రానికి సమీపంలో ఒక ఆధునిక వధ్యశాలను

నిర్మించనున్నట్లు ప్రకటన వెలువడగానే, దానివలన వచ్చే కాలుష్యప్రమా దాన్ని గురించి తెలియజేస్తూ సంతకాలను సేకరించడంద్వారా 'విజిల్' నిరసనోద్యమాన్ని నిర్వహించింది. ప్రభుత్వానికి జ్ఞానోదయం అయి, ఆ స్థలాన్ని మార్పుచేసింది. అదేవిధంగా, 1985 జనవరి 1 నాడు దూరదర్శన్ 'రాసలీల' అనే ఒక అశ్లీల చిత్రాన్ని ప్రదర్శించినపుడు ఫోన్లు, తంతులు, ఉత్తరాలు, చివరికి చట్టపరమైన చర్యకు బెదిరింపులవంటి ఉగ్రమైన నిరసన వెల్లువను అది ఎదుర్కోనవలసివచ్చింది. దూరదర్శన్ కేంద్ర అధికారి (డైరక్టర్) దూరదర్శన్‌లో క్షమాపణలు తెలియజేస్తూ, భవిష్యత్తులో అటువంటి సంఘటనలు పునరావృత్తం కానివ్వబోమని హామీ ఇచ్చాడు.

విజిల్ 'లేఖలు' శీర్షికకు వ్రాసే రచయితలను ఒక వినూత్న పద్ధతిలో కలుసుకుంది. వివిధ పత్రికలలో ప్రచురితమైన చిరునామాల ఆధారంగా వారిని సంపర్కించేసేవారు. ప్రజాప్రయోజనాల విషయంలో వారికిగల ఆసక్తిని, దానికి ప్రతిస్పందించే శ్రమ తీసుకోవడాన్ని ప్రశంశించేవారు. సరిక్రొత్త పరిణామాలు, సమస్యలగురించి చర్చించేందుకు నియమితంగా ఒకచోట కలుస్తూ ఉండవలసిందిగా వారిని అభ్యర్థించేవారు. భాషా సమస్యమొదలు, తరచుతలెత్తే మద్రాస్ నగరంలోని మంచినీటి కొరత సమస్యవరకు అనేక అంశాలు చర్చించేవారు. ఫలస్వరూపంగా సమాజం ఎడల నిజమైన ఆవేదనగల వ్యక్తులు విజిల్‌వైపు ఆకర్షితులయ్యేవారు.

ప్రస్తుత తమిళనాడు ప్రభుత్వం స్వీకరించిన హిందీ వ్యతిరేక విధానం తమిళ ప్రయోజనాలకే భంగకరంగా పరిణమించిందని భాషాసమస్యపై విజిల్ నిర్వహించిన సంగోష్ఠిలో వక్త తరువాత వక్త వాదించడం నిర్వా హకులకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది. సంస్కృతం మిళితమైన హిందీని తాము సులభంగా అర్థంచేసుకోగలమని వక్తలు అభిప్రాయపడ్డారు.

## 'యోగ'లపై శాస్త్రీయ పరిశోధన:

దైనందిన జీవనంలో ఎదురయ్యే అనేక సవాళ్ళను ఆధునిక మాన వుడు తట్టుకునేందుకు ఉపకరించే ఒక యోగ్యమైన ఉపకరణంగా యోగను రూపొందించడానికై, వివిధరంగాలలో యోగ పరిశోధనను ప్రారంభించాలని వివేకానందకేంద్ర కృషిచేస్తోంది. ఆధ్యాత్మికతను, యోగను మేళవించి; స్వామీవివేకానందులు దర్శించిన విధంగా - జ్ఞాన, భక్తి, కర్మ, రాజయోగాల మిశ్రమంగా నిర్వహించే యోగశిబిరాలలో సరిక్రొత్తవారి దగ్గరనుండి, అనుభవజ్ఞులైన వారి వరకు అందరికీ యోగ

నేర్పిస్తారు. ఆ శిబిరాలలో పాల్గొన్నవారి నోటి నుండి "మాలో ఒక నూతన దర్శనం ఆవిష్కారం అయింది"; "సరిక్రొత్త జీవన విధానం లోకి మేం త్రొంగిచూడగలిగాం"; "రోజులోని విశ్రాంతిలేని దినచర్యలోనే, విరామం అనుభవించే కళకు సంబంధించిన పాఠాలు నేర్చుకున్నాం" - అనే మాటలు చాలా సాధారణంగా వినిపిస్తాయి. జ్ఞాపకశక్తి వృద్ధిచేసే శిబిరాలు విద్యార్థులు, స్త్రీలు, పెద్దలు ఆఖరికి వృద్ధులలో కూడా చాలా ప్రజాదరణను పొందాయి. మేధాసంపత్తిలో వృద్ధి, స్వరసంస్కృతి, కంటిచూపు అభివృద్ధి, సృజనాత్మకశక్తివృద్ధి, భావనాసంస్కృతి మొదలైన వ్యక్తిత్వవికాసరంగాలలో యోగ సహాయపడుతుంది. బెంగుళూరులో యోగద్వారా మానసికంగా ఎదుగుదలలేని బాలురకు పునరావాసం కల్పించే కేంద్రంకూడా ప్రారంభమైంది.

ఉబ్బసం, నాసికా ఎలర్జీ, కోరింతదగ్గు, చక్కెరవ్యాధి, రక్తపోటు, మానసిక స్తబ్దత, ఆందోళనవల్ల కలిగే నరముల బలహీనత, చిన్న మెదడుకు పక్షవాతాలకు యోగద్వారా చికిత్స కేంద్రలోని నిపుణులు విశేషాధ్యయనం చేస్తున్న ప్రముఖరంగాలలో ఒకటి. వైద్యరంగ చరిత్రలోనే మొట్టమొదటిగా సునిశిత శాస్త్రీయపద్ధతులద్వారా పరిశీలించి యోగకు గల రోగనివారణ సామర్థ్యాన్ని గుర్తించారు. ఉబ్బసం వ్యాధితో బాధపడుతున్న వందలాది రోగుల రోగ చరిత్రను విశ్లేషించి, వాటిపై యోగ ప్రభావాన్ని ఉన్నత అర్హతలు కలిగిన వైద్యులు అంచనావేశారు. ఈ పరిశోధనల ఫలితాలను బ్రిటిష్ మెడికల్ జర్నల్, జర్నల్ ఆఫ్ ఆస్తమా(యు.ఎస్.ఎ.) వంటి ప్రామాణిక పత్రికలు కూడా ప్రచురించాయి. పిల్లలలో హైపర్ కానెటిక్ సింద్రోమ్, ఒత్తిడివల్ల కలిగే తలనెప్పి, స్త్రీలలో డిస్‌ఫంక్షనల్ రక్తస్రావం, దీర్ఘకాలిక నొప్పులు, గుండె నరముల బలహీనత, పోలియో మొదలైన జబ్బులు చక్కగా నయమైన ఉదాహరణలు అనేకం. బెంగుళూరు సమీపంలో రోగులను చేర్చుకునే పూర్తి వసతులు కలిగిన ఒక యోగ్యవైద్యశాల ప్రారంభమైంది. దేశం మొత్తం నుండి, విదేశాలనుండి కూడా అక్కడికి రోగులు వస్తారు.

## ఘోష్ (బ్యాండ్)లో భారతీయత:

సంస్కృతంలో ఘోష్‌గా వ్యవహరింపబడే వాద్యసంగీతంలో భారతీయవిలువలు ప్రవేశపెట్టడానికి పుణె, నాగపూర్, బెంగుళూరులలోని స్వయంసేవకులు ప్రయత్నంచేసారు. ఈ మధ్యకాలం వరకు సైన్యంలో అమలులో ఉన్న పూర్తి పాశ్చాత్యరాగాలను, లిపిని స్వయంసేవకులు

కూడా ఉపయోగిస్తూవచ్చారు. నిజానికి, ప్రారంభదినాలలో స్వయంసేవకులకు ఘోష్ నేర్పించినవారు పదవీవిరమణ చేసిన పోలీస్ బ్యాండ్ శిక్షకులే. అయితే 1952 తరువాత, ఘోష్‌ను హిందూత్వమయం చేయాలన్న ఆలోచన బలపడసాగింది. అనాటినుండి ఇంగ్లీష్ రాగాలస్థానంలో భారతీయరాగాలు ప్రవేశించసాగాయి. ఇంపీరియల్, నో-రిటైర్, మార్చింగ్-ఎలాంగ్, సెకండరీ, జార్జియా, ఐడియల్ వగైరా సంచలన రచనల స్థానంలో తిలక్-కామోద్, దుర్గ, కేదార్, భూప్, హంసధ్వని, జీవన్‌పురి, మార్వా వగైరా భారతీయ రాగాలు ప్రవేశించాయి. పతాకావిష్కరణ సమయంలో డోనావలోన్‌కు బదులుగా ఇప్పుడు వంశీపై రాగేశ్రీని ఉపయోగిస్తున్నారు. 'ఓం నమోస్తుతే ధ్వజాయ, సకల-భువన-జన-హితాయ, విభవ-సహిత-విమల-చరిత-బోధకాయ, మంగలాయ తే సతతమ్' "ఓ భగవాధ్వజమా! నీకు వందనాలు. (నీవు) సమస్తమానవాళి హితకారకురాలివి. వైభవాన్వితవు. స్వచ్ఛమైన శీలంగలదానవు. జ్ఞాన ప్రదాయినివి. శుభదాయినివి" అనే సంస్కృత చరణం భగవాధ్వజం ప్రకటీకరించే సాంస్కృతిక సందేశాన్ని సరిగ్గా ప్రతిబింబిస్తోంది.

ఈనాడు వంశీ రచనలను (పాతాలు) పూర్తిగా హైందవీకరించారు. స్వాగత ప్రణామ్, సర్ సంఘచాలక్ ప్రణామ్, ఆద్యసర్‌సంఘచాలక్ ప్రణామ్, ధ్వజ ప్రణామ్, ప్రత్యుత్పచలనమ్ మొదలైన ప్రణామ్‌లన్నీ పూర్తిగా భారతీయమైనవే.

అనేక శంఖ(బిగుల్) రచనలనుకూడా భారతీయకరణ చేసారు. ఫార్వర్డ్, అడ్వాన్స్, మార్‌నే వగైరా పాశ్చాత్య సంచలన రచనలతో సమానంగా కళ్యాణ్, చేతక్, దత్తాత్రేయ, కావేరీ మొదలైన భారతీయ రచనలు కూడా రూపొందాయి. వంశీ, శంఖ, ఆనక్ (సైడ్‌డ్రమ్)లకు ఉపయోగించే లిపి, తాళాల విషయంలో కూడా ఇదే జరిగింది.

వివిధ వాద్యాలకు హైందవనామాలు పెట్టడం మరింత సులభమైన పనిఅయింది. శంఖ (బిగుల్), వంశీ (ఫ్లూట్-మురళి), ఆనక్ (సైడ్‌డ్రమ్), పణవ (బేస్‌డ్రమ్), త్రిభుజి (ట్రైయాంగిల్), ఝుల్లరీ (పెద్ద తాళాలు), శృంగ (కార్నెట్), స్వరద (క్లారినెట్) మొదలైన పేర్లన్నీ 'నాదశాస్త్ర రత్నాకర', భగవద్గీతలోని మొదటి అధ్యాయంలలో ంండి స్వీకరించారు. గీతలో..

"తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః

సఘోషో ధార్త రాష్ట్రానాం" అని ఉంది.

ఆసియాక్రీడల సమయంలో వంశీపై భూపరాగంలో రూపొందించిన 'శివరాజ' రచనను వాదనం చేసారు. ప్రభుత్వస్థాయిలోకూడా అలాంటి అనేక ఇతర భారతీయ రచనలు, రాగాలను ప్రవేశపెట్టడానికి అది మార్గం సుగమంచేసింది.

ఘోష్‌లో స్వయంసేవకులు సాధించే రాగబద్ధత, స్వరసమ్మేళనాలు వారిలో క్రమశిక్షణ నిర్మాణానికి సాధనాలుగాకూడా ఉపయోగపడతాయి. 1973లో బెంగుళూరులో జరిగిన ఒక కార్యక్రమంలో 300 మంది స్వయంసేవకులు ఒకే ఘోష్‌దళంగా పథసంచలనం చేయడం అనే ఆలోచన ఒక సైనిక కమాండర్‌ను ఆశ్చర్యంలో ముంచెత్తింది. "అంత పెద్ద సంఖ్యలో స్వరసమ్మేళనం సాధించడం చాలాకష్టమని నాకు తెలుసు. మేమే సైన్యంలో ఇంతవరకు అలాంటి పెద్దప్రయత్నం చేయలేదు. దానికి ఉత్సాహం, క్రమశిక్షణ, కల్పనలతో కఠోరమైన శిక్షణ అవసరం" అన్నాడాయన.

## 13

# జాతీయ గౌరవ చిహ్నాల పరిరక్షణ

స్వాతంత్ర్యపు తొలి వెలుగులు ప్రసరించడం ప్రారంభించగానే ఇక ఒకనాడు స్వాతంత్ర్య పోరాటంలో మన ప్రజలకు అమరమైన ప్రేరణ స్రోతస్సులుగా పనిచేసిన అన్ని చిహ్నాలు, నినాదాలు మరింత ఉజ్వలంగా ప్రకాశిస్తాయని ఊహించాం. అయితే, వ్యవహారం అంతా అందుకు భిన్నంగా సాగింది. ఆ చిహ్నాలన్నీ రానురాను ప్రజల హృదయాలలోనుండి అదృశ్యం కాసాగాయి.

## మధుర రాగాలకు మరల ప్రాణప్రతిష్ఠ

ఆనాటి 'భారత్ మాతాకీ జయ్', 'వందేమాతరం' నినాదాలు కేవలం ప్రజలలో రణాగ్నిలోకి దూకే ఉద్రేకం రగిలించే యుద్ధ నినాదాలు మాత్రమే కాదు. అత్యంత పవిత్ర, ప్రియ మాతృభూమి యొక్క సజీవ చైతన్య స్వరూపాన్ని జాతి హృదయం ముందు సాక్షాత్కారింపజేసినవి అవే. ప్రజలు కుల, వర్గ, ప్రాంత, భాషాది అడ్డుగోడలను దాటి ముందుకు దూకడానికి, ఒకే సమాన ప్రచండ జాతీయ మహాయజ్ఞంలో భుజాలు కలిపి ముందుకు సాగడానికి అవి జాగృతి కేంద్రాలుగా పనిచేశాయి. సంక్షిప్తంగా చెప్పాలంటే, ఆ వాక్యాలు జాతి హృదయ స్పందనలకు ప్రతిస్పందనలు అయ్యాయి. ఒక సమైక్య సమగ్ర, సమరసతాపూర్ణ జాతీయ చైతన్యపు మూలాధారాలను అవి పెంచి పోషించాయి.

దేశమంతటా నిత్యం సంఘ శాఖలలో ప్రార్థన చివరలో ఉచ్చరించే స్వచ్ఛమైన, పవిత్రమైన ఈ 'భారత్ మాతాకీ జయ్' మంత్రం గత కాలపు భావోద్వేగాన్ని పునరుజ్జీవింపజేస్తుంది. స్వయంసేవకులు పనిచేస్తున్న వివిధ సంస్థలలో కూడా- రాజకీయ, పారిశ్రామిక, విద్య, సాంస్కృతిక, ధార్మిక క్షేత్రాలలో, పెద్దపెద్ద పట్టణాలలో మాత్రమేకాక సుదూర వనవాసీ ప్రాంతాలలో కూడా- కోటికోటి కంఠాలలో ఇవే స్వచ్ఛ మంత్రాలు

'భారత్ మాతాకీ జయ్', 'వందేమాతరం'లు మార్మోగుతున్నాయి.

అనూహ్య రీతిలో కమ్యూనిస్టు వర్గాలలో కూడా వీటి ప్రభావం స్పష్టంగా కనబడింది. తిరువనంతపురంలో జరిగిన భారత ప్రజాస్వామ్య సమాఖ్య సమ్మేళనాన్ని యువకులు 'భారత్ మాతాకీ జయ్' నినాదాలతో మార్మోగించారు.

విద్యార్థిలోకాన్ని ఒక గొప్ప జాతీయ ప్రాధాన్యతగల అంశంపై ఉద్యమింపజేసేందుకు 1949లో అ.భా.వి.ప. ఆవిర్భావం జరిగింది. అప్పుడప్పుడే దేశ విహంగం స్వాతంత్ర్యపు రెక్కలు విప్పుకుంటున్న రోజులవి. స్వతంత్ర భారతానికి ఒక నూతన రాజ్యాంగాన్ని రూపొందించడంలో రాజ్యాంగ నిపుణులు తలమునకలుగా ఉన్నారు. అయితే సామాన్య ప్రజానీకాన్ని వారికి సంబంధించిన రాజ్యాంగంలోని అనేక అంశాలలో భాగస్వాములను చేసే ప్రయత్నం మాత్రం జరుగలేదు.

సంఘంతో సంబంధంగల కొందరు మేధావులు, విద్యావేత్తలు, విద్యార్థినేతలు 1949లో ఒకచోట సమావేశమై ప్రజాభిప్రాయ సేకరణకు పిలుపునిచ్చారు. మూడు ప్రశ్నలపై తమ అభిప్రాయాలను వెలిబుచ్చమని ప్రజలను వారు కోరారు. "ఈ దేశం పేరు భారత్ ఉండాలా లేక ఇండియానా?", "అనుసంధాన భాషగా హిందీ ఉండాలా, లేక ఆంగ్లమా?", "జాతీయగీతంగా 'వందేమాతరం' ఉండాలా, లేక జనగణమన ఉండాలా?". మూడు అంశాలు ప్రజల దైనందిన జీవితం, కట్టుబాట్లతో సన్నిహిత సంబంధం కలిగి ఉన్నట్టివి. వీటిపై దేశం మొత్తంలో 10 లక్షల సంతకాలు సేకరించారు. 99 శాతం ప్రజలు భారత్, హిందీ, వందేమాతరంలకు నిర్ద్వంద్వంగా సమర్థన తెలిపినట్లు వెల్లడైంది. రాజ్యాంగ సమితి అధ్యక్షుడైన బాబు రాజేంద్రప్రసాద్‌కు ఒక పెద్ద విజ్ఞాపనను సమర్పించారు. ప్రజాభిప్రాయం యొక్క ఈ ప్రభావ శాలి అయిన ప్రకటీకరణ యొక్క ముద్ర ఈ విషయాలపై నిర్ణయాలు చేసే సమయంలో రాజ్యాంగ నిర్మాతలపై పడి తీరిందని ఎవరైనా ఊహించగలరు.

## భగవాధ్వజం:

తరతరాలుగా భారతదేశం యొక్క జాతీయ సంస్కృతి, సంప్రదాయాల పవిత్ర చిహ్నంగా భగవాధ్వజం ఉంటూ వచ్చింది. డా. హెడ్గేవార్ సంఘాన్ని ప్రారంభించినపుడు, స్వయంసేవకుల ముందు జాతీయాదర్శాల ఉన్నత చిహ్నంగా దానిని ప్రతిపాదించారు. దానిలో వారు

గురువును దర్శించారు. వ్యాస పౌర్ణమి దినాన గురుపూజ పరంపరను ప్రారంభించారు. స్వయంసేవకులు ధ్వజం ముందు తమ భక్తిపూర్వక సమర్పణ అర్పించే దినం అది. బి.ఎం.ఎస్., అ.భా.వి.ప., కళ్యాణాశ్రమం, బి.కె.ఎస్., వి.హిం.ప. వంటి వివిధ ప్రజా ఉద్యమాలలో కూడా ఆనాటి కాషాయ పతాకాలే దర్శనమిస్తున్నాయి. దేశమంతటా శాఖలలో ప్రతినిత్యం పందల వేల స్థలాలలో భగవాధ్వజాలు ఎగురుతున్నాయి. ప్రత్యేక సందర్భాలలో ఈ సంస్థలు వాటిని సామూహిక రూపంలో ప్రదర్శిస్తూ ఉంటాయి. అలా ప్రజల హృదయాలలో భగవాధ్వజం ఒక అద్భుత జాతీయ చిహ్నంగా విశిష్టస్థానాన్ని సంపాదించుకుంది.

భగవాధ్వజానికి గట్టి సవాలు కార్మికరంగంలో ఎదురైంది. ఎందుకంటే ప్రపంచ కార్మిక రంగమంతా చాలాకాలంగా ఎఱ్ఱ జెండాల ఆధిపత్యంలోనే మునిగి ఉంది. కానీ బి.ఎం.ఎస్. భగవాపతాకాన్ని స్వీకరించింది. విశ్వకళ్యాణానికి ప్రాతినిధ్యం వహించే సంప్రదాయ జాతీయ చిహ్నంగా దానిని గట్టిగా సమర్థించింది. కాషాయం ఇప్పుడు చాలా ప్రజాదరణ పొందింది. బి.ఎం.ఎస్. కార్యక్రమాలన్నింటిలోనూ అదే శోభాయమానంగా ఎగురుతూ ఉంటుంది. 1981 మార్చిలో బి.ఎం.ఎస్. 6వ జాతీయ సమ్మేళనం వామపక్షాల ఆధీనంలో ఉన్న కలకత్తాలో జరిగినపుడు, కలకత్తా వీధులగుండా బి.ఎం.ఎస్. కార్యకర్తలు పెద్ద ఊరేగింపు జరిపారు. ఊరేగింపులో వేలాది కార్మికుల చేతులలో తాము మామూలుగా ఇంతకాలం చూస్తూ వచ్చిన ఎఱ్ఱజెండాల స్థానంలో కాషాయ జెండాలు ప్రత్యక్షమవడం ఆశ్చర్యంగా తిలకించారు కలకత్తా ప్రజానీకం. ఇదొక సరికొత్త పరిణామమని కలకత్తాలో ప్రముఖ పత్రికలు వ్యాఖ్యానించాయి.

## గోవు-పవిత్ర చిహ్నం:

యుగయుగాలుగా గోవు భారతీయుల శ్రద్ధా గౌరవాలకు కేంద్రంగా ఉంటూ వచ్చింది. స్వాతంత్ర్య పోరాటంలో కూడా అది ఒక ప్రముఖ విషయంగానే ఉంది.

ఈ విషయంలో ప్రచండమైన జాతీయనిష్ఠను గమనించిన హుమయూన్, అక్బర్‌వంటి మొగలు చక్రవర్తులు సైతం గోవధపై నిషేధం విధించారు. మొగలాయిలు, బ్రిటిష్ పరిపాలన కాలంలో దురాక్రమణకారుల చేతుల్లో నుండి గోమాతను రక్షించడం కోసం సాగిన త్యాగ బలిదానాల రోమాంచక గాథలు మనదేశ చరిత్రలో అనేక పుటలను తమ

స్వంతం చేసుకున్నాయి. తరువాతి కాలంలో స్వాతంత్ర్యోద్యమానికి సారథ్యం వహించిన మహాత్మాగాంధీ, లోకమాన్య తిలక్ వంటి నాయకులు సైతం గోరక్షణను స్వరాజ్య సాధనతో ముడిపడి వున్న ప్రధానమైన ప్రశ్నగానే చూచారు. స్వతంత్ర భారతదేశం చేసే మొట్టమొదటి చట్టం గోవధ నిషేధం కావాలని తిలక్ ప్రకటించారు. గాంధీజీ గోరక్షణకు స్వరాజ్యంకంటే అధిక ప్రాధాన్యత నిచ్చారు. డా. హెడ్గెవార్ సైతం గోమాతకు ఏ చిన్న అవమానం లేదా ప్రమాదం జరిగినా దానిని తీవ్రంగా ప్రతిఘటించారు.

స్వాతంత్ర్యానంతరం, మన రాజ్యాంగ నిర్మాతలు గోసంరక్షణను మన నిర్దేశక సూత్రాలలో ఒకటిగా చేర్చారు. కానీ అది కాగితాల వరకే పరిమితమై పోయింది. రోజురోజుకు గోవధ మరింత పెద్ద ఎత్తున జరుగుతున్నది.

గో సంరక్షణ కేవలం ఆర్థిక సంబంధమైన ప్రశ్నకాదని, అది మన పవిత్ర సంస్కృతికి కేంద్రమని, మన జాతీయ ఏకాత్మతకు సంకేతమని 1952లో జరిగిన సంఘ అఖిల భారతీయ ప్రతినిధి సభ ఒక తీర్మానంలో నొక్కి వక్కాణించింది. దేశంలోని కోట్లాది ప్రజల మనోభావాలను శక్తివంతంగా ప్రకటించేందుకు, ఈ గో సంతతి వధపై నిషేధాని విధించడం ప్రభుత్వానికి తప్పనిసరి అయ్యేటట్లు చేసేందుకు, ఉద్యమ చేపట్టమని స్వయంసేవకులకు ప్రతినిధి సభ పిలుపునిచ్చింది.

శ్రీ గురూజీ తన ప్రకటనలో ఇలా అన్నారు: "సుదీర్ఘ పోరాట తదుపరి జాతి విదేశీ ఆధిపత్యం నుంచి తనను తాను స్వతంత్ర చేసుకుంది. వైభవసంపన్నమైన తన జాతీయ సంప్రదాయాలను పునర్ని ర్మించడం, అపవిత్రం చేయబడిన తన శ్రద్ధా కేంద్రాలను పునరుద్ధరించడం ప్రస్తుతం దాని ప్రధాన కర్తవ్యాలు. ఏ జాతి దీనిని సాధించడంలో విఫలమౌతుందో లేదా ఈ దిశలో తన కర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేస్తుందో, ఆ జాతి తాను ఎంతో కష్టించి సంపాదించుకున్న స్వాతంత్ర్య ఫలితాలను ఏమాత్రం అనుభవించలేదు."

సంఘం ఇచ్చిన ఈ పిలుపునందుకుని దేశమంతటా 1952 గోకులాష్టమి నుండి మొదలుకొని వందలాది బహిరంగ సభలు జరిగాయి. అన్ని రాజకీయ పక్షాలను కలుపుకుని ఉద్యమం త్వరలోనే ఉధృత రూపం దాల్చింది. వక్తలుగాను, సంతకాలు చేయడంలోను అనేకమంది ముస్లింలు, క్రైస్తవులు సైతం పాల్గొన్నారు. ఇదంతా హిందువుల వ్యవహారం అనే అసత్యాన్ని వారు చీల్చి చెండాడారు. ఉదాహరణకు కటక్‌లో

బహిరంగసభకు గవర్నర్ శ్రీ సయ్యద్ ఫజల్ ఆలీ అధ్యక్షత వహించారు. గోవు యొక్క పవిత్రతను, ఆర్థిక ప్రాముఖ్యతను కూడా ఆయన నొక్కి వక్కాణించారు. ఈ ఉద్యమ ప్రభావంవల్ల పుణె, ధులియా (ధూల్), భోపాల్, అహమ్మదాబాద్‌లాంటి కొన్ని పురపాలక సంఘాలు తమ పురపాలక పరిధిలో గోవధను నిషేధించాయి.

1952 డిసెంబర్ 7నాడు కొత్త ఢిల్లీలో ఉద్యమానికి ఘనమైన ముగింపు జరిగింది. దేశం నలుమూలల నుండి అద్భుత రీతిలో సేకరించిన సంతకాలతో నిండిన పత్రాల ప్రదర్శన ఆనాటి ఊరేగింపులో ప్రత్యేక ఆకర్షణ అయింది. 22 ఎడ్లబండ్ల మీద ప్రాంతాలవారీగా ఆ సంతకాల కట్టలను ఉంచారు. వేలాదిమంది గణవేషధారులైన స్వయంసేవకులు సెకిళ్ళపై, ట్రక్కులలో, కాలినడకన వాటిని అనుసరించారు. అగ్రభాగాన ఒక పెద్ద ఫలకం మీద ప్రాంతాలవారీ సంతకాల సంఖ్య వేసి ఉంది. సుందరమైన గోమాత బొమ్మ కూడా అగ్రభాగాన నిలిచింది. దారిపొడుగునా ప్రజలు దానిని పూలమాలలతో, పూజలతో ముంచెత్తారు.

ఢిల్లీలోని రామలీలా మైదానంలో క్రిక్కిరిసిన లక్షమందికి పైగా జలను ఉద్దేశించి ప్రసంగిస్తూ శ్రీ గురూజీ భారతదేశపు సర్వో ్రత శ్రద్ధాకేంద్రమైన గోమాత యొక్క హత్యాకాండ నిరాఘాటంగా ాగుతున్నంత వరకు ఈ పరిపాలన స్వయం పరిపాలన కాజాలదని ప్రకటించారు.

నాంధారీ సిక్ఖుల గురువైన శ్రీ ప్రతాప్‌సింగ్ మహరాజ్ ఈ సభకు అధ్యక్షత వహించారు. భారతీయ జనసంఘ అధ్యక్షులు, పార్లమెంటులో నేషనల్ డెమొక్రాటిక్ పార్టీ నాయకులు అయిన శ్రీ శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ, అఖిల భారతీయ హిందూ మహాసభ అధ్యక్షుడు బారిస్టర్ ఎన్.సి. చటర్జీ, పంజాబ్ ప్రాంత ఆర్య ప్రతినిధి సభ అధ్యక్షుడు శ్రీ మహాశయ కృష్ణ, గో సేవక్ సమాజ్ కార్యదర్శి శ్రీ హర్దేవ్ సహాయ్, తదితరులు సభలో ప్రసంగించారు.

మొత్తం సంతకాల సేకరణ కేవలం 4 వారాల వ్యవధిలో, పూర్తిగా నిజాయితీతో పూర్తి చేశామని శ్రీ గురూజీ ప్రకటించినపుడు కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. మొత్తం సేకరించిన సంతకాల సంఖ్య 1,75,39,813; సంపర్కం చేసిన గ్రామాల సంఖ్య 81,524. మరునాడు, శ్రీ లాలాహంసరాజ్ గుప్తా వెంటరాగా, శ్రీ గురూజీ రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్‌ను కలుసుకుని కేంద్రం గోవధపై పూర్తిగా చట్టపరమైన నిషేధం విధించాలని కోరుతూ ఒక విజ్ఞాపన పత్రాన్ని అందజేశారు.

ఉద్యమ వివరాలను కూడా ఆయనకు తెలియజెప్పారు. గో సంరక్షణ కోసం ప్రభుత్వం తీసుకునే ఏ కార్యక్రమానికైనా సహకరించేందుకు తాము సిద్ధంగా ఉన్నామని శ్రీ గురూజీ ఆయనకు తెలియజేశారు.

## స్వామివివేకానందునికి స్మారకం:

1963లో ఆధునిక కాలపు జాతీయ పునరుజ్జీవనోద్యమానికి సింహసదృశ నాయకుడైన స్వామి వివేకానంద జన్మశతాబ్ది యొక్క ప్రేరణదాయక ఘడియలు సమీపిస్తున్నకొద్దీ స్వయంసేవకులు కన్యాకుమారి తీరంలో సముద్రంలో గల రాతిపై వారికి ఒక భవ్యస్మారకం నిర్మించాలన్న ఆకాంక్షను వ్యక్తం చేయసాగారు. స్వామీజీ మూడు రోజులపాటు తీవ్ర ధ్యానంలో మునిగిపోయి, తన చారిత్రాత్మక జీవనవ్రతాన్ని దర్శించుకున్నది అక్కడే. ఆనాటినుండి ఆ రాతిని 'వివేకానందశిల'గానే వ్యవహరిస్తున్నారు.

అయితే, ఆదిలోనే పెద్ద సవాలు ఎదురైంది. కన్యాకుమారి జిల్లాను తమ కంచుకోటగా భావిస్తున్న తమిళనాడు క్రైస్తవ చర్చి ఆ సవాలుకు కారణం అయింది. తీరం వెంబడి ఉన్న దాదాపు అందరు మత్స్యకారులు క్రైస్తవం స్వీకరించినవారే. దక్షిణ సముద్రాలలో వారి పడవలే రాజ్యం చేస్తూంటాయి. హిందూ జాగృతి యొక్క ఏ చిన్న సంకేతం కనబడినా అది తమ సార్వభౌమాధికారానికి సవాలుగా చర్చి భావిస్తూ ఉంటుంది.

వివేకానంద శిలపై స్వామి వివేకానందునికి భవ్యస్మారకం నిర్మించాలని జాతి మొత్తం నిర్ణయిస్తే, చర్చి ఆ ప్రయత్నాన్ని విఫలం చేయడానికి అన్ని రకాలుగా కుట్రలు పన్నసాగింది. తమిళనాడు ప్రభుత్వం ఆ శిలను వివేకానంద శిలాస్మారక సమితికి అప్పజెప్పిన తరువాత 1963లో సమితి అక్కడ ఒక స్మారక ఫలకాన్ని నిర్మించింది. కానీ క్రైస్తవ మత మౌఢ్యులు దానిని పగులగొట్టి, ఆ స్థానంలో ఒక పెద్ద కాంక్రీటు శిలువను ప్రతిష్ఠించారు. దానితోబాటు, అదే స్థలంలో సెయింట్ జేవియర్‌కు ఒక స్మారకాన్ని నిర్మించేందుకు కూడా చర్చి ప్రయత్నాలను ప్రారంభించింది. పోర్చుగల్ నుండి వచ్చిన ఈ కుటిలుడైన మిషనరీయే గోవాలోను, తూర్పుతీరంలోను హిందువులను సామూహికంగా మతం మార్చే ఉద్దేశంతో వారిపై అనేక అత్యాచారాలు జరిపించినవాడు.

అయితే, కొందరు ఘటికులైన స్వయంసేవకులు ప్రమాదకర సముద్ర జలాలను ఈదుకుంటూ వెళ్ళి, ఆ శిలువను తొలగించి వేశారు. వెంటనే ప్రభుత్వం శిల చుట్టుప్రక్కల 144వ సెక్షను క్రింద నిషేధాజ్ఞలు విధించింది. దానివలన ప్రభుత్వంతో చర్చలు సాగించడానికి

మరింత సానుకూలత ఏర్పడింది. అనతికాలంలోనే స్మారక నిర్మాణం ప్రారంభమైంది.

మన్నాథ్ పద్మనాభన్ అధ్యక్షులుగా, దేశంలోని ప్రముఖ వ్యక్తులు కార్యవర్గ సభ్యులు, ఇతర సభ్యులుగా జాతీయ స్మారక కమిటీ ఏర్పడింది. దేశమంతటా విస్తరించిన శాఖల మాలిక కలిగిన సంఘం ఈ ఉద్యమంలో పూర్తిగా సహకరించాలని నిర్ణయించడంతో ఈ మహత్తర జాతీయ స్మారక నిర్మాణంలో భాగస్వాములయ్యేందుకు వేలాదిమంది యువకులకు అవకాశం లభించింది. అంకిత భావంతో స్వయంసేవకులు ఉద్యమ రూపంలో చేసిన ప్రయత్నాలు స్వామి వివేకానందుని చైతన్యదాయకమైన సందేశంతో లక్షలాది దేశ ప్రజలను ఉర్రూతలూగించడంలో కృతకృత్యం అయ్యాయి. స్మారక పథకపు అతి పెద్దదైన నిధి లక్ష్యాన్ని పూరించడం కూడా ఉద్యమంలో భాగమే. సంఘం యొక్క పూర్వపు సర్ కార్యవాహ శ్రీ ఏకనాథ్‌రానడేను పూర్తిగా ఈ కార్యం కోసమే నియుక్తం చేయడాన్ని బట్టి సంఘం ఈ ఉద్యమానికి, స్మారక పథకానికి ఎంతటి ప్రాముఖ్యతను ఇచ్చిందో గ్రహించవచ్చు.

1962లో చైనీయుల చేతిలో జాతి పరాభవాన్ని చవిచూసిన కొద్ది రోజులకే ఈ శతాబ్ది ఉత్సవాలు రావడం, స్వామీ వివేకానందుల జీవన యాత్రలో కొట్టవచ్చినట్లు కనబడేభవ్యమైన ఆదర్శాల ఎడల సమర్పణ భావనను, వీరత్వాన్ని మన ప్రజలలో నింపడానికి చక్కని అవకాశంగా పరిణమించింది.

మూడు సంవత్సరాల అనంతరం మరొక ఉద్యమం నిర్వహించారు. ఈసారి ప్రత్యేకంగా యువ, విద్యార్థి వర్గంలో స్వామీ వివేకానందుల వ్యక్తి నిర్మాణ సందేశాన్ని వ్యాప్తి చేయడంపై దృష్టిని కేంద్రీకరించారు. ఒక రూపాయి చిత్రాల అమ్మకం ఉద్యమం యొక్క మరొక విశేషం.

ఈ రెండు ఉద్యమాలలోను ప్రముఖ మేధావులు పాల్గొన్నారు. స్వామీజీ జీవితం, కార్యాలపై ప్రచురించిన పుస్తకాలు, కరపత్రాలు, వేలాదిమందిని చేరాయి. ఈ సందర్భంగా ప్రత్యేకంగా తయారుచేసి, అన్ని ప్రధాన భారతీయ భాషలలోకి అనువదించిన స్వామి వివేకానంద 'రౌజింగ్‌కాల్ టు హిందూ నేషన్' అనే సంకలనం విద్యావంతులైన యువకులకు విశేష ఆకర్షణ అయ్యింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో మంత్రులు, ముఖ్యమంత్రులు, గవర్నర్లు, ఉత్సవాలలో పాల్గొన్నారు. దేశమంతటా వేలాది కళాశాలలలో విద్యార్థులు భారతదేశ హిందూ సన్యాసి

అని అమెరికాలో ప్రఖ్యాతి నొందిన స్వామి వివేకానందుని హృదయాలను ఉర్రూతలూగించే సందేశాలను విన్నారు.

కొన్ని పారిశ్రామిక, వ్యాపార సంస్థలతోబాటు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు కూడా స్మారకానికి నిధులను ఇచ్చాయి. ఈ విశిష్టజాతీయ ప్రకల్పానికి తమ శక్తిని కూడా అర్పించేందుకు పురపాలక సంఘాలు, స్థానిక సంస్థలు, రోటరీ, లయన్స్, ఇతర సంస్థలు ముందుకు వచ్చాయి. అయితే ప్రధాన భాగం మాత్రం సామాన్య జన సముదాయం సమర్పించిన చిన్న మొత్తాల ద్వారా లభించినదే. ప్రతిప్రాంతం, ప్రతి జిల్లా, ప్రతి తాలూకా ఈ నిధి సేకరణోద్యమంలో వెనువెంటనే ముందుకు దూకాయి.

నేడు మనోహర శిల్పసౌందర్యంతో విరాజిల్లుతున్న ఆస్మారకం అతి తక్కువ సమయంలో తయారైంది. రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి 1970 సెప్టెంబర్ 2 వ తేదీన జరిగిన భవ్యమైన ప్రారంభోత్సవ కార్యక్రమాన్ని స్వయంగా తిలకించారు. తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి ఆనాడు అధ్యక్షత వహించారు. నాటి నుండి దేశం మూలమూలల నుండి, ప్రపంచం మొత్తం నుండి కూడా ప్రతినిత్యం స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు ఒక మహా ప్రవాహంలా అక్కడికి వస్తూనే ఉంటారు. వారు కేవలం సందర్శకులుగా మాత్రమే అక్కడకు వెళ్ళరు. జీవన సందేశాన్ని వెదుక్కునే యాత్రికులుగా వారక్కడికి వెళ్తారు. మూడు మహాసాగరాల సంగమస్థానంలో, పవిత్ర హిందుభూమియొక్క ఆధ్యాత్మిక పరంపరలో పెంచి పోషించిన ఉన్నత, ఉదాత్త మానవవిలువలను తనలో నింపుకున్న మహావ్యక్తిత్వాన్ని ప్రకటీకరిస్తూ వెలుగొందుతున్న ఆస్మారకం సమస్త మానవాళికి ఆశ, విశ్వాసాల దీప స్తంభంలాంటిది.

ముఖ్యంగా యువకులలో వివేకానందునిపై పెరుగుతున్న గౌరవం నేపథ్యంలో స్వామీజీ జన్మదినమైన జనవరి 12 వతేదీని దేశమంతా యువజన దినంగా పరిగణించాలని భారత ప్రభుత్వం చేసిన ప్రకటన ఎంతో సముచితమైనది.

## ఛత్రపతి శివాజీ స్మారకం:

1974లో జరిగిన ఛత్రపతి శివాజీ పట్టాభిషేక మహోత్సవ త్రిశతాబ్ది ఉత్సవాలు జాతిలో పునరుజ్జీవన నిర్మాణానికి మరొక చారిత్రక అవకాశాన్ని కల్పించాయి. 1674లో పవిత్ర అధికార స్వీకరణ ఉత్సవంలో తగిన వైభవంతో శివాజీ ఒక స్వతంత్ర హిందూ చక్రవర్తిగా పట్టాభిషక్తుడయ్యాడు.

అది దేశమంతా ముస్లిం దురాక్రమణదారుల పాదాలపై సాష్టాంగపడి ఉన్న సమయం. హిందూ సమాజం, హిందూ ధర్మాల మనుగడకే తీవ్రమైన ముప్పు ఏర్పడిన సమయం. అలాంటి విపత్కర కారుమేఘాలను దూరంచేసి, అజేయ హిందూ శక్తి ఆధిక్యతను పునఃప్రతిష్ఠించిన ఆ శివాజీయొక్క అరివీర భయంకర విజయం హిందూ జాతికి పునర్జన్మను ప్రసాదించింది. స్వామివివేకానందుని మాటలలో చెప్పాలంటే, శివాజీ మన ధర్మాన్ని, మన సమాజాన్ని సంరక్షించడానికి భగవంతుని అవతారాల పరంపరలో జన్మించిన ఆదర్శ హిందూరాజు.

ఢిల్లీ, చుట్టు ప్రక్కల ప్రాంతాల ప్రాంత సంఘచాలక్, ఢిల్లీ మాజీ మేయర్ అయిన లాలా హంసరాజ్ గుప్తా అధ్యక్షులుగా, ప్రసిద్ధికలిగిన పెద్దలు సభ్యులుగా ఒక జాతీయ సమితి ఏర్పడింది. 1974 ఫిబ్రవరి 19న శివాజీ జయంతినాడు దేశమంతటా, విదేశాలలోను ప్రారంభమయిన ఉత్సవాలు జూన్ 2వ తేదీతో ముగిశాయి. ఆ రోజుకు శివాజీ పట్టాభిషేకం జరిగి మూడు వందల సంవత్సరాలు పూర్తి అయ్యాయి. కవి సమ్మేళనాలు, నాటకాలు, చిత్ర ప్రదర్శనలు, విద్యార్థులకు వ్యాస రచన పోటీలు, సాహిత్య ప్రచురణ తదితర అనేక కార్యక్రమా... సమయంలో జరిగాయి.

అలనాటి చారిత్రక పట్టాభిషేక దృశ్యాన్ని ప్రదర్శిస్తూ ప్రముఖ చిత్రకారుడు అచ్రేకర్ చిత్రించిన భవ్యమైన రంగుల చిత్రాన్ని 1974 జూన్ 6వ తేదిన క్రొత్త ఢిల్లీలో జరిగిన ముగింపు ఉత్సవంలో ఆనాటి రక్షణ శాఖామంత్రిగా ఉండిన శ్రీ జగజ్జీవనరాం ఆవిష్కరించారు. వక్తలలో ఒకరైన శ్రీ వై.బి. చవాన్ శివాజీ సాధించిన విజయాల వాస్తవ ప్రమాణాలను గురించి విపులీకరించారు.

దక్షిణాగ్రాన కూడా, తిరువనంతపురంలో జరిగిన ముగింపు ఉత్సవాలను కార్డినల్ జోసెఫ్ పరిక్కతిల్ ప్రారంభించగా, న్యాయమూర్తి శ్రీ బాలకృష్ణ ఎరాడి సభకు అధ్యక్షత వహించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీశైలంలో కోటి రూపాయలవ్యయంతో ఛత్రపతి శివాజీ స్మారక నిర్మాణం జరుగుతున్నది. బహూళార్థ సాధకమైనది ఈ స్మారక కేంద్రం. శివాజీ దక్షిణదేశ దిగ్విజయాలకు బయలు దేరుతూ శ్రీశైలంలో ఆగి, అక్కడ ధ్యానం చేసిన స్థలంలోనే స్మారకం నిర్మింపబడుతోంది. ఇక్కడే శివాజీకి భవానీ మాత ప్రత్యక్షమై, ఖడ్గాన్ని ప్రసాదించిందని స్థానికులు చెబుతారు. శివాజీ శ్రీ శైలం శివాలయానికి ఉత్తరాన గాలిగోపురం నిర్మించాడు. పరిసరాలలోని గిరిజనుల వికాసానికి ఈ స్మారకకేంద్రం కృషిచేస్తుంది.

## చాపేకర్ సోదరుల సంస్మరణ:

జాతీయ గౌరవానికి చిహ్నాలయిన అనేక అంశాలను పునరుద్ధరించడం లోను, పునఃప్రకాశమొనర్చడంలోను స్వయంసేవకులు ముందడుగు వేసిన సందర్భాలు కోకొల్లలు. పుణే సమీపంలోని చించ్‌వాడిలో గల చాపేకర్ సదన్ అలాంటి వాటిలో ఒకటి. విప్లవ కార్యాలకుగాను బ్రిటిష్ వారి చేతులలో ఉరికంబానికెక్కిన మొట్టమొదటి విప్లవ కారులైన చాపేకర్ సోదరత్రయం జ్ఞాపకార్థం నిర్మించిన ఈ స్మారకభవనం నిర్లక్ష్యానికి గురై, సంఘ వ్యతిరేక శక్తుల స్థావరంగా మారింది. వారి నక్కడినుండి తరిమికొట్టి, స్వయంసేవకులు క్రాంతివీర చాపేకర్ స్మారక సమితిని స్థాపించారు. సమితి ఇప్పుడొక వ్యాయామశాలను నడుపుతోంది. ప్రతిఏటా శరీర సౌష్టవ పోటీలు నిర్వహించి గెలుపొందిన వారికి చాపేకర్ సోదరుల షీల్డ్ ను పురస్కారంగా అందిస్తోంది. ఒక విద్యాసమితి కూడా ప్రారంభమైంది. దాని ఆధ్వర్యంలో ఒక పాఠశాలనడుస్తోంది. ఆ అమర వీరులు విడిచివెళ్ళిన ప్రేరణదాయక వారసత్వాన్ని పెంపొందించే కృషిలో సమితి ఒక ప్రజా గ్రంధాలయం, ఒక వైద్య కేంద్రం స్థాపన, పట్టణ ప్రవేశ ద్వారం వద్ద దామోదర్ చాపేకర్ విగ్రహ ప్రతిష్ఠ వంటి కొన్ని ప్రముఖ చర్యలు చేపట్టింది.

## జలకంఠేశ్వరుని విముక్తి:

తమ మొట్టమొదటి ప్రకల్పంగా తమిళనాడులో హిందూ మున్నని ఒక సాహసోపేతమైన, ఉజ్వలమైన ప్రయత్నం ప్రారంభించింది. హిందూ మున్నని ఒక ప్రత్యేక లక్ష్యంతో ఆవిర్భవించిందనే విషయాన్ని ఆ ప్రయత్నం తమిళనాడులోని హిందువుల హృదయాలలో ముద్రించింది. వెల్లూరులోని విశాలమైన కోటలో ఒకప్పుడు ప్రఖ్యాత జలకంఠేశ్వరా లయం ఉండేది. కానీ 4 వందల సం.ల క్రితం ముస్లింలు దాడిచేసి, కోటను స్వాధీనం చేసుకున్నప్పుడు, విగ్రహాన్ని వారు విధ్వంసం చేస్తా రేమోనని భక్తులు భయభ్రాంతులయ్యారు. అందుకే ఆ శివలింగాన్ని అక్కడినుండి వేరొక సురక్షిత స్థలానికి తరలించి, అక్కడే దానికి నిత్యపూ జలు జరిగే ఏర్పాటుచేశారు. పురాతత్వ శాఖ వద్దనున్న ఒక శిలాఫలకం ఈ సంఘటనను సవిస్తరంగా తెలియజేస్తోంది. బ్రిటిష్‌వారి హయాంలో పురాతత్వ శాఖ ఈ దేవాలయాన్ని స్వాధీనం చేసుకుని, దానిపై ఎటువంటి శ్రద్ధ చూపకుండా ప్రభుత్వాధీనంలో దానిని వదిలివేసింది.

స్వాతంత్ర్యానంతరం కూడా అదే దుస్థితి కొనసాగింది. దేవాలయ పునరుద్ధరణకు రాజాజీ, కామరాజ్ నాడార్, కృపానందవారియర్ వంటి ప్రముఖులు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఆ దేవాలయానికి పూర్వవైభవ స్థితిని చేకూర్చినట్లైతే ముస్లింలు బాధ పడతారని సెక్యులర్ ప్రభుత్వం భయపడినట్లు తేటతెల్లం అయింది.

కానీ ఆ జలకంఠేశ్వరుని ఆహ్వానం ప్రజల కణకణాన్ని మండించసాగింది. దేవాలయ విముక్తిపై 1981 జనవరి 4 వ తేదీన బహిరంగ సభ నిర్వహించాలని హిందూ మున్నని ఇచ్చిన పిలుపుకు 5 వేల మంది ప్రజలు ప్రతిస్పందించారు. ఒక నిర్ణీత దినాన లక్షమంది ప్రజలు ఆ దేవాలయానికి యాత్ర సాగించి, శాస్త్రోక్తంగా పురాతన శివలింగాన్ని అక్కడ ప్రతిష్ఠించాలని ఆ సభలో వారు ఏకగ్రీవంగా నిర్ణయించారు.

పోలీసుల లాఠీ ఛార్జీలు, తుపాకీ గుండ్లతో సహా ఎటువంటి పరిణామాలెదురైనా ఎదుర్కొనే సంసిద్ధత గల వ్యక్తులు తమ పేర్లను నమోదు చేసుకొనమని కోరినప్పుడు వేలాది మంది వరుసలు కట్టారు. అనేక వీధిమొగ సమావేశాలు, బహిరంగ సభలు జరిగాయి. ఉద్యమ తీవ్రత పెరిగింది. నిర్ణీత దినం 1981మార్చి 16 నాడు శివలింగాన్ని దాచి ఉంచిన స్థలానికి సమీపంలోగల సాధువచేరి నుండి ఆ 8 అడుగుల ఎత్తు రాతి లింగాన్ని తీసుకువచ్చి, అసలు దేవాలయంలో ప్రతిష్ఠ చేసారు. వేలాది మంది ఆ దృశ్యాన్ని తిలకించడానికి తరలివచ్చారు. మహిళలైతే మంగళవాద్యాలు వెంటరాగా అభిషేకానికి నెత్తిన కుండలు పెట్టుకుని అనేక గ్రామాలనుండి ప్రవాహంలా తరలివచ్చారు. దేవాలయంలో కుంభాభిషేకం జరిగింది. స్వయంగా కంచి పరమాచార్యులవారు రెండు రోజులు ఆ దేవాలయంలోనే బస చేశారు. ఫలితంగా ఇప్పుడు ఆ దేవాలయం పెద్ద ధార్మిక కేంద్రం అయింది. మంత్రులు, ప్రభుత్వాధికారులు సైతం తరచు ఆ దేవాలయాన్ని సందర్శించి, జలకంఠేశ్వరునికి పూజలు జరుపుతూ ఉంటారు.

## జగన్నాధ రథయాత్ర:

గుజరాత్‌లో హిందువులు తమ అస్తిత్వాన్ని చాటిచెప్పుకోవడానికి చక్కని అవకాశం ఎనభైలలో సంప్రదాయసిద్ధమైన వార్షిక జగన్నాధరథయాత్ర రూపంలో వచ్చింది. ఈ రథయాత్ర శతాబ్దాల తరబడి పరంపరాగతంగా వస్తున్నది. ఆషాఢశుద్ధ విదియనాడు జరిగే ఈ రథ యాత్రలో సమాజంలోని అట్టడుగు వర్గాల వారైన ఖలాసి కులానికి

చెందిన సభ్యులే రథాన్ని లాగడం విశేషం.

1985లో, రాజకీయ కారణాలవల్ల, గుజరాత్ ప్రభుత్వం యాత్ర మతపరమైన ఉద్రిక్తతలను రెచ్చగొడుతుందనే భావనను కల్గించే ప్రయత్నం చేసింది. అది అవకాశంగా భావించిన ముస్లింలు, రథయాత్రకు వ్యతిరేకంగా ఆందోళన కలిగించే ధోరణిని ప్రదర్శించసాగారు. అది సాకుగా చూపించి ప్రభుత్వం కర్ఫ్యూ విధించింది. అయితే, కర్ఫ్యూ కూడా విఫలం అవుతుందని గ్రహించగానే యాత్రకు అనుమతిని ఇచ్చారు. మార్గాన్ని మాత్రం మార్చాలని పట్టుబట్టారు. కానీ సంఘ కార్యకర్తలు కూడా భాగస్వాములుగా ఉన్న ఆ యాత్ర నిర్వాహక వర్గం తమ మొదటి యోజనకే కట్టుబడి ఉండాలని నిశ్చయించుకుంది. జీపులలో తరలివచ్చిన పోలీసు బలగం జగన్నాథ మందిర ద్వారం వద్దనే యాత్రను నిలువరించాలని ప్రయత్నంచేసింది. కానీ యాత్ర అగ్రభాగంలో ఉన్న ఏనుగులు జీపులను ప్రక్కకు త్రోసిపారేశాయి. యాత్ర ప్రారంభమైంది. ముఖ్యమంత్రి, గృహమంత్రి యాత్రను నిలిపివేయగలమని ఎంత ధీమాగా ఉన్నారంటే, చివరికి ఆకాశవాణికూడా అంతకుముందే ఆరోజు రథయాత్ర జరుగదని ప్రకటించేసింది. మధ్యాహ్నం కాలూపూర్ ప్రాంతంలో కొందరు ముస్లింలు రథంపై రాళ్లు రువ్వడం ఒక్కటే మొత్తం మీద జరిగిన అవాంఛనీయ సంఘటన. పోలీసులు, సైన్యం దుండగులపై కాల్పులు జరుపడంతో పరిస్థితి వెంటనే అదుపులోకి వచ్చింది.

షాహాపూర్ నివాసులు 1986లో జన్మాష్టమినాడు రథయాత్ర జరపాలని సంకల్పించినప్పుడు ప్రభుత్వం నిషేధం విధించింది. అయితే అనుకున్న పథకం ప్రకారం ముందుకు సాగాలని ప్రజలు నిశ్చయించారు. చివరికి ద్వారకాపీఠాధిపతి మధ్యవర్తిత్వం కారణంగా ముఖ్యమంత్రి క్షమాపణలు చెప్పుకోవడంతో, మామూలు పరిస్థితులు నెలకొన్నాయి.

వి. హి. ప. ఒరిస్సా విభాగం జగన్నాథ రథయాత్రను నిర్వహించింది. 1986 నవంబర్‌లో వనవాసీ జిల్లా అయిన ఫూల్బనీలో అది పర్యటిస్తున్నప్పుడు క్రైస్తవ మిషనరీలకు కంటగింపు కలిగింది. ఎందుకంటే ప్రభు జగన్నాథుడు కేవలం హిందూ వనవాసులలో భక్తి పారవశ్యాన్ని పెంపొందించడమే కాదు, క్రైస్తవులుగా మారిన వారుకూడా వేల సంఖ్యలో ఆయన వైపుకు ఆకర్షితులుకాసాగారు. రథయాత్ర ఫూల్బనీ దిశగా సాగుతున్న సమయంలో పోలీసులు దానిపై దాడిచేసి, వెనుకకు బరంపురంకు తెచ్చి, తమ ఆధీనంలో ఉంచుకున్నారు. ఫూల్బనీ క్రైస్తవులకు రథయాత్ర ఆగ్రహం కలిగిస్తున్నదంటూ చర్చి అధికారులు ఒక

విజ్ఞాపనను సమర్పించిన కారణంగానే వారా విధంగా ప్రవర్తించారని ఆ తరువాత వెల్లడైంది. ఆ విజ్ఞాపనలో ఒక విధంగా హింసాకాండను గురించిన హెచ్చరికకూడా ఉంది.

అయితే, 'తన స్వంత భూమిలో తిరగడానికి జగన్నాధునికి క్రైస్తవుల అనుమతి కావాలా?' అని సవాలు చేస్తూ 20వేల మందికి పైగా హిందువులు రథ విముక్తికి తరలిరావడంతో ప్రభుత్వానికి జ్ఞానోదయం అయింది. రథం వెంబడి సాగుతున్న స్వామి లక్ష్మణానందులవారికి చేతులుజోడించి క్షమాపణలు చెప్పుకుని, అధికారులు రథయాత్రకు అనుమతించారు. రథానికి మరమత్తులు చేసి రెండు నెలలపాటు దానికి పోలీసు రక్షణ కూడా వారు ఏర్పాటు చేశారు. అదే రోజున చర్చి అధికారులు కూడ ప్లేటు ఫిరాయించి తాము అసలు రథయాత్రకు ఎన్నడూ అభ్యంతరం తెలుపలేదని ప్రకటించారు.

మీరట్‌లో హిందువులు కూడ అధికారులకు ఇదే విధంగా గుణపాఠం నేర్పించారు. అక్కడకూడ 1987లో పోలీసులు ప్రతి సంవత్సరం జరిగే జగన్నాధ రథయాత్రను నిషేధించారు. వి.హి.ప. ఈ విషయాన్ని తీసుకుని సత్యాగ్రహానికి దిగింది. సత్యాగ్రహులపై సాగిన అరెస్టులు, లాఠీచార్జీలు, కాల్పులు, హిందువులను మరింత ప్రేరేపించడానికి దోహదం చేసాయి. వందలాది మహిళలు కూడ వచ్చిచేరారు. సత్యాగ్రహం పట్టణం అంతా వ్యాపించింది. పోలీసులు కర్ఫ్యూవిధించినప్పటికి వేలాదిమంది ప్రజలు వీధులలోనికి వచ్చి తమపై కాల్పులు సాగించమని పోలీసులను సవాలుచేశారు. పోలీసులు, వారివెనకాల ఉన్న రాజకీయ వాదులు తెలివిగా పలాయనం చిత్తగించి, రథయాత్రకు అనుమతించారు. అప్పటిదాకా ఒక సాధారణ వార్షిక కార్యక్రమంగా మాత్రమే ఉంటూ వచ్చిన ఆ రథయాత్ర ఆ యేడు లక్షమంది హిందువులను ఆకర్షించింది. ఘనత అంతా పోలీసులు తీసుకున్న 'హిందూ జాగరణ చర్య'లకే చెందుతుంది.

హిందువులను నోట్లో నాలుకలేనివారుగా భావించి ప్రతి ఒక్కరు వ్యవహరించే రోజులు పోయాయని, హిందువులు ఇక ఏమాత్రం ఆస్థి తిలోలేరని ఢిల్లీలో అధికారులకు కూడా తెలియవచ్చింది. చిట్టచివరి మొగలుపాలకుడైన బహదూర్‌షా కాలంనుండి సాగుతూ వస్తూన్న రామలీలా ఊరేగింపు యొక్క పరంపరా గత మార్గాన్ని మార్చాలని పోలీసులు పట్టు బట్టినప్పుడు హిందూ మంచ్ ఆధ్వర్యంలో ప్రజలు

ధృఢంగా నిరసన వ్యక్తంచేయడంతో చివరికి పోలీసులు తలవంచక తప్ప లేదు. హిందువులు అతి కొద్దిసంఖ్యలో మాత్రమే ఉన్న శ్రీనగర్‌లో కూడా రాధాకృష్ణ దేవాలయం ధ్వంసం చేయడంపట్ల వారు ప్రకటించిన నిరసన ఎంత తీవ్రంగా ఉన్నదంటే, చివరికి స్వయంగా ఫరూక్ అబ్దుల్లా తన ప్రభుత్వమే మొత్తం ఖర్చు భరించి ఆ దేవాలయాన్ని పూర్తిగా పునరుద్ధరిస్తుందని ప్రకటించవలసిన పరిస్థితి ఏర్పడింది.

ఒరిస్సాలోని కేంద్రపారా, సంబల్‌పూర్‌లలో ముస్లింలు చట్టవ్యతి రేకంగా గోవధ సాగించడాన్ని వ్యతిరేకిస్తూ హిందూ జాగరణ సమాఖ్య ప్రారంభించిన ఉద్యమం కూడ విజయవంతం అయింది. రాజకీయ నాయకులు ముస్లింల పక్షం వహించినప్పటికీ, హిందువుల నిరసన ధాటికి తలవంచి పురపాలక సంఘ అధికారులు తమ సంఘాల పరిధిలో గోవధపై నిషేధం విధించవలసి వచ్చింది.

హిందువులు నిర్వహించిన ఈ అన్ని సఫల హిందూ నిరసనోద్యమా లలోను స్వయంసేవకులు అగ్రగాములుగా నిలిచారు.

## కేరళలో దేవాలయాల పునరుద్ధరణ

1957 అసెంబ్లీ ఎన్నికలలో తమను హిందూ ధర్మ పరిరక్షకులుగా అభివర్ణించుకుని కమ్యూనిస్టులు కేరళలో అధికారాన్ని చేపట్టారు. శబరి మల దేవాలయంలో విధ్వంసకాండకు దిగిన క్రైస్తవ విధ్వంసకారులకు కాంగ్రెస్ రాజకీయ ఆశ్రయం కల్పించడం పట్ల ఆగ్రహించిన హిందువులు కమ్యూనిస్టుల వైపు మొగ్గు చూపించారు. కాని అది వారికి చివరికి నిరాశనే మిగిల్చింది.

మలప్పురం జిల్లాలోని ప్రఖ్యాత తలి దేవాలయాన్ని టిప్పుసుల్తాను ధ్వంసంచేశాడు. ఆనాటినుండి అది శిథిలాలుగానే మిగిలిపోయింది. విగ్ర హాన్ని బయటకు విసిరివేసి స్థానిక ముస్లింలు ఆ ప్రదేశాన్ని తమ సంఘ వ్యతిరేక కార్యకలాపాల స్థావరంగా మార్చివేశారు. మధ్య అరవైలలో ఆదే వాలయ పునరుద్ధరణకు స్వయంసేవకులు ప్రయత్నాలు ప్రారంభించినప్పుడు ముస్లింలు దానినొక సవాలుగా తీసుకున్నారు. 1967లో మార్క్సిస్టులు రెండవసారి అధికారంలోకి వచ్చారు. అప్పటికే వారు ముస్లింలీగ్‌తో ఒప్పందం చేసుకొని ఉన్నారు. ఫలితంగా ప్రభుత్వం ముస్లింల వత్తిడికి తలఒగ్గి, ఆ దేవాలయాన్ని ఒక ప్రాచీన కట్టడంగా పురాతత్వ శాఖకు అప్పగించాలని నిర్ణయించింది. కానీ ఇలాంటి అవమానాలను తమ కర్మగా భావించి హిందువులు వదిలిపెట్టే రోజులు పోయాయి. వయోవృద్ధ కేరళ

నేత, పరమ ఆదరణీయ గాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధుడయిన శ్రీ కేలప్పన్ స్థానిక హిందువుల, హిందూదేవాలయాల దుస్థితిని చూచి చలించిపోయారు. ప్రభుత్వంయొక్క బహిరంగ హిందూవ్యతిరేకధోరణికూడ ఆయనను కలవరపరచింది. స్వయంసేవకులు ఆయన వెనుక నిలచారు. ఒక శక్తివంతమైన ఉద్యమం ప్రారంభమైంది. చివరికి ప్రభుత్వం దిగి రాకతప్పలేదు. తలి దేవాలయం పునరుద్ధరించబడింది. గతంలో లాగే హిందువులకది గొప్ప ధార్మిక కేంద్రం అయింది.

శ్రీ కేలప్పన్ ఒకనాడు సంఘానికి బద్ధ విరోధులు. కాని తలి ఉద్యమం సమయంలోను, ఆతదుపరి మలప్పురం సత్యాగ్రహం సమయం లోను సంఘ కార్యకర్తలతో ఏర్పడిన సన్నిహిత సంబంధాలు ఆయనలో సంపూర్ణ పరివర్తనను సాధించాయి. కేరళలో హిందూ పునర్జాగరణ ఉద్యమంలో ఆయన లీనమయ్యారు. సంఘంయొక్క గట్టి సమర్థకులలో ఒకడుగా మారారు. సామాజిక అశ్రద్ధకారణంగాను, హిందూవ్యతిరేక శక్తుల యొక్క యోజనాబద్ధ విధ్వంసకాండ కారణంగాను నాశనమైన అనేక దేవాలయాల పునరుద్ధరణ లక్ష్యంగా ఆయన కేరళ క్షేత్ర సంరక్షణ సమితి (కె.కె.యస్.యస్) స్థాపించారు. శ్రీ కేలప్పన్ స్వర్గస్థులైన తరువాత స్వయంసేవకులు ఆయన విడిచి వెళ్ళిన పనిని కొనసాగించాలని నిశ్చయించారు. ప్రస్తుతం సుమారు 1500 దేవాలయాలు కె.కె.యస్.యస్. ఛత్ర ఛాయలోనికి వచ్చాయి.

## తమిళనాడులో దేవాలయాలు:

వైభవోపేతమైన హిందూ సంప్రదాయంలో దేవాలయాలు దైవభక్తికే కాక, సామాజిక సమరసతకు, లలితకళలకు, హస్తకళలకు, సంస్కృతికి తేజోమయకేంద్రాలుగా విరాజిల్లుతూ వస్తున్నాయి. గత కాలంలో విదేశీ దురాక్రమణదారులు సాగించిన విధ్వంసానికి తోడు, ప్రస్తుతం ప్రభుత్వ యంత్రాంగం దేవాలయాలను తమ ఆధీనంలోకి తీసుకోవడం మరొక దెబ్బ అయింది. ముఖ్యంగా ఇది దక్షిణాదిలో మరీ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. దేవాలయ నిధులను, దేవాలయ భూములను కొల్లగొట్టే, దుర్వినియోగపరచడానికి రాజకీయ నాయకులకు అది చక్కని అవకాశం కల్పించింది. అప్పుడప్పుడు నిత్య పూజలలో కూడా వారు తలదూరుస్తూంటారు. ఈ ధోరణికి వ్యతిరేకంగా తమిళనాడులో 1965లో హిందూ దేవాలయ పరిరక్షణ సమితి ఉద్యమాన్ని ప్రారంభించింది. మఠాధిపతులు, సన్యాసుల సమ్మేళనాలతో ఉద్యమం ప్రారంభమయింది. 1985లో రాష్ట్ర అసెంబ్లీ

బడ్జెట్ సమావేశాలలో ప్రభుత్వం ప్రకటించిన దేవాలయ భూములను వ్యక్తుల కప్పగించే విధానం, దేవాలయాలకు అత్యంత ప్రమాదకరంగా పరిణమించే అవకాశం ఉంది. ముస్లింలు, క్రైస్తవులు ఆ భూములను చేజిక్కించుకుంటారని హెచ్చరిస్తూ హిందూ మున్నని ఆ విధానాన్ని గట్టిగా వ్యతిరేకించింది. అదీ గాక ఇప్పటికే క్రుంగిపోయి ఉన్న దేవాలయాల వనరులు మరింత దిగజారే పరిస్థితికూడా దీనివలన ఏర్పడవచ్చు. అందుకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమంలో ఈ మధ్యే వి.హిం.ప. కూడా చేరింది. 1988 మార్చి, ఏప్రిల్ మాసాలలో వందలాదిమంది సన్యాసులు, వేలాదిమంది భక్తులు రాష్ట్ర వ్యాప్తంగా నిరసన దీక్ష నిర్వహించారు. ముఖ్యమంత్రికి, జిల్లాలకలెక్టర్లకు విజ్ఞాపనలు సమర్పించారు. అన్ని జిల్లాలలోను వెయ్యి కిలోమీటర్ల దూరం పాదయాత్ర జరిగింది.

సమితి నిర్మాణాత్మక, ప్రబోధాత్మక కార్యక్రమాలు కూడా నిర్వహిస్తున్నది. రామనాథపురం జిల్లాలోని వివిధ దేవాలయాలకు చెందిన వెయ్యి మందికి పైగా ధర్మకర్తలు దేవాలయ సక్రమ నిర్వాహణను గురించి, హిందూ సమైక్యతయొక్క ఆవశ్యకతను గురించి ప్రజలకు తెలియజెప్పేందుకు ఉద్దేశించిన అనేక సమ్మేళనాలలో నిమగ్నులై యున్నారు. హరికథా కళాకారులు, ధార్మిక ప్రబోధకులు కూడా పెద్ద సంఖ్యలో ముందుకు వస్తున్నారు. ఆ జిల్లాల్లో హిందువులు ఎదుర్కొంటున్న రెండు తీవ్రప్రమాదాలైన మతం మార్పిడులు, కులవైషమ్యాలగురించి సామాన్య ప్రజలను జాగృతులను చేయడంలో తాము ప్రధాన పాత్ర నిర్వహించవలసి యున్నదని వారు కూడా గ్రహించారు. దేవాలయాలను గతంలో వలే సామాజిక సమైక్యతను పెంపొందించే, ధార్మిక ప్రబోధాన్ని సాగించే కేంద్రాలుగా పునరుద్ధరించడం కోసం జరుగుతున్న ఈ సమగ్ర ప్రయత్నంలో దాతలు, భక్తులను కూడా నిమగ్నం చేసే కృషి జరుగుతున్నది.

## రామజన్మభూమి విముక్తి:

మొగలు దురాక్రమణదారుడైన బాబరు అయోధ్యలో శ్రీరాముని జన్మ జరిగిన పవిత్ర స్థలంలో గల దేవాలయాన్ని కూలగొట్టి క్రీ.శ. 1558లో అక్కడ ఒక మసీదును నిర్మించిన మొట్ట మొదటి రోజు నుండి మన జాతీయ గౌరవ పరిరక్షణకై ఆ దేవాలయ విముక్తి, పునరుద్ధరణకోసం పోరాటం సాగుతూనే ఉన్నది. శ్రీరామచంద్రుడు కేవలం పౌరాణిక మహాపురుషుడో లేక కొందరి పూజలందుకునే దైవమో

మాత్రమే కాదు. ఆయన మర్యాదా పురుషోత్తముడు. పవిత్ర భారతమాత ఒడిలో ఉద్భవించిన, సకల సద్గుణ సంపన్నుడైన వ్యక్తిత్వం శ్రీరామ చంద్రుడు. దేవాలయం విధ్వంసం జరిగిన నాటి నుండి 76 భీకర యుద్ధాలు జరిగాయి. కుల, వర్గ, భాషా, ప్రాంత అడ్డుగోడలన్నింటినీ ఛేధించి, లక్షలాది మంది ప్రజలు సమాన జాతీయ గౌరవ కేంద్రమయిన ఆ దేవాలయ పరిరక్షణ కార్యంలో బలిదానం చేశారు. ఒకరకంగా శత్రువుయొక్క అణచివేతకు వ్యతిరేకంగా దేశ స్వతంత్ర సాధనకై జరిగిన పోరాటానికి అది సంకేతంగా నిలిచింది.

ఒచే ప్రేరణతో దేశానికి స్వాతంత్ర్యం లభించిన వెంటనే సర్దార్ పటేల్ సౌరాష్ట్రలోని సోమనాథ్ దేవాలయాన్ని పునరుద్ధరించాలని నిర్ణయించారు. పటేల్ ఈ ఆలోచనను గాంధీజీ ముందు పెట్టిన పుడు ఆయనకూడా హృదయపూర్వకంగా దానిని సమర్థించారు. కేంద్ర మంత్రివర్గం కూడా దానిని ఒక ప్రభుత్వ పథకం గానే స్వీకరించాలని ఏకగ్రీవంగా తీర్మానించింది. అయితే గాంధీజీ సలహామేరకు ఆ పనిని శ్రీ కె.యం. మున్షీ ఆధ్వర్యంలోని ఒక ప్రభుత్వేతర ధర్మ కర్తృత్వ మండలికి అప్పగించారు. 1951 మే 11నాడు ఆ పునరుద్ధరింపబడిన దేవాలయ ప్రారంభోత్సవానికి స్వయంగా రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్ర సాద్ విచ్చేశారు. ఆ చారిత్రక సందర్భంలో వారు చేసిన ప్రసంగం ఎంతో ప్రాముఖ్యత గలది. "ఈ చర్యద్వారా భారత ప్రజలు వేయి సంవత్సరాల బానిసత్వ కళంకాన్ని తుడిచివేశారు. పూర్వ తరాలకు చెందిన స్వాతంత్ర్య యోధుల కలలకు సాఫల్యం కలిగించారు." రామ జన్మభూమి విముక్తి కూడా అంతటి ఉదాత్తకార్యమే.

1947లో స్వాతంత్ర్యం లభించగానే జాతి రామజన్మభూమి విము క్తికై సహజంగానే పోరాటాన్ని పునఃప్రారంభించింది. 1949 డిసెంబరు 22, 23 నాటి రాత్రి శ్రీరాముని విగ్రహ ప్రతిష్ఠద్వారా ఆస్థలం మరొకసారి పవిత్రం చేయబడింది. అయితే మన రాజకీయ పరిపాలకులు తమ పరమతాలను బుజ్జగించే విధానాన్ని బయట పెట్టుకుంటూ దేవాలయానికి తాళంవేసి పోలీసులను అక్కడ కాపలా ఉంచారు. రోజూ సాధారణ పూజకు మాత్రం అనుమతించారు. సామాన్య హిందువుకు శ్రీరాముని పూజించే హక్కును నిరాకరించారు. వి.హిం.ప. ఈ ధోరణిని అంతంచేయాలని నిశ్చయించుకుంది. 1984 ఏప్రిల్‌లో కొత్త ఢిల్లీలో జరిగిన వి.హిం.ప. ధర్మ సంసద్ సమావేశం శ్రీరామ జన్మభూమి, మధురలోని శ్రీకృష్ణ జన్మస్థానం, వారణాసిలో జ్ఞానవాపి

వద్దగల శ్రీవిశ్వనాథ దేవాలయాల విముక్తిని కోరుతూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. తదుపరి చర్యగా రామజన్మభూమి ముక్తి యజ్ఞసమితి ఏర్పడింది. గోరక్షా పీఠానికి చెందిన మహంత్ అవైద్యనాథ్ అధ్యక్షులుగా, వివిధ పంథ్ సంప్రదాయాలకు చెందిన అగ్రశ్రేణి మఠాధిపతులు, సన్యాసులు సభ్యులుగా సమితి ఒక బలమైన శక్తిగా ఆవిర్భవించింది. ప్రజలను జాగృతపరచేందుకు భజరంగదళ్ పేరిట యువజన విభాగం కూడా ప్రారంభమయింది. వందలాది బహిరంగ సభలు, ప్రదర్శనలు, ఊరేగింపులు జరిగాయి. బీహారులో సీతాదేవి జన్మస్థలమయిన సీతామార్హి నుండి యాత్రను ప్రారంభించిన రామజానకీరథం ఉత్తరప్రదేశ్ బీహార్ రాష్ట్రాలలో విస్తృతంగా పర్యటించింది. దారి పొడుగునా లక్షలాది మందిని జాగృతంచేసింది. అది అయోధ్యకు చేరుకున్న క్షణాన అక్కడొక మానవ సముద్రం ప్రత్యక్షమయింది. 1984 అక్టోబర్ 7న పవిత్ర సరయూ నదీతీరాన సమావేశమయిన అశేష జనవాహినిచేత దేశం నలుమూలలనుండి వచ్చిన వందలాదిమంది ధర్మాచార్యులు ప్రతిజ్ఞ చేయించారు - ఆ పవిత్ర భూమియొక్క విముక్తి జరిగేవరకూ తాము విశ్రమించమని.

అక్కడినుండి బయలుదేరిన రథయాత్ర రాజకీయ ద్వారాలనుతట్టి, న్యాయాన్ని కోరడానికై 1984 అక్టోబరు 14న లక్నోకు చేరుకుంది. ఆ తరువాత ఆరు రామజానకీ రథాలు నూట ఎనిమిది రోజులపాటు ఉత్తరప్రదేశ్ రాష్ట్రమంతటా పర్యటించాయి. కనీవినీ ఎరుగని హిందూ చైతన్యాన్ని అవి నిర్మాణంచేశాయి. తాళాలను తొలగించేందుకై పార్లమెంటు సభ్యులపై ఒత్తిడి తెచ్చే ఉద్దేశ్యంతో శాంతియుత, చట్టబద్ధ ప్రయత్నాలు కొనసాగాయి.

1985 డిసెంబర్ 19వ తేదీ చారిత్రాత్మక శుభఘడియ. ఆరోజు పదవీ విరమణ చేసిన హైకోర్టు న్యాయమూర్తులయిన శ్రీ శివనాథ కట్జూ, శ్రీ దేవకీ నందన అగర్వాల్, ఉత్తరప్రదేశ్ మాజీ పోలీసు డైరక్టర్ జనరల్ అయిన శ్రీ శిరీష్ చంద్ర దీక్షిత్, మాజీ ప్రణాళికా సంఘ డైరక్టరు అయిన శ్రీ జగదంబికా శరణ శ్రీవాత్సవ తదితర ప్రముఖులు ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిని కలుసుకొని దేవాలయానికి తాళం వేసి ఉంచడం చట్టవ్యతిరేకమైన విషయమని ఆయనకు నచ్చచెప్పారు. చట్ట వ్యతిరేకత విషయం ఎలా ఉన్నా, పెరుగుతున్న హిందూ అశాంతి మంచి ప్రభావం చూపించింది. అయోధ్య దేవాలయంలో నిరాఘాటంగా పూజ జరుపుకోవడానికి తనకుగల హక్కుకు అవరోధం కల్పిస్తున్న ప్రభుత్వ

చర్యను సవాలుచేస్తూ ఫైజాబాదు జిల్లా కోర్టులో ఒక న్యాయవాది సరికొత్తగా ప్రభుత్వానికి వ్యతిరేకంగా మరొక కేసు దాఖలు చేయడంతో ప్రభుత్వం మరింతగా చిక్కుల్లో పడింది. ప్రభుత్వంవైపు నుండి జిల్లా కమీషనర్ పట్టణ మేజిస్ట్రేట్, పోలీసు సూపరిండెంట్లు తాళం ఇక ఎంతమాత్రం అవసరంలేదని, దానిని తొలగించవచ్చని అంగీకరించక తప్ప లేదు. ఫలితంగా అదే రోజు సాయంత్రం అంటే 1986 ఫిబ్రవరి 1 సాయంత్రం దేవాలయం పూర్తిగా విముక్తమయింది. ప్రజలకోసం దాని ద్వారాలు తెరుచుకున్నాయి.

కానీ దేవాలయాన్ని పెద్దఎత్తున పునరుద్ధరించాలన్న ధర్మకర్తల కోరికకు అనుమతి నియ్యటానికి మరల ప్రభుత్వం నిరాకరించింది. ప్రభుత్వంయొక్క ఈ అనిశ్చితవైఖరి, ముస్లిం మతమౌఢ్య నాయకత్వం ఒత్తిడికి తలఒగ్గే ధోరణులతో ధైర్యంపుంజుకున్న బాబరీ మసీదు యాక్షన్ కమిటీ ఉద్యమానికి దిగింది. అయితే జాతి ఈ విషయంలో ఇక ఎటువంటి వ్యతిరేకతను సహించే స్థితిలోలేదు. 1987 మార్చి 29న జరిగిన అపూర్వమయిన ఉత్తరప్రదేశ్ బంద్, 1987 ఏప్రిల్ 5న శ్రీరామనవమి సందర్భంగా ఐదులక్షలమంది భక్తులు తిరిగి ప్రతిజ్ఞ చేయడం, రాష్ట్రవ్యాప్త పాఠశాలలబంద్, సాధు సన్యాసుల హెచ్చరికలకు తలఒగ్గి తమ అధీనంలో పెట్టుకున్న రామజానకీరథాన్ని పోలీసులు విడుదల చేయడం - ఇవన్నీ ఈ విషయంలో సంభాషణలకు గానీ, చర్చలకుగానీ ఇక ఏమాత్రం ఆస్కారంలేదని స్పష్టంచేశాయి. పోరాటం సాగుతూనేఉంది. సోమనాథ్‌లాగే అయోధ్యకూడా జాతీయ గౌరవం, స్వాభిమానాలను చాటిచెప్పే ఒక చిహ్నంగా మరొకసారి సగర్వంగా నిలిచినిలబడే రోజు వచ్చేవరకూ పోరాటం సాగుతూనేఉండవలసిందే.

## భావాత్మక సమైక్యతా చిహ్నాలు

జాతీయశ్రద్ధా కేంద్రాల పునరుద్ధరణ ప్రజలలో భావాత్మక సమైక్యతను సాధించడంలో ఒకశక్తివంతమైన సాధనంగా పనిచేస్తుందన్నది నిర్వివాదాంశం. ఇందుకుప్రత్యక్ష ఉదాహరణ వి.హిం.ప. నిర్వహించిన ఏకాత్మతాయజ్ఞం. భారతమాత, గంగామాతలయెడల ప్రజలలో భక్తివిశ్వాసాలను ప్రేరేపించే ఉద్దేశంతో వి.హిం.ప. 1983 నవంబర్ - డిసెంబర్ మాసాలలో ఏకాత్మతాయజ్ఞాన్ని నిర్వహించింది.

ఈ యజ్ఞం సందర్భంగా మూడుప్రధాన యాత్రలు, వందలాది అనుబంధ యాత్రలు జరిగాయి. మూడుప్రధాన యాత్రలు ఇవి.

1) ఉత్తరాన హరిద్వార్‌నుండి దక్షిణాన కన్యాకుమారి దాకా 2) తూర్పున గంగాసాగరంనుండి పశ్చిమాన చారిత్రాత్మక సోమనాథ మందిరంవరకు 3) నేపాల్‌లోని పశుపతినాథ దేవాలయంనుండి దక్షిణాన రామేశ్వరంవరకు.

ప్రతియాత్రలోనూ అందంగా అలంకరించిన రెండు యంత్రచాలిత రథాలు పాల్గొన్నాయి. ఒక రథంలో భారతమాతయొక్క భవ్యప్రతిమ అలంకృతమైఉంది. రెండవరథంలో రెండు పెద్ద జలకలశాలున్నాయి. వాటిలో ఒకటి గంగోత్రిలోని గంగాజలంతో నిండివుంది. రెండవదానిని దేశంలోని అన్ని పవిత్రనదుల జలాలతో నింపేందుకు ఉంచారు.

రోజుకు వంద కిలోమీటర్ల చొప్పున రథాలు ప్రయాణం చేశాయి. ప్రతి 25 కిలోమీటర్ల దూరం తరువాత ఒక రెండుగంటల కార్యక్రమం ఏర్పాటు చేశారు. ఆ కార్యక్రమాలలో చుట్టుప్రక్కల గ్రామాల, పట్టణాల ప్రజలు పాల్గొన్నారు. వారు తమ తమ ప్రాంతాలకు చెందిన పవిత్ర జలాలను రెండవ కలశంలో పోసి, అందుకు బదులుగా మొదటి కలశంలో నుండి గంగా జలాన్ని తమ తమ గ్రామాలు, పట్టణాలలోగల విగ్రహాలకు అభిషేకం చేసేందుకు తీసుకుని వెళ్ళారు. రథాలు తమ గమ్యస్థానాలైన కన్యాకుమారి, సోమనాథ్, రామేశ్వరాలు చేరుకునే సమయానికి కలశాలు రెండూ దేశం మొత్తంలోని పవిత్ర జలాలతో నిండిపోయాయి. ఆ జలాలలో చతుర్ధామాలు, ద్వాదశ జ్యోతిర్లింగాలు, యాభై రెండు శక్తి పీఠాలు, మానససరోవరం, నానక్‌సాగర్, హేమకుండ్, ఇంకా వందలాది పవిత్రనదులు, సరస్సులు, బావుల పావన జలాలు మిళితం అయి ఉన్నాయి. మూడు యాత్రలు కలిపి మొత్తం యాభై వేల కిలోమీటర్ల దూరం ప్రయాణించాయి. అన్ని రాష్ట్రాలలోని అన్ని తాలూకాల గుండా సాగేవిధంగా యాత్రా కార్యక్రమాలను రూపొందించారు.

ఈ యాత్రల సందర్భంగా హిమాలయాలు మొదలు హిందూ మహాసముద్రం వరకు 'భారత్ మాతాకీ జయ్', 'గంగా మాతాకీ జయ్', 'హిందూ ధర్మకీ జయ్' అనే ఆనందోద్ఘోషలతో మారుమ్రోగింది. కార్యక్రమంలో భాగంగా రథం ఆగిన అన్ని ప్రధాన కేంద్రాలలో "ఏకాత్మతా ప్రదర్శిని"ని ఏర్పాటు చేశారు. స్వామి చిన్మయానంద ఢిల్లీలో పత్రికల వారితో మాట్లాడుతూ యాత్ర యొక్క ఉద్దేశ్యాన్ని స్పష్టంగా వివరించారు. "అన్ని మతాలు, ప్రాంతాలు, వర్గాలకు చెందిన ప్రజలకు అందరికీ స్వీకార యోగ్యమయిన ఒక ఆదర్శాన్ని వారి ముందుంచడమే ఈ యజ్ఞము యొక్క ప్రధాన లక్ష్యం. తద్వారా మన జాతీయ

జీవనంలో జాతీయాదర్శాలకు సంబంధించిన స్పృహ, ఏకాత్మతా భావన నిర్మాణమవుతాయి." దేశంలోని ప్రముఖ వార్తా పత్రికలలో ప్రచురిత మయిన కొన్ని ప్రత్యక్ష నివేదికలు, వ్యాఖ్యానాలు మనం చూద్దాం. ఈ చారిత్రాత్మకమయిన యాత్రలోని విశేషాలు, వివిధ ప్రాంతాలలో దాని ప్రభావం తెలుసుకునేందుకు ఇవి సహాయపడతాయి.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (19-11-1983) ఇలా వ్రాసింది. "ఒక సన్నని ప్రవాహం రూపంలో హరిద్వార్‌నుండి యాత్ర బుధవారం ఉదయం ప్రారంభమయింది. అయితే కొద్దిగంటలలోనే ఆ మూడు వేల కి.మీ.ల తీర్థయాత్ర విస్తృతరూపం దాల్చింది. పదిహేను లక్షల సీసాలలో గంగ ప్రజల గృహాలకు చేరుకుంది. పదకొండు రూపాయలు సమర్పించుకున్న వారికి ప్రసాదంగా ఒక సీసాను అందచేశారు. ఆ విధంగా యాత్రకు నిధులు సమకూర్చారు."

'స్టేట్స్‌మన్' (20-11-83) ఇలా వ్రాసింది. "ఏకాత్మతా యాత్రలో భాగంగా పవిత్ర గంగా జలాలతో నిండివున్న కలశాలు, భారతమాత ప్రతిమలు కలిగిన రథాలు దేశంలో ఈ చివరినుండి ఆ చివరి వరకు ప్రయాణం చేశాయి. ప్రజలు అత్యంత భక్తిశ్రద్ధలతో వాటిని పూజించారు."

'ఇండియా టుడే' (16-30 నవంబర్ 83) గోరఖ్‌పూర్‌నుండి నేపాల్తరాయ్ మీదుగా ఖాట్మండూ వెళ్ళే రహదారిపైన మిలమిలలాడే తెల్లని వన్నె కలిగిన క్షత్రియ మహిళలతో పాటు, నల్లని రంగుతో నిగనిగ లాడే హరిజన స్త్రీలు సైతం బారులు తీరి నిలబడ్డారు. ఏదో దేవతను పూజించడానికి కాదు. నాలుగు వందల లీటర్ల జలంతో నిండివున్న ఎనిమిది అడుగుల రాగి పాత్రను తీసికొని వస్తున్న వాహనం కోసం వారెదురు చూస్తున్నారు. గంగానది జన్మస్థలమైన హిమాలయాలలోని 'గంగోత్రి'లో నింపిన జలమది. ముందు భాగాన ప్లైవుడ్‌పై సింహాన్ని అధిష్ఠించి వున్న ఒక దేవత రూపం చిత్రించబడి వుంది. ఆమె పెద్ద పరిచయమున్న దేవతకాదు. ఆమె భారతమాత. భారతదేశపు యాభై కోట్ల హిందువులలో గల ఎనభై ఐదు ప్రధాన శాఖల నాయకుల మధ్య సంభవించిన అరుదైన ఏకాభిప్రాయంలోనుంచి జన్మించినదే ఈ ఏకాత్మతా యజ్ఞం.

"క్రైస్తవ ఆధిక్యతగల మిజోరాంలోని లూంగ్‌లే గుండా సాగుతున్న ఒక ఉపయాత్ర చర్చిలకు అతి సమీపంలో వున్న వ్యాపార కూడలుల వద్ద ఆగింది. విశ్వహిందూ పరిషత్‌కు చెందిన ఉపన్యాసకులు క్రైస్తవ మిషనరీలను దుమ్మెత్తి పోశారు. వారి ఉపన్యాసాలు అక్కడ గుమిగూడిన

'వాయ్'లు- హిందూ మైదాన ప్రజలను- ఎంతో ఆకట్టుకున్నాయి. మణిపూర్‌లోని 'ఇంఫాల్' నుండి మరొక ఉపయాత్ర బయలుదేరింది. అరుణాచల్ ప్రదేశ్ పూర్వాగ్రాన కల 'తేజు' వద్ద పరశురామకుండ్ పుణ్యక్షేత్రాన్నుండి మరియొకటి బయలుదేరింది. 'లే' నుండి 'లూథి యానా' వరకు సుందరమైన లోయలు, పర్వత పంక్తుల గుండా మరొక ఉపయాత్ర సాగింది. అయితే 'లఢక్' వద్ద కొండ చరియలు విరిగిపడి రహదారి రవాణా స్తంభించిన కారణంగా కలశాన్ని విమానంలో శ్రీనగర్‌కు చేర్చారు. అక్కడినుండి తిరిగి యాత్ర ప్రారంభమయింది."

"అనేక ఉద్రిక్త ప్రాంతాలగుండా ఈ ధర్మయాత్రలు సాగాయి. మతపరమైన ఉద్రిక్తతలతో కుతకుతలాడుతున్న 'పంజాబ్'లో సైతం ఒక యాత్ర పదహారు స్థలాలను దర్శించింది. 'అమృత్‌సర్'లోని 'గోల్‌బాగ్' వద్ద అనూహ్యరీతిలో పెద్ద సంఖ్యలో ప్రజానీకం తరలివచ్చారు. ఆ ప్రాంతం సిక్కు తీవ్రవాదులకు ఆనాడు నిలయంగా ఉండిన స్వర్ణ దేవాలయానికి చాలా దగ్గరలో ఉంటుంది."

"అస్సాంలోని సమస్యాగ్రస్త 'మంగళ్‌దోయ్' జిల్లాగుండా మరొక యాత్ర సాగింది. ఆ సంవత్సరం ప్రారంభంలో 'నెల్లీ' మారణకాండ జరిగిన స్థలమదే. ఒక యాత్ర శ్రీనగర్‌లోని హిందువుల వాడ అయిన 'హబ్బా కదల్' మీదుగా సాగి 'బనిహాల్' సొరంగం గుండా దోడా, ఉధంపూర్‌లకు చేరుకుంది. హిందూ, ముస్లిం గ్రామాలను వేరుచేసే రహదారి అది. 'మానస సరోవర్' నుండి బయలుదేరిన ఒక యాత్ర మత ఉద్రిక్తతలు సదా ప్రజ్వరిల్లుతూండే 'మొరాదాబాద్'లోని అనేక సందులు గొందుల గుండా సాగింది."

'ది హిందూ' (మద్రాస్) (27-11-1983) "ఏకాత్మతా యజ్ఞం వలన మత ఉద్రిక్తతలు చెలరేగాయంటూ కాంగ్రెస్ (ఐ), కొన్ని వామప క్షాల నాయకత్వం బహిరంగంగా ఆందోళనను వ్యక్తంచేసింది. అయితే అది నిరాధారమైనదని ఋజువయింది. పవిత్ర గంగాజలాలు ప్రవహిస్తూ వుండే, పెద్ద సంఖ్యలో పుణ్యక్షేత్రాలు, తీర్థ స్థలాలు ఉండే ఉత్తరప్రదేశ్‌లాంటి రాష్ట్రాలలో కూడా ఈ యాత్ర ఒక విశిష్ట అనుభవమయింది. సంవత్సరాల తరబడి కుల ఘర్షణలు సాగుతూనే ఉన్నా అధిక సంఖ్యాక సమాజ సమైక్యతకై ధార్మిక నేతలు చేసిన ప్రయత్నం బహుస్వల్పం. అటువంటి సమయంలో యాత్ర అందరినీ కలిపే ఒక వేదికగా మారింది."

'ది వీక్' 18-24 డిసెంబర్ 1983: "కనీసం ఆ ఒక్కరోజు నాగపూర్ ఒక పుణ్యక్షేత్రమయింది. జాతి హృదయం ధార్మిక

అభినివేశంతో ఉగ్రరూపం దాల్చింది. ఆ కమలాఫలాల నగరం నిండా స్వాగత తోరణాలు నిర్మించారు. ఆత్మ ప్రక్షాళన గావించే గంగా జలాలు, విస్తారంగా అలంకరించిన రథాల దర్శనం కోసం వందలవేల ప్రజానీకం మార్గం అంతా బారులు తీరి నిలిచారు. యశ్వంత స్టేడియంకు దారితీసే మార్గం అంతా బంతిపూలు వెదజల్లారు. మధ్యాహ్నపు ఎండకు వాడిపోకుండా ఉండేందుకు ఆ పుష్పాలను నీటిలో తడిపి రోడ్డుపై పరిచారు. సైకిలు రిక్షాలపై పంచిపెట్టిన ఆ బంతిపూలకోసం ప్రజలు ఎగబడ్డారు. యాత్రల కారణంగా ఆ పుష్పాలకు ఎంతో పవిత్రత ఏర్పడింది. చాలాకాలం ఉంచుకునే ఉద్దేశ్యంతో ప్రజలు వాటిని తమ ఇండ్లకు తీసుకుపోయారు."

"యశ్వంత స్టేడియంవద్ద ఆ మూడు రథాల సమాగమ దృశ్యం అద్భుతమయినది, భావోద్వేగ భరితమయినది. అపురూపమయిన ఆ మూడు రథాల సమాగమ దృశ్యాన్ని తిలకించేందుకు క్రిక్కిరిసిన జనసందోహం ముందుకు చొచ్చుకొని వచ్చారు. ఆ ప్రజానీకపు మనోభావాలలో ఆధ్యాత్మికతతో బాటు జాతీయ భావనకూడా తొణికిసలాడింది."

'ఆర్గనైజర్' (11-12-1983)

"ఈశాన్య భారతంలోని ఏడు రాష్ట్రాలతో కూడిన పూర్వాంచల్ అంతటా ఏకాత్మతా యజ్ఞ సందర్భంగా ఒక గొప్ప ఆధ్యాత్మిక శక్తి ప్రదర్శితమైంది. మిగిలిన దేశంతో ఒక ఏకాత్మతా భావనను కూడా ఆ సమయంలో ఆ ప్రాంతం అనుభూతి చెందింది. అక్టోబరు 24వ తేదీనుండి నవంబరు 5వ తేదీ వరకు యాత్ర ప్రయాణించిన వివిధ స్థలాల్లో దాదాపు 20 లక్షల మంది పాల్గొన్నారని అంచనా! ఇంఫాల్‌లో గోవింద్‌జీ రథానికి స్వాగతం పలుకుతూ ఏర్పాటయిన బహిరంగ సభలో అప్పటి ఉప ముఖ్యమంత్రి యల్. తోమ్‌పాక్ సింగ్ ప్రసంగించారు. తన ఉద్రేక పూరిత ఉపన్యాసంలో ఆయన "హిందూ అని పిలుచుకోవడంలో తప్పుగాని, సిగ్గు పడాల్సిందిగాని ఏమీలేదు. ఒక వ్యక్తి తన స్వధర్మాన్ని ఆచరించడం, దాని ఎడల గర్వాన్ని కలిగి వుండడం మతతత్వం ఎంతమాత్రం కాబోదు" అన్నారు. "బైబిల్ చదవడం ద్వారా, చర్చికి వెళ్ళడం ద్వారా తన మతానికి చెందిన ఉత్సవాలలో పాల్గొనడం ద్వారా మన ముఖ్యమంత్రి రిషాంగ్ కీషింగ్ ఒక మంచి క్రైస్తవుడు కాగలిగినపుడు, నేను నా ధర్మాన్ని నిష్ఠతో ఆచరిస్తే, గీతను పఠిస్తే, గోవింద్‌జీని ఉపాసిస్తే, ఇలాంటి ధార్మిక ఉత్సవాలకి హాజరైతే మతతత్వ వాదిని ఎందుకు అవుతాను?" అనికూడా

ఆయన ప్రశ్నించారు. రియాంగ్, త్రిపురి గిరిజనుల పుణ్యక్షేత్రమైన తీర్థముఖ్ నుండి బయలుదేరిన ఉపరథానికి గ్రామప్రధాన్ రామానంద్ స్వాగతం పలికాడు. మార్క్సిస్ట్ పార్టీ తరపున ఎన్నికైన ప్రతినిధి ఆయన. 'విష్ణుపాద్' నుంచి ఆ రథంలో వచ్చిన పవిత్ర జలాలను ఆయన స్వయంగా పూజించాడు. రాత్రంతా భజనలు కీర్తనలతో గడిపాడు."

"తేజ్‌పూర్, మంగళదోయ్, నల్బారీ వంటి అనేక స్థలాల్లో 'ఆసు' కార్యకర్తలు కూడా రథయాత్రలో సమధికోత్సాహంతో పాల్గొనటం కనిపించింది."

"అక్టోబర్ 31వ తేదీన మూడు రథాలు 'గౌహతి' చేరుకున్నాయి. పట్టణం వెలుపల వాటికి భవ్యమైన స్వాగతం లభించింది. (ఒక పెద్ద పందిరిని నిర్మించి దానిక్రింద రథాలు నిలిపారు. ఆ రథాలు తరువాత జంషెడ్‌పూరు వద్ద 'కపిల' రథాన్ని కలుసుకున్నాయి). ఆ సందర్భంగా గౌహతి గురుద్వారా కూడా ప్రత్యేక గ్రంథ సాహెబ్ పఠన కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది."

ఈ రథాలు సాగిన మార్గంలో ఏ ఒక్కచోట మత ఉద్రిక్తతలకు దారితీసే సంఘటన ఒక్కటి కూడా జరుగలేదు. నిజానికి మిజోరం, నాగాలాండ్, లఖింపూర్ జిల్లాలోని 'శిలపత్తర్', ప్రధానంగా బంగ్లాదేశ్ ముస్లిం అక్రమ ప్రవేశకుల మధ్య చిక్కుకుని వున్న 'నౌగాంగ్' జిల్లాలోని 'నెల్లీ', అస్సామీ, బెంగాలీ ఘర్షణలకు పేరుగాంచిన 'ఖరపేటియా' మొదలయిన సమస్యాగ్రస్త ప్రాంతాల గుండా రథయాత్రలు సాగాయి.

"షిల్లాంగ్‌లో దాదాపు పదివేలమంది ప్రజానీకం మూడు గంటలపాటు రథం రాకకై ఎదురుచూస్తు నిలబడ్డారు. వారిలో పాఠశాలలకు వెళ్ళే పసిపిల్లలు కూడా ఉన్నారు. 'మంగళదోయ్' వద్ద ఇరవై వేలమంది, తేజ్‌పూర్ వద్ద ఇరవై ఐదు వేలమంది ప్రజలు రథాన్ని స్వాగతించడానికి రాత్రి పదిన్నరవరకు వేచి ఉన్నారు. యాత్ర సందర్భంగా పాఠశాలలన్నింటికీ సెలవు ప్రకటించారు."

"మిజోరంలో, అస్సాం సరిహద్దులలోని 'దేవగిరి' బౌద్ధ మందిరం నుండి అక్కడి బౌద్ధ సన్యాసులు పవిత్ర జలాలను తీసుకొని వచ్చారు. మేఘాలయలోని గారో కొండల ప్రాంతంలోగల 'తుర' ప్రాంతం నుండి 'మహామాయ రథం' అనే మరొక ఉపరథం బయలుదేరింది. దానికి స్వాగతం పలుకడానికి గారోలు, కచరీలు, రాఖాలు, హాజోంగ్‌లు, అస్సామీలు, బెంగాలీలు, నేపాలీలు, ఇతరులు పెద్ద సంఖ్యలో తరలివచ్చారు."

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (11-12-83)లో ఏకాత్మతా యజ్ఞాన్ని సమర్థిస్తూ సమస్త హిందూ జగత్తుకు శ్రీ యం.వి. కామత్ ఇలా వ్రాస్తున్నారు.

"ఇంతకీ ఏకాత్మతా యజ్ఞం సాధించదలచింది ఏమిటి? భారతదేశం ఒక చిన్న గణతంత్ర రాజ్యంకాదు. కనుక ఇక్కడి కోటానుకోట్ల సమాజానికి ఒక సమగ్రమయిన, అవిభాజ్యమైన భారతదేశ భావన అర్థం కావించడమే ఈ యాత్ర ఉద్దేశ్యం."

ఈ విశిష్టమయిన ఏకాత్మతా యాత్ర కార్యక్రమం పట్ల పత్రికలే ఇంతటి మహదానందాన్ని ప్రకటించినపుడు ఇక సామాన్యుల హృదయాలలో ఎంతటి భావోద్వేగాలు ఉప్పొంగి ఉంటాయో కదా!

ఏకాత్మతా యజ్ఞం సాధించిన విశిష్ట విజయాన్ని ఇలా పేర్కొనవచ్చు. మామూలుగా దేశమంతటా యాత్రలు చేసే సందర్భంలో యాత్రికులకు తమ వ్యక్తిగత, కౌటుంబిక, మొక్కుబడులను తీర్చుకోవడం, వివిధ ధార్మిక క్రతువులను పూర్తిచేసుకోవడం మాత్రమే లక్ష్యంగా ఉంటాయి. కానీ స్వయంగా భారతమాత అపరదేవతా మూర్తిగా విరాజిల్లిన ఏకాత్మతా యాత్రలో సామాజిక పుణ్యము, జాతీయ పుణ్యాలకే ప్రాధాన్యత ఇవ్వబడింది. వ్యక్తిగత పుణ్యానికి అందులో స్థానం లేదు. సమాజం ఎడల కర్తవ్యం - అంటే సమాజ ధర్మం, జాతి ఎడల కర్తవం - అంటే రాష్ట్ర ధర్మం- వీటిని పునర్‌జాగృతం చేయడం ఈ యాత్ర లక్ష్యం. అంతేకాదు. తమ తీర్థయాత్రల ద్వారా మనదేశంలోని కోటానుకోట్ల ప్రజానీకం భారతదేశాన్ని ఒక పుణ్యభూమి రూపంలో తమ హృదయాలలో ప్రతిష్ఠించుకొని ఉన్నారు. అయితే ఈ దేశం మన జాతీయ మాతృభూమి అనే భావన కూడా ఇంతే ప్రబలంగా లేనికారణంగా గుప్పెడుమంది విదేశీ దురాక్రమణదారుల చేతుల్లో మనం పరాజయాన్ని, బానిసత్వాన్ని అనుభవించవలసి వచ్చింది. స్వాతంత్ర్య పోరాట సమయంలో 'వందేమాతరం' 'భారత్‌మాతాకీ జయ్' అనే రణనినాదాలు ప్రజలలో దేశభక్తిని, జాతీయ భావనను ఉవ్వెత్తున ఉప్పొంగేటట్లు చేశాయి. భారతమాత యెడల మాతృభూమిగా భక్తి భావనను జాగృతం చేయడం వెనుక ఎంతటి భవ్యమైన శక్తి దాగివున్నదో అవి నిరూపించాయి.

సంక్షిప్తంగా చెప్పాలంటే ఏకాత్మతా యాత్ర ఒక నూతన పథాన్ని దర్శింపజేసింది. ఉదాత్త జాతీయ శ్రద్ధా కేంద్రాల ఆధారంగా సముచితమయిన, శాశ్వతమయిన రీతిలో జాతి హృదయాలను సమైక్య పరిచేందుకు ఏకైక పథమదే.

## 14

# అత్యవసర పరిస్థితి ఉక్కు సంకెళ్ళను ఛేదించుకుని.....

1975 జూన్ 25వ తేదీన దేశంలో అత్యవసర పరిస్థితి విధించబడింది. అపురూపమైన రాజకీయ విలువలకు కఠోరమైన సవాలు ఎదురయింది. స్వతంత్ర భారతం చేష్టలుడిగి నిలుచుండిపోయింది.

"నా చుట్టూ వున్న యీ ప్రపంచం కుప్పకూలిపోయింది. నా జీవిత కాలంలో అది తిరిగి ఒకపై లేచినిలబడడం చూడలేనేమోనని నేను ఎంతో ఆందోళన చెందాను." ఈ హృదయాలను కదిలించే వాక్యాలతో లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ తన జైలు డైరీని వ్రాయడం ప్రారంభించారు. అత్యవసర పరిస్థితి సమయంలో చండీఘర్‌లో నిర్బంధంలో వున్నప్పుడు ఆయన ఆ జైలు డైరీని వ్రాసారు.

నిజానికి యావత్ ప్రజానీకపు మానసిక స్థితికి ఆయన మాటలు ఒక దర్పణం. 1975 జూన్ 26నాడు పిడుగులా వచ్చిపడిన అత్యవసర పరిస్థితి దేశాన్ని దిగ్భ్రాంతం చేసింది. ప్రజల మౌలిక స్వాతంత్ర్యాలను హరించి వేశారు. పత్రికల నోళ్ళు నొక్కారు. న్యాయస్థానాలను నిర్వీర్యం చేశారు. పార్లమెంటు స్తంభించిపోయింది. సంఘాన్ని నిషేధించారు. అరవై కోట్ల సమస్త భారత జాతి రాత్రికి రాత్రి స్వతంత్రం నుండి బానిసత్వంలోనికి నెట్టివేయబడింది. రోజులు గడుస్తున్న కొద్దీ పరిస్థితులు మరింత దిగజారాయి.

గతంలోని బ్రిటిష్ వారి బానిసత్వం కంటె ఈ ఆంతరంగిక బానిసత్వమే జాతిని మరింత అణచివేతకు గురిచేసింది. వాస్తవాలను వెలుగు చూడనివ్వకుండా పూర్తిగా త్రొక్కిపెట్టారు. నిరసనలకు సంబంధించిన ఒక్కమాట కూడా బయటకు పొక్కనివ్వలేదు. ఆఖరికి నిర్బంధించిన జాతీయ నాయకుల ఆచూకీ సైతం తెలియని పరిస్థితి ఏర్పడింది. దీనికి

తోడు నిర్బంధితులైన నాయకులు, నిషేధించిన సంస్థలకు — ముఖ్యంగా సంఘానికి వ్యతిరేకంగా ప్రభుత్వం పెద్ద ఎత్తున విష ప్రచారానికి దిగింది. ఆకాశవాణి, దూరదర్శన్, వార్తా చిత్రాలు (డాక్యుమెంటరీస్), విధేయులైన పత్రికలు- ఇవన్నీ ప్రభుత్వానికి వంతపాడడం ప్రారంభించాయి. అత్యవసర పరిస్థితిని వారు ఆకాశానికి ఎత్తేశారు. ఒక నూతన క్రమశిక్షణ, ఇరవై సూత్రాల పథకం, పట్టాలు తప్పిన ప్రజాస్వామ్యాన్ని తిరిగి దారిలో పెట్టడం, పోలీసులకు, సైన్యానికి జె.పి. ఇచ్చిన పిలుపువల్ల తలెత్తే చట్ట వ్యతిరేక విద్రోహకాండ నుండి దేశాన్ని కాపాడడం- ఈ నినాదాలన్నీ నూతన విధానపు సంకేతాలు అయ్యాయి.

## తలవంచని భారతం:

మొదట్లో ఇందిరాగాంధీ తనకెదురైన సవాళ్ళన్నింటికీ ఈ ఒక్క దెబ్బతో తగు సమాధానం చెప్పినట్లుగానే కనబడింది. జయప్రకాశ్ జీ యొక్క ప్రజా విప్లవం, వ్యతిరేక ధోరణులు అవలంబిస్తున్న పత్రికారంగం, గుజరాత్ ఎన్నికల్లో పరాజయం, అలహాబాదు హైకోర్టు తీర్పు, ఉన్నత స్థానాలలో అవినీతి, నేర ప్రవృత్తులపై పార్లమెంటులో రోజూ వెలుగులోకి వస్తున్న విషయాలు- ఒక్క దెబ్బతో ఆమె వీటన్నింటినీ అణగద్రొక్కేశారు. ప్రజాస్వామ్య ప్రపంచం నిర్ఘాంతపోయింది. ప్రపంచంలో అతిపెద్ద ప్రజాస్వామ్యం కనీస నిరసనకూడా తెలియచేయలేనంతగా అణచివేతకు గురి అవుతుందని వారు ఊహించనయినాలేదు. భారతదేశం ఇక సుదీర్ఘకాలం పాటు నియంతృత్వంలో మ్రగ్గవలసి వుంటుందని దాదాపుగా ప్రపంచమంతా భావించింది. దానినుండి బయటపడే మార్గాంతరమే కన్పించలేదు. ఒక సన్నని కాంతికిరణం కూడా ప్రసరించని గాఢాంధకారమది.

అయితే అదృష్టవశాత్తూ కథ ఇంతటితో ఆగిపోలేదు. పైకి జాతి అంతా ఒక స్మశాన నిశ్శబ్దం ఆవరించినట్లు కనిపిస్తున్నప్పటికీ లోలోపల అగ్నిపర్వతం రాజుకుంటూ వుంది. అది నెమ్మది నెమ్మదిగా మరింత తీవ్రతరమై, మొట్టమొదటి అవకాశం లభించగానే ఒక్కసారి బ్రద్దలయింది.

1977 మార్చిలో జరిగిన ఎన్నికలు కురుక్షేత్ర సంగ్రామంగా మారాయి. ప్రజలలోని సాత్వికశక్తులన్నీ ఒకవైపు, నియంతృత్వ ప్రభుత్వం మోహరించిన క్రూరమయిన అణచివేత, విధ్వంసక శక్తులు మరొకవైపు నిలిచాయి. విజయం సాత్విక శక్తులకే లభించింది. నియంతృత్వ శక్తిపై ప్రజాశక్తి విజయాన్ని సాధించింది. బంధనాల విముక్తి ప్రజలలో కలిగించిన ఆనందం వర్ణనాతీతం. కాళరాత్రి కరిగిపోయింది. మరల స్వాతంత్ర్య భానూదయం జరిగింది—

జరిగినదొక అద్భుతం. విషాదాంతమౌతుందనుకున్న కథ తెల్లవారే సరికి మరింత నాటకీయమయిన ముగింపుకు చేరుకుంది. అత్యంత ప్రియమయిన ఆకాంక్షలకు, అత్యున్నతమయిన ఊహలకు సైతం అందని ఈ పరివర్తనను ఏ శక్తి సాధించింది? అందరినీ తనలో చేర్చుకొని, ఒక శక్తివంతమయిన ప్రజా ప్రతిఘటన ఉద్యమంగా రూపొందిన ఆ ప్రధాన శక్తి ఏది?

## ప్రధాన సాధనం:

అనుభవశాలియైన పాత్రికేయులు, మద్రాసునుండి వెలువడే 'ది ఇండియన్ రివ్యూ' పత్రిక సంపాదకులు అయిన శ్రీ యం.సి. సుబ్రమణ్యం ఏప్రిల్ 1977 సంచికలో ఇలా వ్రాశారు.

"ఈ ఉద్యమాన్ని సుదీర్ఘకాలం వీరోచిత పద్ధతిలో నడిపించిన సంస్థలలో ఆర్.యస్.యస్. బృందాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పకోవాలి. సత్యాగ్రహాలు నిర్వహించడంలోనూ, దేశవ్యాప్తంగా వార్తా సంబంధాల వ్యవస్థ నిర్వహించడంలోనూ, ఉద్యమానికవసరమయిన ధనాన్ని ఎలాంటి హడావుడి లేకుండా సేకరించటంలోనూ, ఎటువంటి ఒడిదుడుకులూ లేకుండా సాహిత్యాన్ని పంచిపెట్టే వ్యవస్థ చేయడంలోనూ, జైళ్ళలో ఇతర రాజకీయ పక్షాలకు, ఇతర విశ్వాసాలకు చెందిన తోటి నిర్బంధితులకు సహాయాలు అందించడంలోనూ వారు తమ ప్రత్యేకతను చాటిచెప్పారు. ఈ దేశంలో సామాజిక, రాజకీయ కార్యకలాపాలను కొనసాగించడానికి ఒక సన్యాసుల సైన్యం కావాలని స్వామి వివేకానంద ఇచ్చిన పిలుపుకు తాము దగ్గర సమాధానంగా నిలుస్తామని వారు నిరూపించారు. వారిది నిగ్రహంతో కూడుకున్న విప్లవశక్తి. తోటి రాజకీయ కార్యకర్తల అభిమానాన్ని, పూర్వపు రాజకీయ ప్రత్యర్థుల గౌరవాన్ని సైతం వారు చూరగొన్నారు". భారతదేశంలో జరిగిన ఈ అజ్ఞాత ఉద్యమాన్ని "ప్రపంచంలోని ఏకైక వామపక్షేతర విప్లవోద్యమం"గా 1976 డిసెంబర్ నాలుగవ తేదీన వెలువడిన ప్రతిష్ఠాత్మక 'లండన్ ఎకనమిస్ట్' పత్రిక అభివర్ణించింది. "పెద్ద సంఖ్యలో నవ యువకులు ఉద్యమంలో వచ్చి చేరుతున్నప్పటికీ ప్రధానంగా వేలాదిమంది ఆర్.యస్.యస్. కార్యకర్తలే ఉద్యమానికి అధిపత్యం వహిస్తున్నారు. ప్రస్తుతం ఆ ఉద్యమం ముందు ఒకే ఒక లక్ష్యం ఉంది- భారతదేశంలో తిరిగి ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడం." అని ఆ పత్రిక వ్రాసింది.

పోలీసుల క్రూరమయిన దాడులను సైతం ఎదుర్కొని అత్యంత

సాహసపూర్ణమైన పద్ధతిలో స్వయంసేవకులు సత్యాగ్రహోద్యమాన్ని నడిపించారు. ఆఖరికి మార్క్సిస్టు పార్లమెంటు సభ్యుడు ఎ.కె. గోపాలన్ సైతం దానిని చూచి చలించి పోయారు. "వారిలో దీక్షాదక్షతలకు, ధైర్యోత్సాహాలకు ప్రేరణనిచ్చే ఉదాత్తమైన ఆదర్శమేదో వారి ముందుంది" అన్నారు ఆయన.

అత్యవసర పరిస్థితి నాటి ఘటనలపై డి.ఆర్. మంకేకర్, బి.యం. సిన్హా వంటి ప్రముఖ పత్రికా రచయితలు వ్రాసిన గాథలు కూడా ఇదే సత్యాన్ని మరింత విస్తృతంగా వెల్లడిస్తాయి.

'ఆర్.యస్.యస్! అవును. అదే కేంద్రకం, అదే కేంద్ర బిందువు.

అన్ని రకాల వార్తా ప్రసార మార్గాలను పూర్తిగా త్రెంచి వేయడంతో అత్యవసర పరిస్థితి కల్పించిన తీవ్ర విఘాతాన్ని ప్రజలు గుర్తించారు. పత్రికారంగం, బహిరంగవేదికలు, తంతి తపాలాశాఖ, ఎన్నికయిన శాసనసభలు - అన్నీ అచేతనంగా ఉండిపోయాయి. అటువంటి స్థితిలోకూడా అత్యవసర పరిస్థితికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా శక్తి సమీకరణ జరిగింది. మరే ఇతర సంస్థకు సాధ్యమయ్యే పనికాదిది. దేశమంతా వ్యాపించి ఉన్న శాఖా యంత్రాంగం కలిగిన రాష్ట్రీయ స్వయంసేవక సంఘం మాత్రమే అందుకు సమర్థత కలిగిన సంస్థ. ప్రారంభ దినాలనుండి సంఘం వ్యక్తితోవ్యక్తిని సంపర్కం చేసే తనదైన ఒక తంత్రం ఆధారంగానే వికసించింది. పత్రికారంగంపైనగాని, ఇతర వేదికలపైనగానీ, ప్రజా సంబంధాలకోసం అది ఎప్పుడూ ఆధారపడలేదు. కనుక ప్రభుత్వం వార్తా ప్రసార మార్గాలను మూసివేసిన కారణంగా రాజకీయ షక్షాలు స్తంభించి పోయాయేమోగాని సంఘం ఏమాత్రం తొణకలేదు. అఖిల భారత స్థాయిలో జరిగిన నిర్ణయాలు అక్కడనుండి ప్రాంత స్థాయికి, అక్కడినుండి విభాగ్ స్థాయికి, అలా జిల్లా, తాలూకా, గ్రామం వరకూ చేరుకొనేవి. అత్యవసర పరిస్థితి విధించిన మొదటి రోజునుండి దానిని తొలగించే రోజు వరకు ఈ వార్తా ప్రసార మార్గాలు అద్భుతమయిన పద్ధతిలో పనిచేశాయి. అదీ, వేలాదిమంది సంఘ కార్యకర్తలు నిర్బంధింపబడిన తరువాత కూడా.

ఈ వార్తా ప్రసార మార్గాలు కేవలం సంఘ కార్యకర్తలకు మాత్రమే పరిమితం కాలేదు. ప్రతిషక్షాలకు చెందిన అన్ని శక్తులనూ అవి అనుసంధానం చేశాయి. శ్రీ అచ్యుత పట్వర్ధన్ ఇలా వ్రాశారు (ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 9, జూన్ 1979) "రాజకీయ ప్రతిఘటనలో మరే ఇతర వర్గంతో కలిసి పనిచేయటానికైనా వారు ((స్వయంసేవకులు)) ఉత్సాహంతో, నిష్ఠతో సంసిద్ధంగా ఉన్నారు. అణచివేత, అసత్యాలకు నిలయమయిన

క్వారప్రభుత్వాన్ని వ్యతిరేకించే అన్ని శక్తులకు సహకరించడానికి, వారితో కలిసి పనిచేయడానికి వారు సదా సర్వదా సిద్ధంగా ఉన్నారు. జైళ్ళలో ఆర్.యస్.యస్. నాయకులతోనూ, వందలాదిమంది ఇతరులతోనూ కలిసి జీవించిన అనేకమంది యొక్క అనుభవం ఈ అభిప్రాయంతో సంపూర్ణంగా ఏకీభవిస్తుంది. ఈ విషయం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తున్నది."

ప్రారంభం నుండి శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ఉద్యమ నిర్వహణ భారాన్నంతటినీ సంఘ ప్రచారక్ అయిన శ్రీ నానాజీ దేశ్‌ముఖ్‌కు అప్పగించారు. దేశంలో అజ్ఞాత ప్రతిఘటనోద్యమాన్ని నిర్వహించేందుకు ఆయనను లోక్ సంఘర్ష సమితి కార్యదర్శిగా నియమించారు. అయితే కొద్ది రోజులలోనే ఆయన పోలీసుల చేతిలో చిక్కారు. ఆ తర్వాత ఆ బాధ్యతలను శ్రీ రవీంద్రవర్మ స్వీకరించారు. ఆయన పాత కాంగ్రెసుకు చెందిన వారు. సంఘకార్యకర్తలతో కలిసి పనిచేస్తున్నపుడు కలిగిన అనుభవాలను గురించి వారు వ్రాసిన విషయాలు తప్పక చదువదగ్గవి. 1975 డిసెంబరు 22వ తేదిన లోక్ సంఘర్ష సమితి కర్ణాటక శాఖకు చెందిన సంఘప్రచారక్‌కు ఒక లేఖ వ్రాస్తూ ఆయన "మీ ప్రాంతం నుంచి వచ్చిన నివేదికలను విని నేనెంతో ఆనందోత్సాహాలను పొందాను. మీరంతా ఈ విజయాలు సాధించడానికి ఎంతటి యోజనా బద్ధంగా కృషి చేసి ఉంటారో నాకు తెలుసు. మీతోనూ, మీ స్నేహితులతోనూ సాన్నిహిత్యం ఏర్పడిన నాటినుండీ మీ స్నేహితుల బృందం అందరి ఎడల నేను అత్యున్నత ప్రశంసా భావననూ, ఆత్మీయతా భావననూ కలిగి ఉన్నాను. మీరు దేనికోసం కృషి చేశారో, దేనిని సాధించారో అది అనేకమంది ఇతరులకు ఒక ప్రేరణదాయక ఉదాహరణగా నిలుస్తుంది."

అజ్ఞాత ఉద్యమ వ్యవస్థకు సంఘ కార్యకర్తల ఇళ్ళు గొప్ప వర ప్రదానంగా పనిచేశాయి. అజ్ఞాత కార్యకర్తలు, వారి సమావేశ స్థలాల ఆచూకీ తెలుసుకోవడంలో గూఢచారి విభాగం అధికారులు కూడా వైఫల్యం చెందడానికి కారణమిదే. కేవలం సంఘ కార్యకర్తలకే కాక, లోక్ సంఘర్ష సమితికి చెందిన అందరికీ ఆ ఇండ్లలో ఆశ్రయం లభించింది. అందులో ఎటువంటి విచక్షణా లేదు. ఉదాహరణకి కర్పూరీ ఠాకూర్ తరచు సంఘ కార్యకర్తల ఇండ్లలోనే రహస్య వాసం చేసేవారు.

పోరాట పటిమ కలిగిన కార్యకర్తలను సంపర్కించేసి, సమీకరించటా నికి శాఖలు ఆ సమయంలో చైతన్య వంతమైన రహస్య కేంద్రాలుగా పనిచేశాయి. ప్రేరణ, మార్గదర్శనం, పరస్పర విశ్వాసం, సహకార భావనలను అవి ప్రసరింప చేశాయి. ఇదంతా అత్యవసర పరిస్థితి విధించిన

కొద్ది రోజులలోనే ప్రారంభమైపోయింది. అత్యవసర పరిస్థితి సవాలును స్వీకరించమని, రానున్న పోరాటం కోసం ప్రజలను సమీకరించటానికి, వారిని ప్రేరేపితులను చేయడానికి అన్ని రకాల ప్రయత్నాలను సాగించమని జూన్ 27వ తేదీన శ్రీ బాలాసాహెబ్ దేవరస్ స్వయంసేవకులకు పిలుపునిచ్చారు.

## బట్టబయలైన ప్రభుత్వ బండారం:

సామాన్య ప్రజానీకంతో సంబంధాలనేర్పరచుకొని వారికి పోరాట సందేశాన్ని అందించడం ప్రధానమయిన సవాలు అయింది. ఉన్న మార్గమల్లా అజ్ఞాత సాహిత్య మొక్కటే. ఇక్కడకూడా సంఘ యంత్రాంగం సమయానికనుగుణంగా సంసిద్ధమయింది. స్వయంసేవకుల గృహాలు సైక్లోస్టైల్ యంత్రాల కేంద్రాలుగా మారాయి. రహస్యంగా ముద్రణాలయాలను కూడా నెలకొల్పారు. దేశం మొత్తంలో వందలాదిమంది ముద్రణ కర్తలు కూడా సాహసంగా ముందుకొచ్చారు. ప్రభుత్వానికి అతి పెద్ద ఆందోళనకర విషయం, సవాలు అదే అయింది. దేశం అంతటా వివిధ పేర్లతో క్రమం తప్పకుండా పక్ష పత్రికలు వెలువడసాగాయి. జిల్లా వార్తా లేఖలను ప్రాంత స్థాయితో సంగ్రహించి, వాటిని కేంద్రానికి పంపించేవారు. కేంద్రం నుంచి వెలువడే అఖిలభారతీయ పత్రిక అప్పుడు అన్ని ప్రాంతాలకు పంపించబడేది. అమెరికాకు చెందిన 'న్యూస్‌వీక్' పత్రిక ప్రతినిధులయిన జాక్ ఎండర్సన్, జార్జ్‌లైజుల్ వంటి విదేశీ పత్రికా ప్రతినిధులకు కొత్త ఢిల్లీ నుండి నియమితంగా ఈ వార్తలు అందజేస్తుండే వారు. కొద్ది కాలం తరువాత కేంద్రంనుండి సత్యసమాచార్ పేరిట ఒక కేంద్రీయ పత్రికను వెలువరించడం ప్రారంభించారు. అత్యవసర పరిస్థితి యొక్క వికృత రూపాన్ని బట్టబయలుచేసే చిన్న చిన్న పుస్తకాలను ప్రచురించారు. విద్యార్థులు, కార్మికులు, స్త్రీలు, రైతులు, పత్రికా రచయితలు, ప్రాధ్యాపకులు, పారిశ్రామికవేత్తలకు ఉద్దేశించిన ప్రత్యేక సందేశాలను వారికి అందజేసేవారు. దేశంలోని వివిధ ప్రాంతాలలో జరుగుతున్న పోరాటపు ప్రేరణదాయక సంఘటనలు, రంగంలో చేరిన విశిష్ట వ్యక్తుల వివరాలు, వారి నిప్పులు గ్రక్కే సందేశాలు, విదేశాలనుండి పోరాటానికి లభిస్తున్న ప్రతిస్పందన, గిలిగింతలు పెట్టే వ్యంగ్య చిత్రాలు, నినాదాలు, ఆగస్టు 9, ఆగస్టు 15, గాంధీ జయంతి, విజయదశమి, సంక్రాంతి, జూన్ 26 మొదలయిన ప్రత్యేక సందర్భాలలో ప్రజలకు సందేశం - ఇవన్నీ వేచిఉన్న ప్రజానీకాన్ని ముంచెత్తాయి. సంపూర్ణంగా

ప్రభుత్వపు బంట్లుగా మారిన అనేక నియమిత వార్తా పత్రికలకు భిన్నంగా అజ్ఞాత పత్రికలు ప్రజా పత్రికలుగా రూపొందాయి.

## బహిరంగ పోరాటం:

ఏ చిన్న అవకాశం లభించినా రహస్య ఉద్యమం కాస్తా బహిరంగ ఉద్యమంగా రూపు దాల్చేది. 1975 అక్టోబర్ 2వ తేదీన గాంధీ జయంతిని ఒక అవకాశంగా చేసికొని "అసత్యం, అన్యాయాలముందు తలవంచడం పిరికితనం" అనే గాంధీజీ సందేశాన్ని బ్యాడ్జీలు, పోస్టర్ల ద్వారా ప్రచారం గావించారు. పోలీసులు ఈ ప్రచారంపై కూడా పెద్ద ఎత్తున విరుచుకుపడి వందలాది మంది కార్యకర్తలను కటకటాల వెనక్కు నెట్టారనుకోండి!

1975 అక్టోబర్ చివరి వారంలో న్యూఢిల్లీలో జరిగిన కామన్‌వెల్తు దేశాల సమ్మేళనంలో పాల్గొనేందుకు అనేకమంది విదేశీ ప్రతినిధులు వచ్చారు. లోక్ సంఘర్షణ సమితికి ఇదొక చక్కని అవకాశంగా లభించింది. సమ్మేళనానికి భారతదేశంలోని ప్రతిపక్ష బృందాన్ని కూడా ఆహ్వానించారు. ఆ బృందం సమ్మేళన సభాస్థలిలోనే పెద్ద ఎత్తున తమ నిరసనను ప్రకటించింది. ఆ తరువాత చారిత్రాత్మక ఎర్రకోటలో ఆ ప్రతినిధులకు ప్రభుత్వం ఏర్పాటుచేసిన విందులో సత్యాగ్రహులు ఎంతో సాహసంతో పెద్ద ప్రదర్శనను నిర్వహించారు. వారంతా స్వయంసేవకులే. అధికారులు తీసుకున్న అనేక భద్రతా చర్యలను సైతం ధిక్కరించి వారు ఆ ప్రదర్శనను నిర్వహించగలిగారు. అమెరికాకు చెందిన 'న్యూయార్క్ టైమ్స్' (9-11-1975) పత్రిక ఈ సంఘటనలకు సంబంధించిన ప్రత్యక్ష నివేదికను ప్రచురించింది. తద్వారా వెల్లడయిన వాస్తవాలు యావత్ ప్రపంచాన్ని దిగ్భ్రమకు లోనుచేశాయి.

రాజ్యాంగానికి చేయతలపెట్టిన 42వ సవరణపై ప్రభుత్వం బహిరంగ చర్చకు అతి తక్కువ అవకాశాన్ని కల్పించింది. ప్రభుత్వపు ఉద్దేశాలు స్పష్టమైనవే. ప్రజల ప్రజాస్వామిక సంకల్పాన్ని సుదృఢం చేయడం అనే సాకు చూపించాలని వారు ప్రయత్నించారు. ప్రజలను చైతన్యవంతులను చేసేందుకు లోక్ సంఘర్ష సమితి కార్యకర్తలకు అది మరొక చక్కని అవకాశంగా లభించింది. ఈ అవకాశం కూడా వదలడానికి వీలులేదు. సంఘం యొక్క మొత్తం రహస్య యంత్రాంగం రంగంలోకి దూకింది. అఖిల భారత స్థాయినుండి జిల్లా స్థాయి వరకు సదస్సులు, సమ్మేళనాలు నిర్వహించారు. రాజ్యాంగ వేదికల మీదనుండి

పోరాటంలో భాగస్వాములు కావలసిందని రచయితలకు, పత్రికా రచయితలకు, రాజకీయ నాయకులకు, విద్యావేత్తలకు, న్యాయవాదులకు వారు పిలుపునిచ్చారు. ఊహకందని ఫలితాలు వారికి లభించాయి. ప్రేరణదాయకమయిన, హృదయరంజకమయిన ప్రజా ఉత్సాహము, ప్రతిస్పందనల దృశ్యాలు కానవచ్చాయి. జాతి అంతరాత్మ జాగృతమయింది.

ఈ జాగృతి మేధావులకే పరిమితం కాలేదు. ఉపేక్షిత వాడల వరకు, గ్రామీణ ప్రజానీకం వరకు అది వెళ్ళింది. ధార్మికోత్సవాలు, భజనలు, వైద్యసేవ, బోధనా తరగతులు, యువజన కేంద్రాలు- ఇవన్నీ సామూహిక జాగరణకు సాధనాలుగా నెమ్మదిగా రూపొందసాగాయి. దాదాపు లక్షమంది క్రియాశీల స్వయంసేవకులు చెరసాలలలో మగ్గుతున్న సమయంలో సంఘం ఈ ఉద్యమాన్ని చేపట్టిందని మనం మరచిపోరాదు.

అజ్ఞాత యంత్రాంగం ఆధారంగానే నిధుల సేకరణ అంతా జరిగింది. వేలాది రహస్యకార్యకర్తల చురుకైన కదలికలు, పత్రికల సైక్లోస్టయిలింగ్, ముద్రణ, 'మీసా చట్టం' క్రింద కుటుంబ పోషకులు జైలుకు వెళ్ళిన కుటుంబాల పోషణ భారం- వీటన్నింటి కోసం ప్రతి రాష్ట్రంలోనూ లక్షలాది రూపాయలు అవసరమయ్యాయి. జాతీయ స్థాయిలో సంఘ ప్రచారక్ అయిన ఒక ప్రముఖ నాయకుడు ఇదే పనిమీద దేశమంతా తిరిగారు. అయితే విరాళాలలో ప్రధాన భాగం స్వయం సేవకులు, ఇతర అభిమానులదే.

## మాట నిలబెట్టుకున్న తీరు:

ఒక బ్రహ్మాండమైన సత్యాగ్రహం నిర్వహించాలా? వద్దా? అనే కీలకమైన నిర్ణయాన్ని లోక్ సంఘర్షణ సమితి తీసుకొనవలసి ఉంది. వార్తా సంబంధాల విచ్ఛిత్తి, వార్తలపై పూర్తి నిషేధం, క్రియాశీల ప్రతిపక్ష నేతలను మీసా క్రింద అరెస్టుచేసి, వారి నోళ్ళు నొక్కడం- ఇవన్నీ ఒక ప్రజా ఉద్యమం ప్రారంభించడం అసాధ్యమని సూచించసాగాయి. అసలు ఈ ప్రయత్నం ప్రారంభమే కాబోదని, దాని వలన అసలు ఉద్యమమే నీరుగారి పోయే ప్రమాదమున్నదని కూడా కొందరు అభిప్రాయపడ్డారు. ప్రభుత్వపు ప్రచార యుద్ధానికి దీనివలన మరొక ఆయుధం లభిస్తుంది. ఒకవేళ ఉద్యమం ఊపందుకున్నా, నియంత ధోరణి ఎలా ఉన్నదంటే అలాంటి ప్రజా ఉద్యమాలను ఆమె ఏమాత్రం లక్ష్య పెట్టకపోవచ్చు. మొత్తం ఉద్యమం దానంతటదే నీరుగారిపోయేవరకు మరొక లక్షమందిని జైళ్ళలో క్రుక్కటానికి కూడా ఆమె వెనుకాడదు. ఇది ఒక అభిప్రాయం.

అయితే మరొక అభిప్రాయం కూడా ఉంది. ఎట్టి పరిస్థితులలోనూ జాతియొక్క పోరాట పటిమను ప్రజ్వలింపచేస్తూ ఉండాలి. లేకపోతే జాతికి ఆ సమయంలో కానీ, భవిష్యత్తులోకానీ ఎటువంటి ఆశా ఉండబోదు. ఆ పోరాట భావనను ఉద్దీపితం చేసేందుకు సత్యాగ్రహమొక్కటే మార్గం. విశ్వాసాన్ని కల్గించే అంశం మరొకటి కూడా ఉంది. సంఘం నిర్మాణం చేసిన అద్భుతమయిన అజ్ఞాతోద్యమం ఈ అగ్ని పరీక్షను అత్యంత సమర్థవంతంగానూ, దృఢంగాను ఎదుర్కొగల సామర్థ్యం కలిగి ఉంది.

ఏర్రవాడ జైలులో ఉన్న శ్రీ బాలాసాహెబ్ దేవరస్‌కు ఈ అభిప్రాయాలను తెలియబరచారు. వారినుండి వెంటనే సుస్పష్టమయిన నిర్ణయం వెలువడింది. "ముందుకు సాగండి. పోరాటం ప్రారంభించండి."

చారిత్రాత్మక నిర్ణయం జరిగింది. సంఘంఎడల ప్రజలకున్న విశ్వాసం మరొకసారి నిరూపితమయింది. మొత్తం లక్షాముప్పైవేల సత్యాగ్రహులలో లక్షమందికి పైగా సంఘానికి సంబంధించిన వారే. 'మీసా' క్రింద నిర్బంధితులయిన ముప్పైవేలమందిలో 25 వేల మంది సంఘానికి సంబంధించిన వారేకావడం విశేషం. ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 354 స్థలాలనుండి 2 వేల మంది సత్యాగ్రహఉద్యమంలో పాల్గొన్నారు. వారిలో 400 మంది మీసా క్రింద నిర్బంధించబడ్డారు. ఈ మహోద్యమాలన్నింటి వెనుక వేలాది సంఘ స్వయంసేవకులు, వారికుటుంబ సభ్యులు, సానుభూతిపరులు పడ్డ అంతులేని కష్టాలు, త్యాగాల నిశ్శబ్దగాథ దాగివుంది. వందలాదిమంది తమ మంచి ఉద్యోగాలను పోగొట్టుకున్నారు. వేలాదిమంది వ్యాపారాలు, వృత్తులు దెబ్బ తిన్నాయి. వేలాదిమంది తమ విద్యాభ్యాసాన్ని త్యజించారు. వారంతా దేశం నలుమూలలా జైళ్ళను నింపి వేశారు. అనారోగ్యకరమయిన ఆహారాన్ని, భయంకరమయిన మురికిని, తీవ్రమయిన దుర్గంధాన్ని, ఎముకలు కొరికే చలిని, క్రిమికీటకాలను, దోమలను, అవమానాలను, అమానుష వ్యవహారాన్ని, అవినీతిని, ఇంకా అనేక ఇబ్బందులను వారు ఎదుర్కోవలసి వచ్చింది. దేశంలోని అనేక కేంద్రీయ కారాగారాలలో 'మీసా' డిటెన్యూలపైన, సత్యాగ్రహులపైనా క్రూరమైన పద్ధతిలో లాఠీ చార్జీలు, దాడులు జరిగాయి. వందలాది మంది ఎముకలువిరిగాయి, తలలుపగిలాయి, జైలు అధికారుల నిర్లక్ష్యానికి కొందరిప్రాణాలు బలైపోయాయి. ఈ పోరాటంలో దాదాపు వందమంది కార్యకర్తలు అమరులయ్యారు. వారిలో అధికశాతం జైళ్ళలోనే. సంఘ అఖిలభారతీయ వ్యవస్థాప్రముఖ్ శ్రీ పాండురంగ క్షీరసాగర్‌వారిలో ఒకరు. దశాబ్దాలు తరబడి నిస్వార్థంగా దేశానికి సేవ చేస్తున్న సంఘప్ర

చారకులు కూడా వారిలో కొందరున్నారు. కొందరు జీవితపు ప్రాథమిక దశలోనే ఈ లోకాన్ని వదలిపెట్టి వెళ్ళిపోయారు.

## రక్త స్వేదాల మూల్యం:

పోలీసుల లాకప్‌లలో సంఘ కార్యకర్తలు అనుభవించిన చిత్రహింసలు చదువుతూంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. ఉద్యమపు వెన్నువిరవాలని నియంత కృత నిశ్చయంతో ఉంది. ఎక్కడ దెబ్బకొట్టాలో వారికి బాగా తెలుసు. ఈ విషయంలో కేరళదే అగ్రస్థానం. బహిరంగ స్థలాలలో శాంతియుత స్వయంసేవక సత్యాగ్రహులపై లాఠీచార్జీలు జరగడం అక్కడొక పరిపాటిగా మారింది. 'కాసరగోడ్' తాలుకాలో సంఘానికి గట్టి పట్టుగల అనేక గ్రామాల మీద ఒక పోలీసు బృందం దాడిచేసింది. వారు తోటలను నాశనం చేశారు. కర్మాగారాలను, ఇండ్లను, హోటళ్ళను, చివరికి ఆహార పదార్థాల నిలువలను తగుల బెట్టారు. పోలీసు జీపులముందు సత్యాగ్రహులను నగ్నంగా పరుగెత్తించారు. తీవ్రమయిన దెబ్బలతో స్పృహకోల్పోయిన అనేకమంది సత్యాగ్రహులను వేగంగా పరుగెడుతున్న జీపులలోనుండి బయటకు విసరివేశారు. చుక్క మంచినీళ్ళయినా ఇవ్వకుండా కొందరిని వారం రోజుల వరకు మలమల మాడ్చారు. కొట్టడం, తన్నడం, క్రిందమేకులుండే బూట్లతో త్రొక్కడం, పైకప్పునుండి తేళ్ళు, పాములు జారిపడుతూ, తేమతో నిండి ఉండే చీకటి గుయ్యారాల లాంటి గదులలో క్రుక్కడం లాంటి అమానుష చర్యలకు 'కాన్ననూర్' కేంద్రీయ కారాగారం ప్రత్యేక ఘనత వహించింది. నెలల తరబడి ఇవన్ని కొనసాగాయి.

'ఏరోప్లెయిన్' విధానాన్ని అవలంబించడంలో కర్ణాటక ప్రత్యేకంగా ఘనతవహించింది. ఒక సత్యాగ్రహి స్వయంసేవక్ అనుభవాన్ని వినండి: "రాత్రిరెండుగంటలవేళ మా ఇంటి వద్దనుండి నన్ను ఈడ్చుకు పోయారు. బట్టలూడదీసి రాత్రంతా చితక్కొట్టారు. అసిస్టెంట్ పోలీసుకమీషనర్ కాలుతున్న సిగరెట్లతో నా సున్నితమైన శరీరభాగాలపై కాల్చారు. ఒంటిపై ఒక్క నూలుపోగయినా లేని నన్ను ఆ ఎముకలు కొరికే చలిలో రాత్రంతా వదలివేశారు. లాకప్ గది అంతా భయంకరమయిన మూత్రపు వాసనతో నిండివుంది. మరుసటి రోజు నాకోసం 'ఏరోప్లెయిన్' ఎదురుచూస్తోంది. నా చేతులను వెనక్కువిరచి కట్టి ఒక పుల్లీ ఆధారంగా నన్ను పైకిలాగారు. అమితమైన ఆ బాధను భరించలేక నేను దాదాపు స్పృహకోల్పోయాను. ఆ స్థితిలో కూడా నాశరీరంపై లాఠీలునాట్యం చేస్తూనే ఉన్నాయి. కాలుతున్న సిగరెట్లు

నా శరీరాన్ని తాకుతూనే ఉన్నాయి." సంఘ కుటుంబాలకు చెందిన మహిళా సత్యాగ్రహులుకూడా ఈ అవమానాలను భరించక తప్పలేదు. బెంగుళూరుకు చెందిన గర్భిణి అయిన ఒక మహిళా సత్యాగ్రహిని ప్రసవం కోసం ఆసుపత్రికి తరలించారు. ప్రసవానంతరం ఆమె చేతుల సంకెళ్ళను తొలగించారు. కానీ జైలుకు తిరిగి పంపించేవరకు కాళ్ళను మాత్రం మంచానికి కట్టివేసి ఉంచారు. చివరి వరకు ఆమె అలా సంకెళ్ళతోనే ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో కూడా పోలీసులు సత్యాగ్రహులపై అత్యాచారాలకు పాల్పడ్డారు. ఒక సత్యాగ్రహి వీపుపై 200 చోట్ల కొవ్వొత్తితో కాల్చి, బట్టలులేకుండా చలిలో పడేశారు. సంఘ పంజాబ్ ప్రాంత కార్యవాహ బూటుతో తన్నులు రుచిచూడవలసి వచ్చింది. వరుసగా నాలుగు రోజులపాటు పగలంతా నిప్పులు చెరిగే ఎండలో నిలబెట్టేవారు. రాత్రిపూట ఒక్కక్షణం కూడా నిద్రపోనిచ్చేవారు కాదు. పోలీసుస్టేషను ముందుభాగంలో ఆయనను నగ్నంగా పాకించారు. ఆయనపైజమాలలోకి ఎలుకలను వదలిపెట్టి పైజమా చివరలను కట్టివేశారు. నగ్నంగా నేలమీద బోర్లా పడుకోబెట్టి కాళ్ళపై పెద్ద కర్రను ఉంచి దానిపై ఇద్దరుపోలీసులు నిలబడేవారు. ఆయన పదేపదే స్పృహకోల్పోయేవారు. అయితే అటువంటి పరిస్థితిలో కూడా స్వయంగానేరాన్ని అంగీకరిస్తున్నట్లుగా పోలీసులు తయారుచేసిన పత్రంపై సంతకం పెట్టడానికి మాత్రం వారు అంగీకరించలేదు.

మధ్యప్రదేశ్‌లో సత్యాగ్రహులను అసహజమైన లైంగిక స్థితులలో బలవంతంగా నిలబెట్టేవారు. ఒకరినోటిలో మరొకరిచేత మూత్రవిసర్జనచేయించేవారు. స్పృహకోల్పోయే వరకు కొట్టేవారు. 65 సం.ల వృద్ధుడైన ఒక సత్యాగ్రహిని కూడావారు విడిచిపెట్టలేదు. మరునాటివరకు ఆయన స్పృహలోకి రాలేదు. అయితే వారిలో ఏ ఒక్కరూ తలవంచలేదు. దృఢసంకల్పంతో ఈ బాధలన్నీ వారుభరించారు.

## కారాగృహమే విద్యాలయం అయినవేళ:

సంఘ కార్యకర్తలు, వారికుటుంబాలు ప్రదర్శించిన ధైర్యసాహసాలు, మిగిలినవారిలో కూడా విశ్వాసాన్ని, పటుత్వాన్ని పెంపొందించడానికి సహాయపడ్డాయి. జైలులోపల, జైలు బయటకూడా ఇది జరిగింది. జైళ్ళను ఆవాస విశ్వవిద్యాలయాలుగా వారుమార్చివేశారు. ఆటలు, వివిధభాషలు, యోగాసనాలు, కుస్తీ, పాటలు, భజనలు, హోమియోపతి, ప్రథమచికిత్స

ఇలా ప్రతిఒక్కరూ ఏదోఒక క్రొత్త విషయం నేర్చుకున్నారు. సదస్సులు నిర్వహించే వారు. అన్ని మతాలకు చెందిన పండుగలను జరుపుకునేవారు. అందరూవాటిలో పాల్గొనేవారు. పుస్తకాలు చదివి వాటిపై చర్చించేవారు. నాటకాలు రచించి ప్రదర్శించేవారు. ప్రత్యేకంగా అధ్యయనం సాగించి, పుస్తకాలు వ్రాసేవారు. వ్రాతపత్రికలు తయారుచేసి పంచి పెట్టేవారు. వాటికి కొన్ని ప్రత్యేక సంచికలు కూడా విడుదల చేస్తుండేవారు. చిత్రలేఖనం చేస్తూండేవారు. పాటలుపాడుతూండేవారు. ఉపవాసాలు, దీక్షలు ఆచరిస్తూండేవారు. మధ్య మధ్యన హాస్యోక్తులు, నవ్వులతో వాతావరణం సదా ఆహ్లాదకరంగా ఉండేది.

అశాంతి, అనిశ్చితతలతో కూడిన పరీక్షా సమయాలుకూడా లేక పోలేదు. ముఖ్యంగా ఎన్నికలు ప్రకటించడానికి కొద్ది రోజులముందు క్షీణిస్తున్న ఆత్మవిశ్వాసాన్ని పునఃప్రతిష్ఠించడానికి సంఘకార్యకర్తలు ఎంతో శ్రమపడవలసివచ్చింది. వివిధ రాజకీయ పక్షాలనాయకులు, కార్యకర్తలు కూడ నిర్బంధంలో వున్న ఎఱ్ఱవాడ జైలులో శ్రీ బాలాసాహెబ్ దేవరస్ ప్రశాంత విశ్వాస వాతావరణాన్ని నింపేవారు. ఆందోళనతో ఉన్న వారికి వారు నచ్చ చెప్పేవారు. "ప్రశాంతంగా ఉండండి. ఆందోళన చెందవలసిన అవసరంలేదు. ఈ కష్టాల్లోంచి సగౌరవంగా మనం బయటికి రావడమనేది విధినిర్ణయం. ఎప్పుడు, ఎలా ఇది జరుగుతుందనేది ఇప్పుడే నేను చెప్పలేను. కానీ అది నా అంతరంగికమయిన దృఢవిశ్వాసం". వారి మాటలు అక్షరాలా నిజమని తరువాతి సంఘటనలు ఋజువు చేసాయి.

కష్టాలు పడడం, త్యాగాలుచేయడంలోనే కాదు, సమయస్ఫూర్తిగా వ్యవహరించడంలో కూడా సంఘకార్యకర్తలు, వారి కుటుంబాలు ఎంతో పరిస్థితిని ప్రదర్శించాయి. అజ్ఞాత కార్యకర్తల రక్షణవిషయంలో తల్లులు ప్రదర్శించిన జాగరూకత, విచక్షణలను వర్ణించడం అసాధ్యం.

కర్ణాటకలో సంఘ తుంకూరు జిల్లా ప్రచారక్‌కి ఒక నగరం యొక్క నగరకార్యవాహ సతీమణి ప్రసవానంతరం తీవ్ర అనారోగ్యానికి గురైందని వార్త తెలిసింది. ఆమె ఆరోగ్యాన్ని గురించి వాకబు చేసేందుకు అతను అక్కడకు వెళ్ళాడు. వారిది చాలా చిన్నవాటా. ఆస్త్రీ పరిస్థితి చాలా ఆందోళనకరంగా ఉంది. ఆమె సగం స్పృహలోనే ఉంది. ఆ పరిస్థితిలోకూడా ఆమె ప్రచారక్‌ని గుర్తుపట్టింది. వెంటనే ఏదోమాట్లాడాలని ప్రయత్నం చేయసాగింది. కానీ మాటలు గొంతుదాటి బయటకు రావడంలేదు. చివరికామె తన చేతితో ఇంటిముఖద్వారం

వైపుగా చూపించింది. ప్రచారక్ అయోమయంలో పడ్డాడు. ఆమె ఏం చెప్పాలని ప్రయత్నిస్తోందని ఆమె భర్తని అతను అడిగాడు. "రెండురోజుల క్రితమే మీ గురించి వెదుకుతూ పోలీసులు ఇక్కడకు వచ్చారు. ఇప్పుడు మనం రోడ్డు మీద నుండి స్పష్టంగా కనబడుతున్నాం. అందుకే ఆమె ఆ తలుపులను మూసివేయమని చెబుతోంది" అని చెప్పాడు ఆమె భర్త. అజ్ఞాత కార్యకర్తల పట్ల ఎంతటి ఆత్మీయత.

నిజానికి రహస్య ఉద్యమానికి రక్షణ దేవతలుగా నిలచినది అటువంటి తల్లులు, సోదరీమణులే.

## విదేశాలలో ప్రతిధ్వనులు:

అత్యవసర పరిస్థితి ప్రకటించారన్న వార్త విని విదేశాలలోని భారతీయులు ఒక్కక్షణం నిర్ఘాంతపోయారు. అంతలోనే తేరుకున్నారు. నిరసనసమావేశాలను, ఊరేగింపులను నిర్వహించడం ప్రారంభించారు. వివిధదేశాలలో విస్తరించి ఉన్న సంఘ స్వయంసేవకులు తమ మధ్య పరస్పర సంబంధాలను ఏర్పాటు చేసుకున్నారు. బ్రిటన్‌లో 'జయప్రకాశ్‌జీని విడుదలచేయండి' ఉద్యమం, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్, ఇతర మానవ హక్కుల సంఘాలతో కూడా వారు సంబంధాలను ఏర్పాటు చేసుకున్నారు. తమ ఉద్యమంలో కార్యకర్తలు, ధనం అంతా తోటి భారతీయులనుండే సేకరించాలని వారు నిర్ణయించారు. ఇతరులనుండి సానుభూతి మినహా మరేవిధమయిన సహాయాన్ని స్వీకరించరాదని నిర్ణయించారు. అమెరికాలో 'ఇండియన్స్ ఫర్ డెమొక్రసీ' అనే సంస్థ ఆవిర్భవించింది. ఆ తదుపరి స్వయంసేవకులు "ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్నేషనల్" ప్రారంభించారు. అందరూ ఒకే వేదికపై కలసి, ఒక దృఢమైన శక్తిగా రూపొందడానికి ఈ సంస్థ ఎంతో ఉపయోగపడింది. శ్రీ సుబ్రహ్మణ్యస్వామి, శ్రీ మకరంద్‌దేశాయ్, శ్రీ కేదారనాథ్ సహానీ వంటి అజ్ఞాత ఉద్యమ నాయకులు విదేశాలకు వెళ్ళారు. తమవెంట భారతదేశంలోని నియంతృత్వ పరిపాలన యొక్క వికృతరూపాన్ని, అందుకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమపు ప్రత్యక్ష వాస్తవాలను వారు ఆదేశాలకు తీసుకువెళ్ళారు.

భద్రతా దళాల కళ్ళుగప్పి శ్రీ సుబ్రహ్మణ్యస్వామి నాటకీయఫక్కీలో దేశంలో ప్రవేశించడం, 1976 ఆగష్టు 10నాడు రాజ్యసభలో హఠాత్తుగా ఆయన ప్రత్యక్షం కావడం, అక్కడినుండి అంతకంటే ఆశ్చర్యకరమయిన పద్ధతిలో తప్పించుకుని దేశసరిహద్దులుదాటి పారిపోవడం, అత్యవసర

పరిస్థితి నాటి పోలీసు రాజ్యాన్ని గట్టిదెబ్బతీయడం మరొక సంఘటన. "జార్జిఫెర్నాండెజ్ దొరికి పోవడానికి, నేను దొరకక పోవడానికి కారణం ఆర్.యస్.యస్. మాత్రమే" అని అన్నారు శ్రీ సుబ్రమణ్యస్వామి.

అమెరికా, బ్రిటన్, అనేక ఇతర ఐరోపాదేశాలలోని భారతీయ ప్రజానీకం అప్పటికే పూర్తిగా జాగృతమయ్యారు. అక్కడ పెరుగుతున్న వ్యతిరేకతను నివారించడానికి కేంద్రమంత్రులు ఆదేశాలకు పరుగులుతీశారు. అయితే వారికి తోకముడవక తప్పలేదు. సమావేశాలలో ఆగ్రహోదగ్రులైన ప్రజలప్రశ్నలకు వారు జవాబు చెప్పలేక పోయారు. ప్రపంచం దృష్టిలో తాము తొడుక్కున్న ముసుగు తొలగిపోయి, తన యొక్క నిజస్వరూపం బయటపడిందని ప్రభుత్వం కూడా గుర్తించింది. దానిప్రతిష్ఠ పూర్తిగా దిగజారిపోయింది. అత్యవసరపరిస్థితి ముసాకు ప్రజలమద్దతు ఉందన్న అసత్యాన్ని అది ఇక ఏమాత్రం నిలుపుకోలేక పోయింది. భారతదేశంలో నియంతృత్వ పరిపాలనను అంతవరకు చూసీచూడనట్లు ఊరుకున్న ప్రజాస్వామ్య ప్రపంచాన్ని ఈ ఉద్యమం ఒక్క కుదుపుకుదిపింది. ప్రజాస్వామ్య ప్రక్రియను తిరిగి ప్రారంభించ వలసిందని అది శ్రీమతి ఇందిరపై ఒత్తిడి తీసుకుని రావడం ప్రారంభించింది.

## ప్రభావం చూపిన అంశాలు:

ఈ అంశాలన్నీ కలిసి చివరికి దేశంలో ఎన్నికలు నిర్వహించేటట్లు పాలకవర్గంపై నిర్ణయాత్మకమైన ఒత్తిడి తీసుకుని రాగలిగాయి. అజ్ఞాతపద్ధతులద్వారా పునరుద్ధరింపబడిన వార్తాసంబంధాలు, విస్తృతంగా పంచిపెట్టబడుతున్న అజ్ఞాత సాహిత్యం - ఇవన్నీ గమనించిన ప్రభుత్వం తన అంచనాలు తల్లక్రిందులు కాబోతున్నాయని గ్రహించింది. శ్రీమతి ఇందిర "ప్రతిపక్షాలను కేవలం అణచి ఉంచామంతే. వాటిని రూపుమాపలేదు." "90 శాతం సంఘకార్యకర్తలు ఇంకా అజ్ఞాతంలోనే ఉన్నారు.", "నిషేధం కారణంగా సంఘం సంస్థారూపంగా ఏమాత్రం దెబ్బతినలేదు. నిజానికి ఇంతకు ముందు ప్రవేశించలేకపోయిన కేరళలాంటి రాష్ట్రాలలోకి ఇప్పుడది ప్రవేశించగలుగుతోంది." అని ఒప్పుకోకతప్పలేదు.

ఆర్థికరంగంలో వైఫల్యాలు కూడా ప్రజలలో అసంతృప్తి మరింత పెరగడానికి దోహదం చేసాయి. ప్రజల ఈ భావోద్వేగాన్ని ఒక సురక్షిత మార్గం గుండా బైటకు వదిలివేయడం అనివార్యమన్నది స్పష్టమైంది. ప్రపంచమంతా కూడా అత్యవసర పరిస్థితి నిజస్వరూపాన్ని గుర్తించింది. ప్రభుత్వం మీద దానిప్రభావం కూడా మరింతగా పడింది. ప్రభు

పనిచేస్తోంది. వివిధప్రాంతాలలో రాత్రింబవళ్ళు శ్రమించి ఈ ప్రజాచైతన్యాన్ని జాగృతం చేస్తున్నది, దానిని సరియైన మార్గంలో నడిపిస్తున్నది సంఘ స్వయంసేవకులే. కర్ణాటకలోని మంగుళూరులో 1977 మే 30వ తేదీన జరిగిన ఒక సంఘ ఉత్సవంలో ప్రసంగిస్తూ డా. శివరామకారంత్ ఇలా అన్నారు. 'ఎన్నికలు ప్రకటించగానే ఒక విషయంపై నాలో ఆతృత పెరిగింది - స్వాతంత్ర్య సందేశాన్ని ప్రజలవద్దకు తీసుకుని వెళ్ళి, పరిస్థితి తీవ్రతను వారికి తెలియజెప్పగలిగిన వారెవ్వరు? వేల సంఖ్యలో సంఘకార్యకర్తలు ముందుకు వచ్చి ఆపనిని స్వీకరించారు, నా ఆతృత చల్లారింది. ఎన్నికలకు ముందుకూడా పోరాటపు ప్రధానబాధ్యత వారే స్వీకరించారు, ప్రజల ఆత్మవిశ్వాసాన్ని నిలిపి ఉంచినది వారే. సంఘర్షణ సాగించిన వారిలో 80%పైగా సంఘకార్యకర్తలే. ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకుండా, ఆదర్శమే ఆరాధ్యదైవంగా పోరాటం సాగించిన వందలాది మంది సంఘ యువకులను నేను నాకళ్ళతో చూసాను. ఒక్కొక్కరోజు వారికి తినడానికి తిండిలభించేది కాదు. తలదాచుకునేందుకు చోటులభించేది కాదు. కానీ వారి ఉత్సాహం ఏ మాత్రం క్షీణించలేదు.'

1977 జనవరి 30వ తేదీన ఢిల్లీలోని రామలీలామైదానంలో జనతా పార్టీ ప్రప్రథమ సభ జరిగింది. జైలునుండి విడుదలైన అనేకమంది నాయకులు అందులో ఉపన్యసించారు. అప్పటికి ఇంకా ఢిల్లీనగరం అత్యవసరపరిస్థితి ఆగడాల కోరలలో చిక్కుకునే ఉంది. అత్యంత భయభీత వాతావరణం నెలకొని ఉంది. అత్యవసర పరిస్థితి ఆకతాయిలు ఇంకా వీధులలో స్వైరవిహారం చేస్తూనే ఉన్నారు. మరి అలాంటి పరిస్థితులలో సభ ప్రశాంతంగా జరుగుతుందా? లేక భగ్నమౌతుందా? అన్నది చాలా ప్రధాన అంశంగా మారింది. సంఘ కార్యకర్తలు ఈ సవాలును స్వీకరించారు. బస్తీబస్తీలో ఇంటింటికి వారు తిరిగారు. ఢిల్లీనగరం మొత్తాన్ని వారు జాగృతం చేసారు, కదిలించారు. సభాస్థలిని కూడా వారు వేయికళ్ళతో కాపలాకాశారు. ప్రజాప్రతిస్పందన అద్భుతం. లక్షలసంఖ్యలో ప్రజలు సభకు హాజరయ్యారు. అత్యవసరపరిస్థితి భయం భూస్థాపితం అయిపోయింది. శాశ్వతంగా జాతికి గడ్డుకాలం గడిచిపోయింది. జాతి నరనరాల్లోను ప్రచండమైన ఆత్మవిశ్వాసం తొణికిసలాడసాగింది. అప్పటి వరకు కొద్ది ఆందోళనగా ఉన్న హృదయాలలో కూడా అది ధైర్యాన్ని నింపింది.

## అగ్నిపరీక్ష:

ఈ దశలో సంఘనాయకత్వం ముందు ఒక అగ్నిపరీక్ష నిలచిఉంది. అది మార్చి మొదటివారం. ఎన్నికలకు ఇక రెండు వారాల గడువు మాత్రమే ఉంది. ఆ సమయంలో ఒక గూఢచారిశాఖ ఉన్నతాధికారి సంఘనాయకులతో ప్రత్యేకంగా మాట్లాడాలని వచ్చారు. సంఘం గనుక ఎన్నికలరంగంలో నుండి తన కార్యకర్తలను ఉపసంహరించుకుంటే, సంఘంపై నిషేధాన్ని ఎత్తివేసే విషయాన్ని పరిశీలించగలమని ఆయన తెలియజేశారు. ఆయన వాదన ఇలాఉంది. ప్రభుత్వమే స్వయంగా సర్దుబాటుధోరణిని ప్రదర్శించడానికి ముందుకు వచ్చినపుడు, అదేపద్ధతిలో సంఘం ప్రతిస్పందించడం బాగుంటుంది కదా? ఇప్పటికే 21 నెలలుగా ఆరెస్సెస్ కార్యకర్తలు జైళ్ళలో మ్రగ్గుతున్నారు. ఇంకెంతకాలం వారు నిలబడగలరు?

సమాధానం స్పష్టంగాను, నిర్ద్వంద్వంగాను లభించింది. 'ఆ కీలకమైన ఘడియలలో ప్రభుత్వంతో రాజీపడడమంటే జాతికి ద్రోహం చేయడమే అవుతుంది. ఓట్లద్వారానే ఈ సమస్య పరిష్కారం కావాలని సంఘం భావిస్తోంది. ఒకవేళ ఫలితాలు వ్యతిరేకంగా వస్తే, గతంలోలాగానే పోరాటం కొనసాగించేందుకు సంఘం సిద్ధంగా ఉంది. జైళ్ళలో ఉన్న సంఘకార్యకర్తల ఆత్మవిశ్వాసం ఇప్పటికీ ప్రచండంగానే ఉంది. బైట అజ్ఞాత ఉద్యమానికి కూడా చక్కటి ప్రజామద్దతు లభిస్తోంది. తమ కష్టాలు, త్యాగాలను వృధాచేసే ఎటువంటి చర్యకు జైలులోపల, బైటఉన్న కార్యకర్తలెవరూ ఏమాత్రం అంగీకరించరు. ప్రభుత్వం గనుక సంఘంపై నిషేధాన్ని తొలగించి, కార్యకర్తలను విడుదల చేస్తే, దానిపై గల కళంకం కొంతవరకు తగ్గే అవకాశం ఉంది. ప్రభుత్వం తన ఈ చేష్టకు ప్రతిఫలంగా అంతకుమించి ఏమీ ఆశించి ప్రయోజనం లేదు'. చివరిగా సంఘ పెద్దలు ఆ అధికారిని సూటిగా ప్రశ్నించారు. "ఇటువంటి వ్యామోహాలకు సంఘం లొంగిపోతుందని మీరు నిజంగానే భావించారా? కేవలం తనను కాపాడుకోవడానికి సంఘం జాతికే వెన్నుపోటు పొడవడానికి సిద్ధపడుతుందని మీరెలా ఊహించారు?".

ఆ ప్రతిపాదన వీగిపోయింది. అధికారి నిష్క్రమించారు. ఇంటిగడప దాటే ముందు ఒక్కసారి వెనకకు తిరిగి, ఆ అధికారి మంద్రస్వరంలో ఇలాఅన్నాడు. "మీ నుండి ఇలాంటి సమాధానాన్నే నేను ఆశించాను.

మీ గురించి నేనెంతో గర్వపడుతున్నాను.''

ప్రతిపక్షాలను చీల్చాలని, వారి ఆత్మవిశ్వాసంపై దెబ్బతియ్యాలని చిట్ట చివరివరకు శ్రీమతి ఇందిర చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఎన్నికల చదరంగంలో ఆమె ఓడిపోయింది, జాతి గెలిచింది.

## 15

# విదేశాలలో సైతం అగ్రగాములుగా

భారతదేశంలో స్వయంసేవకుల ఆధ్వర్యంలో సాంస్కృతిక విలువల పునరుజ్జీవనం కోసం జరుగుతున్న సమగ్ర ఉద్యమం రోజురోజుకు వృద్ధి చెందసాగింది. అదే సమయంలో సహజంగానే విదేశాలలో కూడా దాని ప్రకంపనలు కన్పించసాగాయి. నిజానికి ఏ సాంస్కృతిక ఔన్న త్యాన్ని భారతదేశం సాక్షాత్కారింపజేసుకుందో, అదే విదేశాలలో కూడా ప్రతిధ్వనించింది. ఇప్పటికీ విదేశాలలో ఉన్న స్వయంసేవకులు తాము స్థిరపడ్డ ప్రదేశాలలో ఈ పరంజ్యోతిని ప్రసరింపజేస్తూనే ఉన్నారు.

### కీన్యాలో:

1946 ఆగస్టులో గుజరాత్, పంజాబ్‌లకు చెందిన ఇద్దరు స్వయంసేవకులు కీన్యాకు వెళ్తున్న ఒక ఓడలో ప్రయాణమయ్యారు. ఆ ఓడ ఒక సముద్రతుఫానులో చిక్కుకుని అల్లల్లాడసాగింది. బైటికల్లోలానికి భయపడి ప్రయాణీకులందరూ ఓడలోనే కూర్చున్నారు. అయితే అంతవరకు పరస్పర పరిచయంలేని ఆ ఇద్దరు యువకులు మాత్రం సముద్రపు ప్రళయకాల సౌందర్యాన్ని తిలకించడంకోసం గదులలోనుండి బైటకు వచ్చి ఓడ డెక్ మీద చెరోవైపు నిలబడ్డారు. కొద్దినిముషాలు గడిచాయి. ఇద్దరూ ఖాకీ నిక్కర్లు ధరించి ఉన్నారు. అది ఇద్దరూ గమనించారు. తాము ఇరువురూస్వయంసేవకులమేనని గుర్తించారు. మాతృభూమి భారత్‌ను జ్ఞాపకం చేసుకున్నారు. 'నమస్తే సదావత్సలే' అంటూ తాము శాఖలలో నిత్యంచేసే ప్రార్థనను ఇరువురూకలిసి పఠించారు. ఆ విధంగా, అల్లకల్లోల సాగర మధ్యంలో మొట్టమొదటి విదేశీ 'శాఖ' ప్రారంభమైంది. బహుశ: భవిష్యత్తులో స్వయంసేవకులు ఎదుర్కోవలసిన పరిస్థితుల సవాలును అది సంకేతమాత్రంగా తెలియజేసిందేమో!

కీన్యా చేరుకున్న తదుపరి, అంతకు ముందే అక్కడ స్థిరపడ్డ స్వయం సేవకులు కొందరిని వారు కలుసుకున్నారు. 1947 మకరసంక్రాంతిరోజున మొట్టమొదటి సంఘశాఖను ఔపచారికంగా ప్రారంభించేసారు. 'భారతీయ స్వయంసేవక సంఘ్' (బి.ఎస్.ఎస్.) అని ఆసంస్థకు నామకరణం చేసారు.

హిందూ సంఘటనకు ఇతరమార్గాలను కూడా బి.ఎస్.ఎస్. అన్వేషించ సాగింది. గుజరాతీ, పంజాబీ, తమిళం, బెంగాలీ వగైరా విభిన్నభాషలు మాట్లాడే బాలురు, యువకులు శాఖలలో ఒకే కుటుంబం మాదిరిగా కలిసిమెలిసి కార్యక్రమాలలో పాల్గొనే మనోరంజక దృశ్యం చూసి ఎంతో ప్రభావితులైన వివిధ హిందూనేతలు బి.ఎస్.ఎస్.పట్ల ఆకర్షితులు కాసాగారు. ఫలితంగా, కీన్యాలోని హిందువులకు ప్రాతినిధ్యం వహిస్తున్న 147 విభిన్న సంస్థలను కలిపి ఒక సమైక్యహిందూమండలి (యునైటెడ్ హిందూ కౌన్సిల్ ఆఫ్‌కీన్యా)ని ఏర్పాటు చేయాలని స్వయంసేవకులు ప్రతిపాదించినపుడు, అందరూ దానిని స్వాగతించారు. అనతికాలంలోనే 'హిందూ మండలి' కీన్యా ప్రజాజీవనంలో హిందువుల సమైక్యవాణిని వినిపించసాగింది. సమస్యలు, ప్రమాదాలసమయంలో ఈ 'మండలి' హిందువులకు ఓదార్పును, ఉపశమనాన్ని కలిగిస్తూ ఉండేది. కొద్దికాలం తరువాత, నైరోబీలో నిర్మించిన దీనదయాళ్ భవన్ ఈ కార్యకలాపాలన్నింటికే కేంద్రస్థానం అయింది.

ఆరోజులలో ప్రభుత్వాధికారులు హిందువులను తరచు వేధింపులకు గురిచేస్తూండే వారు. ఆఫ్రికన్లు వారిపై దాడులుసాగిస్తూ ఉండేవారు. ఒకసారి ఒకప్రముఖ స్వయంసేవక్ ఇంటిపై దాడిచేసి, ఆయన భార్యను హత్యచేసారు. ఆ తరువాత, అదే స్వయంసేవక్ కీన్యా హిందూ మండలికి అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. అయితే తరచు జరుగుతున్న ఈ దురాగతాలకు భయపడి హిందువులు కీన్యావదలి పారిపోసాగారు. వారిసంఖ్య మూడవవంతుకు పడిపోయింది. అటువంటి సంక్లిష్టదినాలలో సైతం కొందరు ప్రభుత్వ ఉన్నతాధికారులు హిందూమండలి, బి.ఎస్.ఎస్.ల ప్రాధాన్యతను గుర్తించకపోలేదు. ఒక మండలికార్యకర్త అయిన ప్రముఖ హిందూ వ్యాపారి కీన్యా విడిచివెళ్ళేందుకు సంసిద్ధమౌతున్నప్పుడు, వారు అతడెని నిలువరిస్తూ: "మీలాంటి ఉత్తములు, దేశభక్తులు అయిన ప్రజలను మేం విడిచిపెట్టలేం. మీకు ఏ మాత్రం కష్టం, అసౌకర్యం కలుగకుండా మేం చూస్తాం" అని హామీ ఇచ్చారు. అప్పటికే ఆ స్వయంసేవక్ సంకోచంలోనే ఉండడంతో ఆ అధికారి "ఇప్పటికే వెళ్ళాలనే మీరు పట్టుబడితే, మీ పాస్‌పోర్ట్‌ను రద్దుచేసేస్తాం.

మిమ్మల్ని ఇక్కడి నుంచి కదలనివ్వం" అని నిర్మోహమాటంగా చెప్పేశాడు. ఒక ఆహ్లాదకరమైన బెదిరింపు! ఇరువురికి సంతృప్తికలిగిస్తూ ఆవ్యవహారం అంతటితో సమసిపోయింది.

1982 ఆగస్టులో హిందువులపై ఒక తీవ్ర ప్రమాదం విరుచుకుపడింది. కేన్యా అధ్యక్షుడు డేనియల్ అరప్ మోయ్ విదేశీ పర్యటనలో ఉన్న సమయంలో, వైమానిక దళం తిరుగుబాటు చేసింది. అతడు తిరిగిరాగానే దాన్ని అణచివేసాడు. అయితే ఆ తిరుగుబాటు సాగినకొద్ది రోజుల వ్యవధిలోనే హిందువులకు పెద్దఎత్తున ఆస్తి నష్టం సంభవించింది. వారు బ్రిటన్‌కు పెద్దసంఖ్యలో తరలిపోవడం ప్రారంభించారు. ఆ క్లిష్టసమయంలో, బాధితకుటుంబాలకు వెనువెంటనే సహాయాన్ని అందించడం కోసం స్వయంసేవకులు ఎంతో శ్రమించారు. ఇక హిందువులలో ఆత్మస్థైర్యాన్ని నింపడం ఒకపెద్ద సవాలుగా నిలిచింది. హిందువులపై జరిగిన దురాగతాలకు అధ్యక్షుడు మోయ్ ఎంతో కలత చెందారు. హిందూనేతలను చర్చలకు ఆహ్వానించారు. హిందూమండలి విస్తృత స్థాయిలో హిందువుల సమావేశాన్ని ఏర్పాటుచేసింది. ఒక ప్రతినిధి బృందం అధ్యక్షుని కలుసుకుని సహాయం, భవిష్యత్తులో భద్రతలవిషయంలో ఒత్తిడితెచ్చింది. అధ్యక్షుడు మోయ్ ఇచ్చిన సలహాను అనుసరించి, స్థానిక ఆఫ్రికన్ ప్రజల సంక్షేమంకోసం ప్రభుత్వ సమాజసంక్షేమనిధికి ఒక లక్షపౌండ్ల భారీమొత్తాన్నివారు సమర్పించారు. హిందువులపై ఆఫ్రికావాసులకు గల విశ్వాసరాహిత్యాన్ని దూరం చేయడంలో అదెంతో సహాయపడింది. హిందూమండలి తీసుకున్న అనేక చర్యల కారణంగా , హిందువులు తమ జాతీయ జీవనానికి అందించిన విలువైన సహకారాన్ని, ముఖ్యంగా తమ ఆర్థిక పరిస్థితులను వృద్ధి చేయడానికి వారందిస్తున్న సహకారాన్ని ఆఫ్రికాప్రజలు గుర్తించి వారిపట్ల ఆదరభావన పెంచుకోసాగారు. ప్రభుత్వం కూడా చక్కని ప్రతిస్పందన చూపించింది. దీపావళిని జాతీయసెలవుదినంగా ప్రకటించింది. "ఓం" ముద్రతో ఒక పోస్టల్‌స్టాంపును విడుదల చేసింది.

అత్యవసర పరిస్థితి సమయంలో జరిగిన ఒక సంఘటన తప్పక గుర్తుచేసుకోవలసినది. కేన్యాలోని భారతీయ సమాజమంతటికీ 'హిందూమండలి'నే ప్రతినిధిగా పరిగణించేవారని అది స్పష్టం చేస్తుంది. భారత ఆర్థికమంత్రి శ్రీయశ్వంతరావు చౌహాన్ కేన్యా సందర్శనకు వచ్చిన సమయమది. భారతీయులు ఆయనకు విందు ఏర్పాటు చేద్దామనుకున్నారు. అయితే స్థానిక భారతరాయబారి హిందూమండలికి ఆరెస్సెస్‌కు

సంబంధించిన సంస్థకనుక, విందు సందర్భంలో మండలితో ఏవిధమైన సంబంధం పెట్టుకోవడానికి నిరాకరించాడు. ఫలితంగా, మరే ఇతర సామాజిక సంస్థకూడా మంత్రికి స్వాగతం పలకడానికి ముందుకు రాలేదు. విందు ఘోరంగా విఫలమైంది. కేవలం రాయబారకార్యాలయ వ్యక్తులు, తత్సంబంధీకులు మాత్రమే విందుకు హాజరయ్యారు. ఆనాటి నుండి భారతదేశం నుండి ప్రముఖులెవరైనా ఆదేశానికి విచ్చేసినపుడు భారత రాయబార కార్యాలయం హిందూమండలి సహకారాన్ని అర్థించడానికి ప్రత్యేకశ్రద్ధ తీసుకోసాగింది. భారతరాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి కీన్యా సందర్శనకు విచ్చేసిన సందర్భంలో ఆయనను స్వాగతిస్తూ ఒక భవ్యమైన విందును ఏర్పాటు చేసే గౌరవం హిందూమండలికే లభించింది.

1987లో కీన్యాలో బి.ఎస్.ఎస్. 40వ వార్షికోత్సవం జరిగింది. ఆ సందర్భంగా మూడురోజుల శిబిరాన్ని నిర్వహించారు. ఆ శిబిరంలో ఇతరదేశాల నుండి కూడా స్వయంసేవకులు పాల్గొన్నారు. ఆరెస్సెస్ సహసర్‌కార్యవాహ శ్రీ యాదవరావు జోషి ఆ 40వ వార్షికోత్సవ శిబిరంలో పాల్గొన్నారు. 'స్వదేశోభువనత్రయం' - 'ఈ మూడులోకాలూ నాకుస్వదేశంతో సమానమే' అన్న ఆలోచనను విదేశాలలో నివసిస్తున్న హిందువులు కలిగి ఉండాలని వారిచ్చిన సందేశం వారికి ఒక నూతన జ్యోతి ప్రకాశం అయింది. శిబిరం జరిగిన 'కౌరారి' ప్రాంత పరిపాలనాధికారి క్రమశిక్షణాయుతము, ఆత్మీయపూర్ణము అయిన శిబిర వాతావరణాన్ని చూసి ఎంతో ప్రభావితుడయ్యారు. జోమోకెన్యట్టా వ్యవసాయకళాశాలలో మరొకసారి శిబిరాన్ని నిర్వహించవలసిందిగా బి.ఎస్.ఎస్.ను ఆయన బహిరంగంగానే ఆహ్వానించారు.

గత మూడు దశాబ్దాలుగా భారతదేశం నుండి సర్వశ్రీ దీనదయాళ్ ఉపాధ్యాయ, దత్తోపంత్ ఠేంగ్డీ, భావూరావు దేవరస్, రాజేంద్రసింగ్, నానాజీదేశ్‌ముఖ్, మోరోపంత్‌పింగళే, తదితర జ్యేష్ఠసంఘ అధికారులు కీన్యాలో పర్యటించారు. స్థానిక హిందూసమాజానికి, ప్రధానంగా సంఘ స్వయంసేవకులకు అవసరమైన సమయానుకూల మార్గదర్శనం, ప్రేరణ నివ్వడంలో ఆ పర్యటనలు ఎంతగానో తోడ్పడ్డాయి.

మన ధార్మిక, సాంస్కృతిక, నైతిక విలువలలో తమపిల్లలకు శిక్షణ నివ్వడం అనేది విదేశాలలో ఉంటున్న హిందువులముందు చాలాకాలంగా నిలిచిఉన్న ప్రధాన సమస్య. ఈ దిశలో కూడా కీన్యాహిందూమండలి ప్రముఖ ప్రయత్నాన్ని ప్రారంభించింది. ఆ దృష్ట్యా వైదిక, బౌద్ధ,

జైన, శిక్కు పంథాలకు చెందిన నిపుణులతో ఒక సమితి ఏర్పడింది. కీన్యా ప్రభుత్వ విద్యాశాఖ సహకారంతో ఆ సమితి ప్రాథమిక, ఉన్నత పాఠశాలల విద్యార్థుల కోసం హిందూ ధార్మిక విద్యాప్రణాళికను రూపొందించింది. ప్రభుత్వం ఆపాఠ్యపుస్తకాలను ప్రచురించి, పాఠ్యప్రణాళికను అమలు చేసింది. ఆరకంగా కీన్యాలో క్రైస్తవ మతవిద్య యొక్క గుత్తాధిపత్యానికి సమితి అంతం పలికింది. బహుశ ప్రపంచం మొత్తంలో పాఠశాల విద్యాబోధనలో భాగంగా హిందూ ధార్మిక పాఠ్యప్రణాళికను తయారుచేసి, అమలు చేయడం అదే మొదటిసారి అయిఉండవచ్చు.

1971లో ఈదీ అమీన్ ఉగాండా నియంత అయ్యాడు. ఉగాండేతరుల పాలిట అదొక మహాశాపంగా పరిణమించింది. భారతీయుల విషయంలో అయితే అది మరింతగా. అందరికంటే ముందుగా, అందరికంటే ఎక్కువగా దెబ్బతిన్నది భారతీయులే. తరతరాలుగా తమశక్తి స్వేదాలను పణంగా పెట్టి సంపాదించిన సర్వస్వాన్ని వదులుకుని మానప్రాణాలు కాపాడుకునేందుకు వారు పరుగులుతీశారు. ఆ క్లిష్టసమయాలలో వారికి సహాయ, పునరావాసాలు కల్పించడంలో కెన్యా స్వయంసేవకులు అందించిన పూర్ణసహకారం వారిహృదయాలపై చెరగనిముద్రవేసింది. యావత్తు భారతీయసంతతి మాత్రమేకాక బ్రిటన్, అమెరికా, ఆస్ట్రేలియాదేశాల రాయబార కార్యాలయాల ఉద్యోగులు సైతం బి.ఎస్.ఎస్. స్వయంసేవకులు నిర్వహించిన నిస్వార్థ, చైతన్యవంత పాత్రను గుర్తించారు.

ఆవిధంగా ఉగాండా నుండి గెంటివేయబడి, ఇంగ్లాండ్‌లో స్థిరపడినవారిలో అనేకమంది క్రియాశీల స్వయంసేవకులు ఉన్నారు. ఆ క్రొత్తవాతావరణంలో ఈ నిర్వాసిత ప్రజానీకం సముచితంగా వ్యవహరించే ధోరణులను వారు నిర్మాణం చేయసాగారు. అయితే మొదట్లో బ్రిటీష్ పత్రికలు మాత్రం పూర్తి వ్యతిరేకధోరణిని అవలంబించసాగాయి. భారతీయులను మురికోడుతున్న, అపరిశుభ్ర ప్రజానీకంగా వర్ణిస్తూ ఆ పత్రికలు, వారు ఆదేశంలోకి వలసరావడానికి అనుమతించి నందుకు ప్రభుత్వాన్ని అధిక్షేపించసాగాయి. కానీ, కొద్దిరోజులు గడిచిన తరువాత, అదే పత్రికారంగం "ఉగాండా నుండి వలసవచ్చిన భారతీయులు మనదేశానికి ఒక అపురూప సంపద వంటివారు" అని వ్రాయసాగింది.

## మారిషస్‌లో:

హిందూ జనబాహుళ్యం విషయంలో మారిషస్‌కు, కీన్యాకు మధ్య

పోలికే లేదు. కీన్యాలో హిందువుల సంఖ్య బహుస్వల్పం కాగా, మారిషస్‌లో వారు 52శాతం ఉన్నారు. దేవాలయాలు, ఉత్సవాలు, కావడి, గంగదశహర మొదలైనవాటితో నిండిఉండే ఆదేశం ఒక 'సంక్షిప్త భారతం'లా కనిపిస్తుంది. ప్రభుత్వం కూడా భారతీయుల ఆధిపత్యంలోనే ఉంది. ఇవన్నీ ఉండి కూడా గత శతాబ్దకాలంగా అక్కడి హిందూ సమాజం వివిధభాషావర్గాలుగా చీలిపోయి ఉంది. వారుగనుక ఇలాగే అసంఘటితంగా కొనసాగితే, అవకాశంకోసం ఎదురుచూస్తున్న కొన్ని శత్రువర్గాలు వారిని త్రోసిరాజనే ప్రమాదం కూడా లేకపోలేదనే సంకేతాలు కనబడసాగాయి. క్రైస్తవమతప్రచారకులు సాగిస్తున్న మతం మార్పిడులు అక్కడి హిందువుల పాలిట మరొక ప్రమాదంగా పరిణమించాయి. పై అన్ని కోణాలు దృష్టిలో పెట్టుకుని స్వయంసేవకులు అనేక శ్రమలకోర్చి 'మారిషస్ హిందూమండలి'ని ప్రారంభించారు. తమపై ముంచుకొస్తున్న ప్రమాదకర శక్తులను సమైక్యంగా ఎదుర్కొనేందుకు అక్కడి వివిధ వర్గాలు సన్నిహితం కావడానికి ఆ మండలి కేంద్రబిందువు అయింది.

1979లో ఆ ద్వీపంలో రాజకీయరంగంలో ఆటుపోట్లు సంభవించాయి. శ్రీ అనిరుధ్ జగన్నాథ్, శ్రీ శివసాగర్ రామ్‌గులామ్ అనే ఇరువురు అగ్రగామి హిందూ రాజకీయ నేతలమధ్య విభేదాలు సృష్టించేందుకు ఫ్రాన్స్ నుండి వలసవచ్చిన పాల్ బారింగే ప్రయత్నించాడు. తద్వారా దొడ్డిదారిన ఫ్రెంచి ఆధిపత్యాన్ని ఆ ద్వీపంపై ప్రస్థాపించాలన్నది అతడి తాపత్రయం. అయితే హిందూ మండలి తగు జాగరూకతతో వ్యవహరించింది. సాధారణ హిందువులను, ముఖ్యంగా హిందూ రాజకీయనాయకులను ఈ కుతంత్రాలగురించి హెచ్చరించింది. తమ అంతఃకలహాల కారణంగా, ఇతరశక్తుల పరిపాలనలో అనేక కష్టాల ననుభవిస్తున్న పొరుగుదేశాల హిందువుల పైనాన్ని కూడా వారు ఎత్తి చూపారు. ఫలితంగా, ఆ ఇరువురు హిందూనేతలు ప్రమాదాన్ని గుర్తించారు. తమ అంతఃకలహాలకు స్వస్తిచెప్పి, ఫ్రెంచి వారి కుట్రలను భగ్నంచేసారు. ఆ హిందూ నేతలు సమయస్ఫూర్తితో, జాగరూకతతో ఆనాడు వ్యవహరించి ఉండకపోయినట్లైతే అక్కడిహిందువులు ఎన్నోకష్టాలకు, తీవ్ర అణచివేతకు గురై ఉండేవారు. భారతదేశానికి కూడా మారిషస్ ఈనాడు మిత్రదేశంగా ఉండేదికాదు. భారతసాగరసరిహద్దులలో కల్లోలాన్ని సృష్టించే శత్రువుల నౌకాదళ స్థావరంగా అది రూపొంది ఉండేది.

ఇవాళ తమహిందూ అస్తిత్వాన్ని చాటిచెప్పకోవడం గర్వకారణంగా అక్కడ ప్రతి ఒక్కరు బలంగా భావిస్తున్నారు. కీన్యా హిందూ మండలి

సమ్మేళనానికి, నేపాల్, సింగపూర్‌లలో జరిగిన ప్రపంచహిందూ సమ్మేళనాలకు తమదేశం తరపున ప్రతినిధులతో బాటు, తన శుభాకాంక్షలు పంపించడం కూడా ఒక గౌరవప్రదమైన విషయంగా స్వయంగా ఆదేశ ప్రధానమంత్రి భావించారు. ముస్లిం వ్యక్తిగత చట్టాన్ని రద్దుచేయగల సాహసాన్ని సైతం ఆయన ప్రదర్శించారు.

## ట్రినిడాడ్‌లో:

ట్రినిడాడ్‌లో హిందూపునరుజ్జీవన కార్యం గురించి ప్రస్తావనరాగానే, ఆనాటి ఆ దేశపు పార్లమెంటు సభ్యులు శ్రీ శంభూనాథ్ కపిల్‌దేవ్ సంస్మరణ హృదయగవాక్షం ముందు నిలుస్తుంది. ఆయన ఒకసారి భారతదేశాన్ని సందర్శించారు. ఆ సమయంలో శ్రీ గురూజీని కలిశారు. ప్రపంచహిందూసంఘటన చాలా అవసరమని వాదిస్తూ ఆయన ఆదిశలో అగ్రగామి కృషిని ప్రారంభించమని శ్రీ గురూజీని అర్థించారు. భవిష్యత్తులో విశ్వహిందూపరిషత్ ఆవిర్భావానికి బీజారోపణ నిజానికి ఆనాడే జరిగింది. జ్యేష్ఠ సంఘప్రచారక్ శ్రీ ఎస్.ఎస్.ఆప్టే(దాదా) ఈ ఆలోచనకు ఆచరణరూపం కల్పించారు. వి.హిం.ప. ప్రధానకార్యదర్శిగా వారు కేవలం భారతదేశంలోనే కాక, విదేశాలలో కూడా పర్యటించారు. శతాధిక వయోవృద్ధులైన స్వామీ గంగేశ్వరానంద అనే ఒక అంధస్వామీజీతో కలిసి, వారు అనేక దేశాలలో పర్యటించారు. ఆ దేశాలన్నింటిలోనూ వేదమందిరాలను, వి.హిం.ప.కేంద్రాలను వారు స్థాపించారు.

ట్రినిడాడ్‌లోని సాధారణ హిందూ ప్రజానీకంపై హిందూస్వయంసేవక సంఘ్ (హెచ్.ఎస్.ఎస్.) శాఖల ప్రభావం ఇప్పుడిప్పుడే అక్కడి ప్రజాజీవనంలో కూడా అనుభవంలోకి వస్తోంది. తమ హిందూ అస్తిత్వాన్ని గర్వకారణంగా అక్కడి హిందువులు భావిస్తున్నారు. ట్రినిడాడ్ ప్రభుత్వంలోని ఒక హిందూమంత్రి భగవద్గీత సాక్షిగానే ప్రమాణస్వీకారం చేస్తానని పట్టుబట్టాడు. భగవద్గీత ప్రతిలభించడానికి రెండురోజుల సమయం పట్టింది. అప్పటివరకు ప్రమాణస్వీకార కార్యక్రమం కూడా వాయిదాపడింది. తక్కువసంఖ్యలో అయినప్పటికీ గతంలో క్రైస్తవం స్వీకరించిన అనేకులు తిరిగి మాతృధర్మంలోకి రాసాగారు. యువకులలో కూడా హిందూధర్మం పట్ల ఆసక్తి వేగంగా పెరుగుతోంది. ఫలితంగా ద్వీపంలోని 200 పైగా ఉన్న హిందూ దేవాలయాలలో ధార్మిక

కార్యకలాపాలకు నవజీవం లభించింది.

ఇప్పుడు ట్రినిడాడ్ అక్కడి హిందువులకు కేవలం 'దత్తభూమి' కాదు. ప్రతిహిందూ సమ్మేళనంలోనూ వారు 'మాతాభూమిః పుత్రోహం పృథివ్యాః' మంత్రాన్ని ఉచ్చరిస్తున్నారు. అంటే 'ఈ పుడమి నాతల్లి, నేనామెపుత్రుడను' అని అర్థం. ఈ ఉదాత్తభావనను మరింత సుదృఢం చేసే ఉద్దేశంతో ఒక వినూత్న కార్యక్రమం అక్కడ జరిగింది. హెచ్.ఎస్.ఎస్.కు చెందిన 2వందల మంది స్వయంసేవకులు ఆరురోజుల పాటుఆదేశంలో 'సంకీర్తన ప్రదక్షిణ' కార్యక్రమాన్ని నిర్వహించారు. చివరి మైలుదూరం యాత్రలో మూడువేలమంది హిందువులు పాల్గొన్నారు. ట్రినిడాడ్ అంతర్జాతీయ వ్యవహారాల మంత్రి శ్రీ బాసుదేవ్ పాండే స్వయంగా 'ప్రదక్షిణ'కు నాయకత్వం వహించారు.

## బర్మాలో:

తమ ప్రజలలో జాతీయభావనను పటిష్టం చేసేందుకు అనేక సంవత్సరాలుగా బర్మాప్రభుత్వం కృషిచేస్తోంది. ఈ దిశలో భావాత్మక ప్రేరణ నిర్మాణానికి తమదేశ ప్రధానమతమైన బౌద్ధమతాన్ని ఆధారంగా స్వీకరించాలని వారు భావించారు. అదే లక్ష్యంతో బుద్ధుని జీవనం, సందేశాలపై ఒక ప్రదర్శినిని ఏర్పాటు చేయాలని యోజనచేసారు. ఈ పనిని ఒక సంఘప్రచారక్‌కు అప్పగించారు. కొందరు వేదపండితుల బృందం కూడా ఆయనకు సహాయం చేసింది. బుద్ధభగవానుని జీవితం, సందేశాలకు సంబంధించిన విభిన్న అంశాలనువారు అధ్యయనం చేసారు. వారికృషిలో నుండి ఒక అద్భుతమైన ప్రదర్శిని ఆవిర్భవించింది. ఒక విశాలమైన భారతదేశ చిత్రపటాన్ని కూడా ఆ అత్యంత ఆకర్షణీయమైన ప్రదర్శినిలో అలంకరించారు. బుద్ధునిజీవితంతోను, బౌద్ధమతవ్యాప్తితోను ముడిపడిఉన్న అనేక పుణ్యక్షేత్రాలను ఆ పటంలో గుర్తించారు. వారణాసిలోని భారతమాత మందిరం లాగానే బర్మాప్రభుత్వం మాండలేలో భవ్యమైన బుద్ధప్రదర్శిని మందిర్‌ను కూడా నిర్మించింది. తమ పుణ్యభూమి భారతమాత దర్శనంతో బర్మాప్రజలు ఎంత పులకించిపోతారంటే, ఆ పటంపైన వేలాదిరూపాయలను భక్తితో సమర్పించుకుంటూ ఉంటారు.

ఈ ప్రకల్పం కారణంగా బర్మాప్రజల హృదయాలలో హిందువుల ఎడల అత్యంత సహజమైనరీతిలో సుహృద్భావన నిర్మాణం అయింది.

ఇరువురి మధ్య సౌభ్రాతృత్వ బంధనాలను సుదృఢం చేసేందుకు అది ఉపకరించింది. ఫలితంగా బర్మాలో 'సనాతన ధర్మ స్వయంసేవకసంఘ్' ఆవిర్భావానికి మార్గం సుగమం అయింది. గౌతమబుద్ధుడు ప్రబోధించిన 'ప్రాచ్య ఆధ్యాత్మిక వీరమణి' విలువల వ్యాప్తికి ఆ సంస్థ దోహదం చేసింది. గురుకులాలు, ధర్మశిక్షణ సమితి పాఠశాలలు, హిందూ కేంద్రీయ బోర్డు రూపంలో ఆ సంస్థ కార్యకలాపాలు వేగంగా వృద్ధిచెందాయి. బర్మాప్రజలలో సంస్కృతవ్యాప్తికి హిందూపండితులు చేస్తున్న ప్రయత్నాలను వారు స్వాగతిస్తున్నారు. ఇరువురి మధ్య సాంస్కృతిక, భావాత్మక సంబంధాలను వృద్ధిచేయడానికి అది మరింత సహాయపడుతోంది.

## మలేసియాలో:

మలేసియాలో, ప్రధానంగా రబ్బరుతోటలలో పనిచేసే హిందువులు అనేక కష్టాల నెదుర్కొంటూ ఉంటారు. ఆర్థికంగా కూడా పైకి కనిపించని దోపిడీకి వారుగురౌతూ ఉంటారు. వ్యక్తులు తమకు తోచిన మతాన్ని నిరాటంకంగా అనుసరించడానికి ప్రభుత్వచట్టాలు పూర్తి భద్రతను కల్పిస్తున్నప్పటికీ, ఇతరశక్తులు సాగించే మతం మార్పిడి తంత్రాల ఒత్తిడి హిందువులపై తప్పనిసరిగా పడుతూ ఉంటుంది. ఈ పరిస్థితులలో అక్కడస్థిరపడిన స్వయంసేవకులు తమ ప్రయత్నాలను ప్రారంభంచేసారు. మతం మార్పిడుల వంటి క్లిష్టసవాళ్ళను ఎదుర్కొనే సామర్థ్యం నిర్మించేందుకు హిందువులకు వారి విశిష్ట జీవన విలువల గురించిన ప్రబోధాన్ని సాగించారు. అందరిపట్ల సమరస ధోరణిని, సద్భావనను మాత్రమే హిందువులు ప్రదర్శిస్తూంటారు. కనుక వారిలోని ఈ జాగృతి జాతి యొక్క సమగ్రసాంస్కృతిక పురోగతికి పోషకంగా కూడా రూపొందింది.

హిందూ తత్వజ్ఞానం, జీవన విలువలపై 1985లో హిందూయువకులకు వరుసగా శిక్షణకార్యక్రమాలను నిర్వహించారు. శాఖాకార్యక్రమాలను కూడా ఆశిక్షణలో భాగంగా చేసారు. వారిమార్గంలో ఎదురయ్యే అనేక ఆటంకాలను అధిగమించడానికి అవసరమైన శారీరిక, మానసిక పటుత్వాన్ని అవి ఆయువకులలో నిర్మాణం చేసాయి. తదుపరి, జిల్లా వారీగా హిందూసమ్మేళనాలు జరిగాయి. వాటికి అద్భుతప్రతిస్పందన లభించింది. ఒక్కొక్కచోట రెండునుండి నాలుగువేల హిందువులు వాటికి హాజరయ్యారు. డాటోలోని వర్క్సుమంత్రి సామివెల్లు, పార్లమెంటుసభ్యుడు గోవిందరాజ్, విశ్వవిద్యాలయంలో ప్రాధ్యాపకులు ఎస్.ఎమ్.పొన్నయ్యలు

ప్రస్తుతం అక్కడ ఉద్యమానికి సారథ్యం వహిస్తున్నారు.

మలేసియా ఒక ముస్లింరాజ్యంగా తనను ప్రకటించుకుంది. అయినప్పటికే హిందూసమైక్యతాభావన ప్రభావం అక్కడి ప్రజాజీవనంపై కూడా కన్పించసాగింది. ఒక పురాతన మందిరానికి సమీపంలో ఒక మసీదును నిర్మించారు. దానిని ఆసరాగా చేసుకుని ముస్లింలు దేవాలయంలో గంటలుకొట్టరాదని హిందువులను అభ్యంతరపెట్టసాగారు. అయితే అత్యున్నత న్యాయస్థానంసాధారణ న్యాయసూత్రాలకే కట్టుబడి వ్యవహరించింది. "గత వందసంవత్సరాలుగా అక్కడ దేవాలయం విరాజిల్లుతూ ఉంది. సమయబద్ధంగా పూజాదికాలు జరుగుతూనే ఉన్నాయి. మసీదును నిర్మించుకునే ముందే ముస్లింలు ఈ విషయం ఆలోచించుకోవలసింది. ఇప్పుడు ఫిర్యాదు చేసి ప్రయోజనం లేదు" అని అది తీర్పు చెప్పింది.

ఈ హిందూత్వపునర్జాగరణను చూసి హిందువులలోని కొందరు ప్రతిష్ఠిత వ్యక్తులు సైతం బహిరంగంగా హిందుత్వాన్ని సమర్థించేందుకు ముందుకు వస్తున్నారు. వి.హిం.ప. వంటి హిందూ సంస్థల గురించి మలేసియా ప్రజలందరికీ తెలియజెప్పాలన్న తన ప్రబలమైన కోరికను డాటోకు చెందిన శ్రీ సామివెల్లు వ్యక్తపరిచారు. అన్ని మతాలలోనూ హిందూత్వమే సగర్వంగా తలెత్తుకుని నిలబడగలుగుతుందన్నది ఆయన అభిప్రాయం.

## నేపాల్‌లో:

1963వ సం.లో శ్రీ గురూజీ నేపాల్‌లో పర్యటించి మహారాజును కలుసుకున్నారు. భారత-నేపాల్ సంబంధాలలో ఏర్పడ్డ ప్రతిష్టంభనను తొలగించేందుకు వారు కృషిచేసారు. ఆనాటి నుండి ఆదేశస్థులు సంఘాన్ని ఒక విశ్వాసపాత్రమైన మిత్రునిగా భావించసాగారు. అక్కడ ప్రారంభమైన మాతృభూమి స్వయంసేవకసంఘ్ క్రమంగా వికసించసాగింది. హిందూ జగత్తును సంఘటిత పరచి, చైతన్యవంతం చేసే కృషిలో నేపాల్ ప్రధాన పాత్ర వహించేటట్లు చేయడానికి అనుకూలమైన వాతావరణ నిర్మాణానికి ఆ సంస్థ కృషిచేస్తోంది. అదే లక్ష్యంతో 1988లో ఖాట్మండులో ప్రపంచ హిందూసమ్మేళనం జరిగింది. ఆ సందర్భంలోనే కంచికామకోటిపీఠం శంకరాచార్యులు నేపాల్ రాజు బీరేంద్రకు 'హిందూసామ్రాట్' అనే బిరుదు ప్రదానం కూడా గావించారు.

## ఇండోనేషియాలో:

కొద్దిసంవత్సరాల క్రితం ఇండోనేషియాకు వలసవెళ్ళిన ఒక సింధీ స్వయంసేవక్ జకార్తాలో గాంధీ మెమోరియల్ పాఠశాలను ప్రారంభించారు. హిందీ, సంస్కృత భాషలబోధనతోబాటు హిందూసంస్కారాలలో కూడా శిక్షణ నిచ్చే ఆ పాఠశాల విశిష్టత కారణంగా స్థానిక హిందూ సమాజంలో అది ఒక సగర్వస్థానం సంపాదించుకుంది. ఆ పాఠశాల విశిష్టతను గురించి తెలుసుకున్న ఇండోనేషియా ప్రధమ మహిళ అయిన అధ్యక్షులు శ్రీ సుహార్తో సతీమణి ఒకసారి హఠాత్తుగా పాఠశాల సందర్శనకు విచ్చేసారు. పాఠశాల లోని ఉత్కృష్ట వాతావరణం ఆమెనెంతగానో ప్రభావితం చేసింది. "ఇలాంటి ఆదర్శవంతమైన విద్యాసంస్థను నడిపించడం ద్వారా మీరు నిజానికి మాదేశానికి విశిష్టమైన, విలువైన సేవల నందిస్తున్నారు. దేశమంతటా అలాంటి పాఠశాలలు పెద్దసంఖ్యలో ప్రారంభించమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. దానివలన అన్నిమతాలకు చెందిన పిల్లలు ఇవే ఉదాత్త గుణాలను అలవర్చుకొనడానికి అవకాశం కలుగుతుంది." అన్నారామె ఆ స్వయంసేవక్‌తో.

## డెన్మార్క్‌లో:

వి.హిం.ప. డెన్మార్క్‌లో ఇప్పటికే తన ప్రత్యేకతను చాటిచెప్పింది. 1985వ సం.లో కోపెన్ హాగన్‌లో జరిగిన ద్వితీయ ఐరోపా హిందూ సమ్మేళనానికి శుభాకాంక్షలను అందజేస్తూ హిందూసంస్థల సేవా కార్యక్రమాల గురించి అధ్యయనం చేసిన డెన్మార్క్ సోషల్ డెమొక్రాటిక్ పార్టీ నాయకుడు, పార్లమెంటు సభ్యుడు అయిన ఓల్ ఎస్పర్‌సన్ ఇలా అన్నారు. "పేదలకు, అవసరాలలో ఉన్నవారికి సేవ చేయడంలో మీ మతం మామతం కంటే ఎంతో ముందున్నట్లు కనబడుతోంది. ప్రతిమతం మొట్టమొదటి ప్రాధాన్యత దానికే తప్పక ఇవ్వాలి."

## ఇంగ్లాండ్‌లో:

ఇంగ్లాండ్‌లో రెండు దశాబ్దాలక్రితం ప్రారంభమైన హిందూస్వయంసేవక సంఘ్ నేడు చాలా పటిష్టంగా రూపొందింది. బ్రిటన్‌లోని వివిధ మత, భాషావర్గాలలో దానికి గల బలమైన పలుకుబడిని నేడు అందరూ గుర్తిస్తున్నారు. యువ, వృద్ధస్వయంసేవకులందరిలోనూ దాని శాఖలు నిర్మాణం చేస్తున్న సంస్కారాల ప్రభావం కూడా బ్రిటిష్ సమాజంపై

చెరగని ముద్ర వేసింది. ఇంగ్లాండ్‌కు చెందిన అనేకమంది ప్రముఖులు, మంత్రులు, పార్లమెంటు సభ్యులు, సాంఘిక సంక్షేమ అధికారులు, కళాశాలాధిపతులు, మేయర్లు, పౌరసంబంధాల శాఖ అధికారులు, యువజన శాఖాధికారులు, పోలీసుఅధికారులు, స్థానికసంస్థల అధ్యక్షులు, ఇంకా ఇతరులనేకులు సంఘ్ సంపర్కంలోకి వచ్చారు. దానికార్యకలాపాలనువారెంతో ప్రశంసించారు.

1970ల ప్రారంభంలో శ్రీమతి ఇందిర ఒకసారి ఇంగ్లాండును సందర్శించారు. ఆ సమయంలో స్కాట్‌లాండ్ యార్డ్ పోలీసులు హెచ్.ఎస్.ఎస్. జాతీయ కార్యదర్శికి ఫోన్ చేసి సంఘ్ ఏదైనా నిరసన ప్రదర్శనను నిర్వహించదలచిందా? అని వాకబుచేసారు. 'లేదు. మాకు జన్మనిచ్చినదేశం ప్రధానమంత్రి ఆమె. భారతదేశ రాజకీయవ్యవహారాలపై మా అభిప్రాయాలు ఏవైనా కావచ్చు. కానీ భారతదేశం బైట మాత్రం భారత ప్రతినిధిని గౌరవించి తీరడం మా పరమకర్తవ్యం' అని సమాధానం ఇచ్చారాయన. ఈ సమాధానం విన్న స్కాట్‌లాండ్ యార్డ్ అధికారులు అన్నమాటలు స్మరించదగినవి. "మీ విధానం మాకు ముందునుంచీ తెలుసు. నిజానికి, ఆరెస్సెస్‌ను గురించి అధ్యయనం చేయడానికి మా ఉన్నతాధికారులిద్దరు భారతదేశం వెళ్ళారు. ఇలాంటి విషయాలలో సంఘం యొక్క దృఢమైన దేశభక్తిధోరణి మాకు తెలిసినదే. గోళ్వాల్కర్ 'బంచ్ ఆఫ్ థాట్స్' మేం చదివాం. కొద్ది సంవత్సరాల క్రితం పండిట్ నెహ్రూ మాదేశాన్ని సందర్శించడానికి వచ్చినపుడు సోషలిస్ట్‌లు చేసిన నిరసన ప్రదర్శనను ఆయన (గోళ్వల్కర్) ఆపుస్తకంలో ఖండించారు. అయితే కేవలం ఇక్కడి భారతరాయబార కార్యాలయం ఒత్తిడి మేరకే మేం ఈ వాకబు చేసాం".

1979 ప్రారంభంలో లండన్‌లో శ్వేతజాతివారు, శ్వేతేతరుల మధ్య తీవ్ర ఘర్షణలు చెలరేగాయి. అందులో ఒక పోలీసు అధికారి కూడా తీవ్రంగా గాయపడ్డాడు. వెంటనే ఒక జ్యేష్ఠ సంఘకార్యకర్త పోలీసుకేంద్ర కార్యాలయానికి ఫోన్‌చేసి ఈ ఘర్షణలలో హెచ్.ఎస్.ఎస్. ప్రమేయం గురించి పోలీసులు అనుమానించరని తన విశ్వాసమని, అలాంటి సంఘర్షణలపై సంఘ్‌కు విశ్వాసం లేదని తెలియజేసారు. అయితే ఆయన మాట్లాడడం పూర్తికాకముందే, ఆపోలీసుఅధికారి అందుకుని "మీరు సంజాయిషీ ఇచ్చుకోవలసిన అవసరంలేదు. మీ విశ్వాసపాత్రత పట్ల మా పోలీసు విభాగానికి ఏమాత్రం అనుమానం లేదు. మీ అద్భుత క్రమశిక్షణను మెమెరుగుదుం. ఇలాంటి విచ్ఛిన్న కార్యకలాపాలలో మీరు

తలదూర్చరని మాకు తెలుసు" అని అన్నారు.

వివిధ సందర్భాలలో హెచ్.ఎస్.ఎస్. హిందూమారథాన్‌ను నిర్వహించింది. వివిధ సేవాకార్యక్రమాలకు నిధులను సేకరించే ఉద్దేశంతో - ముఖ్యంగా భారత దేశంలో వనవాసీ కళ్యాణాశ్రమం వనవాసులకోసం నిర్వహిస్తున్న వివిధ కార్యక్రమాలకోసం ఈ మారథాన్‌ను నిర్వహిస్తూంటారు. లండన్‌లోని కింగ్స్‌బరీ ప్రాంతంలో 1986లో నిర్వహించిన అలాంటి ఒక మారథాన్‌లో బ్రాడ్‌ఫోర్డ్ మేయర్ మహమ్మద్‌రియాజ్ కూడా పాల్గొన్నారు. స్వయంసేవకుల నుద్దేశించి ప్రసంగిస్తూ ఆయన "జాతిసేవకు అంకితమయ్యే ఆదర్శపౌరునిగా రూపొందేందుకు అవసరమైన అన్ని గుణాలను వ్యక్తులలో నింపడానికి మీరు చేస్తున్న ప్రయత్నాలు చూసి నేనెం గర్వపడుతున్నాను. శారీరిక క్రమశిక్షణతో బాటు నైతిక, సాంస్కృతిక విలువల ఎడల కూడా మీరు చూపిస్తున్న నిష్ఠనిజంగా అద్భుతమైనది" అని ప్రశంసించారు. ఆ సందర్భంలో బిబిసి టెలివిజన్ 4వ ఛానల్‌లో ప్రసారమైన ఒక కార్యక్రమాన్ని గురించి ఆయన ప్రస్తావించారు. తారిఖ్ ఆలీ నిర్మించిన 'బాండుంగ్‌ఫైల్' అనే ఆకార్యక్రమంలో భారతదేశంలో ఆరెస్సెస్‌ను ఒక నియంతృత్వశక్తిగాను, ముస్లింలకు వ్యతిరేకంగా మతకలహాలను రెచ్చగొట్టేదిగాను అభివర్ణిస్తూ, హెచ్.ఎస్.ఎస్‌కు ఆరెస్సెస్‌తో సంబంధాలున్నాయంటూ కధను అల్లడం జరిగింది. హెచ్.ఎస్.ఎస్.పై చేసిన ఈ ఆరోపణలు ఆధారరహితమైనవని హెచ్.ఎస్.ఎస్.తో తనకు గల సంబంధం తనకు నమ్మకం కలిగించిందని కూడా రియాజ్ అన్నారు.

శ్రీ డబ్ల్యూ.హనుమాన్‌సింగ్ అనేక్రైస్తవుడు ఇంగ్లాండ్ పౌరసంబంధాల అధికారిగా ఉన్నారు. హెచ్.ఎస్.ఎస్. రగ్బీలో 9 రోజుల శిక్షణ శిబిరం నిర్వహించిన సమయంలో ఆయనకు సంస్థతో పరిచయం ఏర్పడింది. సంస్థ సామర్ధ్యం, క్రమశిక్షణలను చూసి ఆయన అమితంగా ప్రభావితులయ్యారు. జూబిలీ నిధిలో నుండి రగ్బీ మహిళా మేయర్ ద్వారా 700 పౌండ్లను విరాళంగా ఆయన ఇప్పించారు. క్రైస్తవులై ఉండి ఒక హిందూ సంస్థకు అంత బలమైన సమర్థకులుగా ఎలా మారారని శ్రీ హనుమాన్‌సింగ్‌ను ప్రశ్నించినపుడు తన హిందూ వారసత్వం పట్ల తానెంతో గర్వపడుతున్నానని ఆయన సమాధానం ఇచ్చారు. తమ పూర్వీకులు ట్రినిడాడ్‌లో ఆ పవిత్ర సంప్రదాయాన్నే అనుసరించారని ఆయన అన్నారు. ఆ ఉన్నత విలువల పరిరక్షణకై హెచ్.ఎస్.ఎస్. కూడా కట్టుబడి ఉండడం తనకెంతో ఆనందం కలిగిస్తోందని కూడా ఆయన

అన్నారు. కళ్యాణాశ్రమం కోసం తన వ్యక్తిగతంగా విరాళాన్నిచ్చేందుకు కూడా శ్రీ హనుమాన్‌సింగ్ ముందుకు వచ్చారు.

సేవకై ఎప్పుడు పిలుపువచ్చినా అందుకోవడానికి స్వయంసేవకులు సదాసిద్ధంగా ఉంటారు. అందుకు ఒకటి రెండు ఉదాహరణలను పేర్కొనవచ్చు. హిందూ వ్యతిరేక దుండగుల విధ్వంసకాండకు కాలిపోయిన లీడ్స్‌లోని శ్రీకృష్ణమందిర పునరుత్థానం వాటిలో ఒకటి. కాగా, ఇథియోపియాలో కరువు సంభవించిన సందర్భంలో కొందరు స్వయం సేవకులు సైకిల్ మారథాన్ నిర్వహించి, కరువుపీడితుల సహాయార్థం 600 పౌండ్ల విరాళాలను సేకరించడం రెండవది.

బ్రిటన్‌లోని అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన ప్రజలు వివిధ కార్య కలాపాలద్వారా తమ సాంస్కృతిక అస్తిత్వాన్ని పరిరక్షించుకునేందుకు ఏ విధంగా ప్రయత్నిస్తారో తెలియజెప్పే ఒక టెలివిజన్ కార్యక్రమాన్ని రూపొందించవలసిందిగా బి.బి.సి. 4వఛానల్ టెలివిజన్ వసుధాజోషీని నియుక్తం చేసింది. గంటసేపు జరిగే శాఖాకార్యక్రమంలోని ప్రధానఅంశాలను ఆమె ప్రసారం చేసారు. హిందూసమాజంలో హిందూత్వవిలువలు, ఆదర్శాలను పెంచిపోషిస్తున్న, ప్రచారం చేస్తున్న కేంద్రబిందువు ఈ కార్యక్రమాలేనని ఆమె పేర్కొన్నారు.

1984 ఆగస్టులో బ్రిటన్‌లోని హెచ్.ఎస్.ఎస్. స్వయంసేవకుల కోసం బ్రాడ్‌ఫోర్డ్‌వద్ద 'హిందూసంగం' పేరిట ఒక శిబిరాన్ని నిర్వహించారు. అనేక విషయాలలో అదొక చారిత్రాత్మకశిబిరంగా నిలిచింది. బ్రిటన్‌లోని 48 నగరాలు, పట్టణాల నుండి 1200 మంది స్వయంసేవకులు ఆ శిబిరంలో పాల్గొన్నారు. బ్రాడ్‌ఫోర్డ్‌లోని విఖ్యాత విశ్వవిద్యాలయంలో వారిశిబిరం ఏర్పాటయింది. శిబిరంలో పాల్గొన్న వారికోసం వందలాది హిందూ గృహాలనుండి చపాతీలు తయారు చేసిపంపించారు. స్థానిక హిందూ వ్యాపారస్తులు శిబిరానికి అవసరమైన వివిధ పాత్రలు, ఆహారసామగ్రి విరాళంగా ఇచ్చారు. శిబిరంలో వంటకు, అలంకరణకు స్వయంసేవకుల తల్లులు, సోదరీమణులు స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు. పట్టణమంతా హిందూత్వ వాతావరణంతో నిండిపోయింది.

ప్రముఖ చిత్రకారులు ఆదరనీయ సర్దార్ శోభాసింగ్ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. ఆప్రాంతానికి మహారాణి ప్రతినిధి అయిన లార్డ్‌విలియమ్ బల్మర్ ముగింపు ఉత్సవానికి అధ్యక్షులుగా విచ్చేశారు. వెయ్యిమంది పాల్గొన్న మారథాన్‌ను బ్రాడ్‌ఫోర్డ్ మహిళామేయర్ ప్రారంభించారు.

శిబిర ముగింపు సమయంలో బ్రాడ్‌ఫోర్డ్‌లోని పోలీసుప్రధానాధికారి హెచ్.ఎస్.ఎస్. నాయకులను కలుసుకునేందుకు వచ్చారు. "మీ స్వయం సేవకులు ప్రదర్శించిన అద్భుత క్రమశిక్షణను, ఆత్మ సంయమనాన్ని ప్రశంసించేందుకు నేనిక్కడికి వచ్చాను." అన్నారాయన. తథాకథిత ఖలిస్థానీ ఉద్యమకారులు సంఘ్‌కు వ్యతిరేకంగా సాగించిన ప్రదర్శననే మాత్రం పట్టించుకోకుండా, హుందాగా, ప్రశాంతంగా స్వయంసేవకులు తమ కార్యక్రమాలు కొనసాగించడం చూసి ఆయన మరింత ప్రభావితులయ్యారు.

గుర్తుచేసుకోవలసిన సంఘటన మరొకటి కూడా ఉంది. ఆరోజు మధ్యాహ్ననికల్లా బైటస్థలాల నుండి తీసుకు రాబడిన ఖలిస్తానీ ప్రదర్శకులలో కొద్దిమంది మినహా అందరూ తిరిగి వెళ్ళిపోయారు. గంటలతరబడి నిల బడి, కేకలుపెట్టిన కారణంగా ఆకొద్దిమంది కూడా బాగా అలసిపోయారు. వారిదురవస్థను చూసి శిబిరకార్యకర్తలు వారివద్దకు వెళ్ళారు. శిబిరంలోకి వచ్చి అల్పాహారం తీసుకోవలసిందని వారిని ఆత్మీయంగా ఆహ్వానించారు. అయిష్టంగానే వారు లోపలికి వచ్చారు. కొద్దిగా స్తిమితపడ్డాక శిబిరంలో ఏర్పాటు చేసిన సాంస్కృతిక ప్రదర్శినిని తిలకించడానికి బయలుదేరారు. ఆప్రదర్శినిలో పదిమందిసిక్కు గురువుల పటాలను అత్యంతసుందరంగా అలంకరించి ప్రదర్శించిన విభాగం వారి కంటపడింది. ఇంతటి సాత్విక కార్యకర్తాగణానికి వ్యతిరేకంగా తాము ప్రదర్శన నిర్వహించినందుకు వారు సిగ్గుతో చితికిపోయారు. శిబిరంలో నుండి వెళ్ళినట్లే వెళ్ళి అంతలోనే క్షమాపణలు చెప్పుకునేందుకు తిరిగివచ్చారు. ఎందుకంటే, వారి నిరసన ప్రదర్శన కారణంగా, శిబిరంలోని వారికి ఒక పూటభోజనం సమ కూర్చాలన్న ప్రతిపాదనను స్థానిక గురుద్వారా ఉపసంహరించుకున్నట్లు వారికి తెలియవచ్చింది. మరునాడు జరిగే హిందూ మారథాన్ సందర్భంలో మార్గమధ్యంలో గురుద్వారాను సందర్శించమని, తాము అందించే ఫలహారాలను స్వీకరించమని శిబిరంలోని స్వయంసేవకులను వారు ఆహ్వానించారు. ఉద్రిక్త వాతావరణం నెలకొని ఉన్న కారణంగా పోలీసులు గురుద్వారాను మార్గమధ్యంలో కార్యక్రమంలో జోడించడానికి మొదట్లో అంగీకరించలేదు. అయితే చివరికి ఒత్తిడి కారణంగా వారికి ఆ నిర్ణయం మార్చుకోక తప్పలేదు. మరుసటి రోజున స్వయంసేవకులు తమసిక్కుసోదరుల ఆత్మీయ ఆతిథ్యాన్ని రుచిచూసారు.

సంఘంలో ప్రవేశించే క్రొత్తవారికి శిక్షణ నిచ్చేందుకు స్వల్పకాలిక

శిబిరాలు, 15 రోజుల శిబిరాలు ప్రతిఏటా జరుగుతూ ఉంటాయి. స్వయంసేవకులలో నింపబడే ఉన్నతస్థాయి క్రమశిక్షణను, వారి హుందాతనాన్ని ఇంగ్లీష్ సమాజం తిలకించడానికి ఆ శిబిరాలు చక్కని అవకాశం కల్పిస్తూంటాయి. యువతరంలో క్రమశిక్షణారాహిత్యం ఇంగ్లీష్ సమాజానికి పెద్ద సమస్యగా పరిణమించింది. అందుకే వారిపెద్దలు, ముఖ్యంగా పోలీసు అధికారులు హెచ్.ఎస్.ఎస్. అలాంటి శిక్షణను ఇంగ్లీష్ యువతరానికి కూడా నేర్పించాలన్న కోరికను తరచువ్యక్తపరుస్తూ ఉంటారు. సంఘ శీతాకాలశిబిరాలకోసం తమ ఎయిర్‌కండీషన్డ్ డేరాలను ఏమాత్రం సంకోచించకుండా పోలీసులు అందజేస్తూఉంటారు. స్వయంసేవకులు వాటిని తిరిగి శుభ్రమైన పద్ధతిలో, పొందికైన రూపంలో వారికి తిరిగి అప్పగించడమే అందుకు కారణం.

## కెనడాలో:

తెలతెలవారే సమయంలో శిబిర రక్షకులు ఈల ఊదుతారు, వెంటనే స్వయంసేవకులు మేల్కొంటారు. భగవాధ్వజంముందు సమావేశమౌతారు. ఏకాత్మతా స్తోత్రాన్ని పఠించి, సూర్యనమస్కారాలు, యోగాసనాలు చేసేందుకై విడిపోతారు. కర్రసాముచేస్తారు. కబడ్డీ మొదలైన ఆటలు ఆడతారు. ఇవన్నీ క్రమశిక్షణాయుత వాతావరణంలో జరుగుతాయి. అయితే వాతావరణంలో ప్రశాంతత, ఆహ్లాదము కూడా మేళవించి ఉంటాయి.

ఈ దృశ్యం కెనడాలోనిది. భారతదేశంలో కనిపిస్తూఉండే దృశ్యానికి ప్రతిరూపమది. అది హిందూస్వయంసేవక సంఘ్ నిర్వహిస్తున్న శిబిర దృశ్యం. వివిధ దేశాలలో ఎక్కడెక్కడ బి.ఎస్.ఎస్., హెచ్.ఎస్.ఎస్.ల శిబిరాలు, శాఖలు జరుగుతూ ఉంటాయో, అక్కడల్లా ఇలాంటి దృశ్యాలే కానవస్తాయి.

## అమెరికాలో:

అమెరికాలో వి.హెం.ప. బహుశః హిందువులందరినీ సంఘటితం, సమన్వయం చేసే అత్యుత్తమ సంస్థ. నాలుగేళ్ళకొకసారి అమెరికా అంతటికీ కలిపి వారు సమ్మేళనాన్ని నిర్వహిస్తూంటారు. రెండు దశాబ్దాలక్రితం మొట్టమొదటి సమ్మేళనం జరిగి నపుడు బహుకొద్ది మంది ప్రతినిధులు మాత్రమే అందులో పాల్గొన్నారు. అయితే 1984లో జరిగిన 10వ

సమ్మేళనంలో 25 దేశాల నుండి 4 వేలమంది ప్రతినిధులువచ్చారు. భారతదేశం, మలేసియా, హాంకాంగ్ వంటి సుదూరదేశాల నుండి కూడా ప్రతినిధులు వచ్చారు. భారతదేశం నుండి ప్రత్యేకాహ్వానితులుగా సర్వశ్రీ స్వామీ చిన్మయానంద, ఈశ్వరానందగిరి, ప్రముఖ్‌స్వామి, మునిసు శీల్ కుమార్‌జైన్, కరణ్‌సింగ్, గోపాల్‌సింగ్, హెచ్.వి.శేషాద్రి గార్లు విచ్చేసారు.

అమెరికా అధ్యక్షుడు, న్యూయార్క్ గవర్నర్ లిరువురూ అమెరికాలో వి.హిం.ప. నిర్వహిస్తున్న ఉదాత్త కార్యానికి తమ ప్రశంశలను అందజేసారు. సమ్మేళనంలో ప్రసంగించిన గవర్నర్ కార్యదర్శి "మీ విశిష్ట హిందూ సాంస్కృతిక అస్తిత్వాన్ని చూసి గర్వించండి. దానిని స్వీకరించడానికి సిగ్గు పడకండి. మీరు దానిని త్యజిస్తే అమెరికన్ సంస్కృతి కాస్తా వెలవెలబోతుంది. అమెరికా సంస్కృతి ఒక మిశ్రమ సంస్కృతి. ఇక్కడ ఉన్న విభిన్న సమాజాల సంస్కృతుల ప్రత్యేకతలు మేళవించినది అది. కనుక మీకు కలిగేనష్టం అమెరికాకు కలిగేనష్టమే" అని హెచ్చరించారు. వి.హిం.ప. యొక్క విస్తారరూపాన్ని దర్శించి ఆయన "ఇంత పెద్ద సంఖ్యలో హిందువులు సమైక్యం కాగలుగుతారని నేనెన్నడూ ఊహించలేదు. ఇప్పుడు మీ రొక రాజకీయ శక్తిగా కూడా రూపొందవచ్చు." అని కూడా అన్నారు.

వి.హిం.ప ఇతర హిందూసంస్థల కృషిఫలితంగా హిందువులు తమ హిందూ అస్తిత్వాన్ని గురించి సగర్వంగా చెప్పుకోవడం ప్రారంభించారు. తమ ఆధ్యాత్మిక వారసత్వం యొక్క మహత్వం పట్ల వారిలో ఆత్మ విశ్వాసం పెంపొందుతోంది.

కొద్దిరోజులక్రితం, అట్లాంటా వి.హిం.ప. అధ్యక్షులు 'అమెరికన్ సందర్భంలో హిందూజీవన విలువలు' అనే అంశంమీద ఒక క్రైస్తవనేతల సమావేశంలో ప్రసంగించారు. వివిధ వర్గాలకు చెందిన క్రైస్తవ తత్వ వేత్తలు కూడా ఆసమైక్యతా సమ్మేళనంలో పాల్గొన్నారు. విలియమ్ సెనేకర్ అనే క్రైస్తవపండితుడు అధ్యక్షత వహించారు. తన ప్రతిస్పంద నను ఆయన ఇలా వ్యక్త పరిచారు. "హిందువుల జీవనవిధానం, జీవన విలువల గురించి అర్థం చేసుకున్న క్రైస్తవులకు వారే వర్గానికి చెందిన క్రైస్తవులైనప్పటికీ - క్రైస్తవంలో విశ్వాసం మరింత వృద్ధి చెందుతుంది. దానివల్ల క్రైస్తవ తత్వజ్ఞానంలోను, అచరణలోను గుణాత్మక పరివర్తన సాధించబడుతుంది."

## ఫిసి(FISI)- (ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియాసొసైటీ ఇంటర్ నేషనల్):

భారతీయ మూలసంతతి వారి మానవహక్కులకు ఎక్కడ ఆటంకం కలిగినా, వాటిని పరిరక్షించేందుకు ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్ నేషనల్ (FISI) గళమెత్తి ఉద్యమిస్తోంది. సంబంధిత ప్రభుత్వాల ద్వారానే సమస్య పరిష్కారానికి అది కృషి చేస్తోంది. ఐక్యరాజ్యసమితిలో ఆ సమస్యలను ప్రస్తావించడం, ప్రపంచ పత్రికారంగం దృష్టికి వాటిని తీసుకుని రావడం కూడా అదిచేస్తూంటుంది. ప్రపంచకేంద్రాలయిన వాషింగ్టన్, లండన్ లలో భారత అనుకూలవర్గాలను నిర్మాణం చేసే ప్రయత్నాలను కూడా అది చేస్తోంది. ఈమధ్యకాలంలో సిక్ఖుసమస్య విషయంలో అమెరికన్ సెనేటర్ల సంతకాలతో అమెరికా పత్రికలలో పెద్ద ఎత్తున దుష్ప్రచారం సాగింది. 'ఫిసి' (FISI) వెంటనే చొరవతీసుకోవడంతో అనేకమంది సెనేటర్లు తమకు తప్పుడు సమాచారం అందిందని బైటపెట్టారు. అమెరికా ప్రభుత్వం తారాపూర్ అణువిద్యుత్ కేంద్రానికి ఇంధన సరఫరాను త్రొక్కిపట్టినపుడు, ఫిసి మధ్యవర్తిత్వం కారణంగా, ఒక ప్రయోజనకర పరిష్కారం సాధ్యపడింది.

విస్తృతపరిధిలో వివిధ అంశాల పరిష్కారం కోసం 'ఫిసి' (FISI) కృషిచేస్తోంది. బాంగ్లాదేశ్ లో హిందువుల ఆస్తుల ప్రతిష్ఠంభన, కెన్యా, దక్షిణాఫ్రికా, బ్రిటన్ లలో వర్ణసంఘర్షణలు, బ్రిటన్, అమెరికాలలోని తిరోగమనకారి వలస చట్టాలు, ఇస్లామిక్ దేశాలలో మతస్వాతంత్ర్య నిరాకరణ, సురినాం, గయానా, ఫిజిలలో సమాన హక్కుల నిరాకరణ; మొదలైనవి వాటిలో కొన్ని. భారతదేశంలోనూ, బైట 6 సార్లు ప్రపంచ 'ఫిసి' సమ్మేళనాలు జరిగాయి. తమకార్యకర్తలలో సమస్యల ఎడల సరియైన దృష్టికోణాన్ని, జాగరూకతను మరింత పెంపొందించడం లోను; కార్యకర్తలమధ్య సన్నిహిత సంబంధాల నిర్మాణంకోసం అవసరమైన మార్గదర్శనం, సహాయం అందించడంలోను అవి ఎంతో సహాయపడ్డాయి.

హిందూ ప్రజానీకం నివసిస్తున్న మొత్తం 113 దేశాలకు గాను, 37 దేశాలలో స్వయంసేవకులు సంపర్కం ఏర్పాటుచేసుకుని, వివిధస్థాయిలలో కార్యకలాపాలను ప్రారంభం చేసారు.

# తుదిపలుకులు: నూతన దృశ్యం ఆవిర్భావం

గత అధ్యాయాల వివరణలనుండి ఒక నూతన దృశ్యం మన కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది. ఆరెస్సెస్ ప్రారంభించిన సమగ్ర జాతీయపునరుజ్జీవన మహోద్యమం యొక్క కొన్ని విశేషాంశాలను అది మన ముందుంచుతుంది.

జన్మించిన నాటినుండి గత 6దశాబ్దాలుగా సంఘ సైద్ధాంతిక ఉద్యమం బలంపుంజుకున్న తీరు సాటిలేనిది. గడచిన ఈదశాబ్దాలలో భారతదేశంలో రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలో పరివర్తనకై అనేక సిద్ధాంతాలు పుట్టాయి. అతివేగంగా తారాపథాన్నందుకుని, అంతలోనే రాలిపోయాయి. వాటిలో కొన్ని చెదిరిపోయిన కలలవలే స్మృతిపథాన్నుంచే తొలగిపోయాయి. అంతర్జాతీయ వాదాలని ప్రచారంచేసుకున్న అనేక వాదాలు నేడు కుప్పగూలిపోవడాన్ని వాటి ఉపాసకులు సైతం గుర్తిస్తున్నారు. ఇంతకాలం అంతర్జాతీయ రంగంలో వాటికి సంరక్షణ కల్పించిన పెద్దమనుషులే వాటిని భారంగా భావించి, వదిలి వెళ్ళిపోతున్నారు.

అయితే, ఈహిందూ రాష్ట్ర తత్వజ్ఞానం మాత్రం నిరంతరం పెరుగుతూనే ఉంది. దేశంలో మరింత విశాల జనసముదాయం వద్దకు తన చైతన్యవంతమైన సందేశాన్ని తీసుకుని పోతూనే ఉన్నది. నిన్నటి వరకు సంశయంగా ఉండిన వారి గళాలు సైతం నేడు దానికి సమర్థనగా గట్టిగా మాట్లాడుతున్నాయి. నేటివరకు రాజకీయ నాయకులు కూడా హైందవేతరుల వ్యామోహంలోనే మునిగితేలారు. హిందువుల హక్కులు, విశ్వాసాలను నిర్లక్ష్యం చేసారు. ఈధోరణి ఇక ఎంతోకాలం సాగదని వారికి కూడా హెచ్చరిక సంకేతాలు అందాయి. ఒకనాటి ఉగ్ర వామ పంథవాదులు సైతం నేడు మౌలికహిందూ జీవన విలువల గురించి మాట్లాడడం ప్రారంభించారు. అధిక సంఖ్యాక హిందూ సమాజాన్ని పరిగణనలోకి తీసుకొనవలసిన ఆవశ్యకతను గురించి వారు కూడా నొక్కి వక్కాణిస్తున్నారు.

మరొక పద్ధతిలో కూడా హిందూ హృదయాలలో ప్రబల పరివర్తన జరుగుతోంది. హిందువులు సంఘటితం కావడం అసాధ్యమని; కులతత్వం, అంటరానితనం, వర్గతత్వం మొదలైన ఆంతరికబలహీనతలు ఆసంఘటనను విఫలం చేస్తాయని కర్ణకఠోరంగా గగ్గోలు పెట్టిన నిరాశా చక్రవర్తుల రోజులు పోయాయి. అట్టి అన్ని ఆటంకాలను అధిగమించి, శక్తివంతమైన, సంఘటితమైన, ఆత్మవిశ్వాస పూర్ణమైన సామాజిక స్వరూపంగా హిందువు లేచినిలబడే దృశ్యం కళ్లముందు సాక్షాత్కరిస్తున్నది.

తనస్వప్నాన్ని సాకారం చేసుకునేందుకై సంఘం రూపొందించిన పథకం అత్యంత ప్రభావశాలి అని నిరూపితమైంది. ఆ పరివర్తనకు సాధనాలుగా రూపొందిన స్వయంసేవకులు తాము ప్రవేశించిన ప్రతి రంగంలోనూ విజయవంతంగా ముందుకు దూసుకుపోతున్నారు.

ఈసమగ్ర జాతీయ పునరుజ్జీవన మహోద్యమంలో నియంతృత్వానికి స్థానం ఏమాత్రం లేదు. వివిధరంగాల కార్యకలాపాలపై నియంత్రణ, మార్గదర్శనం గావించే అధికారకేంద్రంగా పనిచేయాలని సంఘమెన్నడూ వాంఛించలేదు. వివిధరంగాలలో పనిచేస్తున్న సంస్థలకు, సంఘానికి మధ్యగల సంబంధం బిడ్డలకు, తల్లికి మధ్య సంబంధం లాంటింది. పిల్లలు తమ మనస్తత్వానికి, మేధకు తగిన వృత్తులను ఎంచుకుంటారు. అయితే తల్లివద్దపొందిన శ్రేయస్కర శిక్షణ ప్రభావాన్ని తమ నడవడికలోను, జీవన ప్రమాణాలలోనూ దర్శించుకుంటారు.

సంఘం, స్వయంసేవకుల మధ్య కూడా అంతే. తమతమ అభిరుచులననుసరించి స్వయంసేవకులు వేరువేరు జీవనరంగాలలో ప్రవేశిస్తారు. అయితే వారందరూ కూడా సంఘం నుండి పొందిన మౌలిక విశ్వాసాలను, శీలాన్ని కాపాడుకునేందుకే ప్రయత్నిస్తారు. వారి చేతుల మీదుగా నిర్మితమైన వి.హిం.ప., బి.ఎమ్.ఎస్., అ.భా.వి.ప., కిసాన్ సంఘ్, బిజెపి, విద్యాభారతి, తదితర సంస్థలు పూర్తి స్వాతంత్ర్యం కలిగిఉంటాయి. స్వతంత్ర వ్యవస్థ, కార్యపద్ధతి వాటికి ఉంటాయి. కానీ వారంతా కలిసి ఒక విశాల సమాజ అవయవ స్వరూపులమని భావిస్తూంటారు. సమాన జాతీయాశయాకాంక్షలు కలిగినవారుగా, సౌభ్రాతృత్వభావనతో బంధింపబడినవారుగా వారు అనుభూతి చెందుతూ ఉంటారు.

ఈ విషయాలన్నీ సంఘంయొక్క సామాజిక పరివర్తన మహోద్యమంలో ఒకే ప్రధాన అంశాన్ని ప్రస్ఫుటం చేస్తాయి. అసలీ పరివర్తన ప్రపంచ చరిత్రలోనే అసాధారణమైనది. ఇది సంపూర్ణంగా

ప్రజాఉద్యమమే. ప్రజలే దీనిని ప్రారంభించారు. ప్రజలే ముందుకు తీసుకుని వెళ్ళారు. ప్రభుత్వం మేలు చేయడం మాట అటుంచి, అనేకసార్లు నిర్దాక్షిణ్యంగా సంఘంపై దాడులు సాగించింది. అయినా ప్రజలకు ప్రేరణ ఎలాలభించింది? వారి శక్తి సామర్థ్యాలు ఎలా జాగృతంఅయ్యాయి? ఉన్నతమైన ఆదర్శం, శీలం, సమర్పణభావనలకు సాకారరూపులైన వ్యక్తులు ఈ శక్తి సామర్థ్యాలను ఏవిధంగా సక్రమ మార్గంలో నడిపించారు? అన్నదొక పెద్ద గాథ. 'నిస్వార్థ కృషి' అనే సమున్నతస్థాయికి మానవహృదయాన్ని తీసుకుని వెళ్ళడంలో ప్రభుత్వాలు, వివిధ రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలు ఘోరంగా విఫలమైన వేళ సంఘం సాధించిన ఈవిజయం విశ్వవిఖ్యాతమైనది. వేయిసంవత్సరాల పాటు ఆత్మవిస్మృతిలో మునిగిపోయిన, విదేశీదురాక్రమణ దారులతో జీవన్మరణ పోరాటపు భయంకర కష్టాలను అనుభవించిన ఒకానొక ప్రజాసమూహంలో సంఘం ఈపరివర్తనను సాధించడంలో కృతకృత్యం కాగలిగిందన్నది మనం మరువరాదు.

చివరిగా, సమాజంలోని అత్యున్నత, అతిసాధారణ వర్గాలన్నింటికి చెందిన ప్రజల హృదయాలను సంఘం స్పృశించిన విధానం, అదిస్వీకరించిన వ్రతం కేవలం సంస్థానిర్మాణానికి మాత్రమే పరిమితమైనది కాదని స్పష్టం చేస్తుంది. నిజానికి మన జాతిలోని ఉత్తమ, ఉదాత్త అంశాలన్నింటినీ ప్రజ్వలింపజేయడమే ఆవ్రతం. తరతరాలుగా మనజాతి నిర్మాతలు వారసత్వంగా ఇస్తూవచ్చిన వ్రతమిది.

ఆవ్రతంలో చరిత్ర ముద్ర ఉంది. సనాతన సంప్రదాయ శక్తి ఉంది. ఉత్కృష్టసాంస్కృతిక విలువల దృఢత్వం ఉంది. సమస్తజాతిలోని సాధుసంతులు, మహావీరులు సాగించిన అంతులేని త్యాగాలు, తపస్సులు ఉన్నాయి. ఏదీ... ఏశక్తీ దాని పురోగతిని ఆపలేదు. ఎందుకంటే ఆ'మహానౌక'ను అంతిమ, వైభవమయ లక్ష్యసిద్ధిదిశగా నడిపిస్తున్నది స్వయంగా 'భగవంతుని వరదహస్తమే'.

# అనుబంధం - 1
# డా. హెడ్గెవార్ జన్మశతాబ్ది - సంఘటిత హిందూసమాజశక్తి ప్రదర్శనగా...

డాక్టర్‌జీ జన్మశతాబ్ద్యుత్సవాలు 1989 ఏప్రిల్ నెలలో ముగిసాయి. ప్రముఖ హిందూనాయకులు, మఠాధిపతులు, పెద్దఎత్తున వైభవోపేతంగా జరిగిన ముగింపు ఉత్సవాలలో పాల్గొన్నారు. ఈ ఉత్సవాల సందర్భంగా నిర్వహించబడిన జనజాగరణోద్యమంలో స్వయంసేవకులు 2,16,284 గ్రామాలను సందర్శించి 1,48,70,682 కుటుంబాల వారిని స్వయంగా కలుసుకున్నారు. చిన్నా, పెద్దా సమావేశాలు 76,427 వరకు జరిగాయి. ఈ సందర్భంగా వసూలుచేసిన సేవానిధి 11,07,47,500 రూపాయలదాకా అయింది. ఈ ఉత్సవాల నిర్వాహణకై అఖిల భారతస్థాయిలో, రాష్ట్రాలస్థాయిలో శతజయంతి ఉత్సవ సమితులు ఏర్పడ్డాయి.

విదేశాలలో ఈ ఉత్సవాలు మకర సంక్రాంతి (జనవరి 1989)నాడు ప్రారంభమై, విజయదశమి (అక్టోబరు 1989) వరకు సంఘం, విశ్వ హిందూ పరిషత్, హిందూమండలి మొదలైన సంస్థల ఆధ్వర్యంలో నిర్వహించబడ్డాయి. సెమినార్లు, సమ్మేళనాలు, మహాసభలు, సాంస్కృతిక కార్యక్రమాలు, హిందూ ఏకతా సమ్మేళనాలు, హిందూ మారథాన్ పరుగు పందాలు మొదలైన వివిధ కార్యక్రమాలను నిర్వహించారు. వార్తాపత్రికలలో ప్రకటనలు, డాక్టర్జీ జీవిత చరిత్రపై వ్యాసాలు ప్రముఖంగా ప్రచురించారు. ఆగస్టు 27-28 (1989) తేదీలలో ఇంగ్లాండులోని మిల్టన్‌కేన్స్‌వద్ద జరిగిన రెండురోజుల హిందూ సమైక్యతా సమ్మేళనంలో 80 వేలమంది పాల్గొన్నారు. శత జయంతి ఉత్సవాల కారణంగా ఉద్భవించిన హిందూ చైతన్య ప్రవంతికి ఒక ఉదాహరణంగా నిర్వహించబడిన ఈ సమ్మేళనం అత్యంత విశాలమైనది. హిందూ పునరుజ్జీవనానికి ప్రతీక వంటిది. ప్రముఖ ధార్మిక నాయకులైన స్వామి సత్యమిత్రానందజీ, ప్రముఖ్ స్వామీజీ, స్వామి చిన్మయానందజీ మొదలైనవారి మార్గదర్శనం ప్రతినిధులకు ఉత్తేజాన్ని అందించింది. సంఘ్ అఖిల భారత బౌద్ధిక్ ప్రముఖ్ శ్రీ కె.యస్. సుదర్శన్ ఈ సమ్మేళనంలో ఆర్.యస్.యస్. ప్రతినిధిగా పాల్గొన్నారు. తదుపరి ఇంగ్లాండు, అమెరికా, కెనడా, హాలండ్ దేశాలలో వారు పర్యటించారు. బి.బి.సి. ప్రసారసంస్థ వారితో ముఖాముఖీ (ఇంటర్వ్యూ)ని ప్రసారంచేసింది. విదేశాలలో సంఘమునికి ఇందువలన మంచి స్ఫూర్తి లభించింది.

# అనుబంధం - 2

# రామజన్మభూమి విముక్తి

శ్రీరామ శిలాన్యాసం – చరిత్రలో నూతన అధ్యాయం.

1989 జనవరిలో ప్రయాగలో విశ్వహిందూ పరిషత్ ఆధ్వర్యంలో జరిగిన సాధు సమ్మేళనంలో అయోధ్య-రామజన్మభూమివద్ద శ్రీరామమందిర శిలాన్యాస కార్యక్రమం యథాప్రకారం కొనసాగించాలని నిర్ణయించటంతో హిందూ జాతియావత్తూ చైతన్యమై, ఆ నిర్ణయాన్ని విజయవంతంగా అమలుపరచాలని నిశ్చయించుకుంది. శ్రీ రామశిలా పూజా కార్యక్రమాలను కుగ్రామాలతోసహా దేశమంతటా నిర్వహించాలని తీసుకున్న నిర్ణయం అద్భుతమైన విజయాన్ని సాధించింది. సుమారు నాలుగు లక్షల ప్రదేశాలలో ప్రజానీకం శ్రీరామశిలాపూజా కార్యక్రమాలలో పాల్గొన్నారు. 26 విదేశాల నుండి కూడ పూజింపబడిన శ్రీరామశిలలు అయోధ్యకు చేరుకున్నాయి. ఎన్ని ఇబ్బందులు, ఎటువంటి ఆటంకాలు ఎదురైనా — అందులో కొన్ని ప్రభుత్వం సృష్టించినవీ, మరికొన్ని ఇబ్బందులు సృష్టించటంలో అభిరుచి ఉన్న వ్యక్తులూ, వర్గాలూ తయారుచేసినవీ — అనుకున్న సమయానికి, అనుకున్నచోట శ్రీరామశిలాపూజ జరగటం మనదేశ చరిత్రలో ఒక మలుపు అని ప్రఖ్యాత పత్రికా రచయితలు వేర్కొన్నారు. ఈ సంఘటన ద్వారా తాము కూడ సంఘటితులై, తమ సమాజ గౌరవాన్ని, శ్రద్ధా కేంద్రాలను కాపాడుకొనగలమని హిందువులు నిరూపించారు. హిందూసమాజ ఆత్మ విశ్వాసాన్ని పెంచే అన్ని ఉద్యమాల వెనుక ఉన్నట్లే శ్రీరామ శిలాపూజా కార్యక్రమాల వెనుక కూడా సంఘ స్వయంసేవకులున్నారు. అతి సహజమైనరీతిలో వారు కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించారు.

**కరసేవ ప్రారంభం:** శిలాన్యాసం జరిగిన సరిగ్గా సంవత్సరం తరువాత 1990వ సం. ము అక్టోబర్ 30వ తేదీన... ఆ రోజుకూడా శిలాన్యాసం జరిగిన రోజులాగే దేవోత్థాన ఏకాదశి అయింది.... అయోధ్యలో రామమందిర నిర్మాణానికి కరసేవ ప్రారంభమైంది. దీనికి కూడా కేంద్ర, యు.పి. రాష్ట్ర ప్రభుత్వాలు ఎన్నో ఆటంకాలు కల్పించాయి. యు.పి. ప్రభుత్వమైతే కరసేవ ప్రారంభం కాకుండా చూసేందుకు రాష్ట్రాన్ని పోలీసురాజ్యంగా మార్చివేసింది. ఎమర్జెన్సీని మరిపించే దమన కాండ కొనసాగింది. అయినా వీటన్నింటినీ ఎదుర్కొని లక్షలాదిమంది

కరసేవకులు దేశం నలుమూలలనుండి యు.పి. రాష్ట్రంలో ప్రవేశించారు. ప్రభుత్వపు అరెస్టులను, అడ్డంకులను, వేధింపులను తప్పించుకుని, అన్ని రక్షణవలయాలను ఛేదించి, దాదాపు లక్షమంది కరసేవకులు అక్టోబర్ 30వ తేదీన నిర్ణీత ముహూర్తాన ఆలయం లోపల కరసేవను ప్రారంభించారు. కరసేవకులలో అనేకమంది సాధువులు ఉండడం విశేషం. రాజశక్తి పై రామభక్తి విజయంగా దీనిని పలువురు అభివర్ణించారు. కరసేవ హిందూసమాజాన్ని సంఘటితంచేయడంలో కూడా ఎంతగానో తోడ్పడింది.



దివిసీమ వరదబాధితులను పరామర్శిస్తున్న పెజావర్ మఠాధిపతులు.



నెల్లూరులో జయభారత్ ఆసుపత్రి భవనం.



SEIL పథకం క్రింద ఈశాన్యభారతం నుండి వచ్చిన విద్యార్థినీ విద్యార్థులను సన్మానిస్తున్న దృశ్యం.

ఢిల్లీలో జరిగిన 'శిశుసంగమ్'లో కొన్ని దృశ్యాలు.



ఛత్రపూర్ (ఒరిస్సా) కళ్యాణాశ్రమకేంద్రంలో స్వామి లక్ష్మణానంద వద్ద సంస్కృత అధ్యయనం సాగిస్తున్న వనవాసీ, హరిజన బాలురు.



మారుమూల గ్రామాలలో సైతం కళ్యాణాశ్రమ వైద్య బృందాలు వైద్యసేవల నందిస్తున్నాయి.



విద్యార్థి పరిషత్ నిర్వహించిన నేత్ర చికిత్సా శిబిరంలో (1989) ఒకదృశ్యం.



అనకాపల్లిలో వరదబాధితుల పునరావాసంకోసం నిర్మించిన శ్రీరాంనగర్ దృశ్యం (1977)



దివిసీమలో (1978) నిర్మించిన పక్కాగృహాల సముదాయం-దీనదయాళ్‌పురం.



అంబేద్కర్ వర్ధంతి సందర్భంగా రక్తదానం చేస్తున్న సంఘకార్యకర్తలు.



సేవాభారతి పర్యవేక్షణలో పోలియో ఆపరేషన్ జరిగిన ఒక బాలుడు.



శ్రీకాకుళం (ఆంధ్ర) జిల్లాలో వంశధారవరద బాధితుల (1977) సేవలో...






ఎమర్జెన్సీ అత్యాచారాలకు ఒక ప్రత్యక్షసాక్షి.
వీపుపై కొవ్వొత్తులతో కాల్చబడిన ఒక సత్యాగ్రహి.

ఢిల్లీలో జరిగిన 'శిశుసంగమ్'లో కొన్ని దృశ్యాలు.



దివిసీమలో దిక్కులేకుండా పడిఉన్న వందలాది శవాలను స్వయంసేవకులు ఆత్మీయులవలే ఖననం గావించారు. ఆ కార్యంలో ఉన్న 'శవసేన' కార్యకర్తలదృశ్యం.



కన్యాకుమారిలోని వివేకానందస్మారకాన్ని సందర్శించిన పూజ్యశ్రీ కామకోటిపీఠ శంకరాచార్యులు శ్రీ శ్రీ శ్రీ జయేంద్రసరస్వతి స్వామీజీ... వారితో శ్రీ ఏకనాథరానడే.



విశాఖ జిల్లా మరిం వనవాసి గ్రామంలో 50 మంది వనవాసులకు ఉపాధి కల్పించే పథకం క్రింద విద్యాశ్రమం ఏర్పరచిన స్టోన్‌క్రషింగ్ యూనిట్.



కర్ణాటక మొత్తంలో ఉత్తమ ఆవాసవిద్యాలయంగా గుర్తింపుపొందిన చెన్నసహళ్ళిలోని జనసేవాకేంద్ర.

నక్సలైట్ల దురాగతాలకు వ్యతిరేకంగా ఉద్యమించిన కరీంనగర్ జిల్లా మన్నెగూడెం గ్రామప్రజానీకం



జాతీయసమస్యలపట్ల యువకులకు అవగాహన కల్పించడానికి విద్యార్థిపరిషత్ అనేక కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంటుంది.



హిందుమాత ఒడిలోకి పునరాగమనం చేసిన ఆదిలాబాద్ జిల్లాలోని వందలాది క్రైస్తవులు. పరిషత్ నేత స్వర్గీయ కరెడ్ల సత్యనారాయణ.



అనుశాసనబద్ధులైన ఈయువకులే సమాజంలో అద్భుతపరివర్తనకు మణిదీపికలు.